# డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్

## రచనలు - ప్రసంగాలు

సంపుటం. 8

# పాకిస్తాన్
# లేదా
# భారతదేశ విభజన

పునర్ముద్రణ




ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణలు

1994



డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్

ఎం.ఎ., పి.హెచ్.డి., డి.ఎస్.సి., బార్–ఎట్–లా, జె.పి., ఎల్.ఎల్.డి., డి. లిట్.

జననం : 14 ఏప్రిల్, 1891 పరినిర్వాణం : 6 డిసెంబర్, 1956

# డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ రచనలు – ప్రసంగాలు

సంపుటం – 8

ప్రధాన సంపాదకులు
ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం

సంపాదకులు
ఆచార్య ఆర్.వి. ఆర్. చంద్రశేఖరరావు
ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి

అనువాదం
డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం

సారథ్యం
తెలుగు విశ్వవిద్యాలయం

కన్వీనర్
ఆచార్య జయధీర్ తిరుమలరావు

ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
1994

**Dr. BABA SAHEB AMBEDKAR**
**RACHANALU - PRASANGALU Vol - VIII**

Pages : 14+XXII+472



*First Edition*
October 1993

*Second Edition*
October 1994



Copies.
Popular Edition. 4000

Price
Popular Edition. Rs. 40/-

*General Editor*
**Prof. PERVARAM JAGANNADHAM**

*Editors:*
**Prof. R.V.R. CHANDRASHEKAR RAO**
**Prof. KETHU VISWANATHA REDDY**

*Convenor :*
**Prof. JAYADHIR THIRUMAL RAO**

Copies can be had from :
Registrar,
**Telugu University,**
**Lalita Kala Kshetram, Public Gardens,**
**Hyderabad - 500 004.**

*Printed at*
**Prinfas Printers**
2-2-25/P/4 (H-13)
D.D. Colony,
Hyderabad - 500 013.
✆ : 614507

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం
పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాదు

# రెండవ ముద్రణ పీఠిక

నవభారత రాజ్యాంగ నిర్మాత బాబాసాహెబ్ డా. భీంరావు అంబేద్కర్ ఆంగ్ల రచనలను తెలుగులోకి అనువదించి ప్రచురించే కార్యక్రమానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం తెలుగు విశ్వవిద్యాలయాన్ని సారధ్య సంఘంగా నియమిస్తూ అందుకోసం 18 లక్షల రూపాయలు మంజూరు చేసింది. ఈ ప్రణాళికను ప్రోత్సహించి నిధులు మంజూరు చేసిన అప్పటి ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి గారికీ, అంబేద్కర్ సంపుటాలను విజయవంతంగా తెలుగు వారికి అందజేయడంలో సహకరిస్తున్న ప్రస్తుత ముఖ్యమంత్రి మాన్యులు శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారికీ ఈ సందర్భంగా ధన్యవాదాలు సమర్పిస్తున్నాను. డా. అంబేద్కర్ భావజాలాన్ని, ఆయన ఆలోచనా సరళిని నేటి యువతరానికి తెలియజేసే దృష్టితో ఈ గ్రంథాలను సాంఘిక సంక్షేమ శాఖ హాస్టళ్లకు సరఫరా చెయ్యాలని ఆంధ్ర ప్రదేశ్ సాంఘిక సంక్షేమ శాఖ మమ్మల్ని కోరింది. అందుకోసం ఈ సంపుటాలను ప్రత్యేకంగా పునర్ముద్రిస్తున్నాం. ఈ కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించుటకు సహకరిస్తున్న ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికీ, సాంఘిక సంక్షేమ శాఖాధిపతులకూ, పాఠకులకూ, ఆయా సంపుటాల సంపాదక వర్గానికీ మరోసారి ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

14/10

హైదరాబాదు
ది. 14.10.1994
విజయదశమి.

పేర్వారం జగన్నాథం

# ముందుమాట

భారత రాజ్యాంగ నిర్మాతగా, దళితవర్గాల నాయకుడిగా, రాజనీతికోవిదుడుగా, న్యాయశాస్త్ర పారంగతుడుగా, ప్రజాభిమానాన్ని చూరగొన్న మనీషి డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్. కులవ్యవస్థలో కూరుకుపోయిన వారికి డా॥ అంబేద్కర్ ఒక ఆశాజ్యోతి. ఒక చైతన్య కేతనం. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వాల మేలు కలయికగా ఉండే సమాజం అంబేద్కర్ లక్ష్యం.

మహర్ కులంలో జన్మించిన అంబేద్కర్ విద్యార్థి దశ నుండే సమాజం చేత దుర్భరమైన అవమానాలను ఎదుర్కొన్నారు. దాంతో చిన్నతనంలోనే ఆయన సంఘ సంస్కరణ, పీడిత జనోద్ధరణే పరమ లక్ష్యంగా ఎన్నుకొన్నారు. ఆయన ఏ వృత్తి చేపట్టినా ఆ లక్ష్యానికి దూరం కాలేదు. ఆ లక్ష్యసాధన కోసం డా॥ అంబేద్కర్ రాజకీయ కార్యకలాపాలు నిర్వహిస్తూ, ఎన్నో నిర్మాణాత్మక కార్యక్రమాలను కొనసాగించారు. ఆ క్రమంలోనే రచనలు చేయడం ప్రసంగాలు చేయడం ద్వారా ప్రచారం చేయడం, వంటి ప్రధాన మార్గాలను ఎంచుకున్నారు.

బలహీన వర్గాలలో చైతన్యాన్ని రగిలించి వారికి నాయకత్వం వహించి డా॥ అంబేద్కర్ తన రాజకీయ మహాప్రస్థానానికి శ్రీకారం చుట్టారు. బొంబాయి రాష్ట్ర శాసన సభ్యత్వం, రాజనీతి శాస్త్రంలో విశేష పరిజ్ఞానం డా॥ అంబేద్కర్ కృషికి ఎంతగానో దోహదం చేసినాయి.

డా॥ అంబేద్కర్ అహర్నిశలు ప్రతి దశలోనూ దళితుల అభ్యున్నతి కోసం కృషిచేశారు. రాజ్యాంగంలో దళితులకోసం ఏర్పాటయిన ప్రత్యేక హక్కులు, వసతుల కోసం నిర్విరామంగా కృషి చేసిన విషయం లోకవిదితమే.

దళిత జనాభ్యున్నతి కోసం ఆయన సాగించిన అవిశ్రాంత పోరాటానికి వెన్నుదన్నుగా భారత చరిత్ర, శ్రుతి స్మృతి పురాణాది ప్రాచీన వాఙ్మయాన్ని, అందుకు సంబంధించిన ఆధార గ్రంథాల్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నారు. తాను చేపట్టిన మహత్తర సంస్కరణోద్యమాన్ని శక్తిమంతంగా నడిపించినారు.

డా॥ అంబేద్కర్ ఏ రంగంలో కృషి చేసినా రచనా వ్యాసంగాన్ని విడనాడలేదు. రాజకీయ, ఆర్థిక, సాంఘిక, ధార్మికాది విషయాలపై అసాధారణ ప్రతిభతో ఆయన రాసిన రచనలు, చేసిన ప్రసంగాలు అంబేద్కర్ జ్ఞాన సంపదకు మణిహారాలు.

అమూల్యమైన అంబేద్కర్ రచనలు – ప్రసంగాలను సేకరించేందుకు 1976లో మహారాష్ట్ర ప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఫలితంగా డా॥ అంబేద్కర్

గ్రంథావళిని మహారాష్ట్ర ప్రభుత్వం 1979లో డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ జన్మదినోత్సవ దినాన ఆంగ్లంలో వెలువరించి భారతావనికి అందించింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం డా॥ అంబేద్కర్ శతజయంతి ఉత్సవాల సందర్భంగా ఆయన రచనలు, ప్రసంగాలను తెలుగులోకి అనువదింపజేయాలని నిర్ణయించింది. ఈ విషయంలో అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్థనరెడ్డిగారి ఆసక్తి, ఉత్సాహం అనువాద కార్యక్రమానికి ప్రేరకాలయినాయి. వారు నిధులను కూడా సమకూర్చినారు.

అనంతరకాలంలో ముఖ్యమంత్రి మాన్యశ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డిగారు డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమానికి మరింత చేయూత అందించినారు. అందుకు రాష్ట్ర ప్రభుత్వానికి ధన్యవాదాలు తెలుపుతున్నాను.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ అనువాద కార్యక్రమ నిర్వహణకు సారధ్య సంస్థగా తెలుగు విశ్వవిద్యాలయాన్ని నియమించింది. తెలుగుశాఖలు ఉన్న కొన్ని విశ్వవిద్యాలయాలు, ఇతర ముఖ్య సంస్థలు ఈ అనువాద కార్యక్రమంలో భాగస్వాములను చేసి తెలుగు విశ్వవిద్యాలయ పూర్వ ఉపాధ్యక్షులు పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు ఈ ప్రణాళికకు రూపకల్పన చేశారు. వారి నేతృత్వంలో అనువాద కార్యక్రమానికి ఆరంభం జరిగింది.

పైన పేర్కొన్న వివిధ సంస్థలు డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని బాధ్యతయుతంగా స్వీకరించాయి. అంతేకాదు ఆయా సంస్థలకి చెందిన వ్యక్తులే సంపాదక బాధ్యతలు నిర్వహించినారు. వివిధ రచయితలు, పండితులు చేసిన అనువాదాల్లో సంపాదకులు ఎంత ప్రయత్నించినప్పటికి కొంత భిన్నత అనువాద శైలీ బేధాలు చోటు చేసుకోక తప్పలేదు.

డా॥ అంబేద్కర్ రచనలు – ప్రసంగాలు అనువాద కార్యక్రమానికి తగిన సలహాలు, సూచనలు ఇచ్చేందుకు ఒక పరిశీలనా సంఘం ఏర్పాటైంది. పార్లమెంటు మాజీ సభ్యులు శ్రీ కోట పున్నయ్య, ప్రముఖ విద్యావేత్త డా॥ టి.వి. నారాయణ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ మాజీ కార్యదర్శి శ్రీ జె. వీరాస్వామి సభ్యులుగా ఉన్నారు. పరిశీలనా సంఘ సభ్యులు చేసిన సూచనలననుసరించి, వారి మార్గదర్శక సూత్రాలను దృష్టిలో ఉంచుకొని సారధ్య సంఘంగా తెలుగు విశ్వవిద్యాలయం అనువాద కార్యక్రమాన్ని ముందుకు నడిపిస్తున్నది. ఈ సందర్భంగా వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు తెలుపుతున్నాను.

డా॥ అంబేద్కర్ రచనలు – ప్రసంగాలు సంపుటాలను అనువదించే బాధ్యతను తెలుగు విశ్వ విద్యాలయం వెంటనే వివిధ విశ్వవిద్యాలయాలకు, కొన్ని సంస్థలకూ అప్పగించింది. ఈ సందర్భంలో రాష్ట్రప్రభుత్వ విద్యాశాఖ, సాంఘిక సంక్షేమ శాఖలు ఏర్పాటు చేసిన సమావేశాలకు తెలుగు విశ్వవిద్యాలయం తరపున రిజిస్ట్రార్ డా॥ తాళ్ల వెంకటరెడ్డి మా ప్రచురణల కార్యక్రమాన్ని క్రమబద్ధం చేశారు.

డా॥ అంబేద్కర్ శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకుని తెలుగు విశ్వవిద్యాలయం అనువాదించి, ముద్రింపజేసిన ఏడవ సంపుటం తిరుపతిలో 14.4.1992నాడు ఆవిష్కృతమైంది.

డా॥ అంబేద్కర్ జయంతిని పురస్కరించుకుని డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌వారు అనువాదించిన మొదటి సంపుటం హైదరాబాదులో 14.4.1993నాడు ఆవిష్కృతమైంది.

ప్రస్తుత సంపుటం డా॥ అంబేద్కర్ గ్రంథావళిలో ఎనిమిదోది. దీని అనువాదాన్ని డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం వారు నిర్వహించినారు. ఈ గ్రంథంలో లీగ్ ఏమి కోరుకొంది, పాకిస్తాన్ వ్యతిరేకంగా హిందువుల వాదం, పాకిస్తాన్ కోసం హిందువులు సూచించే ప్రత్యామ్నాయం, సామాజిక స్తబ్ధత, పాకిస్తాన్ ఉండతగునా తదితరమైన కీలకాంశాలను డా॥ అంబేద్కర్ విశ్లేషణాత్మకంగా చర్చించినారు.

ఈ ఎనిమిదో సంపుటం అనువాదాన్ని డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ప్రముఖ రచయితలకు, అనువాదకులకు అప్పగించింది. అనువాదాన్ని సకాలంలో అప్పగించడానికి విశేషంగా తోడ్పడిన ప్రొ॥ కేతు విశ్వనాథరెడ్డి, శాఖాధిపతి, తెలుగు అధ్యయన శాఖ; డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలంయం వారికి ప్రత్యేక ధన్యవాదాలు. అనువాదకులు ఆచార్య ఎం. సత్యనారాయణరావు, శ్రీ ఆర్. వెంకటేశ్వరరావు, డా॥ కె.యస్. రమణ, డా॥ ఐ. రామ బ్రహ్మం, డా॥ వి. ప్రసన్నకుమార్ గార్లకు ధన్యవాదాలు.

దీక్షతో, దక్షతతో త్వరితగతిని అనువాదానికి మెరుగులు దిద్దిన సంపాదకులు ఆచార్య ఆర్.వి.ఆర్. చంద్రశేఖరరావు, ఆచార్య కేతు విశ్వనాథరెడ్డిగార్లకు నా అభినందనలు తెలియ జేస్తున్నాను.

డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని ప్రోత్సహించి, ఉత్సాహంతో ముందుకు నడిపిస్తున్న సాంఘిక సంక్షేమా శాఖాధికారులకీ, ఉన్నత విద్యాశాఖాధికారులకు కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని సకాలంలో అందంగా ముద్రించిన ప్లానోగ్రాఫర్స్, హైదరాబాదు వారికి కృతజ్ఞతలు.

ఈ సంపుటం అందరి హృదయాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం
మరియు
ప్రధాన సంపాదకులు

1, అక్టోబరు, 1993

# డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్

# రచనలు - ప్రసంగాలు

## సంపుటం - 8

నాది ఒట్టి బుర్ర కాకపోయినా, నిష్పక్షపాతమైన బుర్రే. విశాల దృక్పథం ఉన్న ఎవళ్లయినా సర్వదా శ్లాఘనీయులే. ఈ విషయం అంతే అయినా, విశాల దృక్పథం ఉన్న బుర్ర ఒట్టి బుర్ర కూడా కావచ్చు. అలాంటి విశాల దృక్పథం ఉన్న బుర్ర. అది గనక సంతోషకరమైన షరతు అయితే - మనిషికి ప్రమాదకరమైన షరతు కూడా. ఒట్టి బుర్రవాణ్ని ఏ ఉత్పాతం అయినా సునాయాసంగా ఒడిసి పట్టేస్తుంది. అలాంటి వ్యక్తి స్థైర్యభారం, చుక్కానీ లేని ఓడ లాంటివాడు. దానికి ఓ దారీ తెన్నూ ఉండదు. అది తేలి సాగవచ్చు, కాని పథ నిర్దేశం లేకపోవడంతో ఏ బండరాతిని కొట్టుకునో భగ్నం కావచ్చు. పాఠకుడికి ముఖ్యమైన, సముచిత విషయాన్నంతటినీ అందించి సాయపడాలనే ఉద్దేశ్యం ఉన్నా, నా అభిప్రాయాల్ని పాఠకుడి మీద రుద్దడం లేదు అనే విషయాన్ని పాఠకుడు గమనిస్తాడు. సమస్యకు ఉన్న రెండు పార్శ్వాలనీ పాఠకుడి ముందుంచుతున్నాను. వాటినిబట్టి అతను తన అభిప్రాయాల్ని తను రూపొందించుకోవచ్చు.

- డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్

'పాకిస్తాన్ లేదా భారత విభజన"

అన్న వ్యాసానికి ముందుమాటలో

# పాకిస్తాన్
# లేదా
# భారతదేశ విభజన

రచన : డా॥ బి.ఆర్. అంబేద్కర్

“మరింత వివేకం, ఓ ప్రభూ, మరింత వివేకం, లేదా మనం జయించగల నందనవనాన్ని పూర్తిగా ధ్వంసిస్తాం”

“పాకిస్తాన్‌ను గురించిన ఆలోచనలు’ ’ (మొదటి ముద్రణ)
అనే గ్రంథంలోని ముఖపత్రం మీది ఉల్లేఖన

(1946 ముద్రణకి పునర్ముద్రణ)

రాము

స్మృతికి

పలకరించే దిక్కు, పేదరికంలో, వ్యధలలో యాతన పడే రోజుల్లో నాతో సమంగా వాటిని పంచుకునే సంసిద్ధతను వ్యక్తం చేస్తూ, శాంతచిత్తంతో, ఓర్మిని ప్రదర్శించినందుకూ, హృదయ సౌశీల్యానికీ, మనో నిబ్బరానికీ, వ్యక్తిత్వ పరిశుద్ధతకూ గుర్తింపు చిహ్నంగా

సమర్పితం.......

# విషయ సూచిక


ఆముఖం I
ద్వితీయ ముద్రణకు ముందుమాట V
ప్రస్తావన VIII
ఉపోద్ఘాతం X

భాగం – I
పాకిస్తాన్ విషయమై ముస్లిముల వాదం

1. లీగ్ ఏమి కోరుతోంది? ... 5
2. స్వస్థానం కోరుతున్న జాతి ... 15
3. పతనం నుంచి పలాయనం ... 27

భాగం – II
పాకిస్తాన్‌కు వ్యతిరేకంగా హిందువుల వాదం

4. ఏకతా విచ్ఛిన్నం ... 39
5. రక్షణ పాటవం దుర్బలమవడం ... 55
6. పాకిస్తాన్, మత సామరస్యం ... 93

భాగం – III
పాకిస్తాన్ లేకుంటే మరేమిటి ?

7. పాకిస్తాన్ కోసం హిందువులు సూచించే ప్రత్యామ్నాయం ... 119
8. పాకిస్తాన్ కోసం ముస్లిములు సూచించే ప్రత్యామ్నాయం ... 185
9. ఇతర దేశాల నుంచి నేర్చుకోవలసిన పాఠాలు ... 193

భాగం – IV
పాకిస్తాన్ : కలిగే అనర్థం

10. సామాజిక స్తబ్దత ... 211
11. మతపరమైన దాడి ... 235
12. జాతీయ నిస్పృహ ... 259

భాగం – V

13. పాకిస్తాన్ ఉండతగునా ? ... 339
14. పాకిస్తాన్ సమస్యలు ... 363
15. ఎవరు నిర్ణయించగలిగేది ? ... 381

ఉపసంహారం
అనుబంధాలు
మ్యాపులు

# ఆముఖం

ఇది బాబాసాహెబ్ అంబేద్కర్ రచనలు, ప్రసంగాల 8వ సంపుటం. 1946లో "పాకిస్తాన్ లేదా భారత విభజన" అన్న గ్రంథం మూడవ ముద్రణ ఇందులో పునర్ముద్రితం. దేశ విభజనకు దారి తీసిన ఆలోచనలకూ, సంఘటనలకూ సంబంధించి, ఈ ఉపఖండ రాజకీయ గతికి సంబంధించీ సామూహికమైన చారిత్రక వర్ణ పట్టకం ఇది. ప్రస్తుత రాజకీయ సాంఘిక ఘటనల్ని నిబద్ధ విద్యార్థి ఎవళ్లూ ఈ ఉపఖండంలో ఉపేక్షించలేరు. ఇక్కడ వ్యక్తమైన అభిప్రాయాలన్నిటినీ ఒప్పుకోకపోవచ్చు. కాని బాబాసాహెబ్ అంబేద్కర్ తన కాలం నాటి సంక్లిష్ట సాంఘిక రాజకీయ సమస్యలన్నింటినీ ప్రతిభా వ్యుత్పత్తులతో పరిశీలించారు. ఆయనను అర్థం చేసుకోవాలన్న సంకల్పం ఉన్నవాళ్లకు సమస్యల ప్రస్తావన తీరు విశ్వాసం కలిగిస్తుంది. ఈ సందర్భంలో పుస్తక శీర్షికను మొత్తంగా ఉల్లేఖించాలి. పాకిస్తాన్ లేదా భారతదేశ విభజన. భారత రాజకీయాల్లో ఏది ఏది? ఈ పుస్తకం "భారతదేశాన్ని స్వాతంత్ర్య పట్టికలో చేర్చండి" అనే ఎడ్వర్డ్ థాంప్సన్ గ్రంథంలో ఎంతో మన్నన పొందింది. ఆ విషయం గురించి తను రాసింది ఎంత విలువైందో అంబేద్కర్‌కు తెలుసు.

దాని రెండవ ఎడిషన్ ప్రవేశికలో రాశారు. "అసలు కొరతను ఈ గ్రంథం తీరుస్తుంది. ఈ గ్రంథంలోని భావాల్నీ, ఊహల్నీ, వాదనల్నీ రచయితలూ, రాజకీయవేత్తలూ, పత్రికా సంపాదకులూ తమ వాదనల్ని సమర్థించుకోవడానికి ఎలా వాడేసిందో నేను గమనించాను. ఏ ఆధారాల నుంచీ తీసుకున్నారో కృతజ్ఞతలు చెప్పే మర్యాద కూడా వాళ్లు పాటించకపోవడం నాకు విచారం కలిగించింది. వాళ్లు ఇందులోని వాదనల్ని ఎత్తి రాసేసుకోవడమే కాదు భాషను కూడా సంగ్రహించారు. సరే, దాన్ని గురించి నేను పట్టించుకోలేదు. పాకిస్తాన్ సమస్య అనే చిక్కుముడితో వేగుతున్న భారతీయులకి గ్రంథం కొంత సేవ చేసిందన్నదే నాకు సంతోషం. ఈ గ్రంథం ప్రామాణికమైందని గాంధీ, జిన్నాలు ఇటీవల తమ సంభాషణల్లో చెప్పడం, దీన్ని చూసి తీరాలని అనడం చాలు ఈ గ్రంథం విలువను తెలియజెయ్యడానికి". భారత రాజకీయాల్నీ, భారత చరిత్రనూ విశ్లేషణాత్మకంగా ప్రదర్శించిన గ్రంథం ఇది. "భారత రాజకీయాలు ఏది ఏది" అని పిలవడానికి తగ్గంత సమాచారమూ, విషయపుష్టీ దీంట్లో ఉన్నాయి. ఇది నిష్పక్షపాతంగా ఉంది. తార్కికంగా ఉంది. పాకిస్తాన్ వ్యతిరేకులు దీన్ని కాదనడం, పాకిస్తాన్ కావాలనేవాళ్లు దీన్ని స్వంతం చేసుకోకపోవడం అందుకు దాఖలా. ఈ ఉపఖండంలో అప్పుడు రూపు తీసుకుంటూ ఉన్న పరిస్థితి గురించి సూచనాత్మక దృశ్యాన్ని అంబేద్కర్ అందించారు. ఆయన రాజకీయ జోస్యుడు కాకపోయినా, రాబోయే ఉత్పాత చిహ్నాల్ని పసిగట్టారు. ఆ ప్రమాదాల్నీ, సంఘటనల్నీ అందుకునేట్టు తన ప్రజల్ని సమాయత్తం

చెయ్యగలిగాడు. రాజ్యాంగ నిర్మాణం అనే రాజకీయ నాటకం వెనకాల సాంఘిక అంశాలున్నాయి, చారిత్రక శక్తులున్నాయి. ఒక రాజకీయవేత్త కర్తవ్యం పరిస్థితిని మలచుకోవడం, సాంఘిక దురవస్థల్ని తగ్గించడం, హఠాత్పరిణామాలని ఇముడ్చుకోవడం. అలాంటి సందర్భాల్లోనే మనుషులు గాడి తప్పిపోతారు. సిసలైన జాతీయవాదిగా, భారత ప్రజల ఉద్ధారకుడుగా అంబేద్కర్ చేసిన కృషి అదే. శాంతి భద్రతల్ని కాపాడ్డంలో బ్రిటిష్‌వాళ్లు చేసిన పనిని ఆయన కీర్తించాడు. పరాధీనత నుంచి స్వాతంత్ర్యానికి పరిణామం సాఫీగా, శాంతియుతంగా ఆనందదాయక భవిష్యత్ కేసి సాగాలని ఆయన కోరారు.

ఇంగ్లీష్ భాషలో, రెండు పక్షాల వాదనల్నీ చాలా చక్కగా ముందుకు వెడుతుందీ పుస్తకం. ఆ విధానం పాఠకుణ్ణి ఆకట్టుకుంటుంది. పరిశుద్ధమైన ఇంగ్లీషు భాషలోనో ఫౌలర్ జాతీయాల్లోనో, నుడికారాల్లోనో తమ భావాల్ని వ్యక్తం చెయ్యాలనుకునేవాళ్లు అధ్యయనం చేసేటట్లు సునాయాసంగా, సులభ పదబంధాల్లో రాస్తారు డాక్టర్ అంబేద్కర్. ఆయనకు ఉల్లేఖనల మీద అధికారం ఉంది. తన వైఖరిని సమర్థించుకుందుకు వీటిని వాడతారు. చెయ్యి తిరిగిన న్యాయవాదికి ఉండే భాషా చాతుర్యం ఉంది. బర్క్ నుంచి అగస్టయిన్ బిర్రెల్ దాకా హాయిగా ఉల్లేఖిస్తారు. బిర్రెల్ నుంచి తీసుకున్న ఒక భాగం చూడండి. "వంటవాళ్లని, యోధుల్ని, రచయితల్నీ వాళ్లు చేసిన పనినిబట్టి అంచనా కట్టాలి. రుచికరమైన వంటకాల్ని బట్టి, వైభవోపేత విజయాల్ని బట్టి, రసపుష్టిగల గ్రంథాల్నిబట్టి అంచనా కట్టాలి. ఇవీ మనం కోరేది. వంటింట్లోకి వెళ్లాలని గానీ యుద్ధరంగం మీదికి పోవాలనిగాని, అధ్యయన మందిరంలోకి ప్రవేశించాలని గాని మన కోరిక కాదు. వంటమనిషి తన ఇష్టం వచ్చిన పెనం వాడుకోవచ్చు. యోధుడు తన సైనికుల్ని ఏ రీతిలోనైనా బార్లు తీసి ఉండనియ్యొచ్చు. రచయిత తనకి తోచిన పద్ధతిలో తన వస్తువునో, ఇతివృత్తాన్నో మలచుకోవచ్చు. ఏ వంటకం వడ్డించారు. బాగుందా అనే మనం అడుగుతాం. పుస్తకం వస్తే చదివిస్తుందా అనే అడుగుతాం".

"రచయితల ప్రథమ కర్తవ్యం ఇంపుగా రాయడం అని గుర్తు చెయ్యక్కర్లేదు. కొంతమంది ఇంపుగా రాయలేని వాళ్లు అలా నెగ్గుకొచ్చారు. అందుచేత ఎవళ్లూ బాధ పడాల్సిందేమీ లేదు. రచయిత గంభీరంగా రాయవచ్చు. సరదా పుట్టించవచ్చు. కాని సాధ్యమైనంత ఆహ్లాదకరంగా ఉండాలి. చదవడం అనేది తలమీద రుద్దిన విధికాదు, అందుచేత రసహీనంగా ఉండడానికి లేదు. నువ్వు దీన్ని చదివి తీరాలన్న శాసనం ఏదీలేదు".

ఇక్కడ పునర్ముద్రిస్తున్న పుస్తకం సాఫీగా సాగుతుంది. ఒక సాహిత్యఖండం అనడానికి సంకోచమే లేదు. దీనికి చారిత్రక సామయికత ఉంది. "సాహిత్యాధ్యయనానికి పరిచయం" అన్న గ్రంథంలో విలియం హడ్సన్ ఇలా అంటాడు :

"గ్రంథంలోని వస్తువేదైనా కానీయండి. దాన్ని ప్రసాదించిన తీరు సౌందర్యానుభూతిని కలిగించాలి. సాహిత్యానికి వున్న ముఖ్యాంశాల్లో ఇదొకటి. బౌద్ధిక, అనుభూతి పూర్వక విషయాన్ని మించి, అంటే జీవిత మౌలిక తత్వాన్ని మించి, అది తన రూపం ద్వారా బుద్ధిని

ఆకట్టుకోవాలి. అంటే సాహిత్యం ఒక లలితకళ. ఇతర లలితకళలన్నిట్లాగే దీనికీ దీని నియమాలు, నిర్మాణ చాతుర్య నిబంధనలూ వున్నాయి. ఈ పుస్తకాన్ని చక్కని సాహిత్య ఖండంగా ఎవరైనా ఒప్పుకుంటారు. ఉదాత్తశైలీ రహస్యాల్ని నేర్చుకుని జ్ఞాపకం పెట్టుకునే భాగాలు ఎన్నో ఇందులో ఉన్నాయి. వాటిని అంబేద్కర్, బర్క్, గిబ్బన్, కార్లైల్ మొదలైన వాళ్ల నుంచి నేర్చుకున్నారు.

డాక్టర్ అంబేద్కర్‌కూ, గాంధీజీకి మధ్య ఉన్న సారూపత్యాల్ని అర్థం చేసుకోవడం కష్టం కాదు. ఇద్దరూ ఈ ఉపఖండంలోని శాంతిని కాంక్షించారు. శాంతి అనేది అభివృద్ధికి ఆనుసంఘికం అని, దాని విలువని అంబేద్కర్ చెప్పారు. బర్క్‌ను ఉల్లేఖిస్తూ ఆయన ఇలా అన్నారు : "బల ప్రయోగం తాత్కాలికం మాత్రమే. ఒకక్షణం పాటు అది ఉండవచ్చు, కానీ మళ్లీ లొంగదీసుకునే అవసరాన్ని అది తప్పించలేదు, ఎప్పుడూ జయించాల్సి ఉన్న దేశాన్ని పాలించడం కుదరదు. బల ప్రయోగానికి మరో అభ్యంతరం దాని అనిశ్చితత్వం. భీతాంగం కలిగించడమే బలప్రయోగ లక్ష్యం కాదు.

సాయుధాగారమే విజయమూ కాదు. నెగ్గ లేకపోతే మీకు వనరులుండవు. రాజీ కుదరక పోతే బల ప్రయోగం ఉండనే ఉంది. కాని బల ప్రయోగం విఫలమైతే ఇక రాజీకి ఆశ మిగలదు. అధికారాన్నీ, పదవినీ దయతో కొనవచ్చు, కానీ ఓటమిపాలైన, శుష్కించిన హింస భిక్షలాగా అర్థించలేదు. బల ప్రయోగానికి మరో అభ్యంతరం ఉంది. కాపాడుకోవాలనే ప్రయత్నంలో మీరు అసలు వస్తువునే పాడు చెయ్యవచ్చు. మీరు దేనికోసం పోరాడేరో అది (ప్రజల విశ్వాసం పొందడం) మీరు తిరిగి పొందేది కాదు. శుష్కించిన, కృశించిన, వృథా అయిన, పోటీలో క్షయమైన వస్తువు".

ఇలాంటి భాగాలు ఎన్నో ఉన్నాయి. వాటిని ఉల్లేఖించకుండా ఉండలేం. డాక్టర్ అంబేద్కర్ గతకాలపు మేధావుల అద్భుత సాహచర్యంలో ఉన్నాడు. ఆయన లేన్‌పూల్‌నూ, టాయన్‌బీనీ, బ్రైస్‌నూ, లార్డ్ ఆక్టన్‌నూ పాఠకుడికి ముచ్చట కలిగేట్టు ఉల్లేఖిస్తాడు. తన వాదనల్ని వివరిస్తాడు. గణాంక వివరాల పట్టికలూ, అంకెల వివరాలూ, అధికార పత్రాల ఉల్లేఖనలూ, డాక్టర్ అంబేద్కర్ మేధా సంపత్తిని తెలియజేస్తాయి. విద్వాంసులకు ఆయన నమూనా, అలాగే వృత్తి న్యాయవాదికినీ. డాక్టర్ అంబేద్కర్‌కి తార్కికత బలమైన అంశంగా ఉన్నా, దానికి కటువైన జీవితానుభవం నుంచీ ప్రేరణ వచ్చింది. అయినా ఆయన కసి పెట్టుకున్న వాడు కాదు.

హాస్యం, చతురోక్తి ఆయన రచనల్లో మిణుకుమంటాయి. చర్చకు 'ఉపసంహారం' ఉల్లేఖించదగ్గది. "ఇక్కడ ఆపు చేస్తాను. ఈ విషయం గురించి చెప్పవలసి దాన్నంతటినీ చెప్పాననుకుంటాను. న్యాయ పరిభాష వాడాలంటే, నా వాదనలు ముగించాను. సుదీర్ఘంగానే చేశాననుకుంటాను. అలా చెయ్యడంలో విక్టోరియన్ న్యాయవాదులకు ఇష్టమైన శైలిని వాడాను. ఆ పద్ధతిలో ఉభయపక్షాలూ ఒకళ్లతో ఒకళ్లు వాద ప్రతివాదాలు చేసుకుంటారు...."

తర్వాత సమస్యను జాగ్రత్తగా ప్రతిపాదిస్తాడు. విభజన సమస్యను ఎలా పరిష్కరించాల్సిందీ చూపిస్తాడు. ఈ అభ్యాసం చేస్తూ పరిస్థితిలోని తార్కికతను విశ్లేషిస్తాడాయన. అనుభవంలో వేళ్లు పాదుకున్న పరిశీలనా పద్ధతి ఆయనది. వాగ్వివాద నైపుణ్యమే కాదు, ఈ ఉపఖండంలోని నిత్య జీవిత సత్యాన్ని సైతం నసుగుడు లేకుండా గుర్తించడం. అబ్రహాం కప్లాన్ "పరిశీలనా నిర్వహణ – ప్రవర్తనా శాస్త్ర రచనా విధానం"లో చెప్పినట్టు డాక్టర్ అంబేద్కర్ పద్ధతి ఉ.. శాస్త్రాన్ని కల్పన నుంచి వేరు చేసేది ప్రామాణిక అంశం. అంతర్గత సమతులనం, ఆ మా..కి వస్తే కచ్చితమైన సంగతత్వం కూడా భ్రమాన్విత పద్ధతిగానూ, శాస్త్రీయపద్ధతిగానూ కనిపించవచ్చు. ఆర్కిమెడిస్ సూత్రాన్ని విశదీకరిస్తూ 'నిలబడ్డానికి పరికల్పనను ఇవ్వండి, నేనో లోకాన్నే నిగమిస్తాను' అని మనం చాటవచ్చు. కాని ఆ పరికల్పన ఎంతైనా ఇచ్చేదాకా అది కల్పనా ప్రపంచమే. అనుభవం ఒక్కటే వాస్తవికమైన పరికల్పనల్ని ఇస్తాయనీ, అందుకనే మన పరికల్పనల్ని నిరంతరం పునర్విశ్లేషించుకోవాలని అంబేద్కర్ అంటూ ఉండేవాడు. నిగమనతర్కం ఒక్కటే దీన్ని వ్యాఖ్యానించడానికి చాలదు. సిద్ధాంతాలూ, అనుభూతులూ, విలువలూ, రాగద్వేషాలూ మామూలుగా సామాన్యుడి బౌద్ధిక సరంజామాగా ఉంటాయి. ఒకో అప్పుడు బుద్ధినైశిత్యం ఉన్నవాళ్లు కూడా అలాంటి ఆలోచనా ధోరణిలో పడతారు. అలాంటి ఆలోచనా ధోరణులే మనకి విషయాల్ని మంచిగానో, చెడ్డవిగానో చేస్తూ ఉంటాయి. కానైతే అది తాత్కాలిక అభిప్రాయమే. మనం మన నమ్మకాల, రాగద్వేషాల కాల్పనిక ప్రపంచం నుంచి బయట పడతాం.

"పాకిస్తాన్ లేదా భారతదేశ విభజన" అనే పుస్తక చారిత్రక విషయానికి విలువైన మూలభూత అంశం. నలభై అయిదేళ్లయినా దీని సామయికత సంఘటనల విలువ పెరిగింది.

పరిశోధనా విద్యార్థికి, సామాన్య పాఠకుడికీ కూడా దీన్ని చదవడం చక్కని, ప్రయోజన పుష్టమైన అనుభవం. డాక్టర్ అంబేద్కర్ చారిత్రక దృక్పథంతో చేసిన కృషి అలరిస్తుంది.

సంపాదకవర్గం, డైరెక్టర్ ఆఫ్ ప్రింటింగ్ అండ్ స్టేషనరీ బొంబాయి, పి.ఎస్. మోర్ అందించిన సహకారానికి కృతజ్ఞతలు తెలియజేస్తోంది. మేనేజర్ ప్రభుత్వ ప్రెస్, నాగపూర్, కె.యస్. బన్‌వాట్టికి అభినందనలు తెలియజేస్తోంది. ఈ సంపుటిని ఎడిట్ చెయ్యడంలో ఆయన సహకరించారు. విద్యాశాఖ కార్యదర్శి, ప్రత్యేక నిధుల అధికారీ, వారి సిబ్బంది ఈ పుస్తకం వెలుగు చూడ్డానికి ఎంతో శ్రమ పడ్డారు. వాళ్లకు మా కృతజ్ఞతలు.

**కమల్‌కిషోర్ కదం**

**విద్యాశాఖ మంత్రి**

**అధ్యక్షులు, డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్**

**రచనల ప్రచురణ కమిటీ**

**ఎమ్.ఎస్. బొంబాయి**

**(అను : ఆర్వియార్)**

# ద్వితీయ ముద్రణకు ముందుమాట

పాకిస్తాన్ సమస్య ప్రతివాళ్ళకూ తలనొప్పిగా తయారైంది. ఇతరుల కంటే నాకే ఎక్కువ బాధాకరం అయింది. ఇతర ప్రధాన సారస్వత కృషి చేయాల్సింది చాలా ఉన్నప్పటికీ పాకిస్తాన్ విషయమే నన్ను ఎక్కువ బాధిస్తోంది. ఈ విషయంలో ఈ రెండవ ముద్రణే నా చివరి కృషి అని భావిస్తున్నా. ఈ ముద్రణ ప్రతులు అయిపోయే లోపలే ఈ సమస్య పరిష్కారమవటమో లేదా ఉపసంహరణ కావటమో జరుగుతుంది.

మొదటి ముద్రణకు, రెండవ ముద్రణ నాలుగు విషయాల్లో భిన్నంగా ఉంది.

మొదటి ముద్రణలో ఎన్నో అచ్చుతప్పులు దొర్లటం పట్ల చాలామంది పాఠకులూ, సమీక్షకులూ ఫిర్యాదులు చేశారు. రెండవ ముద్రణలో అచ్చుతప్పులు లేకుండా ఉండటానికి చాలా జాగ్రత్త పడ్డాను. మొదటి ముద్రణలో మూడు భాగాలే ఉన్నాయి. పాకిస్తాన్ సమస్యలోని వివిధ విషయాలపై నా అభిప్రాయాలను అయిదవ అంశంగా అదనంగా చేర్చాను. మొదటి ముద్రణలో పాకిస్తాన్ సమస్య గురించి రాసినప్పుడు నా అభిప్రాయాలను వెల్లడించలేదన్న విమర్శ ఒకటి ఉంది. మరో విషయంలో కూడా ఈ రెండవ ముద్రణ మొదటి ముద్రణకు భిన్నంగా ఉంది. మొదటి ముద్రణలో లేని భౌగోళిక పటాలను కొన్నింటిని ఇందులో చేర్చాను. అనుబంధాలను విస్తృతం చేశాను. మొదటి ముద్రణలో 11 అనుబంధాలే ఉన్నాయి. ఈ ముద్రణలో 25 అనుబంధాలను చేర్చాను. మొదటి ముద్రణలో లేని సూచికను ఈ ముద్రణలో చేర్చాను.

ఈ గ్రంథం యదార్థంలో ఒక అవసరాన్ని తీర్చిందని నేను భావిస్తున్నాను. ఈ గ్రంథంలోని భావాల్నీ, వాదనల్నీ ఆలోచనలనీ వివిధ రచయితలూ, రాజకీయ నాయకులూ, పత్రికా సంపాదకులూ ఏ విధంగా తమ వాదాన్ని బలపరచుకోవడానికి ఉపయోగించుకున్నారో నేను గమనించాను. కాని తమ అభిప్రాయ ప్రకటనలో నా గ్రంథానికి గుర్తింపు ఇవ్వాల్సిన సంప్రదాయాన్ని కూడా వాళ్ళెవ్వరూ పాటించలేదు. అంతేకాదు, కొన్ని సందర్భాల్లో వాదనలతోపాటు గ్రంథంలోని భాషను కూడా వాడుకున్నారు. పాకిస్తాన్‌లాంటి చిక్కుముడి వ్యవహారంతో సతమతమౌతున్న భారతీయులకు ఈ గ్రంథం ఎంతో సహాయకారి కావడం చాలా సంతోషదాయకమైన విషయం. గాంధీ, జిన్నాలు ఇద్దరూ తమ చర్చలో ఈ గ్రంథాన్ని ప్రామాణికమైన గ్రంథంగా అంగీకరించటం ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని చాటుతోంది.

పేరును బట్టి ఈ గ్రంథం కేవలం పాకిస్తాన్‌కు సంబంధించిన సమస్యలకే పరిమితమైందని తోస్తుంది. అంతకంటే ఎక్కువగానే ఈ గ్రంథంలో విషయాలను చర్చించాను. మత దృక్కోణం నుండి భారత చరిత్రనూ రాజకీయాలనూ విశ్లేషించాను. ఆ విధంగా కూడా పాకిస్తాన్‌కు సంబంధించిన కొన్ని విషయాలను విశదీకరించ ప్రయత్నించాను. ఇది కేవలం పాకిస్తాన్ సమస్యకే పరిమితమైన సమగ్ర గ్రంథం కాదు. ఇందులో భారత చరిత్రకూ, రాజకీయాలకూ సంబంధించిన అనేక విషయాలను విస్తృతంగా చర్చించాను. ఒక విధంగా దీన్ని రాజకీయాలలో ఏది ఏమిటి అన్న విషయ పరిశీలనగా పేర్కొనవచ్చు.

ఈ గ్రంథం హిందువుల్నీ, ముస్లిముల్నీ సమానంగా అసంతృప్తి పరచింది. వాళ్ళ అసంతృప్తులకు కారణాలు వేర్వేరుగా ఉన్నాయి. ఈ గ్రంథం పట్ల ఇలాంటి స్పందనలను నేనేమీ తప్పుగా భావించటం లేదు. హిందువులు దీన్ని కాదనటం, ముస్లిములు దీన్ని ఒప్పుకో నిరాకరించటం నన్నేమీ నిరుత్సాహపరచటం లేదు. దీనిని నేను ఏకపక్షవాదంగా రచించలేదు. వాస్తవాలను నిస్సంకోచంగా స్వేచ్ఛగా మీ ముందుంచ ప్రయత్నించాను.

నేను ఈ గ్రంథంలో చెప్పిన విషయాలు తమను గాయపరచాయని కొందరికి బాధగా ఉంది. ఎంత గౌరవ స్థానాల్లో వున్న వ్యక్తులకైనా, వర్గాలకైనా బాధ కలగచ్చు. కాని నేను దాన్ని పట్టించుకోలేదు. ఇలాంటి మార్గాన్ని అనుసరిస్తున్నందుకు నేను బాధపడ్డానే కాని పశ్చాత్తాప పడలేదు. ఎవరికైనా బాధ కలిగించినట్లయితే నా లక్ష్యంలోని నిజాయితీని నిష్పక్షపాత వైఖరినీ దృష్టిలో ఉంచుకుని, నన్ను క్షమించగోరుతాను. ఏ రాగద్వేషాలూ లేకుండా రాశానని నేను నమ్ముతున్నా. నిష్పక్షపాతంగా రాశానని చెప్పుకోవటం లేదు. తన దేశాన్ని గురించి మాట్లాడే టప్పుడు గానీ కాలమాన పరిస్థితుల గురించి ఆలోచించేటప్పుడుగానీ ఇవాళ ఏ భారతీయుడు కిమ్మన్నాస్తిగా ఉండడం సాధ్యం కాదు. అలా ఉండడం మర్యాద కాదని అంటాను. పాకిస్తాన్ విషయాన్ని పరిశీలిస్తున్నప్పుడు నేను అవగాహన చేసుకున్న మేరకు నిర్దుష్టమైన, భావస్ఫోరకమైన లక్ష్యాన్ని అందివ్వడమే నా లక్ష్యం. ఇరుపక్షాల వాదనల్లోనూ నాకు తెలిసిన బలాబలాలను మీ ముందుంచ ప్రయత్నించాను. మూర్ఖమూ, ఆచరణ సాధ్యమూ కాని మార్గాలను అనుసరించటం వల్ల కలిగే దుష్ఫలితాలను వెల్లడించ ప్రయత్నించాను.

రాజ్యాధికారం, రాజ్యంలోని రాజ్యవ్యతిరేక జాతీయ వాదం – వీటి మధ్య జరిగిన పోరాటాల చారిత్రక సాక్ష్యం రూఢిగానూ నిర్ద్వంద్వంగానూ లేదు.

ఫ్రీడ్‌మాన్ మాటల్లో చెప్పాలంటే : "తనకు వ్యతిరేకమైన ఒక జాతిని ఏదో ఒక సందర్భంలో తన అధికారంలో ఉంచటానికి నిర్బంధించని ఆధునిక రాజ్యం ఒక్కటి కూడా లేదు. స్కాట్లు, బ్రిటన్లు, కాటలాన్లు, జర్మనులు, పోలిష్‌వారు, జెక్కులు, ఫిన్నులు వీరంతా ఒక కాలంలో కాకపోతే మరెప్పుడైనా, వారికి ఇష్టం ఉన్నా లేకున్నా అధికారికమైన రాజ్యం వారిని విధేయులుగా ఉండటాన్ని శాసించింది. తరచూ గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్‌లు ఉపయోగించిన

బలప్రయోగం వల్ల చివరికి రాజ్యాధికారానికీ జాతి ఐక్యతావాదులకూ మధ్య సహకారమూ సమన్వయమూ ఏర్పడ్డాయి. కాని చాలా సందర్భాల్లో జర్మనీ, పోలెండ్, ఇటలీ, చాలా సెంట్రల్ యూరోపియన్, బాల్కన్ రాజ్యాల్లో జాతివాదం తమకు ఇష్టంలేని రాజ్యాధికారపు సంకెళ్ళను తెంచుకొని తమదైన రాజ్యాల్ని ఏర్పరచుకొన్నాయి.

మొదటి ముద్రణలో జాతివాదాన్ని అణచివేసిన, కాలగర్భంలో వెలసిపోయిన రాజ్యాల అనుభవాలను వివరించాను. ముద్రణలో పోలికలకోసం ఇతర రాజ్యాల అనుభవాలను కూడా చేర్చాను. వివిధ వర్గాల, జాతుల ప్రజలు ఒకే రాజ్యం నీడలో శాంతియుత సహజీవనం గడపిన అనుభవాలను చేర్చాను. ఇరుపక్షాలవారికీ ఇచ్చిన సలహాల్లో నేను చాలావరకు అవసరాన్ని మించని ఉద్వేగరహితమైన భాషనే వాడాను. పక్షపాతరోగికి వైద్యం చేస్తున్న వైద్యుడు కదలిక వీలుకాని అవయవాలను ఏ విధంగా అనునయంగా కదిలించ ప్రయత్నిస్తాడో ఆ విధంగా నేను, నిద్రాణంగా కాకపోయినా నిస్తబ్దంగా ఉన్న సామాన్య భారతీయుణ్ని, అజ్ఞానంగా కాక అనుమానించకుండా ఉండే సామాన్య భారతీయుడ్ని మేల్కొల్ప ప్రయత్నించాను. వా ఈ ప్రయత్నం ఆశించిన ఫలితాన్ని ఇస్తుందని ఆశిస్తున్నాను.

బొంబాయి ఖాల్సా కాలేజీకి చెందిన ఆచార్య మనోహర్ 'బి' చిట్నిస్, శ్రీ కె.వి.చిత్రేలకు కృతజ్ఞతలు చెప్పకుండా ఈ ఉపోద్ఘాతాన్ని ముగించలేను. వారిద్దరూ శ్రమ అనుకోకుండా మొదటి ముద్రణలో దొర్లిన అచ్చుతప్పులు ఈ ముద్రణలో లేకుండా కృషి చేశారు. ఆచార్య చిట్నిస్ ఈ గ్రంథానికి సూచికను సిద్ధం చేశారు. ఇందువల్ల గ్రంధపు విలువ పెరిగింది. వారికి కూడా నేను కృతజ్ఞుణ్ణి.

**బి.ఆర్. అంబేద్కర్**

1 జనవరి, 1945
22, పృధ్వీరాజ్ రోడ్,
న్యూఢిల్లీ.

# ప్రస్తావన

ఈ గ్రంథానికి సుదీర్ఘమైన ఉపోద్ఘాతం రాయటం వల్ల, ముందుమాట రాయటానికి ఎలాంటి అవకాశం లేదు. ఈ గ్రంథానికి 'చివరిమాట' రాశాను. చివరిమాట రాయటం వల్ల ముందుమాట రాయాల్సిన ఆవశ్యకత ఏర్పడింది. చివరిమాటతో సమతూకంగా ఉండేందుకు గాను ముందుమాట రాసే అవకాశం కలిగింది. ఈ గ్రంథంలో చర్చించిన సమస్యలను మీ ముందుంచటానికి గల కారణాలను వివరించటానికీ, సమస్యల ప్రాధాన్యాన్ని పాఠకులకు తెలియజెప్పటానికీ ముందుమాట రాయాల్సిన అవసరం రెండవది. బొంబాయి రాష్ట్రంలో గత మూడు సంవత్సరాలుగా 'ఇండిపెండెంట్ లేబరు పార్టీ' అనే రాజకీయ పార్టీ పనిచేస్తున్న విషయం పాఠకులకు తెలియడం చాలా అవసరం. ఈ పార్టీ అంత పురాతనమైంది కాదు, రాజకీయల్లో పండిపోయి వృద్ధాప్యం రాలేదు. బుద్ధి మాంద్యమూ రాలేదు. ఇతర రాజకీయ పార్టీలతో పోల్చినప్పుడు ఇండిపెండెంట్ లేబరు పార్టీ చైతన్యంతో ఆవిర్భవించిన కొత్త పార్టీ. అది దేనికీ లొంగి పడి వుండే పార్టీ కాదు. లాహెూర్ సమావేశంలో ముస్లింలీగ్ పాకిస్తాన్ తీర్మానాన్ని అంగీకరించాక, ఇండిపెండెంట్ లేబరు పార్టీ కార్యవర్గం సమావేశమై పాకిస్తాన్ సమస్యపట్ల అవలంబించాల్సిన వైఖరిని గురించి చర్చించింది. పాకిస్తాన్ భావన విషయంలో ఎలాంటి అభ్యంతరాలు లేవనెత్తనవసరం లేదని కార్యవర్గం నిర్ణయించింది. ఒక విధంగా పాకిస్తాన్ భావన పట్ల ఇండిపెండెంటు లేబరు పార్టీ ఆకర్షితురాలైంది. మతపరమైన సమస్యల పరిష్కారానికి తెగల ప్రాతిపదికగా రాష్ట్రాల ఏర్పాటు లాంటిదే పాకిస్తాన్ భావన అని అభిప్రాయపడింది. ఇప్పటి పరిస్థితుల్లో పాకిస్తాన్ భావనపై తన అభిప్రాయం ప్రకటించనవసరం లేదని కార్యవర్గం నిర్ణయించింది. అందువల్ల ఇండిపెండెంట్ లేబరు పార్టీ కార్యవర్గం పాకిస్తాన్ భావన సమస్యను చర్చించి నివేదించటానికి ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీలో నాతో సహా కింది వారున్నారు. దీనికి ఎం.వి. దోండే బి.ఎ., ప్రిన్సిపల్ చైర్మన్, ఎస్.సి. జోషి ఎం.ఎ ఎల్.ఎల్.బి., అడ్వొకేట్ ఓ ఎస్.ఎం.ఎమ్.సి., ఆర్.ఆర్. భోలే బి.యస్సీ., ఎల్.ఎల్.బి., ఎం.ఎల్.ఎ; డి.జి. జాదవ్ బి.ఎ., ఎల్.ఎల్.బి., ఎం.ఎల్.ఎ; ఎ.వి. చిత్రే బి.ఎ., ఎం.ఎల్.ఎ; సభ్యులు. అందరూ ఇండిపెండెంటు లేబరు పార్టీ సభ్యులే. దీనికి డి.వి ప్రధాన్, బొంబాయి మున్సిపల్ కార్పొరేషన్ సభ్యుడు కార్యదర్శి. ఈ కమిటీ నన్ను పాకిస్తాన్ నివేదికను రాయమని కోరింది. నేను రాశాను. ఈ నివేదికను ఇండిపెండెంటు లేబరు పార్టీ కార్యవర్గానికి సమర్పిస్తే, వారు దీన్ని చర్చించి ప్రకటించమని కోరారు. ఆ నివేదికే ఈ గ్రంథం.

పాకిస్తాన్ సమస్యను అధ్యయనం చేసేవారికి సహాయకారిగా ఉండాలన్నదీ గ్రంథ రచన లక్ష్యం. ఈ లక్ష్యంగా నేను ఈ గ్రంథంలో అవసరమైన సమాచారంతో పాటుగా 14

అనుబంధాలను, 3 పటాలను చేర్చాను. ఇవన్నీ గ్రంథంలో ఉండాల్సిన ప్రధాన విషయాలని నేను భావించాను.

ఈ గ్రంథంలోని పేజీలు కేవలం చదవటం మాత్రమే కాదు; విషయాన్ని తర్కించి చూడాలి. తన తరం ఇంగ్లీషు వారికి కార్లైల్ ఇచ్చిన హెచ్చరికను మనసుకు పట్టించుకోమంటాను:

"ఇంగ్లండు ప్రతిభాశాలిత్వం ప్రపంచ ధిక్కారంగా నభో మండలం వైపు పయనించడం లేదు. తుఫానును దూసుకుంటూ పోతున్న గరుడపక్షిలాగా - ఇంగ్లండు ప్రతిభాశాలిత్వం కబళించే ఆశపోతు ఉష్ట్రపక్షిలా ఆబగా.... ఆశ్రయించిన భ్రాంతి ఏదైతేనేం. సమస్య ఉండనే వుంది. సమస్య కుంటుతూనే వుంది. కాని ఇప్పుడిది తప్పనిసరిగా ఉన్నట్టుంది. ఉష్ట్రపక్షి ఒక్కసారిగా కాకపోయినా మరొకసారి భ్రాంతి వదిలి కళ్ళు తెరిచి తన పరిసరాలను అర్థం చేసుకోవాల్సి ఉంటుంది. సమస్య ఎదురు కాకముందే మేల్కోవడం మంచిది: దేవతలు, మనుషులు మనల్ని మేల్కొలిపారు. పెద్దలు చెప్పిన మంచి మాటలు పరుషంగా మందలించి మేల్కొనేటట్టు ఆదేశిస్తున్నాయి."

ఈ విధమైన హెచ్చరికలు భారతీయులకు కూడా వర్తిస్తాయి. ఒకప్పటి ఇంగ్లీషు వారికి వర్తించిన విధంగానే ఇవి నేటి భారతీయులకూ వర్తిస్తాయి. మనం వాటిని వింటే మంచిది. వినకపోవడం వల్ల కష్టాలు వస్తాయి.

ఇప్పుడు ఈ నివేదిక తయారు చేయటంలో సహాయపడిన వారికి కృతజ్ఞతలు. శ్రీ ఎం.జి. తిప్నిస్ డి.సి.ఇ (కాలాభవన్, బరోడా) పటాలను గీయడంలోనూ శ్రీ చగన్‌లాల్, యస్.మోడీలు టైపు చేయడంలోను ఎంతగానో సహాయం అందించారు. వారు చేసిన పనికి, పనిపట్ల వారు చూపిన శ్రద్ధాసక్తులకు నేను కృతజ్ఞుణ్ని. స్నేహితులైన శ్రీ బి.ఆర్. కద్రేకర్, శ్రీ కె.వి. చిత్రేలకు ప్రత్యేకంగా కృతజ్ఞతలు. వారు అతి క్లిష్టమైన ప్రెస్ ప్రూఫులోనూ చాలా కృషి చేశారు.

బి.ఆర్. అంబేద్కర్

28, డిసెంబరు, 1940
రాజగృహ, దాదర్
బొంబాయి - 14

# ఉపోద్ఘాతం

పాకిస్తాన్ విషయంపై ముస్లింలీగ్ తీర్మానం విభిన్న అభిప్రాయాలకు దారి తీసింది. కొందరు దాన్ని తమ సమైక్యతకూ, శక్తికీ, శైశవదశలో సోకే రాజకీయ మశూచకమన్నారు. మరికొందరు అది యథాలాపమైంది కాదని, ముస్లిముల ఆలోచనల శాశ్వతమైన చట్రమంటూ దాని పర్యవసానాల పట్ల వ్యాకులత చెందుతున్నారు.

యదార్థంలో తీర్మానం లేవనెత్తిన సమస్య చాలా వివాదాస్పదమైంది. ప్రధానమైన సమస్య కూడా ఈ వివాదాస్పద సమస్య విషయంలో ఒకరినొకరు చిత్తు చేసుకోవడానికి వినియోగించుకోని వాదమంటూ లేదు. భారతదేశాన్ని రెండు ప్రత్యేక జాతి రాజ్యాలుగా రాజకీయ విభజనం కావాలని చేసే ఈ డిమాండు తమ ఊహలకు అందని విధంగా ఉందని కొందరు వాదిస్తారు. శతాబ్దాలుగా నిలిచిన భారత దేశ సమైక్యతను కావాలని భగ్నం చేసే ప్రతిపాదన పట్ల ధర్మాగ్రహులైన వాళ్ళ ఆగ్రహం తమ ఆలోచనల్ని వ్యక్తం చేయకుండా అడ్డుపడుతోంది. మరికొందరు దాన్ని అంత తీవ్రంగా భావించాల్సిన సమస్య కాదంటున్నారు. దానిని చాలా చిన్న సమస్యగా అంచనా వేస్తున్నారు. ఉపమానాల్తో, రూపకాల్తో సమస్యను దాట వేస్తున్నారు. "తలకాయ నొప్పి వచ్చిందని తల పగులగొట్టుకోం". "బిడ్డ తల్లి ఎవరని తగాదా పడుతున్న ఇద్దరు స్త్రీల సమస్య పరిష్కారానికి బిడ్డని రెండుగా చీల్చం". పాకిస్తాన్ తీర్మానం అర్థం లేదనటానికి పైన చెప్పిన రెండు ఉదాహరణలను పేర్కొంటున్నారు. ఇది భావోద్వేగ సంబధమైన విషయం. ఈ వివాదంలో సమస్య అవగాహన కన్నా, మూర్ఖత్వం అధికంగా వుందని, వెలుతురు కన్నా వేడి ఎక్కువగా వుందని, నిష్పక్షపాతంగా పరిశీలించే విద్యార్థికి తోచకమానదు. ఈ విషయంలో నా అభిప్రాయం నాకే పరిమితం కాకపోయినప్పటికీ నిశ్చితమైంది. పాకిస్తాన్ కోరిక కేవలం రాజకీయమైందని కాలంతో పాటు అది అంతరిస్తుందని నేను భావించటం లేదు. శారీరక వృద్ధిక్రమంలో ఆంతరంగికంగా లక్షణాలు వృద్ధి చెందినట్లుగా నా దృష్టిలో ముస్లిం రాజకీయ వర్గం ఒక ప్రత్యేక రాజకీయ లక్షణాన్ని సంతరించుకొంటున్నట్లుగా తోస్తోంది. పరిణామక్రమంలో ఆ లక్షణం అలాగే ఉండటం లేదా అంతరించడం అనేది హిందువులు, ముస్లిములు తమ తమ ఉనికి కోసం జరిపే పోరాటంలోని వివిధ శక్తులపై ఆధారపడి వుంటుంది. పాకిస్తాన్ అంటే నాకు ఉత్సాహం లేదు. దానిపట్ల నాకు కోపం లేదు. హాస్యాస్పదంగా ఉందని రకరకాల పేర్లు పెట్టడం ద్వారా ఆ ఆలోచనను తుంచి వేయలేం.

దాన్ని హాస్యాస్పదమైందని కొట్టి పారవేయదలచుకున్నవారు, అర్థం కాని విషయానికి నినాదం పేరు పెట్టినంత మాత్రాన దానికి గల అర్థం అంతరించిపోదు. ఒక్కొక్కసారి పెట్టిన పేరు సార్థకం కాకపోయినప్పటికీ, అది గుండెకు ఫిరంగి గుండులాగ తగలక మానదు. భారతదేశంలోని తొంభై శాతం మంది ముస్లిముల భావోద్వేగపూరిత పథకాన్ని పూర్తిగా విచారించకుండా కొట్టి పారవేయడం సమంజసమైన విషయం కాదు. పాకిస్తాన్ తీర్మానాన్ని అర్థం చేసుకోవటంలోనూ, అధ్యయనం చేయటంలోనూ దాని పర్యావసానాలను అంచనా వేయడంలోనూ ఔచిత్యం ఉంది. వీటన్నిటినీ చూశాక పాఠకుడి మనసులో ఒక ప్రశ్న ఉదయిస్తుంది. పాకిస్తాన్ విషయంపై రాసిన ఈ గ్రంథం సమయానుకూలమైందా? పఠనీయమైందా? అదనుకి దొరికిన పండ్లను తింటున్నట్లుగానే ఈ గ్రంథాన్ని పఠించాలా? అన్నదే పాఠకుని ప్రశ్న. సమయానుకూలమైనట్లయితే పఠనీయమైనదేనా? ఇవన్నీ ఉత్తమమైన ప్రశ్నలే. పాఠకుల నాకర్షించే రచయిత ఉపోద్ఘాతంలోనే తన లక్ష్యాన్ని పొందుపరచాలి.

ఈ గ్రంథం అదను గురించి ఏ విధమైన సందేహమూ లేదు. భారతదేశాన్ని వీక్షించే భారతీయులు, గత 20 సంవత్సరాలుగా ఎన్నో మార్పులకు గురైన విషయాన్ని గ్రహిస్తారు. భారత దేశాన్ని గురించి ప్రొఫెసరు ఆర్నాల్డ్ టాయన్‌బీ 1915లో రాస్తూ ఇలా అన్నారు :

"పందొమ్మిదవ శతాబ్దపు బ్రిటీషు రాజనీతిజ్ఞులు భారతదేశాన్ని నిద్రిస్తున్న సౌందర్యవతిగా వర్ణించారు. ఆమెను ప్రేమించటానికి తమకు విధాయకమైన హక్కు ఉందనుకున్నారు. ఎడారి ప్రాంతం నుండి వచ్చే వారి బారి నుండి రక్షించడానికి భారతదేశం చుట్టూ ముళ్ళకంచెను వేశారు. ఇప్పుడు ఆ సౌందర్యవతి మేల్కొని చేయి చాపుతోంది. బందిపోట్లు మర్యాదస్థులైన పెద్ద మనుషులుగా జాగ్రత్తగా మారి ఎడారిని నందనవనంగా కూడా మారుస్తున్నారు. కాని బ్రిటీషు వారి ముళ్ళకంచెను చూసి భయపడుతున్నారు. ముళ్ళకంచెను మర్యాదగా తీసివేయమంటే తీసివేస్తాం. అయితే వారు బలవంతులయ్యేదాకా ఆ మాట అనరు. ఈ గొడవల్లో భారతదేశ రాజకుమారి సానుభూతి మనవైపు వుండదు. మేల్కొంది గనుక తన వాళ్ళవైపు వెళ్లామను కుంటుంది. మన సహాయం లేకుండానే వాళ్ళని ఎదిరించగలనని తలస్తోంది."

"మనం కాస్త తెలివిగా వ్యవహరిస్తే భారతదేశం ఎన్నటికీ బ్రిటీషు సామ్రాజ్య ఆత్మిక సౌభ్రాతృత్వ పరిధి నుండి బయటికి వెళ్ళదు. స్వతంత్రమైన జీవనాన్ని అభిలషిస్తుంది. బ్రిటిషు కామన్‌వెల్తులోని ఇతర సోదర దేశాల మార్గాన్ని అవలంబించవచ్చు".

రచయిత ఇంగ్లీషు దేశస్థుడు. పై మాటలు 1915లో అన్నారు. అయినప్పటికీ, ఆ భావాలనే కులమత భేదం లేకుండా భారతీయులందరూ అనుసరిస్తున్నారు. టాయన్‌బీ చెప్పిన నిద్రిస్తున్న భారత సుందరి మేల్కొంది. ఇప్పుడు భారతదేశాన్ని గురించి భారతీయులకు ఏ భావాలున్నాయి? నిద్రిస్తున్న భారత సుందరిని గతంలో గమనించిన వారంతా ఆమె ఇప్పుడు గతంలో లాగా దేవకన్యలా కాకుండా కొత్తగా ప్రవర్తిస్తోందని భావిస్తున్నారు. ఆమె మతిభ్రమించిన కన్య. ద్వైదీభావం కలది. సగం మానవుడుగా సగం జంతువుగా నిరంతరం పరస్పరం ఘర్షించే ద్వైదీభావాలతో కనిపిస్తుంది. ఆమె ద్వైదీభావం పట్ల ఎవరికైనా సందేహం ఉన్నట్లయితే భారతదేశాన్ని పాకిస్తాన్, హిందుస్తాన్ అని రెండుగా విభజించాలని డిమాండు చేసే ముస్లింలీగు తీర్మానంతో అది తీరిపోతుంది. ద్వైదీభావ ఫలితంగా ఏర్పడ్డ విక్షోభాల నుంచీ, ఘర్షణల నుంచీ విముక్తమై హిందూ ముస్లిములు తమ తమ సంస్కృతులకు అనుకూలమైన వేరు వేరు ఆవాసాలలో నివసిస్తారు.

పాకిస్తాన్ ప్రశ్నను ఒక ప్రత్యేక పథకంగా గమనించాల్సిన విషయంలో ఎలాంటి సందేహం లేదు. ముస్లిములు పాకిస్తాన్ పథకాన్ని చర్చించాలంటారు. రాజకీయాధికారాన్ని వదులుకోవడానికి ముందు బ్రిటిషు ప్రభుత్వం, హిందువులు ముస్లిములు ఏదో ఒక పరిష్కారం చేసుకోవాలంటారు. అలాంటి పరిష్కారానికి పట్టుబట్టటంలో బ్రిటిషువారిని మనం తప్పు పట్ట వీలులేదు. మైనారిటీలుగా వున్న ముస్లిముల పై పెత్తనం చలాయించే హిందూ మెజారిటీ వర్గానికి ప్రభుత్వాధికారాన్ని బదిలీ చేయడానికి బ్రిటిషువారు సుతరామూ ఒప్పుకోరు. దానితో సామ్రాజ్యవాదం అంతరించదు. మరో సామ్రాజ్యవాదాన్ని సృష్టించినట్లవుతుంది. పర్యవసానంగా హిందువులు పాకిస్తాన్ విషయాన్ని చర్చించకుండా ఉండలేరు.

అన్యథా మరో మార్గం లేదు. కనుక పాకిస్తాన్ పథకాన్ని ఆలోచించాల్సి వస్తే మనం కొన్ని విషయాలను జ్ఞాపకం వుంచుకోవాల్సి వుంది.

ఈ విషయాన్ని హిందువులు ముస్లిములు పరిష్కరించుకోవాలన్నది మొదటి వి[illegible]ం. ఈ విషయంలో వారు మరొకరి సహాయం కోరనక్కరలేదు. బ్రిటిషువారు పరిష్కరిస్తారని భావించటానికి కూడా వీలులేదు. బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రయోజనాల దృష్ట్యా భారతదేశం ఒకటిగా వుంటుందా, రెండుగా వుంటుందా లేక కాంగ్రెసువారు భావిస్తున్నట్లుగా భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఇరవైగా ఉంటుందా అనే విషయం అతీతమైంది. అవన్నీ బ్రిటిషు సామ్రాజ్యంలో అంతర్భాగాలుగా వుండటమే బ్రిటిషు వారి ఆశయం. భౌగోళిక విభజన వల్ల

వారి ఆశయాలకు భంగం కలగనంతవరకూ బ్రిటిషువారు జోక్యం కలుగజేసుకోరు.

పాకిస్తాన్ పథకాన్ని తుంచి వేయడానికి బ్రిటిషువారు బలప్రయోగాన్ని ఉపయోగిస్తారని ఒకవేళ హిందువులు అనుకుంటే అది అసాధ్యమైన విషయం. బలప్రయోగం నివారణోపాయం కాదన్నది మొదటగా గుర్తుంచుకోవాల్సిన విషయం. అమెరికన్ వలసల విషయంలో బలప్రయోగం నిష్ఫలం అన్న విషయాన్ని చాలాకాలం క్రిందటే బర్క్ ప్రవచించారు. ఒక్క హిందూ మహాసభవారి కోసమే గాక అందరికోసం బర్క్ మాటలను ఉల్లేఖించవచ్చు :

"కేవలం బలప్రయోగం తాత్కాలికమైంది. అది కొంతవరకే నిలువ గలుగుతుంది. అంతర్గత కారణాలను శాశ్వతంగా నిర్మూలించజాలదు. శాశ్వతంగా బలప్రయోగం ద్వారా జయిస్తూ జాతిని పాలించలేరు. మరొక ఆక్షేపణ ఏమంటే బలప్రయోగం అనిశ్చితమైంది. భయం భయమే ఎప్పుడూ. బలప్రయోగ పరిణామం కాదు. ఆయుధాలు కలిగి యుండటమే విజయం కాదు. విజయం సాధించ లేకపోతే నీకు వనరులు లేనట్లే. రాజీ సాధ్యపడనప్పుడే బలప్రయోగం. కానీ బలప్రయోగం నిష్ఫలమయినప్పుడు మరే విధమైన రాజీకి అవకాశముండదు. కొన్ని సమయాల్లో శక్తినీ అధికారాన్నీ ప్రజల దాక్షిణ్య కారుణ్యాలతో సాధించవచ్చు. కాని బలప్రయోగం నిష్ఫలమైనప్పుడు శక్తినీ అధికారాలనూ భిక్షంగా అర్థించరాదు. బలప్రయోగం లక్ష్యాలను నిర్వీర్యం చేస్తుంది. దేనికోసమై పోరాడారో సాధించింది అదికాదు. లక్ష్యం సాధించాక దాని విలువ తగ్గిపోయి ఉంటుంది. అందువల్ల పాకిస్తాన్‌కు ప్రత్యామ్నాయంగా బలప్రయోగాన్ని ఆలోచించటానికి వీలులేదు.

ముస్లిములకు స్వయం నిర్ణయాధికార హక్కును ఇవ్వకుండా ఉండే వీలులేదు. స్వయం నిర్ణయాధికారం పట్ల విశ్వాసం ఉండి, యూరోపు ఖండంలోని అతి చిన్న రాజ్యాలకు కూడా ప్రసాదించిన స్వయం నిర్ణయాధికారాన్ని తమకు బ్రిటన్ ఇవ్వాలని హిందువులు కోరుకుంటున్నారు. అలాంటి స్వయం నిర్ణయాధికారాన్ని దేశంలోని ఇతర మైనారిటీలకు ఇవ్వరాదని హిందువులు కోరడం సమంజసమైన విషయం కాదు. పాకిస్తాన్ ఆలోచనలను మానుకోవాలని బ్రిటీషు ప్రభుత్వం ముస్లిములను బలవంతపెట్టాలని అంటున్న హిందూ జాతీయవాదులు ఒక విషయాన్ని విస్మరిస్తున్నారు. విదేశీ దురాక్రమణ, సామ్రాజ్యవాదాల నుండి స్వాతంత్ర్యం కావాలనే జాతీయవాదపు హక్కు, మెజారిటీ జాతీయవాదం నుండి స్వాతంత్ర్యం కావాలనే మైనారిటీల హక్కు ఒకే రకమైనవి కావు. రెండవదాని కన్నా మొదటిది అతి పవిత్రమైనదని కాదు. ఆయా కోర్కెలలోని నైతికతను బట్టి అవి రెండూ స్వాతంత్ర్య

పోరాటంలోని రెండు దృక్కోణాలు. సామ్రాజ్యవాద కబంధ హస్తాల నుండి స్వాతంత్ర్యం కావాలని పోరాడుతున్న జాతీయవాదులు మెజారిటీవర్గ దురాక్రమణ జాతీయవాదం నుండి రక్షణకోరే మైనారిటీల హక్కులను కాలరాచేటందుకు బ్రిటీష్ సామ్రాజ్యవాదుల సహాయం అడగ వీలులేదు. ఈ సమస్య హిందువులు, ముస్లిములే పరిష్కరించుకోవాలి. బ్రిటన్ ఈ సమస్యను పరిష్కరించ వీలులేదు. ఇది మనం జ్ఞాపకం ఉంచుకోవాల్సిన మొదటి వి... ం.

భారతదేశం మొత్తానికి ఒకే కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు అవుతుందన్న విషయానికి వ్యతిరేకతే పాకిస్తాన్ అని భావించాలి. పాకిస్తాన్ ఏర్పాటు పథకం భారతదేశానికి రెండు కేంద్ర ప్రభుత్వాలుండాలంటుంది. అవి ఒకటి హిందుస్తాన్, రెండవది పాకిస్తాన్. మొదటిది రెండో ముఖ్యమైన దానికి దారి తీస్తున్నదన్న విషయాన్ని భారతీయులుగా మనం గమనించాల్సి ఉంటుంది. కొత్త రాజ్యాంగాన్ని ఏర్పరచి అమలు జరపక మునుపే పాకిస్తాన్ సమస్యను పరిష్కరించాల్సి ఉంది. భారతదేశానికంతకూ ఒకే కేంద్ర ప్రభుత్వం ఉండాలనుకోవటం పాకిస్తాన్ హిందుస్తాన్‌లకు వేర్వేరు కేంద్ర ప్రభుత్వాలుండాలనే భావనకు వ్యతిరేకం. విషయం ఈ విధంగా ఉన్నప్పుడు వాయిదా వేయడానికి వీలులేదు. ప్రస్తుత పథకాన్ని విడనాడాలి లేదా కొత్త పథకాన్ని ఏర్పరచుకోవాలి. సర్వాంగీకారంతో ఏదో ఒక నిర్ణయం చేయాల్సి వుంది. ఇప్పుడు గనుక పాకిస్తాన్ ఏర్పాటు పథకాన్ని పాతిపెట్టినట్లయితే మళ్ళీ అది ఆవిర్భవించదన్న నమ్మకం లేదు. పాకిస్తాన్‌ను పాతి పెట్టటమంటే పాకిస్తాన్ భూతాన్ని పాతిపెట్టటంలాంటి సమస్యకాదు. ఒక కేంద్ర ప్రభుత్వ స్థాపనకు వ్యతిరేకతే పాకిస్తాన్ సిద్ధాంతం. ఇలా భావించినట్లయితే పాకిస్తాన్ భూతం నశించదు. బతికే ఉంటుంది. దాని నీడ భారతదేశ రాజకీయ భవిష్యత్తు మీద పడుతుంటుంది. శాశ్వత పరిష్కారాన్ని వాయిదా వేస్తూ తాత్కాలిక నిర్ణయం చేయటం అంత విజ్ఞతతో కూడిన విషయం కాదు. రోగాన్ని తెలుసుకోకుండా మందు వేయటం లాంటి దవుతుంది. రోగం నయం కాదు; మళ్ళీ వస్తుంది. ఆ రావటం చాలా తీవ్రంగా ఉంటుంది.

భారతదేశానికి ఒకే కేంద్ర ప్రభుత్వం ఉండాలనే సమస్య పరిష్కారమైందని భావించడానికి వీలులేదు. ఆ సమస్య నేటితో అంతమయ్యేది కాదు. పునరావృతం కావచ్చు.

భారతదేశంలో ఎలాంటి కేంద్ర ప్రభుత్వమూ ఉండరాదన్న విషయాన్ని ముస్లిములు బహిరంగంగానే ప్రకటించారు. అందుకు కారణాలను కూడా వారు విశదీకరించారు. జనాభాలో ముస్లిములే ఎక్కువగా వున్న అయిదు రాష్ట్రాల్లో వారు ముస్లిముల పాలనను ఏర్పరచారు. ఈ ...యిదు రాష్ట్రాల్లో స్వతంత్ర ముస్లిం ప్రభుత్వాలను ఏర్పరచి, వాటి మనుగడ కొనసాగేటందుకు

ప్రయత్నిస్తున్నారు. ఈ వాస్తవం వల్ల భారతదేశాని కంతటికీ ఒకే కేంద్ర ప్రభుత్వం ఏర్పడడాన్ని ముస్లిములు కంటకంగా భావిస్తున్నారు. హిందువుల మెజారిటీగల కేంద్ర ప్రభుత్వ పర్యవేక్షణ ముస్లిం మెజారిటీ గల రాష్ట్రాలపై వుంటుందని, ముస్లిం రాష్ట్రాల ఆంతరంగిక వ్యవహారాల్లో అది జోక్యం చేసుకుంటుందనీ వారు ఊహిస్తున్నారు. భారతదేశాని కంతటికీ ఒకే కేంద్ర ప్రభుత్వాన్ని అంగీకరించడమంటే, ముస్లిం మెజారిటీ రాష్ట్రాల వల్ల కలిగే లాభాలను కోల్పోవటంగా ముస్లిములు భావిస్తున్నారు? ముస్లిముల మెజారిటీగల రాష్ట్రాలపై హిందువుల మెజారిటీ గల కేంద్ర ప్రభుత్వ నియంత్రణ ఉండడంగా భావిస్తున్నారు. ఆ నియంత్రణ నుండి తప్పించుకోవటానికి అసలు కేంద్ర ప్రభుత్వమే లేకుండా ఉండాలని ముస్లిములు వ్యాఖ్యానిస్తున్నారు.

ఒక్క ముస్లిములే కేంద్ర ప్రభుత్వం ఏర్పాటును వ్యతిరేకిస్తున్నారా? మరి హిందువుల సంగతి ఏమిటి ? హిందువుల రాజకీయ చర్చలన్నింటిలోనూ భారతదేశ రాజకీయ రాజ్యాంగ చట్రంలో కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు శాశ్వతమన్న గౌరవభావన ఉన్నట్టుగా కనిపిస్తుంది. అలాంటి దాన్ని ఎంతవరకూ అంగీకరించవచ్చుననే విషయాన్ని నేను చెప్పలేను. కాని హిందువుల చర్చల్లో రెండు విషయాలు ప్రధానమైనవిగా ప్రముఖమైనవిగా కన్పిస్తున్నాయి. అవి భవిష్యత్తులో ఏనాడైనా కేంద్ర ప్రభుత్వం కావాలనే భావాన్ని హిందువులు విరమించుకునేట్లు చేయవచ్చు.

హిందూ రాష్ట్రాల మధ్యగల సాంస్కృతిక వైరం మొదటి ప్రధాన విషయం. హిందువులు మెజారిటీగా ఉండే రాష్ట్రాలు సుఖ సంతోషమయ కుటుంబం కాదు, శిఖ్ఖులకు బెంగాలీల మీద, రాజపుత్రులకు మదరాసీల మీద మక్కువ లేదు. బెంగాలీలు తమ బెంగాలునే అధికంగా ప్రేమిస్తారు. మదరాసీ తన ప్రపంచానికే పరిమితమవుతాడు. భారతదేశంలో ముస్లిం సామ్రాజ్యాన్ని నిర్మూలించడానికి సమకట్టిన మరాఠీలు, తాము తక్కిన హిందువులను సుమారు వంద సంవత్సరాల పాటు పాలించామన్న సంగతిని గుర్తుకు తెచ్చుకోరు. హిందువుల రాష్ట్రాల్లో అంగీకృతమైన సాంప్రదాయాలు లేవు. వారిని సమైక్యపరిచే ప్రయోజనాలూ లేవు. మరొకప్రక్క భాషాభేదాలు, తెగభేదాలు, గతంలోని ఘర్షణలు వారిని విడదీస్తున్నాయి. అయితే హిందువులందరూ సమైక్యమవుతున్నారు. వీరినందరినీ ఒకేజాతిగా సమైక్యపరచే భావం పాదుకొంటోంది అన్న విషయం నిజం. అయితే వారు ఇంకా ఒక జాతిగా ఆవిర్భవించి లేదన్న విషయాన్ని మనం విస్మరింపరాదు. వారు ఒక జాతిగా ఆవిర్భవించే ప్రయత్నాలు చేస్తున్నారు. వారు ఆ

ప్రయత్నంలో సఫలీకృతం కాకముందే అపజయం ఎదుర్కోవచ్చు. సమైక్యపరచడానికి వంద సంవత్సరాలుగా జరుగుతున్నకృషికి ఫలితం లేకపోవచ్చు.

రెండవది ఆర్థిక వి    ం. కేంద్ర ప్రభుత్వం ఏర్పరచి నిర్వహించటంలోని ఆర్థిక సాధక బాధకాలు ఇంకా అవగాహన అయినట్లు తోచదు. కేంద్ర ప్రభుత్వ నిర్వహణకు ప్రతి రాష్ట్ర ప్రభుత్వానికి ఎంత ఖర్చు అవుతుందన్న విషయం బోధపడినట్లు తెలియదు.

బ్రిటిష్ ఇండియా వార్షిక ఆదాయం : 194,64,17,926 రూపాయలు. ఇందులో రాష్ట్రాల ద్వారా లభించే మొత్తం 73,57,50,125 రూపాయలు. కేంద్ర ప్రభుత్వం తన వనరుల ద్వారా సమకూర్చుకునే వార్షిక ఆదాయం, 121,00,67,801 రూపాయలు. కేంద్ర ప్రభుత్వ నిర్వహణకు ఎంత వ్యయం అయ్యేదీ పైన వివరించిన అంకెలు తెలుపుతాయి. కేంద్ర ప్రభుత్వ నిధులు కేవలం దేశంలో శాంతి పరిరక్షణకే పరిమితం అయ్యేటట్లు ఉండేందుకు గాను అంత పెద్ద మొత్తం చెల్లించాల్సిన విషయాన్ని గురించి ప్రజలు ఆశ్చర్యం ప్రకటించకపోరు. ఈ సందర్భంలో, రాష్ట్రాల్లోని ప్రజలు చాలా కష్టాల నెదుర్కొంటూన్నారన్న విషయాన్ని మనం గమనించాల్సి వుంది. రాష్ట్రాలకు తమ ఆర్థిక వనరులను వృద్ధిపరచుకునేందుకు ఎలాంటి ఇతర మార్గాలు లేవు అన్న విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి.

కేంద్ర ప్రభుత్వ నిర్వహణకయ్యే ఖర్చును భారతదేశ ప్రజలే భరించాలి. ఆ వ్యయంలో రాష్ట్రాలకన్నిటికీ సమభాగాలు లేవు. కేంద్ర ప్రభుత్వ ఆదాయ వనరులు 1) కస్టమ్స్ సుంకాలు 2) ఎక్సైజ్, 3) ఉప్పు, 4) కరెన్సీ 5) పోస్టు టెలిగ్రాఫ్‌లు 6) ఆదాయపు పన్ను 7) రైల్వేలు. భారత ప్రభుత్వం ప్రకటించిన లెక్కలను బట్టి కేంద్ర ప్రభుత్వ వనరులైన కరెన్సీ, పోస్టు టెలిగ్రాఫ్, రైల్వేల ఆదాయాన్ని రాష్ట్రాలవారీగా విభజించడానికి వీలులేదు. ఇతర వనరుల ద్వారా సమకూరే ఆదాయాన్ని రాష్ట్రాలవారీగా లెక్కించడానికి వీలుంది.

| | రాష్ట్రాలు | రాష్ట్ర ప్రభుత్వాలు, వాటి వనరుల నుంచి పొందిన ఆదాయం | కేంద్ర ప్రభుత్వం, కేంద్ర వనరులను సేకరించిన ఆదాయం |
|---|---|---|---|
| 1. | మద్రాసు | 16,13,44,520 | 95326745 |
| 2. | బొంబాయి | 124459553 | 225344247 |
| 3. | బెంగాల్ | 127660892 | 237901583 |
| 4. | యు.పి. | 127999851 | 40553030 |
| 5. | బీహార్ | 52383030 | 15437742 |
| 6. | సెంట్రల్ ప్రావిన్సెస్, బేరార్ | 42741280 | 3142682 |
| 7. | అస్సాం | 25848474 | 18755967 |
| 8. | ఒరిస్సా | 18199823 | 567346 |
| 9. | పంజాబ్ | 113586355 | 11801385 |
| 10. | వాయవ్య | 18083548 | 928294 |
| 11. | సింధ్ | 37029854 | 56646915 |

పైన వివరించిన పట్టిక ద్వారా కేంద్ర ప్రభుత్వ నిర్వహణకయ్యే వ్యయం భారంగా ఉండటమే కాక రాష్ట్రాల మధ్య సమంగా లేదు. బొంబాయి రాష్ట్ర ప్రభుత్వం 12,44,59,553 రూపాయల ఆదాయాన్ని సేకరిస్తే, కేంద్ర ప్రభుత్వం బొంబాయి రాష్ట్రం నుండి 22,53,44,247 రూపాయల ఆదాయాన్ని సేకరిస్తోంది. బెంగాలు రాష్ట్ర ప్రభుత్వం 12,76,60,892 రూపాయల ఆదాయం సేకరిస్తే కేంద్ర ప్రభుత్వం బెంగాలు నుండి 23,79,01,583 రూపాయలను సేకరిస్తోంది. సింధ్ ప్రభుత్వం 3,70,29,354 రూపాయల ఆదాయం సేకరిస్తే సింధ్ రాష్ట్రం నుండి కేంద్ర ప్రభుత్వం 5,66,46,915 రూపాయల ఆదాయం పొందుతోంది. అస్సాం రాష్ట్ర ప్రభుత్వ ఆదాయం 2.5 కోట్ల రూపాయలు కాగా అస్సాం రాష్ట్రం నుండి కేంద్ర ప్రభుత్వం 2 కోట్ల రూపాయల ఆదాయాన్ని పొందుతోంది. పైన వివరించిన రాష్ట్రాలు కేంద్ర ప్రభుత్వానికి ఆదాయం సమకూరిస్తే మిగతా రాష్ట్రాల నుండి కేంద్ర ప్రభుత్వానికి ఎలాంటి ఆదాయం లేదు. వాయవ్య రాష్ట్ర ఆదాయం 1,80,83,548

రూపాయలు కాగా ఆ రాష్ట్రం నుండి కేంద్ర ఆదాయం 9,28,294 రూపాయలు మాత్రమే. యునైటెడ్ ప్రావిన్సెస్ 13 కోట్ల రూపాయలు ఆదాయం కాగా కేంద్ర ప్రభుత్వానికి 4 కోట్లు మాత్రమే ఇవ్వగలుగుతోంది. బీహారు రాష్ట్రం 5.5 కోట్లు ఆదాయం కాగా కేంద్రానికి 1.5 కోట్లు మాత్రమే లభిస్తోంది. సెంట్రల్ ప్రావిన్సెస్ ఆదాయం 4 కోట్లు కాగా కేంద్రానికి 31 లక్షలు.

ఇప్పటివరకు ఈ ఆర్థిక విషయాన్ని ఎవరూ గమనించినట్టు లేదు. కేంద్ర ప్రభుత్వ మనుగడను బలపరుస్తున్న హిందువులు కూడా ఆర్థిక విషయాన్ని గమనించాల్సి వుంది. అప్పుడు వారికి ఇప్పుడున్న దేశభక్తి విషయం కన్నా ఆర్థిక విషయమే ప్రధానమైందిగా కన్పించవచ్చు. ముస్లిములు మత విషయమై హిందువులు ఆర్థిక విషయమై కేంద్ర ప్రభుత్వం లేకుండా ఉండటాన్ని బలపరిచే అవకాశాలున్నాయి.

ఇదే జరగబోయేట్లయితే, అలాంటిది కొత్త రాజ్యాంగం రూపొందకముందే జరగటం మంచిది. కేంద్ర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తూ కొత్త రాజ్యాంగం రూపొందటం జరిగాక పై చెప్పిన విషయం జరిగేటట్లయితే అది చాలా వినాశకారిగా వుంటుంది. అలాంటి వినాశనంలో భారతదేశం అంతర్థానమవటమే గాక హిందువుల సమైక్యతను కాపాడడం కూడా కష్టమవుతుంది. హిందువులు మెజారిటీ కాగల రాష్ట్రాల మధ్య సమైక్యత బలంగా లేదన్న విషయాన్ని ఇంతకు ముందే వివరించాను. ఉన్న కొద్దిపాటి సమైక్య భావానికి భంగం కలిగేటట్లయితే మిగిలిన హిందువుల రాష్ట్రాల మధ్య ఐక్యం సాధించటం కానిపని. ఇందువల్లనే భారతీయులు భారత రాజ్యాంగం రూపొందక ముందే అది తాత్కాలికమైనదా లేదా శాశ్వతమైందా అనే విషయాన్ని నిర్ణయించుకోవాలి. దేశమంతటికినీ ఒకే పునాదిపైన రాజ్యాంగ నిర్మితిని రూపొందించుకున్నాక దాన్ని విభాగించాలని నిర్ణయించినప్పుడు అసలు నిర్మితికే మోసం కలగవచ్చు. మొత్తం, నిర్మితి నుండి ఒక భాగం వేరు చేసినప్పుడు మిగతా భాగపు పునాదులు దెబ్బతినవచ్చు. ఒకే రాజ్యాంగపు నిర్మితిని ఏర్పరచటం వల్ల అది భవిష్యత్తులో బీటలు తీసే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. ముస్లిములకు ప్రత్యేక రాజ్యాంగం కావాలన్న ముస్లిం రాష్ట్రాల కోర్కెలను మన్నించినట్లయితే మిగతా హిందూ రాష్ట్రాల మధ్య ఐక్యానికి భంగం కలిగే అవకాశం ఉంది.

రాజ్యాంగాలకు భంగపాటు ప్రమాదం ఎదురైన సందర్భాలకు చరిత్రలో కొదవలేదు. అమెరికన్ యూనియన్‌లోని దక్షిణాది రాష్ట్రాల విషయం ఒక ఉదాహరణ. నేపాల్ రాష్ట్రం ఫ్రికా యూనియన్‌కు వెలుపలే ఉండాలనుకుంది. పశ్చిమాస్ట్రేలియా రాష్ట్రం ఆస్ట్రేలియా

కామన్‌వెల్త్ నుండి వైదొలగాలని ఇటీవలే నిశ్చయించుకుంది.

సందర్భాల్లో వాస్తవానికి భంగపాటు జరుగలేదు. జరిగిన చోట మళ్ళీ సర్దుబాట్లు ఏర్పడ్డాయి. భారతీయులకు అలాంటి అదృష్టం ఉంటుందని నేను భావించటం లేదు. వారిది చెకోస్లోవేకియా ఉదాహరణగా ఉంటుందేమో. ఒకవేళ ముస్లిం రాష్ట్రాలు విడిపోతే భవిష్యత్తులో వాటిని అంతర్యుద్ధం తరువాత అమెరికాలో లాగా తిరిగి భారతదేశంలో సమైక్యం చేయవచ్చునని అనుకోవటం పొరపాటే అవుతుంది. ఒకవేళ భారత రాజ్యాంగం అధినివేశ రాజ్యాంగం అయితే రాజ్యాంగపు భంగపాటును ఆపటం బ్రిటిష్ వారికి కూడా కష్టమౌతుంది. అందువల్ల కొత్త రాజ్యాంగానికి ముందే పాకిస్తాన్ సమస్యను పరిష్కరించటం మంచిది.

రాబోయే రాజ్యాంగ సంస్కరణాల సవరణలలోపున పాకిస్తాన్ ఏర్పాటు పథకం విషయాన్ని భారతీయులు పరిష్కరించుకోవటం తప్పనిసరి అని భావించేటట్లయితే, ఆ సమస్యను కూలంకషంగా అవగాహన చేసుకోవాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది. రాజ్యాంగ చట్టం నిమిత్తం ఏర్పాటైన రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో కొంతమంది భారతీయులు పాకిస్తాన్ విషయమై కొంత అజ్ఞానాన్ని ప్రదర్శించారు. దాంతో 'అబ్జర్వర్'కు చెందిన గార్విన్, సైమన్ కమీషన్ భారతదేశంపై నివేదికను సమర్పించే బదులు, ప్రపంచ రాజ్యాంగాల్లోని వివిధ అధికరణాలు ఏ విధంగా భారతదేశ సమస్యలకు సమాధానంగా ఉండగలవో వివరించనట్లయితే బాగుండేదని వ్యాఖ్యానించారు. రాజ్యాంగాన్ని ఏర్పరచుకొంటున్న దక్షిణాఫ్రికా ప్రతినిధులకోసం ఇలాంటి నివేదికనే రచించటం జరిగింది. అలాంటి నివేదిక వల్ల లోటుపాట్లను గ్రహించవచ్చు. అందరూ అలాంటిదాన్ని ఆహ్వానిస్తారు.

ఈ గ్రంథం ప్రస్తుతం అవసరం అనడానికి ఇది చాలు. రెండవ ప్రశ్న విషయంలో; ఈ గ్రంథం చదవటానికి అనుకూలంగా వుందా అనే విషయం అగస్టీన్ బిరెల్ అన్న మాటలను ఎవ్వరూ మరచిపోలేరు.

పాచకుల్ని, సైనికుల్ని, రచయితల్ని వాళ్ళు చేసే పనినిబట్టే అంచనా కట్టాలి. నోరూరించే వంటకాలు, వైభవోపేతమైన విషయాలు, ఆహ్లాదకరమైన గ్రంధాలు మనం అర్థిస్తాం. వంటకాల్లో వేటినీ కలుపుతారు, యుద్ధ తంత్రాలు వ్యూహాలూ మనకనవసరం. వంటశాలకూ, మండలికీ, రచనా స్థలానికీ వెళ్ళాలన్న కోరిక మనకుండదు. పాచకులు తమకు ఇష్టం వచ్చిన రీతిలో వంట పాత్రల్ను, సామానుల్ని వాడుతారు. సైనికులు తమకు ఇష్టం

వచ్చిన రీతిలో వ్యూహాన్ని ఏర్పరచుకొంటారు. రచయిత తాను చెప్పదలచుకున్న దాన్ని తన ఇష్టం వచ్చిన రీతిలో రచిస్తాడు. వంటకాలను వడ్డిస్తున్నప్పుడు అవి మంచిగా ఉన్నాయా? యుద్ధరంగంలో పోరు జరుగుతున్నప్పుడు ఎవరు గెలిచారు? పుస్తకం ప్రకటితమైనప్పుడు చదవదగ్గదా? అన్న ప్రశ్నలే మన ముందుంటాయి.

అందరికీ ఆమోదయోగ్యంగా ఉండేటట్లు రాయాల్సిన ఆవశ్యకత గురించి రచయితలకు జ్ఞాపకం చేయాల్సిన అవసరం వుండదు. ఇందుకు అంగీకరించని వారు కూడా కొన్ని మంచి రచనలు చేశారు. వాటిని గురించి అసంతృప్తి చెందనవసరం లేదు. ప్రతి రచయితా, తన పుస్తకాన్ని పాఠకులకు ఇంపైన రీతిలో చదివించే లక్ష్యంతో రాయాలి. చదవడం ఒక విధి కాదు. ఎవళ్ళ పుస్తకాన్నీ చదవమని ఎవరికీ నిర్బంధం లేదు.

ఈ విషయం నాకు బాగా తెలుసు. కాని ఆ విషయం గురించి నేను ఎక్కువగా బాధపడటం లేదు. అది ఇతర పుస్తకాలకు వర్తిస్తుందేమో కాని "పాకిస్తాన్" గ్రంథానికి వర్తించదు. ప్రతి భారతీయుడు 'పాకిస్తాన్' గ్రంథాన్ని చదవాలి. దేశాన్ని సక్రమమైన మార్గంలో నడపాలంటే ఈ గ్రంథం కాకపోతే మరో గ్రంథం ద్వారానైనా పాకిస్తాన్ సమస్యను అవగాహన చేసుకోవాలి.

ఏ పుస్తకమైనా పఠన యోగ్యంగా లేకపోతే, అంటే అభిరుచి దృష్ట్యా బాగా లేకపోతే పాఠకుడికి నచ్చే విషయాలు రెండు అందులో వుంటాయంటాను.

ఇందులోని విషయాలు మంచివిగా ఉండటం మొదటి విషయం. గ్రంథస్తమైన విషయం మంచిదై ఉండవచ్చుకాని దాన్ని అందుకోవడానికి ఎక్కువ శ్రమ పడాల్సి వుంటుంది. ఈ గ్రంథంలో గల గత ఇరవై సంవత్సరాల భారత రాజకీయ సామాజిక చరిత్ర వుందే, దాన్ని ప్రతి భారతీయుడు తెలుసుకోవాల్సి వుంది.

ఈ గ్రంథంలో పక్షపాత వైఖరి లేకపోవటం రెండవది. పాకిస్తాన్ ఏర్పాటు పథకానికి సంబంధించిన సమస్త విషయాలను తెలియటమే నా లక్ష్యం. అంతేగాని పాకిస్తాన్ కోసం వాదించటం లేదు. వివరించటం లక్ష్యం కానీ మీ మనసుల్ని మార్చటం నా లక్ష్యం కాదు. పాకిస్తాన్ పై నాకు ఎలాంటి అభిప్రాయాలూ లేవనటం సబబు కాదు. నాకూ కొన్ని అభిప్రాయాలున్నాయి. కొన్నింటిని వెల్లడించాను. మరికొన్నింటిని మీరే గ్రహించాల్సి వుంటుంది. నా అభిప్రాయాల గురించి రెండు విషయాలను చెప్పవచ్చు. అభిప్రాయాలు వివరించి వాటిని హేతుబద్ధంగా చెప్పటం మొదటిది. నేను ఏమి చెప్పినా అవి ప్రజల నిశ్చిత

దురభిమానాల మీద ఆధారపడకపోవటం రెండవది. ఒక రకంగా అవి నా ఆలోచనలు మాత్రమే. అభిప్రాయాలు కావు. మరో రకంగా చెప్పాలంటే నాది ఏమీలేని శూన్యపు బుర్ర కాదు. ఏనను కొన్ని అభిప్రాయాలను హ్వానిస్తాను. అన్ని రకాల అభిప్రాయాలను ఆహ్వానించే వారిని మనం మెచ్చుకోవచ్చు. ఇది ఇలా ఉండగా అభిప్రాయాలన్నింటిని ఆహ్వానించే బుర్ర, ఒట్టి బుర్రే అయి ఉండే ప్రమాదాలు మెండుగా ఉంటాయి. ఒట్టి బుర్రల వల్ల ప్రమాదాలు వాటిల్లే అవకాశాలున్నాయి. అలాంటివారు చుక్కానిగాని, గడకర్ర కాని లేనట్టి పడవ వంటివారు. అలాంటి వారికి మార్గదర్శకత్వం లభించదు. అలాంటివారు నీటిలోని పడవలాగా తేలియాడుతారు. చివరికి నౌకాభంగంలాగా ప్రమాదం వైపుకు చేరుతారు. సమస్యపై గల అన్ని విషయాలను పాఠకుల ముందుంచటానికి ఈ ప్రయత్నంలో నా అభిప్రాయాలను వేటినీ చేర్చలేదు. ఇరు పక్షాల వాదనలను పాఠకుల ముందుంచా. పాఠకులే వారి అభిప్రాయాలను ఏర్పరచుకొంటారు.

అవసరమైన వాస్తవాలను పాఠకుల ముందుంచటంలో కొన్ని సందర్భాల్లో నేను ఆగ్రహం కలిగించవచ్చు. అలాంటి నిందారోపణలు చేసారని కూడా నాకు తెలుసు. అలాంటి దానికి నేను స్వచ్ఛందంగాను, సంతోషంగాను క్షమాపణ వేడుతాను. వారికి ఆగ్రహం తెప్పించటం నా ఉద్దేశ్యం కాదు. యధాలాపంగా చదివే పాఠకుడికి విషయ ప్రధానమైన వాస్తవాలను వారి దృష్టికి తేవాలన్నదే నా తాపత్రయం. నాపై వచ్చే ఎలాంటి కోపాన్నైనా పాఠకుడు పక్కకి తోసి తన ఆలోచనల్ని విషయం మీద కేంద్రీకరించమని కోరుతున్నాను.

## పాకిస్తాన్ విషయమై ముస్లిముల వాదం

కింది కారణాల మూలంగా ముస్లిములు పాకిస్తాన్ వాదనను సమర్థిస్తున్నారు.

1. తెగ పరంగా సజాతీయమైన ప్రాంతాలన్నింటినీ ఒక పరిపాలనా ప్రాంతంగా చేయాలని ముస్లిములు కోరుతున్నారు.

2. ఈ విధంగా అత్యధిక సంఖ్యాకులైన ముస్లిములు గల సజాతీయ పాలనా ప్రాంతాలన్నింటినీ కలిపి ప్రత్యేక రాజ్యాలుగా ఏర్పాటు చేయాలన్నదే ముస్లిముల కోరిక.

   ఎ. ముస్లిములందరూ తాము ఒక ప్రత్యేక జాతిగా జాతీయ స్థానం కావాలంటున్నారు.

   బి. హిందువులు తమ మెజారిటీ ద్వారా ముస్లిములను రెండవ తరగతి పౌరులుగా పరాయివాళ్ళుగా ఉన్నామన్న భావాన్ని కలిగిస్తున్నారు.

ఈ విషయాల పరిశీలనకు ఈ భాగాన్ని వినియోగిస్తున్నాను.

# లీగ్ ఏమి కోరుతోంది ?

1940 మార్చి 26వ తేదీన హిందూ భారతదేశం ముందెన్నడూ లేనంత ఉలిక్కిపడింది. ఆ రోజున లాహోర్‌లో జరిగిన సమావేశంలో ముస్లింలీగ్ ఈ కింది తీర్మానాలను ఆమోదించింది.

1. అఖిల భారత ముస్లింలీగ్ వర్కింగ్ కమిటీ 1939, ఆగష్టు 27; సెప్టెంబరు 17,18; అక్టోబరు 22న, 1940 ఫిబ్రవరి 3న రాజ్యాంగ సమస్య విషయంలో తీసుకున్న నిర్ణయాలను, లాహోర్‌లో సమావేశమౌతున్న అఖిల భారత ముస్లింలీగ్ అంగీకరిస్తూ; 1935 భారత రాజ్యాంగ చట్టంలోని సమాఖ్య ప్రణాళిక తమకు అంగీకారం కాదనీ, ఈ దేశపు ప్రత్యేక పరిస్థితులలో అది విజయవంతం కాజాలదనీ, భారతీయ ముస్లిములకు అది అంగీకారం కాదనీ పునరుద్ఘాటించింది.

2. 1939 అక్టోబరు 18న బ్రిటిష్ ప్రభుత్వం తరపున వైస్రాయి ప్రకటించిన సందేశంలో 1935 భారత రాజ్యాంగ చట్ట ప్రాతిపదికను తిరిగి వివిధ పార్టీ ప్రయోజనాలతో చర్చిస్తామన్నారు. కాని భారత దేశపు ముస్లిములు మొత్తం ్యంగ ప్రణాళికను తిరిగి నూతనంగా చర్చించాలనీ, పాత ప్రణాళికను మెరుగులు దిద్దడం తమకు అంగీకారం కాదనీ లీగ్ పునరుద్ఘాటించింది.

3. ముస్లిములు సంఖ్యాత్మకంగా అధికంగా ఉన్న వాయవ్య, తూర్పు మండల ప్రాంతాలను స్వతంత్ర రాజ్యాలుగా చేయాలి. వాటిలోని భాగస్వామ్య ప్రాంతాలు స్వయం ప్రతిపత్తి సార్వభౌమత్వం కలిగివుండాలి. అలాంటి ప్రాతిపదిక సూత్రం తప్ప మరే విషయం ముస్లిములకు అంగీకారయోగ్యం కాదని ఈ సమావేశం ప్రకటిస్తున్నది.

4. ఈ మండలాల్లోని మైనారిటీలకు అవసరమైన మత, రాజకీయ, సాంస్కృతిక. ఆర్థిక విషయాలపై వారితో చర్చించి రాజ్యాంగ రక్షణలు కల్పించాలన్న వి...నికి ప్రాధాన్యమిస్తోంది. ముస్లిములు మైనారిటీలుగ ఉన్న ఇతర ప్రాంతాల్లో కూడా వారి అంగీకారంతో వారి మత, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ, పాలనాది ఇతర రక్షణలను ప్రయోజనాలను కలుగజేయాలి.

5. పైన చెప్పిన సూత్రాలు ఆధారంగా కొత్త రాజ్యాంగం ప్రణాళికను ఏర్పాటు చేయాలని వర్కింగ్ కమిటీకి ఈ సమావేశం అధికారం ఇస్తోంది. ఆయా ప్రాంతాల రక్షణ, విదేశీ వ్యవహారాలు, కమ్యూనికేషన్లు, కస్టమ్సు తదితర అవసరమైన అధికారాలను దత్తం చేయాలి.

ఈ తీర్మానం అంతరార్థం ఏమిటి? తీర్మానపు మూడవ పేరాలో ముస్లిములు అధికంగా వున్న ప్రాంతాలను స్వతంత్ర రాజ్యాలుగా ఏర్పరచాలని లీగ్ సూచిస్తున్నది. మాటల్లో విడమర్చి చెప్పాలంటే పంజాబు, వాయవ్య రాష్ట్రం, బెలూచిస్థాన్, వాయవ్యపు సింద్, తూర్పున బెంగాల్, బ్రిటిష్ ఇండియాలో ఉండే బదులు బ్రిటన్‌కు వెలుపల స్వతంత్ర రాజ్యాలుగా ఏర్పడాలి. ముస్లింలీగ్ తీర్మానంలోని అసలు అర్థం ఇది.

స్వతంత్ర రాజ్యాలుగా ఏర్పడ్డాక, ఈ ముస్లిము రాష్ట్రాల్లో ప్రతీదీ స్వతంత్ర సార్వభౌమత్వ రాజ్యాలుగా వుంటాయా లేదా అవన్నీ కలిసి సమాఖ్యగా కాని ఏక కేంద్ర ప్రభుత్వంగా కానీ ఏర్పడతాయా అనే విషయాన్ని తీర్మానం సూచిస్తోందా? ఈ విషయంలో తీర్మానం స్వవచో వ్యాఘాతగా కాకపోయినా అసందిగ్ధంగా ఉంది. ఈ స్వతంత్ర రాష్ట్రాలన్ని అంతర్గత యూనిట్లుగా ఒక స్వయం ప్రతిపత్తిగల సార్వభౌమత్వ రాజ్యంగా ఏర్పడే మండలాలుగా ఏర్పరచాలన్న విషయాన్ని తీర్మానం సూచిస్తోంది. అంతర్గత యూనిట్లు అనే పదం సమాఖ్య ఏర్పాటును సూచిస్తున్నది. అలా అయినట్లయితే సార్వభౌమత్వం యూనిట్ల స్వభావంగా ఉండవీలులేదు. యూనిట్ల సమాఖ్య, యూనిట్ల సార్వభౌమత్వం పరస్పరం వ్యతిరేకాత్మకమైనవి. అందువల్ల తీర్మానం "సమ్మేళన" రాజ్యం గురించే సూచిస్తున్నట్లు భావించాల్సింది. ఈ స్వతంత్ర రాజ్యాలు సమాఖ్యగా ఏర్పడతాయా లేక సమ్మేళన రాజ్యంగా ఏర్పడతాయా అన్నది ప్రస్తుతం చర్చనీయాంశంకాదు. వారి ప్రాథమిక కోరిక చాలా ప్రధానమైనది. ఈ రాష్ట్రాలను భారత దేశం నుండి వేరు చేసి స్వతంత్ర రాజ్యాలుగా ఏర్పరచాలన్నదీ ప్రధానమైన అంశం.

తీర్మానంలో సూచించిన విషయం సరికొత్త ప్రణాళిక అనే భ్రమను కలిగిస్తున్నది. 1930 డిశంబరులో లక్నోలో జరిగిన అఖిల భారత ముస్లింలీగ్ వార్షిక సమావేశపు అధ్యక్షోపన్యాసంలో సర్ మహ్మద్ ఇక్బాల్ చెప్పిన అంశమే ఈ తీర్మానంలో పునరుద్ఘాటించారు. అప్పట్లో ఈ ప్రణాళికను లీగ్ అంగీకరించలేదు. కాని ఆ ప్రణాళికను రహ్మత్ ఆలీ తీసుకుని పాకిస్తాన్ అనే పేరు పెట్టారు. ఆ ప్రణాళికకు అదే పేరు ఖాయమైంది. రహమత్ ఆలీ బి.ఎ.ఎల్.ఎల్.బి., 1933లో పాకిస్తాన్ ఉద్యమాన్ని ప్రారంభించారు. ఆయన భారతదేశాన్ని

పాకిస్తాన్, హిందూస్తాన్‌గా విభజించాయి. ఆయన పాకిస్తాన్ ప్రణాళికలో, పంజాబు, వాయవ్య సరిహద్దు రాష్ట్రం, కాశ్మీర్, సింధ్, బెలూచిస్థాన్‌లు ఉన్నాయి. ఆయన ఉద్దేశ్యంలో మిగతా ప్రాంతాలన్నీ హిందూస్తాన్ ఉత్తర ప్రాంతంలోని అయిదు ముస్లిం ప్రాంతాలను కలిపి స్వతంత్రంగా ప్రత్యేక పాకిస్తాన్ ఏర్పడాలన్నదే ఆయన ప్రణాళిక. ఈ ప్రతిపాదనను రౌండ్ టేబిల్ సమావేశంలో సభ్యులకు పంచిపెట్టారు. కాని ప్రణాళికను అధికారికంగా ప్రతిపాదించలేదు. ప్రణాళికకు ప్రయివేటుగా బ్రిటిష్ ప్రభుత్వపు అంగీకారం లభించేటట్లు ప్రయత్నాలు జరిగాయి. కాని బ్రిటిష్ ప్రభుత్వం సమ్మతించక దాన్ని ప్రాచీన ముస్లిం సామ్రాజ్యపు పునరుద్ధరణ ప్రయత్నంగా భావించింది.

పాకిస్తాన్ తొలి ప్రతిపాదనను లీగ్ విస్తృతపరచింది. తూర్పు ప్రాంతంలో బెంగాలు, అస్సాం రాష్ట్రాల ముస్లిములతో మరొక ముస్లిం రాజ్యం ఏర్పడాలని సూచించింది. ఇది తప్ప మిగతాదంతా సర్ ఇక్బాల్ చేత ప్రతిపాదితమై రహమత్ ఆలీచే ప్రచారం అయిన పాకిస్తాన్ ప్రణాళికనే లీగ్ అంగీకరించింది. తూర్పున ప్రతిపాదించిన, ముస్లిం రాష్ట్రానికి ఏ పేరూ పెట్టలేదు. ఇందువల్ల రహమత్ ఆలీ ప్రతిపాదించిన సిద్ధాంతం, సమస్యలలో ఎలాంటి భేదమూ రాలేదు. అందరూ ఆశించినట్లుగా సమస్య దృక్కోణాన్ని విస్తృతపరిచినప్పుడు ముస్లింలీగ్ రెండు ముస్లిం రాజ్యాలకు ఎలాంటి నామకరణమూ చేయలేదు. అందువల్ల పశ్చిమంలో ముస్లిం రాజ్యం, తూర్పున ముస్లిం రాజ్యం అనే సుదీర్ఘమైన పేర్లతోనే వ్యవహరించాల్సి వస్తోంది. ఈ విషయంలో ద్విజాతి సిద్ధాంతానికి ప్రతీకగా పర్యవసానంగా వున్న పాకిస్తాన్‌కు తూర్పు పాకిస్తాన్, పశ్చిమ పాకిస్తాన్ అనే పేర్లను నేను ప్రతిపాదిస్తున్నాను

ఈ ప్రణాళిక వల్ల హిందూ భారతదేశం సావధానం కావటమే కాక హిందూ భారతదేశాన్ని భయభ్రాంతుల్ని చేసింది. ఈ ప్రతిపాదనలో కొత్తది కాని, భయభ్రాంతులు కలుగజేసేదికానీ ఏది ఉందన్నదే స్వాభావికమైన ప్రశ్న.

## II

వాయవ్య ప్రాంతంలోని రాష్ట్రాలను అను సంధించటం భయభ్రాంతిని కలుగచేసేదా? అలా అయినట్లయితే, గతంలోని వైస్రాయీలు, పాలకులు, గవర్నరులు, సైనికాధికారులు ఈ పథకాన్ని ప్రతిపాదించారన్న విషయాన్ని మనం గుర్తుకు తెచ్చుకోవాలి. వాయవ్య ప్రాంతంలోని పాకిస్తాన్‌లోని పంజాబు, వాయవ్య సరిహద్దు రాష్ట్రం 1849లో బ్రిటిష్ వారు పంజాబును జయించినప్పటి నుండి ఒకటే రాష్ట్రం 1911 దాకా ఈ రెండు రాష్ట్రాలు ఒకటిగానే ఉన్నాయి. 1901లో లార్డ్ కర్జన్ ఈ రెండింటిని విడగొట్టి ఇప్పటి రెండు రాష్ట్రాలను ఏర్పరచారు. పంజాబు కన్నా ముందుగాక, ఆ తరువాత సింధ్‌ను బ్రిటిష్ వారు జయించి ఉన్నట్లయితే సింధ్‌ను పంజాబు రాష్ట్ర అంతర్భాగంగా చేసే వారు. అవి రెండూ పక్క పక్కన ఉండటమే కాక, ఆ రెండిటినీ ఒకటిగా అనుసంధించే సట్లెజ్‌నది వాటి గుండానే ప్రవహిస్తుంది. సింధ్‌ను

బొంబాయి రాష్ట్రంలో చేర్చారు. పంజాబు లేనప్పుడు అది ఒక్కటే మార్గం. బొంబాయి నుండి బ్రిటిష్ వారు సింధ్‌ను పాలించారు. కాని సింధ్‌ను పంజాబులో కలిపివేసే విషయాన్ని విస్మరించలేదు. అప్పుడప్పుడూ ప్రతిపాదనలు చేస్తూనే వచ్చారు. లార్డ్ డల్హౌసీ గవర్నరు జనరలుగా ఉన్నప్పుడు మొదటిసారిగ సింధ్‌ను పంజాబులో చేర్చాలన్న ప్రతిపాదనన చేశారు. కాని ఆర్థిక కారణాల వల్ల ప్రతిపాదనకు కంపెనీ బోర్డు ఆఫ్ డైరెక్టర్ల అనుమతి లభించలేదు. సిపాయిల తిరుగుబాటు తరువాత ఈ ప్రతిపాదనను మళ్ళీ చర్చించలేదు. సింధునదీ తీరం పొడువునా సరైన రోడ్డు రవాణా మార్గాలు లేనందున లార్డ్ కానింగ్ ఈ ప్రతిపాదనని నిరాకరించారు. 1876లో లార్డ్ నార్త్ బ్రూక్ సింధ్‌ను పంజాబులో చేర్చాలన్న అభిప్రాయాన్ని ప్రకటించారు. నార్త్ బ్రూక్ తరువాత 1877లో గవర్నరు జనరలుగా వచ్చిన లార్డ్ లిట్టన్ పంజాబుకు చెందిన ఆరు సరిహద్దు జిల్లాలను సింద్ ప్రాంతపు జిల్లాలతో కలిపి విశాల సింద్ రాష్ట్రం ఏర్పరాచాలనుకున్నారు. ఇందులో పంజాబుకు చెందిన ఆరు సరిహద్దు జిల్లాలైన హజారా, పెషావర్, కోహట్, సిస్ ఇండస్ ప్రాంతంలేని బన్నూ, అదే మినహాయింపులో డేరా ఇస్మాయిల్ ఖాన్, డేరాఘాజిఖాన్, కరాచీ లేని సింధునది ప్రాంతం ఉన్నాయి. అదే ప్రతి పాదనకు లార్డ్ లిట్టన్ సింద్ ప్రాంతం లేని లోటును బొంబాయి రాష్ట్రానికి తీర్చేటందుకు సెంట్రల్ ప్రావిన్స్ మొత్తం బొంబాయికి చేర్చాలన్నారు. ఈ ప్రతిపాదన లేవీ సెక్రటరీ ఆఫ్ స్టేట్ అంగీకారం పొందలేకపోయాయి. లార్డ్ లాన్స్‌డౌన్ (1888-94) వైస్రాయిగా వున్న కాలంలో సింధ్‌ను బొంబాయి నుండి విడదీసే ప్రతిపాదనను మళ్ళీ ప్రవేశపెట్టారు. కానీ బెలూచిస్తాన్ ఏజన్సీ ఏర్పడడంతో సింధ్ సరిహద్దు రాష్ట్రపు హోదాను కోల్పోయింది. అందువల్ల సింధ్ రాష్ట్రాన్ని పంజాబుకు చేర్చలేదు. బ్రిటిష్ వారు బెలూచిస్తాన్‌ను సంపాదించుకోలేక పోయినట్లయితే ఒక పాలనా ప్రాంతంగా పాకిస్తాన్ ఏర్పడడాన్ని చాలా కాలం కిందటే మనం చూసేవాళ్ళం.

బెంగాలులో స్వతంత్ర ముస్లిం రాజ్యం ఏర్పడాలన్న విషయం కొత్తదేమీకాదు. 1905లో అప్పటి వైస్రాయి లార్డ్ కర్జన్ బెంగాల్ రాష్ట్రాన్ని ఢక్కా రాజధానిగా తూర్పు బెంగాలు, కలకత్తా రాజధానిగా పశ్చిమ బెంగాలును ఏర్పరచటం మనందరికీ తెలిసిన విషయమే. కొత్తగా ఏర్పరచిన తూర్పు బెంగాల్‌లో పూర్వపు బెంగాలు రాష్ట్రానికి చెందిన క్రింది జిల్లాలున్నాయి. 1 ఢక్కా, 2. మైమెన్‌సింగ్, 3. ఫరీద్‌పూర్, 4. బేకర్ గంజ్, 5. తిప్పెర, 6. నవభాళీ, 7. చిట్టగాంగ్, 8. చిట్టగాంగ్ పర్వత ప్రాంతాలు, 9. రాజాసాహి, 10. దినాజ్ పూర్, 11. జలపై గురి, 12. రంగపూర్, 13. జోరా, 14. పబ్నా, 15. మాల్డా, పూర్వపు బెంగాల్ రాష్ట్రానికి చెందిన మిగతా ప్రాంతాలుతో పశ్చిమ బెంగాలు ఏర్పడింది. ఇందులో సెంట్రల్ ప్రావిన్సెస్ నుంచి వేరుచేసిన సంబాల్ పూర్‌ను గూడా చేర్చారు.

ఒకే రాష్ట్రాన్ని రెండుగా విభజించటం జరిగింది. భారతదేశ చరిత్రలో దీన్ని బెంగాలు **విభజన** అని పిలుస్తారు. తూర్పు బెంగాల్, అస్సాం లోని కొంత ప్రాంతం మినహా మిగతాదంతా

ముస్లిములు ఉన్న ప్రాంతమే. కాని 1911లో హిందువులకు లొంగి బ్రిటిష్ ప్రభుత్వం ఆ విభజనను రద్దు చేసింది. ఈ విభజనను హిందువులు వ్యతిరేకించారు. ముస్లిముల కోరికల్ని బ్రిటిష్ ప్రభుత్వం ఖాతరు చేయలేదు. ఏమంటే వాళ్ళకి వెన్నెముక లేదు. బెంగాలు విభజనం రద్దు కాక పోయినట్లయితే తూర్పు బెంగాలు ముస్లిం రాష్ట్రంగా అలాగే కొనసాగి వుండేది. ఇప్పటికి దానికి 30 సంవత్సరాల చరిత్ర ఉండేది.

## III

హిందూస్థాన్ నుండి పాకిస్తాన్‌ను వేరు చేయటమనేది భయభ్రాంతం చేసే విషయమా? అలా అయినట్లయితే ఈ సమస్యకు సంబంధించిన కాంగ్రెసు విధానాల ప్రాతిపదిక సూత్రాలను మరొకసారి చూడటం మంచిది. కాంగ్రెసులో గాంధీజీ ఆధిపత్యం సంపాదించగానే దాన్ని ప్రజాసంస్థగా చేసేందుకు ఆయన రెండు పనులు చేశారు. సహాయ నిరాకరణను ప్రవేశ పెట్టడం మొదటిది.

భారత రాజకీయాల్లోకి గాంధీజీ ప్రవేశించక పూర్వం రాజకీయ రంగంలో ప్రధాన స్థానం కోసం కాంగ్రెసు, ఉదారవాదులు, (లిబరల్స్), బెంగాలుకు చెందిన టెర్రరిస్టులు పోటీపడుతుండే వారు. కాంగ్రెసు ఉదారవాదులు వాస్తవంలో ఒక పార్టీకి చెందిన వారే. ఇప్పుడు వారిని విభాగిస్తున్న విభేధాలు అప్పట్లో లేవు. అందువల్ల భారతదేశంలోని టెర్రరిస్టులు, ఉదారవాదులూ అనే రెండు రాజకీయ పార్టీలే ఉన్నాయని భావించాలి. రెండింటిలోను ప్రవేశానికి చాలా కఠినమైన నిబంధనలు ఉండేవి. లిబరల్ పార్టీలో ప్రవేశానికి చాలా కఠినమైన నిబంధనలు ఉండేవి. లిబరల్ పార్టీలో ప్రవేశానికి ఉన్నత విద్యార్హత లేక అధిక విజ్ఞాన సముపార్జనం ఒక నియమంగా ఉండేది. అధ్యయన పరుడుగా ఖ్యాతి పొందనిదే ఎవ్వరికి లిబరల్ పార్టీలో ప్రవేశం లభించేదికాదు. అందువల్ల విద్యలేని వారు రాజకీయాధికార స్థానానికి ఎదిగే అవకాశాలు లేవు. ఊహించ వీలులేని కఠిన నియమాలు టెర్రరిస్టులలో ప్రవేశార్హతలుగా వున్నాయి. జీవితం సమర్పించ సిద్ధమయ్యేవారు, అంటే జీవితాన్ని కేవలం అంకితం చేయటం గాదు, మరణించ సిద్ధపడే వారే టెర్రరిస్టులతో చేరేవారు. సామాన్యులెవ్వరూ టెర్రరిస్టులలో చేరలేదు. సహాయనిరాకరణానికి విద్య అవసరం లేదు. జీవితం అర్పించాల్సిన అగత్యం అంతకంటే లేదు. విద్య లేనివారికి, జీవితం అర్పించకుండానే దేశభక్తులుగా చెలామణి కావాలన్న యావ వున్నవాళ్ళకి సహాయ నిరాకరణం మధ్యేమార్గమయింది. లిబరల్స్, టెర్రరిస్ట్‌పార్టీల మధ్య కాంగ్రెసు పార్టీ మధ్యే మార్గంగా మంచి ప్రాచుర్యాన్ని పొందింది.

భాషాప్రయుక్త రాష్ట్రాల సూత్రం ప్రవేశపెట్టడం గాంధీ చేసిన రెండవ విషయం. గాంధీజీ నేతృత్వంలోనూ, మార్గ దర్శకత్వంలోనూ చేసిన కాంగ్రెసు నియమావళిలో భారతదేశాన్ని భాషాప్రాతిపదికగా ఈ కింది రాష్ట్రాల్ని వాటివాటి ముఖ్య కార్యస్థానాలతో విభజించాలన్నారు.

| రాష్ట్రం | భాష | కేంద్ర కార్యాలయము |
|---|---|---|
| అజ్మీర్, మేర్వారా | హిందుస్తానీ | అజ్మీర్ |
| ఆంధ్ర | తెలుగు | మద్రాసు |
| అస్సాం | అస్సామీ | గౌహతి |
| బీహార్ | హిందుస్తానీ | పాట్నా |
| బెంగాల్ | బెంగాలీ | కలకత్తా |
| బొంబాయి (సిటి) | మరాఠీ, గుజరాతీ | బొంబాయి |
| ఢిల్లీ | హిందుస్తానీ | ఢిల్లీ |
| గుజరాత్ | గుజరాతీ | అహ్మదాబాద్ |
| కర్నాటక | కన్నడ | ధార్వార్ |
| కేరళ | మలయాళం | కాలికట్ |
| మహాకోసల్ | హిందూస్తానీ | జబల్పూర్ |
| నాగపూర్ | మరాఠీ | పూనా |
| వాయవ్య సరిహద్దు రాష్ట్రం | పుష్తు | పెషావర్ |
| పంజాబు | పంజాబి | లాహోర్ |
| సింద్ | సింధీ | కరాచీ |
| తమిళనాడు | తమిళం | మద్రాసు |
| యునైటెడ్ ప్రావిన్స్ | హిందుస్తానీ | లక్నో |
| ఉత్కళ | ఒరియా | కటక్ |
| విదర్భ (బెంగాల్) | మరాఠీ | అకోలా |

ఈ విభజనలో రాష్ట్రాల వైశాల్యం, జనాభా, ఆదాయాలకు ప్రాధాన్యం ఇవ్వలేదు. ప్రతి పాలనా ప్రాంతం తన ప్రజలకు కావలసిన కనీస పౌరజీవనం అందించటానికి అవసరమైన భౌగోళిక ప్రాంతం, ఆదాయం ఉండాలన్న విషయానికి ఈ ప్రతిపాదనలో స్థానం లేదు. భాష నిర్ణాయక సూత్రమై పోయింది. బలహీనంగా వున్న భారత సామాజిక జీవన వ్యవస్థ మరింత విచ్ఛిన్నం కాగలదన్న భావానికి ప్రాధాన్యత లభించలేదు. స్థానిక దేశభక్తి ఆధారంగా కాంగ్రెసుకు అధికమైన విధేయత సమకూర్చాలన్న ఉద్దేశ్యంతో ప్రతిపాదించటం జరిగింది. భాషా ప్రయుక్త రాష్ట్రాల భావానికి బలం చేకూరింది. కాంగ్రెసు అధికారంలోకి వస్తే భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు అమలు చేయాల్సినంతగా బలం చేకూరింది. ఇప్పటికే, బీహారు నుండి ఒరిస్సా విడిపోయింది. ఆంధ్రులు మదరాసు నుండి విడిపోవాలనుకుంటున్నారు. మహారాష్ట్ర నుండి విడిపోయి ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడాలని గుజరాతీలు మాత్రం అనుకోవడం లేదు.

గుజరాతీలు ప్రస్తుతానికి విడిపోవాలన్న భావాన్ని విడిచివేశారు. మహారాష్ట్రలోనే కలిసిఉండటం గుజరాతీయులకు రాజకీయంగానూ ఆర్థికంగానూ చాలా లాభసాటి అని వారు భావిస్తుండవచ్చు.

భాషా ప్రయుక్త రాష్ట్రాల విభజన కాంగ్రెసువారు అంగీకరించిన సూత్రం. కర్ణాటక, ఆంధ్ర విడిపోవాలని కోరటానికి భాషా విభేదాలు కారణమని, పాకిస్తాన్ విభజన సాంస్కృతిక విభేదం వల్ల అని భావించటం పొరపాటు అవుతుంది. ఈ గుర్తింపులో భే ంది. అయితే భాషా భెదమన్నది సాంస్కృతిక విభేదానికి మరోపేరు.

కర్నాటక, ఆంధ్ర విడిపోవాలనటం భయ భ్రాంతులు కలిగించనట్లయితే పాకిస్తాన్ విభజన విభ్రాంతిని ఎందుకు కలిగిస్తుంది. అది విచ్ఛిన్నకరమైనదైతే కర్నాటక మహారాష్ట్ర నుండి, ఆంధ్రులు, మద్రాసు నుండి విడిపోవడం కూడా విచ్ఛిన్న కరమైందే. సాంస్కృతిక స్వేచ్ఛ కావాలని కోరుకుంటున్న పాకిస్తాన్ కోరిక భాషారాష్ట్రాల ఏర్పాటులాంటి దానికి సమానమైన కోరికే.

# స్వస్థానం కోరుతున్న జాతి

విడిపోవాలనుకుంటున్న కోరికలపై భాష, సంస్కృతి, పాలనా విషయాలు ప్రగాఢ ప్రభావం కలిగిస్తున్నాయన్న విషయాన్ని అందరూ అంగీకరిస్తున్నారు. ఎవ్వరూ ఈ కోరికల విషయమై పట్టించుకోవడం లేదు. అందరూ అంగీకరించటానికి సిద్ధంగా ఉన్నారు. కాని ముస్లిములు విడిపోవాలనే కోరికను మించిన దాన్ని కోరుతున్నారని హిందువులు అంటున్నారు. ముస్లిములు ఎందుకు ఈ మార్గాన్ని ఎంచుకొన్నారు? వారు దేశ విభజనను ఎందుకు కోరుతున్నారు? సఖ్యతగా వున్నవారు ఎందుకు రాజ్యాంగపరంగా హిందుస్తాన్ పాకిస్తాన్‌గా విడిపోవాలని కోరుతున్నారని హిందువుల ప్రశ్నిస్తున్నారు.

ఇందుకు సమాధానం, భారతదేశంలోని ముస్లిములంతా ప్రత్యేక జాతి అని ప్రకటించిన ముస్లింలీగ్ తీర్మాన ప్రకటనలోనే వుంది. ముస్లింలీగ్ చేసిన ఈ ప్రకటనను హిందువులు వ్యతిరేకిస్తున్నారు. అవహేళన చేస్తున్నారు. కూడా.

హిందువుల వ్యతిరేకత సహజమైందీ. భారతదేశం ఒకే జాతి అవునా కాదా అన్న విషయం,ఆంగ్లో ఇండియన్, హిందూ రాజకీయ నాయకుల మధ్య భారత జాతీయ కాంగ్రెసు ఏర్పడిన నాటినుండి చర్చనీయాంశమై పోయింది. భారతదేశం ఒక జాతి కాదన్న వి[illegible]ాన్ని ప్రకటించటంలో ఆంగ్లో - ఇండియన్ నాయకులు ఎన్నడూ అలసత్వం ప్రదర్శించలేదు. భారతదేశంలోని ప్రజలను భారతీయులనటాన్ని నామ మాత్రమేనని అంగీకరించరు. భారతదేశాన్ని తెలుసుకోవటమంటే భారతదేశం అనేది లేదన్న విషయాన్ని అంగీకరించటమేనని ఒక ఆంగ్లో -ఇండియన్ నాయకుడు అభిప్రాయపడ్డాడు కూడా. హిందూ రాజకీయ నాయకులు, దేశభక్తులు, మరొక ప్రక్కనుంచి భారతదేశం ఒకజాతి అని ఎలుగెత్తి చాటుతున్నారు. ఆంగ్లో ఇండియన్ నాయకుల వాదన సరియైంది కాదనటానికి వీలు లేదు. జాతీయ కవియైన

డా॥ టాగూరు కూడా వారితో అంగీకరిస్తున్నారు. కాని హిందువులు ఈ విషయంలో డా॥ టాగూరుతో అంగీకరించటం లేదు.

ఇందుకు రెండు కారణాలున్నాయి. హిందువులు భారతదేశం ఒకజాతి కాదని అంగీకరించటానికి సిగ్గుపడటం మొదటి కారణం. జాతీయత, జాతివాదం ప్రజల ప్రత్యేక గుణాలని భావిస్తున్న ప్రపంచంలో, భారతదేశం ఒకజాతి అని హిందువులు భావించటం సహజమైన విషయమే. భారత దేశానికి జాతీయత లేదనటం, సమావేశమౌతున్న ప్రజలు దుస్తులు లేకుండా నగ్నంగా ఉన్నారనటమేనని హెచ్.జి. వెల్స్ వ్యాఖ్యానించారు. స్వపరిపాలనా వాంఛకు జాతీయతకు చాలా దగ్గర సంబంధం ఉందన్న విషయాన్ని గ్రహించటం రెండవ కారణం. 19వ శతాబ్దం చివరి నాటికి జాతిగా భావిస్తున్నవారంతా స్వపరిపాలన కావాలంటున్న దేశ భక్తులు, ఇప్పుడు తామొక జాతి అని నిరూపించుకోవల్సి వచ్చింది. ఈ కారణాల వల్ల హిందువులు భారతదేశం ఒక జాతి అవునా కాదా అని చర్చించటాన్ని మానుకోలేదు. ప్రజలను జాతిగా పేర్కొనటమే జాతియతా! ప్రజలే ఒక జాతిగా ఉన్నారనటమా అనే విషయానికి సంబంధించిన కారణాల గురించి హిందువులు పట్టించుకోవడంలేదు. వారికి ఒక్క విషయం మాత్రమే తెలుసు. భారత దేశం ఒక జాతి అని నిరూపించాలి., లేదా నిరూపించుకోక పోయినా పరవాలేదుగానీ స్వపరిపాలన సంపాదించుకోవడంలో విజయం పొందాలి.

ఈ వాదాన్ని ఏ భారతీయుడూ ఖండించటం లేదు. ఈ వాదం అందరి అంగీకారం పొందటమే కాదు; చాలామంది అనుభవజ్ఞులైన చరిత్ర కారులూ, దేశభక్తులూ వాదాన్ని బలపరుస్తూ ప్రచార సాహిత్యం రాస్తున్నారు. హిందూ సమాజ సంస్కరణ వాదులు దీనిని ప్రమాదభరితమైన విషయమని తెలిసి కూడా బహిరంగంగా ఖండించటం లేదు. ఈ విషయాన్ని ప్రశ్నించిన వారందరినీ బ్రిటిష్ ఉద్యోగి బృందం చేతిలోని కీలుబొమ్మలనీ, దేశ ద్రోహులనీ పిలవటం పరిపాటి అయింది. హిందూ రాజకీయవాదులు చాలా కాలంగా ఈ వాదాన్ని ప్రచారం చేస్తున్నారు. వారి ప్రత్యర్థులైన ఆంగ్లో – ఇండియన్ రాజకీయవాదులు మిన్నకుంటున్నారు. హిందూ రాజకీయ వాదుల ప్రచారం చాలా వరకూ విజయవంతమైంది. విజయవంతం కానున్న సమయంలోనే ముస్లింలీగ్ ప్రకటనం వెలువడింది. భేదాభిప్రాయాలు బయటపడ్డాయి. వెలువడిన ప్రకటన ఆంగ్లో –ఇండియన్ రాజకీయ నాయకులది కానందున అది మరింతగా దెబ్బతీసింది. భారతదేశంలోని ముస్లిములు ప్రత్యేక జాతి అయినట్లయితే భారత దేశం ఒక్క జాతికాదు. ఈ వాదం హిందూ రాజకీయ నాయకుల వాదాన్ని పటాపంచలు చేసింది. దానితో వారు భేదం చెందటం సహజమైన విషయమే. అందువల్లనే హిందువులు దీనిని వెన్నుపోటు అని అంటున్నారు. అది వెన్నుపోటు అవునో కాదో? కాని ముస్లిములు ఒక ప్రత్యేక జాతి అని అనవచ్చునా? దాని వెనుకనే సమస్త విషయాలూ దాగి ఉన్నాయి. దీనితో జాతి అంటే? అనే వి[illegible]ం ఉత్పన్నమైంది. ఈ విషయమై టామ్స్ చక్కగా వివరించారు. అవసరమని భావించేవారు ఆ వి[illegible]న్ని అధ్యయనం చేయవచ్చు. వివిధ ప్రాథమిక భావనలమా

వాటి పర్యవసానాలనూ గ్రహించవచ్చు. అయితే విషయాన్ని గ్రహించి క్లుప్తంగా వివరిస్తే చాలు. జాతీయత అనేది ఒక సామాజిక భావన. అది కలిసి మెలిసి ఉంటున్న వారి మధ్య వృద్ధి చెందిన అవగాహన ప్రోది. తామంతా బంధువులం, దగ్గర వారమూ అని భావించే సామాజిక ఆలోచన. ఈ భావనకు రెండు విధాలైన అర్థాలున్నాయి. తమ బంధువులూ స్నేహితులూ అంతా ఒకటే నన్న భావన ఒకటి. తమవారు కాదనుకొన్న వారిపై పు గల వ్యతిరేక భావన రెండవది. మొదటి భావన అన్ని రకాలైన ఆలోచనలనూ ఒకటిగా బంధిస్తుంది. మరొకటి తమవారు కాదనుకొన్న వారినుండి తమను వేరు చేస్తుంది. ఇదే ఇతర సమూహాలకు చెందామన్న భావన. దీనినే జాతీయ భావన లేదా జాతీయత అని పిలుస్తాం.

ఈ పరీక్షనే ముస్లిముల కోరికలకు అన్వయిద్దాం. భారతదేశంలోని ముస్లిములు ఒక ప్రత్యేక వర్గానికి చెందిన వారన్నది యథార్థమా కాదా? వారికి ఇలాంటి భావన ఉందన్న విషయం యథార్థమా కాదా? ప్రతీ ముస్లిం తానొక ప్రత్యేక ముస్లిం వర్గానికి చెందిన వాణ్ణి అని ముస్లిమేతర వర్గ సభ్యుణ్ణి కాదనీ భావిస్తున్న విషయం నిజమాకాదా?

ఈ ప్రశ్నలకు సమాధానం అవును అని భావించినట్లయితే, వివాదం సమసిపోతుంది. ముస్లిములు ప్రత్యేక జాతి అనే విషయాన్ని నిస్సందేహంగా అంగీకరించవచ్చు.

వివాదాలు ఎన్నివున్నా, ఒకే జాతిగా పేర్కొనటానికి హిందువులు, ముస్లిములు మధ్య కొన్ని దగ్గర సంబంధాలున్నాయన్న విషయాన్ని హిందువులు ప్రకటించాలి. అందువల్ల వారి మధ్య సఖ్యత మరింతగా పెరిగిపోతుంది. వివరంగా చెప్పాలంటే హిందువులు ముస్లిములు చాలాకాలంగా కలిసిమెలిసి జీవిస్తున్నారు.

హిందువులు ముస్లిములు మధ్య ఎలాంటి జాతి భేదాలు లేవన్నది వారి మొట్ట మొదటి వాదన – పంజాబ్ ముస్లిములు,పంజాబీ హిందువులు; బెంగాలీ ముస్లిములు బెంగాలీ హిందువులు; బీహారీ ముస్లిములు, బీహారీ హిందువులు; యు.పి. ముస్లిములు, యు.పి హిందువులు; మద్రాసు ముస్లిములు, మద్రాసు హిందువులు; బొంబాయి ముస్లిములు, బొంబాయి హిందువులు అందరూ ఒకే జాతికి చెందిన వారు. మద్రాసు ముస్లిం, మద్రాసు బ్రాహ్మణుని మధ్య, మద్రాసు పంజాబీ బ్రాహ్మణుల మధ్య కంటే ఎక్కువ దగ్గరి సంబంధాలున్నాయి. ఉన్నదన్న విషయానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వడం రెండవ విషయం. హిందువులకు, భిన్నంగా ముస్లిముల మధ్య భాషాపరమైన సమైక్యత పూర్తిగా వుంది.పంజాబ్‌లో హిందువులు, ముస్లిములు పంజాబీ భాషనే మాట్లాడుతారు. సింధ్‌లో ఇరువురు సింధీ భాషనే మాట్లాడుతారు. బెంగాల్‌లో బెంగాలీ భాషనే ఉపయోగిస్తారు. గుజరాత్‌లో ఇరు మతాలవారు గుజరాతీ భాషలోనే మాట్లాడు కుంటారు. మహారాష్ట్రలో మరాఠీ భాషను వాడుతారు. ఇదే విధంగానే అన్ని రాష్ట్రాలలోను ఇరు మతాలకు చెందిన వారు ఆ భాషనే ఉపయోగిస్తుంటారు. పట్టణాల్లో ఉండే ముస్లిములు మాత్రమే ఉర్దూను, హిందువులు ఆ రాష్ట్ర భాషనూ ఉపయోగిస్తున్నారు.

పట్టణాలకు వెలుపల హిందువులు ముస్లిముల మధ్య భాషాపరమైన సమైక్యతగా భారత దేశంలో కలిసిమెలిసి జీవిస్తున్నారన్నది మూడవ అంశం. అది ప్రత్యే , హిందువుల దేశం కాదు. ప్రత్యేకంగా ముస్లిముల దేశమూ కాదు.

జాతి సమైక్యత పరంగానే కాక, రెండు రకాల సాంస్కృతిక జీవనానికి సంబంధించిన సాధారణ సామాన్యల మీద కూడా విశ్వాసం ఉంచటం జరిగింది. చాలా మంది ముస్లిముల సామాజిక జీవనంలో అనేకానేక హిందూ సాంప్రదాయాలు పెనవేసుకు పోయాయి. పంజాబులో గల అవన్‌లో అందరూ ముస్లిములే, కాని వారు తమ పేర్లలోనూ వంశావళిలోనూ బ్రాహ్మణీయరీతి సాంప్రదాయాలను కొనసాగించటమన్నది ఒక ఉదాహరణగానే పేర్కొనవచ్చు. ముస్లిములలో చాలా మందికి హిందువుల ఇంటిపేర్లున్నాయి. చౌదరి అనే ఇంటిపేరు హిందువులకు చెందింది. యు.పి లోను, ఉత్తర భారతంలోని చాలామంది ముసల్మానులకు చౌదరి ఇంటి పేరుంది. పెళ్ళితంతులో కొన్ని ముస్లిం వర్గాలు కేవలం పేరుకే ముస్లిము మతస్థులు; వారు వివాహమహోత్సవాల్లో హిందూ సాంప్రదాయాన్ని అనుసరిస్తున్నారు. మొదటి హిందూ సాంప్రదాయంలో పెళ్ళి చేసుకొని తరువాత ముస్లిం ఖాజీని పిలిచి ముస్లిం సాంప్రదాయం ప్రకారం వివాహం జరుపుకుంటున్నారు. కొన్ని ముస్లిం వర్గాల వివాహం వారసత్వం, పోషకత్వ బాధ్యతల విషయాలలో హిందూ న్యాయ సూత్రాలను అనుసరిస్తున్నాయి. షరియత్ చట్టం ఆమోదం పొందక ముందు పంజాబు, వాయవ్య రాష్ట్ర ప్రాంతాల్లో ఈ విషయం యదార్థమైందే. సామాజిక రంగంలో హిందూ సమాజ కుల వ్యవస్థ ముస్లిం సమాజ అంతర్భాగంగా మారిపోయింది. మత వ్యవహారాల్లో చాలా మంది ముస్లిం పీరులు హిందువులను శిష్యులుగా చేర్చుకున్నారు. అలాగే హిందూ సాధువులు కొందరు ముస్లిములను తమ అనుచరులుగా చేర్చుకున్నారు. ఇరు మతాలకూ చెందిన యోగుల స్నేహ సంబంధాలు, సందర్భాలు ప్రజ విశ్వాసాన్ని పొందాయి. పంజాబ్‌లో సిరాట్ వద్ద 19వ శతాబ్దంలో జమాలి సుల్తాన్, డియాల్ భవాన్ అనే యోగులు యిద్దరూ పరస్పర స్నేహభావంతో జీవనం గడిపారు వారిద్దరి సమాధులు ఒకదాని పక్క మరొక్కటి ఉన్నాయి. వారిద్దర్నీ హిందువులు ముస్లిములు సమానంగా గౌరవించి పూజించేవారు. కాంగ్రాజిల్లాలోని రాణీతాల్ వద్ద క్రీ.శ. 1700 నాడు ముస్లిం బైరాగి బావాఫాతు, హిందూ యోగి సోధి గురు గులాబ్‌సింగ్ దావరా ప్రవక్త అనే బిరుదును పొందాడు బాబా షహనౌ అనే హిందూ సాధువును జాంగ్ జిల్లాలో చాలా మంది అనుసరించే వారు. ఆయన వాస్తవానికి ముస్లిం పీర్ శిష్యుడు. ముస్లిం పీర్ ఆయన పేరును మిశ్రానుండి మీర్‌షాగా మార్చారు.

ఇవన్నీ యథార్థమనటంలో ఎలాంటి సందేహాలకు తావులేదు. ముస్లిములలోని అనేకులు హిందువుల జాతికి చెందిన వారే అవటంలో కూడా ఏ విధమైన సందేహాలూ లేవు. మహమ్మదీయులందరూ ఒకే భాషను మాట్లాడటం లేదు. వారు హిందువులు మాట్లాడే భాషనే అనుసరిస్తున్నారనడం నిర్వివాదమైన అంశం. కొన్ని సాధారణ సామాజిక అంశాలు రెండు

మతాలలోనూ సమానంగా ఉన్నాయి. కొన్ని మతపరమైన ఆచారాలనూ, ఆరాధనలనూ రెండు మతాలకు చెందిన వారూ అనుసరిస్తున్నారు. కానీ ఇవన్నీ హిందువులు ముస్లిములు ఒకే జాతికి చెందిన వారవటానికి ఎంత వరకూ సహాయ పడతాయి? లేదా వారిలో తాము ఒకే జాతికి చెందిన వారమన్న భావాన్ని కలుగజేయటానికి ఈ విషయాలు ఎంతవరకు సహాయకారి అవుతాయన్నదే ప్రధానమైన ప్రశ్న.

హిందువుల వాదనలో చాలా లోపాలున్నాయి. రెండు మతాలలో గల సాధారణ అంశాలను స్వీకరించటం, ఇమిడించుకోవటం వివేకంతో చేసిన ప్రయత్నాల ఫలితమన్నది మొదటిది. కేవలం యాంత్రికమైన కారణాల ఫలితంగానే ఐక్యత చేకూరింది. అది కేవలం అసంపూర్తిగా జరిగిన మత మార్పిడుల ఫలితాలు. భారతదేశంలాంటి దేశంలో మెజారిటీ ముస్లిం ప్రజలను హిందూ కుల వ్యవస్థనుండి చేర్చుకోవటం జరిగింది. తిరుగబడుతారన్న భయం వల్లా, ఒప్పించగల సామర్థ్యం ఉన్న సరైన ప్రబోధకులు లేనందువల్ల అక్కడక్కడ ముస్లిం వర్గాల సామాజిక మత జీవనంలో కొన్ని హిందూ మత మూలాలు గోచరిస్తుంటాయి. శతాబ్దాలుగా హిందువులు ముస్లిములు ఒకేరకమైన పరిసరాల్లో జీవిస్తున్నారు. అందువల్ల రెండు మతాల వారిపై పరిసరాల ప్రభావాలు ఒకేరీతిలో వున్నాయి. అలాంటి ప్రభావాలకు ఇరు మతస్థులూ ఒకే విధంగా ప్రతిస్పదించారు. ఒక రకంగా ఈ సాధారణ విషయాలు హిందూ ముస్లిం ఏకీకరణకు అంకురార్పణం చేసిన అక్బరు చక్రవర్తి కృషి అవశేషాలని చెప్పవచ్చు. అది ఒక రకంగా మృతప్రాయమైన గతం, దానికి వర్తమానం గానీ భవిష్యత్తుగానీ లేవు.

తెగ ఐక్యత, భాషా సమైక్యత, ఒకేదేశంలో నివసించటం వంటి వాదనల విషయం మరొక రకంగా కూడా వుంది. జాతి నిర్మాణం విషయంలో ఇవే నిర్మాణాత్మక వి[illegible]ాలైనట్లయితే హిందువులు చేస్తున్న వాదనలో బలం ఉంది. వారంతా ఒకే తెగకు చెందిన వారు; ఒకే భాషను మాట్లాడుతున్నారు. ఒకే దేశంలో నివసిస్తున్నారు. అందువల్ల హిందువులు, ముస్లిములు ఒకే జాతికి చెందినవారు. చారిత్రక అనుభవాలలో తెగ, భాష, దేశం అనేవి జాతి నిర్మాణానికి దోహదపడే కారకాలుగా సమగ్రమైన స్వభావం కలవి కావు. రీనన్ బహు చక్కగా ఈ విషయాలను వివరించారు. ఈ విషయాన్ని మరో విధంగా చెప్పలేం. ఆయన చాలా కాలం కిందటే జాతీయత అన్న వ్యాసంలో ఇలా అన్నారు. "తెగను జాతిగా భావించటానికి వీలులేదు. యథార్థంలో స్వచ్ఛమైన తెగ అంటూ ఏదీలేదు. తెగ ప్రాతిపదికగా రాజకీయాలను ఏర్పరచుకోవచ్చు. గతంలో చాలా బలమైన కారకంగా ఉన్న తెగ మూలకం, క్రమంగా తన ప్రాముఖ్యాన్ని కోల్పోయింది. మానవ చరిత్ర జంతుశాస్త్రానికి భిన్నమైంది. ఎలుకల్లో లాగా ఒక పిల్లుల జాతి లాగా ప్రతి విషయానికి ప్రాతిపదిక కాదు".

భాషను గురించి మాట్లాడుతూ రీనన్ ఇలా అన్నారు: భాషపునరైక్యతను ఆహ్వానిస్తుంది. ఐక్యతకు అది ప్రతిబంధకం కాదు. అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఇంగ్లండ్, స్పానిష్ అమెరికా,

స్పెయిన్‌లలో ఒకే విధమైన భాషవుంది. కాని అవన్ని కలిసి ఒకే జాతిగా లేవు. ఇందుకు భిన్నంగా నాలుగు, అయిదు భాషలు మాట్లాడే ప్రజలు ఒకే జాతిగా స్విట్జర్లాండు ఆవిర్భవించింది. మనిషిలో భాషను మించింది మరొకటి ఉంది. అది అతని ఇచ్ఛ. భిన్న భాషలు మాట్లాడే వారయినప్పటికీ, స్విట్జర్లాండు ప్రజల్లో కలిసి మెలిసి జీవించాలనే ఇచ్ఛ కన్పిస్తోంది.

ఒకే దేశంలో నివసించటంపై రీనన్ ఈ విధంగా అన్నారు :

జాతి ఆవిర్భావానికి ప్రదేశమనేది ఒక అడుగుపొర లాగా ఉంటుంది. మిగతా విషయాలకు ప్రాతిపదిక మానవ హృదయం. ప్రజల విషయంలో మానవుడే ప్రధానం, మరొకటి ఏదీ దీనికి సరిలేదు. తెగ, భాష, నివసిస్తున్న దేశం మొదలైనవేవీ జాతి నిర్మాణానికి సరిపోవన్న విషయాన్ని చర్చించాక రీనన్ మరే విషయాలు జాతి నిర్మాణానికి అవసరమన్న ప్రశ్న వేశారు? ఆ ప్రశ్నకు ఆయనే ఈ కింది విధంగా సమాధానం ఇచ్చారు.

జాతి ఒక జీవాత్మ. అదొక ఆధ్యాత్మిక సూత్రం. జీవాత్మ, ఆధ్యాత్మిక సూత్రం రెండూ, వేరుగా కనిపించినా వాస్తవంలో అవి రెండూ ఒకటే. ఒకటి గతానికీ, రెండవది వర్తమానానికీ సంబంధించినవి. గత కాలపు జ్ఞాపకాల ప్రోది ఒకటి. కలిసి జీవించాలన్న ఇచ్ఛ రెండవది. గతం నుండి లభ్యమైన వారసత్వాన్ని భద్రపరచాలన్నకోరిక, దాన్ని మానవుడు వృద్ధి పరచడు. వ్యక్తి లాగే గత కాలపు ప్రయత్నాలు, దీక్షలు కోల్పోవడాలు ద్వారా జాతి తన మనుగడను వెల్లడిస్తుంది. మనల్ని తీర్చి దిద్దింది మన పూర్వీకులే అయినందున వాళ్ళను పూజించటం, గౌరవించటం మన కర్తవ్యం.

"వీరోచిత గతం, మహాపురుషులు, కీర్తి – నిజమైన కీర్తి – ఇవన్నీ కలిసి జాతి భావనకు పునాదులు వేస్తాయి. అందరికీ చెందిన గతకాలపు వైభవాలు, అలాంటి వైభవాలనే నిర్మించాలన్న తపన, కలిసి మెలసి చేశామన్న భావన, మళ్ళీ అలానే చేయాలన్న ఆకాంక్ష, అన్నీ కలిసి ప్రజలను జాతిగా ఐక్యం చేస్తాయి. వారు కోల్పోయిన విషయాలను, అనుభవించిన కష్టాలను గుర్తుకు తెచ్చుకుంటారు. మనం నిర్మించిన గృహాన్ని మనమే ప్రేమించి, మన వారసులకు ఇద్దామనుకుంటాం. గతం లోని వారే మేము, మీ ఆశయాలకు తగ్గట్టుగా మేం ఉంటాం అన్న స్పార్టన్ మంత్రం ప్రతిజాతిగీతంగా వెలుగొందుతుంది.

గతకాలపు కీర్తి అపకీర్తులను సమంగా పంచుకొంటాం. భవిష్యత్తులో ఆశయాలను ఇలాగే సాధించుకొంటాం. కలిసి కష్టించాం. కలిసి ఆనందించాం. ముందు కూడా కలిసే వుందామనుకుందాం. భిన్నత్వాల మధ్య ఈ కారణాలను మనం అర్థం చేసుకోవచ్చు. కలిసి కష్టాలు అనుభవించారన్న విషయం యదార్థంలో సంతోషాని కన్నా సమైక్యతకే ఎక్కువ ప్రధాన కారణమౌతుంది. జాతీయస్మృతుల విషయంలో విజయాల కన్నా సంతాపాలే ప్రధానం. అవి విధులను నిర్దేశిస్తాయి. ఆ విధుల నిర్వహణకు అందరి ప్రయత్నాలు 'అవసరం'. హిందువులు, ముస్లిములు సరిసమానంగా గర్వించేవో ఖేదపడేవో ఏవైనా చారిత్రక సంఘటన

ఉన్నాయా? అది ప్రస్తుత సమస్యకు ప్రధానమైన విషయం. హిందువులు, ముస్లిములు సమైక్యమని జాతి అని భావించేటట్లయితే, ఈ ప్రశ్నకు హిందువులే సమాధానం చెప్పాలి. వారి సంబంధాలను పరిశీలించినట్లయితే పరస్పర పోరాటానికి సన్నద్ధమైన రెండు వర్గాలుగా కన్పిస్తాయి. అందరికీ సంబంధించింది పొందేటందుకు ఇంతవరకూ జరిగిన ప్రయత్నాలు ఏవీ లేవు. రాజకీయ రంగంలోను, మత వ్యవహారాలలోనూ వారి గతమంతా పరస్పర వినాశకరమైన పరిస్థితులే. భాయి పరమానంద తన కరపత్రంలో ఇలా రాశారు. "ముస్లింల దండయాత్రల నుండి తమ మాతృభూమి కోసం జరిపిన పోరాటం, జాతీయోద్యమంలో హిందువులు పృధ్విరాజ్, రాణాప్రతాప్, శివాజీ, బేరాగిబిర్‌లను గౌరవిస్తారు. ముస్లిములు దండయాత్రలు చేసిన మహ్మద్ బిన్ ఖాసిం, ఔరంగజేబులాంటి వారిని తమ వీరులుగా భావిస్తారు." మత వ్యవహారాల్లో హిందువులు రామాయణం, మహాభారతం, భగవద్గీత నుండి ఉత్తేజం పొందుతారు. హిందూ ముస్లిములను కలిపివేసే కంటే విడదీసే విషయాలే ప్రముఖమైనవి. హిందూ ముస్లిం సామాజిక జీవనం నుండి భాష, ఒకే తెగ, ఒకే రాజ్యంలాంటి విషయాలపై ఆధారపడటంలో హిందువులు ప్రాతిపదిక విషయం ఏది? యాదృచ్ఛికం ఏది? కృతకం ఏది? అనే విషయాలలో పొరబడుతున్నారు. రాజకీయ మత వ్యతిరేకతలు తక్కిన విషయాలకంటే ఎక్కువగా హిందువులనూ ముస్లిములనూ విడదీస్తున్నాయి. అవి వారిని సమైక్య పరచలేకపోతున్నాయి. గతాన్ని ఇరువురూ విస్మరించేటట్లయితే ఐక్యతకు అవకాశాలు ఎక్కువ అవుతాయి. ఈ విషయంపై జాతి నిర్మాణంలో గతాన్ని మరవటం గురించి రీనన్ అన్న మాటలను గమనిద్దాం.

"చారిత్రక పొరపాటు విస్మరణ స్వభావమని అంటాను. జాతి నిర్మాణంలో ప్రధానమైన మూలకమని భావిస్తాను. ఒక్కొక్క సందర్భంలో చారిత్రక అధ్యయనాలు జాతీయతా భావానికి ప్రతిబంధకంగా ఉంటాయి. చారిత్రక పరిశోధన వల్ల రాజకీయ సంఘటనల వెనుక గల హింస వెలుగులోకి వస్తుంది. అలాంటివాటిలో కొన్ని లాభదాయకమైనవి ఉండవచ్చు. క్రూరత్వంలో ఏనాడు సమైక్యతను సాధించలేం. ఉత్తర దక్షిణ ఫ్రాన్సులకు మధ్య సమైక్యత అతివాద ధోరణి ఫలితమే. దాదాపు వంద సంవత్సరాలు భయంకరమైన పాలన కొనసాగింది. లౌకికత్వాన్ని స్థిరపరచటంలో ఆదర్శప్రాయుడైన ఫ్రెంచిరాజు సమైక్యతను ఏర్పరచారు. కాని దగ్గరగా పరిశీలిస్తే తన గౌరవాన్ని కోల్పోయిన వాడయ్యాడు. ఆయన నిర్మించిన జాతే ఆయన్ని శపించింది. ఆయన చేసింది, సాధించింది కొద్దిమంది శ్రేష్టుల పరిజ్ఞానానికే పరిమితమైంది."

పశ్చిమ యూరప్ చారిత్రక సూత్రాలు తులనాత్మక పరిశీలనకు పనికివస్తాయి. ఫ్రెంచిరాజు మార్గాన్ని అనుసరించిన చాలా దేశాలు వినాశనానికి గురయ్యాయి. స్టీఫన్ రాజరికంలో మెగాయర్లు, స్లావులు ఎనిమిది వందల యేండ్ల క్రితం ఎలా వున్నారో ఈనాడు కూడా అలానే వున్నారు. వివిధ వర్గాల వారిని సమైక్యపరిచే బదులు హాప్స్‌బర్గ్ రాజవంశం ఒకరిమీద ఒకరిని పురిగొల్పింది.

ముస్లిములది ప్రత్యేక జాతి అనే భావన వారి నాయకుల్లో ఇటీవల వచ్చిన మార్పుగా భావించటంలో ఉపయోగం ఏమీ లేదు. అది కేవలం ఆరోపణ మాత్రమే అవుతుంది. ఇప్పటి వరకు ముస్లిములు తమను ఒక ప్రత్యేక మతవర్గంగా భావించుకోవటంలోనే తృప్తి చెందారు. ఇటీవలనే వారు తాము ఒక ప్రత్యేక జాతియని పేర్కొంటున్నారు. వ్యక్తులపై ఆరోపణలు చేయటమంటే ఈ సిద్ధాంతాన్ని కాదనటం కాదు. ఒకప్పుడు ముస్లిములు తామొక ప్రత్యేక వర్గమని భావించుకున్నారు గనుక, ఇప్పుడు వారు తమను ప్రత్యేక జాతిగా ప్రకటించుకోవటాన్ని ఆటంకపరచటం వారి జాతీయ భావ మనస్తత్వాన్ని తప్పుగా అర్థం చేసుకోవటం జరుగుతుంది. ఎక్కడైనా ఉన్న ప్రజలు జాతిగా పేర్కొనటానికి అర్హులు కారనటం యదార్థ బాహ్య విషయం అవుతుంది. అలాంటి వాదనలకు చారిత్రక ఆధారాలేవీ లేవు.

ప్రొఫెసర్ టాయన్బీ ఇలా అన్నారు : 'అన్నీ కాని, ఏ ఒక్కటికాని జాతీయతకు దోహదం చేసేవని వాదించటం కష్టతరం. యుగాలుగా జాతీయతా మూలకాలు ఉండవచ్చు. అవి ఎలాంటి ప్రతిస్పందననూ కలుగజేసి ఉండకపోవచ్చు. ఒక సందర్భాన్ని మరొక సందర్భంతో పోల్చి చెప్పలేం. అలాంటి కారకాలే ఒకచోట జాతీయతకు దోహదపడవచ్చు. మరొకచోట ఏ ప్రభావం కలిగించి ఉండకపోవచ్చు."

ఇదే నిజమై ఉండవచ్చా? ప్రొఫెసర్ బార్కర్ అన్నట్లు చాలా శతాబ్దాలుగా జాతులు నిశ్శబ్దంగా ఉండవచ్చు. ఆ జాతుల సభ్యులు ఏ విధమైన ఇచ్ఛను ప్రకటించి ఉండక పోవచ్చు కూడా. ఇలాంటిదే ముస్లిముల విషయంలో జరిగి ఉండవచ్చు. జాతీయతా భావం వారికి స్ఫురహ కలిగి ఉండకపోవచ్చు. అందువల్లనే వారు చాలా ఆలస్యంగా తమను ప్రత్యేక జాతిగా ప్రకటించుకొన్నారు. అంతమాత్రాన వారికి జాతీయతా స్పృహ లేదనుకోవటం పొరపాటు.

బొహిమియాలో జెక్కులు, జర్మనులు గ్లాసులోని నీళ్ళమీద నూనెలాగా మాత్రమే కలిసిపోయారు. మత ప్రాతిపదిక మీద జాతులను వేరు వేరుగా ఉంచే టర్కీ విధానాల వల్ల హీనమైన ఫలితాలు వెల్లడయ్యాయి. అది తూర్పును సర్వనాశనం చేసింది. స్మిర్నా, సాలోనికాలాంటి పట్టణాల విషయమే చూడండి. వాటిలో ప్రతిదానిలో నాలుగైదు వర్గాలు వాటి పూర్వస్మృతులతో కలిసి వున్నాయి. వారిమధ్య ఐక్యతకు దోహదపడే విషయమేమీ లేదు. పౌరులందరూ అన్నిటినీ సమానంగా పంచుకోవటమే జాతికి అవసరమైన విషయం. ఎవ్వరినీ వెలివేయకూడదు. ఏ ఫ్రెంచిపౌరుడూ కూడా తాను బర్గండియన్, అలన్, విసిగోథ్ అని భావించరు. ప్రతి ఫ్రెంచి పౌరుడు సెంట్‌బర్త్‌లో మియాను మరచిపోయి ఉండవచ్చు. 13వ శతాబ్దపు దక్షిణాది మూకుమ్మడి హత్యలను కూడా మరిచిపోయి ఉండవచ్చు. ఫ్రాన్సులోని కుటుంబాలలో తమ పూర్వ చారిత్రక స్పృహను కలిగి ఉండవచ్చునేమో కాని, వేలాది కుటుంబాలు కలిసిపోయి తమ పూర్వ చరిత్రను జ్ఞప్తికి తెచ్చుకోలేకుండా ఉన్నారు."

కాని హిందువులు, ముస్లిములు ఇద్దరూ తమ గత చరిత్రను మరచిపోయేటట్లు లేరు.

గతం వారి మతంతో పెనవేసుకొని ఉంది. గతాన్ని వదులుకోవడమంటే మతాన్ని విడనాడటమే అవుతుంది. దీన్ని ఆశించటం నిరాశే అవుతుంది.

అందరూ కలిసిమెలిసి ఉండాలన్న చారిత్రక ఉదాహరణం ఏదీ లేనందున, హిందువులు, ముస్లిములు ఒకే జాతి అనే హిందువుల వాదంలో పస లేదు. అది నిజమనటం భ్రమ అవుతుంది. హిందువులు, ముస్లిములు కలిసి మెలిసి ఉంటున్నారన్న భావన ముస్లిములలో లేనట్లు హిందువుల్లో కూడా లేదు.

జాతీయతా భావం ఉండి, ప్రత్యేక జాతిగా కొనసాగాలన్న ఇచ్ఛలేని సందర్భాలు ఉన్నాయనుకోవటం వల్ల ఏమి లాభం లేదు. కెనడాలో ఫ్రెంచివారు, దక్షిణాఫ్రికాలో ఇంగ్లీషు వారిని ఇందుకు ఉదాహరణలుగా పేర్కొనవచ్చు. ప్రజలకు జాతీయతా భావ స్పృహ ఉండి కూడా, జాతివాదం బలపడటానికి దోహదపడి ఉండవచ్చు. మరోమాటలో చెప్పాలంటే జాతీయతావాదం లేని జాతులు ఉన్నాయి. ఈ వాదం ఆధారంగా ముస్లిములు ప్రత్యేక జాతి అయి ఉండవచ్చు కాని, ప్రత్యేక జాతివాదం ప్రతిపాదించనవసరం లేదనవచ్చు. కెనడాలో ఫ్రెంచివారు, దక్షిణాఫ్రికాలో ఇంగ్లీషు వారి స్థితిలాంటిదే. తమదని వారెందుకు సంతృప్తి చెందరు? అలాంటి స్థితి మంచిదే. ఇలాంటి స్థితి గురించి ముస్లిములను దేశ విభజనను అడుగవద్దని కోరుతూ వాదించవచ్చు. అయితే ముస్లిములు పట్టుబట్టినట్లయితే ఈ వాదం వారి విభజన కోరికకు వ్యతిరేక వాదం కాదు.

ఇలా వాదించటాన్ని వారి వాదనను వ్యతిరేకించటంగా భావించరాదు. రెండు విషయాలను వారిని కోరవచ్చు. జాతివాదం, జాతీయతావాదం మధ్య భేదమున్నదనటం మొదటిది. అవి రెండూ మానవుల మానసిక ఆలోచనలకు ప్రతిబింబాలు. జాతీయత అంటే బంధుత్వ సంబంధాలుగల మానసిక స్థితి. జాతివాదమనగా బంధుత్వ సంబంధాలతో ప్రత్యేకంగా మనగలగాలని కోరుకోవటం. జాతీయతా భావం లేకుండా జాతివాదం ఉండదనేది రెండవది. జాతివాదం కోరటమే జాతీయతా భావం కలిగి ఉండటమనేది అన్నివేళలా వాస్తవం కాదు. జాతీయతా భావం ఉండవచ్చు కాని జాతివాదం లేకపోవచ్చు. జాతీయతా భావం అన్ని సందర్భాలలోనూ జాతివాదానికి దారి తీయదు. జాతీయత జాతివాదానికి దారి తీయటానికి రెండు పరిస్థితులు చాలా అవసరం. జాతిగా కలిసి మెలిసి జీవించాలన్న ఇచ్ఛ కలిగి ఉండటం మొదటిది. అలాంటి ఇచ్ఛా ప్రకటనమే జాతివాదం. జాతివాదం మనగలగటానికి భౌగోళిక ప్రాంతం అవసరం. భౌగోళిక ప్రాంతం జాతివాద రాజ్య ఆవిర్భావానికి దోహదం చేస్తుంది. జాతికి సాంస్కృతిక ప్రాంతాన్ని ఇస్తుంది. భౌగోళిక ప్రదేశం లేకుండా జాతివాదం లేదు. లార్డ్ ఆక్టన్ మాటల్లో "అది శరీరం కోసం వెతుకుతున్న ఆత్మలాంటిది. ఆ శరీరం నశిస్తే ఆత్మకు మరో శారీరక రూపం అవసరమౌతుంది". ముస్లిములు ఒక జాతిగా ఉండాలని నిశ్చయించుకున్నారు. ప్రకృతి వారికొక భౌగోళిక ప్రాంతాన్ని సూచించింది. వారు దాన్ని ఆక్రమించుకొన్నారు. ఆ

ప్రదేశమే కొత్తగా ఏర్పడుతున్న ముస్లిం జాతికి మాతృభూమి. ఇలాంటి పరిస్థితుల్లో కెనడాలో ఫ్రెంచివారు, దక్షిణాఫ్రికాలో ఇంగ్లీషువారు పొందుతున్న స్థితికి భారతీయ ముస్లిములు అంగీకరించక తమకొక మాతృభూమి కావాలని కోరుకోవచ్చు.

# పతనం నుంచి పలాయనం

భారతదేశాన్ని విభజించి ప్రత్యేక ముస్లిం రాజ్యాల ఏర్పాటు కోరికను ముస్లిములు ఏ విధంగా సమర్థించుకుంటారు? ఎందుకీ తిరుగుబాటు? వాళ్ళ బాధలేమిటి? అని హిందువులు ఆగ్రహంతో అడుగుతున్నారు.

చరిత్రను అధ్యయనం చేసిన వారెవరైనా రాజ్య ఆవిర్భావానికి జాతివాదం సరైన కారణమేనని అంగీకరించక మానరు. ప్రఖ్యాత చరిత్రకారుడు లార్డ్ ఆక్టన్ చెప్పినట్లు :

"పురాతన యురోపియన్ వ్యవస్థలో జాతుల హక్కులను ఏ ప్రభుత్వాలూ గుర్తించ లేదు. ప్రజలు వాటిని కోరలేదు. జాతుల ప్రయోజనాలు గాక రాజ కుటుంబీకుల ప్రయోజనాలు రాజ్య సరిహద్దులను క్రమబద్ధం చేశాయి. ప్రజల అభీష్టాలను పట్టించుకోకుండా రాజ్యపాలన కొనసాగింది. స్వేచ్ఛలన్నింటినీ అణగద్రొక్కినప్పుడు, జాతి స్వేచ్ఛను గురించి ఎవ్వరూ పట్టించుకోలేదు. ఫెనిలన్ మాటల్లో "ప్రతి రాజకుమారుడు తన వివాహ కానుకగా రాజ్యాలను స్వీకరించేవాడు".

జాతులకు ఏవిధమైన గుర్తింపు ఉండేది కాదు. అవి జాగృతమైనప్పుడు: "మొదట ప్రజలు తమను పాలిస్తున్న రాజులపై దండయాత్రకు దిగినవారిపై తిరగబడ్డారు. ప్రజలు తిరుగుబాటుదారుల పాలనను వ్యతిరేకించారు. ఆపై ప్రజలపై రాజులు చేస్తున్న అకృత్యాలకు వ్యతిరేకంగా తిరగబడ్డారు. ఖచ్చితమైన బాధలూ, కారణాలూ ప్రజల తిరుగుబాటుకు ప్రోత్సాహానిచ్చాయి. పిదప సంపూర్ణమైన మార్పులకు దోహదం చేసిన ఫ్రెంచి విప్లవం చెలరేగింది. స్వేచ్ఛలేక బాధ పడుతున్న ప్రజలు ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరగబడటాన్ని ఫ్రెంచి విప్లవం సమర్ధించింది. అది ప్రజల సార్వభౌమత్వాన్ని ప్రకటించింది. ప్రజా సార్వభౌమత్వం పై గతంలోని నియంత్రణలు లేవు. ప్రస్తుత రాజ్యపు నియంత్రణాధికారం లేదు. ఫ్రెంచి విప్లవం

నేర్పిన పాఠాల్ని ఉదారవాద తత్త్వవేత్తలందరూ సమర్థించారు. "మానవ జాతి తన ఇష్టం వచ్చిన రీతిలో విభాగమయ్యేటందుకు స్వేచ్ఛ ఉండాలి. వారు ఎవరెవరితో కలిసి ఉండాలన్నది వారే నిర్ణయించుకోవాలి" అని మిల్ వ్యాఖ్యానించారు.

ఆయన మరింత ముందుకు వెళ్ళి ఇలా అన్నారు : ప్రభుత్వాల సరిహద్దులు జాతీయతల సరిహద్దులు కలిసి ఉండాలి. స్వేచ్ఛగా సంస్థలు ఏర్పడాలి".

ప్రజల ఇచ్ఛ అనే ప్రజాస్వామ్య సార్వభౌమత్వ సిద్ధాంతంలో జాతీయతా సిద్ధాంతం కలిసి ఉంది. ఒక జాతి రాజ్యంగా ఏర్పడాలన్న కోరికకు ఎలాంటి కారణాలను చూపనక్కర లేదు. అలాంటి కోరికను సమర్థించటానికి ప్రజల ఇచ్ఛ -ాలు.

కానీ, తాము కోరిన కోరికకు సంబంధించిన బాధలను ఏకరువు పెట్టాలంటే చాలా బాధలున్నాయని ముస్లిములు అంటున్నారు. వాటన్నింటినీ ఒక్క వాక్యంలో చెప్పవచ్చు. రాజ్యాంగ రక్షణలు వారిని హిందువుల మెజారిటీ నియంతృత్వం నుండి రక్షించలేవు.

రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ సమావేశంలో ముస్లిములు తమకు కావలసిన రక్షణలను పేర్కొంటూ పధ్నాలుగు సూత్రాల ప్రణాళికను రచించారు. సమావేశానికి వచ్చిన హిందువుల ప్రతినిధులు ఆ ప్రణాళికను అంగీకరించ సిద్ధపడలేదు. అనిశ్చిత పరిస్థితి ఏర్పడింది. బ్రిటిష్ ప్రభుత్వం జోక్యం కల్పించుకొని తన "కమ్యూనల్ నిర్ణయాన్ని" ప్రకటించింది. ఈ నిర్ణయం వల్ల ముస్లిములకు తాము కోరుకున్న పధ్నాలుగు సూత్రాల రక్షణ లభించింది. కమ్యూనల్ అవార్డు పై హిందువులలో పెల్లుబికిన వ్యతిరేకతలో కాంగ్రెసు భాగస్వామి కాలేదు. దాన్ని జాతి వ్యతిరేక చర్య అని నిందించే హక్కుగాని, ముస్లిముల మద్దతుతో దానిని మార్చే ఆలోచనను కానీ కాంగ్రెసు ప్రదర్శించలేదు. ముస్లిములకు బాధ కలిగించే ప్రయత్నాలను వేటినీ కాంగ్రెస్ చేయలేదు. కేంద్ర అసెంబ్లీలో కమ్యూనల్ అవార్డుకు వ్యతిరేకంగా తీర్మానం ప్రతిపాదించిన సమయంలో దానికి కాంగ్రెసు ఆశీస్సులు లభించలేదు. కాంగ్రెసు దాన్ని సమర్థించనూ లేదు. వ్యతిరేకించనూ లేదు. ఈ అంశాన్ని ముస్లిములు కాంగ్రెసు తమ పట్ల ప్రదర్శించిన స్నేహభావంగా భావించారు.

హిందువులు మెజారిటీగా ఉన్న రాష్ట్రాల్లో కాంగ్రెసుకు ఎన్నికల్లో విజయం లభించటం పట్ల కూడా ముస్లిములు కలత పడలేదు. వారు కాంగ్రెసు నుండి భయపడాల్సిన అవసరం లేదనుకున్నారు. కాంగ్రెసు, ముస్లింలీగ్ రెండూ కలిసి రాజ్యాంగం అమలులో సహకరిస్తారనుకున్నారు. కాని హిందూ రాష్ట్రాల్లో రెండు సంవత్సరాల మూడు నెలల కాంగ్రెసు పాలన ముస్లిములను నిరాశాపరులుగా చేసింది. ఫలితంగా వారు కాంగ్రెసుకు బద్ధ శత్రువులయ్యారు. 1939 డిశంబరు 22న జరిగిన "విమోచన దినం"లో ముస్లిముల వ్యతిరేకత పూర్తిగా ప్రదర్శితమైంది. ముస్లిముల బద్ధ వ్యతిరేకత ఒక్క కాంగ్రెసుకే పరిమితం కాలేదు. రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సులో రాజ్యం కోరటానికి సిద్ధపడిన కాంగ్రెసుతో కలిసి సిద్ధపడిన ముస్లిములు

ఇప్పుడు స్వరాజ్యానికి వ్యతిరేకులయ్యారు.

ముస్లిములకు ఆగ్రహం తెప్పించటంలో కాంగ్రెసువారు చేసింది ఏమిటి? కాంగ్రెసు పాలనలో ముస్లిములు భయకంపితులయ్యారని, అణగద్రొక్కబడ్డారని ముస్లింలీగ్ ఆరోపిస్తుంది. లీగ్ నియమించిన రెండు కమిటీలు కూడా ఈ విషయాన్ని పరిశీలించి నివేదికలు సమర్పించాయి. ఈ విషయంలో నిష్పక్ష విచారణ జరగాల్సి ఉంది. అయితే హిందూ ముస్లిం విభేదాలకు రెండు విషయాలు ముఖ్య కారణాలయ్యాయి. 1) ముస్లిముల ఏకైక ప్రాతినిధ్య సంస్థగా ముస్లింలీగ్‌ను కాంగ్రెసు గుర్తించ నిరాకరించటం; 2) కాంగ్రెసు మెజారిటీ పొందిన రాష్ట్రాల్లో ముస్లింలీగ్‌తో కలిసి కాంగ్రెసు సంకీర్ణప్రభుత్వాలను ఏర్పాటు చేయలేకపోవటం.

మొదటి విషయంలో కాంగ్రెసు, ముస్లింలీగ్ రెండూ మొండి వైఖరిని ప్రదర్శించాయి. కాంగ్రెసు, ముస్లింలీగ్‌ను ముస్లింలకు ప్రాతినిధ్యం వహించే అహెరార్‌లు, జాతీయ ముస్లిములు, జమాయిత్-ఇ-ఉలేమా లాంటి సంస్థలతో పాటు ఒక సంస్థగా గుర్తించ సిద్ధపడింది. కాని ముస్లింలీగ్‌ను ఏకైక ముస్లిం ప్రాతినిధ్య సంస్థగా గుర్తించడానికి కాంగ్రెసు నిరాకరించింది. మరొకపక్క ముస్లింలీగ్ తనను ముస్లిముల ఏకైక ప్రాతినిధ్య సంస్థగా కాంగ్రెసు గుర్తించనంతవరకూ దానితో చర్చలకు సిద్ధపడలేదు. లీగ్ కోరిన కోరికను హిందువుల తలకు మించిన కోరికగా భావించి పరిహాసం చేశారు. జాతుల మధ్య సంధి ఒప్పందాలు ఎలా ఏర్పడుతాయన్న విషయాన్ని హిందువులు తెలుసుకోనట్లయితే వారు తమ కోరిక ఎంత దుష్టమైనదో తెలుసుకోగలుగుతారని ముస్లిములు అంటున్నారు. ఒక జాతి ఇంకొక జాతితో ఒప్పందం చేసుకోదలచినప్పుడు ప్రభుత్వాన్ని అధికారిక ప్రతినిధిగా గుర్తించటం జరుగుతుంది. ఏ దేశంలోనైనా సమకాలీన ప్రభుత్వం ప్రజలందరికీ ప్రాతినిధ్యం వహించదు. ప్రతిచోటా ప్రభుత్వం మెజారిటీ ప్రజలకే ప్రాతినిధ్యం వహిస్తుంది. ప్రాతినిధ్యం వహించే ప్రభుత్వాలకు ప్రజల పూర్తి మద్దతు లేదన్న కారణంతో ఏ రాజ్యాలు కూడా తమ మధ్యన వివాదాలకు అన్వయించాలని ముస్లిములు భావిస్తున్నారు. ముస్లిములందరికీ లీగ్ ప్రాతినిధ్యం వహించకపోవచ్చు. కాని దానికి మెజారిటీ ముస్లిముల మద్దతు ఉంది. హిందువులు ముస్లిముల సమస్యను పరిష్కరించటంలో ముస్లిముల మద్దతుగల ముస్లింలీగ్‌తో సంప్రదింపులు జరపవచ్చు. ఒకటి కన్నా ఎక్కువ సంస్థలకు ప్రజల మద్దతు ఉన్నట్లయితే ఒక దేశపు ప్రభుత్వం మరొక దేశపు ప్రభుత్వాన్ని గుర్తించనట్లు లీగ్‌ను గుర్తించకపోవచ్చు. అదే విధంగా కాంగ్రెసు ముస్లింలీగ్‌ను గుర్తించటం లేదు. అయితే కాంగ్రెసు జాతీయ ముస్లిములను లేదా అహెరార్‌లను లేదా జమాయిత్-ఇ-ఉలేమాను గుర్తించి వారితో రెండు మతాల మధ్య పరిష్కారం కుదర్చవచ్చు. అయితే అలా వ్యవహరించే ముందు లీగ్‌తో ఒప్పందం లేదా ఇతర ముస్లిం సంస్థలతో ఒప్పందం - ఏది ముస్లిములకు అంగీకారమవుతుందన్న విషయాన్ని కాంగ్రెసు అర్థం చేసుకోవాలి. కాంగ్రెసు ఎవరితోనో ఒకరితో వ్యవహరించాలి. ఎవరితోనూ వ్యవహరించకపోవటం మూర్ఖత్వమే గాక తుంటరితనం కూడా అవుతుంది. కాంగ్రెసు అనుసరిస్తున్న ఈ వైఖరి వల్ల

ముస్లిములు చికాకు చెందుతున్నారు. అసహనంగా ఉంటున్నారు. తమని విడదీయటానికి తమలో భేదాలు పుట్టించి తమను బలహీన పరచడానికే కాంగ్రెసు వైఖరి తోడ్పడుతున్నదని ముస్లిములు భావిస్తున్నారు.

శాసనసభలోని ముస్లిముల విశ్వాసం పొందగల ముస్లిమును మంత్రిగా కేబినేట్‌లో నియమించాలన్నది ముస్లిముల రెండో కోరిక. కాంగ్రెసు అధికారంలోకి రాగానే ఈ విధంగా నియామకాలు జరుగుతాయని ముస్లిములు భావించారు. కాని వాళ్ళకు ఒట్టి అసంతృప్తి మిగిలింది. ఈ కోరిక విషయంలో కాంగ్రెసు వారు శాసనబద్ధ వైఖరిని అవలంబించారు. ముస్లిం శాసన సభ్యులు తమ పార్టీకి రాజీనామా చేసి కాంగ్రెసు శపథం పై సంతకాలు చేసి కాంగ్రెసులో చేరేటట్లయితేనే మంత్రివర్గంలో స్థానం కల్పిస్తామని కాంగ్రెసు వివరించింది. దీనిని ముస్లిములు మూడు కారణాల రీత్యా వ్యతిరేకించారు.

మొదటగా, కాంగ్రెసు వాదాన్ని నమ్మకద్రోహమని ముస్లిములు పేర్కొన్నారు. తమ కోరిక రాజ్యాంగ సూత్రబద్ధమైన కోరిక అని ముస్లిముల వాదన. మంత్రివర్గాల్లో మైనారిటీలకు స్థానం కల్పించాలన్న విషయం రౌండ్ టేబుల్ సమావేశాలప్పుడు అంగీకరించటం జరిగింది. ఈ విషయాన్ని చట్టబద్ధం చేయాలని మైనారిటీలు పట్టుబట్టాయి. ఈ విషయాన్ని సమావేశం ద్వారా నియంత్రించుకుందామని హిందువులన్నారు. రెండింటికి మధ్యేమార్గం ఒకటి దొరికింది. గవర్నర్ల కోసం రూపొందించే మార్గదర్శక సూత్రాల్లో ఈ విషయాన్ని చేర్చాలని మైనారిటీల ప్రతినిధులకు మంత్రివర్గంలో స్థానం కల్పించే బాధ్యతను గవర్నర్ల కివ్వాలనుకున్నారు. ఈ విషయాన్ని చట్టబద్ధం చేయటానికి ముస్లిములు పట్టుపట్టకుండా హిందువుల మంచితనం మీద విశ్వాసం ఉంచారు. ముస్లిముల పట్ల తమ వైఖరి సరి అయినదేనని, చాలా సానుకూలంగా ఉందని కాంగ్రెసు పార్టీయే ఈ ఒప్పందాన్ని పాటించలేదు.

రెండవది : కాంగ్రెసు వైఖరి సంప్రదాయ పరిధిని వక్రమార్గం పట్టించేదిగా ఉందని ముస్లిముల భావన. ఈ విషయంలో వారు గవర్నరు ఆదేశ మార్గదర్శక సూత్రాలలోని మైనారిటీ సభ్యుడు అన్న పదం మీద అర్థం ఆధారపడుతున్నారు. మైనారిటీ వర్గాల సభ్యుడు అన్న పదానికి, మైనారిటీ వర్గాల విశ్వాసం గల సభ్యుడన్నదే సరైన అర్థమని ముస్లిములు వాదిస్తున్నారు. ఇందుకు భిన్నమైన వైఖరిని కాంగ్రెసు అవలంబించింది. కాంగ్రెసు శపథంపై సంతకం చేసిన వారినే మంత్రివర్గంలో చేర్చుకుంటామనటం, దేశంలో ఇతర పార్టీలు లేకుండా, కాంగ్రెసునే ఏకైక పార్టీగా చేయటానికేనని వ్యాఖ్యానించటం జరిగింది. కాంగ్రెసు శపథాలపై సంతకాలు చేయాలనటానికి మరో ఉద్దేశ్యం ఏదీ ఉండబోదు. ఈ విధంగా సంపూర్ణాధికారయుత రాజ్యం ఏర్పరచటానికి హిందువులకు ఎలాంటి అభ్యంతరం ఉండబోదు. కాని ముస్లిములు దీన్ని తమను రాజకీయంగా అంతమొందించే కుతంత్రమని అంటున్నారు.

ఈ విషయాన్ని అమలు చేయాల్సిన బాధ్యత గల గవర్నరులు అమలు చేయ నిరాకరిం

చటం వలన ముస్లిములు మరింతగా వ్యధ చెందుతున్నారు. ప్రభుత్వం నెలకొల్పే మెజారిటీ కాంగ్రెసుకే ఉన్నందున వారిని కాదని మైనారిటీ సభ్యుని మంత్రిగా నియమించడానికి కొంతమంది గవర్నరులు నిరాకరించారు. మరొక పార్టీ ఏదీ కాంగ్రెసుకు ఉన్న స్థితిలో లేదు. కాంగ్రెసు మద్దతుదార్లయినందున మరికొంతమంది గవర్నరులు అమలు చేయటానికి నిరాకరించారు. అలాంటివారు కాంగ్రెసు దుస్తులైన ఖద్దరు వస్త్రాలని ధరిస్తూ కాంగ్రెసుకు విధేయతను ప్రకటిస్తున్నారు. కారణమేదైనప్పటికీ తమకు గల రక్షణల ఉల్లంఘనం జరిగిందని ముస్లిములు తెలుసుకున్నారు.

ఇందుకు కాంగ్రెసు వారి సమాధానం రెండు రకాలుగా ఉంది. మొదటగా మంత్రివర్గ సమిష్టి బాధ్యతా సూత్రానికి సంకీర్ణ ప్రభుత్వాలు అతీతమైనవని వారి అభిప్రాయం. దీన్ని ముస్లిములు గౌరవప్రదమైన కారణంగా ఎంచటం లేదు. బ్రిటిష్ వారు ఒక్కరు మాత్రమే బాధ్యతను తమ ప్రభుత్వ పద్ధతిలోని ప్రాధమిక సూత్రంగా అంగీకరించారు. కాని ఇటీవల దాన్ని కూడా విస్మరించారు. ఈ విషయాన్ని బ్రిటిష్ పార్లమెంటు కూలంకషంగా చర్చించింది. ఒకసారి భావించినట్లుగా బాధ్యతాయుత సూత్రాన్ని అతిక్రమించరాని సూత్రంగా ఇప్పుడు భావించాల్సిన అవసరం లేదన్నది. కాంగ్రెసు ప్రభుత్వాలలో సమిష్టి బాధ్యత లేదన్నది రెండో విషయం. అవి వివిధ శాఖల ప్రభుత్వాలు. ప్రతి మంత్రీ సర్వస్వతంత్రుడు. ప్రధాని కూడా ఒక మంత్రే. కాంగ్రెసువారు సమిష్టి బాధ్యత గురించి మాట్లాడటం అనావశ్యకమైన విషయం. ఈ కారణం చెప్పటంలో చిత్తశుద్ధి లేదు. కాంగ్రెసుకు మెజారిటీ లేని కొన్ని రాష్ట్రాల్లో అది సంకీర్ణ ప్రభుత్వాలలో పాల్గొంది. అలాంటి సందర్భాల్లో ఇతర పార్టీలకు చెందిన మంత్రులను తమ పార్టీ సభ్యత్వానికి రాజీనామా చేసి కాంగ్రెసు శపధాన్ని అంగీకరించాలని అడగలేదు. సంకీర్ణ ప్రభుత్వం మంచిది కానట్లయితే, ఒక చోట మంచిదిగానూ, మరొకచోట మంచిది కాకుండానూ ఉంటుందా అని ముస్లిములు అడుగుతున్నారు.

మెజారిటీ ముస్లిముల విశ్వాసం లేని సందర్భాల్లో మంత్రులైన ముస్లిం ప్రతినిధులు ముస్లిముల ప్రయోజనాలను కాపాడటంలో విఫలం కాలేదన్నది కాంగ్రెసు వారి రెండవ సమాధానం. వారు ముస్లిముల ప్రయోజనాలు కాపాడటంలో తమ సర్వశక్తులను వినియోగించారు. ఇది పోప్ ప్రభుత్వాల విషయమై చెప్పటం మీద ఆధారపడుతుంది.

"ప్రభుత్వ రకాల గురించి మూర్ఖులు పోటీ పడుతుంటారు. చక్కని పరిపాలనను అందించేదే మంచి ప్రభుత్వం".

ఈ విధమైన సమాధానం చెప్పటంలో కాంగ్రెసు అధిష్టాన వర్గం ముస్లిముల, మైనారిటీల ప్రధాన వాదాన్ని సరిగా అర్థం చేసుకున్నట్లు కనపడదు. ముస్లిములకు కాంగ్రెసు మంచి చేసిందా లేదా అన్నది వారిద్దరి మధ్యా గల తగాదాలకు. వారి తగాదా మరొకదాన్ని గురించి, స్వరాజ్యం వస్తే హిందువులే పాలక జాతా? ముస్లిములు ఇతర మైనారిటీలు

పాలితులా? సంకీర్ణ మంత్రివర్గాల కోరికతో ఈ సమస్య ముడిపడి ఉన్నది. ఈ సమస్యపై ముస్లిములు మైనారిటీలు నిర్దిష్టమైన వాదనను చేస్తున్నారు. వారు తమను పాలిత జాతి కింద జమకట్టవద్దంటున్నారు.

పాలకవర్గం పాలితులకు మంచి చేశారన్నది అటుపక్కకు నెట్టి, పాలిత ప్రజలుగా ముద్ర వేయించుకోవడానికి ముస్లిములు మైనారిటీలు ఇష్టపడటం లేదు. భారతదేశంలో భారతీయులకోసం బ్రిటిష్ వారు చాలా మంచి పనులు చేశారు. రోడ్లను బాగు పరచారు. శాస్త్రీయ పద్ధతులపై కాలువల్ని తవ్వించారు. రైలు మార్గాలు వేశారు. పోస్టల్ సర్వీసులను ఏర్పాటు చేశారు. తూనికల్ని కొలతల్ని క్రమబద్ధం చేశారు. భూగోళశాస్త్రం, నక్షత్రశాస్త్రం, వైద్యశాస్త్రాలను తగు విధంగా సవరించారు. అంతర్గ కలహాలను రూపుమాపి పరిస్థితులలో అభివృద్ధిని సాధించారు. ఇన్ని మంచి పనులు చేశారు గనుక మనం స్వపరిపాలనను కోరకుండా బ్రిటీషు వారికి విధేయులుగా ఉండటాన్నే కోరుతున్నామా? ఈ మంచిపనులు చేసినందువల్ల భారతీయులు బ్రిటీషువారికి వ్యతిరేకంగా స్వ పరిపాలన కోసం పోరాడటాన్ని విరమించారా? ఇలాంటి పనిని భారతీయులు చేయలేదు. బ్రిటీషువారు చేసిన మంచి పనులతో భారతీయులు సంతృప్తి పడి ఊరుకోలేదు. స్వరాజ్యం కోసం పోరాడుతూనే ఉన్నారు. ఇది కూడా అలాంటిదే. ఐరిష్ దేశభక్తుడు 'కుర్రాం' చెప్పినటుల ఆత్మగౌరవం లేకుండా ఎవ్వరూ కృతజ్ఞులై ఉండరాదు. ఏ వనిత కూడా తన పాతివ్రత్యాన్ని కోల్పోయి జీవించలేదు. ఏ జాతి సైతం తన గౌరవాన్ని కోల్పోయి కృతజ్ఞతాబద్ధమై ఉండలేదు. మరొకరకంగా ఉండాలంటే జీవితతత్త్వం కార్లైల్ చెప్పినట్లు "పంది వేదాంతం లాగా ఉండాలి". ముస్లిములు ఇతర మైనారిటీలు కాంగ్రెసు నుండి మంచితనాన్ని గాక, తమ ఆత్మగౌరవ పరిరక్షణకే ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇస్తున్నారన్న విషయాన్ని కాంగ్రెసు అధిష్టాన వర్గం గ్రహించాలి. తమ అస్తిత్వాన్ని గురించి ఎరుక ఉన్న మనుషులు, కొవ్వు పెంచే తిండి కోసమే వెంపర్లాడే పందుల్లాంటి వాళ్ళు కాదు. వారికి ఆత్మ గౌరవం ఉంటుంది. దాన్ని ఎవళ్ళూ "స్వర్గ సామ్రాజ్య దత్తం చేస్తామని ఆశపెట్టినా వదులుకోరు. క్లుప్తంగా చెప్పాలంటే "జీవితం మాంసం కన్నా అధికమైంది".

కాంగ్రెసు హిందువుల సంస్థ అని కాదని చెప్పి లాభం లేదు. హిందువులే అధికంగా ఉన్న సంస్థ హిందువుల మనస్సుల ఆశయాలను మాత్రమే ప్రతిబింబిస్తుంది. రాజకీయాలలో కాంగ్రెసు చాలా గౌరవంగా వ్యవహరిస్తున్నది. హిందూ మహాసభ మొరటుగా వ్యవహరిస్తోంది. రెండింటి మధ్యగల భేదం ఇదే. ఈ భేదం తప్ప కాంగ్రెసు హిందూ మహాసభల మధ్య మరెలాంటి భేదమూ లేదు.

ఇదే విధంగా పాలకులు, పాలితుల విభేదాన్ని కాంగ్రెసు పాటించటం లేదని చెప్పటంలో కూడా ఫలితమేమీ లేదు. ఒకవేళ ఇదే నిజమైనట్లయితే కాంగ్రెసు ఇతర మైనారిటీలను తనతో సమాన భాగస్తులుగా గుర్తించగలిగే వినమ్రతను, చిత్తశుద్ధిని రుజువు చేసుకోవాల్సి వుంది. అలా

గుర్తించినట్లు దాఖలా ఏమిటి? నాకు ఒకే పరీక్ష కన్పిస్తుంది. ఇతర మైనారిటీల ప్రతినిధులతో కలిసి అధికారం పంచుకోవటానికి కాంగ్రెసు ఒప్పుకోవాలి. అలాంటి దానికి కాంగ్రెసు సిద్ధమేనా? ప్రతివారికి దానికి సమాధానమేమిటో తెలుసు. తనకు విధేయత చూపనటువంటి వర్గాల ప్రతినిధులతో అధికార భాగస్వామ్యానికి కాంగ్రెసు సిద్ధంగా లేదు. అధికార భాగస్వామ్యం కావాలంటే ముందుగా కాంగ్రెసుకు విధేయం గా ఉండాలి. కాంగ్రెసుకు విధేయంగా ఉండని వర్గాన్ని రాజకీయ అధికారానికి దూరంగా ఉంచాలన్నదే కాంగ్రెసు సిద్ధాంతంలాగా కనిపిస్తోంది.

రాజకీయ అధికారం లేకపోవటమే పాలక పాలితులజాతుల మధ్య విభేదానికి ప్రధాన కారణం. అధికారంలో ఉన్నప్పుడు కాంగ్రెసు ఈ సూత్రానికే కట్టుబడి ఉంది. ఇప్పటికే తాము చాలా బాధలు పడ్డామని ముస్లిములు అంటున్నారు. పాలితజాతిగా మారటం చిట్టచివరి దెబ్బగా ముస్లిములు భావిస్తున్నారు. భారతదేశాన్ని బ్రిటిషువారు ఆక్రమించటం మొదలు పెట్టగానే ముస్లిముల వినాశనం ప్రారంభం అయింది. కార్య నిర్వహణ, పాలన, న్యాయశాస్త్ర రంగాల్లో బ్రిటిషువారు ప్రవేశపెట్టిన ప్రతిమార్పూ ముస్లిములను క్రమంగా దెబ్బతీశాయి. పౌరన్యాయం విషయంలో హిందూ న్యాయాన్ని అనుసరించడానికి భారతదేశపు ముస్లిం పాలకులు అనుమతించారు. కాని వారు హిందూ శిక్షాస్మృతిని అనుమతించటం లేదు. ముస్లిం పాలకులు, హిందువులకు ముస్లిములకు ముస్లిము శిక్షాస్మృతినే అమలు జరిపారు. ముస్లిము శిక్షాస్మృతిని బ్రిటిషు ప్రభుత్వం మొదటగా సంస్కరించటం ప్రారంభించి మెకాలే పీనల్‌కోడ్ మార్పులను పూర్తి చేసింది. భారతదేశంలోని ముస్లిముల గౌరవప్రపత్తుల స్థాయికి ఇది మొదటి విఘాతం. దీని తరువాత ముస్లిం పౌరన్యాయాన్ని, షరియత్‌ను అమలు పరచటాన్ని క్రమంగా తగ్గించి వేశారు. వ్యక్తిగత సంబంధాలైన వివాహం, వారసత్వం విషయాల్లోనే షరియత్ ముస్లిం న్యాయాన్ని వాడటాన్ని బ్రిటిషువారు అనుమతించారు. దీంతోబాటుగా 1837లో పర్షియా భాషను కోర్టు వ్యవహారాల భాషగా మార్చివేసి, దాని స్థానంలో ఇంగ్లీషునూ ఇతర ప్రాంతీయ భాషలనూ ప్రవేశపెట్టారు. ఆ తరువాత ఖాజీల వ్యవస్థను రద్దు చేశారు. దీనితో ముస్లిం పాలకుల కాలంలో షరియత్‌ను అమలు చేసిన ఖాజీల వ్యవస్థ రద్దు అయింది. వారి స్థానంలో న్యాయవాదులు, న్యాయమూర్తుల నియామకం ప్రారంభం అయింది. అలాంటివారు ఏ మతానికి చెందిన వారైనా ముస్లిం న్యాయాన్ని అన్వయిస్తూ తీర్పులను చెప్పే అధికారాన్ని దాఖలు పరిచారు. ఇవన్నీ ముస్లిముల బాధలను పెంచాయి. ఫలితంగా ముస్లిములు తమ స్థాయి పోయిందనుకున్నారు. వారి న్యాయశాస్త్రం పనికిరానిదైంది. వారి భాషను, విద్యను పక్కకు నెట్టివేశారు. వీటితోపాటు సింధ్, ఔధ్ సంస్థానాలను బ్రిటిషువారు కలిపివేసుకోవడం, సిపాయిల తిరుగుబాటు ముస్లిముల స్థాయికి విఘాతం కల్గించాయి. సిపాయిల తిరుగుబాటు వల్ల ముస్లిం ఉన్నత వర్గాలవారు మరీ బాధపడ్డారు. వారు సంపదను కోల్పోవటమే గాకుండ,ఆ తిరుగుబాటులో పాల్గొన్నందుకు శిక్షలు కూడా అనుభవించాల్సి ఉంది. తిరుగుబాటు తర్వాత పెద్దా, చిన్న ముస్లిములందరూ తమ స్థాయిని కోల్పోయి కింది స్థాయికి దిగారు. వారి గౌరవం

అంతరించింది. గౌరవం, విద్య, విధుల లేమితో వారు హిందువులను ఎదుర్కోవాల్సి వచ్చింది. రెండు మతాల మధ్య పోరాటంలో బ్రిటిషు వారు తటస్థ్యాన్ని ప్రదర్శించారు. ఈ పోరాటంలో ముస్లిముల స్థితి మరింతగా దిగజారిపోయింది. బ్రిటిషువారు భారతదేశాన్ని పూర్తిగా జయించటంతో హిందువుల ముస్లిముల స్థితిగతుల్లో చాలా విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. దాదాపు అయిదువందలేండ్లు ముస్లిములు భారతదేశపు హిందువులను పాలించారు. బ్రిటిషు వారి విజయంతో ముస్లిముల స్థాయి, హిందువుల స్థాయికి సరి సమానం అయింది. పాలకుల నుండి తోటి పాలితుల స్థాయికి ముస్లిములు చేరుకున్నారు. హిందువులను పాలించే స్థాయి నుండి, హిందువులతో సమానంగా పాలితుల స్థాయికి చేరుకోవడం వాస్తవంలో చాలా అవమానకరమైనది. ఇలాంటి అవమానాల నుండి తప్పించుకోవటానికి ప్రత్యేకమైన స్వతంత్ర ముస్లిం రాజ్యాలు ఏర్పడాలని ముస్లిములు కోరటం అస్వాభావికమా?

## పాకిస్తాన్‌కు వ్యతిరేకంగా హిందువుల వాదం

పాకిస్తాన్ ప్రణాళికను వ్యతిరేకించే హిందువుల ఆలోచనలకు మూడు కారణాలను పేర్కొనవచ్చు. వాళ్ళ అభ్యంతరాలు :

1. అది భారతదేశ సమైక్యతకు భంగం కలిగించి రెండుగా విభజిస్తుంది కాబట్టి;

2. అది భారతదేశ రక్షణ పాటవాన్ని బలహీన పరుస్తుంది కాబట్టి;

3. మత సమస్యా పరిష్కారంలో విఫలమౌతుంది కాబట్టి;

ఈ అభ్యంతరాల్లో ఏదైనా సత్తా ఉందా? ఆ అభ్యంతరాల సత్తాను పరిశీలించటమే ఈ భాగం లక్ష్యం.

# ఏకతా విచ్ఛిన్నం

భారతదేశ సమైక్యత నాశనమౌతున్నదన్న అభియోగం చేయడానికి ముందు, హిందువులు వారు కోరుతున్న సమైక్యత ఉన్నదా అన్న విషయాన్ని రూఢి పరచుకోవాల్సి ఉంది. పాకిస్తాన్ హిందుస్తాన్‌ల మధ్య ఎలాంటి ఐక్యం ఉంది?

ఐక్యం ఉన్నదంటున్న హిందువులు, భారతదేశం నుండి విడిపోవాలంటున్న ముస్లిముల ప్రాంతాలు ఎల్లప్పుడూ భారతదేశంలో అంతర్భాగంగానే ఉన్నాయంటున్నారు. ఇది చారిత్రక సత్యం. ఇందులో ఎలాంటి సందేహమూ లేదు. చంద్రగుప్తుడు పాలించిన రోజుల్లో ఇవి భారత దేశంలోని ప్రాంతాలే. ఏడవ శతాబ్దంలో భారతదేశాన్ని సందర్శించిన చైనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ కాలంలో కూడా ఇవి భారతదేశంలోని అంతర్భాగాలే. హుయాన్‌త్సాంగ్ తన దినచర్య పుస్తకంలో భారతదేశం ఐదు విభాగాలుగా ఉన్నదని రాశాడు. ఆయన భాషలో అవి "అయిదు ఇండీలు". 1) ఉత్తర భారతం, 2) పశ్చిమ భారతం, 3) మధ్యభారతం, 4) తూర్పు భారతం, 5) దక్షిణ భారతం. ఈ ఐదు విభాగాల్లో 80 ్యలు ఉండేవి. హుయాన్‌త్సాంగ్ ప్రకారం ఉత్తర భారతంలో పంజాబు, కాశ్మీరు దానిని ఆనుకుని ఉన్న పర్వత ప్రాంతాలు, సింధూనదికి ఆవల తూర్పు ఆఫ్ఘనిస్తాన్ మొత్తం, సరస్వతీ నదికి పశ్చిమాన గల ప్రస్తుతపు 'సిస్, సట్లెజ్ రాజ్యాలు, కాబూలు, జలాలాబాద్, పెషావర్, ఘజనీ బన్నూ జిల్లాలు ఉండేవి. ఇవన్నీ కపిసరాజు ఆధీనంలో ఉండేవి. కపిసరాజు హిందూ క్షత్రియుడు. ఆయన రాజధాని కాబూల్‌కు 27 మైళ్ళ దూరంలోగల చరికార్ అయి ఉండవచ్చు. పంజాబులోని తక్షశిల, శింఘాపురం, ఉరస, పూంఛ్, రాజోరి ప్రాంతాలు కాశ్మీరు రాజు అధీనంలో ఉండేవి. ముల్తాన్, శోరెకోట్‌లలో కలిసిన మైదాన ప్రాంతమంతా లాహోరుకు దగ్గరలో గల టాకీ లేక సంగల

రాజు పాలనలో ఉండేది. హుయాన్‌త్సాంగ్ భారత సందర్శన యాత్ర సందర్భంలో ఉత్తర భారతపు సరిహద్దులు ఆ విధంగా విస్తరించి వున్నాయి. కాని,టాయన్బీ ఈ విధంగా వ్యాఖ్యానించారు. "ఒకప్పుడు ఉన్నటువంటి, లేదా వున్నాయీ అనుకునేటివంటి పరిస్థితులు నుంచి తీసుకున్న వాదన "చారిత్రక భావన"కి మనం హెచ్చరికగా ఉండాలి. ఆ పరిస్థితులు ఇప్పుడిక ఉనికిలో లేవు. అలాంటి వాటిని ఈ పరమోదాహరణల ద్వారా చాలా సులభంగానే చూపించవచ్చు. ఒకప్పుడు ట్రిపోలీ రోమన్ సామ్రాజ్యంలో ఉండేది కనుక ట్రిపోలీని ఆక్రమించుకోవడాన్ని తమ మాతృభూమికి చెందిన ప్రాంతాన్ని పునరాక్రమించుకోవటంగా ఇటాలియన్ పత్రికలు ప్రచురించాయి. ఒక ప్రక్క క్రీ.పూ. నాల్గవ శతాబ్దపు అలెగ్జాండర్ పాలిత భాగంలో పెల్లా ప్రాంతం ఉన్నందున మాసిడోనియా ప్రాంతాన్ని గ్రీకులు తమదేనని అంటున్నారు. మరోపక్క క్రీ.శ. పదవ శతాబ్దపు బల్గేరియన్ జారు వంశీకుల రాజధాని అయిన ఓక్రిడా ప్రాంతాన్ని తమదని బల్గేరియన్లు వాదిస్తున్నారు. గతమంతా కాలగర్భంలో కలిసిపోయినప్పటికీ ఎవరూ తమ తమ వాదనలను ఉపసంహరించుకొనేటట్లు లేరు".

ఇలాంటి తర్కమే మనం కూడా అన్వయించుకొంటున్నాం. మనదేశంలో కూడా ఒకప్పటి పరిస్థితుల ఆధారంగా వాదవివాదాలు పెరుగుతున్నాయి. ఆనాడున్న పరిస్థితులు ఇవాళ లేవన్న విషయాన్ని విస్మరిస్తున్నారు. హుయాన్‌త్సాంగ్ వెళ్ళిపోయాక ఒక వెయ్యేళ్ళ కాలం నాటి చరిత్ర రచనలో నమోదు చెయ్యాల్సిన తర్వాతి యదార్థ విషయాల్ని పరిగణనలోకి తీసుకోకుండా వదిలేస్తున్నాం.

హుయాన్‌త్సాంగ్ వచ్చినప్పుడు ఒక్క పంజాబే గాకుండా నేటి ఆఫ్ఘనిస్తాన్ ప్రాంతం కూడా భారతదేశం అంతర్భాగంగా ఉండేది. పంజాబు, ఆఫ్ఘనిస్తాన్‌ల ప్రజలు మతపరంగా వేద, బౌద్ధ మతాలకు చెందినవారే. హుయాన్‌త్సాంగ్ భారతదేశాన్ని వదిలి వెళ్ళాక ఏం జరిగింది?

వాయవ్య ప్రాంతం నుండి భారతదేశం పైకి ముస్లిం గుంపులు దండయాత్ర చేయడం చాలా ప్రధానమైన సంఘటనగా పేర్కొనవచ్చు. మహ్మద్‌బిన్ ఖాసిం నాయకత్వంలో భారతదేశం పైకి మొదటి ముస్లిం దండయాత్ర జరిగింది. ఇది క్రీ.శ. 711లో జరిగింది. వారు సింధు ప్రాంతాన్ని జయించారు. ఎందుచేతనంటే మొదటి ముస్లిం దండయాత్ర తర్వాత వాళ్ళు దేశంలో శాశ్వతంగా స్థిరపడలేదు. దండయాత్రకు ఆజ్ఞ ఇచ్చిన బాగ్దాదులోని ఖలీఫాకు సుదూర సింధూ ప్రాంతంలోగల తమ ప్రత్యక్ష అధికారాన్ని తొమ్మిదవ శతాబ్దపు మధ్యకాలానికి ఉపసంహరించుకొన్నారు. ఈ అధికార ఉపసంహరణ తరువాత 1001 సంవత్సరంలో మహ్మద్ ఘజనీ దండయాత్రలు ప్రారంభమయ్యాయి. 1030లో ఘజనీ చనిపోయినా, 30 సంవత్సరాల కాలంలో ఆయన 17సార్లు భారతదేశం పైకి దండెత్తి వచ్చారు. ఆయన తరువాత 1173లో మహ్మద్ ఘోరీ భారతదేశంపై దండయాత్రలు ప్రారంభించారు. ఒక ముప్పై సంవత్సరాల పాటు భారతదేశాన్ని దోచుకున్నారు. ఆ తరువాత చెంఘిజ్‌ఖాన్ నాయకత్వంలో మొఘలు

గుంపులు భారతదేశం రావటం ఆరంభమైంది. అవి మొదట 1221లో ఆరంభమయ్యాయి. అప్పట్లో వారు కేవలం భారతదేశపు సరిహద్దుల్లోకి వచ్చారు. కాని దేశం లోపలికి చొచ్చుకొని రావటానికి వారు సాహసించలేదు. ఇరవై సంవత్సరాల తర్వాత వారు లాహెూర్ పై దండెత్తి జయించారు. వారి దండయాత్రలన్నింటిలోకీ మహా భీకరమైంది 1398లో తైమూరు నాయకత్వంలో జరిగినటువంటిది. ఆ తరువాత 1526లో భారతదేశం పైకి బాబరు దండెత్తి వచ్చారు. బాబరు రాకతో భారతదేశంపై దండయాత్రలు నిలిచిపోలేదు. ఆ తరువాత మరో రెండుసార్లు భారతదేశంపై దండయాత్రలు జరిగాయి. 1738లో నాదిర్షా పంజాబుపై సముద్రపు హెూరులాగా దండెత్తి వచ్చారు. ఆయన తరువాత 1761లో అహ్మద్ షా అబ్దాలి మూడవ పానిపట్టు యుద్ధంలో, మళ్ళీ దేశంలో హిందువుల ప్రభుత్వం తల ఎత్తలేని రీతిలో మహారాష్ట్రులను, మరాఠీలను ఓడించారు. ఆ విధంగా భారతదేశంలో హిందువులు తమ అధికారాన్ని ముస్లిములకు ధారాదత్తం చేయాల్సి వచ్చింది.

కేవలం దోపిడీ, యుద్ధ విజయాల కోసమే ముస్లిం దండయాత్రలు ప్రారంభం కాలేదు. వాటి వెనుక మరొక లక్ష్యం ఉంది. సింధూనది ఓడరేవుల్లో ఒకటైన దేబుల్ దగ్గర పట్టుకున్న అరబ్బుల సేనలను విడుదల చేయించి సింధురాజును శిక్షించే ఉద్దేశ్యంతో మహ్మద్ బిన్ ఖాసిం సింధూ ప్రాంతంపై దండయాత్ర ప్రారంభించారు. బహు దేవతోపాసన, విగ్రహారాధనగల హిందువులపై దాడి చేసి భారతదేశంలో ఇస్లాం మతాన్ని స్థాపించటం కూడా వారి ఉద్దేశ్యమనే విషయంలో ఎలాంటి సందేహం లేదు. హజ్జాజ్‌కు పంపించిన సందేశాలలో ఒకదానిలో మహ్మద్ బిన్ ఖాసిం ఇలా పేర్కొన్నారు. "దహిరరాజు మేనల్లుడిని ఆయన యోధులను, ఉద్యోగులను బంధించాం. ద్రోహులను ఇస్లాం మతంలోకి మార్చాం. విగ్రహాలను ధ్వంసం చేశాం. దేవతా విగ్రహాలు గల దేవాలయాలకు బదులు మసీదులు, ఇతర ప్రార్థనా స్థలాలను నెలకొల్పాం. కుత్బా చదివాం. ప్రార్థనాపరులకు పిలుపు ఇచ్చాం. నిర్ణీత సమయాల్లో ప్రార్థనలు జరిగేటట్లు చేశాం. ప్రతీరోజూ ఉదయం, సాయంకాలం తక్బీరు, భగవంతుని కీర్తనలు సాగేటట్లు చేశాం".

రాజు శిరస్సుతో పాటు పంపిన పై సందేశాన్ని అందుకొని హజ్జాజ్ కింది విధంగా జవాబిచ్చారు.

"అందరికీ రక్షణ కల్పించాల్సింది. శత్రువులు, మిత్రులు, చిన్నా, పెద్దా తారతమ్యం చూడవద్దు. మతద్రోహులను బ్రతకనీయవద్దు. వారి గొంతుకలు కోసి వేయాలన్నదే భగవద్వాక్యం. దీనినే భగవంతుని ఆజ్ఞగా భావించాల్సింది. రక్షణ ఇవ్వటంలో సదా సంసిద్ధంగా ఉండటం వల్ల నీ పని చాలా ముందుకు సాగుతుంది. నీవారిపై తప్ప శత్రువులపై ఎలాంటి దయాదాక్షిణ్యాలు చూపించవద్దు".

మహ్మద్ ఘజనీ తాను భారతదేశంపై చేసిన దండయాత్రలన్నింటిని పవిత్ర యుద్ధాలుగా

భావించాడు. మహ్మద్ ఘజనీ చరిత్రకారుడైన 'అల్‌ఉర్బీ' ఆయన దండయాత్రలను ఈ విధంగా వర్ణించాడు.

"విగ్రహాలున్న దేవాలయాలన్నింటిని పడగొట్టారు. ఇస్లాం మతాన్ని స్థాపించారు. నగరాలను ఆక్రమించారు. అపవిత్రులనూ, విగ్రహారాధకులనూ నిర్మూలించారు. ముస్లిములు గర్వపడేటట్లుగా వ్యవహరించారు. ఆ తరువాత స్వదేశం చేరుకుని ఇస్లాం మత వ్యాప్తికి చేసిన కృషిని సవివరంగా వివరించారు. ప్రతి సంవత్సరం భారతదేశంపై పవిత్రయుద్ధం చేయటానికి ఘజనీ ప్రతినబూనారు".

మహ్మద్ ఘోరీ దండయాత్రలలో కూడా మనకు ఆయనలో ఇలాంటి పవిత్ర ఉద్దేశ్యమే గోచరిస్తుంది. ఘోరీ చేపట్టిన కార్యకలాపాలను ఘోరీ చరిత్రకారుడైన హసద్‌నిజామీ ఈ కింది విధంగా వర్ణించారు.

"హిందుస్తాన్‌పై పవిత్ర యుద్ధం జరపటమే నా దండయాత్రల ప్రధాన లక్ష్యం. బహుదేవతల కాలుష్యం, విగ్రహారాధనల అపవిత్రత నుండి దేశానికి విమోచన కలిగించడమే ఆయన లక్ష్యం. ఆయన దండయాత్రల తర్వాత ఒక్క దేవాలయం కూడా మిగల్లేదు.

తైమూరు తన జ్ఞాపకాలలో భారతదేశంపై ఎందుకు దండయాత్రలు చేశారో వివరించారు:

"అపవిత్రులకు వ్యతిరేకంగా యుద్ధం చేసి వారిని మహ్మద్ ఆజ్ఞాపించిన మతస్థులుగా మార్చటమే నా హిందుస్తాన్ దండయాత్రల లక్ష్యం. దేవాలయాలను, విగ్రహాలను ధ్వంసం చేసి, విగ్రహారాధన విశ్వాసాల నుండి, బహు దేవతల బాధల నుండి విముక్తి కలిగించటమే లక్ష్యం. పర్యవసానంగా దేవుడి ముందు మనమందరం ఘాజీలుగాను, ముజిహిద్‌లుగాను, సహోదరులు గాను, మత రక్షకులుగానూ వుంటాం".

భారతదేశంపై ముస్లిములు జరిపిన దండయాత్రలను ఒక రకంగా ముస్లిముల మధ్య యుద్ధాలుగా భావించవచ్చు. దేశంపై దండయాత్రలు జరిపిన వారందరినీ ముస్లిములుగా భావించటం వల్లనే యథార్థం మరుగున పడింది. వాస్తవంలో వీరిలో తార్తర్‌లు, ఆఫ్ఘనులు, మంగోలులు ఉన్నారు. మహ్మద్‌ఘజనీ తార్తారు, మహ్మద్ ఘోరీ, ఆఫ్ఘను దేశస్థుడు; తైమూరు మంగోలు దేశస్థుడు; బాబర్ తార్తార్; నాదిర్షా, మహ్మద్‌షా అద్దాలీలు ఆఫ్ఘనులు. భారతదేశంపై దండయాత్ర జరపటంలో ఆఫ్ఘనులు తార్తారులను నిర్మూలించ నిశ్చయించారు. తార్తారులు ఆఫ్ఘనులకు వ్యతిరేకంగా వ్యవహరించారు. వారంతా పరస్పరం ఆత్మీయతలు గల ఒక కుటుంబానికి చెందినవారుగా వ్యవహరించలేదు. వారిలో ఇస్లాం మత సౌభాతృత్వం బాగా పెరగలేదు. వారు పరస్పరం బద్ధ వ్యతిరేకులు. వారి మధ్య తరచూ పరస్పర విధ్వంసానికి యుద్ధాలు జరుగుతుండేవి. వారి మధ్య వ్యతిరేకతలు, శత్రుత్వాలూ ఉన్నప్పటికి, వారంతా హిందూ మత విశ్వాసాల నిర్మూలనాన్ని ధ్యేయంగా పెట్టుకున్నారన్న విషయాన్ని మనం

గుర్తుంచుకోవాలి. భారతదేశంపై దండయాత్ర చేసినవారు ఉపయోగించిన పద్ధతులు, ఆ తరువాత జరిగిన చరిత్ర విషయంలో ప్రాముఖ్యం లేనివిగావు. మహ్మద్ బిన్ కాసిం తన మతావేశాన్ని ప్రదర్శించటానికి ప్రథమ సాక్ష్యంగా డియోల్ నగరంలో తాను బందీలుగా పట్టుకున్న బ్రాహ్మణుల నందరినీ బలవంతంగా సున్తీ చేయించారు. అలా సున్తీ చేయించటాన్ని బ్రాహ్మణులు నిరాకరించారన్న విషయాన్ని తెలుసుకొన్న మహ్మద్ బిన్ కాసిం 17 సంవత్సరాలు పై బడ్డ వారినందరినీ చంపించివేశారు. తక్కిన స్త్రీలు, పిల్లలు, పురుషులను బానిసలుగా మార్చారు. హిందూ దేవాలయాల్ని దోచుకున్నారు. దేవాలయపు సంపదలోని అయిదోవంతును న్యాయ సమ్మతమైన ప్రభుత్వ భాగంగా గ్రహించి మిగతా దానిని సైనికులు తమ మధ్య సమంగా పంచుకొన్నారు.

హిందువులకు భీతి కలిగించే పనుల్ని మొదట మహ్మద్ ఘజనీ చేపట్టారు. 1001 సంవత్సరంలో రాజా జయపాల్ ఓటమి తరువాత ఆయనను నడివీధిలో ఊరేగిస్తూ నడిపించారు. అలా నడిపించి అవమాన పరచటాన్ని ఆయన కుమారులు, సామంతులు వీక్షించారు. అపవిత్రుల మనస్సులలో ఇస్లాం మతం పట్ల భక్తిశ్రద్ధలు పెరుగుతాయని భావించటం జరిగింది.

అపవిత్రులను చంపటమనే విషయం మహ్మద్‌కు చాలా సంతోషం కలిగించింది. 1019లో చాంద్‌రాయ్ పై చేసిన దండయాత్రలో ఆయన చాలామంది అపవిత్రులను చంపించారు. కొందరిని ఖైదీలుగా తీసుకొని వెళ్ళారు. అపవిత్రులను సంహరించటం పూర్తయ్యే దాకా ముస్లిములు సంపదను కొల్లగొట్టే విషయంపైకి తమ దృష్టిని మరల్చలేదు. హిందువుల సైన్యాలకు చెందిన ఏనుగులు హిందూ మత విశ్వాసాలను వదులుకొని స్వచ్ఛందంగానే వచ్చి మహ్మద్ సైన్యంలో చేరాయని చరిత్రకారులు అతిశయోక్తులు రాశారు.

చాలా సందర్భాల్లో బీహారుపై మహ్మద్ భక్తియార్ ఖిల్జీ విజయం మాదిరీ హిందువుల నరమేధం వల్ల దేశంలోని హిందువుల సంస్కృతికి కొంత విఘాతం కలిగిన మాట వాస్తవమే. మహ్మద్ భక్తియార్ ఖిల్జీ బీహారులోని నద్దియార్‌ను ఆక్రమించినప్పటి విషయాలను **తబాఖాత్ ఇనాసిరిలో** ఈ విధంగా వివరించారు.

"విజేతలు విపరీతమైన విధ్వంసం చేశారు. నగరంలో చాలామంది ముండిత శిరస్కులైన బ్రాహ్మణులు. వాళ్ళందరినీ చంపించారు. చాలా గ్రంథాలు దొరికాయి – కాని వాటిలో ఉన్న విషయాలను, బ్రాహ్మణులందరూ చనిపోవటం వల్ల ఎవ్వరూ వివరించలేక పోయారు. నగరం, కోట అధ్యయన కేంద్రాలు."

ఈ విషయంలో సాక్ష్యాధారాలను క్లుప్తీకరిస్తూ డా॥ టైటస్ ఈ విధంగా వివరించారు. "దేవాలయాలు, విగ్రహాల విధ్వంసం విషయంలో మనకు చాలా సాక్ష్యాధారాలు ఉన్నాయి. మనం ఇదివరకే గమనించినట్లుగా మహ్మద్ బిన్ ఖాసిం సింధ్‌లో ఒక క్రమపద్ధతిలో విధ్వంస

కాండను జరిపారు. కాని ఆయన మూల్తాన్‌లో గల దేవాలయాన్ని మాత్రమే విడిచిపుచ్చారు. ఆ దేవాలయానికి లభించే ఆదాయం ఆకర్షణీయంగా ఉండేది. ఆ దేవాలయాన్ని సందర్శించే యాత్రికులు విగ్రహాలకు చాలా కానుకలు చెల్లించేవారు. ఆ విగ్రహం మెడ చుట్టూ గోమాంసం తగిలించి తన కసి తీర్చుకున్నాడు. కాని దేవాలయాన్ని ధ్వంసం చేయలేదు.

మినహాజ్ ఇసిరాజ్ మరింతగా వివరించారు. 'దాదాపు వెయ్యి దేవాలయాలు ధ్వంసం చేసిన కీర్తి మహ్మద్‌ది. సోమనాధ్‌లోని దేవాలయాన్ని ధ్వంసం చేసి, విగ్రహాన్ని విరగ్గొట్టి దోచుకున్నారు. విరగ్గొట్టిన విగ్రహాన్ని నాలుగు ప్రాంతాలలో విసిరి వేశారు. గజనీలోని జామె మసీదులో ఒక భాగాన్ని, తన రాజసౌధపు సింహద్వారం ముందు ఒక భాగాన్ని, మూడో భాగాన్ని నాలుగో భాగాన్ని మక్కా మదీనాలకు పంపారు. ప్రతి సంవత్సరం భారతదేశంలోని అపవిత్రత నిర్మూలన కొరకు దండయాత్రలు చేస్తానని మహ్మద్ ఘజనీ ప్రతిజ్ఞ చేశాడని లేన్‌పూలే అన్నారు. సోమనాధ దేవాలయం ధ్వంసమయ్యేదాకా ఆయన నిద్రపోలేదు. దానికోసం ఆయన తన వృద్ధాప్యంలో కూడా కష్టమైన ఎడారి దారిన మూల్తాన్ నుండి అనహాల్ వరకూ తీరం వెంట యుద్ధం చేస్తూ ప్రయాణించి సుప్రసిద్ధ దేవాలయాన్ని చేరుకున్నాడు;

"లక్షలాది యాత్రికులు అక్కడకు చేరేవారు. వెయ్యిమంది బ్రాహ్మణులు దేవాలయంలో పూజలు చేసేవాళ్ళు. ఆభరణాలను సంపదను రక్షించేవారు. వందలాది నర్తకీమణులు, గాయకులు దేవాలయ సింహద్వారం ముందు నిలిచి గానం చేస్తూ, నృత్యాలు చేసేవారు. ఆ దేవాలయంలో మణులు, వజ్రాలు, రత్నాలు పొదిగిన పొడవాటి శివలింగం ఉండేది. దేవాలయ ప్రాకారాన్ని సంరక్షిస్తున్న వేలాది బ్రాహ్మణులు విశ్వాసహీనులైన ముస్లిములు నిర్భయంగా సోమనాధ దేవాలయం పైకి దండెత్తి రావడాన్ని ఆశ్చర్యంగా చూస్తూ, సోమనాధుడే వారిని శిక్షిస్తాడని భావించేరు. ముస్లిం సైనికులు నిర్భయంగా దేవాలయ ప్రాకారపు గోడలు ఎగబ్రాకి దేవాలయంలో చొరబడ్డారు. తన సేవకుల ప్రార్థనలను వినకుండా దేముడు మూగవాడయ్యాడు. అప్పుడు జరిగిన పోరులో దాదాపు 50 వేలమంది హిందువులు తమ మత విశ్వాస రక్షణలో అసువులు కోల్పోయారు. దేవాలయంలోకి చొరబడ్డ ముస్లిములు ఆనందోత్సాహాలతో అపవిత్రం చేసి దేవాలయ సంపదను దోచుకున్నారు. లింగాన్ని పడగొట్టి ముక్కలు ముక్కలుగా చేసి ఆ ముక్కలను విజేత భవనానికి తరలించారు. దేవాలయ ద్వారాలను పెకలించుకొని పోయి ఘజనీలో నెలకొల్పారు. విగ్రహాలను విధ్వంసం చేసిన వారు దేవాలయపు ఆహార సంపదను ఆనందోత్సాహాలతో పంచుకున్నారు."

మహ్మద్ ఘజనీ చేసిన ఘనకార్యం చాలా పవిత్రతను సంతరించుకుంది. ఆ సంప్రదాయాన్ని, ఆయన తరువాత భారతదేశంపైకి దండెత్తి వచ్చినవారు అనుసరించారు. డా॥ టైటస్ మాటల్లో :

"మహ్మద్ ఘజనీ తరువాత భారతదేశంపైకి దండెత్తి వచ్చిన వారిలో మహ్మద్ ఘోరీ

ఒకరు.. అజ్మీర్ పై జరిపిన దండయాత్రలో దేవాలయాలను పునాదులతో సహా పెకలించి వేశారు. దేవాలయాల స్థానాల్లో మసీదులు నిర్మించాడు. ఇస్లాం మత సిద్ధాంతాలను, ఆచార సాంప్రదాయాలను ప్రతిష్టించాడు. ఢిల్లీ నగరం, దాని పరిసరాల్లోని దేవాలయాలన్నింటినీ ధ్వంసం చేశాడు. విగ్రహాలను పగులగొట్టాడు. విగ్రహారాధన లేకుండా చేశాడు. దేవాలయాల స్థానాల్లో మసీదులు నిర్మించాడు."

"కుతుబుద్దీన్ ఐబక్ కూడా దాదాపు వేయి దేవాలయాలను ధ్వంసం చేశాడు. వాటి పునాదులపై మసీదులు నిర్మించాడు. ఇదే రచయిత కుతుబుద్దీన్ ఐబక్ ఢిల్లీలోని జామామసీదును నిర్మించాడన్నాడు. దేవాలయాల విధ్వంసం వల్ల లభించిన శిల్పాలతోనూ, స్వర్ణాభరణాలతోనూ మసీదులో అలంకరించారు. దేవాలయాల సత్వర విధ్వంసానికి ఏనుగులను ఉపయోగించారు. దేవాలయాల రాళ్ళను పెకిలించి, మసీదు నిర్మాణానికి ఉపయోగించి వాటిపై ఖురాన్ సూక్తులను చెక్కించారు. ఢిల్లీ జామామసీదు తూర్పు ద్వారానికి ఎదురుగా వున్న 27 దేవాలయాలను పడగొట్టించి వాటి రాళ్ళను మసీదును నిర్మించడానికి ఉపయోగించారన్న విషయాన్ని శాసనాలు కూడా చాటుతున్నాయి. "జామా మసీదుకు కుతుబుద్దీన్ నిర్మించిన మినారుకు ప్రతిగా రెండవ మినారును నిర్మించాలన్న ఉత్సాహంతో అల్లావుద్దీన్ పర్వతాల నుండి రాళ్ళు తెప్పించటంతో పాటు, దేవాలయాలను ధ్వంసం చేసి కూడా రాళ్ళను తెప్పించాడని అమీర్ ఖుస్రూ చెప్పారు. ఆయన దక్షిణ దేశ దండయాత్రలలో, ఉత్తర హిందుస్తాన్‌లో తన ముందు తరం వాళ్ళు చేసినట్టే అల్లావుద్దీన్ దేవాలయాలను ధ్వంసం చేశాడు".

సుల్తాన్ ఫిరోజ్ షా రాసిన "ఫుల్‌హాత్"లో ఆయన దేవాలయాలు పునర్నిర్మించ తలపెట్టిన హిందువుల పట్ల ఎలా వ్యవహరించారో వివరించారు. విగ్రహారాధనను సహించరాదన్న ప్రవక్త ప్రవచించిన సూక్తుల ప్రకారం ఢిల్లీ పరిసరాలలో గల దేవాలయాలన్నింటినీ ధ్వంసం చేయించాడు. ఎదురు తిరిగిన హిందూ మతస్థులను వధించాడు. విగ్రహారాధన నిలిచిపోయేదాకా ఈ కార్యక్రమాన్ని సాగించాడు. దేవుని దయవల్ల ముసల్మానులు తమ భగవంతుని నిశ్చలంగా ప్రశాంతంగా ప్రార్థించుకోగల్గుతున్నారన్నారు.

షాజహాను కాలంలో కూడా హిందువులు పునర్ నిర్మించుకో తలపెట్టిన దేవాలయాలన్నింటినీ ధ్వంసం చేయించారన్న విషయాన్ని మనం చరిత్రలో చదువుకున్నాం. హిందువులపై జరిపిన ఈ కార్యక్రమాన్ని బాద్షానామాలో ఇలా వివరించారు.

"అక్బరు చక్రవర్తి పాలనాంతపు రోజుల్లో చాలా దేవాలయాల పునర్నిర్మాణం ప్రారంభమై పూర్తి కాలేదన్న విషయం షాజహాను చక్రవర్తి దృష్టికి తేబడిందని చరిత్రకారులు చెప్పారు. అప్పటికింకా బెనారస్ దేవాలయ పునర్నిర్మాణం పూర్తి కాలేదు. ఇప్పుడు దాన్ని పూర్తి చేయాలనుకుంటున్నారు. ఒక్క బెనారస్‌లోనే గాక తన యావత్ సామ్రాజ్యంలోనూ

పునర్నిర్మింప తలపెట్టిన దేవాలయాలన్నింటినీ కూలగొట్టమని షాజహాను ఆజ్ఞాపించారు. ఒక్క అలహాబాదు రాష్ట్రంలోని బెనారస్ జిల్లాలోనే 76 దేవాలయాలను పడగొట్టడం జరిగింది".

క్రీ.శ. 1669 ఏప్రిల్‌లో తత్తా, మూల్తాను, బెనారసు, ప్రత్యేకంగా బెనారసు పట్టణంలో బ్రాహ్మణులు అర్థం పర్థం లేని గ్రంథాలను అధ్యయనం చేయిస్తున్నారన్న సంగతిని ఔరంగజేబు తెలుసుకొన్నారు. అక్కడికి దూరప్రాంతాల నుండి హిందువులు ముస్లిములు కూడా చేరుకుంటున్నారని కూడా గ్రహించారు. హిందూ పాఠశాలలను, దేవాలయాలను ధ్వంసం చేయాల్సిందని చక్రవర్తి తన కింది సుబేదారులకు ఆజ్ఞలిచ్చాడు. విగ్రహారాధనను, మూర్ఖపు విజ్ఞానాన్ని నిలుపుదల చేయించమని ఆజ్ఞాపించాడు. బెనారస్‌లోని విశ్వనాధుని దేవాలయాన్ని ప్రభుత్వాధికారులు ధ్వంసం చేశారన్న విషయం చక్రవర్తికి నివేదించటమైంది. డా॥ టైటస్ ఈ విధంగా అన్నారు :

"మహ్మదు, తైమూరులాంటివారు విగ్రహారాధన, సంపదను కొల్లగొట్టడం, ఓడినవారిని బానిసలుగా మార్చటం, విశ్వాసహీనులను స్వర్గానికి పంపించటంలాంటి విషయాలకే ప్రాముఖ్యం ఇచ్చారు. కాని మతాంతరీకరణం పట్ల వారు శ్రద్ధ కనబరచలేదు. పాలకులు శాశ్వతంగా దేశంలో స్థిరపడినాకనే వారి దృష్టి మతాంతరీకరణం వైపు మళ్ళింది. తాము జయించిన ప్రాంతాల్లో ఇస్లాం మతాన్ని ప్రతిష్ఠించటం వారి ప్రధాన విధానమైపోయింది."

"దేవాలయాల విధ్వంసంలో మహ్మదుతో సరిసమానమైన ఖ్యాతి గడించిన కుతుబుద్దీన్ ఐబక్ 12వ శతాబ్దపు ఉత్తరార్ధ భాగంలోనూ 13వ శతాబ్దపు ఆరంభంలోనూ మతాంతరీకరణకు తన యావచ్ఛక్తిని వినియోగించాడు. ఇందుకు ఒక సంఘటనను ఉదహరించవచ్చు. 1194లో అలీఘర్ వద్ద గల కార్నల్‌కు వెళ్ళినప్పుడు అక్కడగల హిందువులలో ప్రాణభీతి కలవారు మతం మార్చుకున్నారు. మతం మార్చుకోలేని వారిని హతమార్చారు."

"మతం మార్పిడికి మరింత తీవ్రంగా చర్యలు చేపట్టిన ఉదాహరణలు కోకొల్లలు. ఈ సందర్భంలో ఫిరోజ్‌షా క్రీ.శ. 1351–1387 కాలంలోని సంఘటనలను పేర్కొనవచ్చు. ఢిల్లీ నగరంలోని ఒక బ్రాహ్మణునిపై స్వగృహంలో విగ్రహారాధన చేస్తున్నాడన్న నేరం ఆరోపించబడింది. ముస్లిం స్త్రీలను తన మతంవైపు ఆకర్షిస్తున్నాడన్న నేరాన్ని కూడా ఆరోపించారు. ఆయనను రాజస్థానానికి పిలిపించి న్యాయవాదులు, న్యాయమూర్తులు, వైద్య శిఖామణులు, పెద్దల సమక్షంలో విచారణకు నిలిపారు. ఆ బ్రాహ్మణుడు ఇస్లాం మతంలో చేరాలి లేదా ఆయనను సజీవ దహనం చేయాలని వారు తీర్పు ఇచ్చారు. ఇస్లాం మత విశ్వాసపరులు తీర్పును వినిపించారు. సరైన మార్గాన్ని అవలంబించమని ఆ బ్రాహ్మణున్ని కోరారు. కాని బ్రాహ్మణుడు నిరాకరించాడు. సుల్తాను ఆజ్ఞతో బ్రాహ్మణుని సజీవ దహనం చేశారు. సుల్తాన్ ఇస్లాం మత సూత్రాలను సడలించకుండా నిశ్చలదృష్టితో ఆజ్ఞలను జారీ చేశారని వ్యాఖ్యాతలు ఆయనను కీర్తించారు."

మహ్మదు దేవాలయాలను ధ్వంసం చేయడమే కాదు, తాను జయించిన హిందువులందరినీ బానిసలుగా మార్చారు. డా॥ లైటస్ ఈ విధంగా అన్నారు :

"ఇస్లాం దండయాత్రలు ప్రారంభమైన దినాల్లోలాగా దేవాలయాల విధ్వంసం, హిందువుల వధలాంటివే కాక ఓడినవారిని బానిసలుగా మార్చటం కూడా ఆరంభమైంది. నాయకులకు, సామాన్యులకు విజయానంతరం దొరికిన సంపదను పంచుకోవటానికి ప్రోత్సాహం లభించింది. మహ్మదు ఇస్లాం మతం కాని వారిని చంపించాడు. దేవాలయాలను ధ్వంసం చేశాడు. ఓడిపోయిన వారిని బానిసలుగా మార్చారు. సంపదను కొల్లగొట్టారు. మొదటి దండయాత్ర సందర్భంలో ఆయన చాలా సంపదను దోచుకొని వెళ్ళారు. దాదాపు 5 లక్షలమంది హిందూ స్త్రీ పురుషులను బానిసలుగా మార్చారు.

క్రీ.శ. 1017లో కనోజ్‌పై దండయాత్ర చేసిన మహ్మద్ ఖైదీలుగా తీసుకెళ్ళాడు. వాళ్ళు ఎంతమందో లెక్కపెట్టే వాళ్ళ వేళ్ళు నొప్పులు పెట్టాయి. క్రీ.శ. 1019 తరువాత ఘజనీ మధ్య ఆసియాలలో భారతీయ బానిసల అమ్మకం ఎంత సాధారణమైపోయిందీ చరిత్రకారులు ఈ విధంగా వివరించారు;

"బానిసలు ఎందురున్నారంటే ప్రతి బానిసను రెండు నుండి పది దీనారులను ఇచ్చి కొనుక్కునేవారు. ఆ తరువాత వారిని ఘజనీ తీసుకెళ్ళేవారు. దూరప్రాంతాల నుండి వర్తకులు, ఘజనీ వచ్చి కొనుక్కొనేవాళ్ళు. అందమైనవాళ్ళు, అంద విహీనులు, ఎర్రటివారు, నల్లటివారు అందర్నీ బానిసలుగా చేసి అమ్మేవారు."

క్రీ.శ. 1202లో కుతుబుద్దీన్ కలింజరును పట్టుకొన్నాడు. దేవాలయాలను ధ్వంసం చేసి మసీదులు నిర్మించాక విగ్రహారాధన రూపు మాసిపోయింది. 50 వేల మంది బానిసలుగా మారారు.

పవిత్ర యుద్ధంలో ఓడిపోయిన హిందువులందరూ బానిసలయ్యారు. యుద్ధం లేనప్పుడు కూడా ముస్లిములు అనుసరించిన పద్ధతుల వల్ల హిందువులు తమ వ్యక్తిత్వాన్ని కోల్పోయారు. 14వ శతాబ్దపు ఆరంభంలో అల్లావుద్దీన్ పాలిస్తున్న రోజుల్లో కొన్ని ప్రాంతాలలో హిందువులు ఆయనకు కష్టాలను నష్టాలను కలుగజేశారు. అందువల్ల వాళ్ళు మళ్ళీ తిరుగుబాటు చెయ్యలేని విధంగా పన్నులు విధించారు.

"హిందువులు గుర్రాన్ని ఎక్కడానికి వీలులేదు. ఆయుధాలు ఉంచుకోకూడదు. మంచి బట్టలు వేసుకోకూడదు. ఏ విధమైన విలాస జీవితం గడిపే వీలులేదు". జిజియా పన్ను విధింపును గురించి డా॥ లైటస్ ఈ విధంగా అన్నారు :

"సుల్తానులు, చక్రవర్తులు, రాజుల పాలించిన ప్రాంతాలన్నింటినూ జిజియా పన్ను చెల్లించాల్సి ఉండేది. ఈ పన్నును చాలా క్రమబద్ధంగా వసూలు చేసేవారు. కొన్ని సందర్భాలలో

పన్ను విధింపు నామమాత్రంగా ఉండేది. సార్వభౌముని శక్తినిబట్టి పన్నుల చెల్లింపులు ఉండేవి. కాని క్రీ.శ. 1665లో అక్బరు పాలనకు వచ్చిన తొమ్మిదవ సంవత్సరంలో జిజియా పన్నును రద్దు చేశారు. అప్పటికే ఎనిమిది శతాబ్దాలుగా ముస్లిములు హిందువుల నుండి పన్నును వసూలు చేస్తుండేవారు.

'లేన్‌పోల్ ఈ విధంగా అన్నారు : "తన భూమిలో తనకు లభించిన ఆదాయంలో సగం పన్ను రూపంలో ప్రభుత్వానికి చెల్లించాలి. బర్రెలు, గొర్రెలు, ఇతర క్షీరద పశువుల మీద కూడా పన్ను చెల్లించాలి. ఎకరానికి ఇంత, పశువుకు ఇంత అని ధనవంతులూ, బీదవారు సమంగా పన్నులు చెల్లించేవారు. లంచాలు తీసుకునే అధికారులను విచారణ లేకుండా పదవి నుండి తొలగించేవారు. వారికి కొరడా దెబ్బలు, వేళ్ళలో సూదులు గుచ్చటం, చేతులకు సంకెళ్ళు వేయటం, చెరసాలలకు పంపించటం లాంటి శిక్షలు విధించేవారు. కొత్తగా నిబంధనలు ఏర్పాటు అయ్యాయి. ప్రతి రెవిన్యూ అధికారి పదిమంది సంపన్న హిందూ కుటుంబాల నుండి పన్నులు వసూలు చేయాలి. వెండి, బంగారం, చివరకు తమలపాకులను హిందువులు ఉపయోగించే వీలులేదు. వారు సంపన్న ముస్లిముల ఇళ్ళలో చాకిరీ చేయాల్సి వచ్చేది. ప్లేగు వ్యాధి పీడన కన్నా, రెవిన్యూ అధికారులు వసూళ్ళు చాలా భయంకరంగా ఉండేవి. ప్రభుత్వ ఉద్యోగి కావటం కన్న మరణించటం మేలనుకునేవారు. అటువంటి వారికి ఏ హిందువూ తమ కూతుళ్ళనిచ్చి పెళ్ళి చేసేవారు కాదు."

ఆ కాలపు చరిత్రకారుడు ఈ విధంగా అన్నాడు : "ఈ నియమాలను చాలా కఠినంగా అమలు జరిపేవారు. చౌకీదారులు, ఖుద్దులు, మొకద్దములు గుర్రాలను అధిరోహించేవారు కాదు. వారికి ఆయుధాలు ఉండేవి కావు. మంచి వస్త్రాలు కూడా ధరించేవారు కాదు. తాంబూల సేవనం నిషేధం. ఏ హిందువూ తల ఎత్తుకుని తిరిగే వీలులేదు. కొరడా దెబ్బలు, చెరసాలలు, సంకెళ్ళు మొదలైన శిక్షల ద్వారా పన్నులు వసూలు చేసేవారు."

ఇదంతా కేవలం పిచ్చి అనుకోవడానికి వీలులేదు. నైతిక వక్రత అనుకోవడానికీ లేదు. జరిగినవన్నీ ఇస్లాం నాయకుల విశాల దృక్పథపు ఆమోదంలో జరిగినవే. సుల్తాన్ అల్లావుద్దీన్ అడిగిన ప్రశ్నలకు జవాబిస్తూ ఖాజీ ఇస్లాం మతంలో హిందువుల స్థానం గురించి ఇలా అన్నారు;

"వారు విధేయులు మాత్రమే. రెవెన్యూ అధికారులు వెండి అడిగితే బంగారం ఇవ్వాలి. రెవెన్యూ అధికారి మట్టి విసిరితే అది తినటానికి నోరు తెరవాలి. మట్టిని మింగాలి. నమ్రతతో పన్నును చెల్లించటంలోనూ మట్టిని మింగటంలోనూ 'ధిమ్మి'కి చూపించాల్సినంత చూపించి నట్లవుతుంది. వారిని దేవుడు చాలా హీనంగా చూస్తాడు. వారిని అలాగే చూడమని దేవుడు చెప్పాడు. హిందువులను తొక్కిపట్టి ఉంచటమనేది ముస్లిముల పరమ పవిత్రమైన విధులలో ప్రధానమైంది. వారు ప్రవక్తకు శత్రువులు. అందువల్ల వారిని వధించాలని, దోపిడీ చేయాలనీ, బానిసలుగా మార్చాలని ఆజ్ఞాపించారు. వారిని ఇస్లాం మతానికి మార్చండి లేదా చంపండి;

బానిసలను చేయండి. వారి సంపదను ధ్వంసం చేయండి 'హనిషా'లాంటి పెద్ద మతాచార్యుడే హిందువులపై జిజియా పన్ను విధించమని చెప్పారు. ఇతర ఇస్లామిక్ న్యాయశాస్త్ర కోవిదులు 'ఇస్లాం లేదా మరణం' అనేదాన్ని శాసించారు."

మహ్మదు ఘజనీ మన దేశానికి దండెత్తి వచ్చిన నాటి నుంచీ మహ్మద్ షా అబ్దాలీ మనదేశం నుండి వెళ్ళిపోయేదాకా 762 సంవత్సరాల పాటు జరిగిన చరిత్ర అది.

ఉత్తర భారతమంతా ఆర్యావర్తం అని అనటం హిందువులకు ఎంత వరకూ సమంజసం? ఒక కాలంలో ఉత్తర భారత హిందువులకు చెందినది కనుక ఎల్లకాలం వారికే చెందాలనటం ఎంత వరకూ సబబు? ముస్లిములు విడిపోవడాన్ని వ్యతిరేకించే హిందువులు, చారిత్రక మనోభావానికి కట్టుబడి ఉండేవారిని గత 762 సంవత్సరాలుగా జరిగిన వాస్తవాలను మరచిపోవా లందామా? ఈ కాలంలో ఏం జరగలేదని భావిద్దామా?

దండయాత్రల పర్యావసానాలే గాక నా ఉద్దేశ్యంలో ఉత్తర భాతరపు సాంస్కృతిక స్వభావాల్లో మార్పులు వచ్చాయి. అలా మార్పులు వచ్చిన ప్రాంతాలను పాకిస్తాన్‌గా ఏర్పరచమంటున్నారు. ఆ ప్రాంతాల్లో హిందువుల ముస్లిముల మధ్య ఐక్యత లేకపోవడమే గాక వారి మధ్య వైరి భావం నెలకొని ఉంది.

ఈ దండయాత్రల మొదట పర్యవసానం ఉత్తర భారతం తక్కిన భారతదేశం నుండి వేరు కావటం. మహ్మద్ ఘజనీ తన ఉత్తర భారత దండయాత్రల తరువాత ఉత్తర భారతాన్ని భారతదేశం నుండి వేరు చేసి ఘజనీ పట్టణం నుండి దాన్ని పరిపాలించాడు. మహ్మద్ ఘోరీ విజేతగా వచ్చి ఉత్తర భారతాన్ని తక్కిన భారతదేశంతో కలిపి మొదట లాహోరు తర్వాత ఢిల్లీ నుండి పరిపాలించాడు. అక్బరు సోదరుడైన హకీం కాబూల్, కాందహార్‌లను ఉత్తర భారతం నుండి వేరు చేశాడు. మళ్ళీ వాటిని 1738లో నాదిర్షా వేరు చేశాడు. శిఖ్ఖుల కృషి అర్థం కాకపోనట్లయితే భారతదేశం నుండి ఉత్తర భారతం మొత్తం భారతదేశం నుండి వేరయ్యేది. ఒక విధంగా ఉత్తర భారతాన్ని రైల్వే వేగనుతో పోల్చవచ్చు. దాన్ని ఏ క్షణం దేనితోనైనా కలపవచ్చు, విడదీయవచ్చు. దీనికి సమాంతరమైన ఉదాహరణగా ఆల్సెస్-లొరైన్ ప్రాంతాన్ని చెప్పవచ్చు. మొదట్లో ఆల్సెస్-లొరైన్ ప్రాంతం స్విట్జర్లాండు మరియు ఇతర దిగువ దేశాలలాగే జర్మనీకి చెంది ఉండేవి. అలా 1680 దాకా కొనసాగింది. 1680లో ఫ్రెంచివారు దాన్ని జయించి ఫ్రాన్సులో కలుపుకున్నారు. ఆ విధంగా 1871 దాకా ఫ్రాన్సులో అంతర్భాగంగా ఉంది. 1871లో జర్మనీ ఆ ప్రాంతాన్ని గెలుచుకొని తన సామ్రాజ్యంలో భాగంగా చేసుకుంది. మళ్ళీ 1918లో దానిని జర్మనీ నుండి వేరు చేసి ఫ్రాన్సులో కలిపారు. 1940లో ఫ్రాన్సు నుండి వేరు చేసి జర్మనీలో కలుపుకున్నారు.

దురాక్రమణదారులు అవలంబించిన పద్ధతులు, ఆ ప్రాంతం మీదా ప్రజల మీదా ప్రగాఢ ప్రభావాన్ని కలుగజేశాయి. హిందువులకూ ముస్లిములకూ మధ్య వైమనస్యం పెరగటం జరిగిన

పర్యవసానాల్లో మొదటిది. వైమనస్యం ఎంతవరకూ వృద్ధి చెందిందంటే ఒక వంద సంత్సరాల రాజకీయ జీవితం తరువాత కూడా మరచిపోలేనంతగా మారింది. ప్రతి దండయాత్రలో దేవాలయాలు ధ్వంసమయ్యాయి. బలవంతంగా మత మార్పిడులు జరిగాయి. మరెంతో మంది బానిసలయ్యారు. ఈ పర్యవసానాలు ముస్లిములకు గర్వకారణంగాను, హిందువులకు అవమానకరమైనవిగాను మిగిలిపోయి సదా వేధించటం లేదా? ఈ విషయాలన్నింటినీ పక్కకు నెడితే అసలు ఆటంకం భారతదేశపు వాయవ్య భాగంలోనే జరిగింది. ముస్లిం దండయాత్రలు సముద్రపు అలల్లాగా ఒకదానివెంట ఒకటి ఈ ప్రాంతాన్ని బీభత్సం చేసింది. ఆ తరువాతనే చెదురు మదురుగా తక్కిన భారతదేశంలోకి దండయాత్రల ప్రభావం పాకింది. తక్కిన భారతానికి చాలా ఆలస్యంగా చాలా తక్కువ ప్రభావాన్ని కలుగజేశాయి. దూరప్రాంతాల నుండి తిరిగి వెనక్కు మళ్ళాయి. అలా మళ్ళినప్పుడు ఆర్య సంస్కృతి ప్రబలంగా ఉన్న ఈ ప్రాంతంలో ఇస్లామిక్ సంస్కృతి నూతన మత రాజకీయ దృక్పథాన్ని ఏర్పరచింది. ముస్లిం దండయాత్రల నాయకులు హిందువులను అసహ్యించుకొంటూ వెళ్ళిపోలేదు. అలా వెళ్ళినట్లయితే మంచిగానే ఉండేది. వారు వ్యతిరేక భావంతో సంతృప్తి చెందలేదు. సంవర్ధక చర్యలు కూడా చేపట్టారు. వారు ఇస్లాం మత బీజాన్ని నాటారు. ఇస్లాం మత బీజపు వృద్ధి చాలా మంచిగా జరిగింది. అది ఎండాకాలంలో నాటిన బీజం లాంటిది కాదు. ఒక వృక్షంలాగా బలంగా ఎత్తుగా పెరిగింది. ఉత్తర భారతంలో ఇస్లాం బీజంలాగా నెలకొని మహావృక్షమైంది. ఒంద్రుమట్టి చేరి మొక్కకు బలం వచ్చినట్లుగా తరువాత జరిగిన ముస్లిం దండయాత్రలు ముస్లిం మతాభి వృద్ధికి బాగా దోహదం చేశాయి. మహావృక్షంగా ఇస్లాం మతం పెరగగా మరుగుజ్జు వృక్షాలుగా హిందూ బౌద్ధమత సంస్కృతులు మిగిలిపోయాయి. శిఖ్ఖుల బలం కూడా ముస్లిం మహావృక్షాన్ని కదిలించలేకపోయింది. యదార్థంలో శిఖ్ఖులు ఉత్తర భారతాన్ని జయించి యజమానులైనప్పటికీ మళ్ళీ ఉత్తర భారతాన్ని హుయాన్‌త్సాంగ్ కాలం నాటి హిందూ సంస్కృతికి చేరువగా తేలేకపోయారు. ఉత్తర భారతాన్ని శిఖ్ఖులు తిరిగి తక్కిన భారతదేశానికి కలిపి వేశారు. అయినప్పటికీ అది అల్సెస్-లొర్రైన్ ప్రాంతంలాగా రాజకీయంగా విడివడటానికి కలువటానికి సంసిద్ధంగా తయారైంది. ముందు చూపులేని మనిషిమాత్రమే ఈ యదార్థాలను విస్మరిస్తాడు. లేక పాకిస్తాన్ అంటే భారతదేశాన్ని రెండుగా చీల్చటమని భావిస్తాడు.

హిందుస్తాన్ పాకిస్తాన్‌ల మధ్య ఎలాంటి సఖ్యతను హిందువులు కాంక్షిస్తున్నారు? అది భౌగోళికమైన సమైక్యత అయితే అది సమైక్యత కానేకాదు. భౌగోళిక సమైక్యత పైన జాతీయతను వృద్ధి పరచటమనేది భగవంతుడు కోరినదాన్ని మానవుడు కాదనటం లాంటిది అవుతుంది. జీవన విధానం సంప్రదాయాలు లాంటి సమైక్యత కూడా సమైక్యత కాదు. అందరికీ అనువుగా ఉండే పర్యావరణం ఫలితమే అలాంటి సమైక్యత. పాలనా సమైక్యత కూడా సరియైన సమైక్యత కాదు. ఈ విషయంలో బర్మా ఒక ఉదాహరణం. అరకాకడెనా సర్రిమ్‌లను 1826 నాటి ఎండబూ సంధి ద్వారా బ్రిటిషువారు కలుపుకున్నారు. పెగూమార్తబాన్‌లను

1852లో కలుపుకున్నారు. 1886లో ఎగువ బర్మాను కలుపుకున్నారు. ఇండియా బర్మాల మధ్యగల పాలనా సమైక్యత 1826లో ఏర్పరచారు. దాదాపు 110 సంవత్సరాల పాటు ఆ పాలనా సమైక్యత కొనసాగింది.

1937లో రెండింటిని బంధించిన ముడిని విప్పి వేయటం జరిగింది. బర్మా ఇండియాలు వేరు కావడాన్ని ఎవ్వరూ వ్యతిరేకించలేదు. రెండింటి మధ్యగల సమైక్యతకు ప్రాతిపదిక లేదు. బంధుత్వపు సంబంధాల ఆధారంగా సమైక్యత ఏర్పడాలి. ఒక విధంగా అది ఆధ్యాత్మికమైనదే. ఈ విషయంగా పరిశీలించినప్పుడు ఇండియా పాకిస్తాన్‌ల మధ్యగల సమైక్యత ఒక మిధ్య మాత్రమే. బర్మా హిందుస్తాన్‌ల మధ్య ఆధ్యాత్మికమైన సయోధ్య ఉంది. అలాంటి ఐక్యం ఇండియా పాకిస్తాన్‌ల మధ్య లేదు. భారతదేశం నుండి బర్మా విడిపోవడాన్ని నిరోధించని హిందువులు, ఏ విధంగా పాకిస్తాన్ ఏర్పడటాన్ని వ్యతిరేకిస్తున్నారో తెలుసుకోవటం కష్టంగా ఉంది. రెండింటి మధ్య రాజకీయపరమైన ఏకీభావం లేదు. సామాజికంగా రెండూ పరస్పరం వ్యతిరేకమైనవి. ఆధ్యాత్మికంగా రెండింటికి మధ్య పొంతన లేదు.

(అను. ప్రొ॥ ఎం. సత్యనారాయణరావు)

# రక్షణ పాటవం దుర్బలమవడం

పాకిస్తాన్ ఆవిర్భావం వల్ల హిందూస్తాన్ రక్షణ విషయంలో ఎలాంటి మార్పు వస్తుంది? ఇది అంత తక్షణ సమస్య కాదు. ఏమంటే పాకిస్తాన్ ఏర్పడ్డ వెంటనే హిందూస్తాన్‌తో యుద్ధానికి దిగుతుందనుకోవడానికి తగ్గ ఆధారం ఏమీ లేదు. అయినా ఈ సమస్య తలెత్తి తీరుతుంది. అంచేత దీని గురించి చర్చించుకోవడం మంచిది.

ఈ సమస్యను మూడు రకాలుగా పరిశీలించవచ్చు. 1) సరిహద్దు సమస్య 2) వనరుల సమస్య 3) సాయుధ దళాల సమస్య.

## 1. సరిహద్దు సమస్య

పాకిస్తాన్ ఏర్పడితే హిందూస్తాన్‌కు శాస్త్రీయమైన సరిహద్దులు లేకుండా పోతాయని హిందువులు మొర పెడతారు, తప్పదు. హిందువుల ఎల్లలకి ముప్పు వస్తుందన్న కారణంగా పాకిస్తాన్‌ను వదులుకొండని ముస్లిములకు చెప్పడమా? కుదరదు అనవచ్చు. సరే, ఈ పరిహాసోక్తిని అలా ఉంచినా పరిశీలించాల్సిన అంశాలు రెండు ఉన్నాయి. వాటిని చూస్తే ఈ సరిహద్దు విషయానికి సంబంధించి హిందువులు ఆందోళన పడ్డం అనవసరమనిపిస్తుంది.

ఏ దేశానికైనాగానీ 'ఇదీ శాస్త్రీయమైన సరిహద్దు' అని చెప్పగలిగేది ఉంటుందా? ఇది మొదటి అంశం. "వాయవ్య సరిహద్దు" అన్న గ్రంథం రాసిన డేవిస్ ఇలా అంటున్నారు :

"మన భారత సామ్రాజ్య వాయవ్యదిశలో జాతిపరంగా, రాజకీయపరంగా, సైనికపరంగా చూస్తే సంతృప్తికరమైన ఒక సరిహద్దు రేఖ గీయడం అసాధ్యం. భౌగోళికంగా ఫలానా, ఫలానా లక్షణాలున్నాయనీ, సన్నిహితంగా కలిసిపోయిన తెగల భూభాగాల్ని ఛేదించే రీతిలో జాతిపరమైన విషయాల్ని ఉల్లంఘించడం లేదనీ, అయినా రాజకీయపరమైన సరిహద్దుగా ఉండగలదని

చెప్పగల ప్రాంతం కోసం వెతకడం ఒట్టి కల మాత్రమే."

చారిత్రకంగా చూస్తే, భారతదేశానికి ఒక శాస్త్రీయమైన సరిహద్దు అనేది లేదు. అనేక మంది భారతదేశానికి అనేక హద్దులున్నాయన్నారు. ఈ సరిహద్దు సమస్య వల్ల రెండు విధానాలు తలెత్తాయి. ఒకటి "పురోగామి" విధానం, రెండవది సింధు నదికేసి "తిరోగమించే" విధానం. సర్‌జార్జ్ మాక్‌మన్ చెప్పినట్లు, ఈ పురోగామి విధానానికి, విస్తృత ఉద్దేశ్యమూ, పరిమిత ఉద్దేశ్యమూ ఉన్నాయి. విస్తృత ఉద్దేశ్యం ప్రకారం పురోగామి విధానంలో భారతదేశానికి ఆఫ్ఘనిస్తాన్ వాడని తుపాకీ గొట్టానికి బిరడాలాగా అయ్యింది. దాని వ్యవహారాలన్నింటినీ క్రియాత్మకంగా నియతం చెయ్యడం అన్నమాట భారతదేశం పలుకుబడి ఆక్సస్ నదీ తీరం దాకా విస్తరించడం అన్నమాట.పరిమిత ఉద్దేశ్యం ప్రకారం, డురాండ్ పంథా నిర్వచించినట్లు ఆఫ్ఘనిస్తాన్‌కూ పాలిత ప్రాంతానికీ (అంటే వాయవ్య సరిహద్దు భాగం) మధ్య ఉన్న తెగలకొండల్ని కలుపుకోవడం మేరకే పరిమితం అవుతుంది. ఆ సరిహద్దు రేఖ దాకా బ్రిటిష్ ఆధిపత్యం చెలాయించడం ఇందులో ఉంది. భారతదేశానికి సంబంధించి ఏ చింతా లేని సరిహద్దుగా ఉండే ఈ పురోగామి విధానం ఉద్దేశ్యం ఎన్నడనగానో వర్జితం అయ్యింది. తత్ఫలితంగా, ఇక మూడు సరిహద్దు అవకాశాలు మిగిలాయి. వాటి నుంచి దేన్నో ఒకదాన్ని ఎంచుకోవాలి. 1) సింధూనది 2) వాయవ్య సరిహద్దు ప్రాంతంలోని ప్రస్తుత పరిపాలనా సరిహద్దు 3) డూరాండ్ రేఖ. పాకిస్తాన్ మాత్రం భారత సరిహద్దుకు తిరిగి సింధునది కేసి, నిజానికి సింధునది వెనక్కి సట్లెజ్ నదికేసి లాగేస్తోంది. అందులో సందేహం లేదు. అయినాగానీ, సింధునది కేసి తిరోగమించే ఈ విధానానికి దాని వకాల్తాదార్లు లేకపోలేదు. సింధునది సరిహద్దును గట్టిగా ప్రతిపాదించే వ్యక్తి **లార్డ్** లారెన్స్. సింధు పర్వత ప్రాంతం దాటి ఆవలకు ముందుకు ఏ మాత్రం పోవడానికి ఆయన సుతరామూ అంగీకరించడు. సింధునది ప్రాంతం నుంచి ఏ మాత్రం సుదూరంగానైనా యుద్ధం చెయ్యడం తెలివితక్కువ అనీ, దౌర్బల్యం అనీ ఆయన అభిప్రాయం. ఆఫ్ఘనిస్తాన్‌గుండానూ, తెగల ప్రాంతంగుండానూ ఎంత దూరం సైన్యం దాడిచేస్తూ సాగితే, అంతగా అది సంకటస్థితికి గురవుతుందని ఆయన అభిప్రాయం. ఇక మిగిలినవాళ్ళు, నది ఏమంత పటుపైన రక్షణ హద్దు కాదని, అనుమానం లేకుండా సూచించారు. కానీ సింధునది సరిహద్దుకు తగ్గకపోవడానికి అసలు కారణం వేరే చోట ఉన్నట్లు అన్పిస్తుంది. డేవిస్ అసలు కారణాన్ని ఈ విధంగా చెప్పున్నారు :

"వాయవ్య సరిహద్దు ప్రాంతం ఆధునికం అయ్యింది. అక్కడ నివసిస్తున్న వాళ్ళ దృష్ట్యా చూస్తే సింధునది కేసి తిరోగమించడం అసంబద్ధంగా ఉంటుంది. వెనక్కి తగ్గడం అంటే పరువు పోగొట్టుకోవడమే కాదు, మనం సార్థకమైన మన పరిపాలన విస్తరింపజేసిన ఆ ప్రజలకు శుద్ధ దగా చెయ్యడం అవుతుంది కూడా."

నిజానికి ఏ ఒక ప్రత్యేక సరిహద్దు అతి భద్రమైనదని పట్టుబట్టి చెప్పడం నిష్ప్రయోజనం.

ఈనాటి ప్రపంచంలో భౌగోళికమైన స్థితిగతులు నిర్ణయం కాకపోవడమే సూటిగా ఉన్న కారణం. సహజ సరిహద్దులకు ఇంతకు పూర్వం ఉన్న ప్రాముఖ్యాన్ని ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం హరించి వేసింది. మహా పర్వతాలు, విశాలమైన ఏరులు, విస్తారమైన సముద్రాలు, సుదూర వ్యాప్తిగల ఎడారులు ఆ సరిహద్దులుగా ఉన్నప్పటికీ ఇలా జరిగింది.

రెండవ పక్షంలో సహజ సరిహద్దులు లేని దేశాలు ఈ లోటును భర్తీ చేసుకోవడం సర్వదా సాధ్యమే. సహజ సరిహద్దులు లేని దేశాలు లేకపోలేదు. అయినప్పటికీ ప్రకృతిపరమైన లోటుపాట్లను అన్ని దేశాలు పూడ్చుకొన్నాయి. కృత్రిమ దుర్గాలను అవరోధాలుగా నిర్మించుకొని అలా పూడ్చుకొన్నాయి. అవి సహజమైన అవరోధాల కంటే చాలా ఎక్కువ దుర్బలంగా ఉంటాయి. తమలాంటి పరిస్థితుల్లోనే అన్నీ ఇతర దేశాలు సాధించుకొన్న దాన్ని హిందువులు సాధించుకోలేకపోతారు. తమకు ఉన్న వనరులను బట్టి చూస్తే, సహజసిద్ధంగా ఏర్పాటయిన సురక్షిత సరిహద్దు లేదని హిందువులు భయపడాల్సిన పని లేదు.

## 2. వనరుల సమస్య

శాస్త్రీయమైన సరిహద్దు ఉందా లేదా అన్నదాని కంటే ముఖ్యమైంది వనరుల సమస్య. అవసరమైన సాధనా సంపత్తిని సమకూర్చుకునేందుకు పుష్కలంగా వనరులుండాలే గానీ సరిహద్దులు అశాస్త్రీయమైతేనేం, దుర్బలంగా ఉంటేనేం, ఆ కష్టాలన్నింటినీ అధిగమించడం సర్వదా సాధ్యమే. అంచేత పాకిస్తాన్‌కి, భారతదేశానికి ఏఏ వనరులున్నాయో మనం పరిశీలించాలి. రెండుదేశాలకూ ఎలాంటి వనరులున్నాయో ఒక అంచనా ఇచ్చేందుకు ఈ అంకెల్ని చూద్దాం.

### పాకిస్తాన్ వనరులు

| రాష్ట్రం | వైశాల్యం | జనాభా | వార్షిక ఆదాయం* |
|---|---|---|---|
| వాయవ్య సరిహద్దు రాష్ట్రం | 13,518 | 2,425,003 | 1,90,11,842 |
| పంజాబ్ | 91,919 | 23,551,210 | 12,53,87,730 |
| సింధ్ | 46,378 | 3,887,070 | 9,56,76,269 |
| బెలూచిస్తాన్ | 54,228 | 420,648 | - |
| బెంగాల్ | 82,955 | 50,000,000 | 36,55,62,485 |
| మొత్తం | 2,88,998 | 80,283,931 | 60,36,38,326 |

### హిందుస్తాన్ వనరులు

| రాష్ట్రం | వైశాల్యం | జనాభా | వార్షిక ఆదాయం* |
|---|---|---|---|
| అజ్మీర్-మేర్వార్ | 2,711 | 560,292 | 21,00,000 |

| | | | |
|---|---|---|---|
| అస్సామ్ | 55,014 | 8,622,251 | 4,46,04,441 |
| బీహార్ | 69,348 | 32,371,434 | 6,78,21,588 |
| బొంబాయి | 77,271 | 18,000,000 | 34,98,03,800 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ బీరార్ | 99,957 | 15,507,723 | 4,58,83,962 |
| కూర్గ్ | 1,593 | 163,327 | 11,00,000 |
| ఢిల్లీ | 573 | 636,246 | 70,00,000 |
| మద్రాసు | 1,42,277 | 46,000,000 | 25,66,71,265 |
| ఒరిస్సా | 36,695 | 8,043,681 | 87,67,269 |
| యు.పి. | 2,06,248 | 48,408,763* | 16,85,52,881 |
| మొత్తం | 6,07,675 | 178,513,919 | 96,24,05,206 |

* స్థానిక ప్రభుత్వాలు స్థానిక వనరుల ద్వారా సేకరించుకొన్న ఆదాయాలు, కేంద్ర ప్రభుత్వం కేంద్ర వనరుల ద్వారా సేకరించుకొన్న ఆదాయాలూ రెండూ ఈ వార్షిక ఆదాయాల్లో కలిసి ఉన్నాయి.

ఇవి స్థూలంగా చెప్పుకొన్న అంకెలు. కొన్ని చేర్పులూ, మార్పులూ ఇక్కడా, అక్కడా ఉండవచ్చు. రైల్వేల ద్వారా, ద్రవ్య, తపాలా తంతి విభాగాల ద్వారా కేంద్ర ప్రభుత్వానికి వచ్చే ఆదాయాన్ని ఈ అంకెల్లో చేర్చలేదు. ఏమంటే విడివిడిగా రాష్ట్రాల నుంచి ఈ పద్దు కింద ఎంత చేరిందో ఖచ్చితంగా తెలుసుకోవడం కష్టం కాబట్టి. ఆ లెక్క తేలినప్పుడు వార్షికా దాయానికి మరికొంత చేరుతుంది. అయితే పద్దుల కింద హిందూస్తాన్‌కి చేరే వార్షికాదాయం పాకిస్తాన్‌కు వచ్చేదాని కంటే చాలా ఎక్కువ ఉంటుందన్న విషయంలో అనుమానం లేదు. ఈ లెక్కలకి చేర్పులు చేసినట్లే కొన్ని తీసివేతలూ ఉంటాయి. ఈ తీసివేతల్లో ఎక్కువ భాగం పాకిస్తాన్ పాలబడతాయి. ఇంకా ముందు చూపించబోయేట్లు పంజాబ్‌లో కొంతభాగాన్ని పశ్చిమ పాకిస్తాన్ ఉద్దిష్ట ప్రాంతం నుంచి మినహాయించాలి. బెంగాల్ నుంచి పదిహేను జిల్లాల్ని, పంజాబ్ నుండి పదమూడు జిల్లాల్ని మినహాయించాల్సి ఉంటుందని నేను అనుకొంటున్నాను. ఈ జిల్లాల్ని మినహాయిస్తే భూభాగ వైశాల్యంలోనూ,ం జనాభాలోను. వార్షికాదాయంలోనూ ఏ మేరకు తగ్గుదల ఉండబోయేదీ తెలుసుకునేందుకు తగ్గ శాస్త్రీయ సమాచారం అందుబాటులో లేదు. ఏమైనా పంజాబ్, బెంగాల్ రాష్ట్రాలకు సంబంధించి వాటి వార్షికాదాయం సగం అవుతుందని మాత్రం ఊహించవచ్చు. ఈ మినహాయింపు వల్ల పాకిస్తాన్ నష్టపోయినదాన్ని హిందూస్తాన్ పొందుతుంది. ఖరాఖండిగా చెప్పాలంటే, పశ్చిమ తూర్పు పాకిస్తాన్‌ల ఆదాయం 60 కోట్లు, అందులో తీసివేత 24 కోట్లు పోతే 36 కోట్లు అయితే, హిందూస్తాన్ ఆదాయం 96 కోట్లు ప్లస్ 24 కోట్లు అంటే మొత్తం 120 కోట్లు.

నేను ప్రస్తావించిన విశేషాలను ఆధారంగా ఈ అంకెల్ని పరిశీలించి చూస్తే హిందుస్తాన్

వనరులు పాకిస్తాన్ వనరులకంటే చాలా యెక్కువ ఉంటాయని చెప్పాలి – ఈ సమస్యని వైశాల్యం దృష్ట్యా చూసినా, జనాభా దృష్ట్యా చూసినా. అంచేత వనరులకు సంబంధించిన భయాలేమీ ఉండనక్కరలేదు. ఏమంటే, పాకిస్తాన్ ఆవిర్భావం వలన హిందూస్తాన్ దుర్బల స్థితిలో పడదు.

## 3. సా····ధ దళాల సమస్య

ఏ దేశం రక్షణ అయినా వనరుల మీద ఆధారపడినంతగా శాస్త్రీయమైన సరిహద్దుల మీద ఆధారపడి ఉండదు. అయితే వనరుల మీద కంటే ఎక్కువగా దాని రక్షణ దానికి అందుబాటు పోరాట సైనిక దళాల మీద ఆధారపడి ఉంటుంది.

పాకిస్తాన్‌కూ, హిందూస్తాన్‌కూ అందుబాటులో ఉన్న సైనిక శక్తులు ఏవి?

భారత రక్షణ సమస్య గురించిన ఒక ప్రత్యేకమైన అంశాన్ని సైమన్ కమీషన్ ఎత్తి చూపించింది. భారతదేశ సైన్యంలోకి రిక్రూట్ చేసుకోవడానికి ప్రత్యేక ప్రాంతాలున్నాయనీ, అస్సలు సైన్యంలో చేర్చుకోవడానికి ఏ మాత్రమూ లేని కొన్ని ప్రాంతాలున్నాయనీ, ఒకవేళ వాటి నుంచి చేర్చుకోవడం జరిగినా అతి తక్కువ అనీ తెలియజేసింది. ఈ వాస్తవాల్ని ఈ కింద ఇస్తున్న పట్టిక తెలియజేస్తుంది. దీన్ని ఆ కమిషన్ నివేదిక నుంచి తీసుకోవడమైంది. భారతదేశ రక్షణ గురించి ఆలోచించి, ఆందోళన పడిపోయే భారతీయులు చాలామందికిది వెగటు పుట్టించేంత ఆశ్చర్యకరంగా ఉంటుందనడంలో సందేహం లేదు.

| | సైన్యంలో చేర్చుకొనే ప్రాంతాలు | చేర్చుకొన్న వారి సంఖ్య |
|---|---|---|
| 1. | వాయవ్య సరిహద్దు ప్రాంతం | 5,600 |
| 2. | కాశ్మీర్ | 6,500 |
| 3. | పంజాబ్ | 86,000 |
| 4. | బెలూచిస్తాన్ | 300 |
| 5. | నేపాల్ | 19,000 |
| 6. | యునైటెడ్ ప్రావినెన్స్ | 16,500 |
| 7. | రాజ్‌పుటాన్ | 7,000 |
| 8. | మధ్య భారత్ | 200 |
| 9. | బొంబాయి | 7,000 |
| 10. | సెంట్రల్ ప్రావినెన్స్ | 100 |
| 11. | బీహార్, ఒరిస్సా | 300 |
| 12. | బెంగాల్ | లేరు |
| 13. | అస్సాం | లేరు |

| | | |
|---|---|---|
| 14. | బర్మా | 3,000 |
| 15. | హైదరాబాద్ | 700 |
| 16. | మైసూర్ | 100 |
| 17. | మద్రాసు | 4000 |
| 18. | తదితర ప్రాంతాలు | 1900 |
| | మొత్తం | 1,58,200 |

ఈ మాదిరి పరిస్థితి భారతదేశానికి కొత్తకాదని సైమన్ కమిషన్ గ్రహించింది. దీనికి సాక్ష్యంగా మహా యుద్ధకాలంలో భారతదేశంలోని విభిన్న ప్రాంతాల నుంచి సైన్యంలోకి చేర్చుకొన్న వాళ్ళ లెక్కల్ని ఇచ్చింది. ఏమంటే, ఏ ప్రాంతం విషయంలోనూ నిరుత్సాహ పరచడం జరిగిందని అనడానికి లేదు కాబట్టి.

| రాష్ట్రం | చేర్చుకొన్న పోరాట సైనికులు | యుద్ధం చెయ్యనివాళ్ళు | మొత్తం |
|---|---|---|---|
| మద్రాసు | 51,223 | 41,117 | 92,340 |
| బొంబాయి | 41,272 | 30,211 | 71,483 |
| బెంగాల్ | 7,117 | 51,935 | 59,052 |
| యునైటెడ్ ప్రావినెన్స్ | 163,578 | 117,565 | 281,143 |
| పంజాబ్ | 349,688 | 97,288 | 446,976 |
| వాయవ్య సరిహద్దు | 32,181 | 13,050 | 45,231 |
| బెలూచిస్తాన్ | 1,761 | 327 | 2,088 |
| బర్మా | 14,094 | 4,579 | 18,673 |
| బీహార్, ఒరిస్సా | 8,576 | 32,976 | 41,552 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 5,376 | 9,631 | 15,007 |
| అస్సాం | 942 | 14,182 | 15,124 |
| అజ్మీర్–మేర్వార్ | 7,341 | 1,632 | 8,973 |
| నేపాల్ | 58,904 | – | 58,904 |
| మొత్తం | 742,053 | 414,493 | 1,156,546 |

ఈ సమాచారాన్ని బట్టి చూస్తే భారతదేశ రక్షణ కోసం పోరాడే సైన్యాల సంఖ్య అత్యధికంగా పాకిస్తాన్‌లో కలవబోయే ప్రాంతాల నుండే వస్తున్నట్లు కొట్టవచ్చినట్లు తెలుస్తుంది. దీన్నిబట్టి పాకిస్తాన్ లేకపోతే భారతదేశం తన్ను తాను రక్షించుకోలేదని వాదించవచ్చు.

సరే, సైమన్ కమీషన్ అందజేసిన విషయాలు నిర్వివాదమైనవనుకోండి. అంతమాత్రం చేత సైమన్ కమిషన్ సూచించిన రీతిలో నిర్ధారణలు చెయ్యడానికి అవి ఆధారాలు కాలేవు. అదేమిటంటే, పాకిస్తాన్ సైనికుల్ని తయారు చేయగలదు, భారతదేశం చెయ్యలేదు అని. అలాంటి నిర్ధారణ నిలవదని ఈ దిగువ పరిశీలించే అంశాల్ని బట్టి తెలుస్తుంది.

మొదటి అంశం, భారతదేశానికి విలక్షణమైందని సైమన్ కమీషన్ సూచించే అంశం అంత విలక్షణమైంది కాదు. విలక్షణంగా కనిపించే విషయం ప్రజల్లో స్వతహాగా ఉన్న లోపం వల్ల వచ్చింది కాదు. బ్రిటిష్ ప్రభుత్వం గతంలో ఎన్నో ఏళ్ళుగా సైన్యంలో చేర్చుకొనేందుకు అనుసరించిన విధానం వల్ల ఆ విలక్షణత్వం వచ్చింది. భారత సైన్యంలో వాయవ్య ప్రాంతం వాళ్ళు పై చెయ్యిగా ఎందుకు ఉన్నారు అనేదానికి వాళ్ళు క్షాత్రవర్గాలకు చెందినవాళ్ళు కావడమేనని అధికార వివరణ ఇస్తారు. కాని, ఈ వివరణ ఏ మాత్రం నిజం కాదని తిరుగులేని సమాచారం అందిస్తూ శ్రీ చౌదరి చూపించారు. వాయవ్య ప్రాంతంవాళ్ళు సైన్యంలో 1857 తిరుగుబాటు కాలం నుంచి పై చెయ్యిగా ఉన్నారని ఆయన చూపించారు. అంటే క్షాత్ర, క్షాత్రేతర వర్గాల సిద్ధాంతం ముందుకు రావడానికి 20 ఏళ్ళు ముందు నుంచీనన్నమాట. ఈ సిద్ధాంతాన్ని 1879లో మొట్టమొదటిసారిగా స్పెషల్ ఆర్మీ కమిటీ [2] ముందుకు తెచ్చింది.

ఆ కమిటీని ఆ ఏడే నియోగించారు. వాయవ్య ప్రాంతంవాళ్ళు పై చెయ్యిగా ఉండడానికీ, వాళ్ళ వీరోచిత లక్షణాలని చెప్పే వాటికి ఏ సంబంధమూ లేదు. వాళ్ళు ప్రబలంగా ఉండడానికి కారణం, బెంగాల్ సైన్యం సంపూర్తిగా నిమగ్నం అయిన తిరుగుబాటును అణచి వెయ్యడానికి వాళ్ళు బ్రిటిష్ వారికి తోడ్పాటునివ్వడం.

శ్రీ చౌధరి చెప్పినట్లు "సిపాయిల తిరుగుబాటుకు ముందు ఉన్న బెంగాల్ సైన్యం ముఖ్యంగా గంగానదీ ప్రాంతానికి చెందిన బ్రాహ్మణ, క్షత్రియులతో ఏర్పడ్డ సైన్యం ఈ వ్యాసం మొదట్లో చెప్పినట్లు, ఆనాటి ప్రెసిడెన్సీ సైన్యాలు మూడు వాటి వాటి ప్రాంతాలకి చెందినవే, ఆ ప్రాంతాల సైనిక సామర్ధ్యాలకు ప్రాతినిధ్యంగా ఉన్నవే. అలాగని, నిక్కచ్చిగా చెప్పాలంటే, అవి ఆ ఫలానా రాష్ట్రాల జాతీయ సైన్యాలను ఏ ఒక్కదాన్ని గురించీ ఖాయంగా అనలేం. ఏమంటే జనాభాలోని సాంప్రదాయక క్షాత్ర అంశాల నుంచీ వాళ్ళని ఎంచుకొనే ప్రయత్నం ఏమీ లేదు. అయితే సైన్యంలో రిక్రూట్ కావడానికి అనువుగా ఉన్న ప్రాంతాల వాళ్ళే వాటిలోకి వచ్చారు. అంటే, తమిళులు, తెలుగు వాళ్ళు మద్రాసు సైన్యంలోకీ, పశ్చిమ భారతీయులు

1. "భారతదేశంలో క్షాత్రజాతులు" అన్న అంశం మీద ఆయన రాసిన వ్యాస పరంపర చూడండి. జూలై 1930, జనవరి 1931, ఫిబ్రవరి 1931 నాటి "మోడ్రన్ రివ్యూ" సంచికల్లో అవి వెలువడ్డాయి.
2. ఆ కమిటీ జారీ చేసిన ప్రశ్నావళిలో కింది ప్రశ్న ఉంది : "సామ్రాజ్య రక్షణ నిమిత్తం భారత సైన్యం సమర్థవంతమైన, ఔపయోగిక దళం, అవసరమనిభావిస్తే, సాటిలేని సైనికుల్ని అందజేసే ప్రాంతాల నుండి సైన్యంలో చేర్చుకోవడం, నిలబెట్టుకోవడం, భారతదేశంలోని అతి దుర్బలమైన జాతుల నుండి ఏ మాత్రం యుద్ధానికి ఉపయోగపడని జాతుల నుండి సైన్యాన్ని చేర్చుకోవడం కంటే మంచిది కాదా?"

బొంబాయి సైన్యంలోకి, యు.పి., బీహారు వాళ్ళు చాలా పరిమిత సంఖ్యలో బెంగాలీలు బెంగాల్ సైన్యంలోకి వచ్చారు. ఇతర విధాలుగా అర్హులైతే తెగకూ, కులానికీ సంబంధించిన నియమాలేవీ సైన్యంలో చేర్చుకొనేందుకు ఆటంకం కాదు. బొంబాయి, మద్రాసు సైన్యాల విషయంలో అనుసరించిన పద్ధతిని ఒక్క క్షణం పాటు పక్కన పెడితే, ఈ సామాన్య విధానానికి ఒక్క బెంగాల్ సైన్యం మాత్రమే మినహాయింపుగా ఉంది.పంజాబీలో విషయంలోనూ, సిక్కుల వి . ంలోనూ అనుసరించిన పద్ధతే అది. వాళ్ళు అద్భుతమైన సైనిక పాటవం ఉన్న వాళ్ళయినా ఉత్తరాది సైన్యంలో వాళ్ళకి సముచిత ప్రాతినిధ్యం దక్కలేదు. తద్భిన్నంగా, వాళ్ళ రిక్రూట్‌మెంటుకు ఒక ప్రభుత్వ ఫర్మానావల్ల తీవ్రమైన పరిమితులు ఏర్పడ్డాయి. "ఒక దళంలో పంజాబీలు ఎప్పుడూ 200 మించి ఉండకూడదు; వాళ్ళల్లో సిక్కులు 100 మించి ఉండకూడదు" అని ఆ ఫర్మానాలో ఉంది. బెంగాల్ సైన్యంలోని హిందూస్తానీ దళాలు తిరుగుబాటు చేసిన తరువాతే బ్రిటిష్ అధికారులు దృష్టిలో పంజాబీలు పునరావాసం పొందగలిగారు. అప్పటిదాకా వాళ్ళు అనుమానితులుగా, బహిష్కరణకుగురై ఉన్నారు. సిపాయిల తిరుగుబాటు నాటికి బెంగాల్ సైన్యం అంటే ముఖ్యంగా అయోధ్య నుంచీ, ఉత్తర దక్షిణ బీహార్‌ల నుంచీ వచ్చి చేరిన వాళ్ళేనని ప్రధానంగా దక్షిణ బీహార్ నుంచి. అందులోనూ షాహాబాదు, భోజ్‌పర్గ్, గంగాయమునా మధ్య తీరం, రోహిత్‌ఖండ్ నుంచి వచ్చిన వాళ్ళు ఈ ప్రాంతాల నుంచీ సైన్యంలో చేర్చుకొన్న వాళ్ళల్లో అధిక భాగం అగ్రకులాలవాళ్ళే అంటే అన్ని బ్రాహ్మణ శాఖల వాళ్ళు, క్షత్రియులు, రాజపుత్రులు, అహిర్లు, ఒక దళంలో చేర్చుకొన్న ఈ వర్గాలవాళ్ళు దామాషాన (1) బ్రాహ్మణులు 1/24, (2) రాజపుత్రులు 1/4 (3) నిమ్న హిందువులు 1/6 (4) ముస్లిములు 1/6 (5) పంజాబీలు 1/8 ఉన్నారు.

" మరి ఈ సైన్యానికి ఇవాళ అధిక సంఖ్యలో సైనికుల్ని అందజేస్తున్న ప్రాంతంనుంచి – పంజాబ్, నేపాల్, వాయవ్య సరిహద్దు, కుమార్ గరేవాల్ పర్వత భూమి, రాజపుటానా – అతి తక్కువ సంఖ్యలో సైనికులు వచ్చారు, లేదా అసలు రాలేదు. భారతదేశంలో సైనిక పాటవం ఉన్నదని ప్రసిద్ధిపొందిన కులాలన్నిటినీ– సిక్కులు, గుర్ఖాలు, పంజాబీ ముస్లిములు, డోగ్రాలు, జాట్‌లు, పఠాన్లు, గర్‌వారీలు రాడ్‌పుటానా రాజపుత్రులు, కుమోనీలు, నజార్‌లు – ఆ ప్రాంతం వదిలిపెట్టేసినట్లయింది. ఇవాళ భారత సైన్యానికి వెన్నెముకగా పరిగణించే అన్ని తెగల్ని, జాతుల్ని, వదిలిపెట్టేసారు. ఒక ఏడాదిలోనే, ఒక్క తిరుగుబాటు వల్ల ఇదంతా మారిపోయింది. 1857లో జరిగిన తిరుగుబాటు బెంగాల్ సైన్యాన్ని తుత్తునియలు చేసేసింది. పంజాబీ మయమైన అనాగరికమైన సైన్యాన్ని తెచ్చి పెట్టింది. రూపు రేఖల్లో అది స్థూలంగా ఈనాటి భారతసైన్యాన్ని పోలి ఉంది.

"హిందూస్తానీ దళాల (బెంగాల్ సైన్యానికి చెందిన) తిరుగుబాటు వల్ల ఏర్పడ్డ ఖాళీలు వెంటనే సిక్కులతో, ఇతర పంజాబీలతో, కొండల వాళ్ళతో నిండిపోయాయి. వీళ్ళంతా పగ తీర్చుకుందామన్న ఆతృతతో, హిందూస్తాన్ నగరాలన్ని కొల్లగొట్టేద్దామన్న ఆతృతతో

ఉన్నవాళ్ళు. వీళ్ళనందరినీ హిందూస్తానీ సైనికుల తోడ్పాటుతో బ్రిటిష్ వాళ్ళు లొంగదీసుకొన్నారు. వీళ్ళు ఆ విషయం తెలుసుకోలేక, కొద్దిమంది బ్రిటిష్ వాళ్ళను గాక, హిందూస్తానీలను తమ అసలు శత్రువులుగా పరిగణించారు. ఈ శత్రుత్వాన్ని బ్రిటిష్ వాళ్ళు తిరుగుబాటును అణచివేసేందుకు దివ్యంగా ఉపయోగించుకొన్నారు. గుర్ఖాల్ని సైన్యంలో చేర్చుకొన్నారన్న వార్త ఇంగ్లండ్‌లో ఉన్న లార్డ్ డల్హౌసీ విని మహా సంబరపడిపోయాడట. "అయోధ్య సిపాయిలతో వీళ్ళు రాక్షసుల్లా యుద్ధం చేస్తారని ధైర్యంగా ఆశించవచ్చు." అని ఒక మిత్రుడికి రాశాడు. తిరుగుబాటు తర్వాత, భారత సర్వ సేనాని జనరల్ మాన్స్‌ఫీల్డ్ సిక్కుల గురించి ఇలా రాశాడు :

"సిక్కులు తమ స్వాతంత్ర్యం కోసం దెబ్బతీసే అవకాశం నిమిత్తం చూడ్డానికి బదులు మన జెండా కిందకు వచ్చారంటే దానికి కారణం వాళ్ళకి మనమంటే అభిమానం ఉండి కాదు. హిందూస్తానీ, బెంగాల్ సైన్యాన్ని, ద్వేషించడం అందుకు కారణం. వాళ్ళు కసి తీర్చుకొందామను కొన్నారు. హిందూస్తానీ నగరాల సంపదని కొల్లగొట్టుదామనుకున్నారు. వాళ్లని ఆకర్షించింది ఒట్టి దినబత్తెంకాదు, మొత్తంగా కొల్లగొట్ట గల అవకాశం, శత్రువుల తలలమీద కదం తొక్కటం. నిజానికి, రంజిత్‌సింగ్ పాత ఖాల్సా సైన్య సంఘీభావాన్ని, మనం వాటంగా వాడుకున్నాం. ఏరీతిలో వాడుకున్నామంటే కొంతకాలం పాటు సిక్కుల్ని మనకి గట్టిగా బంధించేస్తుంది అవి. వాళ్ళ పాత శత్రువులకు వ్యతిరేకంగా కొలువు సాగినంతకాలం అలా బంధించి ఉంచుతుంది అది.

"నిజానికి ఆ రకంగా ఏర్పడ్డ సంబంధాలు చాలా కాలం నిలదొక్కుకుంటాయి. తిరుగుబాటు సమయంలో సిక్కులు, గుర్ఖాలు,అందించిన సేవల్ని మరిచిపోలేదు. అప్పటి నుంచీ భారత సైన్యంలో పంజాబ్‌కూ, నేపాల్‌కూ గౌరవస్థానం లభించింది."

భారత సైన్యంలో వాయవ్య ప్రాంతం వాళ్ళ ఆధిపత్యానికి అసలు కారణం 1857లో జరిగిన తిరుగుబాటు అని శ్రీ చౌధరి అన్నముక్క నిజం. అందులో ఆవగింజంత అనుమానం లేదు. వాళ్లు ఈ ఆధిపత్యానికి రావడానికి పోరాట గుణాల్లో వాళ్ళకి సహజంగా ఉన్న ఆధిక్యత కాదని అంటున్న చౌదరి అభిప్రాయమూ అంతే తిరుగులేనిది. ఈ విషయం, ఆయన సంతృప్తిగా సేకరించిన లెక్కలే తెలియజేస్తున్నాయి. భారతసైన్యంలో తిరుగుబాటుకు ముందూ, ఆ తర్వాత వచ్చిన మార్పుల్ని ఆ లెక్కలు తెలియ జేస్తున్నాయి.

భారత పదాతిదళం రూపు తీసుకోవడంలో వచ్చిన మార్పులు
భిన్న ప్రాంతాల నుంచి వచ్చిన శాతం

| సంవత్సరం | వాయవ్య ప్రాంతం పంజాబ్ ప్రాంతం వాయవ్య కాశ్మీరు | నేపాల్ గరేవాల్ కుమార్ | ఈశాన్య ప్రాంతం | దక్షిణ భారతం | బర్మా |
|---|---|---|---|---|---|
| 1856 | 10 కంటే తక్కువ | గణనీయం కాదు | 90 కి తక్కువ కాదు | - | లేరు |
| 1858 | 47 | 6 | 47 | - | I |
| 1883 | 48 | 17 | 35 | - | I |
| 1893 | 53 | 24 | 23 | - | I |
| 1905 | 47 | 15 | 22 | 16 | I |
| 1919 | 46 | 14.8 | 25.5 | 12 | 1.7 |
| 1930 | 58.5 | 22 | 11.0 | 5.5 | 3 |

1856లో అంటే తిరుగుబాటుకు ఒక ఏడాది ముందుగా భారత సైన్యంలో వాయవ్య దిశనుంచి వచ్చిన వాళ్ళ సంఖ్య గణించనక్కరలేనంతగా ఉందని ఈ లెక్కలు తెలియజేస్తున్నాయి. కానీ 1858లో, అంటే తిరుగుబాటు జరిగిన ఏడాది తర్వాత, వాళ్ళు ప్రబలస్థానం సంపాదించారు. ఇక ఆ స్థానం నుంచి తగ్గేది లేదు.

మొట్ట మొదటి సారిగా 1879లో క్షాత్ర, క్షాత్రేతర విభాగాల విభేదాన్ని ఒక విధంగా ప్రవేశపెట్టారు. దాని తర్వాత లార్డ్ రాబర్ట్ ప్రధాన విషయంగా పరిశీలించాలని పట్టుబట్టాడు. ఆ తర్వాత లార్డ్ కిచెనర్, భారత సైన్యంలోకి రిక్రూట్ చేసుకొనేందుకు దీన్ని ఒక విధానంగా చెయ్యాలని ఆశించాడు. అయితే పైన చూసినదాన్ని బట్టి భారత సైన్యంలో వాయవ్య ప్రాంతంవాళ్ళ ఆధిపత్యం ఆరంభం కావడానికి దీనికి ఏ సంబంధమూ లేదని తెలుస్తోంది. కానీ

* "నలభై ఒక్క సంవత్సరాలు" అన్న గ్రంథంలో ఆయన ఇలారాశారు. "మద్రాసు సైన్యంలో ఉన్న వాళ్ళు అవసరాలు, శక్తి సామర్థ్యాలు తెలుసుకొనేందుకు ప్రతి శీతకట్టులోనూ నేను దీర్ఘయాత్రలు చేశాను. గత శతాబ్దంలోనూ, ఈ శతాబ్ది ఆరంభంలోనూ వాళ్ళ పూర్వులు విశిష్టత గడించేట్టు చేసిన పోరాట పటిమ వీళ్ళల్లో ఉందేమో కనిపెడదామని ప్రయత్నించాను.. కానీ ఆ గతకాలపు పోరాట పటిమ వీళ్ళల్లో నశించిపోయింది. సాధారణ బెంగాలీ హిందుస్తానీయునిలో, బొంబాయి మరాఠా వాళ్ళల్లో మాదిరిగానే... అన్న తీర్మానానికి రాక తప్పలేదు. వాళ్ళను నమ్మి ఇంకా ఎంత మాత్రమూ యోధ జాతులకు పోటీగా పెట్టలేమని, దక్షిణ భారతసేమదాటి బయటి వాళ్ళను నియోగించలేమని తీర్మానించు కొన్నాను".

ప్రభుత్వం చేత క్షాత్రవర్గంగా గుర్తింపు పొందే అదృష్టం వాయవ్య ప్రాంతం వాసులకు పట్టింది. భారతదేశంలో ఇతర ప్రాంతాలకు చెందిన అధికులకు క్షాత్రేతరవర్గాల దురదృష్టం సంభవించింది. నిస్సందేహంగా దీనికి ముఖ్యమైన పరిణామాలు వచ్చాయి. వాయవ్య ప్రాంత వాసులకు సైన్యంలో స్థిరమైన కొలువు దొరికింది. దాంతో వాళ్ళు సైనిక కొలువును భద్రమైన వృత్తిగా, జీవికగా భావించారు. మిగిలిన భారతావనికి అది దక్కలేదు. అంచేత భారత వాయవ్య ప్రాంతం నుంచి సైన్యంలో ఎక్కువగా చేరడానికి ఇంతకంటే మరేమీ లేదు. అంటే బ్రిటిష్ ప్రభుత్వ విధానంవల్ల సైన్యంలో కొలువు వాళ్ళ వృత్తి అయింది. భారతదేశంలోని ఇతర ప్రాంతాల నుంచి మనుషులు సైన్యంలోకి రాలేదంటే ప్రభుత్వం వాళ్ళను సైన్యంలో చేర్చుకోక పోవడమే కారణం. ప్రజలు తమకు ఇష్టం ఉన్నా లేకపోయినా తాత ముత్తాతల వృత్తుల్నే అవలంబిస్తారు. వాళ్ళు కొత్త వృత్తుల్ని అవలంబించడం లేదు అంటే వాటికి వాళ్ళు తగరనిఎంత మాత్రం అర్థంకాదు. అది వాళ్ళ పూర్వీకుల వృత్తికాకపోవడమే దాని అర్థం.

క్షాత్ర, క్షాత్రేతర వర్గాల మధ్య విభజన కేవలం అహేతుకమూ, కృత్రిమం అని చెప్పాలి. యోగ్యతను బట్టికాక, పుట్టుకనుబట్టి గుర్తింపును ఇచ్చే హిందూమత కులాల అంత తెలివిహీనమైనది మరొకటిలేదు. తాము పాటించినవిచక్షణ అసలయిన విచక్షణ అని ఒకప్పుడు ప్రభుత్వం మొండిగా పట్టుబట్టింది. పోరాట లక్షణాలకు సంబంధించి ఇంతమేరకు పోరాటవిలువ అనీ అంది. నిజానికి, వాయవ్యప్రాంతం నుంచి ఎక్కువ మందిని సైన్యంలోకి చేర్చుకోడానికి ఇదేవాళ్ళ సమర్థన. పోరాట లక్షణాలలో తేడాకూ, ఈ విచక్షణకూ ఏ మాత్రం సంబంధం లేదు అన్న సంగతి ఇప్పుడు ఒప్పుకొంటున్నారు. భారత సైన్యం ఏర్పాటు సందర్భంగా లండన్ నుంచి రేడియోలో మాట్లాడుతూ పంజాబ్‌నుంచి ఎక్కువగా సైన్యంలో చేర్చుకోవడం అంటే ద్వీపకల్పంలో వాళ్ళకు క్షాత్ర లక్షణాలు లేవని అర్థంకావని వివరించడానికి సర్‌ఫిలిప్ చెత్‌వాడ్* తంటాలుపడ్డాడు. భారతసైన్యంలోకి ఉత్తరాది వాళ్ళను ఎక్కువ చేర్చుకొన్నారంటే, శీతోష్ణ పరిస్థితే ముఖ్యంగా కారణమని, ఏమంటే దక్షిణాది వాళ్ళు ఉత్తర భారత దేశపు అధిక ఉష్ణ, శీతలాలకు తట్టుకోలేరని చెత్‌వాడ్ వివరించాడు. ఏజాతి శాశ్వత శౌర్య స్వభావం లేకుండా ఉండదు. క్షాత్ర స్వభావం అనేది సహజాతంగా వచ్చిపడేదేమీకాదు. అది శిక్షణకి సంబంధించింది. ఎవరినైనా దానికి తర్ఫీదు చెయ్యొచ్చు.

ఇదీకాక, ప్రత్యేక శిక్షణతో రూపొందించుకునే దాంతోబాటుగా హిందూస్తాన్‌లో తగినంత పోరాటపటిమ ఉంది. సిక్కులున్నారు, వాళ్ళ వీరోచిత లక్షణాల గురించి చెప్పాల్సిన అవసరంలేదు. రాజపుత్ర జాతివాళ్ళు ఉండనేఉన్నారు. ఇప్పటికీ వాళ్ళను క్షాత్ర వర్గాల విభాగంలోనే చేర్చుకొని ఉన్నారు. వీళ్ళతోబాటుగా మరాఠాలున్నారు. గత ఐరోపా యుద్ధంలో వాళ్ళు తమ శౌర్య ప్రతాపాల్ని ప్రదర్శించనే ప్రదర్శించారు. మద్రాసులో ప్రెసిడెన్సీ

* ఇండియన్ సోషల్ రిఫార్మర్, జనవరి 27, 1940

వాళ్ళుకూడా, సైనికావసరాలకు వస్తే, ఆధారపడతగ్గవాళ్ళే. భారతదేశంలో ఒకప్పుడు సర్వ సైన్యాధ్యక్షునిగా ఉన్న జనరల్ ఫ్రెడరిక్ పి. హైనే సైనికులుగా మద్రాసీయులు ఎలా ఉండేదీ చెబుతూ ఇలా అన్నాడు :

“బెంగాల్ సైన్యంలో చూస్తే, మద్రాసు సైన్యంలో శారీరకంగా ఏోమెట్టు తక్కువ వాళ్ళున్నారని అనడం పరిపాటి. ఒడ్డూ పొడుగూ మాత్రమే చూసుకుంటే, ఇది నిజమే కావచ్చు. అసలైన సైనికుడికి ఉండాల్సిన యోధ స్వభావం, లక్షణాలు పరిస్థితుల ప్రభావం వల్ల, ఈ సైనికుల్లో అగుపించడంలేదని అంటున్నారు. పోల్చిచూపిస్తూ మద్రాసు సైనికులకు అసమర్థతని ఆపాదించే ఈ ప్రకటనలనూ అలాంటి బాపతు వాటిని నేను తిరస్కరించాల్సి ఉంటుంది. ఇటీవలికాలంలో వాళ్ళు సైనికులుగా ఎక్కువ అనుభవం గడించలేదన్న ముక్క నిజమే కావచ్చు. ఏమంటే, శాప్పర్స్‌గా మినహా, వాళ్ళను క్షాత్రం పనుల్లో పాల్గొనకుండా ప్రత్యేకంగా మినహాయించారు. మద్రాసు సిపాయి పోరాటయోధునిగా మిగిలిన వాళ్ళకంటే తక్కువ అని వెల్లడి చేసేది ఏదీ జరిగినట్లు ఒక్కక్షణం కూడా నేను ఒప్పుకోలేదు. చరిత్ర సాక్ష్యాలు చూస్తే తద్భిన్నమైంది జరిగినట్లే తెలుస్తోంది. డ్రిల్లు శిక్షణలో, క్రమశిక్షణలో మద్రాసు సిపాయి ఎవరికీ తీసిపోడు. ఇక ఆరోగ్యరీత్యా చూస్తే, అతనూ తనతో పాటు ఉన్న వాళ్ళంత బాగానూ ఉన్నట్లు ఫలితం తెలుస్తుంది. ఈ విషయం శాప్పర్లని బట్టి, ఖైబర్‌లో ఉన్న వాళ్ళ అనుచరులను బట్టి వెల్లడైంది.

అంచేత తన జనాభా నుంచే చాలినంత మంది పోరాట యోధులు సైన్యంలోకి రావడం గురించిన చింత హిందూస్తాన్‌కు అక్కరలేదు. పాకిస్తాన్ విడిపోయినంత మాత్రాన ఈ విషయంలో హిందూస్తాన్ శక్తి హీనం కాబోదు.

సైమన్‌కమిషన్ భారతసైన్యానికి సంబంధించి మూడు విషయాల్ని గుర్తుచేసింది. ఆ కమిషన్‌కి అవి భారతదేశ ప్రత్యేక లక్షణాలుగా విశేషమైన అం ుగా కొట్టవచ్చినట్లు కన్పించాయి. భారత దేశ సైన్యం నిర్వహించే కర్తవ్యం రెండు విధాలుగా ఉందని ఆ కమిషన్ అంది. భారతదేశపు ఆఫ్ఘన్ సరిహద్దు నుంచి స్వతంత్ర తెగలు వచ్చి శాంతియుతంగా మైదానాల్లో బతుకుతున్న వాళ్ళమీద దాడులు చెయ్యకుండా అడ్డగించడం మొదటిది. అవ్యవస్థీకృతంగా ఉన్న ఈ భూభాగాల ఆవల, వెనక భాగంలోనూ ఉన్న దేశాల నుంచి భారత దేశం మీద దురాక్రమణ జరక్కుండా అడ్డగించడం రెండవది 1850 నుంచీ 1922 దాకా స్వతంత్ర తెగల మీద 72 దాడులు జరిగాయని కమిషన్ పేర్కొంది. అంటే సగటున ఏడాదికి ఒకదాడి అన్నమాట. భారత దేశ ప్రాదేశిక సమగ్రతకు ప్రమాదం శతాబ్దాలుగా పొంచివున్న దిశ గురించి కమిషన్ పేర్కొంది. “కమిషన్ గమనించిన ప్రకారం నానాజాతి సమితిలో సభ్యత్వంకాని రాజ్యాలు” ఈ ప్రాంతాల్ని ఆక్రమించుకొని ఉన్నాయి. అంచేత మునుపటికంటే భారతదేశానికి ఇప్పుడు

1. రాయల్ ఇంజినీర్స్, మైనర్స్‌లో అధికారి, అను.

ప్రమాదం మరింత ఎక్కువ. ఈ రెండు విషయాలూ భారత దేశ సైనిక రక్షణకు సంబంధించి వింత సమస్యను సృష్టిస్తున్నాయని కమిషన్ నొక్కినొక్కి చెప్పింది. ఈ సమస్య ఎంత అవశ్యమైందో, విస్తారమైందోనన్న విషయాలకు సంబంధించి, అవి "సామ్రాజ్యంలో మరెక్కడా సాదృశ్యం లేకుండా ఉన్నాయి. స్వంత ప్రభుత్వ స్థాపనకు ఆటంకం కలిగిస్తాయి. స్వంతంగా పాలించుకొనే అధినివేశ రాజ్యాలు ఏర్పడ్డానికి సంబంధించి ఈ స్థాయిలో ఇంత ఆటంకం మరెక్కడా తలెత్తలేదు" అని కమిషన్ అంది.

భారతదేశ సైన్యానికి గల రెండవ విశిష్ట అంశంగా కమిషన్ ఈ పరిశీలన చేసింది.

"భారతదేశంలోని సైన్యాన్ని, పరమ అసాధారణ లక్షణంగా ఉండే బాహ్య ప్రమాదాల నుంచి రక్షణ కల్పించుకుందుకు మాత్రమే పెంచి పోషించుకోవడంలేదు. దాన్ని అన్ని ప్రాంతాలకు వ్యాపింపజేసి, అంతరంగిక శాంతిభద్రతలను కాపాడేందుకూ వినియోగిస్తున్నారు. అన్నిదేశాల్లోనూ......సైన్యాన్ని మామూలుగా ఈ రీతిలో ఉపయోగించరు. నిజానికి, ఈ ప్రయోజనం నిమిత్తం సైన్యాన్ని సమకూర్చనూ సమకూర్చరు. కాని భారత దేశం విషయంలో ఇది సంపూర్తిగా భిన్నం. ఏడాదిలో ఎన్నోసార్లు అంతరంగిక కల్లోలాన్ని నివారించడానికి, అవసరం అయితే అణచి వెయ్యడానికి, సైన్యాన్ని వినియోగిస్తారు. పోలీసు బలగం బాగా సువ్యవస్థితంగానే ఉంది. కానీ మతావేశంతో వెర్రెత్తిపోయిన మూకలు ఉట్టిపాటున రెచ్చిపోతే పోలీసు బలగం ఆ పరిస్థితుల్లో తూగలేదు. అంచేత సైనికులను రప్పించాలి అన్న సంగతి భారతదేశంలోని పోలీసులకు తెలుసు, సైన్యానికీ తెలుసు-ఇంకా నిజం చెప్పాలంటే ప్రజలకూ తెలుసు.... ఈ రకంగా ఆంతరంగిక శాంతిభద్రతలను స్థాపించి, కాపాడేందుకు వినియోగించడం తగ్గకపోగా రానురానూ పెరుగుతోంది. అంతేకాదు, ఇలాంటి సందర్భాల్లో, సర్వేసర్వత్రా బ్రిటిష్ సైనికులకోసమే అభ్యర్థిస్తూ ఉంటారు. ఈ పని నిమిత్తం కేటాయించిన బ్రిటిష్ సైనికుల శాతం భారతసైనికుల కంటే నిజానికి గత పావుశతాబ్దంలో పెరిగింది. సరే, ఇందుకు కారణం బ్రిటిష్ సైనికులు తటస్థంగా ఉండడం, హిందువులకు సాయం చేస్తున్నాడని ముస్లిములూ, ముస్లిములకు సాయం చేస్తున్నాడని హిందువులు అనుమానించక పోవడం...సైనిక జోక్యాన్ని ఆపేక్షించే అత్యధిక సందర్భాలు కుల, మతపర స్వభావంలో ఉండే[illegible]డంతో ఆజోక్యం నిష్పక్షపాతంగా - అని యదార్థంగానీ, అనుమానితమైందిగానీ, [illegible]. అది సహజం. తప్పనిసరి. గమనార్హమైన విషయం మరొకటి ఉంది. అదేమిటం[illegible] స్థిర సైన్యంలో మొత్తంమీద బ్రిటిష్ సైనికుల సంఖ్య తక్కువ. 2 1/2 భారతీ[illegible] బ్రిటిష్ సైనికుడు ఉండొచ్చు, కానీ ఆంతరంగిక భద్రత కోసం కేటాయించే సైని[illegible]యంలో ఈ ఆధిక్యం తల్లకిందులైంది. ఇందు నిమిత్తం అధికభాగం బ్రిటిష్ సైనికు[illegible] పంపిస్తున్నారు. ఆంతరంగిక భద్రత కోసం ప్రత్యేకంగా కేటాయించిన సైనికుల్లో ఏడుమంది భారతీ[illegible]కు ఎనిమిదిమంది బ్రిటిష్ వాళ్ళు ఉన్నారు.

భారతదేశ సైన్యానికి సంబంధించిన ఈ లక్షణాన్నిగురించి వ్యాఖ్యానిస్తూ కమిషన్ ఇలా అంది :

"అంచేత, భారతదేశ భవిష్యత్తుగురించి యోచన చేసేసమయంలో ఈ భారతీయ సమస్య విస్తృతినీ, స్వభావాన్నీ దృష్టిలో ఉంచుకోవాలి. ప్రస్తుత సమయంలో బ్రిటిష్ సైనికుడు శాంతియుత ప్రభుత్వ సహాయంగా నిర్వహించే పాత్రనూ దృష్టిలో ఉంచుకోవాలి. (అతను నిర్వహించే కర్తవ్యం గ్రామీణ ప్రాంతంలో సామాన్యంగా సంతృప్తికరంగా ఉంది) భవిష్యత్ భారతదేశంలో ప్రస్తుతం ఉన్న సైనిక వ్యవస్థ స్థానంలో దేశ రక్షణ, శాంతిస్థాపన పూర్తిగా భారత దళాల చేతిలోనే ఉంటుంది కెనడా, కెనెడియన్ సైన్యాల మీదా, ఐర్లెండ్ ఐరిష్ సైన్యాలమీదా ఆధారపడినట్లు".

భారత సైన్యానికి ఉన్న మూడో విశిష్ట అంశాన్ని కూడా సైమన్ కమిషన్ ప్రస్తావించింది. వాయవ్య దిశవాళ్ళు సైన్యంలో ఆధిపత్యంలో ఉన్న విషయం అది. ఈ ఆధిపత్యం ఎలా పుట్టుకు వచ్చిందో, అందుకు అధికారయుతంగా ఇచ్చిన కారణాలేమిటో ఇంతకు ముందే చూశాం.

కానీ భారతసైన్యానికి ప్రత్యేక అంశం ఉంది. కమిషన్ ఈ విషయం గురించి అస్సలు తడబడలేదు. కమిషన్ దాన్ని ఉపేక్షించైనా ఉండాలి, లేదా కమిషన్‌కు ఆవిషయం తెలియక పోయైనా ఉండాలి. అది చాలా ప్రముఖం అయ్యింది. దాని ముందు కమిషన్ పేర్కొన్న ఈ మూడు అంశాలు సోదిలోకి నిలవవు, ప్రాముఖ్యం రీత్యాగానీ, సాంఘిక రాజకీయ పరిణామాల రీత్యాగాని.

ప్రచురంగా వెల్లడి అయితే గనుక యెంతో మంది ఉగ్రులయ్యే అంశం ఇది. పరిష్కరించలేని సమస్యలనన్నిట్నీ అదిలేవనెత్తడం ఖాయం. భారతదేశ రాజకీయ పురోగమనపథాన్ని అది అనాయాసంగా అప్పగిస్తుంది. సైన్యాన్ని భారతీకరణం కావించేకంటే ఎంతో ముఖ్యమైనవీ, సంక్లిష్టమైనవీ అయిన సమస్యల్ని అదిలేవనెత్తుతుంది.

ఉపేక్షించిన ఈ అంశం భారతదేశ సైన్యం కులమతపరంగా రూపొందడానికి సంబంధించినది. శ్రీచౌధరి ఇందుకు సంబంధించిన సమాచారాన్ని తన వ్యాసాల్లో సేకరించారు. ఆయన వ్యాసాలగురించి ఇంతకు ముందు ప్రస్తావించుకున్నాం. ఆ సమాచారం భారతసైన్యంలో ఉన్న ఈ వైఖరిని ఎంతో విపులంగా వివరిస్తుంది. భారత పదాతిదళంలో కొలువు చేస్తున్న సైనికుల నిష్పత్తి గురించి ఈ దిగువ ఇచ్చే పట్టిక తెలియచేస్తుంది. ప్రాంతాల వారీగా, ఏఏ జాతుల నుంచి ఆ సైనికులు వచ్చింది ఇది తెలియచేస్తుంది.

## భారత సైన్యంలో కుల మత పరంగా వచ్చిన మార్పులు

| సంఖ్య | ప్రాంతం, జాతులు | 1914నాటి శాతం | 1918నాటి శాతం | 1919నాటి శాతం | 1930నాటి శాతం |
|---|---|---|---|---|---|
| I | పంజాబ్, వాయవ్య ప్రాంతం, కాశ్మీర్ | 47 | 46.5 | 46 | 58.5 |
| | 1. సిక్కులు | 19.2 | 17.4 | 15.4 | 13.58 |
| | 2. పంజాబీ ముస్లిములు | 11.1 | 11.3 | 12.4 | 22.6 |
| | 3. పఠాన్లు | 6.2 | 5.42 | 4.54 | 6.35 |
| II | నేపాల్, కుమోన్, గరేవాల్ | 15 | 18.9 | 14.9 | 22.0 |
| | 1. గూర్ఖాలు | 13.1 | 16.6 | 12.2 | 16.4 |
| III | ఎగువ భారత్ | 22 | 22.7 | 25.5 | 11.0 |
| | 1. యు.పి. రాజ్‌పుత్రులు | 6.4 | 6.8 | 7.7 | 2.55 |
| | 2. హిందుస్తానీ ముస్లిములు | 4.1 | 3.42 | 4.45 | లేరు |
| | 3. బ్రాహ్మణులు | 1.8 | 1.86 | 2.5 | లేరు |
| IV | దక్షిణ భారతం | 16 | 11.9 | 12 | 5.5 |
| | 1. మరాఠాలు | 4.9 | 3.85 | 3.7 | 5.33 |
| | 2. మద్రాసీ ముస్లిములు | 3.5 | 2.71 | 2.13 | లేరు |
| | 3. తమిళులు | 2.5 | 2.0 | 1.67 | లేరు |
| V | బర్మా | | | | |
| | 1. బర్మీయులు | లేరు | లెక్కలోకిరారు | 1.7 | 3.0 |

భారతదేశ సైన్యం కులమతపరంగా రూపొందించడంలో ఏఏ గాఢమైన మార్పులు వచ్చాయో, అదీ ప్రముఖంగా 1919 తర్వాత, ఈ పట్టిక పొరపాటు లేకుండా తెలియజేస్తుంది. ఆ మార్పులు 1) పంజాబీ ముస్లిములు, పఠాన్లు ఊహకందనంతగా పెరగడం 2) సిక్కులు మొదటి స్థానం నుంచి గణనీయంగా పడిపోవడం 3) రాజపుత్రులు నాల్గవస్థానానికి దిగజారడం 4) యు.పి. బ్రాహ్మణులు, మద్రాసీ ముస్లిములు, బ్రాహ్మణ, బ్రాహ్మణేతర తమిళులు మరుగున పడిపోవడం.

**శ్రీ చౌధరి** 1930 నాటి అంకెల్ని ఇంకా విశ్లేషించారు. భారత పదాతిదళం, అశ్వికదళం జాతిపరంగా ఎలా ఏర్పాటయ్యాయో ఆ లెక్కలు తెలియజేస్తాయి. ఈ దిగువ పట్టికే ఆ విషయాల్ని తెలియజేస్తుంది.

## 1930లో భారత సైన్యంలో ఉన్న మత, కుల విభజన *

| | వర్గం | ప్రాంతాలు | పదాతిదళంలో శాతం గూర్ఖాలు మినహా | పదాతిదళంలో శాతం గూర్ఖాలతో కలిసి | అశ్వికదళంలో శాతం |
|---|---|---|---|---|---|
| 1. | పంజాబీ ముస్లిం | పంజాబ్ | 27 | 22.6 | 14.28 |
| 2. | గూర్ఖాలు | నేపాల్ | ... | 16.4 | ... |
| 3. | సిక్కులు | పంజాబ్ | 16.24 | 13.58 | 23.81 |
| 4. | దోగ్రాలు | ఉత్తర పంజాబ్, కాశ్మీర్ | 11.4 | 9.54 | 9.53 |
| 5. | జాట్‌లు | రాజ్‌పుతానా, యు.పి. | 9.5 | 7.94 | 19.06 |
| 6. | పఠాన్లు | పంజాబ్, వాయవ్య రాష్ట్రం | 7.57 | 6.35 | 4.76 |
| 7. | మరాఠాలు | కొంకణ్ | 6.34 | 5.33 | ... |
| 8. | గరేవాలీలు | గరేవార్ | 4.53 | 3.63 | ... |
| 9. | యు.పి. రాజ్‌పుట్‌లు | యు.పి. | 3.04 | 2.54 | ... |
| 10. | రాజ్‌పుటాన్ రాజ్‌పుట్‌లు | రాజ్‌పుటానా | 2.8 | 2.35 | ... |
| 11. | కుమోనీలు | కుమోన్ | 2.44 | 2.05 | ... |
| 12. | గుజార్‌లు | ఈశాన్య రాజ్‌పుటానా | 1.52 | 1.28 | ... |
| 13. | పంజాబీ హిందువులు | పంజాబ్ | 1.52 | 1.28 | ... |
| 14. | అహిర్లు | పంజాబ్ | 1.22 | 1.024 | ... |
| 15. | ముస్లిములు, రాజ్‌పుట్‌లు, రంగార్లు | ఢిల్లీ పరిసర ప్రాంతాలు | 1.22 | 1.024 | ... |

* భారత పదాతిదళంలో (82 క్రమబద్ధ, 18 శిక్షణాయుత పటాలాలు) అర్థమైన ప్రతివర్గం వాళ్ళ శాతాన్ని ఇది తెలియజేస్తుంది. ఆదేరకంగా అశ్వికదళానికి సంబంధించిన (21 రెజిమెంట్లు) 20 పటాలాలు గూర్ఖా పదాతిదళాలకు సంబంధించేవే. భారత 1) పర్వత ఆర్టిలరీ 2) శాప్పర్ల, మైనర్ల రెజిమెంట్లు 3) భారత సిగ్నల్‌కోర్ ఈ పట్టికలో లేవు. వీటన్నింట్లోనూ భిన్న దామాషాల్లో పంజాబీ ముస్లిములు, సిక్కులు, పఠాన్లు, హిందుస్తానీ హిందువులు, ముస్లిములు, అన్నివర్గాల మద్రాసీలు, హజ్రా ఆఫ్ఘన్లు, వర్గయూనిట్లలో గాని, కంపెనీల్లోగానీ ఉన్నారు. వీట్లో కొన్ని యూనిట్లలో ఇప్పుడు ఇతర యూనిట్లలో నమోదై వున్న మద్రాసీలు, హజ్రాలు తప్ప ఈ యూనిట్ల వర్గ పొందిక, పట్టికలో ఇచ్చిన వర్గాల దామాషాలో వస్తుతః మార్పు చెందదు. బ్రిటిష్ సైన్యానికి, ఆర్టిలరీ యూనిట్లకు అనుబంధించిన భారత సిబ్బంది కూడా ఈ పట్టికలో కలవలేదు.

| | | | | |
|---|---|---|---|---|
| 16. కైమ్‌ఖానీలు | రాజ్‌పుటానా | ... | ... | 4.76 |
| 17. కాచిన్లు | బర్మా | 1.22 | 1.024 | ... |
| 18. చిన్లు | బర్మా | 1.22 | 1.024 | ... |
| 19. కరెన్లు | బర్మా | 1.22 | 1.024 | ... |
| 20. దక్కన్ ముస్లిం | దక్కన్ | ... | ... | 4.76 |
| 21. హిందుస్తానీ ముస్లిములు | యు.పి. | ... | ... | 2.38 |

ఈ అంకెల్ని కులమతపరంగా సంక్షేపిస్తే, 1930లో ఉన్నటువంటి ఈ శాతం వస్తుందిః

| మతాలు | పదాతి దళంలో శాతం గూర్ఖాలతో కలిపి | పదాతి దళంలో శాతం గూర్ఖాలు మినహా | అశ్విక దళంలో శాతం |
|---|---|---|---|
| 1. హిందువులు, సిక్కులు | 60.55 | 50.554 | 61.92 |
| 2. గూర్ఖాలు | ... | 16.4 | ... |
| 3. మహమ్మదీయులు | 35.79 | 29.974 | 30.08 |
| 4. బర్మీయులు | 3.66 | 3.072 | ... |

ఈ లెక్కలు భారతసైన్యంలో ఉన్న కుల,మతాల మార్పుని తెలియజేస్తాయి. శ్రీ చౌధరి అభిప్రాయం ప్రకారం భారత పదాతిదళంలో 36 శాతం, అశ్వికదళంలో 30 శాతం ముస్లిములు ఉన్నారు.

ఈ లెక్కలు 1930 నాటివి. ఈ నిష్పత్తిలో అప్పట్నుంచీ ఏఏ మార్పులు జరిగాయో మనం చూడాలి.

1930 తర్వాత ఈ అంశానికి సంబంధించి ఏ సమాచారం లేదు. భారతసైనిక చరిత్రలో చాలా ఆశ్చర్యకరమైన విషయాల్లో ఇదొకటి. ఇవాళ భారతసైన్యంలో ముస్లిముల నిష్పత్తి ఎంతో తెలుసుకోవటం దుర్ఘటం. ఆ బాపతు సమాచారం అందించదగ్గ ప్రభుత్వ ప్రచురణలు ఏమీ లేవు. గతంలో ఇలాంటి సమాచారం అందించే ప్రచురణలకు కొదవ ఉండేది కాదు. అలాంటి ప్రచురణలు ఇప్పుడు అదృశ్యమై పోవడం ఆశ్చర్యంగా ఉంది. ఒకవేళ వెలువడ్డా, ఈ సమాచారం లేకపోవడమే కాదు, కేంద్ర శాసనసభల్లో సభ్యులు ఈ విషయం గురించి అడిగినప్పుడు కూడా ప్రభుత్వం ఏ సమాచారాన్ని అందజెయ్యలేదు. తిరస్కరించింది. ఈ విషయం గురించిన సమాచారం రాబట్టేందుకు చేసే ప్రతి ప్రయత్నాన్ని ఎంత శ్రమపడి ఎదిరించిందో కేంద్ర శాసనసభ కార్యకలాపాల నుంచి తీసుకొన్న ఈ క్రింది ప్రశ్నలూ, జవాబులూ తెలియజేస్తాయి.

1938 సెప్టెంబరు 15వ తేదీన కార్య నిర్వహణకు అంతరాయం కలిగింది. ఈ క్రింద ప్రకటిస్తున్న ప్రశ్నలు అడగడం వల్ల వాటికి జవాబులు చెప్పడం వల్లా అలా జరిగింది.

భారత రక్షణకు ఏర్పాట్లు*

ఎ) × × × ×

బి) × × × ×

సి) × × × ×

డి) పదాతిదళంలోకి, అశ్వికదళంలోకి ఎంతమంది భారతీయుల్ని 1937, 1938 సంవత్సరాలల్లో సైనికులుగా, 1937-38సంవత్సరాలలో ఆఫీసర్లుగా చేర్చుకోవడం జరిగింది? అలా సైన్యంలో చేర్చుకున్న సైనికుల్లో ఆఫీసర్లలో ఎంతమంది పంజాబీ సిక్కులు, పఠాన్లు, గరేవాలీలు, మరాఠాలు, మద్రాసీలు, బీహారీలు, బెంగాలీలు, యునైటెడ్ ప్రావిన్సెస్ హిందూస్తానీ గూర్ఖాలు ఉన్నారు?

ఇ) పంజాబీ సిక్కుల్ని, పఠాన్లను, గూర్ఖాలను తప్ప మరెవళ్ళనూ చేర్చుకోనట్లయితే, భారత రక్షణ కోసం అన్నిరాష్ట్రాల నుంచీ మనుషుల్ని చేర్చుకొని, వాళ్ళకి సరైన సైనిక శిక్షణ ఇచ్చే విషయం గౌరవనీయ సభ్యుని యోచనలో ఉందా?

ఎఫ్) భారత రక్షణ నిత్తం రాష్ట్ర ప్రభుత్వాలు స్థానిక దళాల్ని ఏర్పాటు చేసుకోవచ్చనీ, శిక్షణ ఇచ్చుకోవచ్చనీ పూర్తిగా యాంత్రీకృతం చేసుకోవచ్చనీ చెప్పడం జరుగుతుందో లేదో రక్షణ కార్యదర్శి దయచేసి సెలవీయగలరు? లేని పక్షంలో భారతదేశ రక్షణ కోసం పటిష్టమైన సైన్యాన్ని ఏర్పాటు చేసే పథకం ఏమిటి?

**శ్రీ సి.యమ్.జి. ఓగిల్వీ :**

ఎ) అలాంటి ఏర్పాట్ల గురించి వెల్లడించడం ప్రజా ప్రయోజనాల దృష్ట్యా మంచిది కాదన్న విషయాన్ని గౌరవనీయుడైన సభ్యుడు గ్రహించగలరు.

బి) 1937-38 సంవత్సరంలో 5 మంది కెడెట్లనీ, 33 మంది భారతీయ నూతన అభ్యర్థుల్నీ భారత వైమానిక దళంలో చేర్చుకోవడం జరిగింది.

సి) 1937-38 కాలంలో రాయల్ ఇండియన్ నేవీలో 5 మందిని ఇప్పటికే కమిషన్డ్ హోదాలో చేర్చుకొన్నారు. 1938 అక్టోబర్‌లో పోటీ పరీక్ష ద్వారా మరో 4 మందిని చేర్చుకుంటారు. మరో 3 మందిని 'డఫ్ఫెరిన్' కెడెట్ పరీక్ష ద్వారా మాత్రమే చేర్చుకొంటారు. ఇదే కాలంలో రాయల్ ఇండియన్ నేవీలో విభిన్న నాన్-కమిషన్డ్ తరగతుల్లో 314 మంది భారతీయుల్ని చేర్చుకున్నారు.

* శాసనసభ చర్చలు, 1938 వాల్యూం - VI, పేజీ 2462.

డి) 1938 మార్చి 31లో అంతమయ్యే సంవత్సరంలో ఇండియన్ కమిషన్డ్ ఆఫీసర్లుగా 54 మంది భారతీయుల్ని కమిషన్ చెయ్యడం జరిగింది. శిక్షణ నిమిత్తం ఇప్పుడు వాళ్ళను బ్రిటిష్ యూనిట్లకు అనుబంధించారు. ఎంతమందిని ఏ నిష్పత్తిలో పదాతి దళంలోకి, అశ్వికదళంలోకి క్రమంగా తీసుకునేది ఇప్పుడే చెప్పడం సాధ్యం కాదు. ఇదే కాలంలో అశ్విక దళంలోకి 961 మంది భారత సైనికుల్ని చేర్చుకోవడం జరిగింది. 7,970 మందిని పదాతిదళంలో చేర్చుకొన్నారు. వర్గాలవారీగా వాళ్ళ వివరాలు సైనిక ప్రధాన కార్యాలయంలో అందుబాటులో లేవు. వాటి గురించి యావత్ భారతదేశంలో రిక్రూటింగ్ ఆఫీసర్ల నుంచి సమాచారం అర్థించడం శ్రమదృష్ట్యా, కాల హరణం దృష్ట్యా సమంజసం కాదు.

ఇ) లేదు.

ఎఫ్) మొదటి భాగానికి జవాబు 'లేదు' అని. ఇక రెండవదానికి ఏమిటంటే భారతదేశానికి ఇప్పటికే సమర్థవంతమైన సైన్యం ఉందనీ, ఆర్థిక పరిస్థితులు అనుమతించే మేరకు ఈ సైన్యాన్ని సర్వవిధాలా ఆధునికం చేసే ప్రతి ప్రయత్నం జరుగుతుందని.

శ్రీ ఎస్. సత్యమూర్తి ప్రశ్నలోని డి, ఇ అధికరణలకు ఇచ్చిన జవాబు మొత్తంగా కలిపి చూస్తూ, నేను ఒక విషయం తెలుసుకోగోరుతున్నాను. సైన్యంలో ఎక్కువ భాగం పంజాబ్ నుంచీ, ఒకే మతం నుంచీ వచ్చిందేమోనని చాలామంది ప్రముఖులు ప్రకటనలు చేసిన విషయం ప్రభుత్వం దృష్టికి వచ్చిందా? సైన్యంలో చేర్చుకొనే విధానాన్ని అన్ని రాష్ట్రాలకూ కులమతాలకూ విస్తరింపజేసి నిజమైన జాతీయ సైన్యంగా రూపొందించి సకల దేశాల్లోనూ సైనిక నియంతృత్వం రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకునేట్లున్న ప్రమాదాన్ని తప్పించుకునేందుకు గాను అలా చేసే అవకాశాన్ని కూడా ప్రభుత్వం పరిశీలిస్తుందా ?

**శ్రీ సి.యన్.జి. ఓగిల్వీ :** ఈ ప్రశ్న నుంచి అది ఎలా ఉత్పన్నం అవుతుందో చెప్పలేను. కానీ రాష్ట్రీయ సరిహద్దులు ప్రభుత్వ పరిగణనలోకి ఎంతమాత్రం రావని చెప్పగలను. అత్యుత్తమ సైన్యాన్ని భారతదేశానికి అందించేందుకే అత్యుత్తమ సైనికుల్ని చేర్చుకోవడం జరుగుతుంది గానీ ఏ ఒక్క రాష్ట్రానికీ సైన్యాన్ని అందించేందుకు కాదు. ఈ విషయంలో రాష్ట్రీయమైన దానికంటే జాతీయమైన పరిగణనే అన్నిటికంటే ఎక్కువగా ఉండాలి. ఉత్తమమైన సైనిక సంపత్తి ఎక్కువగా ఎక్కడి నుంచి వస్తుందో, దాన్ని అందుకుందుకు అక్కడికే వెడతాం గానీ మరోచోటుకు కాదు.

**శ్రీ ఎస్. సత్యమూర్తి :** సైన్యంలోకి అధికభాగం పంజాబ్ నుంచే వచ్చిందా అనీ, భారత సైన్యంలో మా రాష్ట్ర ప్రజలు ఇటీవల ప్రదర్శించిన శౌర్య ప్రతాపాల్ని మరచి పోవడం జరిగిందా అనీ తెలుసుకోగోరుతున్నాను. యదార్థానికి మద్రాసీయుల్ని, మొత్తంగా ఇతర రాష్ట్రాల వారినీ సైన్యం నుంచీ దూరంగా ఉంచడం జరిగిందా అనీ తెలుసుకోగోరుతున్నాను.

శ్రీ సి.ఎమ్.ఓ. ఓగిల్వీ : సైన్యం నుంచీ మద్రాసును ప్రత్యేకంగా వేర్పాటుగా ఉంచడం జరుగలేదు. సైన్యంలో మద్రాసీయులు ప్రదర్శించిన ధైర్యసాహసాలకు ప్రభుత్వం ఆనందంగా కృతజ్ఞతలు తెలియజేస్తుంది. వాళ్ళ అనుభవం వల్ల ఎక్కడ రాటుదేరారో ఆ దళాల్లోకి వాళ్ళను ఇప్పుడు తీసుకుంటున్నారు. శాప్పర్స్, మైనర్స్, ఆర్టిలరీలలో ముఖ్యంగా వాళ్లున్నారు. సుమారు 4,500 మంది ఉన్నారు.

శ్రీ ఎస్. సత్యమూర్తి : 1,20,000 మందిలో ఈ మాత్రమా?

శ్రీ సి.ఎమ్.జి. ఓగిల్వీ : అంతమంది.

శ్రీ ఎస్. సత్యమూర్తి : మద్రాసు జనాభా దృష్ట్యా, కేంద్ర ఖజానాకు మద్రాసు చెల్లించే సుంకం దృష్ట్యా అది ఉచితమైన దామాషాగా నేను పరిగణించవచ్చునా? అన్ని రాష్ట్రాల నుంచీ తీసుకున్న వాళ్ళలో జాతీయ సైన్యం ఏర్పాటు చెయ్యాల్సిన అవసరం వుందని నేను అనుకోవచ్చునా?

శ్రీ సి.ఎమ్.జి. ఓగిల్వీ : మేం గుర్తించేదల్లా సాధ్యమైనంత ఉత్తమ సైన్యాన్ని సంపాదించడం.

శ్రీ ఎస్. సత్యమూర్తి : భారత సైన్యానికి పంజాబ్ తప్ప ఇతర రాష్ట్రాలు ఉత్తమ సైనికుల్ని అందించలేదని ఏ ప్రమాణాల రీత్యా ప్రభుత్వం తీర్మానించుకుందో తెలుసుకోవచ్చా?

శ్రీ ఓగిల్వీ : అనుభవం రీత్యా.

డా. సర్ జైయుద్దీన్ అహ్మద్ : అకౌంట్స్ డిపార్టుమెంట్‌లోని అన్ని శాఖల్లోను మద్రాసీయులు ఆధిపత్యంలో ఉన్నారు కదా. భారతదేశంలో వాళ్ళ సంఖ్యతో తూగేట్టు దామాషాన ప్రభుత్వం వెంటనే వాళ్ళ సంఖ్యను తగ్గిస్తుందో లేదో తెలుసుకోవచ్చా?

శ్రీ ఓగిల్వీ : ఈ ప్రశ్న నుంచి అదెలా ఉత్పన్నమవుతుందో నాకు తెలీదు, కానీ ప్రభుత్వం ఏ స్థానిక కారణం దృష్ట్యానూ సామర్థ్యాన్ని బలి చేసేందుకు సిద్ధంగా లేదు.

విభిన్న కులాలకు చెందిన భారతీయులకు ఏర్పడ్డ భారత పటాలం* ప్రశ్న 1078. శ్రీ ఎమ్. అనంతశయనం అయ్యంగార్ (శ్రీ మను సుబేదార్ తరపున) :

ఎ) భిన్న రాష్ట్రాల నుంచి సిక్కులు, మరాఠాలు, రాజ్‌పుట్లు, బ్రాహ్మణులు, ముస్లిములు లాంటి విభిన్న మతాల నుంచి రిక్రూట్ చేసుకున్న భారతీయులతో భారత పటాలాన్ని ఏర్పాటు చెయ్యాలన్న ప్రయోగం బ్రిటిష్ ప్రభుత్వం ఎప్పుడైనా చేసిందేమో రక్షణ శాఖ కార్యదర్శి తెలియజేస్తారా?

* శాసనసభ చర్చలు, 1938, వాల్యూం 6, పేజీ 2478.

బి) ఈ (ఎ) భాగానికి జవాబు 'లేదు' అని గనక అయితే, అలాంటి చర్య తీసుకోవడం ఎందుకు ఉచితం కాదనుకుంటున్నదీ కారణాలు తెలియజేస్తూ ఈ వి . . . మై ప్రభుత్వం తన విధానం గురించి ఒక ప్రకటన చెయ్యగలదా?

సి) ఘనత వహించిన సర్వ సైన్యాధ్యక్షుడు ఈ విషయాన్ని గురించి చక్రవర్తి గారి ప్రభుత్వంతో చర్చించగలరా?

డి) యూనివర్సిటీ కోర్‌లోనూ, బొంబాయి స్కౌట్ ఉద్యమంలోనూ, దేశ పోలీసు బలగంలోనూ కుల, మత ప్రాతిపదిక పై కేటాయింపు లేదన్న విషయం ప్రభుత్వం వారికి తెలుసా?

శ్రీ ఓగిల్వీ : ఎ) లేదు.

బి) పదాతిదళ విభాగం, దళంలాంటి సైనిక ఉపభాగాలు సమరూపతతో ఉండాలన్నది మౌలిక సూత్రంగా ప్రభుత్వం పరిగణిస్తోంది.

సి) లేదు, ఈ పైన చెప్పిన కారణం వల్ల.

డి) తెలుసు.

శ్రీ ఎస్. సత్యమూర్తి : 'సమరూపత' అన్న పదానికి ప్రభుత్వం ఏ అర్థం చెపుతుందో తెలుసుకోవచ్చా? సమరూపత అంటే ఒకే రాష్ట్రం నుంచి అనా, లేక ఒకే కులం నుంచి అనా?

శ్రీ ఓగిల్వీ : అంటే అర్థం వాళ్ళు ఒకే తరగతికి చెందినవాళ్ళని.

శ్రీ సత్యమూర్తి : ఈ విషయం గురించి మరింత వివరణ కోరవచ్చునా? ఒక తరగతికీ మరో తరగతికీ విభేదం చూస్తున్నారా?

శ్రీ ఓగిల్వీ : తప్పకుండా.

శ్రీ సత్యమూర్తి : ఏ ఆధారంగా? మతపరమైన విభేదమా, జాతిపరమైన విభేదమా, ప్రాంతీయమైనదా?

శ్రీ ఓగిల్వీ : ఏ ఒక్కటీ కాదు. ప్రధానంగా జాతిపరమైంది.

శ్రీ సత్యమూర్తి : ఏ జాతినీ ఎక్కువ ఎంపిక చేస్తున్నారు? దేన్ని ఎంపిక చెయ్యడం లేదు?

శ్రీ ఓగిల్వీ : గౌరవనీయుడైన సభ్యుడు సైనిక చూడవచ్చు.

భారతసైన్యంలో రిక్రూట్‌మెంటు*

శాసనసభ చర్చలు, 1938 వాల్యూం 6, పేజీ 2754.

ప్రశ్న 1162 శ్రీ బ్రజేంద్ర నారాయణ చౌధరి : రక్షణ శాఖ కార్యదర్శి ఈ విషయాలు తెలియజేయగలరా?

ఎ) పంజాబ్ ప్రధాని గౌరవనీయ సర్ సికిందర్ హయాత్ ఖాన్ సోదర సైనికుల్ని ఉద్దేశించి "సైన్యంలో పంజాబీల ఆధిపత్య స్థానానికి భంగం కల్గించాలని ఏ దేశ భక్తియుత పంజాబీ కోరడని" చెప్పినట్లు 1938 సెప్టెంబరు 5వ తేదీ "హిందూస్తాన్ టైమ్స్" పత్రికలో అసోసియేటెడ్ ప్రెస్ ఆఫ్ ఇండియా వార్త వచ్చింది. ఇది ప్రభుత్వం దృష్టికి వచ్చిందా?

బి) పంజాబ్ నుంచే అధిక సంఖ్యాకుల్ని సైనికులుగా చేర్చుకొని పంజాబీల ఆధిక్యాన్ని నిలబెట్టడమే ప్రభుత్వ విధానమా? లేక జాతిపర, ప్రాంతీయ విభేదాలు లేకుండా అన్ని ప్రాంతాల నుంచీ సైన్యంలోకి చేర్చుకునే ప్రయత్నమేమన్నా ఉందా?

**శ్రీ సి.ఎమ్.జి. ఓగిల్వీ :**

ఎ) వచ్చింది.

బి) 1938 సెప్టెంబరు 15న శ్రీ అమరేంద్రనాథ చటోపాధ్యాయ అడిగిన నెంబరు 1060 నక్షత్రం గుర్తు ప్రశ్నకు అనుబంధంగా వచ్చిన ప్రశ్నలకు నేనిచ్చిన సమాధానాల్ని గౌరవనీయులైన సభ్యుని దృష్టికి తీసుకువస్తున్నాను.

**శ్రీ ఎస్. సత్యమూర్తి :** ప్రశ్నలోని (ఎ) భాగానికి వచ్చిన సమాధానానికి సంబంధించి గౌరవనీయులైన మా మిత్రులు లోగడ ఇచ్చిన సమాధానాలు ప్రస్తావించారు. నాకు గుర్తున్నంత వరకు ముందు ఆ ప్రకటన తీసుకువచ్చిన తర్వాత ఆ జవాబుల్ని ఇవ్వడం జరగలేదు. "సైన్యంలో పంజాబీల ఆధిపత్య స్థానానికి భంగం కలిగించాలని ఏ దేశభక్తియుత పంజాబీయుడు కోరడని" పంజాబ్ ప్రధాని చేసిన ప్రకటనను భారత ప్రభుత్వం పరిశీలించిందీ లేనిదీ నేను తెలుసుకోవచ్చా? ఈ ప్రకటన లోని ప్రమాదకరమైన భావాన్ని ప్రభుత్వం పరిశీలించిందా? ఆద్యంతమూ భారతీయంగా ఉండాల్సిన సైన్యంలో ప్రాంతీయ, మత పరమైన ఆధిక్యం చాటుకుంటూ ఒక బాధ్యతాయుత మంత్రివరేణ్యులు చరించకుండా ప్రభుత్వం చర్యలు తీసుకొంటుందా?

**శ్రీ సి.ఎమ్.జి. ఓగిల్వీ :** గత సెప్టెంబరు 15న సరిగ్గా ఇదే మాదిరి ప్రశ్న అడిగిన గౌరవనీయుడైన సభ్యునికి నేనిచ్చిన సమాధానంలోని అవే మాటల్ని మాత్రమే నేను జవాబుగా చెప్పగలను. సైన్యంలో చేర్చుకోవడానికి సంబంధించి ప్రభుత్వ విధానం ఏమిటైందీ పదే పదే చెప్పడం జరిగింది, అది పరమ విస్పష్టంగా ఉంది.

**శ్రీ సత్యమూర్తి :** ఆ విధానం ఉత్తమ సిబ్బందికి సంపాదించడానికి సంబంధించినది. నేను మా గౌరవనీయులైన సభ్యుణ్ణి నిర్దిష్టంగా అడుగుతున్నాను. పంజాబ్ ప్రధాని చేసిన

ప్రకటనలోని అంతరార్థం ఆయన గ్రహించారని ఆశిస్తున్నాను. భారత సైన్యంలో ఏ స్థానిక ప్రధాని అయినా స్థానిక ఆధిపత్యాన్ని చాట..డం ఎంత ప్రమాదకరమైన అర్థాలకు దారి తీస్తుందో ప్రభుత్వం పరిశీలించిందా అనీ, ఈ ప్రమాదకరమైన అపార్థాల్ని నవరించడానికి ఏ చర్యలైనా తీసుకోదలిచారా అనీ నేను తెలుసుకోగోరుతున్నాను.

శ్రీ ఓగిల్వీ : ప్రమాదకరమైన ఉద్దేశ్యాలు ఏవీ లేని, కానీ అందుకు జర్తి వ్యతిరిక్తమైనదనీ ప్రభుత్వం భావిస్తుంది.

శ్రీ సత్యమూర్తి : ఏ ఒక్క ప్రాంతానిదో, మతానిదో ఆధిపత్యం, ఒకవేళ నిజమైనప్పటికీ, బాధ్యతాయుతమైన ప్రముఖులు దాన్ని గురించి చెప్పడం, వాంఛనీయమైన విషయంగా ప్రభుత్వం అంగీకరిస్తుందా? దీనివల్ల సైన్యంలో మతపరమైనవీ, ప్రాంతీయ పరమైనవీ అయిన అసూయలు తల ఎత్తవచ్చనీ ప్రభుత్వం అనుకోవడం లేదా?

శ్రీ ఓగిల్వీ : ఈ శంకలు వేటికీ ఏ ఆధారమూ లేదని ప్రభుత్వం భావిస్తోంది.

శ్రీ ఎమ్.ఎస్. ఆనే : సర్ సికిందర్ హయాత్‌ఖాన్ ప్రకటనలో గర్భితమై ఉన్న విధానాన్ని ప్రభుత్వం అనుమతిస్తుందా?

శ్రీ సి.ఎమ్.డి. ఓగిల్వీ : ప్రభుత్వ విధానాన్ని పదే పదే వివరించడం జరిగింది. స్పష్టం చెయ్యడం జరిగింది.

శ్రీ ఆనే : మళ్ళీ అదే ప్రశ్నను అడుగుతున్నాను. సైన్యంలో పంజాబ్ ఆధిక్యంతో ఉండమేనా ఆ విధానం.

శ్రీ ఓగిల్వీ : నేనీ ప్రశ్నకు పదే పదే జవాబు ఇచ్చాను. అన్ని రాష్ట్రాల నుంచీ ఉత్తమ సిబ్బందిని సైన్యానికి సమకూర్చటమే ఆ విధానం. ప్రస్తుతం సైన్యానికి ఉత్తమ సిబ్బంది ఉందన్న విషయం ప్రభుత్వానికి సంతృప్తిగా ఉంది.

శ్రీ ఎమ్.ఎస్. ఆనే : అంచేత, సర్ సికిందర్ హయాత్‌ఖాన్ సూచించిన విధానాన్ని సవరిస్తూ ప్రభుత్వం ప్రకటన చెయ్యడం అవసరం కాదా?

శ్రీ ఓగిల్వీ : ప్రత్యేకంగా తమ విధానాన్ని మార్చుకునే ఉద్దేశం ఏదీ ప్రభుత్వానికి లేదు.

1938 నవంబరు 28న మరోసారి శాసనసభ్యులకూ మంత్రికీ ప్రతివాదన జరిగింది. అప్పుడు ఈ దిగువ చూపిస్తున్న ప్రశ్నల్ని అడిగారు :

సెంట్రల్ ప్రావిన్సెస్ నుంచీ, బీరార్ నుంచీ భారత సైన్యంలోకి రిక్రూట్‌మెంట్ :

* శాసనసభ చర్చలు, 1938, వాల్యూం 6, పేజీ 3313

ప్రశ్న 1402 శ్రీ గోవింద్ వి. దేశ్‌ముఖ్: రక్షణ శాఖ కార్యదర్శి దయచేసి ఈ అంశాల్ని తెలియజేస్తారా?

ఎ) భారత సైన్యంలోకి మనుషుల్ని చేర్చుకొనేందుకు సెంట్రల్ ప్రావిన్సెస్‌లో, బీరార్‌లో ఉన్న సైన్య కేంద్రాలు;

బి) ఏ తరగతుల నుంచి వాళ్ళను చేర్చుకున్నారో ఆ తరగతులు;

సి) మొత్తం సైన్యంలో, అదే రకంగా ఈ రాష్ట్రాల్లో ఉన్న జనాభాకు సంబంధించి సెంట్రల్ ప్రావిన్సెస్, బీరార్‌ల నుంచి చేర్చుకొన్న వాళ్ళ నిష్పత్తి;

డి) ప్రస్తుత రిక్రూట్‌మెంటు విధానం; దాన్ని మార్చడం జరుగుతుందా? లేక ఎందుకని మార్చడం జరగదు?

శ్రీ సి.ఎమ్.జి. ఓగిల్వీ : సెంట్రల్ ప్రావిన్సెస్ గానీ, బీరార్‌లో గానీ రిక్రూట్‌మెంట్ కేంద్రాలు లేవు. సెంట్రల్ ప్రావిన్సెస్‌లో నివసించే వాళ్ళు ఢిల్లీ రిక్రూట్‌మెంట్ ఆఫీసర్ పరిధిలో ఉన్నారు. బీరార్ వాళ్ళు పూనా రిక్రూట్‌మెంట్ పరిధిలో ఉన్నారు.

బి) బీరార్ మరాఠాలని ప్రత్యేక తరగతిగా చేర్చుకుంటున్నారు. సెంట్రల్ ప్రావిన్సెస్ నుంచీ, బీరార్ నుంచీ రిక్రూట్ చేసుకున్న ఇతర హిందువుల్ని, ముస్లిముల్ని, "హిందువులు" అనీ "ముస్లిము"లనీ వర్గీకరించే ఏ వర్గమానం కిందా చేర్చలేదు.

సి) మొత్తం సైన్యంలో ఈ నిష్పత్తి .03 శాతం ఉంది. ఈ రాష్ట్రాలకి చెందిన మొత్తం మగవాళ్ళ సంఖ్యలో ఈ నిష్పత్తి .0004 శాతం ఉంది.

డి) ప్రస్తుత విధానాన్ని తిరగదోడే ఉద్దేశం ఏదీ వర్తమానంలో లేదు. దీనికి కారణాలు, 1938 సెప్టెంబరు 15న శ్రీ సత్యమూర్తి అడిగిన 1060 నక్షత్రం గుర్తు ప్రశ్నకి అనుబంధంగా వచ్చి ప్రశ్నలకు నేను ఇచ్చిన సమాధానంలోనూ మియాన్ గులాం కాదిర్ మహమ్మద్ షాబాన్ అదే రోజు అడిగిన నక్షత్రం గుర్తు ప్రశ్న 1086 (ఎ) భాగానికి ఇచ్చిన సమాధానంలోనూ ఉన్నాయి. 1936 సెప్టెంబరు 21న భారతీయులకు సైనిక శిక్షణ అన్న అంశం మీద గౌరవనీయులైన సుశీల్ కుమార్ చౌదరి తీర్మానం స్టేట్ కౌన్సిల్‌లో చర్చకు వచ్చినప్పుడు, భారత సైన్యంలో అన్ని తరగతుల వాళ్ళనూ చేర్చుకోవడం గురించి గౌరవనీయులైన పి.ఎస్. సప్రూ తీర్మానం 1935 ఏప్రిల్‌లో వచ్చినప్పుడు ఘనత వహించిన సర్వ సైన్యాధ్యక్షులు ఇచ్చిన సమాధానంలోనూ ఉన్నాయి.

దీనిమీద 1939 ఫిబ్రవరి 6న ప్రతివాదన జరిగింది. అప్పుడు ఈ క్రింద ప్రస్తావించిన ప్రశ్నను అడిగారు.

భారతసైన్యంలోకి రిక్రూట్‌మెంట్

ప్రశ్న 129, శ్రీ ఎస్. సత్యమూర్తి : రక్షణ శాఖ కార్యదర్శి దయచేసి ఈ విషయాలు తెలియజేస్తారా?

ఎ) ఈ ప్రశ్నకు లోగడ ఇచ్చిన సమాధానం తర్వాత, భారత సైన్యంలోకి అన్ని రాష్ట్రాల నుంచీ, అన్ని కులాల నుంచీ, మతాల నుంచీ మనుషుల్ని చేర్చుకోవడం అనే సమస్యను ప్రభుత్వం పరిశీలిస్తుందా?

బి) ఏదైనా నిర్ణయం తీసుకొన్నారా?

సి) ఇతర రాష్ట్రాలకూ, కులమతాలకూ చెందినవాళ్ళు సైన్యంలో ఎందుకు చేరడానికి లేదో ఆ కారణాల్ని ప్రభుత్వం సూటిగా వెల్లడిస్తుందా?

డి) ఇవాళ భారతసైన్యంలోకి రిక్రూట్‌మెంట్ జరిగిన ప్రాంతాలు, మతాలు కాక ఇతర ప్రాంతాలు కులమతాలు భారత సైన్యానికి అవసరమైన సామర్థ్య కొలమానానికి అందడం లేదన్న నిర్ణయానికి ఏ పరీక్షల ద్వారా వచ్చారు?

శ్రీ సి.ఎమ్‌జి. ఓగిల్వీ :

ఎ) లేదు.

బి) ఈ ప్రశ్నే ఉత్పన్నం కాదు.

సి), డి) : దీనికి కారణాలను 1938 సెప్టెంబరు 15న 1060, 1086 నంబరు నక్షత్రం గుర్తులున్న ప్రశ్నలకు, 1938 సెప్టెంబరు 20న, నంబరు 1162 ప్రశ్నకూ 1938 నవంబరు 23న 1402 నంబరు ప్రశ్నకూ నేనిచ్చిన సమాధానాల్లోనూ, భారత సైన్యంలోకి అన్ని తరగతుల వాళ్ళనూ చేర్చుకోవడం గురించి గౌరవనీయులైన పి.ఎస్. సప్రూ ప్రతిపాదించిన తీర్మానం పైన జరిగిన చర్చలకూ, భారతీయులకూ సైనిక శిక్షణ గురించి గౌరవనీయులైన శ్రీ సుశీల్ కుమార్‌రాయ్ చౌధరి గారి తీర్మానం మీద జరిగిన చర్చలకూ, 1935 మార్చి 13న, 1938 ఫిబ్రవరి 21న ఘనత వహించిన సర్వ సైన్యాధ్యక్షులు స్టేట్ కౌన్సిల్‌లో ఇచ్చిన సమాధానాల్లోనూ వెల్లడించడం జరిగింది.

భారత ప్రభుత్వం ఇలా మూగనోము పట్టాలని కుట్ర చేసింది. ఈ కుట్రను ఇటీవల భారత అంతరంగిక కార్యదర్శి (సెక్రెటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా) భగ్నం చేశాడు. కామన్స్ సభలో ఒక ప్రశ్నకు సమాధానంగా అతి కీలకమైన, ఆసక్తికరమైన ఈ విషయం గురించిన యావత్తు సమాచారం అందజేశాడు. 1943 జులై 8న, ఆయన ఇచ్చిన సమాధానాన్ని బట్టి భారత సైన్యం ప్రాంతీయ, కులమత పర నిర్మితి మనకు తెలుస్తోంది.

శాసనసభ చర్చలు, 1939, వాల్యూం 1, పేజీలు 253.

### భారత సైనంలో రాష్ట్రాలవారీ సంఖ్య

| | రాష్ట్రం | శాతం |
|---|---|---|
| 1. | పంజాబ్ | 50 |
| 2. | యు.పి. | 15 |
| 3. | మద్రాస్ ప్రెసిడెన్సీ | 10 |
| 4. | బొంబాయి ప్రెసిడెన్సీ | 10 |
| 5. | వాయవ్య రాష్ట్రం | 5 |
| 6. | అజ్మీరు, మేర్వార్ | 3 |
| 7. | బెంగాల్ ప్రెసిడెన్సీ | 2 |
| 8. | సి.పి. బీరార్ | |
| 9. | అస్సాం | 5 |
| 10. | బీహారు | |
| 11. | ఒరిస్సా | |
| 12. | నేపాల్ | 8 |

### భారత సైన్యంలో కులమతాల వారీ సంఖ్య

| | | |
|---|---|---|
| 1. | ముస్లిములు | 34 శాతం |
| 2. | హిందువులు, గూర్ఖాలు | 50 శాతం |
| 3. | సిక్కులు | 10 శాతం |
| 4. | క్రైస్తవులు, ఇతరులు | 6 శాతం |

అంతరంగిక శాఖ కార్యదర్శి ఇచ్చిన సమాచారం నిజంగా చాలా మంచిదే. అయితే ఇది యుద్ధకాలం నాటి భారతసైన్యానిది. శాంతికాలంలో ఈ సైన్యం చాలా భిన్నంగా ఉంటుంది. శాంతి కాల సైన్యం క్షాత్రం, క్షాత్రేతర భేదం అన్న ప్రసిద్ధ సూత్రం మీద ఆధారపడుతుంది. యుద్ధకాలంలో ఆ భేదం రద్దయింది. ఇప్పుడు తిరిగి శాంతి స్థాపితమైంది. కాబట్టి దానికి మళ్ళీ ప్రాణం పొయ్యరన్న హామీ ఏదీ లేదు. మనం తెలుసుకోవాలనుకుంటున్నదీ భారత సైన్యం శాంతి కాలంలో ఎలా ఉండబోతున్నదీ అన్న విషయం. ఆ సంగతి ఇంకా అజ్ఞాతంగానే ఊహ మాత్రంగానే మిగిలిపోయింది.

యుద్ధాత్పూర్వం మామూలుగా ముస్లిముల నిష్పత్తి 60–70 శాతం మధ్య ఉంటుందని కొందరు అంటున్నారు. ఏ 50 శాతం దరిదాపుల్లోనో ఉంటుందని కొందరంటున్నారు. ఖచ్చితమైన సమాచారం లేకపోవడంతో అస్సలు పరిస్థితిని వెల్లడి చేసేది ఈ 50 శాతం సంఖ్య అని భావింపవచ్చు. అయితే, ఈ విషయమై కొంత అభిప్రాయం కలిగించుకోగల స్థానంలో

ఉన్నవాళ్ళను విచారించిన మీదట ఈ అంకె ముఖ్యంగా స్థిరమవుతుంది. ఈ అంకె 50 శాతమే అనుకున్న హిందువులకిది కలవరం పుట్టించేటటువంటిది. ఇదేగనక నిజమైతే తిరుగుబాటు తర్వాత భారతదేశంలో బ్రిటిష్ సైన్యం అనుసరించిన సుప్రతిష్ఠత సూత్రాల్ని దారుణంగా ఉల్లంఘించడమవుతుంది.

తిరుగుబాటు తర్వాత భారత సైన్య వ్యవస్థ గురించి బ్రిటిష్ ప్రభుత్వం రెండు విచారణలు జరపించాలని ఆదేశించింది. మొదటి విచారణను 1859లో నియమించిన పీల్ కమిటీ నిర్వహించింది. రెండవ విచారణను ప్రత్యేక సైనిక కమిటీ అన్న సంఘం నిర్వహించింది. దీన్ని 1879లో నియమించారు. దీని గురించి ఇదివరకే ప్రస్తావించుకున్నాం.

పీల్ కమిషన్ పరిశీలించిన ప్రధాన సమస్య 1857 తిరుగుబాటుకు దారితీసిన బెంగాల్ సైన్యంలోని లోటుపాట్లు కనిపెట్టడం. తిరుగుబాటు చేసిన బెంగాల్ సైన్యంలోని ప్రధాన బలహీనత ఏమిటైందీ సాక్షి తర్వాత సాక్షి చెప్పినట్లు –

"స్థిర సైన్యంలో నానా గోత్రికులు గుడ్డిదావుగా కలిసిపోయారు. తరగతుల రీత్యా, తెగరీత్యా ఏర్పాటు లేదు. హిందువులు, మహమ్మదీయులు సిక్కులు, పర్షియులు శిబిరాల్లో కలగాపులగం అయ్యారు. దాంతో ఒక రకంగా ప్రతివాళ్ళకూ, స్వజాతి దురభిమానం కొంతమేరకు పోయింది, ఒక ఉమ్మడి భావంతో ఉత్తేజితం అయ్యారు.[1]

అంచేత, సర్ జాన్ లారెన్స్, భారత సైన్యాన్ని వ్యవస్థీకరించడం గురించి ఏ జాగ్రత్తలు తీసుకోవాలో ప్రతిపాదించాడు. "వ్యత్యాసాన్ని నిలబెట్టాలి. అది చాలా ఉపయోగకరం. అలా వ్యత్యాసం ఉన్నంతకాలం ఒకదేశ మహమ్మదీయుడు మరోదేశ మహమ్మదీయుడంటే అసహ్యించుకుంటాడు, భయపడతాడు, ద్వేషిస్తాడు. ఇక ముందు సైనిక దళాలు ప్రాంతీయమైనవిగా ఉండాలి. భౌగోళిక పరిమితుల మేరకి ఉండాలి. విభేదాలు, ద్వేషాలు గట్టిగా ఉన్నటువంటివై ఉండాలి. ఒకే రాష్ట్రానికి చెందిన హిందువుల్ని, మహమ్మదీయుల్ని, అన్ని జాతులవాళ్ళనూ ఒకే పటాలంలో చేర్చుకోండి. వేరేవాళ్ళను అందులో చేర్చకండి. ప్రత్యేక పటాలాన్ని ఏర్పాటు చేశాక వాటిని అలాగే ఉండనిద్దాం, అవసరార్థం. ఈ మాదిరి పద్ధతివల్ల రెండు గొప్ప ముప్పులు తప్పుతాయి. దేశీయ సైన్యం మొత్తంగా ఉండే స్వజాతి అభిమానం మొదటిది. వాళ్ళంతా జాతులుగా అలా కలిసి ఉండడం వల్ల, ఇతర రాష్ట్రాలకు చేసే యాత్రల వల్ల పుట్టుకొచ్చే దుష్ట రాజకీయ కార్యకలాపాలూ, కూహకాలు రెండవది.[2]

పీల్ కమీషన్ ముందు చాలామంది సైన్యం వాళ్ళు ఈ ప్రతిపాదనను సమర్థించారు. భారత సైనిక విధానంగా దీన్ని సిఫార్సు చేశారు. ఈ సిద్ధాంతమే 'మూలపాందిక" అన్న పేరుతో

1. మెక్‌మోహన్, లోనెట్, "భారతసైన్యం" పేజీలు 84-85 చౌధరి ఉల్లేఖన.
2. చౌదరి ఉల్లేఖన

ప్రసిద్ధమైంది.

1879 నాటి స్పెషల్ ఆర్మీ కమిటీ పూర్తిగా భిన్నమైన వేరే సమస్యకు సంబంధించింది. ఆ కమిటీ జారీ చేసిన ప్రశ్నావళిని బట్టి ఆ సమస్య వెల్లడవుతుంది. ఆ ప్రశ్నావళిలో ఈ ప్రశ్న వుంది :

"సామ్రాజ్య భద్రత కోసం భారత సైన్యానికి సమర్థవంతమైన, అభ్యమాన రిజర్వుదళం అవసరం అని భావిస్తే, భారత దేశంలోని అతి దుర్బల, క్షాత్రేతర జాతుల నుంచి కాక మేటి సైనికుల్ని అందించే ప్రాంతాల నుంచి చేర్చుకొని, పోషించడం మంచిది కాదా? ఏ ప్రత్యేక జాతికీ, మతానికీ ఆధిక్యాన్ని గాని, మరీ ఎక్కువ శక్తినిగానీ, ఇచ్చే అవసరం లేకుండానే, సామ్రాజ్య భద్రతని దృష్టిలో ఉంచుకొని ఇలా చెయ్యకూడదా?

ఈ ప్రశ్నలోని ప్రధాన భాగం "ఏ ప్రత్యేక జాతికీ, మతానికీ ఆధిక్యాన్ని గాని, మరీ ఎక్కువ శక్తినిగానీ" ఇవ్వనవసరమో, అనవసరమేమోనన్నదే ఈ ప్రశ్నకు సంబంధించి కమిటీ ముందు వెల్లడైన అభిప్రాయం ఏకగ్రీవంగా ఉంది.

బాంబే సైన్యానికి సర్వసైనానిగా ఉన్న లెఫ్టినెంట్ జనరల్ హెచ్.జె. వారెన్ ఇలా చెప్పాడు :

"అనుచిత శక్తినీ, ప్రాముఖ్యాన్ని ఆ ప్రాంతాల జాతులకూ, మతాలకూ ఇవ్వకుండా, మేటి సైనికుల్ని అందించే భారత భూభాగాల నుంచి మాత్రమే సైన్యంలో చేర్చుకొని భారత సైన్యంలో రిజర్వుదళాల్ని ఏర్పాటు చెయ్యడం సాధ్యం కాదని నా అభిప్రాయం".

సర్వ సైన్యాధ్యక్షుడైన సర్ ఫ్రెడరిక్ పి. హైనే ఇలా అన్నాడు :

"జాతి, భాష, ప్రయోజనాలను బట్టి సంఖ్యాపరంగా బెంగాల్ సైన్యం ఉన్నదానికంటే ప్రత్యేకతతో ఉండే ఈ సైన్యాల్ని (మద్రాసు, బొంబాయి సైన్యాన్ని దానికి ప్రతిగా ఉండేట్టు నిలుపుకోవడమే చాలా తెలివైందీ, యుక్తమైందని నా అభిప్రాయం. సైన్యంలోకి చేర్చుకోదగ్గ మేటి సైనికులలో ఏర్పాటు చెయ్యబోయే రిజర్వుకు శక్తి సామర్థ్యాల రీత్యా ఈ సైనికులు ఏమీ లెక్కకారు. బెంగాల్ సైన్యశ్రేణికి అనుభవంతో, అదే తరగతుల వాళ్ళతో ఏర్పాటు చేసే రిజర్వు దళం మద్రాసు, బొంబాయి సిపాయిల స్థానంలో రావడమే ఈ రిజర్వుదళం ఉద్దేశ్యమైతే, ఇంతకంటే అనుచితమూ, అవివేకమూ అయిన ఊహ ఉండదని నా అభిప్రాయం".

పంజాబ్ లెఫ్టినెంట్ గవర్నరు కూడా ఇదే అభిప్రాయాన్ని వెల్లడి చేశాడు. భారతదేశంలో "యావత్ సైన్యానికీ, ఒకే రిక్రూటింగ్ క్షేత్రం ఉండడాన్ని వ్యతిరేకిస్తున్నట్లు ఆయన చాటాడు. "రాజకీయ కారణాల దృష్ట్యా, ఒకేజాతి ఆధిక్యాన్ని నిరోధించాలని" ఆయన

అన్నాడు.

స్పెషల్ కమిటీ ఈ అభిప్రాయాన్ని అంగీకరించింది. సైన్యంలో ఏ ఒక్క జాతికీ, మతానికీ ఆధిక్యం ఉండని రీతిలో భారత సైన్యాన్ని క్రమబద్ధం చెయ్యాలనీ అది సిఫార్సు చేసింది.

భారత సైనిక విధానంలో ఈ రెండూ నిర్ణాయక సూత్రాలు 1879 నాటి స్పెషల్ ఆర్మీ కమిటీ నిర్దేశించిన ఈ సూత్రాన్ని బట్టి భారత సైన్యం కుల, మత పరంగా రూపు తీసుకోవడంలో జరిగిన మార్పులు ఆసాంతం విప్లవాత్మకమైనవి. ఈ విప్లవాన్ని ఎలా జరగనిచ్చారో ఊహకి అందదు. సుప్రతిష్టంగా ఉన్న సూత్రాన్ని కాలదన్ని జరిగిన విప్లవం అది. భారత సైన్యంలో వాయవ్య ప్రాంతం వాళ్ళ ఆధిక్యం పెరిగిపోతుందన్న భయంతో నిజంగా ఈ సూత్రం వచ్చింది. ఈ ధోరణిని అదుపు చెయ్యాలన్న ప్రత్యేక లక్ష్యంతో దీన్ని పైకెత్తారు. ఈ సూత్రాన్ని ఏదో మార్గదర్శక నియమంగా ఉండేట్టు చాటటమే కాదు. ఏ మాత్రం బెసకనట్లుగా అమలు చేసారు. లార్డ్ రాబర్ట్స్ ఈ సూత్రాన్ని వ్యతిరేకించాడు, ఎందుకంటే ఆయనకిష్టమైన వాయవ్య ప్రాంతం వాళ్ళ రిక్రూట్‌మెంటు మీద ఇది పరిమితిని విధించింది. ఆయన కూడా భారత సైన్య సర్వసైన్యాధ్యక్షుడిగా కాలంలో దీనికి తల ఒగ్గవలసి వచ్చింది. ఈ సూత్రాన్ని ఎంత గొప్పగా భావించారంటే 1903లో లార్డ్ కిచెనర్ 15 మద్రాసీ దళాల్నీ, పంజాబీ దళాలుగామార్చేందుకు ఉద్యుక్తుడైనాడు. గూర్ఖాల నిష్పత్తిని, పఠాన్ల నిష్పత్తినీ పెంచి సిక్కులకూ, పంజాబీ ముస్లిములకూ సరితూగేట్టు వెంటనే ప్రయత్నించాడు. ఆయన జీవితచరిత్ర రాసిన సర్ జార్జి ఆర్థర్ చెప్పినట్లు :

"తిరుగుబాటు నేర్పిన గుణపాఠం దృష్ట్యా, భారత సైన్యంలో ఏ ఒక్కళ్ళకో అనవసరమైన ఆధిక్యం ఇస్తే వచ్చే ప్రమాదం గురించి ప్రభుత్వం హెచ్చరికగానే ఉంది. పంజాబీ పదాతిదళంలో కొంతమందిని హెచ్చుగా చేర్చుకుంటే పర్యవసానంగా ఉపయుక్తమైన గూర్ఖాలనీ ఇంకా చేర్చుకోవాలి. సరిహద్దు దళంలో హద్దు ఆవలి పఠాన్లనీ ఇంకా చేర్చుకోవాలి

మహాయుద్ధ కాలం నాటి దాకా, ఇంత ఏకగ్రీవ ఆమోదం పొంది ఇంత నిక్కచ్చిగా అమలు జరిగిన ఈ సూత్రం మహాయుద్ధం తర్వాత చడీ చప్పుడు లేకుండా ఏ పరితాపం లేకుండా, రహస్యంగా గాలికి కొట్టుకుపోవడం నిజంగా ఊహకి అందదు. భారత సైన్యంలో ముస్లిములకు అంత ఆధిక్యం బ్రిటిష్‌వాళ్ళు ఎందుకు ఇచ్చినట్లు? రెండు వివరణలు ఇవ్వచ్చు. ఒకటి మహాయుద్ధంలో వాళ్ళు హిందువుల కంటే మంచి సైనికులుగా బుజువు చేసుకొన్నారు. రెండవదేమంటే, బ్రిటిష్ వాళ్ళు ఆ సూత్రాన్ని భగ్నం చేసి ముస్లిములకు సైన్యంలో ఆ ఆధిక్యం ఇచ్చారు. ఏమంటే బ్రిటిష్ వాళ్ళ నుంచి రాజకీయాధికారాన్ని లాక్కోవడం కోసం ఆందోళన చేసే హిందూశక్తుల్ని ప్రతిఘటించాలని వాళ్ళు భావించారు.

సరే, ఈ వివరణలు ఏమైనా, పైన పరిశీలించిన దాన్నిబట్టి రెండు విషయాలు కొట్టొచ్చినట్లు తేలుతాయి. ఇవాళ భారత సైన్యం ప్రముఖంగా ముస్లిములతో నింపి ఉండడం ఒకటి. ఆధిక్యంతో ఉన్న ముస్లిములు పంజాబ్ నుంచీ, వాయవ్య రాష్ట్రం నుంచీ వచ్చినవాళ్ళు కావడం మరొకటి. భారత సైన్యం ఇలా రూపు తీసుకుందీ అంటే అర్థం పంజాబ్, వాయవ్య రాష్ట్రాలకు చెందిన ముస్లిములు విదేశీ దాడి నుంచి భారతదేశాన్ని కాపాడే ఏకైక రక్షకులు అవుతున్నారన్న మాట. ఈ విషయం ఎంత ప్రసిద్ధం అయిందంటే పంజాబ్, వాయవ్య రాష్ట్రాల ముస్లిములు బ్రిటిష్ వాళ్ళు దఖలు పరచిన ఈ ఘనమైన స్థానాన్ని బాగా గుర్తించారు. ఎందుకని బ్రిటిష్ వాళ్ళు అలా చేసారో వాళ్ళకే తెలియాలి. తాము "భారతదేశానికి ద్వారం కావలి వాళ్ళమని" వాళ్ళు తరచూ అంటూ ఉంటారు. ఈ కీలక విషయం దృష్ట్యా హిందువులు భారత రక్షణ సమస్యను పరిశీలించాలి.

ఈ "ద్వారం కావలివాళ్ళ" మీద భారతీయులు ఆధారపడగలరా? భారత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలని కాపాడుకోగలరా? ద్వారం దగ్గరకు ఎవళ్ళు దూసుకు వస్తారోనన్న దాని మీద దీని జవాబు ఆధారపడుతుంది. భారతదేశ వాయవ్య సరిహద్దు నుంచి ద్వారం మీదకు తోసుకు వచ్చేందుకు అవకాశం ఉన్న పరాయి దేశాలు రెండే ఉన్నాయి, రష్యా, ఆఫ్ఘనిస్తాన్‌లు. ఈ రెండు దేశాల సరిహద్దులూ భారత సరిహద్దులను తాకుతూ ఉన్నాయి. ఏ దేశం ఎప్పుడు భారతదేశం మీద దాడి చేస్తుందో ఎవళ్ళు కచ్చితంగా చెప్పలేరు. రష్యా గనక ఆ దాడి చేస్తే ఈ ద్వారపాలకులు దృఢంగా ఉంటారు, ద్వారాన్ని కాపుకాస్తారు, దురాక్రమణదారుల్ని అడ్డగిస్తారు. కానీ ఆఫ్ఘన్లు తమంతతాముగాని, ఇతర ముస్లిము రాజ్యాలతోగాని, భారతదేశం మీదకు దండెత్తి వచ్చారనుకోండి, ఈ "కావిలివాళ్ళు" దురాక్రమణదారుల్ని ఆపుతారా లేక తలుపులు తెరిచి వాళ్ళను లోపలికి రానిస్తారా? ఈ సమస్యను ఏ హిందువు కూడా ఉపేక్షించలేడు. ఈ సమస్యకి సంబంధించి ప్రతి హిందువుకూ అభయం ఉండాలి. ఏమంటే ఇది చాలా కీలకమైన సమస్య.

ఆఫ్ఘనిస్తాన్‌కు భారతదేశం మీద దాడి చేసే ఆలోచనే ఎప్పటికీ రాదని అనుకోవచ్చు. కానీ కీడెంచి మేలెంచడం అన్నివేళలా మంచిది. పంజాబీ, వాయవ్య రాష్ట్రాల ముస్లిం సైన్యం ఎంత విధేయంగా, ఆధారపడ్డదిగా ఉండగలదో ఆఫ్ఘనిస్తాన్ ఒకవేళ దాడిచేస్తే అప్పుడది ప్రవర్తించే దాన్నిబట్టే నిగ్గదీయగలం. తమ మాతృభూమిపిలుపుని అది అందుకుంటుందా? లేకపోతే మతం పిలుపును అది అందుకుంటుందా? అన్నది సమస్య. పరమభద్రత సాధించాలి అంటే దాన్ని పరీక్షించాలి. భారతదేశం బ్రిటిష్‌వాళ్ళ గొడుగు కింద ఉన్నంతకాలం విదేశీదాడి గురించి బెంగపడాల్సిన అవసరం లేదనుకుంటూ, ఈ ఇబ్బందికరమైన, చిరాకుపెట్టే సమస్యను దాటవెయ్యడం క్షేమం కాదు. ఆ మాదిరి దిలాసా వైఖరి ఏమాత్రం క్షంతవ్యం కాదు, కనీస పక్షం చెప్పాలంటే, గ్రేట్ బ్రిటన్ భారతదేశాన్ని రక్షించలేకపోయే పరిస్థితి ఉత్పన్నం కావచ్చని గత

యుద్ధం చూపించింది. అసలు అలాంటప్పుడే భారతదేశానికి ఎంత రక్షణ అవసరమైనా. ఇది మొదటి విషయం. ఒక వ్యవస్థ సామర్థ్యం ఎంతటిదో కృతిమ పరిస్థితులలో కాక, సహజ పరిస్థితుల్లో నిగ్గు తేలాలి. ఇది రెండవ విషయం. బ్రిటిష్ అజమాయిషీలో ఉన్నప్పుడే భారతదేశ సైనికుడి ప్రవర్తన కృత్రిమంగా ఉంటుంది. భారత అజమాయిషీ ఉన్నప్పుడే సహజ ప్రవర్తనగా ఉంటుంది. బ్రిటిష్ అజమాయిషీ ఉన్నప్పుడే అతని సహజ ప్రవర్తనకి ఎక్కువ అవకాశం ఉండదు. సైన్యంలో ఉన్నవాళ్ళ సహజసిద్ధమైన సానుభూతులకు ఎక్కువ అవకాశం ఉండదు. అందుకనే సైనికులు అంత చక్కగా ప్రవర్తిస్తూ ఉంటారు. అయితే అది కృత్రిమ పరిస్థితి, సహజమైంది కాదు. బ్రిటిష్ అజమాయిషీలో ఉండగా బాగా ఉన్న సైన్యం భారత అజమాయిషీలో కూడా అంత బాగానూ ఉంటుందన్న నమ్మకం లేదు. బ్రిటిష్ అజమాయిషీ తొలిగి పోయినా కూడా అది అంత బాగానూ ఉంటుందన్న నమ్మకం హిందువులకు కలగాలి.

ఆఫ్ఘనిస్తాన్ భారతదేశం మీద దాడి చేస్తే ఈ పంజాబీ, వాయవ్య సరిహద్దు రాష్ట్రాల ముస్లిం సైన్యం ఎలా ప్రర్తిస్తుందీ అన్న సమస్య చాలాసందర్భమైందీ, కీలకమైందీని. ఎంత వెగటుగా ఉన్నా ఈ సమస్యను పరిశీలించి తీరాలి.

సైన్యంలో ఎక్కువభాగం ముస్లిములేనని రూఢి అయిపోయిన అంశంగా ఎందుకు ఊహించుకోవడం, అలా కాకుండా తప్పించలేమనీ ఎందుకు ఊహించుకోవడం అని ఎవళ్ళనా అనవచ్చు. అలాకాకుండా తప్పించగల వాళ్ళు నిరభ్యంతరంగా తమ ప్రయత్నాలు తాము చెయ్యవచ్చు. కానైతే, ఇప్పుడు ఎవళ్ళకైనా కనిపించేట్లుగా ఉన్న ఈ పరిస్థితిని తప్పించలేం. తప్పించలేకపోగా, రాజ్యాంగాన్ని సవరించినప్పుడు ముస్లిం మైనారిటీకి కాపుదలగా దీన్ని చేర్చినా నేను ఆశ్చర్యపడను. ముస్లిములు తప్పకుండా ఈ డిమాండ్ చేస్తారు. హిందువులకు పోటీగా ముస్లిములు ఏదోవిధంగా ఎప్పుడూ నెగ్గుకొస్తారు. అంచేత భారతసైన్యం ఇప్పుడు ఉన్నట్లే ఉంటుందన్న ఊహతో మనం సాగాలి. పునాది ఇలానే ఉండగా పరిశీలించాల్సిన సమస్య మునుపు ఉన్నట్లే ఉంటుంది. ఆఫ్ఘనిస్తాన్ దాడి చేస్తే దేశరక్షణకు సంబంధించి సైన్యం మీద హిందువులు భరోసా ఉంచగలరా? భారత జాతీయ వాదులనబడే వాళ్ళు మాత్రమే 'ఆఁ' అని సమాధానం ఇస్తారు. ఈ ప్రశ్నకు సమాధానం ఇచ్చేముందు యదార్థవాదులతో గుండెమీద చెయ్యి వేసుకుని మాట్లాడే వ్యక్తి ఒక్క క్షణం ఆలోచించాలి. హిందువుల్ని ముస్లిమ్‌లు "కాఫిర్లు"గా పరిగణిస్తారు, వాళ్ళను తుడిచిపెట్టాలి గానీ రక్షించడం కాదు అని అనుకుంటారు. యదార్థవాదులు ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. ముస్లిములు, యూరోపియన్లను తమకంటే అధికులుగా గుర్తించినా, హిందువుల్ని తమ కంటే తక్కువగా చూస్తారు. ఈ విషయాల్ని యదార్థవాదులు గమనించాలి. హిందూ అధికార్ల ఆధిపత్యం కింద ముస్లిములను ఉంచితే, ఆ ముస్లిములు ఎంతవరకు ఆ హిందూ అధికార్లను మన్నిస్తారనేది సంశయాత్మకం. ముసల్మాన్‌లందర్లోకీ వాయవ్య రాష్ట్రముస్లిములే హిందువులతో తమ సంబంధాల విషయంలో

విరోధించేవాళ్ళు. పంజాబ్ ముస్లిములు ముస్లిం ప్రపంచమంతా సమైక్యం అవాలనే ప్రచారానికి లొంగిపోతారు. ఈ విషయాల్ని యదార్థవాది గుర్తించాలి. ఇన్ని విషయాలను పరిశీలించాక కూడా, ముస్లిం దేశం దండయాత్ర చేసినా, భారతసైన్యంలో ఉన్న ముస్లిం తన జన్మభూమికి విధేయంగా ఉంటాడని, దురాక్రమణదారుని పక్షం వహించడని అనే హిందువు గుండె ధైర్యం ఉన్నవాడని అనడానికి సందేహం లేదు

1899లో థియోడోర్ మారిసన్* కూడా ఈ అభిప్రాయం వెల్లడించాడు.

"స్వతంత్ర భారత ప్రభుత్వస్థాపనను అప్పగించడానికి మహమ్మదీయుల దృక్పథాలే చాలు. (భారత ప్రజానీకంలో వాళ్ళే పెద్ద కబ్జాకోర్లు, జగడాలమార్లు). ఉత్తరాది నుంచి ఆఫ్ఘన్లు, స్వతంత్ర భారతం మీదకు ఊడిపడితే గనక, ఆఫ్ఘన్లను తరిమి కొట్టేందుకు మహమ్మదీయుడు సిక్కులతోనూ, హిందువులతోనూ కలవడానికి బదులుగా స్వజాతి, మతపర సంబంధాలకు ఆకర్షితుడై ఆ జెండా కింద చేరిపోతాడు"

1919 ఖిలాఫత్ ఉద్యమం సాగేటప్పుడు భారతదేశం మీదకు దండెత్తి రావలసిందిగా భారత ముస్లిములు ఆఫ్ఘనిస్తాన్ అమీరును ఆహ్వానించేంతవరకు వెళ్ళారు. ఈ విషయాల్ని గుర్తు చేసుకొంటే సర్ థియొడోర్ మారిసన్ వెల్లడించిన అభిప్రాయాలకు మరింత పుష్టి నిస్తుంది. ఇదేదో ఊహామాత్ర విషయం అన్న భావం పోతుంది.

పంజాబ్, వాయ్వ సరిహద్దు రాష్ట్రాల ముస్లిములతో ఉన్న సైన్యం ఆఫ్ఘనిస్తాన్ దాడి చేస్తే ఎలా ప్రతిస్పందిస్తుంది అన్న సమస్య మాత్రమే కాదు. హిందువులు పరిశీలించాల్సిన విషయం హిందువులు బాగా ఆలోచించాల్సిన సమస్య మరొకటి ఉంది. అదీ దీంతో సమానమైందే. ఆ సైన్యం విశ్వాసపాత్రత ఎలాంటిదైనా, ఆఫ్ఘన్లు దాడి చేస్తే, ఆ దాడి ఎదుర్కొనేందుకు సైన్యాన్ని నియోగించే స్వేచ్ఛ భారత ప్రభుత్వానికి ఉందా? ఈ సందర్భంలో ముస్లింలీగ్ వైఖరి పట్ల దృష్టి పెట్టాలి. అదేమిటంటే ముస్లిం రాజ్యాలకు వ్యతిరేకంగా భారత సైన్యాన్ని పంపగూడదు అని. ఇందులో వింతేమీ లేదు. ఈ విషయాల్ని లీగ్‌కు చాలాకాలం ముందే ఖిలాఫత్ కమిటీ చాటి చెప్పింది. దీన్నలా ఉంచినా, భవిష్యత్‌లో భారత ముస్లిములు దీన్ని తమ సిద్ధాంతంగా ఏ మేరకు గ్రహిస్తారన్న సమస్య ఉండనే ఉంది. బ్రిటిష్ ప్రభుత్వానికి సంబంధించి లీగ్ ఈ అంశం మీద నెగ్గలేకపోయింది. అంతమాత్రాన భారత ప్రభుత్వంతో నెగ్గలేదని అర్థం కాదు. ఉన్న అవకాశాల్ని బట్టి చూస్తే నెగ్గుతుంది. ఏమంటే హిందువుల వైపు నుంచి ఈ సూత్రం ఎంత దేశ ద్రోహపూరితమైందైనా ముస్లిం మనోభావాలకు చాలా అనురూపంగా ఉంటుంది. లీగ్ భారతదేశంలో ఉన్న ముస్లిం వర్గం నుంచి సామాన్యంగా తోడ్పాటు పొందుతుంది. తమ సైన్యాన్ని నియోగించే భారతదేశపు హక్కు మీద ఈ పరిమితి విధించడంలో లీగ్ నెగ్గితే, హిందువుల గతి ఏమవుతుంది?

* ఇంపీరియల్ రూల్ ఇన్ ఇండియా, పేజీ 5

హిందువులు ఆలోచించాల్సిన మరో అంశం ఇది.

భారతదేశం రాజకీయంగా ఏకఖండంగా ఉండిపోతే పాకిస్తాన్ సృష్టించిన రెండు జాతుల సిద్ధాంతం పాలుపోసుకుంటూ సాగిపోతే, హిందువుల గతి ముందు నుయ్యి, వెనక గొయ్యి అన్న తంతుగా తయారవుతుంది, రక్షణ విషయాలకు సంబంధించినంతవరకు సైన్యం ఉన్నదాన్ని వినియోగించుకోరు, ముస్లింలీగ్ అభ్యంతరాల పల్ల వినియోగించుకున్నా, ఏ మేరకు దాని మీద ఆధారపడవచ్చునన్నది సందేహమే. ఇది ఎంత దయనీయమైన పరిస్థితో అంత ప్రమాదకరమైంది. సైన్యం పంజాబ్, వాయవ్య సరిహద్దు రాష్ట్రాల ముస్లిముల ఆధిపత్యంలో ఉంటే హిందువులు దాని జీతభత్యాలు ఇవ్వాలి, కానీ దాన్ని ఉపయోగించుకోలేరు. ఒకవేళ ముస్లింలీగ్ మాట నెగ్గి, ముస్లిం దేశాలకు వ్యతిరేకంగా సైన్యాన్ని నియోగించే స్వేచ్ఛ భారతదేశానికి లేకపోయినా సైన్యంలో ముస్లిముల ఆధిక్యత సైనిక పరిమితుల రీత్యా తగ్గినా, సరిహద్దులో ఉన్న ముస్లిం దేశాలతో అణిగి ఉండే సహకారం చూపించాల్సిందే, బ్రిటిష్ సర్వసత్తాక అధికారం కింద భారతదేశంలోని రాష్ట్రాల మాదిరిగా.

హిందువులు ఏదో ఒకదాన్ని ఎంచుకోవాల్సి వస్తుంది. నమ్మకమైన సైన్యాన్ని ఉంచుకోవడమో, భద్రత గల సరిహద్దును ఉంచుకోవడమో, ఈ చిక్కు విషయంలో హిందువులు అవలంబించదగ్గ యుక్తివంతమైన మార్గం ఏది? ముస్లిం భారత్ సమైక్య భారత్‌లో భాగంగా ఉండాలనే వాళ్ళు పట్టుబట్టాలి. అప్పుడు భద్రతకు సరిహద్దు ఉంటుంది. ఇది ప్రయోజనకరమా? లేక భారతదేశం నుంచి వేర్పాటుని అంగీకరించాలి. అప్పుడు నమ్మదగ్గ సైన్యం ఉంటుంది. ఇది ప్రయోజనకరమా? ఇక్కడి ముస్లిములు హిందువులంటే ద్వేషంతో ఉన్నారు. ఈ విషయంలో అనుమానమే లేదు. అలాంటప్పుడు భారతదేశానికి ఏది మంచిది. ఈ ముసల్మానులు బయట, వ్యతిరేకిస్తూ ఉండడమా? లేక లోపలే ఉండి వ్యతిరేకిస్తూ ఉండడమా? విచక్షణా జ్ఞానం ఉన్న ఎవళ్ళని ఈ ప్రశ్న అడిగినా ఒక్కటే జవాబు వస్తుంది. అదేమిటంటే, ముసల్మాన్లు హిందువులకు వ్యతిరేకంగా ఉండేట్టయితే, వాళ్ళు బయట ఉండి వ్యతిరేకించడమే మేలు. లోపల ఉండి వ్యతిరేకించే కంటే, నిజానికి ముస్లిములు బయట ఉండడం కంటే త్రికరణశుద్ధిగా కోరదగ్గది లేదు. భారత సైన్యంలో ముస్లిముల ఆధిక్యాన్ని వదిలించుకోవడానికి ఇదొక్కటే మార్గం.

దీన్ని ఎలా సాధించాలి? ఇక్కడ కూడా ఒక్కటే దారి. పాకిస్తాన్ ఏర్పాటుని సమర్థించటం. పాకిస్తాన్ ఆవిర్భవిస్తే గనక హిందూస్తాన్ తమకు ఉన్న పుష్కలమైన మానవ వనరులతో, డబ్బుతో తనదిగా చెప్పుకోదగ్గ సైన్యాన్ని ఏర్పాటు చేసుకోగలదు. దాన్ని ఎప్పుడు ఎలా ఎక్కడ నియోగించాలి అని శాసించేవాడు ఉండడు. పాకిస్తాన్ ఆవిర్భావం వల్ల హిందూస్తాన్ రక్షణ బలహీనపడదు సరికదా బ్రహ్మాండంగా వృద్ధి చెందుతుంది.

రక్షణ దృష్ట్యా తాము ఎంత అనుకూల పరిస్థితుల్లో ఉన్నదీ, హిందువులు

గుర్తిస్తున్నట్లు లేరు. వాళ్ళు సైన్యంలో లేకపోవడం వల్ల అలాంటి పరిస్థితి వచ్చింది. తాము ఈ అనుకూల పరిస్థితిని ఎంత, ఎక్కువ మూల్యం చెల్లించి కొని తెచ్చుకొంటున్నారన్న సంగతి, వాళ్ళకు తెలీదు ఈ ముక్క వింతగా అన్పించినా.

ఈనాటి భారతసైన్యానికి ప్రధాన రిక్రూటింగ్ ప్రాంతంగా ఉన్న పాకిస్తాన్, కేంద్ర ఖజానాకి తక్కువ సొమ్ము చెల్లిస్తోంది. ఈ కింది లెక్కలు ఆ విషయాన్ని తెలియజేస్తాయి.

**కేంద్ర ఖ... కు చెల్లింపులు**

| | |
|---|---|
| పంజాబ్ | 1,18,01,385 |
| వాయవ్య సరిహద్దు | 9,28,294 |
| సింధ్ | 5,86,46,915 |
| బెలూచిస్తాన్ | శూన్యం |
| మొత్తం | 7,13,76,594 |

దీంతో పోలిస్తే హిందూస్తాన్ రాష్ట్రాలు చెల్లించే మొత్తం ఇలా ఉంది :

| | |
|---|---|
| మద్రాస్ | 9,53,26,745 |
| బొంబాయి | 22,53,44,247 |
| బెంగాల్ | 12,00,00,000 |
| యు.పి. | 4,06,53,000 |
| బీహార్ | 1,54,37,742 |
| సెంట్రల్ ప్రావిన్సెస్, బీరార్ | 31,42,682 |
| అస్సాం | 1,87,55,967 |
| ఒరిస్సా | 5,67,346 |
| మొత్తం | 51,91,27,729 |

దీన్నిబట్టి చూస్తే పాకిస్తాన్ రాష్ట్రాలు చాలా తక్కువ చెల్లిస్తున్నాయి. ప్రధానంగా, ఆదాయం హిందూ రాష్ట్రాల నుంచే వస్తు ంది. నిజానికి, హిందూస్తాన్ రాష్ట్రాలు చెల్లించే సొమ్ముతోనే భారత ప్రభుత్వం పాకిస్తాన్ రాష్ట్రాల్లో కార్యకలాపాలు నిర్వహించగలుగుతోంది. పాకిస్తాన్ రాష్ట్రాలు హిందూస్తాన్ రాష్ట్రాలను పీల్చేస్తున్నాయి. అవి కేంద్ర ప్రభుత్వానికి తక్కువ చెల్లించడమే కాదు, కేంద్ర ప్రభుత్వం నుంచి ఎక్కువ అందుకుంటున్నాయి. కేంద్ర ప్రభుత్వ ఆదాయం 121 కోట్ల రూపాయలు ఉంటుంది. దీన్నించి 52 కోట్లు సాలీనా సైన్యం మీద ఖర్చు అవుతున్నాయి. ఈ సొమ్మును ఏ ప్రాంతాల్లో ఖర్చు చేస్తున్నారు? ఈ 52 కోట్లలోనూ

* 1/2వ వంతు ఆదాయాన్నే చూపించారు. ఏమంటే సగం జనాభా మాత్రమే హిందువులు.

ఎవరు ఎక్కువ మొత్తం చెల్లిస్తున్నారు? సైన్యం మీద ఖర్చు పెట్టే ఈ 52 కోట్లలోనూ అధిక భాగాన్ని పాకిస్తాన్ ప్రాంతం నుంచి వచ్చిన ముస్లిం సైన్యం మీద ఖర్చు పెడుతున్నారు. చూడండి. ఎక్కువ సంఖ్యలో హైందవేతరులున్న సైన్యం మీద హిందూ రాష్ట్రాలు చెల్లించిన 52 కోట్ల నుంచీ అధిక మొత్తాలు ఖర్చు పెడుతున్నారా? ఈ దురవస్థ ఎంతమంది హిందువులకు తెలుసు? ఈ దురవస్థ ఎవరి మూల్యంతో నడుస్తున్నదో ఎంతమంది ఎరుగుదురు? ఇవాళ దీనికి హిందువులు బాధ్యులు కారు, ఏమంటే వాళ్ళు దీన్ని అడ్డుకోలేరు. వాళ్ళు ఈ దౌర్భాగ్యస్థితిని ఇలాగే సాగనిస్తారా అన్నది ప్రశ్న. దీన్ని అడ్డగించాలి అంటే మినహాయింపులు లేకుండా దీన్ని ముగించాలి. అంటే పాకిస్తాన్ ఆవిర్భవించే పథకాన్ని ఆమోదించడమే దారి. ఈ పథకాన్ని వ్యతిరేకించడం అంటే తమ వినాశనాన్ని తాము కోరి తెచ్చుకోవడమే అవుతుంది. భద్రమైన సైన్యం, భద్రమైన సరిహద్దు కంటే మేలు.

# పాకిస్తాన్, మత సామరస్యం

పాకిస్తాన్ వల్ల మత సమస్య పరిష్కారం అవుతుందా? ఇది మామూలుగా వచ్చే ప్రశ్న. ప్రతి హిందువూ ఈ ప్రశ్నను అడిగి తీ డు. దీనికి కచ్చితంగా జవాబు చెప్పాలి అంటే ఇందులో ఇమిడి ఉన్నదేమిటో బాగా విశ్లేషించుకోవాలి. హిందువులు, ముసల్మాన్లు మత సమస్య గురించి మాట్లాడుతున్నారు అంటే అసలు దీని అంతరార్థమేమిటి అన్న స్పష్టమైన అవగాహన ఉండితీరాలి. అదిలేకుండా పాకిస్తాన్ వల్ల మత సమస్య పరిష్కారం అవుతుందా లేదా చెప్పడం కష్టం.

సరిహద్దు "పురోగామి విధానం"లోం విస్తృత ఉద్దేశ్యమూ పరిమిత ఉద్దేశ్యమూ ఉన్నట్లుగా మత సమస్యకు కూడా ఉన్నాయనీ, పరిమిత ఉద్దేశ్యంలో ఒక అర్థం, విస్తృత ఉద్దేశ్యంలో మరో విభిన్న అర్థమూ ఉన్నాయనీ సామాన్యంగా తెలీదు.

మొదటగా "పరిమిత ఉద్దేశ్యం"లో మత సమస్యను చూద్దాం. "పరిమిత ఉద్దేశ్యంలో" మతసమస్య చట్ట సభల్లో హిందూ, ముస్లిం ప్రాతినిధ్యానికి సంబంధించింది అవుతుంది. ఈ అర్థంలో వాడినప్పుడు ఈ సమస్యకు రెండు విభిన్న సమస్యల పరిష్కారం అవసరం.

1. భిన్న చట్ట సభల్లో హిందువులకూ, ముస్లిములకూ కేటాయించాల్సిన సీట్ల సంఖ్య;

2. ఈ సీట్లను భర్తీ చేసేందుకు ఉద్దేశించిన ఆయా నియోజకవర్గాల స్వరూప స్వభావాలు.

రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో ముస్లిములు ఇలా అర్థించారు 1. అన్ని స్థానిక శాసన సభల్లోనూ, కేంద్ర శాసన సభల్లోనూ తమ ప్రతినిధులు ప్రత్యేక నియోజక వర్గాలద్వారా ఎన్నికై ఉండాలి. 2. జనాభాలో తాము అల్పసంఖ్యాక వర్గంగా ఉన్న రాష్ట్రాల్లో ముస్లిం అల్ప

సంఖ్యాక వర్గానికిచ్చిన ప్రాధాన్యత కొనసాగించుకోనివ్వాలి. దీనికి తోడు పంజాబ్, సింధ్, వాయవ్య సరిహద్దు రాష్ట్రాల్లో చట్టబద్ధంగా హామీ ఇచ్చే అధిక సంఖ్య సీట్లు ఉండాలి.

హిందువులు ఆదినుంచీ ముస్లిముల ఈ రెండు అభ్యర్థనల్ని ఎదిరిస్తూనే ఉన్నారు. అన్ని రాష్ట్రాల, కేంద్ర శాసన సభలకూ అన్ని ఎన్నికల్లోనూ హిందువులకూ, ముస్లిం ఉమ్మడి నియోజక వర్గాలు ఉండాలని, జనాభా నిష్పత్తి రీత్యా ఉభయ అల్ప సంఖ్యాక వర్గాలకూ ప్రాతినిధ్యం ఉండాలనీ వాళ్ళు పట్టుబడుతూనే ఉన్నారు. అల్ప సంఖ్యాక వర్గంగా హిందువులు, ముస్లిములు ఎక్కడెక్కడ ఉన్నా ఇలానే ఉండాలని అన్నారు. చట్టరీత్యా ఏమతానికీ అధిక సంఖ్యాక సీట్లు ఇవ్వగూడదని గట్టిగా ప్రతిఘటిస్తూనే ఉన్నారు.

ఘనత వహించిన చక్రవర్తిగారికమ్యూనల్ అవార్డ్ ఈ వివాదాన్ని, సునాయాసంగా, ముతకగా పరిష్కరించింది. హిందువుల ప్రతిఘటనను ఖాతరు చెయ్యకుండా ముస్లిములకు వాళ్ళడిగినవన్నీ ఇచ్చేసింది. అదీ పరిష్కార పద్ధతి. ముస్లిములకు వాళ్ళ ప్రాముఖ్యాన్ని ప్రత్యేక నియోజక వర్గాలను ఈ అవార్డు కొనసాగనిచ్చింది. దీనికి తోడు ముస్లిములు జనాభా రీత్యా అధిక సంఖ్యలో ఉన్న రాష్ట్రాలల్లో వాళ్లకు అధిక సంఖ్యలో సీట్లను చట్టరీత్యా అనుమతించారు.

అవార్డులో సమస్యగా ఉండేది ఏమిటి? ప్రభుత్వం వారి కమ్యూనల్ అవార్డును హిందువులు వ్యతిరేకించడంలో ఏమన్నా సత్తా ఉందా? అవార్డును హిందువులు వ్యతిరేకించడానికి సబబు ఏమైనా ఉందో, లేదో చూసేందుకు ఈ సమస్యను జాగ్రత్తగా పరిశీలించాలి.

మొదటిగా, ప్రాతినిధ్యం విషయంలో ముస్లిం అల్ప సంఖ్యాక వర్గాలకిచ్చే ప్రాముఖ్యం కూడదని వాళ్ళు అభ్యంతరం చెప్పడం. అల్ప సంఖ్యాక వర్గాలకు కేటాయించే ప్రాతినిధ్యపరమైన ఔచిత్యం ఏమిటనేవి అలా ఉంచినా హిందువులు ముస్లిం అల్ప సంఖ్యాక వర్గాలకిచ్చే ప్రాముఖ్యాన్ని వ్యతిరేకించలేరు. ఏమంటే తాము అల్ప సంఖ్యాక వర్గంగా ఉన్నచోట్ల, తగినంత ప్రాముఖ్యాన్నీ ఇచ్చే వీలున్నచోట, అదే బాపతు ప్రాముఖ్యాన్ని హిందువులకు ఇస్తున్నారు. సింధ్, వాయవ్య రాష్ట్రాల హిందువులకు ఇచ్చే ప్రాముఖ్యం ఇందుకు ఉదాహరణ.

రెండవది, చట్టపరంగా అధికసంఖ్యలో సీట్లు ఇవ్వడానికి వాళ్ళు తెలియజేసే అభ్యంతరం. దీనికి కూడా గట్టి పునాది లేదు. సూత్రరీత్యా, తాత్విక పరిశీలన రీత్యా ఫలానా ఇన్ని సీట్లు హామీగా ఇచ్చే వ్యవస్థ తప్పుకావచ్చు. దుర్మార్గం కావచ్చు. ఎంతమాత్రమూ సమర్థనీయం కాకపోవచ్చు. కానైతే, భారతదేశంలో ఉన్నలాంటి పరిస్థితులను బట్టి చూస్తే, చట్టపర ఆధిక్య సంఖ్య విధాయకం అనిపిస్తుంది. అల్పసంఖ్యాక వర్గాలకిచ్చిన ప్రాతినిధ్యం అధిక సంఖ్యాకుల్ని అల్పసంఖ్యకు దిగజార్చకూడదు అన్న విషయాన్ని ఒప్పుకోవడమంటూ జరిగిందనుకోండి. అప్పుడు దానికి ప్రతిగా, అదే నియమంవల్ల అత్యధిక సంఖ్య మతస్థులకు చట్టపరమైన అత్యధిక సంఖ్య పద్ధతి ఏర్పడుతుంది. ఏమంటే అల్ప సంఖ్యాక వర్గలకు సీట్లు కేటాయించడంలోనే అధిక సంఖ్యాకులకు సీట్లు కేటాయించడం ఇమిడి ఉంది. అధిక సంఖ్యాక వర్గాలను అల్ప

సంఖ్యగా మార్చే ప్రాతినిధ్యం అల్పసంఖ్యాకులకు ఉండరాదని ఎప్పుడైతే అంటామో అప్పుడే చట్టపరమైన ఆధిక్యం అన్న పద్ధతి నుంచి మోక్షం లేదు. అంచేత పంజాబ్‌లో, వాయవ్య సరిహద్దు రాష్ట్రాల్లో, సింధ్‌లో, బెంగాల్‌లో, ముస్లిములకు చట్టపరంగా అధిక ప్రాతినిధ్యం ఉండరాదన్న హిందువుల అభ్యంతరంలో పసలేదు. ఏమంటే, హిందువులు అధికంగానూ, ముస్లిములు అల్పసంఖ్యగానూ ఉన్న రాష్ట్రాల్లో హిందువులకు చట్టపరంగా ముస్లిములకంటే ఆధిక్యం ఉంది. ఏది ఏమైనా వాళ్ళ స్థానాల్లో సమతుల్యత ఉంది. అంచేత ఆ మేరకు ఎవళ్ళకీ గొణుక్కోవాల్సిన అవసరం లేదు.

హిందువులు లేవనెత్తిన అభ్యంతరాలకు, ఆధారం లేదన్నంత మాత్రాన, కమ్యూనల్ అవార్డు తిరస్కరించడానికి ఆధారాలు లేవని అర్థంకాదు. హిందువుల మీద బాణాలు సంధించడానికి ఆ అవార్డును పునాదిగా చేసుకున్నట్లు కన్పించకపోయినా, కమ్యూనల్ అవార్డును తిరస్కరించడానికి కావలసినంత ఆధారం ఉంది.

ఈ అభ్యంతరాన్ని ఎత్తి చూపేందుకు ఇలా మొదలు పెట్టవచ్చు. హిందూ రాష్ట్రాల్లో ముస్లిం అల్ప సంఖ్యాక వర్గాలు ప్రత్యేక నియోజకవర్గాలు కావాలని పట్టుపడుతున్నాయి. ఈ విషయాన్ని నిర్ణయించుకొనే అధికారాన్ని కమ్యూనల్ అవార్డు వాళ్ళకు ఇస్తుంది. ఇక్కడ వాళ్ళు అవలంబించవలసిన పద్ధతి నిజానికి – ప్రశ్నార్థమైంది. అంటే, ముస్లిము అనుమతి లేకుండా వాళ్ళు అల్ప సంఖ్యాక నియోజకవర్గాలని ఎత్తి వెయ్యలేరట, హిందువులు మాత్రం వాళ్ళ నిర్ణయాన్ని శిరోధార్యంగా భావించాలట. ముస్లిం రాష్ట్రాల్లోని హిందూ అల్ప సంఖ్యాక వర్గాలు ఉమ్మడి నియోజకవర్గాలుండాలని పట్టుబట్టారు. వాళ్ళ అభ్యర్థనను అంగీకరించడానికి బదులుగా, వాళ్ళు అభ్యంతరపెట్టే ప్రత్యేక నియోజకవర్గాల పద్ధతిని కమ్యూనల్ అవార్డు వాళ్ళ మీద రుద్దుతోంది. హిందూ రాష్ట్రాల్లో నియోజక వర్గాలకు సంబంధించి స్వయం నిర్ణయాధికారాన్ని ముస్లిం అల్ప సంఖ్యాక వర్గాలకు ఇచ్చినప్పుడు ఈ ప్రశ్న తలెత్తుతుంది. నియోజకవర్గాల విషయంలో ముస్లిం రాష్ట్రాలలోని హిందువులకు స్వయం నిర్ణయాధికారాన్ని ఎందుకు ఇవ్వలేదు? ఈ ప్రశ్నకు జవాబు ఏమిటి? జవాబు లేనట్లయితే, ఘనత వహించిన చక్రవర్తిగారి కమ్యూనల్ అవార్డు చాలా అధర్మంగా ఉంది. దాన్ని సరిదిద్దాలి.

ముస్లిములు అల్ప సంఖ్యాకవర్గంగా ఉన్న రాష్ట్రాల్లో ప్రత్యేక నియోజకవర్గాల* మీద ఆధారపడ్డ చట్టపరమైన ఆధిక్యం హిందువులకు ఉంచితే కదా అనొచ్చు. అదీ దీనికి సమాధానం కాదు. ఈ రెండు సందర్భాల్లోనూ పరిస్థితికి సంబంధించిన సామ్యం లేదు. అది కొంచం నిదానించి చూస్తే తెలుస్తుంది. హిందూ రాష్ట్రాల్లో హిందువుల ఆధిక్యం ఉన్న ప్రత్యేక

* ఓ రకంగా చూస్తే హిందూ నియోజకవర్గాలనడం సబబు కాదు. ఆ నియోజకవర్గం సాధారణ నియోజకవర్గం, ఏ ప్రత్యేకత లేని నియోజకవర్గంలోనూ కలవని వాళ్ళంతా దీంట్లో ఉంటారు. కానీ సాధారణ ఎన్నికల్లో అధిక సంఖ్యాకులు హిందువులే అవడం వల్ల దీన్ని హిందూ నియోజకవర్గం అంటున్నాము.

నియోజకవర్గాలు కావాలని, ముస్లిం అల్ప సంఖ్యాకులు పట్టుపట్టిన దాని ఫలితం అది. కొన్ని పరిస్థితుల వల్ల ఒక్క అల్ప సంఖ్యాక వర్గం తమ అస్తిత్వ రక్షణకు గాను ప్రత్యేక నియోజకవర్గాల గురించి ఆలోచింపవచ్చును, తనకు వ్యతిరేకంగా, తన చర్యల ద్వారా ప్రత్యర్థివర్గానికి చట్టబద్ధమైన ప్రత్యేక నియోజకవర్గాన్ని ఏర్పాటు చేస్తున్నానన్న భయం లేకపోవచ్చును. మరో అల్ప సంఖ్యాక వర్గాన్ని ఒక విధంగా అందుకుగాను, అదే అల్ప సంఖ్యాకవర్గం వేరే పరిస్థితుల్లో తమ చర్య వల్ల తనకు వ్యతిరేకంగా ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా చట్టపర అధికారాన్ని ఇష్టపడకపోవచ్చు. అంచేత, ప్రత్యేక నియోజకవర్గాలకు బదులు ఉమ్మడి నియోజకవర్గాల్ని తన ఉనికి ఇంకా బాగా రక్షణగా ఉండేందుకు, కోరవచ్చు. అల్ప సంఖ్యాకవర్గాన్ని ప్రభావితం చేసే మార్గదర్శక సూత్రం విశదంగా ఏమిటంటే, అధిక సంఖ్యాకవర్గం తన అధిక సంఖ్యను, మత ధోరణిలో అచ్చం మత ప్రయోజనాలకు వాడుకుంటుందా? అధిక సంఖ్యలో ఉన్న వర్గం తమ మతపర అధిక సంఖ్యను మత ప్రయోజనాల కోసమే వాడుకుంటుందని భావిస్తే అల్ప సంఖ్యాక వర్గం ఉమ్మడి నియోజక వర్గాల్ని ఎంచుకుంటుంది. ఏమంటే, శాసనసభలకు అధిక సంఖ్యాక వర్గం వాళ్ళ ప్రతినిధులే ఎన్నిక అయ్యేట్టు చేసే చట్టపరమైన ఆధిక్యవర్గ మత బంధనాన్ని తొలగించేందుకు ఇదొక్కటే పద్ధతి. ఇదీ అవతలివైపున, మతపరంగా ఆధిక్యంగా ఉన్నదాన్ని ఒక్కటిగా బంధించేందుకు అవసరమైన మతతత్వం ఉండకపోవచ్చు. అలాంటప్పుడు, చట్టపర ఆధిక్యం వల్లా, ప్రత్యేక నియోజకవర్గాల వల్లా అధిక సంఖ్యాక వర్గాలకు, ఏదో ఊడి పడుతుందన్న భయం ఉండదు. అల్ప సంఖ్యాక వర్గం తనకు ప్రత్యేక నియోజకవర్గం కావాలని కోరుకోవచ్చు. నసుగుడు లేకుండా చెప్పాలంటే, ప్రత్యేక నియోజకవర్గాన్ని కోరడంవల్ల హిందువుల చట్టపరమైన ఆధిక్యం, ప్రత్యేక నియోజకవర్గాలు, ముస్లిం అల్ప సంఖ్యాకవర్గాలకు ఏ భయం కలిగించడం లేదు. ఏమంటే, ఎంతో లోతుగా పాతుకుపోయిన కుల జాతి విభేదాల వల్ల హిందువులు అధిక సంఖ్యను ముస్లిములకు వ్యతిరేకంగా ఉపయోగించలేరు. ఆ నమ్మకం ముస్లిములకు ఉంది. అలాకాక, ముస్లిం రాష్ట్రాల్లో ముస్లిముల సామాజిక సంఘీభావం వల్ల హిందువులకు భయం ఉంది. తమ చట్టపరమైన అధిక సంఖ్యను ముస్లిములు "పట్టు సడలని ప్రభుత్వం" నడిపించడానికి వాడతారన్న విషయంలో హిందువులకు సందేహం లేదు. ఐర్లెండ్ విషయంలో హోమ్‌రూల్‌కు బదులుగా లార్డ్‌శాలిస్‌బరీ చేసిన ప్రతిపాదన సరళిలో ఇది ఉంటుంది. అయితే ఒక తేడా ఉంది. లార్డ్‌శాలిస్‌బరీ ప్రతిపాదించిన "పట్టు సడలని ప్రభుత్వం" ఇరవై ఏళ్ళు మాత్రమే కొనసాగాల్సి ఉండగా, ముస్లిముల "పట్టు సడలని ప్రభుత్వం" కమ్యూనల్ అవార్డు ఉన్నంతకాలం ఉంటుంది. అంచేత ఈ సన్నివేశాలు ఒక్క లాగా లేవు. ప్రత్యేక నియోజకవర్గాల ఆధారంగా ఏర్పడే హిందువుల చట్టపరమైన ఆధిక్యం, ముస్లిం అల్ప సంఖ్యాకవర్గాల కోరిక ఫలితం. అయితే ప్రత్యేక నియోజకవర్గాల ఆధారంగా ఏర్పడే ముస్లిం ఆధిక్యం హిందూ అల్పసంఖ్యాక వర్గాల కోరిక ఫలితం మాత్రం కాదు. ఒక సందర్భంలో, హిందూ మత అధిక సంఖ్యకు ముస్లిం అల్ప సంఖ్యాక

ప్రభుత్వం ముస్లిం అల్ప సంఖ్యాకుల సమ్మతి ఫలితం. మరో సందర్భంలో, ముస్లిం అధిక సంఖ్యాకులకు హిందూ అల్ప సంఖ్యాక ప్రభుత్వం హిందూ అల్ప సంఖ్యాక వర్గాల ఫలితం కాదు, బ్రిటిష్‌వాళ్ళు దండంతో బెదిరించి నెత్తిన రుద్దింది.

కమ్యూనల్ అవార్డు గురించిన చర్చను ముగిస్తూ ఇలా అనవచ్చు : "పరిమిత ఉద్దేశ్యంలో కమ్యూనల్ సమస్యకు పరిష్కారంగా, హిందూ రాష్ట్రాల్లో ముస్లిం అల్ప సంఖ్యాక వర్గాలకు హెచ్చు పరిగణను అవార్డు ఇస్తుందన్న ఆధారంగా అది అన్యాయంగా ఉందని. ఏమంటే ముస్లిం రాష్ట్రాల్లో హిందూ అల్పసం ఖ్యాక వర్గాలకు ఆ హెచ్చు పరిగణనను ఇస్తుంది. అదేరకంగా, ముస్లిం రాష్ట్రాల్లో అధిక సంఖ్యలో ఉన్న ముస్లిములకు చట్టపరమైన ఆధిక్యాన్ని ఇస్తుందని చెప్పి కమ్యూనల్ అవార్డు అధర్మంగా ఉందని అనలేం. హిందువులు అధిక సంఖ్యలో ఉన్న రాష్ట్రాల్లో హిందువులకు అదే ఆధిక్యాన్ని అవార్డు ఇస్తుంది కదా. అయితే నియోజక వర్గాలకు సంబంధించి అవార్డు గురించి అదేమాట అనలేం. నియోజకవర్గాల విషయంలో హిందువులకూ, ముస్లిములకూ సమాన హోదాను అవార్డు ఇవ్వడం లేదు. అక్కడ అవార్డు పాక్షిక వైఖరితో ఉంది. దాంతో అధర్మం గా తయారైంది. హిందూ రాష్ట్రాల్లోని ముస్లిం అల్ప సంఖ్యాకులకు స్వయం నిర్ణయాధికార హక్కును అది ఇస్తోంది. నియోజకవర్గాల విషయంలో అదే హక్కును ముస్లిం రాష్ట్రాల్లోని హిందూ అల్ప సంఖ్యాకులకు ఇవ్వడం లేదు. హిందూ రాష్ట్రాల్లో తమకు నచ్చిన రకంగా నియోజకవర్గాల్ని ముస్లిం అల్ప సంఖ్యాక వర్గాలు ఎంచుకోవచ్చును, ఈ విషయంలో హిందూ అధిక సంఖ్యాక వర్గాలు నోరు మెదపడానికి వీల్లేదు. కానీ ముస్లిం రాష్ట్రాల్లో తమకు నచ్చిన నియోజకవర్గాల్ని ముస్లిం అధిక సంఖ్యాకులు ఎంచుకోవచ్చును. హిందూ అల్ప సంఖ్యాకులకు ఈ విషయంలో నోరు మెదిపేందుకు లేదు. ఆ రకంగా ముస్లిం రాష్ట్రాల్లో ముస్లింలకు చట్టపరమైన ఆధిక్యాన్ని, ప్రత్యేక నియోజకవర్గాల్ని, రెండింటినీ ఇవ్వడం వల్ల హిందువుల మీద ముస్లిం పాలనను కమ్యూనల్ అవార్డు రుద్దుతోంది. దీన్ని హిందువులు మార్చనూ లేరు, ప్రభావితం చెయ్యనూ లేరు.

కమ్యూనల్ అవార్డులోని ప్రధాన దోషం ఇది. ఇది ఘోరమైన లోపం అన్న విషయం ఒప్పుకొని తీరాలి. ఇప్పుడు సూత్రప్రాయంగా మారిన కొన్ని రాజకీయ ధర్మాల్ని ఇది భంగపరుస్తోంది. మొదటిగా ఇది, అపరిమిత అధికారంలో ఉండే ఎవళ్ళనూ విశ్వసించదు. లోగడ ఎవరో బాగా చెప్పారు:

"అపరిమిత అధికారం ఉన్నవాళ్ళ బృందం ఏ రాజ్యంలోనైనా ఉన్నట్లయితే, వాళ్ళ ఏలుబడిలో ఉన్నవాళ్ళు ఎప్పటికీ స్వేచ్ఛగా ఉండలేరు. చారిత్రక పరిశోధనల ఫలితం ఏమంటే అదుపు లేని అధికారం అది ఉన్నవాళ్ళకే విషతుల్యం అవుతుంది అన్న గుణపాఠం. తమ శ్రేయస్సు అనే ధర్మాన్ని ఇతరుల మీద రుద్దాలన్న ప్రలోభం వాళ్ళకు సర్వదా ఉంటుంది. దాంతో చివరకు తమ మత శ్రేయస్సు తమ అధికారం కొనసాగడం మీద ఆధారపడి ఉందని

వాళ్ళు భావించుకుంటారు. స్వేచ్ఛ ఉండాలి అంటే రాజకీయ అధికారం మీద సర్వదా పరిమితులు ఉండాలి....."

రెండవ సూత్రం : పాలించడానికి రాజుకు దైవదత్తమైన హక్కు లేనట్లే అధిక సంఖ్యాకులకూ దైవదత్తమైన హక్కు పాలించేందుకు లేదు. అధిక సంఖ్యాక పాలన భరించడం ఎందుకూ అంటే దాని పాలనా కాలం పరిమితం, దాని మార్చవచ్చు. మరో విషయం ఏమంటే, అది రాజకీయంగా ఆధిక్యంలో ఉన్నవాళ్ళ పాలన. అంటే అధిక సంఖ్య మతపరమైన ఆధిక్యం వల్ల కాక అల్ప సంఖ్యాకులు తమకు తాముగా ఒప్పుకున్న ఓటింగ్ వల్ల వచ్చినటువంటిది. రాజకీయ ఆధిక్యానికి రాజకీయ అల్ప సంఖ్య మీద చిక్కిన అధికారం పరిధి ఇంత పరిమితంగా ఉంటే ఒక మతానికి చెందిన అల్ప సంఖ్యాకులు మరో మతానికి చెందిన అధిక సంఖ్యకు నిరంతరంగా ఒదిగి ఉండాల్సి రావడం ఏమిటి? ఒక మతం అధిక సంఖ్యాకులు మరో మతం అల్ప సంఖ్యాకుల మీద పరిపాలన సాగించవచ్చు. ఆ అల్ప సంఖ్యాకుల ఓట్లకు ఈ అధిక సంఖ్యాకులు ఒదిగి ఉండక్కరలేదు. అదీ ముఖ్యంగా ఆ అల్ప సంఖ్యాకులు అడుగుతూ ఉన్నప్పటికీ - అంటే, ప్రజాస్వామిక సూత్రాల్ని తల్లకిందులు చెయ్యడం. హిందూ అల్ప సంఖ్యాకుల రక్షణ, భద్రతల పట్ల పిసరు కూడా లక్ష్యం లేకపోవడం.

II

ఇక విస్తృత అర్థంలో మతసమస్యను పరిశీలిద్దాం. హిందువులు సమస్య అంటున్నారే, ఏమిటది? విస్తృతమైన అర్థంలో మత సమస్య అనేది ఉద్దేశ్యపూర్వకంగా ముస్లిం రాష్ట్రాలకు ఏర్పాటు చెయ్యడానికి సంబంధించినది. లక్నో ఒడంబడిక సమయంలో ముస్లిములు మత సమస్యను పరిమితమైన అర్థంలోనే లేవనెత్తారు. విస్తృతమైన అర్థంలో మత సమస్య ఆవరించుకునే పథకాన్ని, మొట్టమొదటిసారిగా ముస్లిములు రౌండ్‌టేబుల్ సమావేశంలో ప్రతిపాదించారు. 1935 చట్టానికి ముందు హిందువులు అధిక సంఖ్యలోనూ, ముస్లిములు అల్ప సంఖ్యలోనూ ఉన్న రాష్ట్రాలు ఎక్కువగా ఉండేవి. ముస్లిములు అధిక సంఖ్యాకులగానూ, హిందువులు అల్ప సంఖ్యాకులుగానూ ఉన్న రాష్ట్రాలు మూడే మూడు ఉండేవి. అవి పంజాబ్, బెంగాల్, వాయవ్య సరిహద్దు రాష్ట్రాలు. ఈ మూడింటిలోనూ వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోని ముస్లిం అధిక సంఖ్యాక వర్గం అంత పట్టు ఉన్నది కాదు. ఏమంటే ఆ రాష్ట్రంలో బాధ్యతాయుతమైన ప్రభుత్వం లేదు. మాంటేగ్ - చేమ్స్‌ఫర్డ్ రాజకీయ సంస్కరణల పథకాన్ని అటు విస్తరింప చెయ్యకపోబట్టి. అంచేత, క్రియకు చెప్పుకోవాలంటే, ముస్లిములు అధిక సంఖ్యలో, హిందువులు అల్ప సంఖ్యలో ఉన్న రాష్ట్రాలు పంజాబ్, బెంగాల్ రెండే రెండు మిగిలాయి. ముస్లిం రాష్ట్రాల సంఖ్య పెరగాలని ముస్లిములు కోరుతున్నారు. ఆ ఉద్దేశ్యంతోనే వాళ్ళు బొంబాయి ప్రెసిడెన్సీ నుంచి సింధ్‌ని విడగొట్టాలని, స్వయంపాలిత రాష్ట్రంగా ఏర్పాటు చెయ్యాలనీ, అప్పటికే ఒక ప్రత్యేక రాష్ట్రంగా ఉన్న వాయవ్య సరిహద్దు రాష్ట్రాన్ని స్వయంపాలిత

రాష్ట్రస్థాయికి పెంచాలనీ అభ్యర్థించారు. ఇతర విషయాల మాట ఎలా ఉన్నా, ఒక్క ఆర్థిక కారణాల దృష్ట్యా, ఈ అభ్యర్థనను ఆమోదించడం కుదరలేదు. కానీ ముస్లిములు అభ్యర్థనను తృప్తి పరచేందుకుగాను, బ్రిటిష్ ప్రభుత్వం సింధ్‌కు[1], వాయవ్య సరిహద్దు[2] రాష్ట్రానికి కేంద్ర నిధుల నుంచి సాలీనా ధన సహాయం ఇచ్చేంత దూరం వెళ్ళింది. వాటి బడ్జెట్‌లో సమతూకం ఉండేదుకు, ఆర్థికంగా అవి స్వయం పోషకంగా ఉండేందుకు ఈ సాయం అందించారు.

ముస్లిములు అధిక సంఖ్యలో, హిందువులు అల్ప సంఖ్యలో ఉన్న నాలుగు రాష్ట్రాలు ఇప్పుడు స్వయం పాలితాలుగా, సొంత ప్రభుత్వం ఏలుబడిలో ఉన్నాయి. వీటిని పరిపాలనా సౌలభ్యం కోసంగానీ, నిర్మాణ సమరూప్యత కోసంగానీ – అంటే హిందూ రాష్ట్రాలకు ప్రతిగా సరితూగేట్టు ముస్లిం రాష్ట్రాలు ఉండేందుకుగాని, ఏర్పాటు చెయ్యలేదు. హిందువులు ఆధిక్యంగా ఉన్న చోట్ల ముస్లిములు అల్ప సంఖ్యాకులుగా ఉండే అవమానాన్ని భర్తీ చేసేందుకు ముస్లిముల ఆధిక్యం కింద హిందువులు అల్ప సంఖ్యాకులుగా ఉండాలన్న ముస్లిం అహాన్ని తృప్తి పరచేందుకూ, ముస్లిం రాష్ట్రాల పథకం పుట్టిందన్నదీ నిజం కాదు. అయితే, ముస్లిం రాష్ట్రాల పథకం వెనక ఉన్న ఉద్దేశ్యం ఏమిటి? చట్టపరమైన ఆధిక్యం కోసం, ప్రత్యేక నియోజక వర్గాల కోసం ముస్లిములు పట్టుబడుతున్నారు; ఎందుకనీ అంటే ముస్లిం రాష్ట్రాల్లోని ముస్లిములను సమీకరించి ముస్లిం అధికారాన్ని సమర్థవంతంగా, ప్రత్యేక రూపంలో, అవకాశం ఉన్న మేరకు సంపూర్తిగా చెలాయించాలన్నదే, అదేవాళ్ళ ఉద్దేశ్యం అనీ హిందువులు అంటున్నారు. ఈ రూపేణా ముస్లిం రాజకీయాధికారాన్ని సమీకరించుకోవడం ఏ ప్రయోజనం నిమిత్తమయ్యా అని అడిగితే హిందువులు ఇచ్చే జవాబు ఇదీ : హిందూ ఆధిక్యం ఉన్న రాష్ట్రాల్లో ముస్లిం అల్ప సంఖ్యాకుల్ని నిరంకుశంగా ఆదేశించడం జరిగితే, ముస్లిం రాష్ట్రాల్లో, హిందూ అల్ప సంఖ్యాకుల్ని నిరంకుశంగా బెదిరించే ఆయుధంగా ఉండేందుకే ముస్లిముల చేతుల్లో దీన్ని పెట్టారు అని. ఆ రకంగా ఈ పథకం ఒక్క రక్షక కవచం అన్న మాట. ఇక్కడ పేలుడు ఉంటే, ప్రతిగా అక్కడ ప్రేలుడు ఉంటుంది; ఇక్కడ భీతాంగం ఉంటే ప్రతిగా అక్కడ భీతాంగం ఉంటుంది. ఇక్కడ అణచివేత ఉంటే ప్రతిగా అక్కడ అణచివేత ఉంటుంది. ఈ పథకంలో శాంతి ధర్మాల్ని ఎదురుదాడి ద్వారా నిలబెట్టడం ఇమిడి ఉంది. అమాయకులైన అల్ప సంఖ్యాకుల్ని దండించే అవకాశం ఇది కల్పిస్తుంది. ఆ రాష్ట్రాల్లో తమ మతం వాళ్ళ పాపాలకు ముస్లిం రాష్ట్రాల్లో హిందువులు, హిందూ రాష్ట్రాల్లో ముస్లిములు అన్యాయంగా దండనకు గురై పోతారు. ఈ పథకం పరమ దారుణమైంది. మతపరంగా ఒకళ్ళనొకళ్ళకు బందీగా ఉంచే పద్ధతిలో మత సామరస్యాన్ని సాధించే పథకం ఇది.

మతపర రాజ్యాల వ్యవస్థ ఈ పద్ధతిలోనే ఏర్పాటవుతుందని ఆది నుంచీ ముస్లిములకు

1. సింధ్‌కు సాలీనా 1,05,00,000 రూపాయలు ముడతాయి.
2. వాయవ్య సరిహద్దు రాష్ట్రానికి సాలీనా 1,00,00,000 రూపాయల సాయం అందుతుంది.

తెలుసు. వాళ్ళకు తెలుసునన్న విషయం 1927లో కలకత్తాలో జరిగిన ముస్లింలీగ్ సమావేశానికి అధ్యక్షుడిగా మౌలానా అబుల్ కలాం అజాద్ ఇచ్చిన ఉపన్యాసాన్ని బట్టి విశదమవుతుంది. ఆయన ఇలా ప్రకటించాడు :

"లక్నో ఒడంబడిక ద్వారా వాళ్ళు తమ ప్రయోజనాన్ని అమ్ముకున్నారు. భారతదేశ ముస్లిముల అసలైన హక్కులను గుర్తించడానికి మొదటిసారిగా గత మార్చిలో చేసిన ఢిల్లీ ప్రతిపాదనలు ద్వారాలు తెరిచాయి. 1916 నాటి ఒడంబడిక అనుమతించిన ప్రత్యేక నియోజకవర్గాల్లో ముస్లిములకు ప్రాతినిధ్యం ఉంటుందన్న హామీని ఇచ్చారు అంతే, కానీ అసలు ఈ మతవర్గం యొక్క ఉనికికి ప్రాణభూతమైంది దాని సంఖ్యాత్మక బలం గుర్తింపు పొందడం. అలాంటి వ్యవహార విధానానికి ఢిల్లీ దారి తెరిచింది. భవిష్యత్ భారతంలో వాళ్ళకు ఉచితమైన భాగం ఉండేట్టు హామీ కల్పించింది. ప్రస్తుతం బెంగాల్లోనూ, పంజాబ్‌లోనూ వాళ్ళకు అయిదు రాష్ట్రాలను ఇస్తున్నాయి. వాటిలో మూడుకు తక్కువ కాకుండా రాష్ట్రాల్లో (సింధ్, సరిహద్దు రాష్ట్రం, బెలూచిస్తాన్) సిసలైన ముస్లిం ఆధిక్యం ఉంది. ఇంత గొప్ప ముందడుగును ముస్లిములు గుర్తించకపోతే, ముస్లిములు బతకడం వ్యర్థం. ఇప్పుడు తొమ్మిది హిందూ రాష్ట్రాలకు అయిదు ముస్లిం రాష్ట్రాలు ఉంటాయి. ఆ తొమ్మిది రాష్ట్రాల్లోనూ హిందువులు, ముస్లిములను ఎలా చూస్తారో, ముస్లిములు ఈ రాష్ట్రాల్లో హిందువులను అలానే చూస్తారు. ఇది గొప్ప విజయం కాదంటారా? ముస్లిం హక్కుల్ని ధృఢం చేసుకోవడానికి గొప్ప ఆయుధం రాలేదంటారా?"

ఈ ముస్లిం రాష్ట్రాలకు నేతలుగా ఉన్నవాళ్ళకు ఈ పథకం గురించి తెలుసును, దని నిమిత్తం దీన్ని రూపొందించారో దాని కోసం వాడేందుకు వాళ్ళు వెనకడుగు వెయ్యరు అన్న విషయం బెంగాల్ ప్రధానమంత్రి శ్రీ ఫజల్ ఉల్‌హక్ ఇటీవల చేసిన ప్రసంగం బట్టి స్పష్టం అవుతుంది.

విస్తృతార్థంలో మత సమస్యగా రూపొందే ఈ మతపర రాష్ట్రాల పథకాన్ని మత నిరంకుశత్వానికి ఇంజన్‌గా వాడతారన్న దాంట్లో అనుమానం లేదు. ఒకళ్ళనొకళ్ళకు బందీలుగా చెయ్యడమే ప్రత్యేక నియోజకవర్గాల తోడ్పాటుతో ఏర్పడే మతపర రాష్ట్రాల పథకం అంతఃస్సారం. ఈ పద్ధతిని ఎట్టి పరిస్థితుల్లోనూ సమర్థించడానికి లేదు. ఎక్కువ ముస్లిం రాష్ట్రాలు ఏర్పాటు చెయ్యాలన్న డిమాండ్ వెనక ఉన్న ఉద్దేశ్యం ఇదే అయితే దాని ఫలితంగా వచ్చే వ్యవస్థ నిస్సందేహంగా విషపూరిత వ్యవస్థగా ఉంటుంది.

ఈ విశ్లేషణను బట్టి "మతసమస్య" అనేదాని రెండు తెగుళ్ళు ఏమిటో తేలుతున్నాయి. మతపర నియోజకవర్గాల మీద ఆధారపడిన మతపరమైన చట్టబద్ధ ఆధిక్యం, మతపర రాష్ట్రాలు. చట్టబద్ధమైన అధిక సంఖ్యాక వర్గం, అల్ప సంఖ్యాక వర్గాన్ని దౌర్జన్యంగా అణచి పెట్టేందుకే ముఖ్యంగా వీటిని ఏర్పాటు చేస్తున్నారు.

ఈ సమస్య నిలబడి ఉండడానికి హిందువులు, ముస్లిములను తప్పు పట్టుకుంటారు, ముస్లిములు హిందువులను తప్పు పట్టుకుంటారు. ముస్లిములు మూర్ఖంగా ఉన్నారని హిందువులు తిడతారు. హిందువులు కుత్సితంగా ఉన్నారని ముస్లిములు అంటారు. అయితే ముస్లిములు తలకు మించిన కోరికలు కోరి మూర్ఖంగా ఉండడంవల్లా, సర్దుబాటు లేకుండా హిందువులు కుత్సితంగా సణుక్కోవడంవల్లా ఈ మత సమస్య రాలేదని ఉభయపక్షాల వాళ్ళు మర్చిపోతున్నారు. విద్వేషపూరిత అధిక సంఖ్యాక వర్గాన్ని, విద్వేషపూరిత అల్ప సంఖ్యాకవర్గాన్ని, ఎదురుబొదురుగా పోటీపెట్టే అన్ని సందర్భాల్లోనూ ఇది ఉంటుంది, ఉండబోతుంది. అధిక సంఖ్యాకవర్గాలకు పోటీగా అల్ప సంఖ్యాకవర్గాలను ఎక్కుపెట్టిన సందర్భాల్లో ప్రత్యేక నియోజకవర్గాలకు పోటీగా ఉమ్మడి నియోజకవర్గాల వివాదం, జనాభా నిష్పత్తికి పోటీగా ప్రత్యేక హామీలులాంటి వివాదాలు అంతర్గతంగా ఉంటాయి. ఒకటి అధిక సంఖ్యగా రెండోది అల్ప సంఖ్యగా, ఒకే ప్రభుత్వం అనే ఉక్కు చట్రంలో అతుక్కుని రెండు వర్గాలు ఎదురుబొదురుగా ఉండకుండా చెయ్యడమే మత సమస్యకు అత్యుత్తమ పరిష్కారం.

మతపర సమస్యకు పాకిస్తాన్ పరిష్కారంగా ఏ మేరకు తూగుతుంది?

ఈ ప్రశ్నకు జవాబు స్పష్టమే. పాకిస్తాన్ ఏర్పాటు పథకం. వాయవ్య సరిహద్దు రాష్ట్రానికీ, బెంగాల్‌కు ఉన్న ప్రస్తుత సరిహద్దుల్ని అనుసరిం చేట్లయితే, అది మత సమస్యకు మూలభూతంగా ఉన్న చెడుగుల్ని ఏ మాత్రమూ నిర్మూలించలేదు. ఈ ముక్క నూటికి నూరుపాళ్ళు నిజం. మతతత్వం పాలుపోసుకోవడానికి దోహదపడ్డ ఆ అంశాల్నే అది నిలబెట్టి ఉంటుంది. అంటే అల్పసంఖ్యాక వర్గాన్ని అధిక సంఖ్యాకవర్గం మీదకు ఎక్కుపెట్టడం. ముస్లిం అధిక సంఖ్యాకవర్గాల ఏలుబడిలో హిందూ అల్పసఖ్యాక వర్గాలు ఉండడం, హిందూ అధిక సంఖ్యాకవర్గాల ఏలుబడిలో ముస్లిం అల్ప సంఖ్యాక వర్గాలు ఉండడం అనేవే ప్రస్తుత పరిస్థితిలోని ఘోరమైన చెరుపులు. పాకిస్తాన్ నిమిత్తం కేటాయించిన రాష్ట్రాల్ని యధాతథంగా, అంటే ప్రస్తుతం ఉన్న సరిహద్దులతోనే, దాంట్లో చేరిస్తే పాకిస్తాన్‌లో ఈ కీడే తిరిగి తలెత్తుతుంది. దీనికితోడు, విస్తృతార్థం లో మతసమస్యకు అవకాశం కల్పించే చెడుగు యధాతథంగా నిలబడ్డమే కాకుండా, కొత్త ద్వేషాన్ని సంతరించుకుంటుంది. ప్రస్తుత పరిస్థితుల్లో కేంద్ర ప్రభుత్వానికి రాష్ట్ర ప్రభుత్వాల మీద అధికారం ఉండడంతో, మతపర రాష్ట్రాలు తమ కింద వూతగా ఉన్నవాళ్ళ మీద అంత దుర్మార్గం చెయ్యలేవు, వాటి అధికారం పరిమితమైంది. ప్రస్తుతంలో, ఆ నిర్భాగ్యులు కేంద్ర ప్రభుత్వం నీడ కింద ఉన్నారు. ఈ కేంద్ర ప్రభుత్వం హిందువులతో ఏర్పడినటువంటిది. వాళ్ళ రక్షణకోసం జోక్యం చేసుకోగలిగినటువంటిది. కానీ పాకిస్తాన్, అంతరంగిక, విదేశాంగ విధానాల మీద సర్వం సహాధికారంతో సార్వభౌమ ముస్లిం రాజ్యంగా ఏర్పడినప్పుడు, దానిమీద కేంద్ర ప్రభుత్వ అజమాయిషీ ఏమీ ఉండదు. దానికి స్వేచ్ఛ, హిందూ అల్పసంఖ్యాక వర్గాలకు మొరపెట్టుకునే దిక్కు ఉండదు. తమ తరపున జోక్యం చేసుకోగల అధికారమూ, దుర్మార్గాన్ని నిరోధించగల బయట శక్తి ఏదీ ఉండదు, అలాంటిది ఈ పథకంలో లేదు. అంచేత పాకిస్తాన్‌లో

హిందువుల పరిస్థితి, టర్కీల కింద ఆర్మీనియన్ల పరిస్థితిలాగ, జారిస్టు రష్యాలో, నాజీ జర్మనీలో బతికిన యూదుల పరిస్థితిలాగా తయారవుతుంది. అలాంటి ఏర్పాటు దుర్భరమైంది. హిందువులు ఈ పాకిస్తాన్ గొడవే వద్దని అనొచ్చు. తమ సాటి మతస్తుల్ని, ఒక ముస్లిం జాతీయ రౌద్రమౌఢ్యానికి బలిపెట్టలేం అంటారు.

III

పాకిస్తాన్ ఏర్పాటు మూలంగా వచ్చే పరిణామాల గురించి ఇది కరాఖండిగా ఉండే ప్రకటననే, కాదనం. కానైతే, ఈ పరిణామాల మూలం ఏమిటో నిర్ధారించే జాగ్రత్త తీసుకోవాలి. ఆ పరిణామాలు పాకిస్తాన్ ఏర్పడాలన్న ప్రణాళిక ఫలితంగా వచ్చేవా లేక దానికి ఏర్పాటు చేసే ప్రత్యేక సరిహద్దుల వల్ల వచ్చేవా? ఈ చెడుగులు అస్సలు ఈ పథకం ఫలితమే అయితే, అంటే ఈ పథకంలో అంతర్గతంగా ఉన్నవే అయితే, హిందువులు దాన్ని గురించి ఆలోచించి కాలహరణం చెయ్యడం అనవసరం. అలా కాక, సరిహద్దుల ఫలితంగా ఆ చెడుగులు వచ్చేట్లయితే, పాకిస్తాన్ సమస్య సరిహద్దుల సవరింపుల మేరకి పరిమితం అవుతుంది.

పాకిస్తాన్ చెడుగులు దాంట్లో అంతర్గతంగా లేవనీ, ఈ సమస్యను క్షుణ్ణంగా పరిశీలిస్తే స్పష్టంగా తేలుతుంది. ఈ చెడుగులేను దాని ఫలితంగా వస్తే, వాటిని సరిహద్దులకు ఆపాదించాల్సి ఉంటుంది. జనాభా ఎలా ఉన్నదీ పరిశీలిస్తే, ఈ విషయం తేటతెల్లమవుతుంది. పశ్చిమ, తూర్పు పాకిస్తాన్‌లలో ఈ చెడుగులు తిరిగి తలెత్తడానికి కారణం ఇప్పుడున్న సరిహద్దుల్లో అవి ఏక జాతీయ రాజ్యాలుగా ఉండకపోవడం. అవి మిశ్రిత రాజ్యాలవుతున్నాయి. ముస్లిం అధిక సంఖ్యాక వర్గాలు, హిందూ అల్ప సంఖ్యాక వర్గాలు ముందటిలాగే ఉంటాయి. మిశ్రిత రాజ్యాలకు ఉండే చెడుగులే ఈ చెడుగులు, వాటిని వేర్పాటు చెయ్యలేం. పాకిస్తాన్ ఒకేఒక ఏకీకృత జాతి రాజ్యం అయితే గనక ఈ చెడుగులు వాటంతట అవే అదృశ్యమైపోతాయి. పాకిస్తాన్‌లో ప్రత్యేక నియోజకవర్గాల సమస్యే, ఉత్పన్నం కాదు. ఏమంటే సజాతీయమైన అలాంటి పాకిస్తాన్‌లో, పాలించే అధిక సంఖ్యాకవర్గాలు ఉండవు. అదేరకంగా, తనను వ్యతిరేకించే అల్ప సంఖ్యాక వర్గాల్ని అధీనంలో ఉంచుకొనే ఏకైక అధిక సంఖ్యాక వర్గమూ ఉండదు.

అంచేత సమస్య అల్లా సరిహద్దుల విభజన. సమస్య ఇలా తేలుతుంది; అధిక సంఖ్యాక వర్గాలు, అల్ప సంఖ్యాక వర్గాలు కలిసి, వాటితో పాటు అనుసరించి వచ్చే చెడుగులతో ఏర్పడే మిశ్రమ రాజ్యానికి బదులుగా ఒకే ఒక జాతితో, అంటే ముస్లిములతో, సమరూపంగా ఉండే రీతిలో పాకిస్తాన్ సరిహద్దుల్ని, ఏర్పాటు చెయ్యడం సాధ్యమేనా? లీగ్ ప్రణాళిక ప్రకారం, ఆ ప్రాంత విస్తార భాగంలో, సరిహద్దుల్ని అటూ ఇటూ సవరించి ఒక సమరూప రాజ్యాన్ని ఏర్పాటు చేయవచ్చు. మిగిలిన దాంట్లో జనాభాను మార్చి సజాతీయతను సాధించవచ్చు.

ఈ సందర్భంలో v, x, x1 అనుబంధాల్లో ఇచ్చిన అంకెల్ని చూడమని పాఠకుల్ని

కోరుతున్నాను. ఆ అంకెలు జనాభా ఏ ప్రాంతంలో ఎలా ఉన్నదీ తెలియజేస్తాయి. పంజాబ్ విషయం తీసుకొంటే రెండు అంశాలు కన్పిస్తాయి.

1. ముసల్మాన్లు అధికంగా ఉన్న జిల్లాలు కొన్ని ఉన్నాయి. హిందువులు అధిక సంఖ్యగా ఉన్న జిల్లాలు కొన్ని ఉన్నాయి. రెండువర్గాలు ఇంచుమించులో సరిసమానంగా ఉన్న జిల్లాలు ఏ కొద్దో ఉన్నాయి.

2. ముస్లిములు ఆధిక్యంలో ఉన్న జిల్లాలు, హిందువులు ఆధిక్యంలో ఉన్న జిల్లాలు అటూ ఇటూ చెదిరినట్లు లేవు. ఈ రెండు జిల్లాల విభాగాలు రెండు విడివిడి ప్రాంతాలుగా ఏర్పడతాయి.

ఇక తూర్పు పాకిస్తాన్ ఏర్పాటుకు సంబంధించి బెంగాల్, అస్సామ్‌లలో జనాభా ఏ తీరులో ఉన్నదీ పరిశీలించాలి. జనాభా లెక్కల్ని బాగా పరిశీలిస్తే :

1) బెంగాల్‌లో ముస్లిములు ఆధిక్యంలో ఉన్న జిల్లాలు కొన్ని ఉన్నాయి. మిగిలిన వాటిలో హిందువులు ఆధిక్యంలో ఉన్నారు.

2) అస్సాంలో కూడా ముస్లిములు ఆధిక్యంలో ఉన్న జిల్లాలు కొన్ని ఉన్నాయి. మిగిలిన వాటిలో హిందువులు ఆధిక్యంలో ఉన్నారు.

3) హిందువులు ఉన్న జిల్లాలు, ముస్లిములు ఆధిక్యంలో ఉన్న జిల్లాలు చెదిరినట్లు లేవు విడివడి ప్రాంతాలుగా ఉన్నాయి.

4) బెంగాల్, అస్సాంలలో ముస్లిములు ఆధిక్యంలో ఉన్న జిల్లాలు ఇరుగు పొరుగుననే ఉన్నాయి.

ఈ వాస్తవాల్ని చూస్తే పంజాబ్, బెంగాల్, అస్సాం రాష్ట్రాల నుంచి, హిందువులు అధిక సంఖ్యలో ఉన్న ప్రాంతాల్ని మినహాయించి సజాతీయ ముస్లిం రాజ్యాల్ని హాయిగా ఏర్పాటు చెయ్యచ్చు. అనుబంధంలో చేర్చిన అంకెల్ని బట్టి ఇది సాధ్యమని గుర్తించవచ్చు.

వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోనూ, సింధ్‌లోనూ పరిస్థితి కొంచం క్లిష్టంగా ఉంది. అనుబంధాల్లో ఇచ్చిన అంకెల్ని పరిశీలించి వాయవ్య రాష్ట్రంలోనూ, సింధ్‌లోనూ ఉన్న పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోనూ, సింధ్‌లోనూ హిందువులు సాంద్రంగా ఉన్న జిల్లాలు లేవు. ఈ సంగతి అనుబంధాల్ని బట్టి తెలుసుకోవచ్చు. హిందువులు ఆ ప్రాంతంలో చెదిరిపోయి ఉన్నారు. ఈ రెండు రాష్ట్రాల్లోని ప్రతి జిల్లాలోనూ చిన్నా చితకా సంఖ్యలో హిందువులు ఉన్నారు. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోనూ, సింధ్‌లోనూ హిందువులు పట్టణ ప్రాంతాల్లో ముస్లిముల కంటే ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో ముస్లిములు పట్టణాల్లోనూ, గ్రామాల్లోనూ హిందువుల కంటే ఎక్కువ ఉన్నారు.

అంచేత వాయవ్య సరిహద్దు రాష్ట్ర పరిస్థితి, సింధ్‌లోని పరిస్థితి. పంజాబ్ బెంగాల్‌లోని పరిస్థితికంటే పూర్తి భిన్నంగా ఉన్నాయి. పంజాబ్ బెంగాల్ రాష్ట్రాల్లో హిందువులు, ముస్లిములు సహజంగానే వేర్పాటుగా ఉండడం వల్ల సమరూపత కలిగిన రాజ్యాన్ని సరిహద్దులుగా మార్చడం ద్వారానూ, చాలా తక్కువ మేరకు జనాభాను తరలించడం ద్వారాను ఏర్పాటు చెయ్యవచ్చు. కానీ వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోనూ, సింధ్‌లోనూ హిందూ జనాభా చెదిరి ఉండడం వల్ల సమరూప రాజ్యాన్ని ఏర్పాటు చేసేందుకు సరిహద్దుల్ని మార్చడం చాలదు. ఒకే ఒక మార్గం ఉంది, జనాభాను తరలించడం.

జనాభాను మార్చడం, బదలాయించడం ఏమిటని కొందరు అపహాస్యం చేస్తారు. అల్పసంఖ్యాక వర్గాల సమస్య సృష్టం చేసే సంక్లిష్ట పరిస్థితులు ఏమిటో, వాళ్ళను కాపాడ్డానికి చేసే అన్ని ప్రయత్నాలూ విఫలం అయితే వచ్చే చిక్కులు ఏమిటో అపహాస్యం చేసేవాళ్ళకు తెలీదు. యుద్ధానంతరం ఏర్పడ్డ రాజ్యాల్లోనూ, యూరప్‌లోని పాత రాజ్యాల్లోనూ అల్ప సంఖ్యాక వర్గాల సమస్య వచ్చింది. వాటి రాజ్యాంగాలు ఈ అల్పసంఖ్యాక వర్గాలకు రాజ్యాంగపరమైన రక్షణలు కల్పిస్తే చాలన్న ఊహతో మొదలయ్యాయి. దాంతో ఆ నూతన రాజ్యాల రాజ్యాంగాలు చాలా భాగం అధిక సంఖ్యాక వర్గాలు అల్ప సంఖ్యాక వర్గాలు ఏ హక్కులతో ఉండాలో పెద్ద ప్రాథమిక హక్కులతో జాబితాలు నిండిపోయాయి. అధిక సంఖ్యాక వర్గాలు వాటిని ఉల్లంఘించకుండా ఉండాలని అనుకున్నారు. కానీ అనుభవం తెలియజేసిందేమిటి? రాజ్యాంగ రక్షణలు అల్పసంఖ్యాక వర్గాలను కాపాడలేవని. అల్పసంఖ్యాక వర్గాల మీద నిర్దాక్షిణ్యంగా చేసిన యుద్ధం కూడా సమస్యను పరిష్కరించలేదని. అప్పుడు ఈ సమస్యను పరిష్కరిం చడానికి ఉత్తమ మార్గం విదేశీ అల్ప సంఖ్యాక వర్గాలను తమ అల్ప సంఖ్యాక వర్గాలను బదలాయించుకోవడం అన్న ఏకాభిప్రాయానికి వచ్చాయి. ఎవళ్ళ సరిహద్దులోకి వాళ్ళు వెళితే సజాతీయ రాజ్యాలు ఏర్పడతాయని వాటి ఉద్దేశ్యం. టర్కీలో, గ్రీక్‌లో, బల్గేరియాలో జరిగింది ఇదే. జనాభా బదలాయింపుని అవహేళన చేసేవాళ్ళు టర్కీలో, గ్రీస్‌లో, బల్గేరియాలో ఉత్పన్నమైన అల్ప సంఖ్యాకవర్గాల చరిత్రను అధ్యయనం చెయ్యడం బావుంటుంది. వాళ్ళు అధ్యయనం చేస్తే జనాభా బదలాయింపే ఈ సమస్యను పరిష్కరించేందుకు ఫలవంతమైన మార్గం అని ఆ దేశాలు తెలుసుకున్నట్టు బోధ పడుతుంది. ఈ దేశాలు నిర్వహించదలచిన కర్తవ్యం ఏ మాత్రం ఆషామాషీ వ్యవహారం కాదు. ఇరవై మిలియన్ల జనాభాను ఒక నివాసం నుంచి మరో నివాసానికి బదలాయించడం ఈ పనిలో ఉంది. అయినా ఏ మాత్రం బెదిరిపోకుండా, ఈ మూడు దేశాలు ఈ కర్తవ్యభారాన్ని భుజస్కందాల మీదకు ఎత్తుకున్నాయి. దిగ్విజయంగా పూర్తి చేసాయి. ఏమంటే జాతి సామరస్యం మిగిలిన అన్నిటికంటే ఎక్కువైందని అని పరిగణించడమే ఇందుకు కారణం.

మత సామరస్యానికి అల్ప సంఖ్యాక వర్గాల బదలాయింపే దీర్ఘకాల నివారిణి అన్నదాంట్లో అణుమాత్రం సందేహం లేదు. మరి అలాంటప్పుడు ఏ అభయమూ అందివ్వలేని రాజ్యాంగ

రక్షణల పాటనే హిందువులు ముస్లిములు పాడడంలో అర్థం లేదు. తక్కువ వనరులతో, చిన్న దేశాలైన గ్రీస్, టర్కీ, బల్గేరియాల్లాంటివే ఇలాంటి కర్తవ్యాన్ని నిర్వహించినప్పుడు భారతీయులు ఆ కర్తవ్యాన్ని నిర్వహించ లేరనుకుందుకు తగ్గ హేతువు లేదు. ఇంతా చేసి, సమస్యలో చిక్కుకున్న జనాభా పెద్ద పరిగణనలోకి తీసుకోవాల్సిందీ కాదు. ఏవో కొన్ని అడ్డంకులు ఉంటాయన్న సాకుతో, మత సామరస్యానికి ఏ పేచీలు ఉండని ఈ మార్గాన్ని వదులుకోవడం పరమ మూర్ఖం.

ఇంతవరకు ప్రస్తావించుకోని విమర్శనాంశం ఒకటుంది. దీన్ని కూడా లేవనెత్తే అవకాశం ఉంది కాబట్టి ఆ వి[illegible]ం పరిశీలిస్తాను. హిందూస్తాన్లో దిగడిపోయే ముస్లిముల మీద పాకిస్తాన్ ప్రభావం ఎలా ఉంటుంది అని ఖాయంగా అడుగుతారు. ఈ ప్రశ్న సహజం. ఏమంటే పాకిస్తాన్ ఏర్పాటు వ్యూహం రక్షణ అవసరం లేని ముస్లిం అధిక సంఖ్యాకుల్ని పట్టించుకొని రక్షణ అవసరమైన ముస్లిం అల్ప సంఖ్యాక వర్గాలను వాళ్ళ ఖర్మకు వాళ్ళను వదిలేస్తున్నట్లు కనిపిస్తుంది. కానీ విషయం ఏమిటంటే ఎవరు ఈ ప్రశ్నను లేవనెత్తుతారు? హిందువులు కాదు. పాకిస్తాన్ ముస్లిములు కానీ, హిందుస్తాన్ ముస్లిములు కానీ ఈ ప్రశ్నను లేవనెత్తుతారు. పాకిస్తాన్ కావాలని వాదించే రహ్మత్ ఆలీని ఈ ప్రశ్న అడిగారు. దానికి ఆయన ఇచ్చిన జవాబు:

"హిందూస్తాన్‌లో ఉన్న నలభై అయిదు మిలియన్ల ముస్లిములను ఇది ఎలా ప్రభావితం చేస్తుంది?"

"ఈ పోరాటంలో వాళ్ళ ఆలోచన నన్నెంతో వేధించింది అన్న మాట నిజం. వాళ్ళు మన రక్తంలో రక్తం, ఆత్మలో ఆత్మ, మనం వాళ్ళ నెన్నటికీ మరచిపోలేం, వాళ్ళు మనల్ని మరచిపోరు. వాళ్ళు ప్రస్తుత పరిస్థితి, భవిష్యత్ భద్రత దృష్ట్యా, హిందూస్తాన్‌లో వాళ్ళ స్థితి, పాకిస్తాన్ వల్ల ప్రతికూలంగా మారదు. జనాభా ప్రాతిపదికగా (నలుగురు హిందువులకు ఒక ముస్లిం చొప్పున) వాళ్ళు శాసనసభల్లో, పాలకరంగాల్లో ఇప్పటికీ అదే ప్రాతినిధ్యానికి అర్హులు, వాళ్ళకు ఇప్పుడవి ఉన్నాయి. భవిష్యత్తుకు సంబంధించి మనం అందివ్వగల సార్థక హామీ ఉభయ రాజ్యాల మధ్య వినిమయ సహకారం. అంచేత, పాకిస్తాన్‌లోని ముస్లిమేతర అల్ప సంఖ్యాక వర్గాలకు అన్ని రక్షణలనీ కల్పిస్తాం, వేటినీ హిందూస్తాన్‌లోని మన ముస్లిం అల్ప సంఖ్యాక వర్గాలకు అందిస్తారో వాటి నన్నింటినీ."

"కానీ మనకు అన్నిటికీ మించి ప్రోత్సాహాన్నిచ్చేది, "మిల్లెట్" పరమ ప్రయోజనాల దృష్ట్యా మనం పాకిస్తాన్‌ని ప్రకటిస్తున్నాం అన్నది. ఆ విషయం వాళ్ళకూ తెలుసు. ఇది మనకు ఎంతో వాళ్ళకూ అంతే. ఇది మనకి జాతీయ దుర్గం అయితే వాళ్ళకు నైతికపరమైన పట్టుగొమ్మ. ఈ పట్టుగొమ్మ ఉన్నంతకాలం ప్రతిదీ భద్రంగా ఉంటుంది, భద్రంగా ఉండవచ్చు. కానీ అది గనక బెసిగితే అంతా తుడిచిపెట్టుకుపోయినట్లే."

హిందూస్తాన్‌లోని ముస్లిములు ఇచ్చిన జవాబు అంతే స్పష్టంగా ఉంది. "ముస్లిములు

పాకిస్తాన్, హిందూస్తాన్‌లుగా విడిపోవడం వల్ల మేము బలహీనపడం. హిందూస్తాన్‌కు తూర్పు సరిహద్దులోనూ, పడమటి సరిహద్దులోనూ విడివిడి ఇస్లామిక్ రాజ్యాలు ఉండడం, హిందూస్తాన్‌లో అవి మునిగిపోవడం కంటే ఎక్కువ భద్రతను మాకు కల్పిస్తుంది" అంటారు వాళ్ళు. వాళ్ళ తప్పని ఎవరు అనగలరు? జెకొస్లోవేకియాలోని సుడేటన్ జర్మన్లు తమని తాము రక్షించుకోవడం కంటే బయట రాజ్యంగా ఉంటూ జర్మనీవాళ్ళను ఇంకా బాగా రక్షించినట్లు వెల్లడవడం లేదా?*

సరే ఆ విషయం ఎలా ఉన్నా దాంతో హిందువులకు ఏమీ సంబంధం లేదు. హిందువులకు ప్రమేయం ఉన్న సమస్య ఏమిటంటే, పాకిస్తాన్ ఆవిర్భావం వల్ల హిందూస్తాన్‌లో మత సమస్య ఏ మేరకు తొలగిపోతుంది? ఇది సబబైన ప్రశ్నే, దీన్ని పరిశీలించి తీరాలి. పాకిస్తాన్ ఆవిర్భావం వల్ల హిందూస్తాన్ మత సమస్య నుంచి విముక్తి లేదు. సరిహద్దుల్ని మార్చుకుని ఏర్పాటు చేసుకున్నాక, పాకిస్తాన్ సజాతి రాజ్యం అయితే, హిందూస్తాన్ సంకీర్ణ రాజ్యంగానే ఉండిపోతుంది. ముసల్మాన్లు యావత్ భారతమంతటా ఎక్కువగా బస్తీల్లోనే పోగయి ఉన్నా చెదిరి ఉన్నారు. ఎంత యుక్తిగా ప్రయత్నించి సరిహద్దుల్ని గీసినా దీన్ని సజాతీయం చెయ్యలేం. భారతదేశాన్ని సజాతీయం చెయ్యాలంటే ఉన్న ఒక్క పద్ధతీ, జనాభాను బదలాయించుకోడం. అలా జరిగేదాకా, పాకిస్తాన్ ఆవిర్భవించినా కూడా, హిందూస్తాన్‌లో అల్ప సంఖ్యాక వర్గాలు, అధిక సంఖ్యాక వర్గాలు పోటీగానే ఉంటాయి, హిందూస్తాన్ సాంఘిక జీవితంలో పొరపులు తరలిస్తూనే ఉంటాయి. ఈ విషయాన్ని ఒప్పుకొని తీరాలి.

పాకిస్తాన్ ఏర్పడ్డా హిందూస్తాన్‌లో మత సమస్య సంపూర్ణంగా పరిష్కారం కావడానికి లేదు. మరి ఆకారణంగా హిందువులు పాకిస్తాన్ ఏర్పాటుని వ్యతిరేకించాలా? హిందువులు అంత తొందరపాటు నిర్ణయానికి రావడానికి ముందు పాకిస్తాన్ ఆవిర్భావ ఫలితాన్ని పరిశీలించాలి. అవి ఇలా ఉంటాయి.

మొదటిది, మత సమస్య చాలా విస్తారమైంది కదా, పాకిస్తాన్ ప్రభావం దాని మీద ఎలా ఉండేదీ చూడండి. హిందూస్తాన్‌లోనూ, పాకిస్తాన్‌లోనూ ముస్లిం జనాభా ఎలా ఉండేదీ చూస్తే దాన్ని అంచనా కట్టచ్చు.

* సుడేటన్ జర్మన్ల ప్రయో[illegible]నాల దృష్ట్యా జెకొస్లోవేకియాకి వ్యతిరేకంగా హిట్లరు ప్రయోగించిన ఎదిరింపు ఎత్తుగడల్ని లీగ్ నాయ[illegible]లు బాగా ఒంటబట్టించుకున్నట్లుంది. 1937 లో జరిగిన కరాచీ లీగ్ సమావేశాల్లో వాళ్ళు చేసిన ఉపన్యాసాలు చూడండి.

| పాకిస్తాన్‌లోని ముస్లిం జనాభా | | హిందూస్తాన్‌లోని ముస్లిం జనాభా | |
|---|---|---|---|
| 1. పంజాబ్ | 13,332,460 | 1. బర్మా, ఎడిన్‌లని మినహాయించి బ్రిటిష్ ఇండియాలోని మొత్తం ముస్లిం జనాభా | 66,42,766 |
| 2. వాయవ్య సరిహద్దు రాష్ట్రం | 2,227,303 | | |
| 3. సింద్ | 2,830,800 | 2. పాకిస్తాన్‌లోనూ, తూర్పు తూర్పు బెంగాల్‌లోనూ ఉన్న ముస్లిం జనాభా | 47,897,301 |
| 4. బెలూచిస్తాన్ | 405,309 | | |
| 5. తూర్పు బెంగాల్ | | | |
| ఎ) ముస్లిం రాష్ట్రాలు | 27,497,624 | 3. బ్రిటిష్ హిందూస్తాన్‌లో మిగిలిన ముస్లిములు | 18,545,465 |
| బి) సిల్హాట్ | 1,603,805 | | |
| మొత్తం | 47,897,301 | | |

ఈ అంకెలు ఏం తెలియజేస్తాయి? బ్రిటిష్ హిందూస్తాన్‌లో మిగిలే ముస్లిములు 18,545,465 అనీ, ముస్లిం జనాభాలో చాలా భాగం ఉన్న 47,897,301 ముస్లిములూ హిందూస్తాన్ బయట ఉంటారనీ, పాకిస్తాన్ రాష్ట్రాల పౌరులుగా ఉంటారనీ ఈ అంకెల్ని బట్టి తెలుస్తుంది. మత సమస్య రీత్యా ముస్లిం జనాభా విస్తరణ పాకిస్తాన్‌లో లేకుండా హిందూస్తాన్‌లో 6 1/2 కోట్లు అయితే పాకిస్తాన్ ఆవిర్భావం వల్ల 2 కోట్లు మాత్రమే ఉంటుంది. మత సామరస్యం కావాలనుకునే హిందువులకు ఇది గణింపదగ్గది కాదా! హిందూస్తాన్ లోపల మత సమస్యను పాకిస్తాన్ పరిష్కరించలేకపోయినా క్రమేణా ముస్లిం జనాభా దామాషాను తగ్గిస్తుంది, దాని ప్రాముఖ్యాన్ని తగ్గిస్తుంది. శాంతియుత పరిష్కారానికి మరింత సుకరం అవుతుంది.

రెండవ విషయం, పాకిస్తాన్ వల్ల కేంద్ర శాసనసభలో మతపర ప్రాతినిధ్యం ఎలా మారేదీ పరిశీలిద్దాం. ఈ కింద ఇస్తున్న పట్టిక కేంద్ర శాసనసభల్లో సీట్ల పంపిణీ పద్ధతిని తెలియజేస్తుంది. 1935 భారత ప్రభుత్వ చట్టం దీన్ని నిర్ణయించింది. పాకిస్తాన్ ఆవిర్భవిస్తే ఇలా ఉండబోతుంది.

| | సీట్ల కేటాయింపు ప్రస్తుతం | | | సీట్ల కేటాయింపు పాకిస్తాన్ ఆవిర్భావం తర్వాత | | |
|---|---|---|---|---|---|---|
| ఛాంబర్ | మొత్తం సీట్లు | ముస్లిమేతర (హిందూ) ప్రాదేశిక సీట్లు | ముస్లిం ప్రాంత సీట్లు | మొత్తం సీట్లు | ముస్లిమేతర (హిందూ) ప్రాదేశిక సీట్లు | ముస్లిం ప్రాంత సీట్లు |
| స్టేట్‌కౌన్సిల్ | 150 | 75 | 49 | 126 | 75 | 25 |
| ఫెడరల్‌అసెంబ్లీ | 250 | 105 | 82 | 211 | 105 | 43 |

పాకిస్తాన్ స్థాపన తర్వాత మతపరంగా పంపిణీ అయ్యే సీట్లు గుణాత్మక మార్పును స్పష్టంగా చూపించేందుకు పైన ఇచ్చిన అంకెల్ని ఈ దిగువ శాతానికి కుదించడం జరిగింది:

| చాంబర్ | సీట్ల పంపిణీ ప్రస్తుతం ఉన్నవి | | సీట్ల పంపిణీ పాకిస్తాన్ ఆవిర్భావం తర్వాత | |
|---|---|---|---|---|
| | హిందువులతో ముస్లిం సీట్ల శాతం | మొత్తం సీట్లలో ముస్లిం సీట్ల శాతం | హిందూ సీట్లతో పోలిస్తే ముస్లిం శాతం | మొత్తం సీట్లలో ముస్లిం సీట్ల శాతం |
| కౌన్సిల్ ఆఫ్ స్టేట్ | 33 | 66 | 25 | 33.33 |
| ఫెడరల్ అసెంబ్లీ | 33 | 80 | 21 | 40 |

పాకిస్తాన్ ఆవిర్భావం వల్ల ఎలాంటి ఉద్భృతమైన మార్పులు వచ్చేదీ తెలుస్తుంది. భారత ప్రభుత్వ చట్టం ప్రకారం మొత్తం సీట్లలో ముస్లిం సీట్లు నిష్పత్తి 33%. ఇది ఉభయసభల్లో ఉండే శాతం. కానీ హిందువుల సీట్ల నిష్పత్తి కౌన్సిల్ ఆఫ్ స్టేట్‌లో 66%, అసెంబ్లీలో 80%. హిందువుల స్థాయికి దాదాపు సమానం అయినట్లే. పాకిస్తాన్ ఏర్పాటు తర్వాత, మొత్తం సీట్లలో చూస్తే ముస్లిం సీట్ల నిష్పత్తి 33.33 నుంచి 25 శాతానికి పడిపోతుంది. కౌన్సిల్‌లో అసెంబ్లీలో 21%కి పడిపోతుంది. అయితే హిందువుల సీట్లు 55% నుంచి 33.1/3%కి కౌన్సిల్‌లోనూ, 80% నుంచి 40% అసెంబ్లీలోనూ పడిపోతాయి. ముస్లిములకు ఇచ్చే రాయితీ, పాకిస్తాన్, హిందూస్తాన్ విడిపోయాక కూడా అదే విధంగా ఉంటుందన్న ఊహతో ఈ రూపొందించినవి ఈ అంకెలు. ముస్లిములకు ప్రస్తుతం ఉన్న రాయితీని రద్దు చేసినా, తగ్గించినా, హిందువుల ప్రాతినిధ్యానికి సంబంధించి ఇదేమన్నా తక్కువ లాభమంటారా? నాకైతే ఇది పెద్ద ముందడుగులాగే నన్పిస్తుంది. కేంద్రంలో హిందువుల స్థానం విషయానికి సంబంధించి ఇది ముందడుగే. పాకిస్తాన్ ఏర్పాటుని వ్యతిరేకించే వాళ్ళకి స్థానం ఎన్నటికీ రాదు.

పాకిస్తాన్ ఏర్పాటు వల్ల వచ్చే పాదార్థిక లాభాలు ఇవి. మానసికమైనదిది మరోటి ఉంది. దక్షిణ భారతంలోనూ, మధ్య భారతంలోనూ ఉన్న ముస్లిములు ఉత్తరాదిన, తూర్పున ఉన్న ముస్లిముల నుంచి ఉత్తేజం పొందుతారు. పాకిస్తాన్ ఏర్పాటైతే ఉత్తరాదిన, తూర్పున మత సామరస్యం వస్తే, వచ్చి తీరుతుంది. ఏమంటే అధిక సంఖ్యాక వర్గాలు, అల్ప సంఖ్యాక వర్గాలు అనే విభజన పోతుంది. హిందూస్తాన్‌లో కూడా మత సామరస్యం వస్తుందని హిందువులు అన్యాయంగా ఆశించవచ్చు. ఉత్తరాదిన, తూర్పున ఉన్న ముస్లిములకూ, హిందూస్తాన్‌లో ఉన్న ముస్లిములకూ మధ్య బంధం విడిపోతుంది. హిందువులకు ఇది ఇంకో లాభం.

పాకిస్తాన్ ప్రభావం ఎలా ఉండేదే ఇంతగా పరిశీలించాక ఒక విషయాన్ని మాత్రం కాదనలేం. పాకిస్తాన్ ఏర్పాటు వల్ల హిందూస్తాన్లో మత సమస్య ఆసాంతం పరిష్కారం కాకపోయినా, హిందువులు బలమైన భాగస్వాములుగా ఉన్న ముస్లిముల అల్లరి నుంచి విముక్తులౌతారు. సంపూర్ణ పరిష్కారం అందదన్న కారణంగా మాత్రమే ఈ ప్రతిపాదన హిందువులు తిరస్కరిస్తారు అన్నదాన్ని హిందువులు తేల్చిచెప్పాలి. తీవ్ర నష్టం కంటే కొద్దిపాటి లాభం మేలుకదా, గుడ్డిలో మెల్ల.

## IV

మిగిలిన ఆఖరి సమస్య, దీంతో మత సామరస్యానికి, పాకిస్తాన్‌కూ సంబంధించిన చర్చను ముగించవచ్చు. పాకిస్తాన్ ఏర్పాటు ప్రణాళిక దోషరహితంగా రూపొందాలంటే, పంజాబ్, బెంగాల్ రాష్ట్రాల సరిహద్దుల్ని, మార్చి తిరిగి గీసుకోవాలి. ఈ రాష్ట్రాల్లోని ముస్లిములు, హిందువులు అందుకు అంగీకరిస్తారా?

సరిహద్దుల్ని తిరిగి గీసుకోవడానికి ముస్లిములకైతే అభ్యంతరం ఉండకూడదు. వాళ్ళు అభ్యంతరం పెట్టారు అంటే, తమ డిమాండ్ స్వభావం ఏమిటో వాళ్లకు బోధ పడలేదన్న మాట. ఇలా జరిగినందుకు అవకాశం ఉంది. ఏమంటే పాకిస్తాన్ కావాలని వాదించే ముస్లిముల నుంచి వినిపించే మాటలు చాలా అస్థిర స్వభావంతో ఉన్నాయి. పాకిస్తాన్ అంటే ముస్లిం జాతీయ రాజ్యం అని కొందరు అంటున్నారు, పాకిస్తాన్ అంటే ముస్లిం జాతీయ వాసం అని కొందరు అంటున్నారు. ముస్లిం జాతీయ రాజ్యానికీ, ముస్లిం జాతీయ వాసానికీ తేడా ఏమిటో ఎవ్వరూ పట్టించుకుంటున్నట్లు లేదు. కానీ ఈ రెంటికీ హస్తిమస్తకాంతర భేదం ఉంది. అందులో సందేహం లేదు. ఆ భేదం ఏమిటనేది పాలస్తీనాను యూదుల జాతీయవాసంగా ఏర్పాటు చేసినప్పుడు విస్తృతంగా చర్చ జరిగింది. సరిహద్దుల్ని తిరిగి గీసుకునేందుకు ముస్లిములు ఏమన్నా అభ్యంతరపెడితే, దాన్ని అధిగమించేందుకు ఈ భేదం ఏమిటో స్పష్టంగా తెలుసుకొని ఉండడం అవసరం.

ఒక ప్రముఖ నిష్ణాతుడు చెప్పిన ప్రకారం : "జాతీయవాసం అంటే ఒక భూభాగం. అక్కడ ఉండే జనాభాకు రాజకీయ సార్వభౌమ హక్కులు ఉండవు. అయినా కానీ గుర్తింపు పొందిన చట్టపర హెూదా ఉంటుంది. నైతిక, సాంఘిక, బౌద్ధిక ఆదర్శాల్ని అభివృద్ధి చేసుకునే అవకాశం ఉంటుంది.

1922లో పాలస్తీనా విధానం గురించి బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటన చేసింది. జాతీయవాసం అంటే ఏమిటో ఆ ప్రభుత్వమే ఇలా నిర్వచించింది :

"పాలస్తీనాలో యూదుల జాతీయవాస అభివృద్ధి అంటే ఏమిటని అడుగుతున్నారు. జవాబు ఏమిటంటే మొత్తంగా పాలస్తీనా వాసుల మీద యూదు జాతిని రుద్దడం కాదు అని.

ప్రస్తుతం ఉన్న యూదుజాతిని మరింత అభివృద్ధి చెయ్యడం. ప్రపంచంలోని ఇతర ప్రాంతాల యూదుల సహాయంతో అలా అభివృద్ధి చెయ్యడం. ఆ రకంగా మత, జాతిపర భూమిక మీద యూదు ప్రజలందరూ ఆసక్తి కనబరిచి, గర్వంగా చాటుకోగల కేంద్రం అవుతుంది అది. కానీ ఈ మతవాసులకు అభివృద్ధి చెందే అత్యుత్తమ భవిష్యత్తు, తమ సామర్థ్యాల్ని, యూదులు ప్రదర్శించేందుకు అవకాశం ఉండగలందుకుగానూ ఏదో దయాదాక్షిణ్యం వల్ల కాక, ఒక హక్కుగా ఆ జాతి పాలస్తీనాలో యూదు జాతీయవాసానికి అంతర్జాతీయ హామీ ఉండడం అవసరం, ప్రాచీన చారిత్రక అనుసంధానం మీద అది ఆధారపడుతుందని లాంఛనంగా గుర్తించడం అవసరం".

జాతీయవాసానికీ, జాతీయ రాజ్యానికీ మధ్య ముఖ్యమైన భేదం ఉందన్న విషయం దీన్ని బట్టి స్పష్టమవుతుంది. ఆ భేదం ఇదీ : జాతీయవాసం అంటే అక్కడ ఉండేవాళ్ళకు ఆ భూభాగం మీద రాజకీయ సార్వ భౌమత్యం ఉండదని, అక్కడ నివాసం ఉండే ఇతరుల మీద తమ జాతీయతను రుద్దడం ఉండదని వాళ్ళకు లభించేదల్లా గుర్తింపు పొందిన చట్టపరస్థానం. పౌరులుగా బతికే హక్కు, తమ సంస్కృతిని నిలబెట్టుకునే స్వేచ్ఛ హామీ ఉండే గుర్తింపు ఇది. జాతీయ రాజ్యం అయితే అక్కడ ఉండే ప్రజలకూ రాజకీయ సార్వభౌమత్వం ఉంటుంది. తమ జాతీయతను ఇతరుల మీద రుద్దే హక్కు ఉంటుంది.

ఈ భేదం చాలా ముఖ్యమైంది. దీని దృష్ట్యా పాకిస్తాన్ ఏర్పాటు అభ్యర్థనను పరిశీలించాల్సి ఉంది. ముస్లిములు పాకిస్తాన్‌ని ఎందుకు కోరుతున్నారు? ముస్లిములకు జాతీయవాసం కావాలని పాకిస్తాన్ కోరుకుంటే అనవసరం. పాకిస్తాన్ ఏర్పడబోయే రాష్ట్రాల్లో ఇప్పటికీ తమ సంస్కృతిని పురోగమింపజేసుకునే హక్కు, బతికే హక్కు ఇప్పటికే వాళ్ళకు ఉన్నాయి. జాతీయ ముస్లిం రాజ్యం కావాలని పాకిస్తాన్ కోరుకుంటే అందులో చేరాల్సిన భూభాగం మీద సార్వభౌమ హక్కుని వాళ్ళు అడుగుతున్నారన్న మాట. కానీ ప్రశ్న ఏమిటంటే : ఈ ముస్లిం రాజ్యాల సరిహద్దుల్లోపల, వాళ్ళ ఏలుబడి కింద ముస్లిమేతర అల్ప సంఖ్యాక వర్గాల్ని, తమ ముస్లిం రాజ్యాల జాతీయతను రుద్దే హక్కుతో ఉంచుకోనియ్యాలా? రాజకీయ సార్వభౌమాధికారానికి అనుబంధంగా ఉండడాన్ని అంగీకరించడమే అలాంటి హక్కు అన్న దాంట్లో అనుమానం లేదు కానీ, ఆధునిక యుగంలో ఈ హక్కు అన్ని రాష్ట్రాల్లోనూ, దుర్మార్గాలకు ఆలవాలం అన్న విషయం కూడా అంతే నిజం. అలాంటి దుర్మార్గాలకు అవకాశం ఉందన్న విషయాన్ని నిర్లక్ష్యం చెయ్యడం అంటే ఎలాంటిదన్న మాట? టర్కీలు, గ్రీకులు, బుల్గార్లు, చెక్‌లు తమ అల్ప సంఖ్యాక వర్గాల మీద జరిపిన దారుణాల్ని, హత్యల్ని, దోపిడీలనూ, గృహదహనాలనూ నమోదు చేసిన ఇటీవలి రక్తసిక్త చరిత్ర పుటల్ని చదవకుండా దాటవెయ్యడమన్నమాట. తమ పాలితుల మీద జాతీయతని బలవంతంగా రుద్దేహక్కును రాజ్యం నుంచి తీసేసుకోవడం సాధ్యమే, ఏమంటే రాజకీయ సార్వభౌమత్వానికి ఇదీ అనుషంగికం. కానీ అలాంటి హక్కును నియోగించే అవకాశం ఇవ్వకుండా ఉండడం సాధ్యం. ముస్లిములకు

నూటికి నూరుపాళ్ళు సజాతీయమైన జాతిపర రాజ్యాలుగా ఉండే జాతీయత ముస్లిం రాజ్యాలను ఇవ్వకుండా అలా చెయ్యవచ్చు. ముస్లిములు హిందువులకు ప్రతిగా, హిందువుల కంటే సంఖ్యలో ఎక్కువగా ఉండే మిశ్ర రాజ్యాలను ఏ పరిస్థితుల్లోనూ ఏర్పాటు చేసుకోనివ్వకూడదు.

పాకిస్తాన్ఏర్పాటు వ్యూహాన్ని తయారు చేసుకున్న ముస్లిములు బహుశా దీన్ని గురించి ఆలోచించి ఉండరు. ఈ పథకానికి శ్రీకారం చుట్టిన సర్ ఎమ్. ఇక్బాల్ ఖాయంగా దీన్ని గురించి ఆలోచించి ఉండడు. ఆయన 1930లో ముస్లిం లీగ్‌లో అధ్యక్షోపన్యాసం చేశాడు: ముస్లిమేతర ఆధిక్యం ఉన్న అంబాలా ప్రాంతాన్ని, బహుశా మరి కొన్ని జిల్లాల్ని మినహాయించేందుకు అంగీకరించే సంసిద్ధతను ఆ ఉపన్యాసంలో వెల్లడి చేశాడు. ఎందుకనంటే "అలాంటి మినహాయింపు వల్ల విస్తృతి తగ్గుతుంది. మరింత ఎక్కువ ముస్లిం జనాభా ఉండాలని" అన్నాడు. మరోవైపున పాకిస్తాన్, పథకాన్ని ప్రతిపాదించే వాళ్ళు అందులో పంజాబ్, బెంగాల్ రాష్ట్రాలు వాటి ప్రస్తుత సరిహద్దుల్లో ఉంటాయని భావించుకొంటున్నారు. ప్రస్తుతం ఉన్న సరిహద్దుల గురించి పట్టుబట్టడం, ఈ సమస్యను గురించి విశాల దృక్పధంతో ఉన్న హిందువుల్ని కూడా వ్యతిరేకం చేసుకోవడమే అవుతుందని వాళ్ళకు స్పష్టంగా తెలుస్తుంది. ముస్లిం మత విశ్వాసాన్ని, ముస్లిం సంస్కృతినీ కాపాడేందుకు, ప్రచారం చేసేందుకూ ఉద్దేశ్యపూర్వకంగా నిర్మితమయ్యే ముస్లిం రాజ్యంలో హిందువులు కలవడానికి అంగీకరిస్తారని ఆశించడం కుదరదు. హిందువులు ఖాయంగా దీన్ని వ్యతిరేకిస్తారు. తమ ఉద్దేశ్యాలేమిటో వెల్లడవడానికి చాలాకాలం పడుతుందని ముస్లిములు అనుకోనక్కర్లేదు. ప్రస్తుతం ఉన్న సరిహద్దుల్ని అలానే ఉంచాలని ముస్లిములు పట్టుబడితే కనుక, పాకిస్తాన్ఏర్పాటు చెయ్యాలన్న తమ కోరిక వెనకాల ఏదో జాతీయవాసాన్ని, జాతీయ రాజ్యాన్నో నిర్మించుకోవడమే కాక, వేరే దురుద్దేశం ఉన్నట్లు నిందలకు గురౌతారు. ముస్లిం ప్రాంతాల్లో హిందువులకు ప్రతిగా ముస్లిం ఆధిక్యవర్గాన్ని పెంచుకుని హిందువుల్ని తమ గుప్పిట్లో ఉంచుకోవాలన్న పథకాన్ని పకడ్బందీగా ఏర్పాటు చేసుకోవాలనుకుంటున్నారన్న నిందకూ గురౌతారు.

పాకిస్తాన్ ఏర్పాటు వి· · ంలో స్థానిక సరిహద్దుల్ని మార్చాలన్న ముస్లిములు వీటన్నిటినీ దృష్టిలో ఉంచుకోవాలి.

ఇక పంజాబ్, బెంగాల్ హిందువులు ఆలోచించాల్సిన విషయాలున్నాయి. సమస్యకు సంబంధించిన రెండు పక్షాల్లో హిందువులు మరింత చిక్కుగా ఉన్నారు. ఈ సందర్భంలో అగ్రవర్ణాల హిందువుల ప్రతిస్పందనను పరిశీలించడం చాలు. వాళ్ళే హిందూ ప్రజా బాహుళ్యానికి మార్గ నిర్దేశం చేస్తారు, హిందూ అభిప్రాయాల్ని రూపొందిస్తారు. దురదృష్టవశాత్తు అగ్రవర్ణ హిందువులు నాయకులుగా మంచివాళ్ళు కారు. వాళ్ళ స్వభావంలో ఓ అంశం ఉంది, అది ఎక్కువగా వినాశనానికి దారి తీస్తుంది. ఈ స్వభావం వాళ్ళకు పీనాసితత్వం వల్ల ఇతరులతో

జీవిత సద్విషయాల్ని పంచుకోలేని విముఖత్వం వల్ల ఏర్పడింది. వాళ్ళ విద్యనూ, సంపదను గుత్త తీసుకున్నారు. రాజ్యాన్ని చేజిక్కించుకున్నారు. ఈ గుత్తస్వామ్యాన్ని కాపాడుకోవడమే వాళ్ళ కాంక్ష, జీవిత గమ్యం. వాళ్ళు వర్గ ఆధిక్యత అన్న స్వార్థభావంతో నిండిపోయారు. దాంతో హిందువుల్లోని కింద వర్గాలవాళ్ళను సంపద నుంచి విద్య నుంచి, అధికారం నుంచి దూరంగా ఉంచాలనే ప్రతి ప్రయత్నం చేసారు. అలా దూరంగా ఉంచేందుకు పదిలమైన మార్గం మత గ్రంథాల్ని కూర్చడం, అగ్రవర్ణాల వారికి ఊడిగం చెయ్యడమే తమ జీవిత కర్తవ్యం అని కింది వర్గాల వాళ్ళ బుర్రలకి ఎక్కించడం. ఈ గుత్తస్వామ్యాన్ని తమ గుప్పిట్లో ఉంచుకోవడానికి సంబంధించీ, ఇందులో భాగం అడక్కుండా కింది వర్ణాల వారిని దూరంగా ఉంచడానికి సంబంధించి అగ్రవర్ణాల హిందువులు చాలాకాలం నెగ్గుకొచ్చారు. ఊహించలేనంతగా కూడా నెగ్గుకొచ్చారు. ఇటీవలి కాలంలోనే మద్రాసు, బొంబాయి, ప్రెసిడెన్సీలలోనూ, సెంట్రల్ ప్రావిన్సెస్‌లోనూ బ్రాహ్మణేతర పార్టీలను స్థాపించి కింది వర్గాల హిందువులు ఈ గుత్తస్వామ్యానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేసారు. అయినప్పటికీ అగ్రవర్ణ హిందువులు తమ ఆధిక్య స్థానాన్ని విజయవంతంగా నిలబెట్టుకున్నారు. కింది వర్ణాలవారికి విద్య, సంపద, అధికారం లాంటి వాటిలో భాగం లేకుండా చేసి తమకి మాత్రమే పదిలంగా అట్టే పెట్టుకున్నారు అగ్రవర్ణాలవాళ్లు. కానీ, కింది వర్గాల వారికి తిరస్కరించిన వీటిని ముస్లిములకూ తిరస్కరించే వైఖరితో ఉన్నారు. తక్కువ వర్ణాల హిందువుల విషయంలో ప్రవర్తించినట్టే ముస్లిములనూ హోదా, అధికారం లేకుండా దూరంగా ఉంచాలని వాళ్ళు అనుకున్నారు. అగ్రవర్ణ హిందువుల్లో ఉన్న ఈ వైఖరి వాళ్ళ రాజకీయాల్ని అర్థం చేసుకుందుకు కీలకమైంది.

వాళ్ళ స్వభావాన్ని రెండు ఉదాహరణలు వెల్లడి చేస్తాయి. 1929లో బొంబాయి ప్రెసిడెన్సీ నుంచి సింధు వేర్పాటుని సైమన్ కమిషన్ ముందు తీవ్రంగా యాతనపడి వ్యతిరేకించారు. కానీ 1915లో సింధ్ రాష్ట్ర హిందువులు ఇందుకు వ్యతిరేకమైన అభ్యర్థన చేసారు. సింధ్‌ను బొంబాయి నుంచి విడదియ్యాలని కోరారు. రెండు సందర్భాల్లోనూ కారణం ఒకటే. 1916లో సింధ్ రాష్ట్రానికి ప్రాతినిధ్య ప్రభుత్వం లేదు. ఒకవేళ ఉన్నా అది అనుమానం లేకుండా ముస్లిం ప్రభుత్వమే అయి ఉండేది. హిందువులు వేర్పాటుకు రారు. ఏమంటే ముస్లిం ప్రభుత్వం లేకపోవడం వల్ల హెచ్చు సంఖ్యలో వాళ్ళకు ప్రభుత్వ ఉద్యోగాలు దొరుకుతాయి. 1929లో వాళ్ళు వేర్పాటును వ్యతిరేకించారు. ఏమంటే వేర్పాటైన సింధ్ ముస్లిం ప్రభుత్వం ఏలుబడిలో ఉంటుందని వాళ్ళకు తెలుసు. ముస్లిం ప్రభుత్వం ఉందంటే తమ గుత్తాధిపత్యం సడలుతుంది, తమను తొలగించి ముస్లిం అభ్యర్థులకు అవకాశం కల్పిస్తుంది. బెంగాల్ విభజనను బెంగాల్ హిందువులు వ్యతిరేకించారు. అగ్రవర్ణ హిందువుల స్వభావానికి ఇది మంచి ఉదాహరణ. మొత్తం బెంగాల్, బీహార్, ఒరిస్సా, అస్సాం రాష్ట్రాలు, ఆ మాటకొస్తే యు.పి. కూడా బెంగాలీ హిందువులకు పచ్చిక బీడు లాంటిది. ఈ రాష్ట్రాలన్నిటిలోనూ అతను సివిల్ సర్వీసుని ఒడిసి పట్టేశాడు. బెంగాల్ విభజన అంటే ఈ పచ్చిక బీడు

కుంచించుకు పోవడమే. బెంగాల్ విభజన అంటే తూర్పు బెంగాల్ నుంచి బెంగాల్ హిందువులకు ఉద్వాసన అన్న మాట. అప్పటిదాకా సివిల్ సర్వీస్‌లో ఏ మాత్రం స్థానం లేని బెంగాల్ ముస్లిములకు స్థానం కల్పించడం అన్నమాట. బెంగాల్ విభజనను బెంగాలీ హిందువులు వ్యతిరేకించడానికి ముఖ్య కారణం తూర్పు బెంగాల్‌లో బెంగాలి ముస్లిములు తమ స్థానాన్ని ఆక్రమించుకోకుండా చెయ్యడం. అయితే, స్వరాజ్ కోరుతూ విభజనను వ్యతిరేకించటం అంటే తూర్పు బెంగాల్‌లోనూ, పశ్చిమ బెంగాల్‌లోనూ కూడా ముసల్మానులను పాలకుల్ని చెయ్యడమేనని బెంగాలీ హిందువులు ఊహించను కూడా ఊహించడం లేదు.

ఈ ఆలోచనలన్నీ మనసుకు తోస్తున్నాయి. ఏమంటే వారసత్వంగా సంక్రమించిన స్వభావం వల్ల అగ్రవర్ణ హిందువులు అంధులై పోయి పాకిస్తాన్ ఏర్పాటుని వ్యతిరేకిస్తారన్న భయం కలుగుతుంది. వాళ్ళు అలా వ్యతిరేకించడానికి కనిపించే కారణమల్లా తమ స్వార్థ ప్రయోజనాల జీవికకు పరిమితులే ఏర్పడతాయన్న భయం తప్ప మరేమీ కాదు. పాకిస్తాన్ ఏర్పాటుకి ఆటంకపడే కారణాల్లో ఒకటి అగ్రవర్ణ హిందువుల స్వార్థపరత్వమే అవుతుందంటే ఆశ్చర్యపోనక్కర్లేదు.

పంజాబ్, బెంగాల్ హిందువులకు రెండు మార్గాలున్నాయి. వాటిని వాళ్ళు న్యాయంగా, ధర్మంగా పరిశీలించాలి. పంజాబ్‌లోని ముస్లిముల సంఖ్య 13,332,460. సిక్కులు, ఇతరులూ కలుపుకుని హిందువుల సంఖ్య 11,392,732 తేడా అల్లా 1,939,728. అంటే పంజాబ్‌లో ముస్లిం ఆధిక్యం 8% మాత్రమే. వాస్తవాలు ఇలా ఉండగా ఏది మంచిదంటారు. పంజాబ్ విభజించకుండా ఐక్యంగా ఉంచి 54% ఉన్న ముస్లిం అధిక సంఖ్యాక వర్గాన్ని 46% హిందువుల మీద పాలకులుగా చేసుకోవడమా లేక సరిహద్దుల్ని తిరిగి ఏర్పాటు చేసుకుని ముస్లిములు, హిందువులుగా విడివిడి జాతీయ రాజ్యాల కింద ఉండేట్లు, ఆ రకంగా ముస్లిం పాలన భీతాంగం నుంచి మొత్తం హిందువుల్ని కాపాడుకునేట్లుగా చేసుకోవడమా?

బెంగాల్‌లో ముస్లిముల సంఖ్య 27,497,624. హిందువుల సంఖ్య 21,570,407. వున్న తేడా అల్లా 5,927,217. వాస్తవాలు ఇలా ఉండగా ఏది మంచిదంటారు. సరిహద్దుల్ని తిరిగి ఏర్పాటు చేసుకోవడాన్ని తిరస్కరిస్తూ సిల్హెట్, తూర్పు బెంగాల్ రాష్ట్రాలతో జాతీయ ముస్లిం రాజ్యా నిర్మాణాన్ని వ్యతిరేకించి 12% మాత్రమే ఆధిక్యంలో ఉన్న ముస్లిములను 44% ఉన్న హిందూ అల్ప సంఖ్యాకవర్గాన్ని పాలించేట్టు చెయ్యటమా కాక హిందువుల్ని ప్రత్యేక జాతీయ రాజ్యంలో ఉంచి, ముస్లిం భీకర పాలన నుంచి 44% హిందువుల్ని రక్షించడమా? ఏది మంచిదో బెంగాల్ పంజాబ్ హిందువుల్ని పరిశీలించనివ్వండి. తమకు లాభసాటిగా ఉన్న ఉద్యోగాలను లాగి పారేస్తుందన్న కారణంగా పాకిస్తాన్ ఏర్పాటును బెంగాల్, పంజాబ్ రాష్ట్రాల అగ్రవర్ణ హిందువులు ప్రతిఘటించదలిస్తే, వాళ్ళు చాలా ఘోరమైన తప్పిదాన్ని చేస్తున్నారని వాళ్ళకు చెప్పవలసిన సమయం వచ్చిందని నాకు అన్పిస్తుంది. హోదానీ, అధికారాన్ని తమ

గుప్పిట్లోనే ఎదురు లేకుండా పెట్టుకునే కాలం చెల్లిపోయింది. హిందూ తక్కువ కులాలవాళ్ళను జాతీయతత్వం పేరుతో వాళ్ళు మోసం చెయ్యగలగచ్చు, కానీ ముస్లిం రాష్ట్రాల్లో ముస్లిం అధిక సంఖ్యాక వర్గాల్ని, మోసం చేసి హోదాని, అధికారాన్ని గుత్తస్వామ్యాన్ని ఉంచుకోలేరు. హిందువుల తీర్మానం – పాకిస్తాన్‌కు వ్యతిరేకంగా వాళ్ళ ఘోషను అలా పరిగణిస్తే గనక – ముస్లిం అధిక సంఖ్యాక వర్గాల కింద బతికేందుకు, స్వయం నిర్ణయాధికారాన్ని వ్యతిరేకించేందుకు తీర్మానం, చాలా సాహసోపేతమైంది కావచ్చు. కానీ ముస్లింలను దద్దమ్మల్ని చేసి తమ హోదానీ, అధికారాన్ని నిలబెట్టుకుంటామని హిందువులు అనుకోవడం అంత తెలివైన పని కాదు. లింకన్ చెప్పినట్లు సర్వదా సర్వుల్ని మోసగించడం సాధ్యం కాదు. ముస్లిం అధిక సంఖ్యాకుల కింద హిందువులు బతక దలుచుకుంటే వాళ్ళు సర్వస్వమూ పోగొట్టుకునే అవకాశాలే ఎక్కువ. అలా కాక బెంగాల్ పంజాబ్ హిందువులు విడిపోవడానికి ఒప్పుకుంటే వాళ్ళు ఎక్కువ లబ్ధి పొందలేకపోవచ్చు, నిజమే. కానీ సర్వాన్నీ కోల్పోరు అని గుండె మీద చెయ్యి వేసుకొని చెప్పవచ్చు.

అను : ఆర్వియార్

పాకిస్తాన్‌కనుకూలమైన ముస్లిముల వాదన, వ్యతిరేకమైన హిందువుల వాదన చెప్పుకున్న తర్వాత, పాకిస్తాన్‌కు ప్రత్యామ్నాయాల వేపు (నిజానికి అలాంటివి ఉంటే) మనం దృష్టిని సారించాల్సిన అవసరం ఉంది. పాకిస్తాన్ మీద ఒక అభిప్రాయాన్ని ఇవ్వదలచుకుంటే దాని ప్రత్యామ్నాయాలనూ దృష్టిలో ఉంచుకోక తప్పదు. అది : పాకిస్తాన్‌కు ప్రత్యామ్నాయాలు లేవు అనైనా కావచ్చు, పాకిస్తాన్‌కు ప్రత్యామ్నాయం ఉంది అనైనా కావచ్చు. కాని పాకిస్తాన్‌కు ప్రత్యామ్నాయం అన్నది పాకిస్తాన్ ఉన్నప్పుడు ఉన్న స్థితి కన్నా మరింత అనర్థమైన స్థితిగాగానే ఉంటుంది. అయితే, ఒకవేళ ఈ విషయం మీద ఆసక్తి ఉన్న పార్టీలకు పాకిస్తాన్ లేదా దాని ప్రత్యామ్నాయం కానీ అంగీకారం కాకపోయినట్లైతే జరిగే పరిణామాలను కూడా పరిశీలించవలసి ఉంటుంది. ఈ అంశాలన్నీ దృష్టిలో ఉంచుకుని వాటికి సంబంధించిన వివరాలను కింది శీర్షికల్లో ఇవ్వటం జరిగింది :

1. పాకిస్తాన్ కోసం హిందువులు సూచించే ప్రత్యామ్నాయం
2. పాకిస్తాన్ కోసం ముస్లిములు సూచించే ప్రత్యామ్నాయం
3. ఇతర దేశాల నుంచి నేర్చుకోవలసిన పాఠాలు.

# పాకిస్తాన్ కోసం హిందువులు సూచించే ప్రత్యామ్నాయం

పాకిస్తాన్‌కు ప్రత్యామ్నాయంగా హిందూపరమైన ప్రణాళిక ఏమైనా ఉందా? అని ఆలోచించినపుడు, మనసులో 1925లో స్వర్గీయ లాల్ హరదయాల్ ప్రతిపాదనలే మెదులుతాయి. లాహోర్ నుంచి వెలువడే 'ప్రతాప్' పత్రికలో, అది ఒక నివేదిక రూపంలో వెలువడింది. ఈ నివేదికను హరదయాల్ రాజకీయ వీలునామాగా అభివర్ణించారు. అందులో లాల్ హరదయాల్ ఇలా అన్నారు :

"హిందూజాతి, హిందూస్తాన్, పంజాబ్ – భవితవ్యం ఈ నాలుగు మూల స్తంభాలపై నే ఆధారపడింది అని నేను ప్రకటిస్తున్నాను – అవి : 1) హిందూ సంఘటన్ 2) హిందూ రాజ్ 3) ముస్లిములను శుద్ధి చేయటం 4) ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దులను జయించటం, శుద్ధి చేయటం. హిందూ జాతి ఈ నాలుగు లక్ష్యాలను సాధించనంతకాలం మన పిల్లల భద్రతకూ తర్వాతి తరాల భద్రతకూ ముప్పు తప్పదు. హిందూజాతి భద్రత అనేది అసంభవమై పోతుంది. హిందూజాతికి ఒక చరిత్ర ఉంది. దాని సంస్థలూ సజాతీయమైనవి. కాని, ముసల్మానులు, క్రైస్తవులు హిందూస్తాన్ పరిమితుల్లో లేరు. ఆ పరిధికి చాలా దూరంగా ఉన్నారు. ఎందుకంటే వారి మతాలు పరాయివి. వారు పర్షియా, అరబ్, ఐరోపీయ సంస్థలను ప్రేమిస్తారు. కంట్లో నలుసును తీసివేసినట్లుగానే ఈ రెండు మతాల శుద్ధీ జరగాలి.

ఆఫ్ఘనిస్తాన్, పర్వత ప్రాంతాల సరిహద్దులు ఒకప్పుడు భారతదేశంలో భాగంగానే ఉండేవి. అయితే, ప్రస్తుతం ఇస్లాం పరిధిలో ఉంది. నేపాల్‌లో హిందూ మతం ఉన్నట్లే, ఆఫ్ఘనిస్తాన్‌లో సరిహద్దు ప్రాదేశిక ప్రాంతంలో హిందూ సంస్థలు ఉండాలి. లేకుంటే స్వరాజ్‌ను సాధించీ ప్రయోజనం ఉండదు. పర్వతాల్లోని తెగలు ఎప్పుడూ ఆకలితో యుద్ధ కాముకమైనవిగా

ఉంటాయి. వారు మనకు శత్రువులు అయ్యారంటే నాదిర్‌షా, జమాన్‌షాల యుగం పునరావృతమౌతుంది. ప్రస్తుతం ఆంగ్ల అధికారులు సరిహద్దులను కాపాడుకోవాలంటే వాళ్లు ఆఫ్ఘనిస్తాన్‌నూ, సరిహద్దులనూ జయించాలి. పర్వతాల్లో నివసించే తెగలవారిని మన మతం లోకి మార్చాలి.''

లాలా హరదయాల్ సూచించిన ఈ ప్రత్యామ్నాయానికి ఎంతమంది హిందువులు ముందుకొచ్చి మద్దతు ప్రకటిస్తారో నాకు తెలియదు.

మొదట తెలుసుకోవాల్సిందేమిటంటే హిందూ మతం మత మార్పిడి చేయించే మతం కాదు. కాంగ్రెసు అధ్యక్షుడిగా తన ప్రసంగంలో మౌలానా మహమ్మద్ అలీ సరిగ్గానే చెప్పారు.

"అయితే ఇది హిందూవాదం పట్ల వ్యతిరేకంగా ఎప్పటి నుంచో నేను చేస్తున్న ఫిర్యాదు. 1907లో అలహాబాదులో ప్రసంగిస్తూ నేను ఒక విషయాన్ని చెప్పాను. ముసల్మాన్లకూ, హిందువులకూ ఉన్న తేడాకు సంబంధించిందే ఆ విషయం. ముస్లిం ఒకలాంటి అరుచికర వంటకాన్ని తయారించి అది రాజులు ఆరగించేదని చెబుతాడు. అందరూ తనతో కలిసి పంచుకోవాలని కోరుతాడు. ఆ వంటకాన్ని ఏమాత్రం ఇష్టపడనివారి నోళ్లలో కుక్కుతాడు. అతని హిందూ సోదరుడైతే తన వంట ప్రావీణ్యానికి తానే మురిసి గర్వపడుతూ తన ప్రత్యేక వంటగదిలోకి వెళ్లి ఆత్రంగా తాను వండినదాన్ని దిగమింగుతాడు. తన తిండిపైన తన అనుంగు సోదరుని నీడ కూడా పడకుండా అతనికే మాత్రం ఒక్క మెతుకు కూడా మిగల్చకుండా జాగ్రత్తపడతాడు. ఇదేదో చాలా తేలిగ్గా చెప్పిన మాట కాదు. నేను నిజానికి మహాత్మాగాంధీని ఈ అంశం పట్ల నమ్మకం సబబైందని ఎలా అంటారో చెప్పమన్నాను"

మహాత్మాగాంధీ ఆ ప్రశ్నకు ఏమి సమాధానం ఇచ్చారో మహ్మద్‌అలీగారు చెప్పనే లేదు. అసలు వాస్తవం ఏమంటే హిందువులెంతగా కోరుకున్నా హిందూమతం ఇస్లాంలాగా, క్రైస్తవమతంలా ధర్మ ప్రచారక (మిషనరీ) మతం కాజాలదు. తద్విరుద్ధంగా ఇది ఒకనాడు ధర్మ ప్రచారక మతంగానే కన్పిస్తుంది. లేకుంటే ఇంత పెద్ద భారత ఉపఖండమంతటా ఎలా వ్యాపించిందో వివరించటం కష్టమే మరి*. ఒకనాడు ధర్మ ప్రచారక మతంగా ఉండిన హిందూమతం హిందూ సమాజంలో కులవ్యవస్థ తలెత్తి బలం కావటంతోటే ధర్మ ప్రచారక గుణాన్ని కోల్పోయి ఉంటుంది. ఎందుకంటే మతమార్పిడికి కులం అనుయోగ్యమైంది. ఎవరైనా ఒక నూతన వ్యక్తిని ఒక మతంలోకి మార్పించేప్పుడు ఆ సమాజం కేవలం తన మత విశ్వాసాన్ని అతనికి ఇప్పించటంతోనే సరిపోదు. అలా మతం మార్చుకున్న వ్యక్తిని తన సామాజిక జీవితంలోకి అంగీకరించగలిగి ఉండాలి. తన సంబంధితుల మధ్య ఒకడిగా

* హిందూ మతం ఒకప్పుడు ధర్మ ప్రచారకమతంగా ఉండేదా? అలా ఉండి ఉంటే యిప్పుడెందుకు ఆ స్వభావాన్ని కోల్పోయింది? అనే ప్రశ్నలకు నా వ్యాసం "కులం-మత మార్పిడి" (తెలుగు సమాచార్ సంవత్సర సంచిక 1926) చూడండి.

ఇముడ్చుకోగలిగి ఉండాలి. మతం మార్పిడి జరిగేప్పుడు అభిలషణీయమైన ఇలాంటి అంశాలను హిందూ సమాజం తృప్తిపరచజాలదు. అయితే ఒక హిందువు ధర్మ ప్రచారకోత్సాహంతో ఒక పరాయి మనిషిని హిందూ విశ్వాసం అంగీకరించేలా చేయటానికి ఏదీ అడ్డురాదు. కాని, ఆ పరాయి మనిషిని మతం మార్పించే ముందు హిందువు ఒక ప్రశ్నను వేసుకోకతప్పదు. ఇలా మతం మారిన మనిషి కులం ఏది? అనేది ఆ ప్రశ్న. హిందువుల ప్రకారం ఒక వ్యక్తి ఒక కులానికి చెంది ఉండాలంటే అతను ఆ కులంలో జన్మించి ఉండాలి. మతం మార్పిడి చేసుకున్న వ్యక్తి కులంలో పుట్టి ఉండడు. కాబట్టి అతను ఏ కులానికీ చెందడు. ఇది కూడా ముఖ్యమైన ప్రశ్నే. మానవుడు రాజకీయ జీవి, మతజీవి. అంతకన్నా మించి సామాజిక జీవి. అతనికి మతం అవసరం లేకపోవచ్చు. అతను మతాన్ని స్వీకరించక పోవచ్చు. అట్లాగే రాజకీయాలు అవసరం లేకపోవచ్చు. అతను రాజకీయ జీవి కాకపోవచ్చు. అయితే, అతనికి సమాజం కావాలి. సమాజం లేకుండా అతనేమీ చేయలేడు. హిందువైన వ్యక్తి కులంతో నిమిత్తం లేకుండా ఉండడం అంటే సమాజంతో నిమిత్తం లేకుండా ఉన్నట్లే. మత మార్పిడి చేసుకున్న వ్యక్తికి ఇలా సమాజం అన్నది లేకుండాపోతే మత మార్పిడి ఎలా జరుగుతుంది? హిందూ సమాజం స్వతంత్ర కులాలుగా ఖండఖండాలుగా ఉన్నంత కాలం, హిందూ మతం ధర్మ ప్రచారక మతంగా ఉండజాలదు. కాబట్టి ఆఫ్ఘన్లు, సరిహద్దు తెగలను హిందూ మతంలోకి మార్చటం అన్నది ఒక పనికి మాలిన కల.

మరోపక్క చూస్తే లాలాహర దయాల్ ప్రణాళికకు కావలసిన ఆర్థిక వనరులు ఎంతో లెక్కకట్టి చెప్పటం అసాధ్యం. ఆఫ్ఘనులు, సరిహద్దు తెగలను హిందూ మతంలోకి మార్పించేందుకు అవసరమైన నిధుల్ని ఎవరు సమకూరుస్తారు? చాలాకాలంగా ఇలా తమ మత విశ్వాసాన్ని ఇతర్లకి ఇప్పించటం మానివేసిన హిందువుల్లో ఈ మతమార్పిడి చేయించాలన్న ఉత్సాహం కూడా పోయింది. ఇంతే కాకుండా హిందూ సమాజం చాతుర్వర్ణ పద్ధతిలో నిర్మించబడింది. ప్రాచీన కాలం నుంచీ సంపద హెచ్చు తగ్గులుగా విభజింపబడింది. హిందువుల్లో సంపదకూ, ఆస్తికీ వారసులు బనియ మాత్రమే. విదేశీ ఆక్రమణదారులు, స్వదేశీ తిరుగుబాటుదారులు తయారు చేసిన భూస్వాములు ఉండనే వున్నారు. అయితే వారు 'బనియ'లున్నంత అధిక సంఖ్యలో లేరు. బనియాలు డబ్బుకోసం, డబ్బు నుంచే తయారైనవారు.

వారి ప్రయత్నాలు అంతా పూర్తిగా వ్యక్తిగత లాభాల కోసమే. డబ్బును తన చేతిలో ఉంచుకోవటం, తన తర్వాతి వారికి దాన్ని అందజేయటం తప్ప డబ్బుకు మరో ఉపయోగాన్ని గుర్తించనివాడు బనియా. మత విస్తరణ, లేదా మత స్వాధీనం, సంస్కృతి అభివృద్ధి మొదలైనవేవీ అతనికి ఆసక్తి కలిగించవు. అతని బడ్జెటులో శుభ్రమైన జీవనానికి కూడా స్థానం లేదు. యుగాలనించీ అతని సంప్రదాయం ఇదే. డబ్బు కావలసినప్పుడు మాత్రం జీవిత విధానంలో, భావాల్లో అతను క్రూరుడూ పశుప్రాయుడూ అవుతాడు. అతని బడ్జెటులో, ఖర్చుల పద్దులో ఒక కొత్త అంశానికి మాత్రం చోటుంది. అదేమిటంటే రాజకీయాలు. గాంధీ

రాజకీయాల్లోకి నాయకుడుగా ప్రవేశించినప్పటి నుంచీ ఇది జరుగుతూ ఉంది. ఇక్కడ కూడా నిజమైన కారణం అతనికి రాజకీయాలపై ప్రేమకాదు. ప్రజా వ్యవహారాల్లోంచి వ్యక్తిగత లాభాన్ని దండుకోవాలనుకోటమే దానికి కారణం. దండుకోవటానికి ఎలాంటి ఆస్కారమూ లేని అంశం ఆఫ్ఘన్లలో సరిహద్దు తెగల్లో మతాన్ని వ్యాపింప చేయటం అన్నది. ఇలాంటిదాన్లో అలాంటి వ్యక్తులు డబ్బులు ఖర్చు పెడుతారన్న ఆశ ఏముంది?

ఇక మూడవ సంగతి. ఆఫ్ఘనిస్తాన్‌లో మత మార్పిడికి ఏ అనుకూలాలు ఉన్నాయన్నది ఒక ప్రశ్న. టర్కీలోలాగే ఎలాంటి శిక్షకూ నష్టానికి లోను కాకుండా ఆఫ్ఘనిస్తాన్‌లోనూ ఖురాన్ తప్పులతడక అనీ, దానికి కాలం చెల్లింది అనీ చెప్పే వీలుందని లాలా హరదయాల్ ఆలోచించారన్నది నిజమే. 1924లో అంటే లాలా హరదయాళ్ తన రాజకీయ వీలునామాను ప్రచురించటానికి సంవత్సరం ముందే కాబూల్‌లో ఒక సంఘటన జరిగింది. ఖయాదిన్-మీర్జా గులాం అహ్మద్-నియాముద్దీన్ అనే వ్యక్తి తనను తాను ప్రవక్తననీ, మహా పురుషుణ్ణనీ చెప్పుకుంటున్నప్పుడు అతన్ని రాళ్లతో కొట్టి చంపటమనే శిక్ష విధించటం జరిగింది*.

ఆఫ్ఘనిస్తాన్‌లో అత్యున్నతమైన ధార్మిక (మత సంప్రదాయవాద) న్యాయస్థానం ఈ శిక్షను ప్రకటించింది.ఇతను చేసిన నేరం గురించి ఖిలాఫత్ పత్రిక ఇలా పేర్కొంది : ఇస్లాం, షరియత్‌లకు భిన్నంగా భావాల్నీ, విశ్వాసాల్నీ ప్రచారం చేయటమే అతని నేరం. ఈ మనిషిని రాళ్ళతో కొట్టి చంపాలని శిక్ష విధించటం జరిగింది. ఈ శిక్షను కొన్ని కోర్టులు తీర్పును అంగీకరించిం తర్వాతే విధించటం జరిగింది. ఆ కోర్టులు – మొదటి షరియత్(కోర్టు), కేంద్ర అప్పీలు కోర్టు, న్యాయమంత్రిత్వ శాఖకు చెందిన తుది అప్పీలు కమిటీ ఉలేమాలు ఈ సమస్యల వెలుగులో ఈ ప్రణాళికను పరిశీలిస్తే దీని రచనే విచిత్రంగా సాగినట్లు అనిపిస్తోంది. అమలులోకి తెస్తే విధ్వంసకారిగా కూడా నిరూపణ అవుతుంది అనిపిస్తోంది. ఇది చాలా సాహసంతో కూడుకున్న ప్రణాళిక. విచక్షణ కలిగిన ఏ వ్యక్తికి చెప్పినా అసంగతంగా తోచక తప్పదు, అంటే బహుశా కొంతమంది పంజాబులోని ఆర్య సమాజీయులకు తప్ప. హిందూ మహాసభ సంవత్సర సమావేశాల్లో సభాధ్యక్షుడు వి.డి. సావర్కర్ తన అధ్యక్షోపన్యాసంలో హిందువులు తీసుకున్న నిర్ణయాన్ని నిర్వచించారు. దాని ప్రకారం హిందూ మహాసభ పాకిస్తాన్ ఏర్పాటును వ్యతిరేకిస్తోంది. అందుకు అన్ని మార్గాల ద్వారా తన నిరసనను ప్రకటిస్తోంది. ఈ మార్గాలేమిటో మనకు తెలియదు. ఒకవేళ ఆ మార్గాలు – బలప్రయోగం, అణచివేత, ప్రతిఘటన మొదలైనవి - అయితే ఇవన్నీ వ్యతిరేక ప్రత్యామ్నాయాలు మాత్రమే. ఈ సాధనాలు ఎంతవరకు విజయవంతమౌతాయో హిందూ మహాసభ, సావర్కార్ చెప్పాలి.

అయితే భారతదేశంలోని ముస్లిముల ప్రతిపాదనల పట్ల తనకు వ్యతిరేకత మాత్రమే ఉందని సావర్కార్ అనడం ఏ మాత్రం తగిందిగా లేదు. ముస్లిముల ప్రతిపాదనలకు

* "Through Indian Eyes" - టైమ్స్ ఆఫ్ ఇండియా 27.11.24 నివేదికను చూడండి.

సమాధానంగా కొన్ని నిశ్చయాత్మక ప్రతిపాదనలు అతను చేశాడు.

అతని నిశ్చయాత్మకమైన ప్రతిపాదనల్ని ఎవరైనా సరే అర్థం చేసుకోవాలంటే అతని మౌలిక భావనల్లో కొన్నిటిని అవగాహన పరచుకుని ఉండాలి. హిందూమతం (Hinduism), హిందూత్వం (Hindutva), హిందూ రాజ్యం (Hindudom) మొదలైన కొన్ని పదాలను అర్థం చేసుకోవాల్సిన ఆవశ్యకతను సావర్కార్ నొక్కి చెప్పుతుంటారు. ఆయన ఇలా అంటారు :

"హిందూ ఉద్యమ భావజాలాన్ని వ్యాఖ్యానించాలంటే ఈ మూడు పదాల అర్థాన్ని సరిగ్గా అవగతపరుచుకోవాల్సిన అవసరం కచ్చితంగా ఉంది. "హిందూ" అనే పదం నుండి ఆంగ్లంలో హిందూయిజం అనే పదం ఏర్పడింది. "హిందూయిజం అంటే హిందూమతం. హిందువులు అనుసరించే మతం లేదా సంప్రదాయ మార్గాలు. హిందూమతం లాగా హిందువుల మత దృక్పథాల్ని సూచించే పరిమిత పదం నేడు 'హిందూత్వం' అనే పదం. ఇది హిందువుల సాంస్కృతిక, భాషా, సామాజిక, రాజకీయ కోణాలనూ కలుపుకొనే విస్తృతార్థం ఇస్తుంది. ఇది దాదాపు 'హిందూ రాజ్య తంత్రం' అనే పదానికి సన్నిహితంగా ఉంది. దీనికి సరైన సన్నిహితమైన అనువాదం హిందూనెస్ ((Hinduness) అంటే హైందవం అని చెప్పవచ్చు. ఇక మూడవ పదం 'హిందూడం' (Hindudom) అంటే సామూహికంగా హిందువులను సూచించే పదం. హిందూ ప్రపంచాన్ని సూచించే సమష్టిపదం ఇది. ముస్లిముల ప్రపంచాన్ని 'ఇస్లాం' అనే పదం సూచించినట్లే ఇదీనూ.

హిందూ మహాసభను ఒక మత సంస్థగా లెక్క కట్టడం చాలా పొరపాటు అయిన పని అని సావర్కార్ అభిప్రాయం. ఈ రకమైన పరిగణనను వ్యతిరేకిస్తూ ఆయన ఇలా అంటారు:*

"ఆంగ్ల విద్యను అభ్యసించిన హిందువుల్లో చాలామంది హిందూ మహాసభలో చేరకుండా ఉన్న విషయం నా దృష్టికి వచ్చింది. క్రైస్తవ మిషనరీ లాగా ఇది కూడా ఒక మత సంస్థ అనే పొరపాటు అభిప్రాయం వారికి ఉండడం చేతే ఇలా జరిగింది. ఇంతకన్నా సత్యదూరమైందేదీ లేదు. హిందూ మహాసభ హిందూ మతధార్మిక ప్రచార సంస్థ కాదు. వివిధ మత సంబంధమైన ప్రశ్నలు – ఆస్తికత్వం, ఏకేశ్వరవాదం, సర్వేశ్వరవాదం, నాస్తికత్వం మొదలైన వాటికి సంబంధించిన తర్కాలూ, ప్రతిపాదనలూ ఆయా హిందూ మత భావాలకు ప్రాతినిధ్యం వహించే శాఖలకు హిందూ మహాసభ వదిలివేసింది. అంటే ఇది హిందూ ధర్మ మహాసభ కాదు. హిందూ జాతీయ మహాసభ. తత్కారణంగానే హిందూమతంలోపలి శాఖలతో కూడా, హిందూ మత ధోరణులతో కూడా ఎలాంటి సంబంధమూ ఈ మహాసభ పెట్టుకోలేదు. జాతీయ హిందూ సంస్థగా హిందూస్థాన్‌లో పుట్టిన అన్ని మతాల సమ్మేళనమైన జాతీయ హిందూ చర్చిని ప్రచారం చేయడం, రక్షించడం, హిందూయేతర శక్తుల నుండి దాడినీ, ఆక్రమణనూ ప్రతిఘటించడం ఈ మహాసభ చేసిన పని. కాని, దీని కార్యకలాపాలు ఒక మత సంస్థగా మాత్రం

* చూడండి. మళ్లీ అదే పుస్తకం. పుట – 25.

పరిమితమై లేదు. అది ఇంకా విస్తృతమైంది. హిందూ మహాసభ జాతీయ జీవనంతో, సమష్టి హిందూ రాజ్యంతో మమేకంగా ఉంటుంది. ఈ మమైక్యత అన్ని దేశాల్లో నుంచీ సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక అన్నిటికన్నా మిన్నగా రాజకీయ దిశ నుంచీ ఉంటుంది. హిందూ దేశ స్వాతంత్ర్యానికీ, శక్తి సంపన్నతకీ, కీర్తికీ తోడ్పడే అంశాలన్నిటికీ మద్దతునిస్తుంది. వాటి రక్షణకు ప్రతిన పూనుతుంది. చట్టబద్ధమూ, సక్రమమూ అయిన మార్గాల ద్వారా హిందూస్తాన్ సంపూర్ణ రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించి పెట్టే సాధనంగా ప్రవర్తిస్తుంది".

ముస్లింలీగ్‌కు ప్రతిగా హిందూ మహాసభ అవతరించిందన్న విషయాన్ని సావర్కార్ ఒప్పుకోరు. హిందూ ముసల్మానులిరువురికీ సంతృప్తికరంగా మతపరమైన సమస్యలు పరిష్కారం అయితే ఈ హిందూ మహాసభ యధావిధిగా పని చేస్తుందని ఆయన నొక్కి చెబుతారు. ఆయన మాటల్లో* :

"చాలామంది లోతులేని విమర్శకులకు ఈ హిందూ మహాసభ పట్ల ఒక భ్రమ ఉంది. ఇది కేవలం ముస్లిం లీగ్‌తో సమతూకంగా హిందువులను ఉంచటానికి, ముస్లింలీగ్ ఆట కట్టించటానికి తయారు చేయటం జరిగిందని వారి భావం. ప్రస్తుత కాంగ్రెసు నాయకుల హిందూ వ్యతిరేక విధానానికి ప్రతిగానూ ఇది ప్రతిపాదింపబడిందనీ వారి విమర్శ. దాని ఏర్పాటుకు వెనుక ఉన్న ఈ అంశాలను సాధించటం అవుతూనే దాని కార్యకలాపాలూ ఆగిపోతాయనీ, సభ మూత పడుతుందనీ వారంటారు. అయితే మహాసభ ఏర్పాటుకు వెనుక లక్ష్యాలు అంటూ ఉంటే అవి సామాన్యమైనవి కావు. ఏదైనా రాజకీయ పార్టీని వ్యతిరేకించటానికో, మరేదైనా కష్టాన్ని తొలగించటానికి అట్టహాసమైన ఉద్యమాన్ని ప్రారంభించటానికో, మరేవో పై మెరుగు ప్రయోజనాలకో ఈ మహాసభను ప్రారంభించలేదు. ఏదైనా ఒక జీవి అది వైయక్తికమూ కావచ్చు, సామాజికమూ కావచ్చు. పరిసరాల్లో మార్పు రాగానే అందుకు తగ్గట్టు తన అంగనిర్మాణ క్రమంలో ప్రమాదకరమైన, రక్షణాత్మకమైన వాటిని ఒదిలించుకుంటూ మార్పు చెందుతుంది. హిందూదేశం ఊపిరాడని కాంగ్రెసు బ్రాండు అభాస జాతీయతా భావజాలం పట్టు నుంచి బయటపడిన వెంటనే ఆధునిక కాలానికి, మార్పులకు అనుగుణమైన దిశలో తనను తాను అభివృద్ధి పరచుకుంటుంది. ఇదీ హిందూ మహాసభ. జాతీయ జీవనానికి సంబంధించిన ప్రాథమిక అవసరం నుంచీ ఈ మహాసభ పుట్టింది కానీ ఏదో అల్పమైన సంఘటన నుంచి రూపు దిద్దుకొంది కాదు. దీని నిర్మాణాత్మక పార్శ్వం నుంచి లక్ష్యాలనూ ఉద్దేశాలనూ పరిశీలిస్తే జాతి జీవనానికి ఇదెంత నిబద్ధమైన దృక్పథంతో ఉందో అర్థమవుతుంది. అదలా ఉంచితే అనుక్షణం మారుతూ వస్తున్న రాజకీయ మార్పుల కనుగుణంగా కొత్త విధానాలను అనుసరించుతూ రావటానికి ఈ మహాసభ హిందూ రాజ్యం పై విధి నిర్వాహకురాలు లాగా తయారవుతుంది. హిందేతర, లేదా కొన్ని సంస్థలు కలిసిన సంఘం పెత్తనానికి లొంగి,

* చూడండి అదే. 24-27 పుటలు.

నైతికంగా మేధోపరంగా ఒక బానిసగా మారకుండా స్వతంత్రంగా ఈ హిందూ సంస్థను కొనసాగించటం ముఖ్యోద్దేశం. హిందూ ప్రయోజనాలను రక్షించటం, ఎప్పటికప్పుడు కుంటు పడకుండా సంకటాల నుంచి ఉద్ధరించటం కూడా ముఖ్యమైన లక్ష్యమే. హిందూస్తాన్‌లో రాజకీయ పరిస్థితులను దృష్టిలో ఉంచుకునేకాదు కానీ ఇలాంటి ప్రత్యేకమైన హిందూ సంస్థ అవసరం నిజంగానే వుంది. అంటే హిందూ సంస్థ హిందూ మహాసభ రూపంలో లేదా అలాంటి మరొక రూపంలో పనిచేస్తూ ఇంక రానున్న రెండు శతాబ్దాలకు కూడా ఒక రకమైన హిందూత్వానికి కాపలాదారు పాత్రను నిర్వహించాల్సి ఉంది. హిందూస్తాన్ పాక్షికంగానో, పూర్తిగానో విముక్తి పొంది జాతీయ పార్లమెంటు దాని రాజకీయ గమ్యాన్ని నిర్దేశిస్తున్నప్పుడు కూడా ఇలాంటి హిందూ సంస్థ పర్యవేక్షణ ఉండాల్సిందే.

ఇప్పుడు ప్రవర్తమవుతున్న రాజకీయాలు ఈనాడు ఊహించలేని విధంగా ఏదైనా విప్లవం సంభవించి ప్రపంచ రాజకీయ పటం తల్లకిందులైతే చెప్పలేం కానీ, తక్షణ భవిష్యత్తులో హిందువులైన మనం ఆశించగలిగిందీ, చేయగలిగిందీ ఇంగ్లాండును ప్రభావితం చేసి పశ్చిమ మంత్రిత్వ వ్యవస్థ విధానంలో ఆలోచన చేయబడిన స్థాయితో సమానంగా భారత్‌ను స్వయం పాలనా ప్రభుత్వ భాగంగా అంగీకరిం చేట్లు చేయటమే. అలాంటి స్వయంపాలనా ప్రభుత్వం ఉన్న భారత్‌లోని జాతీయ పార్లమెంటు అక్కడి హిందూ ముస్లిం ఓటర్ల పరిస్థితికి అద్దం పడుతుంది. హిందూ ముస్లిం సంబంధాలు కొద్దిగా మెరుగుగానూ ఉండవచ్చు. అదే సమయంలో కొద్దిగా క్షీణించీ ఉండవచ్చు. భారతదేశాన్ని ముస్లిం రాజ్యంగా మార్చాలనే ముస్లిముల రహస్య కాంక్ష, విదేశీ ప్రణాళికలు, ఏ సమయంలోనైనా, భారత స్వయంపాలనా ప్రభుత్వంగా ఉన్నా కూడా అంతః కలహాల రూపంలోనో, విదేశీ దురాక్రమణదారులకు మద్దదతునిచ్చే భారత్‌లోని ముస్లిముల ద్రోహ చింతనల రూపంలోనో ఒక్కసారిగా బయటపడవచ్చు. అలా అయినప్పుడు మళ్ళీ ఒక శతాబ్దం వరకూ భారత్ అశాంతి సంఘటనల పరంపర నుంచి తేరుకోలేకపోవచ్చు. మత ద్వేషపు దొమ్మీలు, ఉద్యోగాల కోసం, శాసనసభ సీట్లు కోసం తొక్కిసలాటలు, ముస్లిముల జనాభా – మైనారిటీలకు ఒక నిష్పత్తిలో ప్రాతినిధ్యం – ఇవన్నీ కూడా అంతర్గత శాంతికి ఎప్పుడూ ఒక ప్రమాదంగా కొనసాగుతాయి. మనం వివేకంతో ప్రవర్తించినట్లయితే వీటి ఆట కట్టించడానికి హిందూత్వ పరిరక్షణ కోసం అవతరించిన ఒక బలమైన సంస్థ హిందూ మహాసభ లాంటిది అవసరమని గ్రహించి తీరుతాము. హిందూస్థాన్ స్వయం పాలనా ప్రతిపత్తిని పొందిన తర్వాత కూడా ఈ సంస్థ ఉనికి అవసరం. ఇది ఒక కచ్చితమైన అంకిత భావంతో పనిచేసే శక్తి. సంయుక్త పార్లమెంటులో హిందువులు తమ కష్టాలను చర్చించటానికి, గట్టిగా తమ ఉద్దేశ్యాలను ప్రతిపాదించటానికి, రాగల ప్రమాదాలను పసికట్టటానికి, అలాంటి ప్రమాదంలో అమాయకంగా సంయుక్త రాజ్యమైన భారత్ ఇరుక్కున్నప్పుడు అవసరమైతే పోరాటానికి సిద్ధ పడటానికి ఈ హిందూ సంస్థపై ఆధారపడవచ్చు.

"కెనడా, పాలస్తీనా, యంగ్‌టర్క్ ఉద్యమం చరిత్రను పరిశీలిస్తే ఇదే విషయం

తేటతెల్లమవుతుంది. అక్కడ రాజ్యంలో ఎప్పుడైతే ఇలాంటి రెండు లేదా అంతకన్న ఎక్కువ అంశాలు (అంటే భారత్‌లో హిందూ, ముస్లిములు లాగా) సంఘర్షణలో ఉండటం జరిగితే అందులో తెలివైన వర్గం వారు తమకు ప్రత్యేకమైన సంస్థను ఒకదానిని ఏర్పరచుకోవటం గమనించవచ్చు. ఎదుటి పార్టీ వారు రాజ్యాన్ని హస్తగతం చేసుకోకుండా చూడటానికి, వారు ఎలాంటి మోసాలకూ, కుట్రలకూ పాల్పడినా వాటిని భగ్నం చేయటానికి అలాంటి ప్రత్యేక సంస్థను వారు ఉపయోగించుకుంటారు. ఎదుటి పార్టీవారు సరిహద్దుల కావలివైపు సంబంధాలను పెట్టుకున్నప్పుడు, సరిహద్దు రాజ్యాలతో మత, సాంస్కృతిక సంబంధాలను కలిగి ఉన్నప్పుడు ఇలాంటి ప్రత్యేక సంస్థల అవసరం ఉంది."

హిందూస్తాన్ అంటే ఏమిటో? హిందూ మహాసభ అంటే ఏమిటో? చెప్పింతర్వాత సావర్కార్ 'స్వరాజ్' భావనను నిర్వచించటానికి పూనుకున్నారు. సావర్కార్ ప్రకారం[1] :

"స్వరాజ్ అంటే హిందువులకు సంబంధించి ఒక ప్రత్యేక అర్థం ఉంది. వారనుకున్న 'స్వరాజ్'లో హిందూత్వం పై చేయిగా ప్రధానంగా ఉంటుంది. హిందేతర ప్రజల, అంటే వారు భారత ప్రాంతంలోని వారు కావచ్చు – ఇతర ప్రాంతాల్లో నుంచి వచ్చివేసినవారు, భారత్‌లో పుట్టినవారు అయిన ఆంగ్లేయులలాంటివారు కావచ్చు – వీరి అధికారం లేదా పెత్తనం 'స్వరాజ్'లో ఉండదు. ఈ ఆంగ్లో ఇండియన్ల ఆధిపత్యం హిందువులకు 'స్వరాజ్' అనిపిస్తుందా? ఔరంగజేబు, టిప్పు వంశానుగతంగా భారతీయులా? కాదు. మతం మార్చుకున్న హిందూతల్లులకు పుట్టినవారు. అయితే అంతమాత్రం చేత టిప్పు, లేదా ఔరంగజేబు పరిపాలన హిందువులకు 'స్వరాజ్' లాంటిదా! లేదు. వారు ప్రాదేశికంగా భారతీయులైనా కూడా, హిందూత్వానికి శత్రువులుగా నిరూపించుకున్నారు. కాబట్టే, శివాజీ, గోబిందసింగ్, ప్రతాప్, లేదా పీష్వాలు ముస్లిం ఆధిపత్యానికి వ్యతిరేకంగా పోరాడి హిందూ 'స్వరాజ్'ను స్థాపించాల్సి వచ్చింది".

తన 'స్వరాజ్' భావనలో భాగంగా సావర్కార్ రెండు విషయాలను నొక్కి చెప్పారు. అందులో మొదటిది : భారత్‌కు 'హిందూస్తాన్' అనే పేరును ఖరారు చేయటం.[2]

"మనదేశం 'హిందూస్తాన్' అనే పేరు మీదే వ్యవహరించబడాలి. సింధు అనే పదం నుంచి వచ్చిన ఇండియా, హింద్ మొదలైన పదాలను వాడవచ్చు కానీ అది కేవలం హిందువుల ప్రాంతం, హిందూ దేశం అనే అర్థాన్ని సూచించటానికి మాత్రమే ఉపయోగించాలి. మన మాతృదేశానికి విశేషణాలని చెప్పదగ్గ పదాలు ఆర్యావర్తం, భరతభూమి లాంటివి చాలా పాతవి, పురాతన కాలం నుంచీ వాడుతూ వస్తున్నవి. అవి నాగరికులైన శిష్టులకు అలాంటి ప్రాచీన సాంస్కృతికార్థాన్నే సూచిస్తూ వస్తాయి ఇక మీదట వాడుకలో కూడా. ఈ పట్టు మీదే

---

1. 1939 ఉపన్యాసం, అదే పుట 18.
2. అవే పుటలు 19–20

హిందువుల మాతృభూమిని 'హిందూస్తాన్' అని పిలవాలనటం. అంతమాత్రం చేత దేశంలోని హిందూయేతరులను చిన్న బుచ్చినట్టు కాదు. మనదేశంలోని పార్శీ, క్రైస్తవులు సాంస్కృతికంగా చాలా చేరువయ్యారు. కాబట్టి వారికి దేశభక్తి కూడా ఎక్కువే. అయితే ఆంగ్లో ఇండియన్లు ఈ వరుసలో నిలవటానికి నిరాకరణను వ్యక్తం చేశారు. అది చట్టబద్ధంగా సరైనదే. అయితే ముస్లిం సోదరులకు సంబంధించినంతవరకూ ఒక మాట చెప్పుకోవాలి. వారిలో కొంతమందికి హిందూ ముస్లిం ఐక్యతకు మధ్య దాటరాని ఒక అడ్డంకి ఉందన్న విషయాన్ని నమ్మటానికే ఇష్టం. అయితే ఇండియాలో మాత్రమే ముస్లిములు నివసించటంలేదని, భారతీయ ముస్లిములు మాత్రమే ఇస్లాంకు విధేయులుగా మిగిలిన వీరులు కాదనీ వారు గుర్తు చేసుకోవాలి. చైనాలో ఎన్నో కోట్ల ముస్లిములు ఉన్నారు. గ్రీకు పాలస్తీనా, హంగరీ, పోలండ్ మొదలైన దేశాల్లో - ఆ దేశీయులతో పాటు కొన్ని వేలమంది ముస్లిములు జీవిస్తున్నారు. అయితే ఒక మైనారిటీగా, ఒక జాతిగా ముస్లిములు ఈ దేశాల్లో ఈ దేశాలకు ఉన్న ప్రాచీన నామధేయాల్ని మార్చేసేంత ముందుకు రాలేదు. అలాంటి పరిస్థితినీ ఏర్పరచలేదు. ఈ దేశాల పేర్లన్నీ కూడా అక్కడ నివసించే జాతులకు సంబంధించిన మాతృభూమిని సూచించినవే. పోలిష్ జాతీయుల దేశం పోలెండ్గా, గ్రీసియన్లు నివసించే భూ ప్రాంతం గ్రీసుగా చలామణి అవుతున్న వైనం మనకు తెలిసిందే. అక్కడ ముస్లిములు పరిస్థితులను అస్తవ్యస్తం చేసేందుకు ధైర్యం చేయలేకపోయారు. తమ్మతాము పోలిష్ ముస్లిములుగానో, గ్రీషియన్ ముస్లిములుగానో, చైనీయులుగానో పరిగణించుకోవటంతో సంతృప్తి చెందుతూ వచ్చారు. అలాగే అవసరం వచ్చినపుడు ఇక్కడ ముస్లిములు జాతీయ స్థాయిలో, ప్రాదేశికంగానూ, తమను తాము హిందూస్తాన్ ముస్లిములుగా పిలుచుకోవచ్చు. తమ ప్రత్యేకమైన మత, సాంస్కృతిక అస్తిత్వాన్ని నిలుపుకుంటూనే వారీ పని చేయవచ్చు. కాని, ముస్లిములు వారి ఇచ్ఛానుసారం ఇండియాలోకి వచ్చి రావటంతోటి తమను తాము 'హిందూస్తానీస్'గా పిల్చుకుంటున్నారు.

"కాని, ఇన్నిటి మధ్యా మనదేశంలోని కొన్ని ముస్లిం కూటాలు మన దేశం పేరు విషయమై ఇంకా అభ్యంతరాలు చెబుతూ ఉన్నారు. మన అంతరాత్మల ముందు మనం పిరికి వాళ్ళుగా నిలబడాల్సిన అవసరం ఏమిటో తోచదు. ఋగ్వేదకాలంలో సింధూ నుండి మనదేశానికున్న అవిచ్ఛిన్నతకు యువతరం హిందువులు దాకా ఉన్న ఆ కొనసాగింపునకు మనం భంగం రానివ్వకూడదు. ఇదే హిందూస్తాన్ అన్న పదం వెనుక దాగిన అర్థం. మన మాతృభూమికి మనం అంగీకరించిన సాధికారిక సాభిప్రాయ నామం హిందూస్తాన్. జర్మన్ల భూమి జర్మనీ, ఇంగ్లీషు వాళ్లది ఇంగ్లండు, ఆఫ్ఘన్లది ఆఫ్ఘనిస్తాన్. అలాగే ప్రపంచ పటం మీద వెలిగే ముద్ర - హిందువుల భూమి 'హిందూస్తాన్' చిరకాలం నిలిచి పోతుంది.

ఇక రెండవది - సంస్కృతాన్ని పవిత్రభాషగా, హిందీని జాతీయ భాషగా నిలపడం - అలాగే నాగరిలిపిని హిందూజాతికి సంకేతంగా అట్టిపెట్టడం*.

* ఉపన్యాసం పుటలు 21,22,23

"సంస్కృతం (దేవభాష)[1] అంటే మన పవిత్ర భాషగా ఉండాలి. సంస్కృత నిష్టమైన హిందీ అంటే సంస్కృతం నుండి తయారైన హిందీ Sankrit Nista జాతీయ భాషగా(రాష్ట్రభాష) అభివృద్ధి చెందుతుంది. మన ప్రస్తుత జాతీయ భాష ప్రపంచంలోనే సుసంపన్నమైంది. సంస్కృతీ వైభవంతో అలరారే ప్రాచీన భాషల్లో ఒకటి అవుతుంది. హిందువులకు సంస్కృతం అతి పవిత్రమైన భాష. సంస్కృత సాహిత్యంలోనే మన శాసనాలు, చరిత్ర, తత్వశాస్త్రం, సంస్కృతి మొదలైన అంశాలు వేళ్లూని ఉన్నాయి. ఒకరకంగా ఈ సంస్కృత సాహిత్యం మన జాతి మేధోసారాన్ని మనకు సాక్షాత్కరింప చేస్తుందనీ అనవచ్చు. ఈ సంస్కృత భాష మన మాతృభాషలకెన్నిటికో తల్లి. ఆ భాషలన్నీ ఆ తల్లి పాలతో పెరిగి పెద్దయినవే. అన్ని హిందూ భాషలూ - సంస్కృతం నుంచి వచ్చినవీ, దానితో సంబంధం వల్ల అభివృద్ధి చెందినవీ సరైన సంస్కృతభాష సారం నుంచి మాత్రమే వికసించగలవు, పెంపొందగలవు. కాబట్టి హిందూ యువకులకు సంప్రదాయ అధ్యయన అంశాల్లో తప్పనిసరిగా ఉండాల్సింది సంస్కృత భాష"

"హిందీని జాతీయ భాషగా తీసుకోవటంలో ప్రాంతీయ భాషలను చిన్నపుచ్చటమో వేర్పాటు గుర్తింపు ఇవ్వటమో లేదు. మనం మన ప్రాంతీయ భాషలతో ఎంత సాన్నిహిత్యం కలిగి ఉన్నామో హిందీతోనూ అంతే సాన్నిహిత్యం కలిగి ఉన్నాం. ఈ ప్రాంతీయ భాషలన్నీ వాటి వాటి పరిధిల్లో పెంపొందుతాయి. వాస్తవానికి వాటిలో చాలా భాషలు ఈనాడు సాహిత్య రీత్యా సుసంపన్నమైనవీ, అభ్యుదయాత్మకమైనవీ - అయితే హిందీ జాతీయ భాషగా ఉత్తమమైన అఖిల హిందూ భాషగా ఉండగలదు.

ఒక విషయం మనం గుర్తుంచుకోవాలి. హిందీని జాతీయభాషగా ప్రయత్నపూర్వకంగా చేయలేదు. అధికారాన్ని ప్రయోగించీ చేయలేదు. నిజమేమిటంటే ఇండియాలోకి ఇంగ్లీషు వాళ్లు రాక పూర్వమే ఆ మాటకొస్తే ముస్లిములు అడుగు పెట్టకముందే హిందూస్తాన్ అంతా కూడా హిందీ జాతీయ భాష స్థానాన్ని ఆక్రమించింది. హిందూ యాత్రికుడు, వర్తకుడు, పర్యాటకుడు, సైనికుడు, విద్వాంసుడు మొదలైన వారందరూ బెంగాల్ నుండి సింధూ, కాశ్మీర్ నుంచి రామేశ్వర్ తిరుగుతూ తమ భావ ప్రసారానికి హిందీనే వాడుతూ వచ్చారు. హిందూ మేధో ప్రపంచానికి సంస్కృతం జాతీయ భాషగా ఉన్నట్లే హిందీ కనీసం వెయ్యేళ్ల నుంచీ హిందూ సమాజానికి భారత జాతీయ భాషగా వస్తూ వుంది.

"హిందీ అన్నప్పుడు మనం సంస్కృత నిష్టమైన హిందీనే ఉద్దేశిస్తున్నాం. ఉదాహరణకు మహర్షి దయానంద సరస్వతి 'సత్యార్థ ప్రకాశ్'లో ఈ విషయాన్ని ప్రస్తావించినపుడూ ఈ ఉద్దేశంతోనే అన్నారు. ఎంత సరళమైంది ఈ హిందీ భాష. ఒక్క అనవసర విదేశీ పదం కూడా లేకుండా ఎంత స్వచ్ఛమైంది. ఎంత భావ ప్రకటనా సామర్థ్యం ఉన్న భాషో ఇది! ఈ

1. దేవతల భాష
2. ప్రాథమికంగా సంస్కృతం, జాతీయ భాష

సందర్భంగా స్వామి దయానందులవారి గురించి ప్రస్తావించక తప్పదు. ఇండియాలో హిందీ అఖిల హిందూ జాతీయ భాషగా ఉండాలని ఒక కచ్చితమైన జాగృతివంతమైన ప్రకటనను చేసిన మొట్టమొదటి హిందూ నాయకుడు ఆయన. సంస్కృత నిష్టమైందా ఇది! హిందీకి ఆ సంకరంతో ఎలాంటి సంబంధమూ లేదు. హిందూస్తానీ అన్నదంతా ఈ ప్రణాళిక కల్పితం. ఇలాంటిది భాషా వైపరీత్యం కాకపోతే మరేమీ కాదు. దీన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేయాలి. అంతేకాదు. హిందూ భాషల్లోంచి అవి ప్రాంతీయాలైనా, మాండలికాలైనా కూడా అన్ని అనవసరమైన అన్య దేశాలను అంటే అరబిక్ లేదా ఇంగ్లీషు పదాలను తీసెయ్యాల్సిన అవసరముంది.

"సంస్కృత వర్ణక్రమం ధ్వని పరంగా చాలా నిర్దుష్టమైంది. ప్రపంచ భాషల్లో ఇంకా అలాంటి నిర్దుష్టతకు ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నాయి. ప్రస్తుతం ఇండియాలో ఉన్న లిపులన్నీ కూడా దాదాపు ఆ క్రమాన్ని అనుసరిస్తున్నాయి. నాగరి లిపి కూడా శతాబ్దాలుగా భారతదేశమంతా హిందూ సాహిత్య వర్గాల్లో ప్రచారంలో ఉంది. రెండు వేల సంవత్సరాల నుంచీ ఇలా వ్యాప్తి చెంది ప్రచారంలో ఉందనీ చెప్పవచ్చు. దీనికి 'శాస్త్రి లిపి' అనే మారు పేరు ఉండేది. మన హిందూ శాసనాల లిపి ఇది. నాగరిలో ముద్రించబడిన బెంగాలీ గాని, గుజరాతీ గాని ఇతర ప్రాంతాల్లో దాదాపు అర్థం చేసుకోబడే హిందూస్తాన్ పొడవునా ఒకే భాష ఒక్కసారిగా తీసుకు రావాలనుకున్న ఆలోచనలో ఏ మాత్రమూ విజ్ఞత లేదు. ఆచరణలో అది సాధ్యం కాదు. హిందూరాజ్‌లో అంతటా ఒకే లిపిగా నాగరిలిపిని ప్రయోగించటం సాధ్యమౌతుంది. మరొక్క విషయాన్ని కూడా మనం గుర్తుంచుకోవాలి. వివిధ ప్రాంతాల్లోని ప్రాంతీయ హిందూ లిపులు నాగరలిపితోబాటే అభివృద్ధి చెందుతూ వస్తాయి. వాటి భవిష్యత్తు వాటి కుంటుంది. హిందూ రాజ్యం ప్రయోజనాల దృష్ట్యా అత్యావశ్యకమైంది ఏమంటే హిందూ విద్యార్థులకు ప్రతి పాఠశాలలోనూ హిందీ భాషతో పాటు నాగరి లిపిని కూడా తప్పనిసరిగా చదవాల్సిన అంశాలలో చేర్చాలి."

సావర్కార్ ఆలోచన ప్రకారం 'స్వరాజ్'లో హిందేతర మైనారిటీల పరిస్థితి ఎలా ఉంటుంది? ఈ ప్రశ్నకు సావర్కార్ చెప్పగలిగిన సమాధానం ఇది* :

"హిందూ మహాసభ ఒక మనిషి – ఒక ఓటు సూత్రాన్ని అంగీకరించటమే కాదు, దాన్ని అమలు పరుస్తూ వస్తే ప్రజా సేవలన్నీ ప్రతిభా పాటవాల పైనే ఆధారపడినవంటే, అందరు పౌరులు జాతి మత బేధం లేకుండా ప్రాథమిక హక్కులు బాధ్యతలూ పంచుకోవాలన్న అభిప్రాయంతో ఏకీభవిస్తే, ఇక మైనారిటీ హక్కుల గురించి ప్రస్తావించడం అనేది అనవసరం మాత్రమే కాదు. పరస్పర విరోధం కూడా కలుగుతుంది.

* ఉపన్యాసాలు. పుట 4.

ఎందుకంటే మత ప్రాతిపదిక మీద మైనారిటీ, మెజారిటీ అనే స్పృహను ఇది ప్రవేశ పెడుతుంది. అయితే ఆచరణలో రాజకీయాలుపేక్షించేవి ఇదే. హిందూ సంఘటనకారులు మన దేశీయులలో హిందేతరులను అనుమాన పిశాచం బారి నుంచి బయటకు లాగటానికి ఇది కావలసి వస్తుంది. మైనారిటీల మత, సాంస్కృతిక, భాషా అంశాలకు సంబంధించి వారి చట్టబద్ధమైన హక్కులకు రక్షణ కల్పిస్తామని, మనం ఇందుకే నొక్కి చెప్పాల్సి వస్తుంది. పైన చెప్పిన హామీలన్నీ ఇచ్చేందుకు ఒక షరతుంది. మెజారిటీల సమానత్వ హక్కులు ఎక్కడా భంగం కలగకుండా వాటిని నిరాకరించకుండా ఉండేందుకు ఆ షరతు. ప్రతి మైనారిటీ వారికి వారి పిల్లలకు మాతృభాషను బోధించటానికి ప్రత్యేక పాఠశాలలు, ఇంకా వారు మత సంస్థలు, సాంస్కృతిక సంస్థలు ఏర్పరచుకోవచ్చు. వాటికి ప్రభుత్వం నుంచి సహాయం కూడా తీసుకోవచ్చు. అయితే వారు చెల్లించే పన్నులకు సరైన నిష్పత్తిలోనే ఈ సహాయం ఉంటుంది. ఇదే సూత్రం మెజారిటీల విషయంలోనూ వర్తిస్తుంది.

"వీటన్నిటికి మించి మరొక విషయం ఉంది. సంయుక్త ఓటర్లపై, ఒక మనిషి - ఒక ఓటు అన్న జాతీయ నియమంపై ఆధారపడకుండా రాజ్యాంగం మత ప్రాతిపదికపై తయారైనపుడు ప్రత్యేక నియోజకవర్గాలు కావాలనుకున్న మైనారిటీలు ప్రత్యేకించబడిన సీట్లనూ తీసుకోనివ్వండి. అయితే ఇది ఎప్పుడూ వారి సంఖ్యకు తగిన నిష్పత్తిలోనే వుండాలి. మెజారిటీలు తమ సంఖ్యకు తగిన నిష్పత్తిలో వాటిని పొందటానికి సమాన హక్కు ఉంది. దానికి భంగం వాటిల్లకూడదు."

మైనారిటీలకు ఇవ్వవలసిన స్థానం గురించి అలా నిర్వచించాక సావర్కార్ తన 'స్వరాజ్' ప్రణాళికలోని అంశాలను మరికొన్ని పేర్కొంటూ ముగించారు.*

"ఇండియాలోని ముస్లిం మైనారిటీలు సమాన పౌరులుగా గుర్తించబడే హక్కు కలిగి ఉంటారు. వారి సంఖ్య నిష్పత్తిని అనుసరించి సమాన భద్రతను పౌరహక్కులనూ వారు అనుభవించగలుగుతారు. హిందేతర మైనారిటీల చట్టబద్ధమైన హక్కుల్లో హిందూ మెజారిటీ ఎప్పుడూ తలదూర్చదు. కాని ప్రజాస్వామిక చట్టబద్ధమైన రాజ్యాంగాల్లో మెజారిటీలకున్న హక్కునే ఇక్కడ హిందూ మెజారిటీ వినియోగించుకుంటుంది. ఎట్టి సందర్భంలోనూ ఆ హక్కును వదులుకోదు. ముస్లిం మైనారిటీలు మైనారిటీలుగా మిగిలి ఉండటానికి సుముఖతను చూపించలేదు. అయినా వారు తమకు ఇచ్చిన స్థానంతో సంతృప్తి పడాలి. వారి జనాభాకు సరియైన నిష్పత్తిలో చట్టరీత్యా తమ వంతు సాంఘిక రాజకీయ హక్కుల్ని అనుభవించటంతో వారు సంతృప్తి పడాలి. వారి జనాభాకు సరియైన నిష్పత్తిలో చట్టరీత్యా తమ వంతు సాంఘిక రాజకీయ హక్కుల్ని అనుభవించటంతో వారు సంతృప్తి పడాలి. మెజారిటీల చట్టబద్ధమైన హక్కులు, విశేషాధికారాలు మొదలైన వాటి అమలులో వీటిని ఉపయోగించే అవకాశం ముస్లిం

* అదే,పుట - 16

మై నారిటీలకు ధారాదత్తం చేయటం దానినే స్వరాజ్యం అనటం మూర్ఖత్వమే తప్ప మరొకటి కాదు. హిందువులు కేవలం పాలకులను మార్చాలనుకోవటం లేదు. హిందువులు పోరాటాలు, ప్రాణత్యాగాలూ చేసిన కారణంగా ఏర్పడ్డ స్థానంలో ఔరంగజేబును కేవలం అతను ఇండియా సరిహద్దుల్లోపల పుట్టాడన్న ఒక్క కారణం చేత ప్రతిష్టించాలని అనుకోవటం లేదు. తమ భూమిలో, తమపై తామే పాలకులు కావాలని వారు కోరుకుంటున్నారు."

సావర్కార్ తాననుకుంటున్న స్వరాజ్‌కు హిందూరాజ్ అనే ముద్ర ఉండాలని అనుకోవటం వల్లే ఇలా అన్నారు.

ఇలాంటి స్వరాజ్ నిర్మాణానికి సావర్కార్ ప్రాధమికమైనవిగా రెండు ప్రతిపాదనల్ని చేశారు.

మొదటిది : 'హిందువులు తమకు తాముగా ఒక దేశం". ఈ ప్రతిపాదనను ఎంతో వివరంగా, ఒక ఉద్రిక్త స్వరంతో సావర్కార్ చేయడం చూడవచ్చు.

సావర్కార్ ఇలా అంటారు* : "నాగపూర్‌లో నా అధ్యక్షపన్యాసంలో నేను అనుకున్నది ఇలా వివరించాను. మొట్టమొదటిసారిగా ఇటీవలి రాజకీయాల్లో తేలింది ఒకటుంది. మొత్తం కాంగ్రెసు భావజాలం అంతా ఒక్క తెలివితక్కువ ఊహతో దుర్బలం అయిపోయింది.

ఆ ఊహ ఏమిటంటే ఒక సాధారణ నివాసస్థానం, ప్రాదేశిక ఐక్యత మాత్రమే ఒక దేశాన్ని తయారు చేసే అంశంగా భావించటం. ఇలాంటి ప్రాదేశిక జాతీయతా భావన యూరోపులోనే ఖంగు తింది. నిజానికి యూరోపు నుంచే ఈ భావన ఇండియాలోకి ప్రవేశించింది. నా వాదాన్ని నిజం చేస్తూ ఈ కల్పనను తునాతునకలు చేసింది ప్రస్తుతం జరుగుతున్న యుద్ధం. ఎలాంటి సామాన్యమైన సంబంధం లేకుండా కేవలం ప్రాదేశికమైన నిర్మితి మీద ఒక దేశంగా రూపొందించబడిన దేశాలన్నీ పేకమేడల్లా కూలిపోయాయి. నాశనమయ్యాయి. వివిధ ప్రజలను కలిపి ఒక దేశంగా తయారు చేయటం అంటే అటూ ఇటూ కూరుకుపోయే యిసుకలాంటి ప్రాదేశిక జాతీయత అనే భావనపై ఆధారపడి దేశాన్ని తయారు చేయడం - జాతి పరమైన, సాంస్కృతికమైన, చారిత్రకపరమైన దృఢమైన సంబంధాలేవీ లేని, తమను తాము ఒక దేశంగా మలచుకునేందుకు ఎలాంటి ఇచ్ఛలేని ప్రజలతో ఒక దేశాన్ని తయారు చేయటం - ఇలాంటి ప్రయత్నాలన్నిటికీ పోలండ్, చెకొస్లొవేకియా దేశాలు ఒక కఠిన హెచ్చరికలా నిలిచి వుంటాయి. ఈ ఒడంబడిక దేశాలు తమకు మొదటి అవకాశం కనిపించగానే విడిపోవటం జరిగింది. జర్మన్‌లకు చెందిన భాగం జర్మనీలో చేరింది. రష్యన్లకు చెందిన భాగం రష్యాలోకి, చెక్స్ భాగం చెక్స్‌కి, పోల్స్ భాగం పోలండ్‌లో చేరింది. సాంస్కృతిక పరమూ, భాషాపరమూ, చారిత్రకమూ అయిన సంబంధాలు భౌగోళికమైన ప్రాదేశికమైన పరిధుల్ని

* ఉపన్యాసాలు : 14-17

మించి బలమైనవిగా నిరూపితమయ్యాయి. అయితే కొన్ని దేశాలు యూరోపులో గత మూడు శతాబ్దాలుగా తమ ఐక్యతనూ, గుర్తింపునూ కాపాడుకుంటూ వచ్చాయి. అవి తమ ప్రాదేశిక ఐక్యతతోపాటు సాంస్కృతికమైన, జాతిపరమైన, భాషాపరమైన సంబంధాలనూ పటిష్టంగా ఉంచుకుంటూ వచ్చాయి. పైగా వాటికి సజాతీయ దేశ విభాగాలుగా ఉండాలనే పట్టు ఉంది. అంటే ఉదాహరణకు ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, పోర్చుగల్‌లాగా అని చెప్పవచ్చు.

"పైన చెప్పిన పరీక్షలన్నిటిలోనూ, లేదా ఏ ఒక్క అంశంపైనా విమర్శకు నిలబడి సమిష్టిగా ఏర్పడేదే ఒక సజాతీయ సమైక్య దేశం. ఇండియాలో హిందువులైన మనం ఒక దేశంగా నిబద్ధులై ఉన్నాం. మనకు స్వంతమైన అందరికీ చెందిన ఒక ప్రాదేశిక ఐక్యత, పితృభూమి మాత్రమే కాకుండా మనకందరికీ చెందిన పవిత్ర భూమి హిందూస్తాన్. ఇది మనకందరికీ చెందిన పితృభూమితో గుర్తింపబడింది.

భరతభూమి, ఈ హిందూస్థాన్- ఇండియా ఇరువిధాలా మన పితృభూమి, పుణ్యభూమి. మన దేశభక్తి ఆ రకంగా రెట్టింపు నిశ్చయమైంది. మనకు సామాన్యమైన కొన్ని సంబంధాలున్నాయి. లెక్కలేనన్ని శతాబ్దాలుగా మన మధ్యనున్న సాంస్కృతిక, మత, చారిత్రక, భాషాపర, జాతిపరమైన సంబంధాలద్వారా సమీకృతమైన ఒక సజాతీయ సమైక్యదేశం ఏర్పడింది. ఒక సమిష్టి జాతి జీవనాన్ని నడుపుకోవాలనే అభిలాషను వారిలో కల్గించింది. హిందువులది ఒడంబడిక దేశం కాదు, ఒక సమైక్య జాతీయ మూర్తి.

"ముఖ్యంగా మన కాంగ్రెస్ హిందూ సోదరులను తప్పుతోవపట్టించే అంశం ఒకటుంది. అయితే సజాతీయత అన్నది కొందరు ప్రజల్ని ఒక జాతీయ మూర్తిత్వ నిర్మాణానికి ప్రేరేపించేది అనే మాట నిజమే. కాని, ఇలాంటి జాతీయ మూర్తి మత్వంలో పూర్తిగా జాతి,మత, భాషాపరమైన ఇతర శాఖలూ అంతర్ భేదాలూ లేవని మాత్రం కాదు. అంటే ఒక దేశవిభాగంగా వారు ఇతర ప్రజలతో విభేదించినంత ఎక్కువగా తమలో తాము విభేదించరు అని అర్థం. ఏక కేంద్రక దేశాలయిన ఫ్రాన్సు, బ్రిటన్‌లు కూడా, జాతి, మత, భాషా సాంస్కృతిక భేదాలనుండి తప్పించుకోలేకపోయాయి. వాటి లోపలే ఎన్నో శాఖా భేదాలు, కొన్ని వివక్షతలూ ఉన్నాయి. కాబట్టి జాతీయమైన సజాతీయత ఒక ప్రత్యేక ప్రజల ఐక్యతను తెలిపే పదం. ఈ ఐక్యత ఎప్పుడూ ఇతర ప్రజలు - వారిలో ప్రదర్శితమయ్యే ఇదే విధమైన ఐక్యతలో సాపేక్షంగానే గుర్తించటానికి వీలవుతుంది."

"మనలో వెయ్యిన్నొక్క భేదాలుండనీ, అయినా మత, సాంస్కృతిక, చారిత్రక, జాతి, భాషాపరమైన సంబంధాలను కలిగి ఉండటంవల్ల కచ్చితంగా సజాతీయ ప్రజలుగా నిలబడి ఉన్నాం. ఈ హిందూ సజాతీయతను ముఖ్యంగా హిందేతర ప్రజలు - అంటే ఇంగ్లీషువారు, జపానీయులు, ఇండియన్ ముస్లిములు మొదలైన వారితో సాపేక్షంగా గుర్తించినపుడు మనకు

తెలిసివస్తుంది. ఆ కారణంవల్లే కాశ్మీరు నుంచి మద్రాసు; సింధ్ నుంచి అస్సాం వరకూ ఉన్న హిందువులు తమకు తాముగా ఒక దేశంగా............"

సావర్కార్ తన ప్రణాళికను నిర్మించటానికి ఆధారంగా గ్రహించిన రెండవ ప్రాతిపదిక – 'హిందూ' అనే పద నిర్వచనానికి సంబంధించింది. సావర్కార్ అభిప్రాయం ప్రకారం హిందూ అనే వ్యక్తి "సింధు నుంచి సముద్రాల వరకూ వ్యాపించిన నేలను తన పితృ భూమిగా, తన పరమ పవిత్ర భూమిగా, ఈ భరత భూమిని తన స్వంత ప్రదేశంగా పరిగణించేవాడు – అంటే తన మతానికి పుట్టినిల్లుగా, తన విశ్వాసానికి ఒడిగా ఈ ప్రదేశాన్ని పరిగణించేవాడు హిందువు.

వైదిక, సనాతన, జైన, బౌద్ధ, లింగాయత, సిక్కు మతభేదాలను అనుసరించేవారు, ఆర్య సమాజం, బ్రహ్మసమాజం, దేవ సమాజం, ప్రార్థనా సమాజం ఇంకా భారత దేశంలోనే పుట్టిన తదితర మతాలు అన్నీ హిందూత్వ కల్పనకు సహకరించిన అంశాలే. హిందూ అంశాలే. అంటే హిందూ ప్రజలనూ ఒక్కటిగా చేసే అంశాలే.

। ఆ సింధు సింధు పర్యంతా యస్య భారత భూమికా ।
। పితృ భూః పుణ్యభూ శ్చైవ సవై హిందురితి స్మృతితాః ॥

ఈ నిర్వచనం ప్రభుత్వం చేత గుర్తించబడాలి. రాబోయే ప్రభుత్వ గణాంకాల్లో హిందూ జనాభా లెక్కింపుకు ఈ హిందూత్వ పరీక్షను నిర్వహించాలి.

హిందూ అనే పదానికి నిర్వచనం చాలా జాగ్రత్తగా తయారు చేయటం జరిగింది. సావర్కార్ అభిప్రాయంలో ఈ నిర్వచనం రెండు ప్రయోజనాలను నెరవేర్చే విధంగా తయారయ్యింది. మొదటిది : ముస్లిములు, క్రైస్తవులు, పార్శీలు, యూదులు మొదలైన వారిని మినహాయించటం, ఇండియాను ఒక పవిత్ర భూమిగా పరిగణించటమే హిందువుకావటానికి అర్హతగా సూత్రీకరించటం వల్ల యిది సాధ్యమయింది.

రెండవది : హిందువు కావటానికి అర్హతల్లో తేడాలపట్ల విశ్వాసం ఒకటి. ఈ అంశాన్ని మరీ ఒత్తిడి చేయక పోవటం ద్వారా బౌద్ధులను, జైనులను,శిక్కులను చేర్చుకోవటం.

ఇదీ సావర్కార్, వారి హిందూ మహాసభ నిర్మించిన ప్రణాళిక. ఈ ప్రణాళికలో కలవరపరిచే లక్షణాలు కొన్ని ఉన్న సంగతి ఇప్పటికే మనదృష్టికి వచ్చి ఉంటుంది.

మొదటిది : హిందువులు తమకు తామే ఒక దేశమని స్పష్టంగా నొక్కి చెప్పటం, ఇది ముస్లిములు వారికి వారు ఒక ప్రత్యేక దేశమనే అర్థం రావటానికి దారితీస్తుంది. అది అతని దృక్పథం. సావర్కార్ ఊహలకేమాత్రం ఆస్కారం యివ్వలేదు. దీనినే ఆయన ఎలాంటి సందిగ్ధ పదజాలం ఉపయోగించకుండా తన శక్తి మేరకు నిరపేక్షంగా ఉద్ఘాటించారు. 1937లో అహ్మదాబాదులో జరిగిన హిందూ మహాసభల సమావేశంలో మాట్లాడుతూ సావర్కార్ ఇలా అన్నారు :–

"ఇండియా ఎప్పుడో ఒక సమరస దేశంగా తయారయిపోయింది. లేదా అలా ఉండాలనే కేవల ఆకాంక్ష చాలు. ఇండియా ఒక సమరస దేశంగా తయారవట్టానికి – ఇలాంటి ఊహలతో ముక్కుపచ్చలారని చాలా మంది రాజకీయనాయకులు ఘోరమైన పొరబాట్లు చేస్తుంటారు. వీటిని మన సన్నిహిత మిత్రులే అయినా ఆలోచనారహితులైన మిత్రులు అలాగే తీసుకుని తమ కలల్నే నిజాలుగా భ్రమిస్తారు. అందుకనే వారు మత కలహాలపట్ల చాలా అసహనాన్ని ప్రదర్శిస్తారు. ఆ కలహాలకు మూలకారణం మత సంస్థలని అంటారు. అయితే అసలు వాస్తవం ఒకటుంది. ఈ మతపరమైన ప్రశ్నలన్నీ కూడా అనూచానంగా వస్తున్నవే. శతాబ్దాలుగా హిందువులకు ముస్లిములకు మధ్య సాంస్కృతిక, మత, జాతీయ, స్వర్థలమూలంగా వారసత్వంగా మనకు అంది వస్తూన్నవే అన్నదే ఆ వాస్తవం. సమయం వచ్చినపుడు వాటిని నువ్వు పరిష్కరించగలుగుతావు. అయితే వాటిని గుర్తించకుండా ఉండటం ద్వారా అణచివేయటం సాధ్యం కాదు. చాలా ముదిరిపోయిన ఈ రోగాన్ని బాగా పరిశీలించి వైద్యం చేయాలి కానీ, పట్టించుకోకుండా వదిలి వేయకూడదు. మనకే మాత్రం సంతోషం కలిగించని కఠిన వాస్తవాలను అలాగే ధైర్యంగా ఎదుర్కొందాం. ఇవాళ ఇండియాను ఏక కేంద్రకమైన, సజాతీయమైన దేశంగా పరిగణించలేము. తద్విరుద్ధంగా ప్రధానంగా యిది రెండుదేశాలుగా అంటే ఇడియాలోని హిందువుల, ముస్లిముల దేశాలుగా కన్పిస్తోంది".

ఒక దేశంగా రెండు దేశాలు అనే సమస్య మీద పరస్పరం విరుద్ధంగా ఉండాల్సిన సావర్కార్, జిన్నా ఇద్దరూ ఆ విషయంలో ఒక పూర్తి అంగీకారానికి రావటం అన్నది కొత్తగానే, వింతగానే కనిపిస్తుంది. ఇద్దరూ అంగీకరించటమే కాదు ఇండియాలో రెండు దేశాలున్నాయన్న విషయాన్ని నొక్కి చెబుతారు. అంటే ఒకటి హిందూ దేశం. రెండవది ముస్లిం దేశం. రెండు దేశాలూ ఏఏ షరతులపై ఏర్పడి ఉండాలో అన్న విషయంలోనే వారు విభేదిస్తారు. జిన్నా ఏమంటారంటే ఇండియాను రెండుగా అంటే పాకిస్తాన్‌గా, హిందూస్తాన్‌గా ముక్కలు చేయాలని, ముస్లిం దేశం పాకిస్తాన్‌ను, హిందూ దేశం హిందూస్తాన్‌ను ఆక్రమించాలని అంటారు. సావర్కార్ మరోపక్క ఏమంటారంటే – ఇండియాలో రెండు దేశాలున్నా కూడా అది రెండు ముక్కలుగా ఉండకూడదు. ఒకటి ముస్లిముల భాగంగా మరొకటి హిందువుల భాగంగా విభజించబడకూడదు. ఈ రెండు దేశాలూ ఒకే దేశం కింద అంటే ఒకే రాజ్యాంగం గొడుగు కింద జీవించాలి. హిందూదేశం తనకి రావాల్సిన ప్రధానమైన స్థానాన్ని ఆక్రమించేటట్లు రాజ్యాంగం ఉండాలి. అట్లే హిందూదేశంతో ముస్లిం దేశం ఒక కిందిస్థాయి సహకార స్థానాన్ని కలిగి గడపాలి. ఈ రెండు దేశాల మధ్య రాజకీయ అధికారం కోసం జరిగే పందెంలో నిబంధన ఒకటే ఉండాలి. హిందూ అయినా, ముస్లిం అయినా ఒక మనిషి ఒక ఓటు అన్నదే ఆ నిబంధనగా ఉండాలి అని సావర్కార్ సూత్రీకరిస్తారు. ఆయన ప్రణాళికలో హిందువు కాలేని అవకాశం ముస్లింలకూ ఉండదు. మైనారిటీ అన్నంత మాత్రాన ప్రత్యేక హక్కులు కలిగి ఉండాలనే న్యాయం కానీ, మెజారిటీ అయినంత మాత్రాన శాస్తి జరిగేందుకు ఆస్కారం కానీ ఉండకూడదని సావర్కార్

అంటారు. ముస్లిం మతం, ముస్లిం సంస్కృతి రూపంలో ఎలాంటి రాజకీయాధికార సంబంధమైనా, చర్యకైనా రాజ్యమే పూచీకత్తు నిస్తుంది. అయితే రాజ్యం (లేదా ప్రభుత్వం) పాలనాభాగంలో కానీ, శాసనసభలో గానీ సీట్ల కోసం ఎలాంటి పూచీనీ ఇవ్వదు.*

ముస్లిములు అలాంటి అభయం కావాలని ఒత్తిడి చేస్తే అలా ఇచ్చిన కోటా సాధారణ జనాభాలో వారి నిష్పత్తికన్నా ఎక్కువ ఉండదు. ఈ విధంగా ముస్లిం దేశం ప్రాబల్యాన్ని సావర్కార్ హరించి వేయటమే కాకుండా అది ఇంతవరకూ సాధించుకున్న రాజకీయ ప్రత్యేక హక్కులనూ తీసి వేస్తారు.

సావర్కార్ సూచించిన పాకిస్తాన్‌కు ప్రత్యామ్నాయంలో ఒక విశేషం ఉంది. అది దాని ప్రతిపాదనలోనే ఉంది. ధైర్యం, నిశ్చయాత్మకత, నిర్మొహమాటం ఆ ప్రతిపాదనలో ఉంది. మైనారిటీ హక్కుల గురించి కాంగ్రెసు చేసే ప్రకటనల్లో క్రమంలేని, శుష్కమైన అవిశ్చితమైన గుణం సావర్కార్ ప్రతిపాదనలో కన్పించదు. అది ప్రధానమైన తేడాగా గుర్తించవచ్చు. సావర్కార్ ప్రణాళికలో కనీసం ముస్లిములు ఎంతవరకు వెళ్లాలో, ఎక్కడి నుంచి ఇక వెళ్ళలేరో స్పష్టంగా చెప్పటం ఉంది. హిందూ మహాసభకు సంబంధించినంతవరకూ ముస్లిములకు తమ స్థానమెక్కడో తెలుసు. అయితే మరోపక్క కాంగ్రెసుకు సంబంధించినంత మేరకు తామెక్కడున్నారో తెలియని పరిస్థితి వారిది. ఎందుకంటే కాంగ్రెసు వాళ్లు ముస్లిములనూ వారికి చెందిన మైనారిటీ సమస్యనూ వంచనా ధోరణితో కాకున్నా ఒక దౌత్య క్రీడగా చూస్తున్నారు.

సావర్కార్ ధోరణి వింతది కాకపోతే తర్కబద్ధమైంది కాదనే చెప్పకతప్పదు. సావర్కార్ ముస్లిం దేశం ప్రత్యేకమైంది అని అంగీకరిస్తారు. వారికి సాంస్కృతిక స్వేచ్ఛ, హక్కు ఉందనీ సమ్మతిస్తారు. వారికి సంబంధించిన దేశ పతాకాన్నీ ఉండనిస్తారు. అయినా ముస్లిం దేశం ఒక ప్రత్యేక జాతీయ స్వదేశంగా ఉండటాన్ని వ్యతిరేకిస్తారు. హిందూ దేశానికి ఒక జాతీయమైన స్వదేశాన్ని ఆయన అభిలషించేటప్పుడు ముస్లిములు తమకు ప్రత్యేక జాతీయ స్వదేశాన్ని కోరుకోవటాన్ని ఎలా వ్యతిరేకిస్తారు.

సావర్కార్ వాదనల్లో అసంబద్ధత ఉండటం మాత్రమే తప్పు అయితే పెద్దగా పట్టించుకోనక్కర్లేదేమో! అయితే సావర్కార్ తన ప్రణాళికను ప్రవేశపెట్టడం ద్వారా నిజంగానే ఇండియా భద్రతకు సంక్షేమానికి దారుణమైన ప్రమాదాన్ని తెచ్చి పెడుతున్నారు. ఒక మెజారిటీ దేశం తన దేశంలోనే పౌరులుగా ఉన్న, తన రాజ్యాంగం కిందకే వచ్చే మైనారిటీ దేశంలో సంబంధాలను రెండు విధాలుగా కలిగి ఉండడం సాధ్యమని చరిత్ర చెబుతోంది.

---

* ముస్లిములకు ప్రత్యేక నియోజక వర్గాలుండాలనే విషయాన్ని సావర్కార్ వ్యతిరేకించలేదని గమనించాలి. ముస్లిములు మెజారిటీ ఉన్న చోట్ల కూడా ప్రత్యేక నియోజక వర్గాలు వారికి ఉండాలని సావర్కార్ అభిప్రాయపడుతున్నాడో లేదో స్పష్టంగా తెలియదు.

ఒక పద్ధతి ఏమిటంటే ఆ మైనారిటీ దేశం జాతీయతను ధ్వంసం చేసి మెజారిటీ దేశంలోకి కలిపేయటం. అలా రెండు దేశాల నుంచి ఒకే దేశాన్ని ఏర్పరచటం చేయవచ్చు. మైనారిటీలకు భాషాపరమైన, మతపరమైన, సాంస్కృతికమైన ఎలాంటి హక్కుల్నీ, సంస్కృతినీ, భాషనూ మైనారిటీలపై బలవంతంగా రుద్దటం ద్వారా ఈ పని చేయవచ్చు. మరో మార్గం ఏమంటే దేశాన్ని రెండుగా విభజించి, మైనారిటీలకు ఒక ప్రత్యేక స్వయంపాలిత, సర్వసత్తాక అస్తిత్వాన్ని మెజారిటీ దేశం నుంచి స్వతంత్రను కల్పించటం. ఈ రెండు మార్గాలనూ టర్కీలో, ఆస్ట్రియాలో అనుసరించి చూశారు. ఒకటి విఫలం కాగానే మరొక మార్గాన్ని అనుసరించారు.

సావర్కార్ ఈ రెండు మార్గాలనూ అనుసరించరు. దేశంలో ముస్లిములను అణచాలనీ ఆయన ప్రతిపాదించారు. తద్విరుద్ధంగా ఒక దేశం ఆత్మకు రూపాన్ని నిలిపే మతపర, భాషాపరమైన, సాంస్కృతికమైన అంశాలను పెంచి పోషించడం ద్వారా ఈ మైనారిటీ దేశం వాటిని అలాగే నిలబెట్టుకొనేట్లు చూస్తున్నారు. కాని, అదే సమయంలో దేశాన్ని రెండుగా విభజించి, అవి వాటి వాటి ప్రాంతాల్లో సర్వసత్తాక స్వయంపాలక, ప్రత్యేక రాజ్యాలుగా ఏర్పడటాన్ని కూడా ఆయన అంగీకరించారు. ఒకే రాజ్యంలో రెండు దేశాలుగా వారి వారి మతాన్నీ, భాషనూ, సంస్కృతినీ వారు కొనసాగించుకుంటూ హిందువులు ముస్లిములు జీవించాలని సావర్కార్ అభిప్రాయం. మైనర్ దేశాన్ని అణచివేస్తూ రావాలన్న వాదనలో దాగిన తెలివిని అర్థం చేసుకున్నప్పుడు అభినందించక తప్పదు. ఎందుకంటే తొలిలక్ష్యం ఏమంటే చివరికి ఆ రెండింటినీ ఒక దేశంగా మార్చటమే. అయితే రెండు దేశాలు ఉండాలి కాని, అవి విడిగా ఉండకూడదు అనే వాదనలో ప్రయోజనం ఏమిటో అర్థం కాదు. పరస్పర గౌరవంతో, ఒడంబడికలతో కలిసి మెలిసి భాగస్వాముల్లాగా, స్నేహితుల్లాగా ఈ రెండు దేశాలు కలిసి ఉండే మాటైతే ఈ ధోరణిని ఎవరైనా సరే సమర్థించవచ్చు. అయితే అలా జరుగదు మరి. ఎందుకంటే సావర్కార్ హిందూదేశంతో సమానంగా ముస్లిము దేశం ఆధిక్యతలో కాకుండా ముస్లిం దేశం బానిసత్వంలోనూ ఉండాలంటారు. హిందూదేశం ముస్లిం దేశం మధ్య శత్రుత్వ బీజాలను నాటిం తర్వాత సావర్కార్ అవి ఒకే రాజ్యంలో ఒకే రాజ్యాంగం కింద ఉండాలని ఎందుకు వాదిస్తున్నారో వివరించటం చాలా కష్టం.

అయినా ఒక కొత్త విధానాన్ని కనుక్కున్న ఘనతను సావర్కార్‌కు ఇవ్వలేము. తన విధానమే సరైన విధానమని అతను నమ్మాలి మరి. దీనిని అర్థం చేసుకోవటం చాలా కష్టం. సావర్కార్ తన స్వరాజ్య ప్రణాళికకు నమూనాగా ప్రాచీన ఆస్ట్రియాను, ప్రాచీన టర్కీని తీసుకున్నారు. ఆస్ట్రియాలో, టర్కీలో ఒక మేజర్ దేశం తనకు చేరువలో కొన్ని మైనర్ దేశాలను కలిగి ఉండటం, అవన్నీ ఒకే రాజ్యాంగం కింద ఉండటం, మైనర్ దేశాలన్నిటిపైనా మేజర్ దేశం ఆధిపత్యాన్ని చలాయించ గలగడం – ఇవన్నీ సావర్కార్ గమనించారు. అందుకే

ఆస్ట్రియాలో, టర్కీలో వీలు కాగా లేనిది ఇక్కడ ఇండియాలో హిందువుల కెందుకు వీలు పడదు అని సావర్కార్ ప్రశ్నించారు.

ప్రాచీన ఆస్ట్రియా, ప్రాచీన టర్కీలను నమూనాలుగా తీసుకోవటం, సావర్కార్ వాటిపై తన నిర్మాణాన్ని సాగించాలనుకోవటం నిజంగానే విడ్డూరమనిపిస్తుంది. ప్రాచీన ఆస్ట్రియా,ప్రాచీన టర్కీ ఇక లేవన్న వాస్తవాన్ని సావర్కార్ గుర్తించినట్లు లేరు. ప్రాచీన ఆస్ట్రియా, ప్రాచీన టర్కీని ముక్కల కిందికి పేల్చివేసిన శక్తుల గురించి సావర్కార్‌కు చాలా తక్కువ తెలిసినట్లుంది. సావర్కార్ తనకు చాలా ఇష్టమైన ప్రాచీన చరిత్రకు బదులు, వర్తమానాన్ని అధ్యయనం చేసి ఉంటే ఆయన ప్రతిపాదించిన ప్రణాళిక లాంటి దాన్ని అమలు చేయాలని ప్రయత్నించడం వల్లనే ప్రాచీన ఆస్ట్రియా, ప్రాచీన టర్కీ నాశనం అయ్యాయని తెలిసికొని ఉండేవారు. ఆయన ప్రతిపాదించిన ప్రణాళిక అంటే 'హిందూ రాజ్యం' అనుసరించాలని ఆయన చెప్పిన ప్రణాళికలో స్వరాజ్ ఉంటుంది.

ఒకే రాజ్యాంగ పరిధి కింద అందులో రెండు దేశాలు ఇమిడి ఉంటాయి. అందులో మేజర్ దేశం తన కింద మైనర్ దేశాన్ని ఆధిపత్యంలో ఉంచుకోవటానికి ఈ ప్రణాళిక వీలు కల్పిస్తుంది. ఇలాంటి ప్రణాళికనే అనుసరించి ఆ ప్రాచీన టర్కీ, ప్రాచీన ఆస్ట్రియా నాశనం అయ్యాయి.

ఆస్ట్రియా, చెకొస్లొవేకియా, టర్కీల విధ్వంసన చరిత్ర ఇండియాకు, హిందూ మహాసభ సభ్యులకు చాలా ముఖ్యమైంది. వారు చక్కగా దీనినే అనుసరించవచ్చు. ఇక్కడ నేను దాని గురించి ఏమి చెప్పదలచలేదు. ఎందుకంటే మరో అధ్యాయంలో వాటి దురదృష్టకర చరిత్ర నుండి మనం నేర్చుకోగలిగిన పాఠాలను నేను విశదీకరిస్తున్నాను. సావర్కార్ తయారు చేసిన 'స్వరాజ్' ప్రణాళిక ముస్లింలపై సామ్రాజ్యాధిపత్యాన్ని హిందువులకు కల్పిస్తుంది. ఆ రకంగా హిందువులలో వున్న రాజవంశీయులకున్న అహంకార గర్వాలను తృప్తి పరుస్తుంది అని చెపితే సరిపోతుందనుకుంటాను. అయితే హిందువులకు ఒక శాంతియుతమైన స్థిరమైన భవిష్యత్తును ఇది ఇవ్వజాలదు. ఎందుకంటే ఇలాంటి ఘోర ప్రత్యామ్నాయానికి ముస్లిములు అణిగిమణిగి అంగీకరించరు.

**అను : డా॥ కె.యెస్. రమణ**

## III

సావర్కార్ తాను ప్రతిపాదించిన ప్రణాళిక పట్ల ముస్లిముల ప్రతిస్పందనల్ని ఏ మాత్రం పట్టించుకోలేదు. ఆయన తన ప్రణాళికను రూపొందించి, ముస్లిముల ముఖం మీద కొట్టి "అంగీకరిస్తే అంగీకరించండి, లేకపోతే పొండి" అని వదిలేశారు. స్వరాజ్య పోరాటంలో ముస్లిములు పాల్గొనటానికి అంగీకరించకపోవడం ఆయనకు చీమ కుట్టినట్టయినా లేదు.

హిందువులకు, హిందూ మహాసభకి ఉన్న శక్తి సామర్థ్యాల మీద ఆయనకు దృఢ విశ్వాసం ఉంది. ఎవర్ల సహాయ సహకారాలు లేకుండానే ఒంటి చేత్తో హిందువులు బ్రిటీష్ వాళ్ళ నుంచి స్వాతంత్ర్యాన్ని గుంజుకోగలరనే ఆయన నమ్మకం. ఆ నమ్మకంతోనే పోరాటాన్ని కొనసాగించాలని ప్రతిపాదించాడు. సావర్కర్ ఈ విషయం ముస్లిములకు చెప్పడానికే ఆయత్తమయ్యాడు.

"మీరు వస్తే మీతో కలిసి, మీరు రాకపోతే మీరు లేకుండానే, మీరు వ్యతిరేకిస్తే, మీరు లేకుండానే హిందువులు తమ జాతీయ స్వాతంత్ర్యం కోసం తాము ఎంత బాగా పోరాడగలుగుతారో అంత బాగా పోరాడుతారు".

గాంధీ అట్లా కాదు. ఇండియాలో రాజకీయ నాయకుడిగా తన ప్రజా జీవితాన్ని ప్రారంభించగానే స్వరాజ్యం ఆరునెలల్లోపే సంపాదించి పెడతానని భారతీయుల్ని ఉలికిపాటు పడేట్లు చేశారు. కొన్ని పరిస్థితులు అనుకూలిస్తే అద్భుతాన్ని చేయగలనని గాంధీ అన్నాడు. వీటిలో ఒకటి – హిందూ ముస్లిం ఏకతా సాధన. హిందూ ముస్లిం ఐక్యం లేకుండా స్వరాజ్యం రావడం కష్టమని, గాంధీ విసుగూ, విరామం లేకుండా చెబుతూ వచ్చాడు. గాంధీ ఈ నినాదాన్ని ఇవ్వడమనేది భారత రాజకీయాల్లో భాగంగా ఇవ్వడమే కాదు హిందూ ముస్లిముల ఐక్యం కోసం పూర్తి పట్టుదలతో కృషి చేశాడు. 1919 మార్చి 2న రౌలత్ చట్టానికి వ్యతిరేకంగా సత్యాగ్రహాన్ని చేపట్టటంతో గాంధీ భారత రాజకీయాల్లో ప్రవేశించాడు. సత్యాగ్రహంలో పాల్గొనేవారు తనతో పాటుగా సత్యాగ్రహ ప్రతిజ్ఞపై సంతకం చేయాలని కోరారు. సత్యాగ్రహ ప్రచారం కొద్దికాలం మాత్రమే సాగింది. 1918 ఏప్రిల్ 18న సత్యాగ్రహ ప్రచారాన్ని గాంధీ నిలిపి వేశాడు. నిర్దేశించిన సత్యాగ్రహ కార్యక్రమంలో భాగంగా (1919 మార్చి 23 తేది ప్రణాళికను చూడండి) 1919 మార్చి ఆరు నుండి* భారతదేశ మంతటా రౌలత్ చట్టానికి వ్యతిరేకంగా ప్రదర్శనలు నిర్వహించాలని గాంధీ తలపెట్టాడు. ఆరోజు వేలాదిమందితో బహిరంగ సమావేశాలు నిర్వహించాలనీ, సమావేశానికి హాజరైన వాళ్లందరూ కింద పేర్కొన్నట్టు ప్రతిజ్ఞ చేయాలని గాంధీ పిలుపు నిచ్చాడు.

"దైవసాక్షిగా హిందువులు, మహమ్మదీయులు ఒకే తల్లిదండ్రుల పిల్లల్లాగా కలిసి మెలిసి ప్రవర్తిస్తాం మా మధ్య ఏ విధమైన భేదాలు లేవు. ఒకరి బాధల్ని మరొకరం పంచుకొంటూ వాటి నివారణకు ఒకరికొకరం సహాయం చేసుకోవడమే కాక కలిసికట్టుగా కృషి చేస్తాం. మేము మా మతాన్ని మత పద్ధతులనూ గౌరవిస్తూ ఒకరి మత స్వేచ్ఛకి మరొకరం ఆటంకం కలిగించకుండా చూసుకొంటాం. మేము మతం పేరుతో హింసాకాండకు పాల్పడం."

హిందువులు, ముస్లిములు ఘర్షణకి దిగేట్టు చేసే అంశాలేవీ రౌలత్ చట్ట వ్యతిరేక సత్యాగ్రహోద్యమంలో లేవు. అయినా గాంధీ తన అనుచరులను ప్రతిజ్ఞ చేయాలని కోరాడు. దీనివల్ల గాంధీ మొదటి నుంచీ హిందూ–ముస్లిం ఐక్యానికి పట్టుదలతో ఎంత కృషి చేశాడో

* 1919 మార్చి 23వ తేదీతో ఉన్న ఆయన 'మానిఫెస్టో' చూడండి.

మనకు తెలుస్తుంది.

1919లో మహమ్మదీయులు ఖిలాఫత్ ఉద్యమాన్ని మొదలుపెట్టారు. ఈ ఉద్యమ ఆశయాలు రెండు : 1) ఖిలాఫత్‌ను యధాతథంగా కొనసాగించడం, 2) టర్కిష్ సామ్రాజ్య సమగ్రతను పరిరక్షించడం. ఈ రెండు ఆశయాలు సమర్థించతగ్గవి కావు. ఖిలాఫత్‌ను పరిరక్షించలేము. కారణం - సుల్తానును తిరస్కరిస్తూ, టర్కీల ప్రయోజనాల కోసం ఉద్దేశించింది ఈ ఆందోళన కాబట్టి. టర్కీ ప్రజలు టర్కీని రాజరిక రాజ్యంగాకాక, గణతంత్ర రాజ్యంగా మార్చాలని కోరుతున్నారు. అట్లా గణతంత్ర రాజ్యంగా మార్చడాన్ని ప్రజలు కోరుతున్నప్పుడు రాజరికంగా కొనసాగనివ్వడం ఏ మాత్రం ధర్మం కాదు. టర్కీ సామ్రాజ్య సమగ్రత మీద పట్టుబట్టడం సబబు కాదు. ఎందుకంటే అనేక జాతుల్ని టర్కీ పాలనలో శాశ్వతంగా అణచి ఉంచడం ఇందులో ఉంది, ముఖ్యంగా అరబ్బుల స్వాతంత్ర్యాన్ని, శాంతియుత పరిష్కారానికి పునాది శాంతియుత సిద్ధాంతం ఉండాలని సర్వత్రా అంగీకరించినపుడు అలాగే జరగాలి.

ఈ ఉద్యమాన్ని మహమ్మదీయులు ప్రారంభించారు. దాన్ని గాంధీ ఎంత పట్టుతో, విశ్వాసంతో అంది పుచ్చుకున్నాడంటే చాలామంది మహమ్మదీయులకే ఆశ్చర్యం కలిగింది. చాలామంది ఈ ఉద్యమం తాలూకు నైతిక విలువల్ని శంకించారు. నైతిక సూత్రాలు ఇంత సంశయాత్మకంగా ఉన్న ఖిలాఫత్ ఉద్యమంలో గాంధీ పాల్గొకూడదని వెనక్కిలాగ చూశారు. కాని, గాంధీ ఖిలాఫత్ ఉద్యమం సమంజసమని ఎంత త్రికరణశుద్ధిగా నమ్మాడంటే వాళ్ల హితబోధనని ససేమీరా పట్టించుకోలేదు. ఉద్యమం న్యాయబద్ధమైనదేనని దానికి మద్దతునివ్వడం తన విధి అనీ గాంధీ చాటాడు. ఆయన వైఖరిని ఆయన మాటల్లోనే క్రోడీకరించవచ్చు.*

"నా దృష్టిలో టర్కీల అభ్యర్థన అనైతికమూ, అధర్మమూ కాకపోడమే కాదు. న్యాయబద్ధమైందికూడా. ఎందుకంటే టర్కీ ఏదైతే తన సొంతమో దాన్నే నిలుపుకోవాలంటుంది. మహమ్మదీయుల ప్రణాళిక నసుగుడు లేకుండా చాటుతుంది. ముస్లిమేతరులకు, తురుష్కేతరులకు కావాల్సిన రక్షణలన్నీ ఉంటాయి. టర్కీ సార్వభౌమత్వం కింద క్రైస్తవులకు, అరబ్బులకు వాళ్ల వాళ్ల స్వయం ప్రతిపత్తిని ఇవ్వాలి. 2) టర్కు బలహీనుడూ, అసమర్థుడూ, క్రూరుడూ అని నేను అనుకోవటం లేదు. అతనికి ఒక క్రమపద్ధతి లేకపోవచ్చు, సరైన నేతృత్వం లేకపోవచ్చు. ఒక బలహీనుడూ, అసమర్థుడూ, క్రూరుడూ అని పదే పదే పాడేపాట ఎవరి నుండి అధికారాన్ని తొలగించాలనుకుంటున్నారో వాళ్ల నుంచే వింటున్నాం. ఆరోపిత క్రూరహత్యలపై విచారణకి తగిన కమీషన్‌ను నియమించమని అడిగారు. కాని నియమించలేదు. ఏమైనా పీడనకి వ్యతిరేకంగా తగిన రక్షణ కల్పించుకోవచ్చు. 3) నేను ఎప్పుడో చెప్పాను, నాకు కనుక ఇండియన్ మహ్మదీయుల పట్ల ఆసక్తి లేకపోతే, నేను టర్కీల యోగక్షేమాల గురించి ఆసక్తి

*"యంగ్ ఇండియా" 1920 జూన్ 2

చూపించను. ఆస్ట్రియన్ల పోలీస్‌వాళ్ల యోగక్షేమాలు ఎంతో ఇదీ అంతేనని ఊరుకుంటాను. నేను ఇండియన్‌గా తోటి భారతీయుల కష్టసుఖాలు పంచుకోవడం నా విధి. మహమ్మదీయుడు నా సోదరుడు; అతనికి కష్టకాలంలో సాయపడ్డం నా కర్తవ్యం. 4) హిందువులు, మహ్మదీయులతో ఎంతమేరకి చేతులు కలపాలో దానికి సంబంధించిన విషయం. అది అనుభూతులకి, అభిప్రాయాలకి సంబంధించింది. నా మహమ్మదీయ సోదరుల కోసం ధర్మబద్ధ లక్ష్యం కాంక్షిస్తూ నేను కూడా బాధపడ్డం మంచిది, వారితో పయనించడం, వారితో పాటు యావత్పథం, వాళ్ల లక్ష్యాలతో తూగే సాధనాలున్నంత కాలం, వెళ్లడం మంచిది. నేను మహ్మదీయుల భావనలను క్రమబద్ధం చేయలేను. ఖిలాఫత్ అనేది మత సమస్యే. ఆ ఉద్యమానికి కట్టుబడి దాన్ని సాధించడానికి తన జీవితాన్ని కూడా పణంగా పెడతాడతను.

గాంధీ ముస్లిములతో ఖిలాఫత్ ఉద్యమం గురించి ఏకాభిప్రాయంతో ఉండడమే కాదు, వాళ్ల నేతగా, సలహాదారుడుగా పనిచేశాడు. ఖిలాఫత్ ఉద్యమంలో గాంధీ వ్యవహరించిన తీరు, ఖిలాఫత్ ఉద్యమానికి, సహాయ నిరాకరణోద్యమానికి ఉన్న సంబంధం మసక కమ్ముకుపోయింది. ఎందుకంటే కాంగ్రెసే సహాయ నిరాకరణోద్యమం మొదలు పెట్టిందని, స్వరాజ్య సాధనకి అది మార్గమని చాలామంది ప్రజలు నమ్మారు. అట్లాంటి అభిప్రాయం కలగడాన్ని అర్థం చేసుకోవచ్చును. ఎలా అంటే కలకత్తాలో 1920 సెప్టెంబర్ 7,8 తేదీల్లో జరిగిన ప్రత్యేక కాంగ్రెస్ సమావేశం, సహాయ నిరాకరణోద్యమంల మధ్య సంబంధం ఉందనుకున్నారు. కాని 1920 సెప్టెంబరుకు ఇంకా ముందుకు వెళ్లి ఆ పరిస్థితుల్ని పరిశీలించినట్లయితే, ఈ రెండింటి మధ్య అసలు పొత్తు లేదని స్పష్టమౌతుంది. ఇందులో నిజం ఏమిటంటే, సహాయ నిరాకరణోద్యమం ఖిలాఫత్ ఉద్యమంలో నుండి పుట్టుకొచ్చింది కాంగ్రెస్ ఉద్యమమైన స్వరాజ్ నుండి కాదు. ఆ ఉద్యమం ఖిలాఫత్ ఉద్యమకారులు టర్కీకి సహకరించాలని మొదలు పెట్టినటువంటిది. ఖిలాఫత్ ఉద్యమకారులకు సహకరించడానికి కాంగ్రెస్ దాన్ని అందుకుంది. స్వరాజ్ సాధన కాదు ముఖ్యం, ఖిలాఫత్, స్వరాజ్ రెండోది. హిందువులు ఆ ఉద్యమంలో చేరడానికి సానుకూలంగా ఉంటుందని అలా చేశారు. ఈ కింది వాటినిబట్టి దాన్ని అర్థం చేసుకోవచ్చు.

1919 అక్టోబర్ 27 తేదీన ఖిలాఫత్ ఉద్యమం మొదలయ్యిందని చెప్పవచ్చు. ఆరోజుని మొత్తం దేశం అంతా జరుపుకున్నారు. 1919 నవంబర్ 23 తేదీన మొదటి ఖిలాఫత్ సమావేశం ఢిల్లీలో జరిగింది. ఈ సమావేశంలోనే ముస్లిములు సహాయ నిరాకరణోద్యమ అవకాశాన్ని బ్రిటీషు వాళ్లు ఖిలాఫత్ తప్పు సరిదిద్దుకునేందుకు మార్గంగా పరిశీలించారు. 1919 మార్చి 10వ తేదీన కలకత్తాలో ఖిలాఫత్ సమావేశమై సహాయ నిరాకరణోద్యమమే తమ ఆందోళనని ముందుకు తీసుకుపోయే సాటిలేని ఆయుధం అని భావించారు.

1920 జూన్ 9వ తేదీన అలహాబాద్ ఖిలాఫత్ సమావేశం జరిగింది. సహాయ

నిరాకరణోద్యమానికి దిగాలని అది ఏకగ్రీవంగా తీర్మానించింది. తమ కార్యక్రమ వివరాలు తయారు చేయడానికి కార్య నిర్వహణ కమిటీని ఏర్పాటు చేసింది. టర్కీ ప్రజల బాధలను 1920 ఆగస్టు 1 నాటికి తీర్చకపోయినట్లయితే తాము సహాయ నిరాకరణోద్యమాన్ని చేపడతామని వైస్రాయ్‌కి 1920 జూన్ 22వ తేదీన ముస్లిములు సమాచారం పంపారు. 1920 జూన్ 30న అలహాబాదులో జరిగిన ఖిలాఫత్ కమిటీ సమావేశమైంది. వైస్రాయ్‌కు ఒక నెల వ్యవధి ఇచ్చి చూడ్డం జరిగింది. ఇక సహాయ నిరాకరణోద్యమం మొదలు పెడదామని తీర్మానించింది. 1920 జూలై 1 తేదీన నోటీసు ఇవ్వడం జరిగింది. 1920 ఆగస్టు 1న సహాయ నిరాకరణోద్యమం మొదలైంది. సంగ్రహ పరిశీలననుబట్టి సహాయ నిరాకరణోద్యమాన్ని ఖిలాఫత్ కమిటీ మొదలు పెట్టిందని తెలుస్తుంది. కలకత్తాలో జరిగిన ప్రత్యేక కాంగ్రెస్ సమావేశం కూడా, ఖిలాఫత్ కమిటీ ఏ నిర్ణయాలనైతే చేసిందో వాటికి ముద్ర వెయ్యడానికే జరిగింది. స్వరాజ్ సాధించాలనే ఆసక్తితో కాక ముస్లిములకు మద్దతునిస్తూ ఖిలాఫత్‌కి సాయ పడేందుకు అది జరిగింది. కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ ప్రత్యేక సమావేశంలో కాంగ్రెస్ చేసిన తీర్మానాలను* చదివినట్లయితే ఇది మనకు స్పష్టంగా తెలుస్తుంది.

సహాయ నిరాకరణోద్యమాన్ని ఖిలాఫత్ కమిటీ ప్రారంభించినా కాంగ్రెస్ సమావేశంలో ఖిలాఫత్ లక్ష్యాలకి వత్తాసుగా దాన్ని ప్రతిపాదించి తీర్మానించడానికి ఈ ఖిలాఫత్ కమిటీకి సలహాలనిచ్చి ఆ కమిటీతో మమేకం అయి దాని బాధ్యత వహించినవాడు గాంధీయే.

---

* ఖిలాఫత్ సమస్య విషయంలో ఇద్దరు భారతీయులు, ఇంపీరియల్ ప్రభుత్వం భారతీయ ముస్లిం పట్ల తమ బాధ్యత నిర్వహించడంలో విఫలమయ్యారు. ప్రధానమంత్రి ఉద్దేశ పూర్వకంగా ముస్లిములకు ఇచ్చిన మాటని నెరవేర్చలేదు. ఆ ముస్లిం సోదరుల న్యాయమైన కోరికకు మద్దతుగా, ముస్లిమేతర భారతీయులు ప్రతివాళ్లూ తమ వాళ్ల తమ బాధ్యతగావారి మతపర విపత్తును అధిగమించడానికి సాయపడాలి".

"వాస్తవ సమస్య బట్టి 1919 ఏప్రిల్ సంఘటనల విషయంలో రెండు ప్రభుత్వాలు పూర్తిగా, ఆ సమస్యను నిర్లక్ష్యం చేశాయి. అమాయకపు పంజాబ్ ప్రజలను రక్షించలేకపోయాయి. ఆ ప్రజలపై అమానుషంగా ప్రవర్తించిన అధికార్లను దండించలేదు. అధికారికంగా జరిపిన చాలా నేరాలకు ప్రత్యక్షంగా బాధ్యుడైన సర్ మైఖేల్ ఓ డయ్యర్ నిర్దోషి అని నిరూపించుకోవాలి. ఆయన పరిపాలనలో అనేక మంది ప్రజలను చాలా ఇబ్బందులకు గురిచేశాడు. ఈ విషయంపై ప్రభువుల సభలో చర్చకు వచ్చినపుడు ఇండియా ప్రజల పట్ల కొంచెమైనా సానుభూతి చూపించలేదు. ఉగ్రవాదం, పంజాబ్ భయంకర పరిస్థితులు, ఇటీవల వెలువడ్డ వైస్రాయ్ ప్రకటన పంజాబ్, ఖిలాఫత్ విషయాల్లో జరిపిన సంఘటనలకు కొంచమైనా పశ్చాత్తాపం కనిపించలేదనడానికి సాక్ష్యం.

"ఈ రెండు సంఘటనల్లో జరిగిన దారుణానికి ప్రాయశ్చిత్తం లేకపోతే భారతదేశం తృప్తి పడదని కాంగ్రెస్ భావిస్తోంది. తమ ఆత్మగౌరవం కాపాడుకోవడానికి బ్రిటిషువారు భవిష్యత్తులో అట్లాంటి తప్పులను మళ్ళీ చెయ్యకుండా ఉండడానికి స్వరాజ్య స్థాపన ఒక్కటే మార్గం.

జరిగిన తప్పుల సవరణ జరిగేదాకా, స్వరాజ్య స్థాపన జరిగేదాకా గాంధీజీ శ్రీకారం చుట్టిన క్రమాభివృద్ధి మత అహింసాత్మక సహాయ నిరాకరణని భారత ప్రజలు స్వీకరించాలి అని కాంగ్రెస్ అభిప్రాయం. దాన్ని శ్రీమతి అనిబీసెంట్ '1920 మార్చిలో ఖిలాఫత్‌కే మద్దతుగా సహాయ నిరాకరణోద్యమంలో ఇతర విషయాల్ని కలపకూడదన్న గాంధీ మాటల్ని గుర్తుంచుకోవాలి. అయితే ఖిలాఫత్ హిందువులను ఆకర్షించడానికి చాల్లేదు. 1920 మే 30, 31 తేదీన బనారస్‌లో ఆలిండియా కాంగ్రెస్ కమిటి సమావేశం జరిగింది. పంజాబ్‌లో జరిగే అత్యాచారాలను, సంస్కరణల చట్టంలోని లోపాలను ఉద్రేకపరచే కారణాలుగా గుర్తించింది - (ది ఫ్యూచర్ ఆఫ్ ఇండియన్ పాలిటిక్స్, పుట 250).

1919 నవంబరు 23వ తేదీన ఢిల్లీలో జరిగిన మొదటి ఖిలాఫత్ కమిటీ సమావేశానికి గాంధీ హాజరయ్యాడు. గాంధీ కేవలం హాజరవడమే కాదు ఖిలాఫత్ కమిటీకి సహాయ నిరాకరణోద్యమాన్ని చేపట్టమని ఖిలాఫత్ సమస్యని బ్రిటిష్‌వారు గుర్తించేట్టు చేయాలంటే ఈ ఉద్యమాన్ని అందుకొమ్మని చెప్పినవాడు ఆయనే. గాంధీ ఖిలాఫత్ ఉద్యమంలో ముస్లిములు చేరడంతో ఆ ఉద్యమానికి మంచి గుర్తింపు వచ్చింది. ఖిలాఫత్ ఉద్యమానికి హిందువుల మద్దతు కోసం ఆత్రపడ్డారు. 1919 నవంబర్ 3 తేదీన జరిగిన ఖిలాఫత్ సమావేశానికి ముస్లిములు హిందువులను ఆహ్వానించారు. మళ్లీ 1920 జూన్ 3వ తేదీన జరిగిన అలహాబాదు సమావేశంలో హిందువులు, ఖిలాఫత్ ముస్లిములు జాయింట్ సమావేశాన్ని నిర్వహించారు. ఈ సమావేశానికి సప్రూ, మోతీలాల్ నెహ్రూ, అనిబీసెంట్‌లతో పాటు చాలామంది హాజరయ్యారు. కాని హిందువులు ముస్లిముల ఖిలాఫత్ ఉద్యమంలో చేరడానికి సంకోచించారు. గాంధీ ఒక్కడే ఖిలాఫత్ ముస్లిముల ఉద్యమంలో చేరిన ఏకైక హిందువు. గాంధీ ఖిలాఫత్ ఉద్యమంలో ధైర్యంగా చేరడమే కాక ఆ ఉద్యమంతో అడుగు వేశాడు. కాదు నడిపించాడు.

1920 జూన్ 9న అలహాబాదులో ఖిలాఫత్ సమావేశం జరిగింది. అందులో సహాయ నిరాకరణోద్యమ కార్యక్రమాన్ని తయారు చెయ్యడానికి ఒక కార్య నిర్వహణ కమిటీని ఏర్పాటు చేశారు. ఆ కమిటీ సవివరంగా కార్యక్రమాన్ని తయారు చెయ్యాల్సి ఉంది. గాంధీ ఒక్కడే ఆ కార్య నిర్వహణ కమిటీలో ఉన్న హిందువు. 1920 ఆగస్టు ఒకటో తేదీకి ముస్లిముల బాధలను తీర్చకపోయినట్లయితే సహాయ నిరాకరణోద్యమాన్ని మొదలు పెడదామని బ్రిటిష్ వైస్రాయ్‌కి జూన్ 20, 1920నాడు ఒక ఉత్తరాన్ని పంపేడు. అదేరోజున ఖిలాఫత్ ఆశయ లక్ష్యాన్ని వివరిస్తూ తానెందుకు అందులో చేరిందీ, ఖిలాఫతీయులని తృప్తి పరచాల్సిన అవసరం గురించీ వైస్రాయ్‌కి గాంధీ ఒక ఉత్తరం రాశాడు. ఈ సంఘటనలో 1920 జూలై 1 తేదీనాడు సహాయ నిరాకరణోద్యమాన్ని మొదలు పెడదామని నోటీసు ఇచ్చింది గాంధీయే కాని ఖిలాఫత్ ఉద్యమకారులు కాదు. అదే విధంగా 1920 ఆగస్టు 1వ తేదీన సహాయ నిరాకరణోద్యమ కార్యక్రమానికి తుది మెరుగులు దిద్దింది గాంధీయే. అందులో భాగంగా గాంధీ తనకిచ్చిన పతకాన్ని బ్రిటిష్ వాళ్లకి తిరిగి ఇచ్చేశాడు. ఖిలాఫత్ ఉద్యమీయులు సహాయ నిరాకరణోద్యమాన్ని చేపట్టడానికి దాన్ని ప్రారంభించడానికి ఉత్సాహం చూపించింది గాంధీయే. అదే విధంగా కాంగ్రెస్ కమిటీని, ఈ ఖిలాఫత్ ఉద్యమానికి మద్దతుగా సహాయ నిరాకరణోద్యమాన్ని చేపట్టే దానికి పురికొల్పింది కూడా ఆయనే. ఆ తీర్మానాన్ని కాంగ్రెస్‌చే ఆమోదింప చేయించాడు. అదే లక్ష్యంతో గాంధీ 1920 ఆగస్టు 1 నుండి 1920 సెప్టెంబరు 1 వరకు ఖిలాఫత్ ఉద్యమ స్థాపకులైన ఆలీ సోదరులు కలిసి ఆ ఉద్యమానికి ప్రజల మద్దతు సంపాదిచడానికి దేశ పర్యటన గావించారు. గాంధీ, ఆలీ సోదరుల మధ్య సామరస్యం లేకపోవటాన్ని ప్రజలు గమనించే ఉంటారు. మోరడన్ రివ్యూ అనే పత్రికలో పేర్కొన్నట్టు "వారి ఉపన్యాసాల్ని శ్రద్ధగా చూస్తే ఖిలాఫత్ దుస్థితి గురించి ఒకళ్లు ఎంతో దూరంలో నున్న టర్కీని ప్రబల అంశంగా చేసుకొని

ఉపన్యసిస్తే, మరొకళ్లు ఇండియాకు స్వరాజ్యం సాధించే ధ్యేయంతో ఈ సహాయ నిరాకరణోద్యమాన్ని చేపట్టవలసిన ఆవశ్యకత ఉంటుందంటున్నారు". ఈ రెండింటి మధ్య విభేదాలతో కూడుకున్న ప్రయోజనాలు, దాని అంతిమ లక్ష్యం మధ్య స్పష్టంగా కన్పిస్తుంది[1]. కాని గాంధీ ఖిలాఫత్ ఉద్యమానికి కాంగ్రెస్ మద్దతు పొందడంలో పూర్తిగా సఫలీకృతుడై నాడు[2].

చాలాకాలం ముస్లిములను తమవేపు లాక్కునేందుకు హిందువులు నిమగ్నమయ్యేరు. తనకీ, ముస్లిమ్ లీగ్‌కీ మధ్య ఉన్న అగాధాన్ని పూడ్చడానికి చాలా యాతన పడింది కాంగ్రెస్. వీరిమధ్య సఖ్యత కుదర్చడానికి చేపట్టిన పద్ధతులు ఫలితంగా 1916లో హిందూ–ముస్లిముల మధ్య కుదిరిన లక్నో ఒప్పందం గురించి తన అభిప్రాయాల్ని స్వామి శ్రద్ధానంద సవివరంగా వ్యక్తం చేశాడు. ఆ సంవత్సరంలోనే కాం గ్రెస్ లక్నోలో సమావేశం జరిపింది. దాన్ని గురించి స్వామి శ్రద్ధానంద ఇలా అన్నాడు[3] : నేను స్టేజి మీద కూర్చుని (లక్నో కాంగ్రెస్ ప్లాట్‌ఫారం) మొదటిగా నేను గమనించిందేమంటే 1893 లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో ముస్లిమ్ ప్రతినిధుల సంఖ్య కంటే ఈ సమావేశంలో ముస్లిములు నాలుగురెట్లు ఎక్కువ హాజరయ్యారు.

మెజారిటీ ముస్లిం ప్రతినిధులు బంగారం, వెండి, సిల్క్ ఎంబ్రాయిడరీ చోగాలు (వ్రేలాడే అంగీలు) మామూలు కోట్లపై వేసుకున్నారు. కాంగ్రెస్ తమాషా కోసం డబ్బున్న హిందువులు ఆ బంగారం, వెండి, జరీ అంగీలను తయారు చేయించి ఇచ్చినట్లు ఒక పుకారు ఉంది. 433 మంది ముస్లిం ప్రతినిధులలో 30 మందే బయట నుండి వచ్చిన వాళ్లు. మిగతా 403 మంది ముస్లిం ప్రతినిధులు లక్నో నగరవాసులే. వాళ్లందరికీ ఉచిత వసతి భోజన సదుపాయాలను కల్పించారు. సర్ సయ్యద్ అహ్మద్ గారి కాంగ్రెస్ వ్యతిరేక ముస్లింలీగ్ బహిరంగ సభలో ప్రతినిధులుగా పాల్గొనవద్దని ముస్లిములకి బోధించింది. ఆ ప్రచారానికి వ్యతిరేకంగానూ వారి సమావేశానికి అనుకూలంగా ఏర్పాటు చేయడానికి కాంగ్రెస్‌వారు నాలుగు రాత్రుల ముందే లక్నోలోకి చేరుకొని వారి కార్యక్రమానికి అన్ని ఏర్పాట్లు చేశారు. కాంగ్రెస్ వ్యతిరేక ప్రచారాన్ని త్రిప్పికొట్టారు. దాని ఫలితంగా లక్నోలోని చండూర్ ఖానాలన్ని ఖాళీ అయ్యాయి. 30 వేల హిందూ ముస్లిం శ్రోతల్ని ఉద్దేశించి డజనుకు పైగా వేదికల మీద

1. మాడరన్ రివ్యూలోని సూచనను గాంధీ నిరాకరించాడు. అది క్రూరమైందన్నాడు. 1921 అక్టోబరు 21 నాటి యంగ్ ఇండియాలో రాసిన వ్యాసంలో గాంధీ మాడరన్ రివ్యూ విమర్శను ప్రస్తావిస్తూ ఇలా అన్నారు : మౌలానా మహమ్మద్ ఆలీ విషయంలో ఖిలాఫత్ అతని మతం. నా విషయంగా ఖిలాఫత్ కోసం జీవితాన్ని మీదు కట్టాను. ముసల్మాన్ కత్తి నుంచి గోర్క్షణకు హామీ ఇస్తున్నా. అది నా మతం.

2. సహాయ నిరాకరణ తీర్మానాన్ని ఓటింగుకు పెట్టినపుడు అనుకూలంగా 1886 ఓట్లు ప్రతికూలంగా 1884 ఓట్లు వచ్చాయి. స్వర్గీయ టాయర్స్ నాతో చెప్పిందేమిటంటే కాంగ్రెస్ ప్రతినిధుల్లో చాలామంది కలకత్తాలోని టాక్సీ డ్రైవర్లు, ఆ తీర్మానానికి అనుకూలంగా ఓటు వేసినందుకు వాళ్ళకి ముట్టచెప్పారట.

3. లిబరేటర్, 1926 ఏప్రిల్ 22.

నుండి మాట్లాడారు. ఆ తర్వాత ముస్లిం ప్రతినిధులు ఎంపిక చేయడమో లేక ఎన్నికవ్వడమో జరిగింది. ఈ సంగతులన్నీ నాకు లక్నో కాంగ్రెస్‌లో పాల్గొన్న ప్రతినిధులు లోపాయికారిగా చెప్పినవి.

ముస్లిం ప్రతినిధుల్ని గొప్ప చేశారు. ఓ ముస్లిం ప్రతినిధి ఉర్దూలో తీర్మానానికి మద్దతు నిస్తాడు. అతను హజ్రత్, నేను మహమ్మదీయ ప్రతినిధిని' అని మొదలెడతాడు. వెంటనే ఓ హిందూ ప్రతినిధి లేచి సెభాష్, సెభాష్ అని అరుస్తాడు. ఇక చూడండి కోలాహలం చెప్పడానికి లేదు."

గాంధీ ఖిలాఫత్ ఉద్యమాన్ని అందుకుని రెండు లక్ష్యాల్ని సాధించారు. ఆయన ముస్లింలపై విజయాన్ని సాధించడానికి కాంగ్రెస్ ప్రణాళికను చాకచక్యంగా అమలు చేశాడు. రెండోది; గాంధీ కాంగ్రెస్‌ను ఒక శక్తిగా తీర్చి దిద్దాడు. దానిలో ముస్లిం చేరడంతో కాంగ్రెస్‌కి పూర్తి మద్దతు లభించినట్లయింది. ఖిలాఫత్ లక్ష్యాలు ముస్లింలను రాజకీయ రక్షణల కంటే ఎక్కువగా ఆకర్షించాయి. దానితో బయటనున్న ఇతర ముస్లింలు కూడా కాంగ్రెస్‌లో చేరడం మొదలు పెట్టారు. హిందువులు వారికి స్వాగతం పలికారు. దీనితో బ్రిటీషు వారికి వ్యతిరేకంగా పోరాడ్డానికి వారు ఆకర్షితులై వారి ముఖ్యోద్దేశ్యం బ్రిటీషు వారిని ఎదుర్కోవడం కనక అందరూ కాంగ్రెస్‌లో చేరారు. దీనికి కారణం గాంధీయే కనుక ఈ పేరు ఆయనకే దక్కుతుంది. ఇట్లా పని చేయడమనేది చాలా సాహసోపేతమైన పని అని చెప్పవచ్చును.

1919లో ముస్లిములు హిందువుల్ని సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనమని అడిగారు. వారు టర్కీకి, ఖిలాఫత్‌కు సహాయం చేయాలని ముస్లిములు ఆశ. అప్పట్లో హిందువులు మూడు వర్గాలుగా చీలిపోయారు. ఒక వర్గం సహాయ నిరాకరణోద్యమాన్ని సూత్రప్రాయంగా వ్యతిరేకించిన వారు. రెండోవర్గానికి చెందినవారు ముస్లిములు గోవధను ఆపితే సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనడానికి అంగీకరించిన హిందువులు. మూడో వర్గం హిందువులు, ముస్లిములు సహాయ నిరాకరణోద్యమంలో సహకరిస్తే ఆఫ్ఘనిస్తాన్ భారతదేశాన్ని జయించడానికి ఆహ్వానిస్తామనేవారు. ఈ సహాయ నిరాకరణోద్యమం స్వరాజ్యం స్థాపించడానికి బదులు భారతదేశంలో ముస్లిముల రాజ్యం నెలకొల్పడానికి ఎక్కువగా సహాయ పడుతుందేమో నని వెనక్కి తగ్గారు.

గాంధీ సహాయ నిరాకరణోద్యమంలో చేరడానికి వ్యతిరేకించిన హిందువుల్ని గురించి లెక్క చేయకుండా తను కార్యోన్ముఖుడయ్యాడు. ఆయన ఈ ఉద్యమాన్ని వ్యతిరేకించేవారి దృక్పథం సందిగ్ధమైనదని పేర్కొన్నాడు. ఎవరైతే హిందువులు, ముస్లిములు గోవధను ఆపితే చేరతామన్నారో వారిని గురించి గాంధీ ఇట్లా చెప్పారు*.

* యంగ్ ఇండియా, 1919 డిసెంబరు 10

"నేను విన్నవించేదేమంటే హిందువులు ఆ గోరక్ష అంశాన్ని ఇక్కడ లేవనెత్తవద్దం టున్నాను. నిజమైన స్నేహితుడు కష్టాల్లో ఏ స్వార్థం లేకుండా ఆదుకొన్నవాడే. సహకారం అనేది వాణిజ్యంలో చేసుకొనే ఒప్పందాలలో అవసరం అవుతుంది. కాని స్నేహంలో కాదంటాను. మినహాయింపులతో కూడిన సహకారం కల్తీ సిమెంటులాంటిది. ఎందుకంటే అది అతకదు. అట్లానే ఈ సహకారం అంటాను. మహమ్మదీయులు హిందువుల గో సంరక్షణను అర్థం చేసుకొని, గౌరవించి తమంతట తామే గోవధను నిషేధించినట్లయితే వారికి హిందువులు మద్దతునిచ్చి ఆ పని చేయవచ్చు. లేకపోవచ్చు. అయినా నేను గోవును పూజించినప్పటికీ గోవధను ఆపమని పరస్పర సహకారానికి ముందుగా నిబంధన పెట్టాలనటంలో ఏ హిందువుకూ లొంగను. ఏ నిబంధనలూ లేని సహకారం అంటే గోవులకు రక్షణ ఇవ్వటం".

సహాయ నిరాకరణోద్యమం లో చేరని హిందువులు ముస్లిములు ఇండియాపై దండెత్తడానికి ఆఫ్ఘన్లను పిలుస్తారని భయపడ్డారు. అట్లాంటి వారికి గాంధీ ఇట్లా చెప్పాడు* : "హిందువుల హెచ్చరికను చాలా సులభంగా అర్థం చేసుకోవచ్చు. అందులో కొంత న్యాయముంది. ముస్లిం స్థితిని ఎదుర్కొనడం చాలా కష్టం. నా అభిప్రాయంలో ఇండియాను ముస్లిములు, ఇంగ్లీషు వారి మధ్య యుద్ధభూమిగా మార్చేదానికంటే, హిందువులు సహాయ నిరాకరణోద్యమం చేపట్టి పూర్తిగా వెంట నే విజయం సాధించడం మంచిది. నాకు ఒక చిన్న సందేహం కూడా లేదు.

మహమ్మదీయులు గనుక ప్రకటించిన లక్ష్యాలకు నిజంగా కట్టుబడి ఉండి, స్వయం నిగ్రహశక్తితో త్యాగాలు చేయడానికి సిద్ధపడితే, హిందువులు వారితో సహకరించవచ్చు. కనుక సహాయ నిరాకరణోద్యమంలో చేరాలి. నేను కూడా నమ్మేదేమంటే హిందువులు మహమ్మదీయులకు సహాయం చేయరు. ఎందుకంటే ముస్లిముల మధ్య బ్రిటీష్ సైన్యం మధ్య సంఘర్షణను పెట్టి ఆఫ్ఘన్లను ఆహ్వానించే స్థితిలో వారికి సహాయపడరు. బ్రిటీషు సైన్యం కూడా ఆధునిక శిక్షణ పొంది హిందూ సరిహద్దు ప్రాంతాలపై దండెత్తి తనను కాపాడుకొన గల స్థితిలో ఉంది. ఒకటే మార్గం ఏమిటంటే మహమ్మదీయులు ఇస్లాం పేరుతో దాని గౌరవార్థం గట్టిగా పోరాడగలరు. తద్వారా సహాయ నిరాకరణోద్యమాన్ని నిజంగా అందుకోగలుగుతారు. ఇది కేవలం సమర్థవంతంగా కొనసాగించడమే కాక ఎక్కువమంది ఈ ఉద్యమాన్ని చేపట్టడానికి అవకాశముంది. కాని ఇది పూర్తిగా వ్యక్తి మనస్సాక్షికే వదిలి వేయడం జరిగింది. నేను ఏ వ్యక్తికి కాని లేక సంస్థకి కాని, అన్యాయం జరిగితే సహించలేను. నేను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆ వ్యక్తిని లేక సంస్థని నిలపడానికి కారకుడవుతాను. నేను దానికి జవాబు నన్ను సృష్టించిన వాడికి చెప్పుకోవాలి. నేను మానవత్వంతో చేయగలిగిన నైతిక పరమైన విలువతో చేస్తాను. అది కూడా తప్పు చేసిన వాళ్ళని గాయపరచకుండా. అన్యాయానికి పై చెప్పిన పద్ధతిలో

* యంగ్ ఇండియా, 1920 జూన్, 9.

మద్దతు నివ్వడం చాలా తేలిక. అట్లాంటి నైతిక విలువలను అమలు చేయడానికి గట్టి మనోశక్తి కావాలి. అందులో ఎట్లాంటి అసహ్యాన్ని తొందరపాటుతనాన్ని చూపించకూడదు. సహాయ నిరాకరణోద్యమం తప్పనిసరిగా స్వచ్ఛందంగానే అమలు చేయగలగాలి. దాని అమలు అంతా మహమ్మదీయుల ఆచరణపైన ఆధారపడి ఉంది. దీన్ని దాటించడం వల్ల వారికే లాభం. హిందూ సహకారం దానంతటదే వస్తుంది. ప్రభుత్వం, గొప్పదీ, శక్తివంతమైందీ అయినా రక్త రహితమైన ప్రతిఘటనకి దిగిరాక తప్పదు."

ఇక్కడ దురదృష్టమేమిటంటే గాంధీ ఏదైతే ఆశించాడో అంటే 'ఏ ప్రభుత్వం కూడా రక్తరహిత ప్రతిఘటనకు నిలవలేదు' అని ఆశించాడో అది వాస్తవం కాలేదు. సహాయ నిరాకరణోద్యమం మొదలుపెట్టి సంవత్సరం కాకముందే గాంధీ ముస్లిములు నిరుత్సాహ పడిపోయేరని భావించాడు.

"వాళ్ల పట్టలేని కోపంతో ముస్లిములు కాంగ్రెసును, ఖిలాఫత్ వ్యవస్థను ఎక్కువ శక్తితో ఇంకా దృఢ కార్యాచరణను చేపట్టాలని కోరారు. ముస్లిములు ఖిలాఫత్ సమస్యను భారతదేశం సామర్థ్యంతో తీర్చగలదని, అది స్వరాజ్ వంటిది అని అనుకుంటున్నారు. ఆ ముస్లిములు స్వరాజ్ సాధించడంలో తప్పకుండా ఆలస్యం అవుతుంది. అంతవరకూ వేచి ఉండడం తప్పనప్పుడు భారతదేశ ముస్లిములు టర్కీ ఐరోపా జలాలలో లుప్తమైపోతుంది. ఆదుకొనే శక్తిలేక గుడ్లప్పగించి చూస్తూ ఉండాలి.

ఈ దృక్పథంతో సానుభూతి లేకుండా ఉండడం సాధ్యం కాదు. నేను ఆలోచించేదేమంటే సామర్థ్యంతో పరిష్కారముంటే దాన్ని వెంటనే కార్యరూపంలో పెట్టమని సలహా ఇచ్చేవాణ్ని. ఖిలాఫత్ ప్రయోజనం మనమింకా ముందుకు తీసుకెళ్ళడానికి మార్గం కనిపిస్తే నేను సంతోషంగా స్వరాజ్య కార్యక్రమాన్ని వాయిదా వేసేద్దామంటాను. లక్షలాది ముస్లిములు పడే బాధలకు ఉపశమనం కలిగించేటట్లయితే నేను సహాయ నిరాకరణోద్యమాన్ని మించిన నివారణ చర్యలను తీసుకొని ఉండేవాణ్ణి.

"నా అభిప్రాయమేమంటే ఖిలాఫత్ తప్పును సరిదిద్దుకోవడానికి వెంటనే స్వరాజ్యసిద్ధికి కార్యాచరణ పథకాన్ని చేపట్టాలి. నాకనిపించేది ఖిలాఫత్ సమస్యకు పరిష్కార మార్గం స్వరాజ్యం సాధించడమే. ఇది ఒకదానితో ఒకటి ముడిపడి ఉంది. టర్కీకి భారతదేశం ఏ విధంగా సహాయ పడగలదంటే అది తగినంత శక్తిని తనకు తాను చేకూర్చుకొనేట్టు చెయ్యడం. టర్కీ కనక తగిన కాలంలో శక్తిని సంపాదించుకోలేకపోతే టర్కీ యూనియన్ నుండి రాజీనామా చేయడం అనివార్యం. పక్షవాతం వచ్చిన వ్యక్తి మరొక పక్షవాత వ్యాధిగ్రస్తుడికి సహాయం చేయలేడు. కాబట్టి తన పక్షవాతాన్ని తగ్గించుకోవటానికి ప్రయత్నించడం మంచిదని నా ఉద్దేశ్యం. కేవలం ఉద్రేకపూరితంగా అనాలోచితంగా హింసకు పాల్పడితే విచ్ఛిన్నానికి దారి తీస్తుందే తప్ప టర్కీకి ఉపశమనం కొద్దిగా కూడ కల్గించదు".

ముస్లిములు గాంధీ సలహాను వినే స్థితిలో లేరు. వారు అహింస అనే సిద్ధాంతాన్ని ఆరాధించే స్థితిలో లేరు. వ్యతిరేకత తెలియజేస్తున్నారు. వారు స్వరాజ్ వచ్చేంతవరకూ ఓపిక పట్టే స్థితిలో లేరు. ముస్లిములు ఎంత తొందరగా టర్కీకి ఖిలాఫత్ ఉద్యమం రక్షించడానికి సహాయ పడగలమనే ఆతృతతో ఉన్నారు. హిందువులు భయపడినట్లు ముస్లిములు అసహనంగా వ్యవహరిస్తున్నారు. ఆఫ్ఘనిస్తాన్ భారతదేశాన్ని జయించడానికి సిద్ధంగా ఉన్నట్టు హిందువులు అనుకుంటున్నారు. ఎంతవరకు ఖిలాఫతీయులు ఆఫ్ఘనిస్తాన్ అమీరులతో ఎట్లాంటి చర్చలు జరిపారో తెలిసే అవకాశం లేదు. ఆ పథకం ప్రకారం పని చేయడం వారికి అందని ప్రశ్న. ఆ పథకం భారతదేశాన్ని జయించడానికైతే అది చాలా అపాయకరమైనదని చెప్పక తప్పదు. ప్రతి భారతీయ పౌరుడు అట్లాంటి ఉద్రేకం కలిగించే పథకానికి దూరంగా ఉంటాడు. ఈ పథకంలో గాంధీ పాలు పంచుకోవడానికి గల కారణం అంతు తెలవకుండా ఉంది. ఆయన అట్లాంటి పథకానికి దూరంగా ఉండడనే అనుకుందాం. చివరకు ఆయన హిందూ-ముస్లిం ఐక్యం కోసం ప్రయత్నం చేసే అనాలోచిత కార్యక్రమాన్ని చేపడితే స్వరాజ్య పథకం లాంటి వన్నీ దీన్ని సాధించడానికేనా? అయితే ఆయనను ఈ పథకానికి మద్దతునీయమనండి.

గాంధీ ఆఫ్ఘనిస్తాన్ అమీరుకు బ్రిటీష్‌వారితో ఏ ఒప్పందానికి అంగీకరించవద్దని సలహా ఇచ్చాడు. ప్రకటన కూడా ఇచ్చేడు*. ఆ ప్రకటనలో "ఆఫ్ఘనిస్తాన్ అమీరు గనుక బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా యుద్ధానికి దిగినట్లయితే నేను తప్పక అమీరుకే మద్దతునిస్తాను. నేను బహిరంగంగా నా దేశ ప్రజలకు ఒక జాతిపై నమ్మకం కోల్పోయిన ప్రభుత్వాన్ని ఇంకా అధికారం ఉండటానికి సహకరించడం నేరం అని చాటి చెబుతాను."

ఏ మాత్రం జ్ఞానం ఉన్న మనిషైనా హిందూ-ముస్లిం ఐక్యం కోసం ఇట్లాంటి పనికి పూనుకుంటాడా? కాని, గాంధీ మాత్రం హిందూ-ముస్లిం ఐక్యానికి బాగా అంటుకుపోయాడు. దానితో ఆయన ఎట్లాంటి వెర్రి కార్యక్రమానికి పాల్పడుతున్నాడో తెలుసుకొనే స్థితిలో లేడు. ఎంతో ఆకాంక్షతో గాంధీ హిందూ-ముస్లిముల ఐక్యానికి కష్టపడి ఎంతగానో పునాది నిజంగా వేశాడు. అప్పుడు కూడా తన వెనక నడిచివచ్చే వాళ్లకి మనజాతి ఎదుర్కొంటున్న సమస్యలను గురించి వివరించి చెబుతూనే ఉన్నాడు. "యంగ్ ఇండియా"లో సెప్టెంబర్ 8, 1920లో రాస్తూ ఇట్లా అన్నాడు : "నేను మద్రాసు పర్యటనలో ఉన్నప్పుడు జాతీయ సమస్యలను గూర్చి మాట్లాడడానికి బెజవాడలో అవకాశం దొరికింది. మనం ఆదర్శాలను గూర్చి పాటుపడాలే గాని మనుషుల్ని గూర్చి పట్టించుకోనవసరం లేదు. ప్రేక్షకులు మహాత్మా గాంధీజీకి జై జై అనే బదులు మహమ్మద్ అలీ షవుకత్ అలీకి జై జై అంటూ హిందూ ముస్లిం ఐక్యానికి బదులు మరొకటి అన్నారు. అదే హిందువులు వందేమాతరం అంటే ముస్లిములు అల్లహెూ అక్బర్ అని నినాదాలు చేశారు. దీన్నే గాంధీ "చెవులు చిల్లులు పడేటట్లు

* యంగ్ ఇండియా 1921 మే 4.

నినాదాలతో ప్రజలు ఒకే తాటిపై నడవడం కష్టమని" కచ్చితంగా చెప్పాడు. అల్లాహో అక్బర్ అనే నినాదాన్ని ముస్లిములు ఏకకంఠంతో దేవుడొక్కడే గొప్పవాడు అనడం ఆయనకంటే గొప్పవారు లేరు అనడం. రెండవది వందేమాతరం(జన్మభూమికి దండాలు) లేదా భారతమాతాకీ జై. మూడవది : హిందూ-ముస్లిములకు జై. ఇవి లేకుంటే భారతదేశానికి విజయం వచ్చేది కాదు. దేవునికోసం నిజమైన ఊరేగింపు జరగలేదు.

నేను కూడా కోరేదేమంటే మౌలానా అబుల్ కలామ్ అజాద్ ఇచ్చిన సలహాలననుసరించి వార్తాపత్రికలు, ప్రజా ప్రతినిధులు కూడా ఈ నినాదాలను ఎక్కువగా ఉపయోగించి ప్రచారం కొనసాగించాలంటున్నాను. వాటిలో పూర్తి అర్థం ఇమిడి ఉంది. మనిషిముఖ్యంగా చేయవలసింది దేవుని ముఖ్యాంశం - ప్రార్థిస్తూ, మన చిన్నతనాన్ని దేవుని ముందు ఒప్పుకోవాలి? ఇది ఒకే నినాదంగా ముస్లిములు, హిందువులు కలిసి భక్తితో ప్రార్థించాలి. హిందువులు కూడా అరబిక్ మాటలను అందులో ఏ క్రమభాష్యం లేక అందరికీ పనికి వచ్చే వాటిని తప్పక ఉపయోగిస్తారు. దేవుడు అందరి భాషలను అంగీకరిస్తాడు. వందేమాతరం - దీనితోపాటు ఆశ్చర్యకరమైన కలయిక ఒకే దేశం కావాలనే కోరికతో భారతదేశం ఉన్నత శిఖరాలకు చేరుకుంటుంది. నేను భారతమాతకు జై అనేదాని కంటే వందేమాతరం అనే నినాదాన్ని ఎన్నుకొంటాను.

హిందూ-ముస్లిం హృదయాల సమ్మేళనం లేకుండా భారతదేశం అర్థరహితం. హిందూ-ముస్లిములకు జై అనే నినాదాన్ని ఎప్పుడూ మరువలేము.

"ఈ నినాదంలో విభేదం ఉండకూడదు. కొంతమంది ఆ మూడు నినాదాల్లో ఏదో ఒకదాన్ని పట్టుకున్నప్పుడు, మిగతావాళ్ళు తమ కిష్టమైన దాన్నే అరవకూడదు. ఇష్టం లేని వాళ్ళు మానవచ్చు. ఒక నినాదం వచ్చినప్పుడు తమది మధ్య చేర్చడం మర్యాద కాదు. పైన చెప్పిన విధంగా ఆ నినాదాలను వరసగా ప్రయోగించటం ఎప్పటికీ మంచిది."

గాంధీ, ముస్లిం-హిందూ ఐక్యం సాధించడానికి ఎన్నో ముఖ్యమైన అంశాలను చేపట్టాడు. ఆయన హిందువులకు వ్యతిరేకంగా ఎన్నో హింసా కార్యక్రమాలు తలపెట్టిన ముస్లిములను ఏమీ అనేవాడు కాదు. అనలేదు. చాలామంది ప్రఖ్యాత హిందువులు ముస్లిం మతం పిచ్చిని, కట్టుబాట్లను శంకించారు. ముస్లిములు వారి రాతలలోనూ లేక శుద్ధి ఉద్యమం అనే పేరుతో చాలామంది హిందూ ప్రవక్తలను చంపించారు. అట్లాంటి మొదటి సంఘటనలో స్వామి శ్రద్ధానంద 1926 డిశంబరు 23వ తేదీన అబ్దుల్ రషీద్ చేతుల్లో చంపబడ్డాడు. ఆయన జ్వరంచే మంచం పట్టి ఉండగానే చంపబడినాడు. దీని తర్వాత ఢిల్లీలో ప్రముఖ ఆర్య సమాజవాది లాల్ నానక్‌చంద్‌ని హత్య గావించారు.

1929 ఏప్రిల్ 6వ తేదీన 'రంగీలా రసూల్' రచయిత రాజ్‌పాల్‌ను ఆయన తన దుకాణంలో కూర్చుండగానే ఇలామ్‌దిన్ అనేవాడు పొడిచి చంపాడు 1934లో నాథూరామ్ శర్మను అబ్దుల్‌ఖయామ్ కాల్చి చంపాడు. అట్లా చేయడం చాలా ధైర్యంతో కూడింది. శర్మ

సింధులో జుడిషియల్ కమీషనర్ కోర్టులో తనపై మోపిన నేరం 195 ఇండియన్ పీనల్ కోడ్ ప్రకారం పెట్టిన కేసులో తను ఒక కరపత్రాన్ని ముద్రించినందుకు గాను విచారణ జరుగుతూ ఉన్నప్పుడు కత్తిపోట్లకు గురై మరణించాడు. 1938లో అహమ్మదాబాద్‌లో హిందూ మహాసభ జరిగిన అనంతరం ఆ సభ కార్యదర్శి ఖన్నా మీద క్రూరంగా దాడి జరిపారు. కాని అదృష్టవశాత్తు త్రుటిపాటులో మరణం నుడి తప్పుకున్నాడు.

ఈ జాబితా చాలా చిన్నది. దీన్ని పెంచాలంటే చాలా తేలికగా పెంచవచ్చు. కాని ప్రముఖ హిందువులను, మూర్ఖపు ముస్లిములు చాలామందిని చంపారా కొద్ది మందినే చంపారా అనేది పెద్ద విషయం కాదు. ఖూనీకోరుల లెక్కలు గట్టే వాళ్ల దృక్పధాన్ని పట్టించుకోవలసిన విషయం. చట్టం అమలు జరిగిన చోట హంతకులు శిక్షింపబడ్డారు. ప్రముఖ ముస్లిములు ఎవరూ ఈ హంతకుల్ని ఏనాడూ ఖండించలేదు. అట్లా హత్యలకు పాల్పడిన వారిని త్యాగధనులుగా మతం కోసం ప్రాణాలర్పించేవారిగానూ, ఉద్యమం వారిని క్షమించి వదిలి వేసిందనీ చెప్పలేము. దీనికి తగిన వివరణలు కావాలంటే బర్కత్ అలీ, లాహోర్ బారిష్టర్ అబ్దుల్ ఖయామ్ తరపున కోర్టులో వాదించడం చూడచ్చు. అబ్దుల్ ఖయామ్ ఖొరాన్ ననుసరించి, దాన్ని రక్షించడానికి తను నాథురామ్‌ను హత్య చేశాడు. కనుక ఆయన చేసిన పని సమర్థనీయం అంటాడు. ఇట్లాంటి ముస్లిముల దృక్పధాన్ని చాలా సులభంగా అర్థం చేసుకోవచ్చు. మనకు అర్థం కానిదేమంటే గాంధీ దృక్పధం ఏమిటని.

గాంధీ హింసను, హింసాయుత కార్యాలను ఖం డించడంలో చాలా కాలానుగుణంగా చేసేవాడు. ప్రతి హింసా చర్యను కాంగ్రెసు ఇష్టం ఉన్నా లేకపోయినా ఖండిం చేవారు. కాని, గాంధీ అట్లాంటి హత్యలకు ఎప్పుడూ వ్యతిరేకత తెలిపేవాడు కాదు. ముస్లిములు కూడా ఈ హత్యలను ఖండించలేదు*. ఇది టైమ్స్ ఆఫ్ ఇండియా "ఇండియా కన్నులతో చూడు" అనే పేరుతో ప్రచురించబడింది.

ఇట్లాంటి సంఘటనను విమర్శించాలని ప్రముఖ ముస్లిములను కూడ గాంధీ కోరలేదు. ఆయన ఇట్లాంటి విషయాలపై మౌనం వహించి కూర్చున్నాడు. ఇట్లాంటి దృక్పధం ఉన్న గాంధీ కోరికేమిటి అంటే హిందూ–ముస్లిముల ఐక్యతను కాపాడడం - కొంతమంది హిందువులు హత్యకు గురి అయినా, వారి బలి ద్వారానైనా సరే ఈ దృక్పధమే ముస్లిములను అన్ని అక్రమాల నుండి మినహాయించింది. మోపల్లా ఘర్షణలని గాంధీ చాలా బాగా విశ్లేషణ గావించాడు. అది ఐక్యానికి భంగం కలిగించవచ్చు. అయినా తగ్గకుండా అందులోని తప్పులను

* స్వామి శ్రద్ధానందను హత్య చేసిన అబ్దుల్ రషీద్ ఆత్మకు శాంతి కలగాలని, ఆయనకు పై లోకంలో శాంతి దొరకాలని దేవబంద్ థియాలజీ కాలేజీ విద్యార్థులు, ప్రొఫెసర్లు ఖురాన్ పఠనంను ఐదుసార్లు చేశారు. అట్లా ప్రతిరోజూ ఒక లక్షసార్లు ఖురాన్ వచనాలను పఠించటానికి పూనుకున్నారు. వారు ప్రార్థనలతో సర్వోన్నతుడైన దేవుడు రషీద్‌కు ఏడవ పరలోకంలో స్థానంను పొందేలా చేసేవారు.

క్షుణ్ణంగా పేర్కొన్నాడు.

మలబారులోని హిందువులపై మోప్లాలు చేసిన అత్యాచారాలు రక్తాన్ని ఉడికించేస్తాయి. మొత్తం దక్షిణ భారతంలో హిందువులను భయభ్రాంతుల్ని చేసింది. అందరు తమ అభిప్రాయాలను మార్చుకొన్నారు. అది ఉధృతంగా ఉన్నప్పుడు ఖిలాఫత్ నాయకత్వం తప్పుగా అర్థం చేసుకుని, మోపల్లాలు తమ మతంను కాపాడుకోవడానికి చేసిన వీరోచిత పోరాటానికి హార్థికాభి వందనాలను తెలియజేసింది. ఎవరైనా హిందూ–ముస్లిముల ఐక్యానికి ఇట్లాంటి సంఘటనలను సహించడం కూడదంటున్నారు. గాంధీ మాత్రం హిందూ–ముస్లిముల ఐక్యం కోసం ఎక్కువగా సహించడం ఖిలాఫతీయులు మోప్లాలను అభినందించడాన్ని కూడా చాలా తేలికగా తీసుకున్నారు. గాంధీ మోప్లాల గురించి చెబుతూ దైవానికి భయపడి ధైర్యంగా తమ మతం కోసం మాట్లాడ్డం జరుగుతుందన్నాడు. మోప్లాలను గూర్చి వారిపై జరుగుతున్న అన్యాయం గూర్చి ముస్లిముల మౌనం గురించి గాంధీ ఇట్లా అన్నాడు :

"హిందువులు తమ మతాన్ని కాపాడుకోవడానికి ధైర్యంతో నమ్మకంగా వ్యవహరిస్తున్నారు. మాట రూపేణా చేసిన ముస్లిముల మోప్లాల దుశ్చర్య ముస్లిం-హిందువుల స్నేహానికి ఎట్టి పరిస్థితిలోనూ పరీక్ష కాదు. ముస్లిములు సహజంగానే అవమానం మోపల్లల చర్యలు బలవంతంగా మతంను మార్చడం, దోపిడీలను చాలా మౌనంగా కొనసాగించారు. అవివెంత మతమౌఢ్యం కలవారైనా చేయడం కష్టం. నా నమ్మకం ఏమంటే హిందువులు కలిసికట్టుగా మోప్లాల మౌఢ్యాన్ని సమానంగా అణచివేశారు. కొంత సంస్కారం ఉన్న ముస్లిములు ఆ మోప్లా చర్య మహమ్మదు చెప్పిన బోధనలకు వ్యతిరేకమని అంగీకరించారు*. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ మోప్లాల అత్యాచారాల పట్ల కాంగ్రెస్ చాలా జాగ్రత్తగా ముస్లిములకు ఎక్కడ నొప్పి కలుగుతుందోనన్నట్లు చేశారు.

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ మోప్లాల హింసాత్మక చర్యలకు ప్రగాఢ విచారం వ్యక్తం చేస్తూ మలబారు ప్రాంతంలోనే కాక దేశంలో చాలాచోట్ల కాంగ్రెస్ సందేశాన్ని పూర్తిగా అందుకోని వారున్నారని వ్యక్తమౌతోందన్నారు. కేంద్ర ఖిలాఫత్ కమిటీ, ప్రతి కాంగ్రెస్, ఖిలాఫత్ కార్యకర్తా అహింసా సందేశాన్ని అందరికీ అందేలాగ ఎంతగా కవ్వింపు చర్యలకు పాల్పడినా భారతదేశం నలుమూలలకు తీసుకెళ్లాలని తీర్మానించింది.

ఇట్లా చేసిన మోప్లాల దక్షిణ ప్రాంతంలో జరిపిన తిరుగుబాటుకు తీవ్ర నిరసన వ్యక్తం చేసింది. ఆ వర్కింగ్ కమిటీ అసలు మోప్లాల అంతటి చర్యలకు పాల్పడవలసి వచ్చిందనేదాన్ని

* ఒక తీర్మానం కేవలం మూడు బలవంతపు మత మార్పిళ్లు చేయడం జరిగిందని పేర్కొంది!! సర్ విలియం విన్సెంట్ 1922 జనవరి 16న కేంద్రీయ శాసనసభలో వేసిన ప్రశ్నకు జవాబు ఇచ్చాడాయన. మద్రాసు గవర్నమెంటు రిపోర్టుల ప్రకారం బలవంతపు మత మార్పిళ్లు వందల వేలకొలదిగా ఉండొచ్చు. కాని కొన్ని కారణాల వల్ల అంత ఖచ్చితంగా నివేదికను పొందడం కష్టమని వివరించాడు.

తెలుసుకోవాలనుకుంటుంది. కవ్వింపు చర్యలు భరించరానివిగా ఉంటే మోప్లాలు అట్లాంటి చర్యకు పాల్పడ్డారో అనేది విశదంగా తెలపడం లేదు. ప్రభుత్వం ప్రకటించిన నివేదికల ఆధారంగా చూస్తే ఒకవైపు దృశ్యం కనిపిస్తుంది. మోప్లాలు క్షమించరాని నేరాలకు పాల్పడినట్లు, దానిని అరికట్టడానికి ప్రభుత్వం శాంతి భద్రతలను కాపాడడం పేరుతో జీవితాలను కోల్పోవడం జరిగిందంటారు.

మోప్లాలో కొందరు మతోన్మాదులు బలవంతంగా మతం మార్పిడికి పాల్పడడం విచారకరమని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ పేర్కొంది. కొందరు కావాలని చేసే దుశ్చర్యల్ని ఖండించే ప్రభుత్వాన్నీ కల్పిత వార్తల్ని-నమ్మవద్దని ప్రజల్ని హెచ్చరించింది. కమిటీ నివేదిక ఈ విధంగా పేర్కొంది.

"మంజేరి చుట్టుపక్కల నివసించే కుటుంబాల వారిని బలవంతంగా మహ్మదీయ మతంలోకి మార్పిడి చేయడం జరిగింది. కొంతమంది మతోన్మాదులు హిందువులను బలవంతంగా మార్పిడి చేయించారు. ఇది ఖిలాఫత్, సహాయ నిరాకరణోద్యమానికి పూర్తి విరుద్ధం. ఇంతవరకు మాకు అందిన సమాచారం ప్రకారం మూడు సందర్భాల్లోనే మత మార్పిడి చేసినట్లు గాంధీజీ నోరు మెదపకుండా ఉన్న సందర్భాలు మరి కొన్ని ఉన్నాయి, ముస్లిముల తలబిరుసు ప్రవర్తనకి సంబంధించి వాటిని స్వామి శ్రద్ధానంద తన వారపత్రిక 'లిబరేటర్' పేర్కొన్నారు. 1926 సెప్టెంబరు 30 పత్రికలో స్వామీజీ ఇలా రాశారు :

"అంటరానితనం నిర్మూలనకి సంబంధించి అధికార పూర్వకంగా చాలాసార్లు తీర్పు వచ్చింది. హిందువులు గతంలో చేసిన పాపాలకి ప్రాయశ్చిత్తం చేసుకోవాలని, హిందూయేతరులు దీనికి సంబంధించి చేయవలసిందేమీ లేదన్నారు. కాని, మహమ్మదీయులు, క్రైస్తవులు బహిరంగంగా వైకోమ్ ఇతర స్థలాల్లో గాంధీ ఆదేశాలని వ్యతిరేకించారు. చివరికి యాకూబ్ హసన్‌లాంటి నిష్పక్షపాత నాయకుడు నాకు విజ్ఞప్తినివ్వాలని ఉద్దేశించిన మీటింగ్‌కు అధ్యక్షత వహిస్తూ మద్రాసులో ఇండియాలోని అంటరానివారి నందరినీ ఇస్లాంలోకి మార్చవలసిన బాధ్యత ముస్లిముల మీద ఉందని బహిరంగంగా చాటాడు.

ముస్లిములనిగానీ, క్రైస్తవుల్నిగానీ మందలిస్తూ ఒక్క ముక్క అనలేదు.

1926 జూలై పత్రిక లిబరేటర్‌లో స్వామిజీ ఇలా రాశారు :

"మహాత్మాగాంధీ దృష్టికి తేవలసిన మరో ముఖ్యమైన విషయం ఉంది. మేమిద్దరం ఖిలాఫత్ నాగపూర్ సమావేశానికి కలిసి వెళ్ళాం. ఆ మీటింగ్‌లో ప్రారంభమయ్యే ఖురాన్ ఆయత్ (శ్లోకాన్ని) ఓ ముసల్మాన్ చదివాడు. అందుట్లో చాలాసార్లు జిహాద్‌కి కాఫిర్లను చంపడం లాంటి అంశాలు జోక్యం చేసుకున్నాయి. కాని నేను ఎప్పుడైతే ఖిలాఫత్ ఉద్యమ ప్రస్తుత దశకు దృష్టి మళ్ళించానో మహాత్మాజీ నవ్వాడు. వాళ్ల బ్రిటిష్ సామ్రాజ్య

ఉద్యోగసామ్యాన్ని ఉద్దేశిస్తున్నారు. అహింసాత్మక కార్యక్రమానికి ఇది భంగకరం అన్నానేను. ద్వేషజ్ఞానం వచ్చినపుడు మహమ్మదీయ మౌలానాలు హిందువులకు వ్యతిరేకంగా వాటిని వాడకుండా చేయరు."

మోప్లా అల్లర్లకు సంబంధించిన మూడవ ఉదంతాన్ని స్వామీజీ చెప్పారు. 1926 ఆగస్టు 26వ తేదీన వెలువడిన లిబరేటర్‌లో స్వామీజీ ఇట్లా అన్నారు : "పౌర కమిటీలో ఈ విషయం ప్రస్తావనకి వచ్చినపుడు మొదటి హెచ్చరిక వచ్చింది. మొదటి తీర్మానం హిందువుల్ని చంపడం తప్పని నీళ్లు నమలకుండా మొత్తంగా ఖండించింది. హిందువుల ఇళ్లు తగలబెట్టడం, బలవంతంగా ముస్లిములుగా మార్చడం లాంటి చర్యల్ని వ్యతిరేకించింది. హిందూ సభ్యులే తీర్మానానికి సవరణలు ప్రతిపాదించి, చివరికి అది ఏ కొద్దిమంది వ్యక్తుల్నో ఖండించడం కిందకి దిగజారింది. కొంతమంది ముస్లిం నాయకులకి ఇది కూడా రుచించలేదు. మౌలానా ఫకీరు, మరికొందరు మౌలానాలు ఈ ప్రతిపాదనను వ్యతిరేకించారు. అందులో ఆశ్చర్యం లేదు.

కానీ ఆపాదమస్తకం జాతీయవాది అయిన మౌలానా హస్రత్ మొహానీ లాంటివాళ్ళు ఆ తీర్మానాన్ని వ్యతిరేకించడం నాకు ఆశ్చర్యం కలిగించింది. ఆ వ్యతిరేకించడమైనా మోప్లా ప్రాంతం ఇక ఎంతమాత్రం దార్-ఉల్-అమన్ కాదనీ, అది దార్‌ఉల్‌హరబ్‌గా మారిందనీ, కారణం చూపించి హిందువులు మోప్లాల బ్రిటిష్ శత్రువులతో కుమ్మక్కు అయ్యారనీ వాళ్ళు అనుమానించారు. అంచేత హిందువులకు ఖురాన్‌నో, కత్తినో బహూకరించడం మోప్లాలకి సంబంధించ ఒప్పే. హిందువులు మృత్యువు నుంచి తమను తాము కాపాడుకునేందుకు ముసల్మాన్లుగా మారడం ఐచ్ఛికంగా విశ్వాసాన్ని మార్చుకోవడమే గాని, బలవంతంగా జరిగింది కాదు - సరే, కొంతమంది మోప్లాలను ఖండించే మెత్తని తీర్మానానికి కూడా ఏకగ్రీవ ఆమోదం లభించలేదు. మెజార్టీ ఓటుతో ఆమోదించారంతే. కాంగ్రెస్ తమ ఓరిమి మీదనే మనుతూ ఉందనీ, తమ రెక్కల్ని అతి చిన్న ప్రయత్నం కనిపించినా తలస్పర్శి ఐక్యం తునాతునకలవుతుందని ముసల్మాన్లు భావిస్తున్నారనడానికి సూచనలు ఉన్నాయి."

ఆఖరుది గాంధీ ప్రారంభించిన విదేశీ వస్త్ర దహనానికి సంబంధించింది. 1926 ఆగస్టు 31వ తేదీ "లిబరేటర్"లో రాస్తూ స్వామీజీ ఇలా అన్నారు :

"విదేశీ వస్త్ర దహనం తమ అనుల్లంఘనీయ కర్తవ్యం అని ప్రజలు భావించారు. దాస్, నెహ్రూ తదితర అగ్రనాయకులు వేల రూపాయల విలువ చేసే వస్త్రాల్ని మంట కాహుతి చేశారు. అటువంటి సందర్భంలో 'విదేశీ వస్త్రాలనన్నింటిన్ని' టర్కీ సోదరులకోసం పంపించేట్లు ఖిలాఫత్ ముసల్మాన్లు మహాత్మాజీ నుంచి అనుమతి పొందారు. అది కూడా నాకు మతి పోగొట్టింది. మహాత్మాజీ మొండిపట్టుగా హిందువుల భావాలకు మాత్రం సానుభూతి చూపించకుండా ఉంటాడు. మాత్రబద్ధమైన సమస్య వచ్చేటప్పటికి ముస్లిమ్‌లు కర్తవ్యాన్ని

ఉల్లంఘించినా, ఆయనకు వాళ్ళపట్ల సానుభూతి ఉంటూనే ఉంది."

హిందూ ముస్లిం ఐక్యం సాధించడానికి ఆయన చాలా ప్రయత్నాలు చేశాడు. ఆ ప్రయత్నాల చరిత్రలో రెండు సంఘటనల గురించి ప్రస్తావించుకోవాలి. ఒకటి 1924లో గాంధీ సాగించిన నిరాహార దీక్ష. అది 21 రోజులు సాగింది. ఆ దీక్షకు ఉపక్రమించే ముందు గాంధీ దానికి కారణాలు ఏమిటో చెప్పాడు.

"రెండేళ్ళ క్రితందాకా స్నేహితులుగా ఉన్న హిందువులు, ముస్లిములు ఇవాళ కాట్లకుక్కల్లా కొట్లాడుకుంటున్నారు కొన్నిచోట్ల. దీన్నిబట్టి వాళ్ళు సహాయ నిరాకరణను అహింసాత్మకంగా అనుసరించడం లేదని తేలుతోంది. బాంబేలో చౌరీచౌరాలో, ఇంకా అనేక చిన్న సంఘటనల్లో నాకు సూచనలు కనిపించాయి. అప్పుడు నేను ప్రాయశ్చిత్తం చేసుకున్నాను. దాని ఫలితాలు కనిపించాయి. కానీ ఈ హిందూ, ముస్లిం ఉద్రికత్తలు అనూహ్యం. కొహాత్ విషాదం గురించి విని భరించడం కష్టమైంది. నేను సబర్మతి నుంచి ఢిల్లీకి బయల్దేరేటప్పుడు, శాంతి గురించి ఉపన్యాసాలు చెప్పడం, సూక్తులు బోధించడం మాత్రమే చాలదని సరోజినీ దేవి నాకు రాసింది. మంచిపట్టుగా ఉండే ఔషధం కనిపెట్టాలని అంది. ఆ బాధ్యత నామీద ఆవిడ ఉంచడం మంచిదే అయింది. మన ప్రజల అపారమైన శక్తిని ఆచరణలోకి తేవడంలో నేను నిమిత్తమాత్రంగా ఉండలేదా? ఆ శక్తి ఆత్మ వినాశకరంగా తయారైతే నేను దానికి ఔషధం కనిపెట్టాలి."

★ ★ ★

"అమేథీ, సంభాల్, గుల్బర్గా సంఘటనలతో నేను తీవ్రంగా చలించిపోయాను. అమేథీ, సంభాల్ సంఘటన గురించి హిందూ, ముస్లిం మిత్రులు తయారు చేసిన నివేదికల్ని చదివాను. గుల్బర్గా వెళ్ళివచ్చిన హిందువుల, ముస్లింల సంయుక్త నివేదికనూ చూశాను. నా గుండె బాధతో పిండేసినట్లయింది. అయినా నాకు ఔషధం కనిపించలేదు. నేను ప్రాయశ్చిత్తం చేసుకోవాలి."

"నన్ను అభిమానిస్తున్నామని చెప్పే హిందువులకూ, ముస్లిములకూ ఇది హెచ్చరిక. వాళ్ళు నన్ను నిజంగానే అభిమానిస్తే, వాళ్ళ అభిమానానికి నేను యోగ్యుణ్ణే అయితే, వాళ్ళూ నాతోబాటు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. పరమాత్ముణ్ణి తమ హృదయాలలో తిరస్కరించినందుకు అలా చేసుకోవాలి.

"హిందువుల ముస్లిముల ప్రాయశ్చిత్తం ఉపవాసదీక్ష కాదు, తమ తప్పుల్ని సవరించుకోవడం. హిందూ సోదరుల పట్ల ముసల్మాన్‌కు ద్వేషభావం ఉండకూడదు, హిందువులకు ముస్లిం సోదరుల పట్ల ద్వేషం ఉండకూడదు. అదే అసలు ప్రాయశ్చిత్తం.

"నేను మిత్రులనెవళ్ళనూ సంప్రదించలేదు. బుధవారం నాడు నాతో చాలాసేపు దగ్గరగా ఉన్న హకీం సాహెబ్‌ని కూడా అడగలేదు. మౌలానా మహమ్మదాలీతో ఆతిథ్యం

తీసుకుంటున్నాను, అయినా ఆయన్నీ సంప్రదించలేదు. "అయితే ముస్లిం ఇంట్లో ఉపవాస దీక్ష పట్టడం సబబేనా? (అప్పుడు గాంధీ ఢిల్లీలో మహమ్మద్ ఆలీ అతిథిగా ఉన్నారు) అవును, సబబే. ఈ ఉపవాస దీక్ష ఏ ఒక్క వ్యక్తికీ వ్యతిరేకంగా చేస్తున్నది కాదు. ముస్లిం ఇంట్లో నేను ఉండడమే దానికి సాక్ష్యం. పరిస్థితుల్ని బట్టి నేను అలాంటి దీక్షని పట్టాల్సి వచ్చింది, దాన్ని ముస్లిం నివాసంలో పూర్తి చెయ్యాల్సి రావడం ఉచితం."

"మహమ్మద్-ఆలీ ఎవరు? ఉపవాసానికి రెండు రోజుల ముందు ఏదో స్వవిషయం మీద మాకు చర్చ జరిగింది. నాదైనది ఆయనదనీ, ఆయనదైనది నాదనీ నేను చెప్పాను. మహమ్మద్ ఆలీ ఇంట్లో లభించిన లాంటి హృదయపూర్వక ఆతిథ్యం నాకు ఎక్కడా లభించలేదని బహిరంగంగా చెపుతున్నాను. నాకేది కావాలో ముందే వాళ్ళకి తెలుసు. ఇంట్లో ఉన్న ప్రతివాళ్ళకూ నాకు సౌకర్యంగా ఏ ఇబ్బందీ లేకుండా ఉండేట్టు చెయ్యాలనే. డాక్టరు అయిన అన్సారీ, అబ్దుల్ రహమాన్‌లు నా వైద్య సహాయకులయ్యారు. నన్ను రోజూ పరీక్షిస్తున్నారు. నా జీవితంలో ఎన్నో ఆనందదాయకమైన సంఘటనలున్నాయి. ఈ సందర్భం లోగడ వాటికంటే తక్కువది కాదు. తిండే సర్వస్వం కాదు. పరిపూర్ణ ప్రేమని ఇక్కడ పొందుతున్నాను. అది నాకు భోజనం కంటే ఎక్కువ."

"ముసల్మాన్ స్నేహితులతో ఎక్కువ తిరగడం వల్ల హిందువుల మనోభావాలు ఏమిటో నాకు తెలియడం లేదని అనుకుంటూ ఉండడం నాకు తెలుసు. నా మనోభావమే హిందూ మనోభావం. వాళ్ళ మనోభావాలు తెలుసుకునేందుకు నేను వాళ్ళ మధ్యలో ఉండనవసరం లేదు. నాలోని ప్రతి అణువూ హిందువైనపుడు. మహా ప్రతికూల పరిస్థితుల్లో కూడా వికసించ లేకపోయినట్లయితే నా హిందూ మతం చాలా పేదది అన్నమాట. హిందూమతానికి ఏది అవసరమో నాకు సద్యోజాతంగా తెలుసు. కానీ, ముసల్మాన్ మనోభావాల తెలుసుకునేందుకు నేను పాటుబడాలి. మణిపూసల్లాంటి ముసల్మాన్లకి నేను ఎంత సన్నిహితంగా వస్తే అంత న్యాయబద్ధంగా ముస్లిములను వాళ్ళ చర్యల్ని నేను అంచనా కట్టగలను. ఈ రెండు మతవర్గాల మధ్యా అత్యుత్తమ సంధానంగా తయారవాలని నా తపన. కానీ అలా చేసే ముందు నేను హిందువుల్ని ప్రేమించినంతగా ముసల్మాన్లనీ ప్రేమిస్తున్నాని వాళ్ళకు నేను రుజువు చెయ్యాలి. అందర్నీ సమానంగా ప్రేమించమని నా మతం నాకు బోధిస్తోంది. అలా చేసేందుకు పరమాత్ముడు నాకు సాయపడుగాక! నా ఉపవాసం ఇతర విషయాలతోబాటుగా ఆ సమాన స్వార్థరహిత ప్రేమని నేను సాధించేందుకు తోడ్పడాలి."

ఈ ఉపవాస దీక్ష వల్ల ఐక్య సమావేశాలు జరిగాయి. అయితే పవిత్ర తీర్మానాలు తప్ప ఏమీ జరగలేదు. ఆ తీర్మానాన్ని ప్రకటిస్తూనే ఉల్లంఘించారు.

హిందూ ముస్లిం ఐక్యం సాధించేందుకు గాంధీ నిర్వహించిన పాత్ర మరొక విషయంతో ముగిద్దాం. మత సమస్యా పరిష్కారం కోసం జరిపిన చర్చల్లో గాంధీ అనుసరించిన వైఖరి

గురించింది అది. ఆయన ముస్లిములకి బ్లాంక్ చెక్ ఇచ్చాడు. కానైతే దానివల్ల ముస్లిములకి చిరాకెత్తిందంటే, ఏమంటే తప్పించుకోవడంగా వాళ్లు దాన్ని చూశారు. రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ ప్రత్యేక నియోజకవర్గాల్ని ఆయన వ్యతిరేకించాడు. కమ్యూనల్ అవార్డు వాటిని ముస్లిములకు ఇచ్చింది, కాని గాంధీ, కాంగ్రెస్ వాటిని అంగీకరించలేదు. కాని దాని మీద ఓటింగ్ జరిగినపుడు దాన్ని ఒప్పుకుంటున్నట్టుగాక, ఒప్పుకోనట్టుగాక చిత్రమైన వైఖర్ని అవలంబించారు.

అదీ హిందూ ముస్లిం ఐక్య సాధనలో గాంధీ చేసిన ప్రయత్నాల చరిత్ర. ఈ ప్రయత్నాల ఫలితాలు ఏమిటి? దీనికి సమాధానం కావాలంటే ఈ ఉభయ వర్గాలకీ 1920–1940ల మధ్య ఉన్న సంబంధాన్ని చూడాలి. ఆ సంవత్సరాల్లోనే వాళ్ల మధ్య ఐక్యం కోసం గాంధీ శ్రమపడ్డాడు. పార్లమెంటుకి వార్షికంగా సమర్పించే భారత వ్యవహారాల నివేదికలో ఈ సంబంధాల్ని బాగా వివరించారు. భారత ప్రభుత్వ చట్టం మేరకు అలా సమర్పించాల్సి ఉంది. ఈ నివేదికల్లో* నుంచే నేను సమాచారం సేకరించాను.

1920లో ఆదిలోనే మలబార్‌లో మోప్లాల తిరుగుబాటు అనేది జరిగింది. ఖుద్దామ్-ఇ-కాబి మక్కా దేవాలయ సేవకులు, కేంద్ర ఖిలాఫత్ కమిటీ అనే రెండు ముస్లిం సంస్థలు నిర్వహించిన ఆందోళన ఫలితం అది. భారతదేశం బ్రిటీష్‌వాళ్ల పాలన కింద దార్-ఉల్-హరబ్ అని ఆందోళనకారులు ప్రచారం సాగించారు. ముస్లిములు దీనికి వ్యతిరేకంగా యుద్ధం చెయ్యాలనీ, చెయ్యలేకపోతే ప్రత్యామ్నాయ సూత్రం అయిన హజరత్‌ను సాగించాలనీ ప్రచారం చేశారు. మోప్లాలు ఒక్క ఉదుట్న రెచ్చిపోయారు. అది బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిజంగా తిరుగుబాటే. బ్రిటీష్ ప్రభుత్వాన్ని కూలదోసి ఇస్లాం రాజ్యాన్ని స్థాపించడం దాని లక్ష్యం. చాకులు, కత్తులు, బల్లేలు రహస్యంగా ఉత్పత్తి అయ్యాయి. తెగించిన వాళ్లు కొందరు బ్రిటీష్ అధికారాన్ని ఎదిరించారు. ఆగస్టు 20న మోప్లాలకీ, బ్రిటీష్ వాళ్లకి మధ్య తీవ్రమైన ఘర్షణ జరిగింది, పిరునండిలో. రోడ్ల మీద అవరోధాలు పెట్టారు. టెలిగ్రాఫ్ తీగల్ని తెంపేశారు. రైల్వేలను ధ్వంసం చేశారు చాలాచోట్ల. పరిపాలన స్తంభించిపోయింది. వెంటనే మోప్లాలు స్వరాజ్యం స్థాపితం అయిందని ప్రకటించారు. ఎవరో ఆలీ మొదలియార్‌ను రాజును చేశారు. ఖిలాఫత్ జెండాలు ఎగిరాయి. ఎర్నాడ్, వల్లూరన ఖిలాఫత్ రాజ్యాలుగా చాటారు. బ్రిటీష్ ప్రభుత్వ వ్యతిరేక తిరుగుబాటుగా దాన్ని గురించి అర్థం చేసుకోవచ్చు. అయితే సంభ్రమాశ్చర్య కారకమయింది హిందువుల్ని మోప్లాలు చూసిన తీరు. హత్యలు, బలవంతంగా మత మార్పిళ్లు, దేవాలయాన్ని అపవిత్రం చెయ్యడం ఆడవాళ్ల మీద నీచంగా అత్యాచారం చెయ్యడం, కొల్లగొట్టడం, గర్భిణీ స్త్రీల గర్భాలు చీల్చడం, దహనకాండ, ధ్వంసం –ఒకటేమిటి, పరమ ఆటవిక చర్యలన్నీ జరిగాయి. నిరాఘాటంగా జరిగాయి. సైన్యాలు దిగి శాంతి భద్రతలు స్థాపించే దాకా హిందువుల మీద అత్యాచారాలు అలానే సాగాయి. హిందూ

* వాటిని "ఇండియా ఇన్ 1920" వగైరాలుగా పిలుస్తారు.

ముస్లిం అల్లర్లు కావు కాని ఎంతమంది హిందువులు చనిపోయారో, గాయపడ్డారో, మత మార్పిడికి గురయ్యారో తెలీదు కాని ఆ సంఖ్య చాలా విపరీతంగా ఉండే ఉంటుంది.

1921-22 సంవత్సరంలో మతకావేశాలు చల్లారలేదు. మొహర్రం ఉత్సవాల, తర్వాత తీవ్రమైన అల్లర్లు జరిగేయి, బెంగాల్లో, పంజాబ్‌లలో. పంజాబ్‌లో అయితే ముల్తాన్ మత విద్వేషం ఎంత తీవ్రస్థాయికి చేరిందంటే, మృతుల సంఖ్య ఓ మాదిరిగా తక్కువే అయినా, ఆస్తి నష్టం విపరీతంగా జరిగింది.

1922-23లో ఉభయుల మధ్యా సంబంధాలు శాంతియుతంగా సాగాయి. 1924లో మళ్లీ బెడిశాయి. కాని కోహట్‌లో అంతగా ఏ ప్రాంతంలోనూ ఉద్రిక్తత కనిపించలేదు. ఇస్లాం వ్యతిరేక తీవ్రగతం ఒకటి ప్రచురితం అవడం దానికి తక్షణ కారణమయింది. 1924 సెప్టెంబరు 9, 10 తేదీల్లో భయంకరమైన అల్లర్లు చెలరేగాయి. 155 మంది చనిపోయారు. క్షతగాత్రులయ్యారు. 9 లక్షల రూపాయల విలువ చేసే ఆస్తి నష్టం జరిగింది. అసంఖ్యాకంగా సరుకుల్ని కొల్లగొట్టేరు. ఆ భీతాంగ వాతావరణంలో కోహట్‌లోని హిందూ జనాభా వలస వెళ్లిపోయారు. చాలా దీర్ఘచర్చల తర్వాత ఒక రాజీ కుదిరింది. అల్లర్లకు దిగిన వాళ్ల మీద ఆరోపణల్ని ప్రభుత్వం ఉపసంహరించుకుంటామని, కొన్ని మినహాయింపుల్తో హామీ ఇచ్చింది. నష్టపోయిన వాళ్లు తమ వ్యాపారాల్ని తిరిగి ఆరంభించేందుకు ప్రభుత్వం అడ్వాన్సులు ఇచ్చింది. వడ్డీ లేకుండా కొన్ని సందర్భాల్లో 5 లక్షల మేరకి ఇచ్చింది. రాజీ కుదిరాక కూడా, వలసపోయిన వాళ్లు తిరిగి కోహట్ చేరుకున్నాక కూడా 1924-25 అంతా శాంతి లేకపోయింది. హిందూ – ముస్లిముల మధ్య ఉద్రిక్తత కొనసాగింది. దేశమంతటా అది ఉంది. వేసవి నెలల్లో చాలా విదారకమైన అల్లర్లు జరిగాయి. జులై నెలలో ఢిల్లీలో ఉభయ వర్గాలకూ మధ్య తీవ్రమైన కొట్లాట జరిగింది. నాగపూర్లోనూ అలా జరిగింది. చాలామంది హతులయ్యేరు. ఆగస్టు నెల దరిద్రంగా గడిచిందనే చెప్పాలి. లాహోర్, లక్నో, భగల్పూర్, నాగపూర్‌లలో అల్లర్లు రేగాయి. గుల్బర్గాలో తీవ్రమైన ఘర్షణ జరిగింది. సెప్టెంబర్-అక్టోబర్ నెలల్లో లక్నో, షాజహాన్‌పూర్, కంకినార, అలహాబాదుల్లో ఘర్షణలు రేగాయి. ఆ ఏడాది జరిగిన తీవ్రమైన ఘర్షణ కోహట్‌దే.

1925-26లో హిందూ-ముస్లిం విద్వేషం బాగా వ్యాపించింది. ఆ యేడు జరిగిన అల్లర్లకు సంబంధించిన విశేషం ఏమిటంటే అవి విస్తృతంగా వ్యాపించడం, చిన్న చిన్న గ్రామాల్లో కూడా అవి చెలరేగాయి. కలకత్తా, యు.పి., సెంట్రల్ ప్రావిన్సెస్, బొంబాయి ప్రెసిడెన్సీ – అన్నిచోట్లా తీవ్రమైన అల్లర్లు జరిగాయి. ఆగస్టు ఆఖర్లో కొన్ని చిన్నా చితకా గొడవలు జరిగాయి. చాలా ప్రాణ నష్టం జరిగింది. కొన్నిచోట్ల బాహాబాహీ యుద్ధం జరిగింది. కంకినారలో, కలకత్తాలో జనసాంద్రత ఎక్కువగా ఉండే జూట్‌మిల్లు ప్రాంతం అది – పోలీసుల వల్ల పెద్ద ఘర్షణ తప్పింది. గుజరాత్‌లో, హిందూ-ముస్లిం వైషమ్యం సాగింది. ఒక సందర్భంలో దేవాలయాన్ని అపవిత్రం చెయ్యడం జరిగింది. హిందువుల ముఖ్యమైన పండగ రామకల. అది

సెప్టెంబరు ఆఖర్లో వస్తుంది. అప్పుడు చాలా చోట్ల ఆందోళన కలిగించే పరిస్థితి ఏర్పడింది. యు.పి.లోని అలీఘర్‌లో దారుణమైన కొట్లాటలు జరిగాయి. శాంతిస్థాపన కోసం పోలీసులు కాల్పులు జరపాల్సి వచ్చింది. లక్నోలో అదే ఉత్సవం సమయంలో పరిస్థితి విషమించింది. అయితే స్థానిక అధికార్లు అల్లర్లని నివారించారు. అక్టోబరులో బొంబాయి ప్రెసిడెన్సీలోని షోలాపూర్‌లో తీవ్ర స్థితి ఏర్పడింది. అక్కడ స్థానిక హిందువులు హిందూదేవుళ్ల విగ్రహాల్ని రథం ఊరేగింపుగా తీసికెళుతున్నారు. అది మసీదు దగ్గరికి వచ్చే వేళకి, తగవు మొదలైంది. అది అల్లరిగా మారింది.

కలకత్తాలో ఏప్రిల్‌లో ఒక మసీదు దగ్గర ఘర్షణ మొదలైంది. కొంతమంది ఆర్యసమాజ్ వాదులకు ముస్లిములకు మధ్య మొదలైంది. అది ఏప్రిల్ 5 దాకా సాగింది. పోలీసు, మిలటరీ ఒక సందర్భంలో మాత్రమే గుంపుల్ని ఎదుర్కొన్నారు. అప్పుడు కాల్పులు జరిగాయి. చాలా గృహ దహనాలు జరిగాయి. మొదట మూడురోజుల్లోనూ 110 దహనాల్ని అగ్నిమాపక దళం నిరోధించింది. ఈ అల్లర్లలో అంతకు ముందెన్నడూ లేని విశేషం దేవాలయాల్ని పాడు చెయ్యడం. హిందువులు మసీదుల్ని పాడు చెయ్యడం. 44 మంది చనిపోయారు. 584 మంది గాయపడ్డారు. దోపిడీలు జరగడం, వ్యాపారం మూతపడడం. కలకత్తాలో చాలా నష్టం జరిగింది. ఏప్రిల్ 5 తర్వాత దుకాణాలు తెరిచారు. కాని ఉద్రిక్తత సాగింది. ఏప్రిల్ 13, 14 తేదీల్లో హిందూ పండుగ ఉంది. అంచేత అప్పటి దాకా సాగింది. 13న సిక్కులు కూడా ఊరేగింపు జరపాల్సి ఉంది. కాని ప్రభుత్వం అనుమతి ఇవ్వలేదు. 13, 14 తేదీల గురించిన భయాలు అదృష్టవశాత్తు తొలగిపోయాయి. 22 దాకా పైపైన శాంతి సాగింది. అప్పుడు ఒక్క ఉదుటన్న భగ్నం అయింది. వీధిలో జరిగిన ఓ చిన్న కొట్లాటతో అల్లరి మళ్లీ మొదలైంది. ఉభయ వర్గాల గుంపుల మధ్య సామాన్యంగా చిన్నగా మొదలయ్యే తగువులు చిలికి, చిలికి గాలివానలయ్యేవి. ఇప్పుడు మాత్రం దేవాలయాల మీద దాడులు జరగలేదు. గృహ దహనాలు, దోపిడీలు కూడా తక్కువే. కాని ఎక్కువ సంఘటనలు జరిగాయి. పోలీసుల జోక్యంతో విద్వేషపూరితమైన గుంపులు చెదిరిపోయాయి. 12 సందర్భాల్లో కాల్పులు జరపాల్సి వచ్చింది. ఈ దశలో మొత్తం హతుల సంఖ్య 66, క్షతగాత్రుల సంఖ్య 391. వ్యాపారం చాలా భగ్నమైంది. యురోపియన్ వ్యాపార సంస్థలకి ఇబ్బంది ఏమీ లేదు కాని, మార్వాడీ వ్యాపారం మాసిపోయింది. భీతాంగంతో చాలా వాణిజ్య సంస్థలు మూతపడ్డాయి. రెండురోజులు మాంసం సరఫరా నిలిచిపోయింది. చెత్తని తొలగించడం కూడా జరగలేదు. సరఫరాలు జరిగేందుకు ఏర్పాట్లు జరిగాయి. మునిసిపల్ పాకీ పనివాళ్లని మళ్ళీ పనిలోకి తెచ్చారు. పోలీసులకి రక్షణ నిమిత్తం విజ్ఞప్తి చేశారు. అల్లర్ల ప్రాంతం విస్తరించింది. కాని కలకత్తా మిల్లు ప్రాంతంలో అల్లర్లు జరగలేదు. కల్లోలిత ప్రాంతాల్లో క్రమపద్ధతిగా దాడులు చేసి, గూండాల్ని అరెస్టు చేసి, ఆయుధాల్ని స్వాధీనం చేసుకుని పోలీసులు పరిస్థితిని కాపాడారు. బ్రిటిష్ సైనికులు స్పెషల్ పోలీసు ఆఫీసర్లుగా వ్యవహరించారు. చెదురు మదురుగా జరిగిన హత్యలకి

గూండాలు బాధ్యులు. వాళ్ల కిరాయి హంతకులని ఉభయవర్గాలకీ అనిపించేది. అల్లర్లలో మరో విశేష అంశం ఏమిటంటే ఉభయపక్షాల వాళ్లూ రెచ్చగొట్టే కరపత్రాలు అచ్చువేసి పంచడం, కిరాయి గూండాల్ని పెట్టుకోవడం అల్లర్లు సాగుతూ ఉండేందుకు డబ్బు వాడేరు.

1926-27 అంతా మతపరమైన అల్లర్లే. 1926 ఏప్రిల్ నుంచి ప్రతినెలా అల్లర్లు సాగాయి. రెండు నెలలో ఏమో ప్రశాంతంగా గడిచాయి. అదేనా న్యాయ పరిభాష రీత్యానే. అసంఖ్యాక అల్లర్లనీ, ఘర్షణలను చూస్తే అవి చిల్లర గొడవల నుంచో, వ్యక్తుల సొంత గొడవల నుంచో పుట్టేయని తెలుస్తుంది. ఉదా : ఓ హిందూ దుకాణదారుకీ, మహమ్మదీయ ఖాతాదారుడికీ మధ్య ఏ మత ఉత్సవం దగ్గరో, హిందువులు మసీదు దగ్గర ఊరేగింపులు జరుపుతూ సంగీతం వెయ్యడం లాంటివి. ఒకటి రెండు అల్లర్లు మామూలు ఉద్రిక్తత వల్ల వచ్చినవి. అలాంటి వాటిలో కొట్ట వచ్చినట్టు కనిపించే సంఘటన ఢిల్లీలో జూన్ 24న జరిగింది. సమ్మర్దంగా ఉన్న ఓ వీధిలో ఓ గుర్రం దూరడంతో అల్లర్లు మొదలయ్యాయన్న భావం కలిగింది. దాంతో రెండు పక్షాలూ ఒకళ్ళు మీద ఒకళ్ల కర్రలతో, ఇటుకలతో దాడి చేసుకున్నాయి.

కలకత్తాలో 1926 మేలో జరిగిన రెండు అల్లర్లతో బాటుగా 40 అల్లర్లు ఆ ఏడంతా 1927 ఏప్రిల్ దాకా కొనసాగాయి. 197 మంది హతులయ్యారు. 1578 గాయపడ్డారు. ఆ అల్లర్లు విస్తారంగా వ్యాపించాయి. బెంగాల్, పంజాబ్, యు.పి.లు బాగా దెబ్బ తిన్నాయి. బెంగాల్ ఘరంగా నష్టపోయింది. ఆ యేడాదిలో చాలా భాగం సింధ్‌లో బొంబాయి ప్రెసిడెన్సీలో హిందూ ముస్లిముల మధ్య ఉద్రిక్తతలు కొనసాగాయి. కలకత్తా ఆ ఏడాదంతా ఉద్రిక్తంగా ఉంది. జూన్ 1న ఓ చిన్న తగువు జరిగింది. అది అల్లర్లగా మారింది. 40 మంది క్షతగాత్రులయ్యారు. తర్వాత కొంత విరామం వచ్చింది. జూలై 15న ఓ ముఖ్యమైన హిందూ పండగ. ఆ సందర్భంలో హిందువులు కొన్ని మసీదు ప్రాంతంలో సంగీతం వాయించారు. అది ఘర్షణకు దారి తీసింది. 14 మంది చనిపోయారు. 116 మంది గాయపడ్డారు. ఆ మర్నాడు మహమ్మదీయుల పండగ, మొహరం. ఆరోజున అల్లరి చెలరేగింది. 19, 20, 21, 22 తేదీల్లో మళ్లీ పుంజుకొంది. చెదురుమదురుగా గొడవలు 23, 24, 25లలో జరిగాయి. 28 మంది హతులయ్యారు. 22 మంది గాయపడ్డారు. కలకత్తాకు పొరుగునున్న హౌరాలో అల్లర్లు జరిగాయి. ఇద్దరు చనిపోయారు, 30 మంది గాయపడ్డారు. ఏప్రిల్, మే నెలల్లో గృహదహనాల వల్ల తీవ్రమయ్యాయి. అదృష్టవశాత్తూ జూలై అల్లర్లలో ఇలా జరగలేదు. అగ్నిమాపక దళాన్ని నాలుగు సందర్భాల్లోనే పిలిచారు.

1927-28కి వస్తే ముఖం మీద కొట్టినట్టు ఈ వాస్తవాలు గోచరిస్తాయి. ఏప్రిల్ నుంచి సెప్టెంబరు దాకా 1927లో 25కి తక్కువ కాకుండా అల్లర్లు జరిగాయి. 10 యు.పి.లో, 6 బొంబాయిలో, పంజాబ్‌లో 2, బెంగాల్ బీహార్, ఢిల్లీ, ఒరిస్సాల్లో 2 చొప్పున జరిగాయి.

అధికభాగం పడుగలప్పుడే జరిగాయి. ఈ అల్లర్లలో 103 మంది హతులయ్యారు. 1,084 మంది గాయపడ్డారు.

లాహోర్‌లో 1927 మే 4,7 తారీఖుల మధ్య జరిగింది తీవ్రమైన అల్లరి. రెండు వర్గాల మధ్య ఉద్రిక్తత రేగింది. సిక్కులకి, మహమ్మదీయులకి మధ్య సందు దొరకగానే అల్లరిగా మారింది. వాయువేగంగా అది వ్యాపించింది. 27 మంది హతులయ్యారు. 272 మంది గాయపడ్డారు. వ్యక్తుల మీద చెల్లాచెదురుగా జరిగిన దాడుల వల్లే ఆ సంఖ్య పెరిగింది. పోలీసులు, సైనికులు రంగంలో దిగారు. దాంతో విద్వేష వర్గాల మధ్య భారీ కొట్లాట్లు జరగలేదు. అక్కడక్కడ హత్యలు, దాడులు జరిగేయన్నారు రెండు మూడురోజులు. లాహోర్ వీధులు ప్రశాంతత చూసేందుకు ముందుగానే ఇలా జరిగింది.

మే లాహోర్ అల్లర్ల తర్వాత ఒక రెండు నెలలు మళ్ళీ విరామం. చిన్న సంఘటన మాత్రం జరిగింది. బీహార్, ఒరిస్సాలో జూన్‌లో జరిగింది. కాని జులైలో 5 తక్కువ కాకుండా అల్లర్లు జరిగాయి. తీవ్రమైంది పంజాబ్‌లోని ముల్తాన్‌లో మొహరం అప్పుడు జరిగింది. 13 మంది హతులయ్యారు. 24 మంది గాయపడ్డారు. ఆగస్టులో అల్లర్లు ఇంకా జరిగాయి. 9 అల్లర్లు జరిగాయి. రెండింటిలో తీవ్ర ప్రాణనష్టం కలిగింది. బీహార్ చెట్టమాపట్నంలో ఓ మత తగాదాతో అల్లరి జరిగి 11 మంది చనిపోయారు. 100 మంది గాయపడ్డారు. బరైలీలో ఓ ఊరేగింపు జరుపుతూ ఉండగా అల్లరి జరిగింది. 14 మంది చనిపోయారు. 165 మంది గాయపడ్డారు. అదృష్టవశాత్తు మత కల్లోలాల్లో ఇది మలుపు అయింది. దాంతో సెప్టెంబరులో 4 అల్లర్లే జరిగాయి. ఒకటి సెంట్రల్ ప్రావిన్సెస్‌లోని నాగపూర్-అల్లరి సెప్టెంబరు 4న జరిగింది. లాహోర్‌లో జరిగిన దాని తర్వాత, ఇదే అతి దారుణం, నష్టదాయకం అయిన అల్లరి. ముస్లిముల ఊరేగింపుతో అంటుకున్న రవ్వ అది. అయితే అందుకు ఇంధనం ముందే తయారైంది. 19 మంది చనిపోయారు, 123 మంది గాయపడ్డారు. ఆ సమయంలో చాలామంది ముస్లిములు నాగపూర్ వదిలి వెళ్ళిపోయారు.

ఆ సంవత్సరంలో హిందూ ముస్లిం సంబంధాల్లో ఒక వర్గం వాళ్లు మరో వర్గం వాళ్ల మీద జరిపిన దాడులు ఏవీ తక్కువ లేదు. వాటిల్లో అతి తీవ్రం అయినవి 'రంగీలా రసూల్', 'రిసాల వర్తమాన్'ల మీద జరిగాయి. అవి రెండు ప్రచురణలు. మహమ్మద్ మీద దాడి జరిగింది. ఆ సందర్భంలో చాలామంది ప్రాణాలు పోయాయి. చాలా అనాగరికంగా జరిగాయి. లాహోర్‌లో వ్యక్తుల మీద దాడులవల్ల 1927లో భయం ఆందోళన కొనసాగాయి.

'రంగీలా రసూల్'* వల్ల కలిగిన ఉద్రిక్తత చాలా దూరం సాగింది. కేంద్రం కంటే వాయవ్య సరిహద్దు రాష్ట్రం దాకా పాకాయి. ఈ ప్రాంతంలో అల్లరి సూచనలు జూన్‌లోనే కనిపించాయి.

* రంగీలా రసూల్ 'సీతాకా చినాలా'కు జవాబుగా రాసింది. రాముని భార్య సీత వేశ్య అని నిందిస్తూ ఓ ముస్లిం రాసిన కరపత్రం.

జూలై రెండవ భాగంలో ఉద్రిక్తత తారాస్థాయికి చేరింది. బ్రిటిష్ సరిహద్దుల్లో స్థానిక అధికార్ల నైపుణ్యం వల్ల యుక్తి వల్ల గొడవలు తప్పాయి. లేకపోతే చాలా తీవ్రమై ఉండేవి. బ్రిటిష్ సరిహద్దుల్లో హిందువులకు వ్యతిరేకంగా ఆర్థిక బోయ్‌కాట్‌ని బాగా ప్రచారం చేశారు. ముఖ్యంగా పెషావర్‌లో, కాని ఆ ప్రకారం నెగ్గలేదు. హిందువుల్ని ఒకటి రెండు సందర్భాల్లో అవమానపరచినా, ఒకటి రెండు గ్రామాల్లో, దోషుల్ని అరెస్టు చెయ్యడం, తగిన శిక్షా స్మృతిని అమలు పరచడంతో శాంతి స్థాపితమైంది. సరిహద్దు కావలా తెగలవాళ్లకు ఆవేశం ఎక్కువ. ప్రవక్త మీద దాడి జరిగింది. దానివల్ల తీవ్రమైన పరిణామాలు వచ్చాయి. ప్రఖ్యాత ముల్లా ఒకరు హిందువులు, హిందువులకు వ్యతిరేకంగా ఆఫ్రికన్, షిన్‌వారితోను ఖైబర్ కనుమ దాపుల్లోను బోధించడం సారవంతమైన నేలలో విత్తనాలు చల్లినట్టే అయింది. హిందువుల్ని బహిష్కరించమని ఆయన విజ్ఞప్తి చేశారు. హిందువులు దేశంలోని ఇతర హిందువులకి దూరంగా, వాళ్ల అభిప్రాయాల్ని మన్నించడం లేదని రాసి ఇవ్వాలని అన్నాడు. ఖైబర్ ఆఫ్రికన్ తెగలు రెండు కుయిఖెల్ హిందువుల్ని మొదటగా బహిష్కరించాయి. జూలై 22న దాంతో షిన్‌వారీలు హిందువులకు హెచ్చరిక చేశారు. ఏమైనా, కొంతమంది హిందువుల నిష్క్రమణం తర్వాత షిన్‌వారీలు మిగిలిన వాళ్లని ఉండనిచ్చారు.

ఖైబర్ దాటి వెళ్ళిపోయే హిందువులపై కొంతమంది దురుసుగా ప్రవర్తించారు. రెండు సందర్భాల్లో రాళ్లని విసిరారు, అదృష్టవశాత్తు ప్రాణహాని జరగలేదు. మూడవ సందర్భంలో ఓ హిందువు గాయపడ్డాడు. చాలా సొమ్ముని ఎత్తుకపోయారు. కాని పూర్తిగా దాన్ని తిరిగి సంపాదించారు. దోషుల్ని పట్టుకుని జరిమానా వేశారు. తర్వాత, తెగ ప్రాంతం నుంచి హిందువుల మార్గానికి పికెటింగ్ ఏర్పాట్లు జరిగాయి. రాజకీయ ఏజెంట్ ఒత్తిడి వల్ల ఆఫ్రికా జూలై ఆఖరికి హిందూ బాయ్‌కాట్‌ని వదిలివేసింది. రిసాల వర్తమానానికి సంబంధించిన విషయం తేల్చకుండా ఉంచారు. తర్వాతి వారంలో చాలా హిందూ కుటుంబాలు లండీ కొటాల్‌లో ఉన్నవి పెషావర్‌కి వెళ్ళిపోయాయి. తెగ నాయకుల హామీలని నమ్మలేదు. కాని ఒక కుటుంబం నుంచి ఒకో సభ్యుని వెనక దిగవిడిచారు తమ ప్రయోజనాలు చూసేందుకు. మొత్తం మీద 450 మంది హిందువులు స్త్రీలు, పురుషులు, పిల్లలు ఆగస్టు మధ్య నాటికి పెషావర్ చేరారు. గడ్డు కాలం భయంగా తగ్గుతూ ఉన్నాగానీ, కొంతమంది హిందువుల్ని ఖాయంగా బహిష్కరించారు. కొంతమందిని వెళ్ళిపోయేట్టు చేశారు. కొంతమంది భయంతో వెళ్లిపోయారు. వాళ్ల ఇరుగుపొరుగు వాళ్ల సానుభూతి , బహిష్కరణ, ఐచ్ఛిక నిష్క్రమణం సాదృశ్యం కాకుండా జరిగాయి. ఎన్నో తరాలుగా హిందువులు అక్కడ నివసించారు. చాలామంది మన్నన పాత్రులు, నిజానికి తెగ వ్యవస్థలో ముఖ్య భాగమయ్యారు. వాళ్ల రక్షణ కోసం తెగలవాళ్లు రక్తం చిందించారు. మొత్తం మీద 450 మంది హిందువులు ఖైబర్ కనుమదాటి వచ్చేశారు. వాళ్లల్లో 330 మంది వెనక్కి తిరిగి వెళ్ళారు, 1927 ఆఖరు నాటికి మిగిలిన వాళ్ళు ప్రస్తుతానికి స్థిరపడ్డారు, బ్రిటిష్ ఇండియాలోని మరింత భద్రమైన పరిస్థితుల్లో.

1928-1929 ఓ మాదిరిగా 27-28 కంటే శాంతియుతంగానే ఉంది. లార్డ్ ఇర్విన్ కేంద్ర శాసనసభలోనూ, బయటా ఉపన్యసించి, రెండు వర్గాల మధ్యా, రాజకీయ సమస్యలకి సంబంధించి, మంచి బలం కలిగించాడు. అదృష్టవశాత్తు సైమన్ కమీషన్ విచారణ వచ్చింది. ఆ కమిటీని 1929లో నియమించారు. విభిన్న వర్గాల మధ్య నించీ శక్తినీ, శ్రద్ధనీ ఇముడ్చుకున్నాయి. దాంతో స్థానిక కారణాలకు ప్రాముఖ్యం తగ్గింది. రాజ్యాంగం లాంటి పెద్ద సమస్యల పట్ల దృష్టిమళ్లింది. మత పరిస్థితి మెరుగైంది. 1929 మార్చి 21 దాకా ఆ పన్నెండు నెలల్లోనూ అల్లర్ల సంఖ్య 22 మాత్రమే. సంఖ్య తక్కువే అయినా దాడికి గురైనవాళ్ల సంఖ్య పెరిగింది. బొంబాయి అల్లర్లలో 204 మంది చనిపోయారు. వెయ్యిమంది గాయపడ్డారు. వీటిలో బొంబాయిలో పక్షం రోజులపాటు జరిగిన అల్లర్లలో 149 మంది చనిపోయారు. 739 మంది గాయపడ్డారు. ఈ 22 అల్లర్లలోనూ 7 లేదా మూడో వంతు ముస్లిముల బక్రీద్ పండుగరోజున జరిగాయి. ఈ పండుగ హిందూ ముస్లిం సంబంధాల్లో ఎప్పుడూ ప్రమాదకరంగానే ఉంది. ముస్లిమ్‌లకి అది జంతుబలి రోజు, ఆ జంతువు సామాన్యంగా ఆవే అయి ఉండడంతో ఉభయ వర్గలకూ మధ్య స్వల్ప ఉద్రిక్తత చాలు భగ్గుమని అంటుకోవడానికి. బక్రీదు అల్లర్లలో రెండు మాత్రమే తీవ్రమైనవి.

ఆ రెండూ పంజాబ్‌లో జరిగాయి. మొదటిది అంబాలా జిల్లాలోని ఓ గ్రామంలో జరిగింది. పదిమంది చనిపోయారు, 9 మంది గాయపడ్డారు. నరణాం జిల్లాలోని సాఫ గ్రామంలో జరిగింది. అది ఢిల్లీకి 27 మైళ్ల దక్షిణాన ఉంది. ఎక్కువమంది ముస్లిములుండే గ్రామం. ఆ గ్రామాన్ని హిందూ రైతులు చుట్టుముట్టారు. సాఫ గ్రామవాసులు ఆవుని బలి యిస్తున్నారని విని వాళ్లు అభ్యంతరం పెట్టారు. వాళ్లు ఎంచుకున్న ఆవు సింధు రైతుల పొలాల్లో మేసేదని కారణం చెప్పారు. దాని మీద తగువు పెరిగింది. పోలీస్ సూపరింటెండెంట్, రెవెన్యూ అధికార్లు ఊళ్లోకి వెళ్లారు. తగువులో ఉన్న ఆవుని బలి ఇవ్వరని హామీ ఇచ్చారు. సూపరింటెండెంట్ ఆ కోరికని తిరస్కరించాడు. దాంతో గుంపు ఉద్రిక్తమైంది. పోలీసుల మీద రాళ్లు రువ్వింది. సూపరింటెండెంట్ గుంపుని చెదరిపొమ్మని హెచ్చరించాడు. కాని ఫలితం లేకపోయింది. మరింత హెచ్చరిక చేస్తూ ఆయన గాలిలోకి రివాల్వరు పేల్చాడు. అయినా గుంపు ముందుకు సాగింది. దాని మీద ఆయుస కాల్పులు జరపమని ఆదేశించాడు. మొదట ఒకసారి మాత్రం కాల్పులు జరిగాయి. కాని గుంపు వెనక్కి మళ్లకపోవడంతో, మరో రెండుసార్లు కాల్పులు జరిగాయి. గుంపు మెల్లగా చెదరిపోయింది. పులి నోట్లో పశువుల్ని తోలుకుపోయింది.

పోలీసులు ఈ గొడవలో ఉండగా, కొంతమంది హిందూ రైతులు సాఫా గ్రామంలో మరో చోట్లోకి వెళ్లి గ్రామానికి నిప్పు పెట్టారు. కాని పోలీసులు వాళ్లని తరిమేశారు. నలుగురైదుగురు గాయపడ్డారేమో. మొత్తం మీద 14 మంది చనిపోయారు. 33 మంది గాయపడ్డారు. పంజాబ్ ప్రభుత్వం న్యాయాధికారిని విచారణకి పంపింది. ఆయన నివేదిక జూలై ఆరవతేదీన వచ్చింది.

పోలీసుల చర్యని సమర్థించింది. కాల్పులు మితిమీరి జరిగాయని కాని, గుంపు దురన్యాయంగా ఎదుట లేకుండా వెళ్లిపోయినప్పుడు జరిగాయని కాని అభిప్రాయపడలేదు. పోలీసులు కాల్పులు జరపకపోయినట్లయితే పోలీసుల జీవితాలే ప్రమాదం పాలయ్యేవని అంది. అంతేకాదు సాఫా ప్రజలు కూడా చాలామంది పోయి ఉండేవారని అంది. ఆఖరుగా, ఆ న్యాయాధికారి చెప్పిందేమంటే సాఫా గ్రామాన్ని ధ్వంసం చేసి ఉంటే 24 గంటల్లోనే మహోధృతమైన మత కల్లోలం చెలరేగి ఉండేదని.

ఖరగ్‌పూర్ అల్లర్లలో కూడా తీవ్ర ప్రాణనష్టం జరిగింది. అలాంటివి ఖరగ్‌పూర్‌లో రెండు జరిగాయి. మొదటిది మొహరం అప్పుడు, రెండవది 1928 సెప్టెంబర్ 1న, ఆవు సాకుగా జరిగింది. మొదటి అల్లరిలో 15 మంది చనిపోయారు. 21 మంది గాయపడ్డారు. రెండవ దాంట్లో 9 మంది చనిపోయారు, 35 మంది గాయపడ్డారు. కాని, బొంబాయిలో జరిగిన వాటికీ, వీటికీ పోలికా లేదు. ఫిబ్రవరి ఆరంభంలో జరిగిన ఆ అల్లర్లలో, ముందే చూసినట్టుగా 149 మంది చనిపోయారు. 700 మంది గాయపడ్డారు.

1929-30 మధ్య మత కల్లోలాలు మరింత విరామంతో జరిగాయి. అసలివి అంతకు ముందు వాళ్లల్లో ప్రజా జీవితంలో ఒక భాగమై పోయాయి. భారత ప్రభుత్వం వారి ప్రకారం గమనీయమైనవి 12 మాత్రమే. బొంబాయిలో జరిగిన అల్లర్లు నిజంగా తీవ్రమైనవే. ఏప్రిల్ 23తో మొదలై అవి చెదురుమదురుగా మే మధ్యదాకా సాగాయి: 35 మంది చనిపోయారు, 200 మంది క్షతగాత్రులయ్యారు. ఏప్రిల్‌లో ఉద్రిక్తతకు కారణభూతమైంది, లాహోర్‌లో రాజ్‌పాల్ హత్య. 'రంగీలీ రసూల్' అన్న ఆయన కరపత్రమే ప్రవక్త మహమ్మద్ మీద బాణం ఎక్కు పెట్టింది. దానివల్లనే అంతకు ముందు ఏడు అల్లర్లు రేగాయి. అనేక న్యాయపర, రాజకీయ హక్కులు వచ్చాయి. అదృష్టవశాత్తు రెండు వర్గాలూ శ్లాఘనీయమైన సంయమనాన్ని ప్రదర్శించాయి ఆ హత్యా సమయంలో. అదే మాదిరి ఒక నిందితుడ్ని ఉరితీసి అంత్యక్రియలు జరిపిన సందర్భంలోనూ రెండు వర్గాలూ ఉన్నాయి. ఉద్రేకం, ఆవేశం రేగినా తీవ్రమైన పరిణామాలు ఏర్పడలేదు.

1930-31 సంవత్సరం లో సివిల్ డిసోబిడియన్స్ ఉద్యమం వచ్చింది. దేశమంతటా అల్లర్లు, కల్లోలాలూ చెలరేగాయి. అవి అధికభాగం రాజకీయ స్వభావం ఉన్నటువంటివే. వాటిలో నిమగ్నమైన పక్షాలు పోలీసులు కాంగ్రెస్ వాదులూనూ, కాని భారతదేశంలో సర్వదా జరిగేటట్టు రాజకీయ అల్లర్లు మతపరమైన మలుపు తీసుకున్నాయి. సివిల్ డిసోబిడియన్స్ ఉద్యమంలో చేరమని కాంగ్రెస్‌వాదులు బలవంతమైన ఒత్తిళ్లు చేశారు. ముస్లిములు దానిని తిరస్కరించారు. దాని వల్ల అది జరిగింది. ఫలితంగా, ఆ సంవత్సరం రాజకీయ కల్లోలంతో మొదలై అనేక, తీవ్రమైన మత పర కల్లోలాలతో ముగిసింది. ఆ అల్లర్లలో అతి దారుణమైంది సింధ్‌లోని సూక్కూర్ పరిసరాల్లోనూ, సుక్కర్‌లోనూ ఆగస్టు 4-11 తేదీల మధ్య జరిగింది.

ఓ వంద గ్రామాలకు అది పాకింది. బెంగాల్‌లోని మైమెన్ సింగ్ జిల్లా కిషోర్‌గంజ్ సబ్ డివిజన్‌లో జూలై 12, 15 నాడు చెలరేగిన దౌర్జన్యం కూడా భారీస్థాయిలోనే ఉంది. వీటికి తోడు ఆగస్టు 3న వాల్లియా (యు.పి.)లో మత కల్లోలం రేగింది.

సెప్టెంబర్ 6న నాగపూర్‌లో, సెప్టెంబరు 6, 7 తేదీల్లో బొంబాయిలో అల్లర్లు జరిగాయి. అక్టోబరు 31న తిరుచెందూర్‌లో (మద్రాసు) హిందూ - క్రిస్టియన్ అల్లర్లు జరిగాయి. ఫిబ్రవరి 12న, అమృతసర్‌లో ఓ హిందూ జౌళి వర్తకుణ్ణి చంపబోయారు. అతను పికెటర్లని ఎదిరించడం అందుకు కారణం. అంతకు ముందు రోజున బెనారస్‌లో ఇలాంటి అల్లర్లే జరిగి తీవ్ర పరిణామాలు వచ్చాయి. ఈ సంఘటనలో బాధితుడు ఓ ముస్లిము వర్తకుడు. అతని మీద జరిగిన దాడి మరికొంత కారణం అయింది. అప్పటికే ఉత్తర భారతదేశం అంతటా హిందూ–ముస్లిం సంబంధాలు ఒరుసుకుపోయి ఉండటంతో, దీని ఫలితంగా తీవ్రమైన మత కల్లోలం చెలరేగి అయిదు రోజులు సాగింది. విపరీతంగా ఆస్తినష్టం జరిగింది. అనేకమంది ప్రాణాలు కోల్పోయారు. ఈ దశలో జరిగిన ఇతర మత ఘర్షణల్లో విల్లామరీ (బెంగాల్)లో జనవరి 25న జరిగినవీ, 31వ తేదీన రావల్పిండిలో జరిగినవీ ఉన్నాయి. 1931 సంవత్సరం మొదటి రెండు నెలల్లోనూ యావత్ ఉత్తర భారతంలోనూ మత సంబంధాలు చాలా దిగజారి పోయాయి. ఫిబ్రవరి నాటికే తీవ్రమైన కల్లోలం బెనారస్‌లో జరిగింది. దీనికి కారణం వ్యాపారం కుంటుపడి పోవడంతో ముస్లిముల్లో రగిలిన అసంతృప్తి, కాంగ్రెస్ కార్యకలాపాల వల్ల ఏర్పడ్డ అశాంతీ, గందరగోళమూనూ. ప్రభుత్వంతో చర్చలు జరుపుతూ ఉండడం వల్ల కాంగ్రెస్‌కు ప్రాముఖ్యం పెరిగింది. దానివల్ల ముస్లిముల్లో చాలా భయాందోళనలు కలిగాయి. తత్ఫలితంగా రెండు మతవర్గాల మధ్య ఉద్రిక్తత పెరిగింది, సంబంధాలు దిగజారాయి. మార్చి నెలలో యు.పి.లో ఈ ఉద్రిక్తత చాలా ఎక్కువ అయింది. ఆ నెల 14-16 తేదీల మధ్య మీర్జాపూర్ జిల్లాలో తీవ్రమైన అల్లరి చెలరేగింది. 17వ తేదీన ఆగ్రాలో కొట్లాట సంభవించింది. అది 20వ తేదీ దాకా సాగింది. ధన్‌బాద్‌లో (బెంగాల్) 28న అమృతసర్ జిల్లాలో 30వ తేదీన మత కల్లోలం చెలరేగింది. దేశంలోని చాలా ప్రాంతాల్లో ఆ ఉభయ వర్గాల మధ్య సంబంధాలు విపరీతంగా బెడిసిపోయేయి.

అస్సాం రాష్ట్రంలోని లకిమ్‌పూర్ జిల్లా దిగ్బోయ్‌లో చెలరేగిన మత కల్లోలంలో ఒక హిందువు, ముగ్గురు ముస్లిములు చనిపోయారు. బెంగాల్‌లోని అసల్‌సోల్ డివిజన్‌లో మొహరం పండుగప్పుడు మతకల్లోలం రేగింది. ఆ ఏడాది బీహార్, ఒరిస్సాలలో ముఖ్యంగా సరాన్‌లో కొంత మతోద్రిక్తత తలెత్తింది. మొత్తం మీద 16 మతకల్లోలాలు, చట్ట వ్యతిరేక సభలు జరిగేయి. బక్రీద్ పండగప్పుడు షాహాబాద్‌లో (భాబువా సబ్ డివిజన్) ఓ కొట్లాట జరిగింది. ఆవుని బలి ఇవ్వడం జరిగిందన్న అపోహతో ఓ 300 మంది హిందువులు పోగయేరు. రెండువందల మంది ముస్లిములు లాఠీలతో బరిసెలతో, కత్తులతో హిందువుల మీద దాడి

చేశారు. ఒక హిందువు తర్వాత చనిపోయాడు. మొత్తం మీద స్థానిక అధికార్లు వాళ్లని శాంత పరిచారు. ఆ ఉత్పాతం ఇంకా వ్యాపించకుండా పోలీసులు తీసుకున్న తక్షణ చర్యలూ, రాజీ కమిటీ నియామకం నిరోధించాయి. మొహరం పండగప్పుడు హాంఫీర్‌లో రెండు స్వల్ప సంఘటనలు జరిగాయి. ఓ సందర్భంలో హిందువులు దాడి చేశారు, ఇంకో సందర్భంలో ముస్లిములు దాడి చేశారు. ఆ ఏడే మద్రాస్ ప్రెసిడెన్సీలో కూడా అనేక మతపర స్వభావం ఉన్న అల్లర్లు జరిగాయి. రెండు పక్షాల మధ్య సంబంధాలు బాగా బెడిసిపోయాయి. అతి తీవ్రమైన అల్లరి ఆ ఏడాది జూన్ 8న వెల్లూర్‌లో జరిగింది. ముస్లిముల ఊరేగింపు ఒకటి తాజియాలితో హిందూ దేవాలయం దగ్గర వెళ్లడంతో అది జరిగింది. అది ఎంత తీవ్రం అయిందంటే శాంతి భద్రతల్ని స్థాపించడానికి పోలీసులు కాల్పులు జరపాల్సి వచ్చింది. చెదురుమదురు కొట్లాటలు తర్వాత రెండు మూడురోజుల దాకా సాగాయి. జూలై 13న సేలం పట్టణంలో హిందూ ముస్లిం ఉద్రిక్తత వల్ల ఓ పేజీ తలెత్తింది. దానికి షేవాపేట్‌లో భారీగా జనం హాజరైన ఓ కుస్తీ పోటీలో ఎవరు విజేతలన్నది కారణం. సేలంకు దగ్గరలోని కిచిపాలియంలో అక్టోబరు నెలలో మరో అల్లరి రేగింది. కొంతమంది హిందువులు ఏదో వీధి ఆట ఆడుకుంటూ ఉంటే కొంతమంది ముస్లిములు దానికి ఆటంకం కల్గించడం అందుకు కారణం. కర్నూలు జిల్లాలోని పోలికల్లులో మార్చి 15న హిందూ–ముస్లిం అల్లర్లు చెలరేగాయి. హిందువులు ఉరేగింపు తీసుకెళ్లే దారి గురించి తగూ దానికి కారణం. కాని పోలీసులు స్వల్ప బలప్రయోగంతో మూకల్ని చెదర గొట్టారు. పంజాబ్ 1929లో జరిగిన 813 కల్లోలాలతో పోతే ఆ ఏడు 907 సం ఘటనలు జరిగాయి. వాటిలో అధికశాతం మత స్వభావంతో ఉన్నవే. రెండు వర్గాల మధ్య ఉద్రిక్తత రాష్ట్రంలోని చాలా ప్రాంతాల్లో కొనసాగింది. యు.పి.లో 1930లో మత విద్వేషాలు అంత ఘోరంగా లేకపోయినా 1931వ సంవత్సరం మొదటి మూడునెలల్లో చాలా తీవ్రంగా ఉన్నాయి. కొంతకాలం పాటు సివిల్ డిస్ఒబీడియన్స్ ఉద్యమం నీడలో పడిపోయాయి. ఆ విద్వేషాల సూచనలు బాహాటంగానే కనిపించాయి. విభేదాల కారణాలు ఎప్పుడంత పట్టుగాను ఉన్నాయి. డెహ్రాడూన్, బులంద్ షహర్‌లలో మామూలు తరహా మత కల్లోలాలు రేగాయి. బాల్లియా నగరంలో దారుణమైన అల్లరి జరిగింది. అది కూడా హిందూ ఊరేగింపు గురించిన తగాదాతోనే మొదలైంది. పోలీసులు కాల్పులు జరపాల్సి వచ్చింది కూడా. ముత్రా, ఆజంఘర్ మైన్పూరి తదితర ప్రాంతాల్లో కూడా అల్లర్లు జరిగాయి.

1931-32 సంఘటనల ప్రభావం రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్ రాజ్యాంగం మీద స్పష్టంగా కనిపించింది. ముస్లిముల్లోనూ, ఇతర అల్ప సంఖ్యాక వర్గాల్లోనూ భయాందోళనలు కలిగాయి. మెజార్టీ సూత్రం రీత్యా నడిచే రాజ్యాంగం కింద తమ స్థానం ఏమిటోనని భయాలు కలిగేయి. రాజ్యాంగ భవిష్యత్ గురించిన సమీప దర్శనం ఆ కాన్ఫరెన్స్ ఇచ్చింది. అప్పటిదాకా అధినివేశ ప్రతిపత్తి అన్న ఆదర్శం ఏదో అస్పష్ట, అసాధారణ భావంగానే ఉంది తప్ప ముందుకు సాగలేదు. కాని ప్రారంభ సమావేశంలో రాజాల ప్రకటనల వల్ల ఓ స్పష్టమైన దృక్పథంతో, ఫెడరల్ రూప

ప్రభుత్వం కేంద్రంలో బాధ్యత కలిగింది. అంచేత ముస్లిములు తాము పరిస్థితిని అంచనా వేసుకునే సమయం వచ్చిందని అనుకున్నారు. ఈ ఇబ్బందికర పరిస్థితి ఇర్విన్ - గాంధీ ఒప్పందంతో తీవ్రమైంది. అది కాంగ్రెస్‌కు ఒక హోదాని కలిగించినట్టే కనిపించింది. ప్రభుత్వం మీద విజయం సాధించామన్న భావం, కాంగ్రెస్ వాళ్ల ఉత్సాహం ముస్లిముల భయాల్ని తొలగించేట్టు కనిపించలేదు. ఆ ఒప్పందం కుదిరిన మూడు నెలల్లోనే కాన్పూర్‌లో ఆటవికమైన మత కల్లోలాలు జరిగాయి. కాంగ్రెస్‌వాదులు భగత్‌సింగ్ స్మృత్యర్థం - (ఆయన్ని మార్చి 23న ఉరితీశారు) హర్తాల్ పాటించమని మహమ్మదీయ దుకాణదార్లను ఒత్తిడి చెయ్యడం వల్ల ఆ కల్లోలాలు రేగాయి. మార్చి 24న హిందువుల దుకాణాల్ని కొల్లగొట్టారు. 25న దహనకాండ జరిగింది. దుకాణాల్నీ, దేవాలయాల్నీ తగలబెట్టారు. మాడ్చి మసి చేశారు. అల్లకల్లోలం, దహనాలు, దోపిడీలు, హత్యలు, దావానలంలా వ్యాపించాయి. అయిదువందల కుటుంబాలు కొంపా, గోడు వదలి పారిపోయి ఓ ఊళ్లో తలదాచుకున్నారు. డాక్టర్ రామచంద్ర అతి దుర్భరమైన బాధల పాలిట పడ్డాడు. అతని కుటుంబంలో అందర్నీ - భార్యనీ, వృద్ధ తల్లిదండ్రుల్నీ అందర్నీ నరికేశారు. వాళ్ల మృతదేహాల్ని మురికి కాల్వల్లోకి విసిరేశారు. ఆ హత్యాకాండలోనే గణేశశంకర్ విద్యార్థి ప్రాణాలు కోల్పోయాడు. కాన్పూర్ మతకల్లోలాల విచారణ కమిటీని నియమించారు. ఆ అల్లర్లు ముందెన్నడూ లేనంత ఘోరమైనవనీ, దారుణమైనవనీ ఊహించలేనంత వేగంగా వ్యాపించాయనీ ఆ నివేదిక తెలియజేసింది. మూడ్రోజుల పాటు హత్యలు, దహనాలు, దోపిడీలు, విపరీతంగా సాగాయి. పరిస్థితిని బెనక్కుండా అదుపులోకి తెచ్చేదాకా అలా సాగాయి. లెక్క తేలిన హతుల సంఖ్య 300 ఉంది. కాని ఇంకా ఎక్కువ మందే చనిపోయి ఉండచ్చు. ఆ సంఖ్య నాలుగైదు వందలు ఉండొచ్చు. ఎన్నో దేవాలయాల్నీ, మసీదుల్నీ పాడు చేశారు, తగులబెట్టారు. ఎన్నో ఇళ్లని తగలబెట్టారు, దోచుకున్నారు.

కాంగ్రెస్‌వాళ్లు రెచ్చగొట్టేట్టు ప్రవర్తించడం గాని, లేకపోతే ఈ మతకల్లోలం చెలరేగి ఉండదు. ఇంత ఘోరమైన మతకల్లోలం భారతదేశంలో ఎన్నో ఏళ్లుగా జరగలేదు. అదీగాక, ఈ అల్లర్లు నగరం నుంచి గ్రామాలకు పాకాయి. ఆ తర్వాత కొన్నిరోజుల పాటు గ్రామాల్లో చెదురుమదురు ఘర్షణలు కొనసాగాయి.

1932-33వ సంవత్సరం మత కల్లోలాలు, అల్లర్లు లేకుండా ఓ మాదిరిగా ప్రశాంతంగానే సాగింది. సామాన్యంగా అరాచకత్వాన్ని అణచటం, రాజ్యాంగంలో ముస్లిముల స్థానానికి సంబంధించిన ఊగిసలాటని తొలగించడం పరిస్థితి మెరుగుపడడానికి ఒక మేరకు కారణాలు.

కాని, 1933-34 అంతా దేశంలో మత ఉద్రిక్తత పెరుగుతూనే ఉంది. అరాచకత్వం రేగుతూనే ఉంది. అవి హోలీ, ఈద్, మొహరం లాంటి పండగ సందర్భాల్లోనే కాకుండా నిత్య జీవిత ఘటనల నుంచి కూడా తలెత్తాయి. సంవత్సరం మొదలైన దగ్గర్నుంచీ మతసామరస్యం

దిగజారుతూనే ఉందని దాన్నిబట్టి విశదమైంది. హెూలీ పండగప్పుడు మతకల్లోలాలు బెనారస్, కాన్పూర్‌లలో రేగాయి. పంజాబ్ రాష్ట్ర లాహెూర్‌లో రేగాయి. పెషావర్‌లో రేగాయి. బక్రీద్ పండగప్పుడు యు.పి.లోని అయోధ్యలో గొడవలు జరిగాయి. గోవుని బలి ఇచ్చారని దానికి కారణం చెప్పారు. ఆ పండగప్పుడే బీహార్‌లోని భాగల్పూర్‌లో, ఒరిస్సాలో, మద్రాస్‌లోని కన్ననోర్‌లో అల్లర్లు జరిగాయి. యు.పి.లోని ఘజియాపూర్ జిల్లాలో తీవ్రమైన అల్లర్లు జరిగాయి. చాలామట్టుకి అతి చిల్లర కారణాలకు – ఉదాహరణకు ఢిల్లీలో దారమ్మట వెళ్లే హిందువుల మీద పొరపాటున ఓ ముస్లిం దుకాణదారు ఉమ్మివేసిన కారణానికి చెలరేగాయి. బ్రిటిష్ ఇండియాలో పెరిగిన మత కలహాల ప్రభావం ఇతర రాష్ట్రాల మీదా పడింది. అలాంటి ఘర్షణలే జరిగాయి.

జూన్ – అక్టోబర్ మాసాల్లో కనిపించిన మత అరాచకత్వం ఉభయ పక్షాల్లోనూ, లోతుగా పాతుకుపోయిన విద్వేషానికి సూచకం. జూన్, జూలై నెలల్లో హిందువులకు గాని, మహమ్మదీయులకు గాని పెద్ద పండుగలు లేవు. ఆ నెలలు అల్లర్లు లేకుండానే గడిచాయి. అయితే బీహార్‌లోని కొన్ని ప్రాంతాల్లో అదనపు పోలీసు బలగాల్ని నియమించాల్సి వచ్చింది. ఆగ్రాలో పల రావణ కాష్టం లాంటి తగూ మొదలైంది. హిందువుల ఇళ్లల్లో మత కర్మకాండలప్పుడు గొడవగా ఉంటోందని, వాటివల్ల తమ ప్రార్థనలకి పక్కనే ఉన్న మసీదుల్లో అంతరాయం కలుగుతుందనీ, ముస్లిములు అభ్యంతర పెట్టారు. ఆ తగువు పరిష్కారం కాకముందే జూలై 20న అల్లర్లు రేగాయి. మళ్లీ సెప్టెంబరు 2న రేగాయి. ఈ అల్లర్లలో నలుగురు చనిపోయారు. 80 మందికి పైగా గాయపడ్డారు. మద్రాస్‌లో సెప్టెంబరు 3న జరిగింది. ఒకళ్లు చనిపోయారు. 13 మంది గాయపడ్డారు. దానికి కారణం ప్రవక్త గురించి కష్టం కలిగించేట్టు హిందువులు ఓ పుస్తకాన్ని ప్రచురించడం. అదే నెలలో పంజాబ్, యు.పి.లలో అనేక చోట్ల చిల్లర ఘర్షణలు జరిగాయి.

1934-35 సంవత్సరంలో జూన్ 29న లాహెూర్‌లో తీవ్రమైన గొడవ జరిగింది. సిక్కు దేవాలయ ప్రాంగణంలో (దాన్ని షహీద్‌గంజ్ గురుద్వారా అంటారు) మసీదు ఉండటం మీద ముస్లిములకీ సిక్కులకీ పేచీ వచ్చింది. దానిమీద అల్లర్లు రేగాయి. కొంతకాలంగా లోపల్లోపల గొడవ ఉడుకుతూనే ఉంది. సిక్కులు మసీదుని కొల్లగొట్టడం మొదలెట్టగానే ద్వేషం తీవ్రమైంది. ఆ కట్టడం చాలా కాలంపాటు లిటిగేషన్‌కి మూలంగా ఉండింది. సిక్కుల హక్కుని కోర్టు ధృవీకరించింది.

జూన్ 29 నాటి రాత్రి మూడు నాలుగు వేల మంది ముస్లిములు గురుద్వారా ముందు పోగయ్యేరు. లోపల ఉన్న సిక్కులకూ, ఈ మూకకూ మధ్య కొట్లాట జరిగేది కాని అధికారులు తక్షణం చర్యలు తీసుకోవడంతో తప్పింది. మసీదును ఇక కూలగొట్టమని సిక్కుల నుంచి తర్వాత హామీ తీసుకున్నారు. తర్వాత వారంలో ఉభయపక్షాల న్యాయవాదులకీ మధ్య రాజీ

కుదిర్చేందుకు గట్టి ప్రయత్నాలు జరిగేయి. ఆ సమయంలో సిక్కులు అతివాదుల ప్రోద్బలంతో మళ్లీ మసీదును ధ్వంసం చేయబోయారు. దాంతో అధికారులు ఇబ్బందిలో పడ్డారు. సిక్కులు చట్టపర హక్కుల మేరకే చేశారు. విధ్వంసాన్ని ఆపు చెయ్యడానికి ఉన్న ఒక్క మార్గమూ కాల్పులు. ఆ భవనం అంతా సిక్కులు కిక్కిరిసి ఉన్నారు. అది సిక్కుల ఆరాధనా స్థానం పరిధిలోనే ఉంది. అప్పుడు కాల్పులు జరిగేవి. ఎంత రక్తపాతం ఉండేదో చెప్పలేం. మత కారణాల రీత్యా, రాష్ట్రమంతటా సిక్కుల్లో తీవ్ర ఆందోళన జరిగేది. పోనీ తాని ప్రభుత్వం ఊరుకుంటే ముస్లిములలో అశాంతి పెచ్చరిల్లి ఉండేది, అదీ మత కారణాల రీత్యానే. చెదురుమదురుగా సిక్కుల మీద ముస్లిములు దాడి చేసేవాళ్లు, ప్రభుత్వ బలగాల మీద కూడా చేసేవాళ్లే.

ఉభయపక్షాల నాయకుల మధ్యా చర్చలు ఏదో అంగీకారాన్ని కుదిర్చి పెట్టేవేనని అనుకున్నారు. కానీ తుంటర్లు కొందరు సాటి మతస్థుల్ని రెచ్చగొట్టారు. ముఖ్య దోషుల్ని అరెస్ట్ చేసినా ఉద్రిక్తత తగ్గలేదు. ముస్లిములకు మరో మసీదు ఏర్పాటు చేస్తామని ప్రభుత్వం చెప్పింది. అయినా లాభం లేకపోయింది. పరిస్థితి జూలై 19న ఇంకా క్షీణించింది. ఆ తర్వాత రెండురోజుల్లోనూ పరిస్థితి ప్రమాదకరంగా తయారైంది. కేంద్ర పోలీస్‌స్టేషన్‌ను అక్షరాలా ముట్టడించడం జరిగింది. ఆ గుంపులు భీతావహం సృష్టించేట్టు కనిపించాయి. కాల్పులు లేకుండా గుంపుల్ని చెదరగొట్టడానికి పదేపదే ప్రయత్నాలు జరిగాయి. సైనికులు ఇక చేసేది లేక జూలై 20న రెండుసార్లు 21న ఎనిమిదిసార్లు కాల్పులు జరిపారు. మొత్తం మీద 23 రౌండ్ల కాల్పులు జరిగాయి. 12 మంది చనిపోయారు. ఇక క్షతగాత్రుల సంఖ్య - గాయాలు స్వల్పమైనవే అయినా పోలీసుల్లోనూ సైనికుల్లోనూ చాలా ఎక్కువ.

కాల్పుల్లో మూకలు చెదిరిపోయాయి. మళ్లీ గుమికూడలేదు. ఇతర రాష్ట్రాల నుంచి పోలీసులను పిలిపించారు. సైనికదళాల్ని సంపుటీకరించారు. వేగంగా పాలనాపరమైన అదుపును స్థాపించారు. కాని మత నాయకులు పుల్లల్ని పెడుతూనే ఉన్నారు. సివిల్ లిటిగేషన్ తిరిగి మొదలైంది. కాని కొన్ని ముస్లిం సంస్థలు మరిన్ని కోరికలు కోరాయి.

లాహోర్ పరిస్థితి ఆ ఏడాదంతా ఆందోళన కలిగిస్తూనే ఉంది. నవంబరు 6న ఒక సిక్కును ఒక ముస్లిం చాలా గాయపరిచాడు. మూడురోజుల తరువాత హిందువులు సిక్కులు భారీ ఊరేగింపు జరిపారు. ఘర్షణ లేకుండా చూడ్డమనే కార్యకర్తల సంకల్పం. కాని తీవ్రమైన కొట్లాట జరిగింది. ఆ మర్నాడు ఇంకా అల్లరి జరిగింది. కాని పోలీసులు, సైనికులు చేసిన మంచి పనివల్ల ఆ కొట్లాటలు ముదరలేదు. లేకపోతే చాలామంది హతులై ఉండేవాళ్ళు.

1935 మార్చి 19న కరాచీలో తీవ్రమైన సంఘటన జరిగింది. నాధురమల్ అనే హిందువును హత్య చేసినందుకు అబ్దుల్ కయ్యూమ్ అనే ముస్లింను ఉరి తీశారు. ఈ హిందువే ప్రవక్తమీద చెడ్డగా రాసినవాడని ముందే అనుకున్నాం. అబ్దుల్ కయ్యూమ్ మృతదేహాన్ని జిల్లా

మెజిస్ట్రేట్, పోలీసుల సాయంతో తీసుకువెళ్ళి మృతుని కుటుంబానికి ఖననం నిమిత్తం అప్పగించాడు. శ్మశాన వాటికలో 25 వేల మంది గుంపు పోగైంది. శ్మశాన వాటికలో ఖననం కానిద్దామని కయ్యూమ్ బంధువులు అనుకున్నా గుంపులో తీవ్ర ఆవేశంతో ఉన్న కొందరు ఊరేగింపు తియ్యాలని పట్టుబట్టారు. స్థానిక అధికార్లు గుంపును లోపలికి రానివ్వకూడదని అనుకున్నారు. రానిస్తే గొడవలు జరుగుతాయి. అయినా పోలీసుల ప్రయత్నాలు విఫలమయ్యాయి. దాంతో రాయల్ సస్సెక్స్ రెజిమెంట్‌ను శాంతి స్థాపన కోసం పిలిపించారు. కాల్పులు జరపక తప్పలేదు. ఉన్మత్తావేశంలో ఊగిపోతున్న మూక ముందుకు సాగకుండా కాల్పులు జరపాల్సి వచ్చింది. 47 రౌండ్ల కాల్పులు జరిగాయి. 47 మంది హతులయ్యారు. 134 మంది గాయపడ్డారు. మరిన్ని బలగాల రాకతో గుంపు ముందుకు సాగకుండా నిరోధించడం జరిగింది. క్షతగాత్రుల్ని హాస్పిటల్‌కు తీసుకెళ్ళారు. ఇంకా గొడవలు జరగకుండా కయ్యూమ్ దేహాన్ని ఖననం చేశారు.

1935 ఆగస్టు 25న సికింద్రాబాద్‌లో మత కల్లోలం జరిగింది.

1936వ సంవత్సరంలో నాలుగు మతకల్లోలాలు జరిగాయి. ఏప్రిల్ 14న ఆగ్రా జిల్లాలోని ఫిరోజాబాద్‌లో అతి భీకరమైన కల్లోలం జరిగింది. ఒక ముస్లిం ఊరేగింపు ప్రధాన విపణి మార్గం గుండా వెడుతోంది. హిందువుల ఇంటి కప్పుల మీద నుంచి ఇటికలు విసిరారని ఆరోపించారు. దాంతో ముస్లిములకు ఆగ్రహం వచ్చింది. వాళ్ళు హిందువుల ఇళ్ళకు నిప్పుపెట్టారు. రాధాకృష్ణా దేవాలయానికి దగ్గర్లో ఉన్న డా. జీవారామ్ ఇంటికి నిప్పుపెట్టారు. ఆ ఇంట్లోని 11 మంది హిందువులు, ముగ్గురు పిల్లల్తో సహా సజీవదహనం అయిపోయారు. బొంబాయి ప్రెసిడెన్సీలోని పూనాలో 1936 ఏప్రిల్ 24న మరో హిందూ ముస్లిం కల్లోలం రేగింది. ఏప్రిల్ 277న మాంఫీర్ జిల్లాలోని జమాల్‌పూర్‌లో హిందూ ముస్లిం కొట్లాటజరిగింది. నాల్గవ హిందూ–ముస్లిం కల్లోలం బొంబాయిలో 1936 అక్టోబరు 15న జరిగింది.

1937వ సంవత్సరం అంతా మతకల్లోలాలే. 1937 మార్చి 27న హెూలీ ఊరేగింపు అపుడు పానిపట్‌లో కల్లోలం రేగింది. 14 మంది చనిపోయారు. 1937 మే 1వ తేదీన మద్రాస్‌లో జరిగిన కల్లోలంలో 50 మందికి గాయాలయ్యాయి. మే నెల మొత్తం సెంట్రల్ ప్రావిన్సిస్‌లో, పంజాబ్‌లో కల్లోలాలు రేగుతూనే ఉన్నాయి. షికాపూర్‌లో జరిగినది చాలా భీతాంగం కలిగించింది. జూన్ 18న అమృత్‌సర్‌లో సిక్కు–ముస్లిం కల్లోలం జరిగింది. శాంతిభద్రతల స్థాపన కోసం బ్రిటిష్ సైన్యాన్ని పిలవాల్సి వచ్చింది.

1938లో రెండు మత కల్లోలాలు జరిగాయి, ఒకటి అలహాబాద్‌లో మార్చి 26న మరొకటి ఏప్రిల్‌లో బొంబాయిలోను.

1939లో 6 హిందూ–ముస్లిం మతకల్లోలాలు జరిగాయి. జనవరి 21న అవన్‌సోల్‌లో కల్లోలం జరిగింది. ఒకళ్ళు చనిపోయారు. 18 మంది గాయపడ్డారు. తర్వాత ఫిబ్రవరి 11న

కాన్పూర్‌లో అల్లరి జరిగింది. 42 మంది చనిపోయారు. 200 మంది గాయపడ్డారు. 800 మంది అరెస్ట్ అయ్యారు. మార్చి 4న బెనారస్‌లో అల్లరి జరిగింది. మార్చి 5న కలకత్తా దగ్గరి కేశాపూర్‌లో జరిగింది. జూన్ 19న కాన్పూర్‌లో రథ జాతరప్పుడు మళ్ళా ఘర్షణ జరిగింది.

1939 నవంబర్ 20న సింధ్‌లోని సుక్కూర్‌లో తీవ్రమైన కల్లోలం జరిగింది. ముస్లిమ్‌లు మంజిల్‌గాహ్ అనే కట్టడాన్ని బలవంతంగానైనా సరే లాక్కోబోయారు. ఆ కట్టడం ప్రభుత్వం ఆధీనంలో ఉంది. ప్రభుత్వ ఆస్తి దాన్ని బదలాయించడానికి హిందువులు అభ్యంతర పెట్టారు. ఇపుడు బొంబాయి హైకోర్టు జడ్జిగా ఉన్న ఇ. వెచ్చకని ఆ కల్లోల సంఘటనల గురించి విచారణ జరిపే నిమిత్తం నియమించారు. ఆయన ఎంతమంది హతులైందీ, ఎంతమంది క్షతగాత్రులైందీ ఈ కింది అంకెలు ఇచ్చారు*.

| తాలూకాలు | జరిగిన హత్యలు | | గాయపడ్డవాళ్ళు | | గాయాలవల్ల తరువాత చనిపోయినవాళ్ళు | |
|---|---|---|---|---|---|---|
| | హిందువులు | ముస్లిమ్‌లు | హిందువులు | ముస్లింలు | హిందువులు | ముస్లింలు |
| సుక్కూర్ బస్తీ | 20 | 12 | 11 | 11 | 1 | – |
| సుక్కూర్ తాలూకా | 2 | 2 | 23 | – | 5 | – |
| షికాపూర్ తాలూకా | 5 | – | 11 | – | 2 | – |
| గర్హియాసిన్ తాలూకా | 24 | – | 4 | – | – | – |
| రోహ్రి తాలూకా | 10 | – | 4 | – | – | – |
| పనోఅకిల్ తాలూకా | 6 | – | 3 | – | – | – |
| ఘర్కి తాలూకా | 1 | – | 1 | – | – | – |
| మీర్‌పూర్‌మథిల్ తాలూకా | – | – | 1 | – | – | – |
| ఉబావేరో తాలూకా | 4 | – | 3 | 1 | 1 | – |
| | 142 | 14 | 58 | 12 | 9 | – |

ఎన్నో భీకర, దారుణ సంఘటనలుగా పేర్కొన్న వాటిలో కొన్ని :

పరమ దారుణ సంఘటన గోసార్జీ గ్రామంలో 20వ తేదీ రాత్రి జరిగింది. అది సుక్కూర్‌కు 8 మైళ్ళ దూరంలో ఉన్న గ్రామం. షికాపూర్ నుంచి 16 మైళ్ళు, జిల్లా మెజిస్ట్రేట్ ప్రభుత్వానికి ముందర పంపిన నివేదికలో అది అసమగ్రం అని వాళ్ళే అన్నారు. 27 మంది హిందువుల్ని ఆ రాత్రి హత్య చేశారట. సాక్ష్యాల విచారణలో తేలిన సంఖ్య 37.

గోసార్జిలో ఒక కాంట్రాక్టరు అయిన విమల్‌మల్ చెప్పిందేమంటే సత్యాగ్రహ సమయంలో

* సింధ్ పబ్లిక్ ఇంక్వైరీస్ యాక్ట్ 3వ నిబంధన కింద ఆ విచారణ కమిటీకి వేశారు. 1939లో సుక్కూర్‌లో జరిగిన అల్లర్ల గురించి విచారణ జరిపేందుకు, మె. 65. హతులైన హిందువుల సంఖ్య కింద ఇచ్చిన సంఖ్య 142, అది తప్పనిస్తుంది. అది 72 అయి ఉండాలి.

ప్రముఖ హిందువులు జమీందార్ దగ్గరకు ఏదో నివేదించేందుకు వెళ్ళారు. అక్కడ జమీందార్ ఖాన్‌సాహెబ్ అమీర్ బక్ష. అప్పుడు అతను సుక్కూర్‌లో ఉన్నాడు. వాళ్ళ రక్షణ బాధ్యత తనదని ఆయన వాళ్ళకి హామీ ఇచ్చాడు. 20వ తేదీన ఆఖాన్‌సాహెబ్ గోసార్జిలో ఉన్నాడు. ఆ ఉదయమే ముఖీమాథూర్‌మల్ హత్య జరిగింది. హిందువులు ఖాన్‌సాహెబ్ దగ్గరకు రక్షణకోసం వెళ్ళారు. మళ్ళీ ఆయన అదే హామీ ఇచ్చాడు. కాని ఆ రాత్రి మూకుమ్మడి హత్యాకాండలూ, దోపిడీలూ జరిగాయి. 37 మంది హతులయ్యారు. వారిలో 7గురు మహిళలు. ఆ మర్నాడు ఉదయం తను బాగెర్జి సబ్ ఇన్‌స్పెక్టర్ దగ్గరకి వెళ్ళానని అది గోసార్జికి ఒక మైలు దూరం అని, కానీ తనను ఠాణా నుంచి తన్ని బయటకు తోసేసారని విమల్‌మల్ చెప్పాడు. అప్పుడు తను షికాపూర్ వెళ్ళాట్ట. పంచాయతీకి ఫిర్యాదు చేశాడట. ఏ అధికారికి ఫిర్యాదు చెయ్యలేదట. తర్వాత బాగెర్జి సబ్ – ఇన్‌స్పెక్టర్‌ని సెక్షన్ 211 భారత శిక్షాస్మృతి కింద ప్రాసిక్యూట్ చేశార్ట. గోసార్జి హత్యలకు సంబంధించి ఎవళ్ళనూ అరెస్టు చెయ్యనందుకు అతనికి శిక్ష పడింది.

హిందువులకు హామీ ఇచ్చిన జమీందార్ ఖాన్ సాహెబ్ అమీర్‌బక్ష కోర్టుకు హాజరవుతున్నాడని, కోర్టుకు పిలిపించేరని, కోర్టు సాక్షిగా ఉన్నాడని అన్నారు. తను గోసార్జి గ్రామానికి ఓ మైలు దూరంలో ఉంటున్నాడు. 20వ తారీకు మెహ్రామల్ హత్య తర్వాత సబ్ ఇన్‌స్పెక్టర్ బాగెర్జి గోసార్జికి వెళ్ళాడు. అతను హెూషిర్‌గా ఉన్నాడు. హిందువులు సాయం అడగలేదని, ఏదన్నా అల్లరి రేగుతుందన్న భయమూ కనిపించలేదట. 20వ తేదీ రాత్రి తనకు ఒంట్లో బాగోలేదని, హత్యలు గురించి వినలేదని చెప్పాడు. మంజిల్‌బాగ్‌ని ఖాళీ చేయించడం గురించి విన్నానని అన్నాడు. జాగ్రత్తగా ఉండమని గోసార్జి గ్రామస్థులకు చెప్పాడట. అలా అని సాక్ష్యంలో చెప్పాడు. 21 ఉదయమే గోసార్జికి వెళ్ళాడట. తనను గోసార్జి రక్షకునిగా చూస్తారని అన్నాడు.

వెస్టన్ ఇలా అన్నాడు*. "ఈ సాక్షి చెప్పిందాన్ని నమ్మడం అసంభవం అతనికి అన్ని బాగా తెలుసు, గోసార్జిలో 20వ తేదీ రాత్రి గొడవ జరుగుతుందని తెలుసు. ఊరికే ఇంటిలో ఉండిపోయాడంతే."

ఈ నివేదిక హృదయ విదారకమైన, బాధాకరమైన దృశ్యాన్ని ప్రదర్శించడం లేదని ఎవరు అనగలరు. వరుసక్రమంలో ఉండటం వల్ల ఆ కల్లోలాలు దారుణ దృశ్యం నశించి మనకు అందదు. జీవితం స్తంభించిపోయింది. ఆర్థిక జీవితం కుంటు పడిపోయింది. ఎంతలా అక్కడ జీవితం స్తంభించిపోయిందో చూపించడానికి బొంబాయి రాష్ట్ర అల్లర్లను తిరిగి చెప్పాల్సి వస్తుంది. తిరిగి చెపితే సాధారణ దృశ్యం ఇలా ఉంటుంది.

ప్రెసిడెన్సీని వదలిపెట్టి నగరం మేరకు మాత్రమే పరిమితం అయితే చాలా దారుణంగా ఉంటుందనడంలో సందేహమే లేదు. మొదటి హిందూ–ముస్లిం కల్లోలం 1893లో జరిగింది.

* అదే నివేదిక పే. 66-67

తర్వాత కల్లోల రహిత శాంతి 1929 దాకా ఉంది. ఇక ఆ తర్వాత నుంచి తల తిరిగిపోయేటంత ఘోర సంఘటనలు జరిగాయి. ఫిబ్రవరి 1929 నుంచి 1938 ఏప్రిల్ దాకా - 9 ఏళ్ళ కాలం పదికి తక్కువ కాకుండా కల్లోలాలు జరిగాయి. 1929లో రెండు మత కల్లోలాలు జరిగాయి. ఒక దాంట్లో 149 మంది హతులు, 739 మంది క్షతగాత్రులు. అది 36 రోజులు సాగింది. రెండవదాంట్లో 35 మంది హతులు, 109 మంది క్షతగాత్రులు, అది 22 రోజులు సాగింది. 1930లో రెండు కల్లోలాలు జరిగాయి. 1932లో మళ్ళీ రెండు జరిగాయి. మొదటిది స్వల్పమైందే. రెండవ దాంట్లో 217 మంది చనిపోయారు. 2,713 మంది గాయపడ్డారు. అది 49 రోజులు సాగింది. 1933 మళ్ళీ కల్లోలం జరిగింది. దాని వివరాలు తెలియవు. 1936లో ఒకటే జరిగింది. 93 మంది చనిపోయారు. 632 మంది గాయపడ్డారు. అది అలా 65 రోజులు రగులుతూనే ఉంది. 1937 అల్లర్లలో 11 మంది చనిపోయారు, 85 మంది గాయపడ్డారు. 21 రోజులు సాగింది. 1938లో అల్లరి రెండున్నర గంటలు మాత్రమే ఉంది. కాని ఆ వ్యవధిలోనే 12 మంది చనిపోయారు. వందమంది పైగా గాయపడ్డారు. మొత్తం 9 ఏళ్ళ 2 నెలల కాలాన్ని – 1929 ఫిబ్రవరి నుంచి 1938 ఏప్రియల్ వరకూ ఒక్క బొంబాయి నగరంలోనే హిందూ ముస్లిమ్ రక్తసిక్త యుద్ధం 210 రోజులు సాగింది. ఈ కాలంలో 550 మంది చనిపోయారు. 4,500 మంది గాయపడ్డారు. ఇందులో గృహదహనాలు దోపిడీ ద్వారా జరిగిన ఆస్తినష్టాన్ని లెక్కపెట్టలేదు.

1920 నుంచి 1940 వరకూ హిందూ ముస్లిముల మధ్య సంబంధాల గురించిన నివేదిక అలాంటిది. హిందూ ముస్లిం ఐక్యానికి గాంధీ చేసిన ఉద్విగ్న ప్రయత్నాలూ పక్కపక్కనే ఉంచి యీ నివేదికను చదివితే చాలా బాధాకరంగా ఉంటుంది. హృదయం ద్రవించేలా ఉంటుంది. భారతదేశంలో మధ్య మధ్య చిన్న చిన్న సాయుధ శాంతి విరామాలను మినహాయిస్తే, హిందూ ముస్లిముల మధ్య చెలరేగిన అంతర్యుద్ధాల 20 సంవత్సరాల సుదీర్ఘ నివేదికే యిది అనటంలో అతిశయోక్తి ఎంతమాత్రమూ లేదు.

ఈ అంతర్యుద్ధంలో ప్రాధమికంగా బలయినవారు మగవారు. అయితే స్త్రీలందరూ మొత్తానికి అత్యాచారాల నుంచి తప్పించుకోలేకపోయారు. ఈ మత కలహాల్లో ఎంతమంది స్త్రీలు బాధపడ్డారో బహుశా అంతగా తెలియరాలేదనే అనిపిస్తుంది. భారతదేశం అంతటికీ సంబంధించిన గణాంక వివరాలు లభ్యం కావటం లేదు. అయితే బెంగాల్‌కు సంబంధించిన కొన్ని వివరాలు మాత్రం ఉన్నాయి.

పాత బెంగాల్ విధాన పరిషత్‌లో 1932 సెప్టెంబరు 6న బెంగాల్ ప్రాంత పరిధిలో స్త్రీలను అపహరించుకు పోవటాన్ని గురించి కొన్ని ప్రశ్నలు అడగటం జరిగింది. అప్పుడు పాలనలో ఉన్న ప్రభుత్వం 1922-1927 మధ్య అపహరించబడిన స్త్రీల సంఖ్య 568 అని ప్రభుత్వం తెల్పింది. వీరిలో 101 మంది అవివాహితులు. 467 మంది వివాహితులు. అలా

అపహరింపబడిన స్త్రీలు ఏ మతానికి సంబంధించిన వారని ప్రశ్నించటం జరిగింది. అందుకు సమాధానం ఇలా ఉంది. 101 మంది అవివాహితుల్లో 64 మంది హిందువులు. 29 మంది ముస్లిములు. నలుగురు క్రైస్తవులు. తక్కిన నలుగురిదీ ఇదమిత్థమని తెలియవు. అలాగే 467 వివాహిత స్త్రీలలో 331 మంది హిందువులు, 122 మంది ముస్లిములు, ఇద్దరు క్రైస్తవులు, తక్కిన ఇద్దరు క్రైస్తవులు, తక్కిన 12 మంది విషయం తెలియదు. ఈ గణాంకాలన్నీ రిపోర్టు చేసిన కేసులకు సంబంధించినవి లేదా రిపోర్టు చేసిన తర్వాత దర్యాప్తు చేయబడని కేసులకు సంబంధించినవి. సాధారణంగా 10 శాతం కేసులు మాత్రమే రిపోర్టు చేయబడి లేదా దర్యాప్తు చేయబడి ఉంటాయి. తక్కిన 90 శాతం ఎలాంటి దర్యాప్తుకూ నోచుకోవు. బెంగాల్ ప్రభుత్వం వెల్లడించిన ఈ వాస్తవాలను ఆధారంగా తీసుకుని పరిశీలిస్తే 1922-27 మధ్య అయిదు సంవత్సరాల కాల వ్యవధిలో బెంగాల్‌లో 35,000 మంది స్త్రీలు అపహరించబడ్డారని చెప్పవచ్చు.

ఏ మతం వారైనా స్త్రీలపట్ల చూపించే వైఖరిని ఒక సూచికగా తీసుకోవచ్చు. ఇరు మతాల మధ్య స్నేహం లేదా శత్రుత్వాలను సూచించే సరైన సూచిక ఇదే. బెంగాల్‌లోని గోవిందపూర్ గ్రామంలో 1936, జూన్ 27న జరిగిన ఒక కేసు నిజంగా మనల్ని ఆలోచింప చేస్తుంది. 1936, ఆగస్టు 10వ తేదీ 40 మంది మహమ్మదీయుల విచారణకు సంబంధించిన కేసులో క్రౌన్ కౌన్సిల్ తన వాదన ప్రారంభిస్తూ అన్న మాటల్లోని అభియోగం ప్రకారం* –

"రాధావల్లభ్ అనే పేరుగల హిందువు గోవిందపూర్‌లో నివసించేవాడు. అతనికి హరేంద్ర అనే పేరుగల కొడుకున్నాడు. గోవిందపూర్‌లోనే పాలవిక్రయం వృత్తిగా జీవిస్తున్న ముస్లిం స్త్రీ ఒకామె ఉండేది. ఈ ముస్లిం స్త్రీతో హరేంద్ర అక్రమ సంబంధం కలిగి ఉన్నాడని స్థానిక ముసల్మానులు అనుమానించారు. ముస్లిం స్త్రీని హిందువు ఉంచుకోవటం అన్నది వారికి చాలా మనస్తాపాన్ని కలిగించింది. ఈ అవమానానికి ప్రతీకారంగా వారు రాధావల్లభ్ కుటుంబాన్ని నాశనం చేయాలనుకున్నారు. గోవిందపూర్‌లోని ముసల్మానులందరూ ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసుకున్నారు. ఆ సమావేశానికి రమ్మని హరేంద్రకు తాఖీదు పంపారు. హరేంద్ర సమావేశానికి వెళ్లిన వెంటనే అతని కేకలు వినిపించాయి. సమావేశం జరిగిన స్థలంలో హరేంద్ర చావుదెబ్బలు తిని స్పృహలేని స్థితిలో కనిపించాడు. అయితే గోవిందపూర్‌లోని ముసల్మానులు ఈ దాడితోనే సంతృప్తి పడలేదు. రాధావల్లభ్, అతని భార్య, పిల్లలు, అందరూ ఇస్లాంను స్వీకరిస్తే గాని వారి కొడుకు హరేంద్ర తప్పును సహించేది లేదని ముసల్మానులు రాధావల్లభ్‌కు వర్తమానం పంపారు. రాధావల్లభ్ తన భార్యాపిల్లలను మరోచోటుకు తరలించాలనే ప్రయత్నాల్లో ఉన్నాడు. మరుసటిరోజు రాధావల్లభ్ భార్య కుసుమ్ ఇంటిముందు కసవూడుస్తుంటే కొంతమంది మహమ్మదీయులు వచ్చారు. కొందరు రాధావల్లభ్‌ను కిందపడేసి అదిమిపెట్టారు.

* టైమ్స్ ఆఫ్ ఇండియా 'ట్రూ ఇండియన్ ఐస్' అనే శీర్షిక కింద పేర్కొనబడింది.

కొంతమంది కుసుమ్‌ను తీసికెళ్ళారు. కొంతదూరం ఆమెను తీసికెళ్లి లాకెర్, మహజర్ అనే పేర్లున్న మహమ్మదీయులు ఆమెపై అత్యాచారం చేశారు. ఆమె నగలను ఒలుచుకున్నారు. కొంతసేపు తర్వాత ఆమె స్పృహలోకొచ్చింది. తన ఇంటివేపు పరుగులు పెట్టింది. ఆమెను ఆ దుండగులు మళ్లీ వెంబడించారు. ఆమె ఎలాగో ఇల్లు చేరుకుని లోపలికెళ్లి గడియపెట్టుకుంది. ఆ ముస్లిం దుండగులు తలుపులు పగలగొట్టారు. ఆమెను పట్టుకుని ఈడ్చి రోడ్డు మీదకు తీసుకొచ్చారు. ఆ దుండగుల్లో కొందరు వీధిలోనే ఆమెపై మళ్లీ అత్యాచారం చెయ్యాలని సలహా ఇచ్చారు. అయితే రజని అనే పేరుగల మరో యువతి సాయంతో కుసుమ తప్పించుకుంది. రజని ఇంట్లో ఆశ్రయం పొందింది. కుసుమ్ రజని ఇంట్లో ఉన్నప్పుడు గోవిందపూర్‌లోని ముసల్మానులు రాధావల్లభ్‌ను అవమానకర పరిస్థితిలో వీధులన్నీ నడిపించారు. మరుసటిరోజు నుంచి పోలీస్‌స్టేషన్‌కు పోయే రోడ్లన్నింటి వద్దా ముసల్మానులు కాపలా కాశారు. తమపై జరిగిన అత్యాచారాన్ని గురించి పోలీసులకు ఫిర్యాదు ఇవ్వకుండా రాధావల్లభ్‌ను, కుసుమ్‌ను వారు నిరోధించారు."

స్త్రీలకు వ్యతిరేకంగా జరిగిన ఈ ఆటవిక చర్యలు ఏ మాత్రం పశ్చాత్తాపం లేకుండా చేసినవి. వీటిని వారి సోదర ముస్లిములు కూడా ఖండించలేదు. ఈ రెండు మతాలను విడదీసిన శత్రుభావం ఎంత లోతైందో ఇది తెలియజేస్తుంది. రెండు పక్కలా ఉన్న ఈ ఉద్రిక్తతలు రెండు యుద్ధోన్ముఖ దేశాలకు చెందిన ఉద్రిక్తతలుగానే భావించాలి. ప్రతి జాతిపైనా మారణహోమం, దోపిడీ, అపవిత్ర పరచటం, అత్యాచారం మొదలైనవి జరిగినాయి. ఈ నేరాలన్నీ హిందువులు ముసల్మానులపై చేశారు. ముసల్మానులు హిందువులపై చేశారు. బహుశా హిందువులు ముసల్మానులపై చేసిందానికన్నా ముసల్మానులు హిందువులపై చేసిందే ఎక్కువ. దహనకాండలు ఎన్నో జరిగాయి. వీటిలో హిందువుల ఇళ్లకు ముసల్మానులు నిప్పుపెట్టారు. ముసల్మానులకు నేత్రపర్వంగా ఈ మంటల్లో హిందువుల కుటుంబాలు, స్త్రీలు, పురుషులు, పిల్లలు అందరూ సజీవంగా దహనమయ్యారు. అయితే ఆశ్చర్యపరిచే విషయం ఏమంటే ఈ ఉద్దేశ్యపూర్వకమైన ఘోరకృత్యాలు క్రూరమైనవిగా ఏ మాత్రం పరిగణింపకపోవటం. పైగా ఇవన్నీ యుద్ధపరంగా న్యాయబద్ధమైన చర్యలుగా లెక్కగట్టడం, వీటికి ఎలాంటి క్షమాపణలూ అక్కరలేదని భావించటం గమనార్హం. ఈ రకమైన శత్రుభావనలను చూసి కాంగ్రెసు పత్రిక – హిందుస్తాన్ సంపాదకునికి కోపం వచ్చింది. 1926లో హిందూ ముస్లిమ్‌ల మధ్య ఐక్యాన్ని సాధించటంలో గాంధీజీ ప్రయత్నాల గురించి కఠోర వాస్తవాల్ని వెల్లడించేందుకు ఇలాంటి భాషను ఉపయోగించాడు. గొప్ప నిరాశతో ఆ సంపాదకుడు ఇలా అన్నాడు :

"ఇప్పటి భారతదేశానికి, ఒక దేశంగా భారతదేశానికి మధ్య ఎంతో అగాధం ఉంది. ఒక భారతదేశం హత్యల ద్వారా, దహనాల ద్వారా తనను వ్యక్తపరచుకుంటున్నది అన్నది ఒక వింతైన వాస్తవం. తమను తాము మోసగించుకుంటున్న మనుషులు లేదా దేశభక్తి ఊహల్లో కల్పితమైన భారతదేశం మరొకటి. వీటి మధ్య ఎంతో అగాధం ఉంది మరి. వేలాది వేదికలపై

నుంచి హిందూ ముస్లిం ఐక్యాన్ని గురించి మాట్లాడటం, వాటికి ఉజ్వలమైన శీర్షికలను ఇచ్చి ప్రచురించడం ఇవన్నీ ఒక భ్రమను కొనసాగించటమే అవుతుంది. మసీదులను, ఆలయాలను ధ్వంసం చేయటంలోనూ, ఒకరిపై ఒకరు రాళ్లు రువ్వుకోవటంలోనూ ఈ వాస్తవం చుట్టూ ముసిరిన మబ్బులు విడిపోతూ అసలు స్వరూపం వ్యక్తపరచుకుంటున్నది. శాంతి గురించీ, మంచి గురించీ కొన్ని పవిత్ర గీతాలు పాడినంత మాత్రాన అది దేశానికేమీ ఒరగదు. హిందూ ముస్లిం ఐక్యం అనే విషయంపైనే కాంగ్రెసు అధ్యక్షులు తమ పబ్బం గడుపుకుంటున్నారు. పైగా ఈ విషయం అధ్యక్షులకు చాలా ప్రీతిపాత్రమైంది. కొన్ని సూక్ష్మమైన మార్పులతో వారి ప్రతిభకు ఒక నిలువుటద్దంగా ఉండవచ్చు కాని అసలు సమస్యను మాత్రం అపరిష్కృతంగా అంటకుండా వదిలివేస్తున్నారు. ఈ ఐక్యగానం నాయకుల నాలుకలపై మాత్రం కాకుండా ఆ దేశంలోని కొన్ని మిలియన్ల ప్రజల హృదయాలలో ధ్వనించినపుడే భారతదేశం ప్రతి స్పందిస్తుంది."

హిందూ ముస్లిం ఐక్య సాఫల్యంపై ఎలాంటి ఆశాభావాన్ని నేను వెలిబుచ్చలేను. హిందూ ముస్లిం ఐక్యం ఎండమావే అయినా ఇప్పటివరకూ కనుచూపు మేరలో ఉంది. ఇప్పుడు అది కంటికి కనిపించటం లేదు. మనస్సుకు అందటం లేదు. గాంధీ కూడా దీనిపై ఆశ వదలుకున్నారు. ఇది అసాధ్యమైన కార్యమని బహుశా ఇప్పటికి ఆయన తెలుసుకుని ఉంటారు.

20 సంవత్సరాల గత చరిత్రను ఏ మాత్రం హరాయించుకోలేని కొంతమంది ఇంకా హిందూ ముస్లిం ఐక్యం సాధ్యమనే నమ్ముతున్నారు. వీరి నమ్మకం రెండు ఆధారాలపై నిలిచిఉన్నట్లు అనిపిస్తుంది. మొదటిది : విభిన్న ప్రజలను ఒక దేశంగా మలచగల కేంద్ర ప్రభుత్వ సామర్థ్యంపై వారికి విశ్వాసం ఉండటం. రెండవది : హిందూ ముస్లిం ఐక్యాన్ని సాధించేందుకు ముస్లింల కోర్కెలను సంతృప్తి పరచటమే సాధనమని వారు భావించటం.

ప్రభుత్వం అనేది ఒక ఐక్య ఘటనాశక్తిగా పనిచేస్తుందన్నది వాస్తవమే. ఒక్క ప్రభుత్వం కింద ఉన్న కారణం చేతే విభిన్న ప్రజలు ఒకే సజాతీయ సమూహంగా ఒక ఐక్యశక్తిగా తయారైన సంఘటనలూ ఎన్నో లేకపోలేదు. ఐక్యఘటనకు మూలశక్తిగా ప్రభుత్వాన్నే భావిస్తూ వస్తున్న హిందువులు ఆ ప్రభుత్వం చేయగలిగిన దానికి కొన్ని పరిమితులూ ఉంటాయన్నది విస్మరించారు. ఐక్యఘటనా శక్తిగా ప్రభుత్వానికున్న క్రియాచరణకు పరిమితులు ఆ ప్రజల్లో విలీనశక్తిగా రూపొందే అవకాశాలపై ఆధారపడి ఉంది. ప్రజల్లోని ఈ కలయిక శక్తికి అడ్డుగా జాతి, భాష, మతం నిలవనంతవరకూ ప్రభుత్వం గొప్ప ఐక్య ఘటనా శక్తిగా ఉంటుంది. అయితే ఏ దేశంలోనైతే ఈ జాతి, మత, భాషా తారతమ్యాలు ప్రజల్లోని విలీనశక్తిని, ఉత్సాహాన్ని నిరోధించేలా తయారవుతాయో అక్కడ ప్రభుత్వం ఐక్య ఘటనాశక్తి ఏ మాత్రం ప్రభావాన్ని చూపించలేదు. ఫ్రాన్సు, ఇంగ్లాండు, ఇటలీ, జర్మనీ మొదలైన దేశాలు ఒకే సాధారణ ప్రభుత్వం కింద ఐక్య దేశాలుగా తయారయ్యాయంటే అందుకు కారణం ఆయా దేశాల్లో ప్రభుత్వ ఐక్య

ఘటనా శక్తి కార్యక్రమానికి అడ్డుగా భాషగానీ, మతంగానీ, జాతిగానీ రాకపోవటమే అని చెప్పాలి. మరోపక్క ఒకే సాధారణ ప్రభుత్వం కలిగి వుండి కూడా హంగరీ, ఆస్ట్రియా, చెకొస్లవేకియా, టర్కీ మొదలైన దేశాల ప్రజలు ఐక్యం కావటంలో విఫలురయ్యారు. అందుకు కారణం ఆ ప్రభుత్వం చేపట్టే ఐక్య ఘటనా కార్యక్రమాలను జాతి, మత, భాషా తారతమ్యాలు బలంగా ఎదుర్కోవటమే, నిర్వీర్యం చేయటమే అని చెప్పక తప్పదు. ఒకే సాధారణ ప్రభుత్వ ఐక్య ఘటనాశక్తి ప్రోద్బలంతో ఒకే దేశంగా భారతదేశంలోని ప్రజలు పెనవేసుకు పోవటానికి అక్కడి భాషా, మత, జాతి తారతమ్యాలు ప్రోత్సాహకర వాతావరణాన్ని ఇవ్వకపోగా అడ్డుగా నిలిచే పరిస్థితి ఉంది. భారతదేశంలో కేంద్ర ప్రభుత్వం భారతదేశంలోని ప్రజలను ఒక దేశంగా రూపొందించింది అనటం ఒక భ్రమ మాత్రమే అవుతుంది. క్రమశిక్షణ లేని జంతువుల్ని కొట్టంలో ఒకే తాడుకు కట్టినట్లు ఒక ప్రదేశంలో ప్రజల్ని ఉంచి వాళ్లని చట్టాల ద్వారా బంధించి ఒకటిగా కన్పించేట్లు చేసింది కేంద్ర ప్రభుత్వం. కేంద్ర ప్రభుత్వం చేసిందల్లా ఒకరకమైన శాంతిని భారతదేశంలోని ప్రజల మధ్య నెలకొల్పటం మాత్రమే. అది వారిని ఒక దేశంగా మాత్రం తయారు చేయలేదు.

ఐక్య ఘటనకు చాలినంత సమయం లేదని చెప్పనూ లేము. కేంద్ర ప్రభుత్వ పాలనలో నూటయాభై సంవత్సరాలూ ఈ ఏకతకు చాలకపోయిందంటే అనంతమైన కాలమైనా ఇక సరిపోదనే అర్థం. ఈ వైఫల్యానికి కారణం భారత ప్రజల ప్రతిభే అని చెప్పవచ్చు. భారతదేశంలోని ప్రజల మధ్య ఐక్యం కోసం ఒక ఆరాటం కానీ, కలయిక కోసం ఆసక్తి కానీ కనిపించదు. అందరికీ ఒక సాధారణ దుస్తులు పాటించటం పట్ల ఆసక్తి లేదు. అందరికీ సామాన్యమైన ఒక భాషను కలిగి ఉండటం పట్ల ఉత్సాహం లేదు. జాతీయమైన, అందరికీ సామాన్యమైన విషయాలకు స్పందిస్తూ అందుకు అనువుగా స్థానికమైన కొన్నిటిని వదులుకోవాలనే ఇచ్ఛ వారిలో లేదు. గుజరాతీయుడు తాను గుజరాతీవాడినని చెప్పుకోవటానికి గర్వపడతాడు. అలాగే మహారాష్ట్రీయుడూ, పంజాబి, మద్రాసీ, బెంగాలీ వారందరూ తమను తాము అలానే పిల్చుకోవటానికి ఇష్టపడతారు. ఇదీ హిందువుల మనస్తత్వం. వీరు ముసల్మానులను నిందిస్తారు. ముసల్మాను 'నేను మొదట ముసల్మానుని, ఆ తర్వాత భారతీయుణ్ని' అని చెప్పినందుకు దేశానికి సంబంధించిన స్పందన లేదని అంటారు. 'నాగరిక భారతీయులు' అన్న ప్రకటన వెనక భారతదేశంలోని ప్రజల, ముఖ్యంగా హిందువుల్లోనూ ఒక కోరిక, ఒక సామాన్యమైన స్పందన, ఉద్రేకం, కన్పిస్తుందని ఎవరైనా అనగలరా! అందరికీ సామాన్యమైన దానికోసం, ఐక్య ఘటన కోసం, ప్రత్యేకమైన, స్థానికమైన వాటిని వదులుకోగలిగిన భావనను ప్రేరేపించే ఒక సామాజిక నైతిక ఏకత గురించిన కొద్దిపాటి చైతన్యం వారిలో కనపడుతుందా? వారిలో అలాంటి చైతన్యమూ లేదు. కోరికా లేదు. అలాంటి చైతన్యమూ, కోరికా లేనప్పుడు ఏకత కోసం ప్రభుత్వం మీదే ఆధారపడటం తనను తాను మోసగించుకోవటమే అవుతుంది.

ఇక రెండవ విషయానికొస్తే అది సైమన్ కమిషన్ అభిప్రాయమే అనటంలో సందేహం,

లేదు :

"భారతదేశ రాజకీయ భవితవ్యం దృష్టిలో ఉంచుకున్న రెండు మతాలూ; వాటిలోపలి ఆ కారణంగా పెచ్చరిల్లిన ఉద్రేకాలూ, ఆశలూ ఈ మత కలహాల రూపంలో బయటికి వచ్చాయి. బ్రిటిష్ చేతుల్లో అధికారం స్థిరంగా ఉన్నంతకాలం, స్వయంపాలన గురించిన ఆలోచనే లేనప్పుడు, హిందూ ముస్లింల మధ్య వైరం స్వల్పంగా పరిమితంగా ఉండేది. తటస్థమైన బ్రిటిష్ ఉద్యోగి వర్గం ఈ కలహాలను నిరుత్సాహ పరుస్తూ వచ్చిన కారణంగానే అలా జరిగిందనటానికి వీలులేదు. మరొక్క కారణం కూడా ఉంది. ఒక మతంలోని సభ్యులు మరొక మతం ప్రాబల్యం గురించి భయపడటానికి చాలా తక్కువ అవకాశాలుండటమే ఆ కారణం. సాపేక్షంగా చూసినప్పుడు భారతదేశంలో మతపరమైన గొడవలు లేకుండటాన్ని ఈ రకంగానే వివరించవచ్చు. ఒక తరం వెనక బ్రిటిష్ ఇండియాలో పరిస్థితులతో బాగా పరిచయం ఉన్నవారిని అడిగితే వారిలా అంటారు : ఇరువర్గాల ప్రజల మధ్య మంచి భావాలూ, స్నేహం వర్ధిల్లేది. పౌరశాంతికి ఈ మతపరమైన ఉద్రిక్తతలు భంగం కలగజేసే అవకాశాలు చాలా పరిమితంగానే ఉండేవి. అయితే సంస్కరణలు రావటం, ఆ తరువాత జరగబోయే వాటి గురించిన జ్ఞానం హిందూ–ముస్లిం స్పర్థలకు ఒక కొత్త అంశాన్ని తెచ్చి పెట్టింది. ఒక మతం సహజంగానే మెజారిటీ హక్కులను కోరుతుంది. మంచి విద్య, గొప్ప సంపద అర్హతలుగా కలిగి ఉండటంతో సహజంగానే ఆ హక్కులను కోరుతుంది. మరొకమతం తన సభ్యులకు పకడ్బందీ రక్షణను కల్పించటమే ధ్యేయంగా ఉంటుంది. పైగా గతంలో దేశాన్ని ఏలినవారికి తాము ప్రతినిధులమనే విషయాన్ని విస్మరించదు. ఈ మతం సరైన తగిన ప్రాతినిధ్యాన్ని అధికార పదవుల్లో భాగాన్ని కల్పించటానికి హామీని కోరుతుంది."

ఇది సరైన విశ్లేషణే అనుకుందాం. ముస్లింల కోర్కెలు సమంజసమైనవే అనుకుందాం. హిందువులు వాటిని ఇవ్వటానికి సిద్ధం గానే ఉన్నారనుకుందాం. నిజానికి ఇవన్నీ చాలా పెద్ద ఊహలు. లేదా కల్పనలు. ముస్లింల రాజకీయ కోర్కెలు తీరటం ద్వారా పెరిగే సంతృప్తి భావనలో, తద్వారా ఏర్పడే హిందూ ముస్లింల రాజకీయ ఏకత సాధ్యమవుతుందా? అనేది ఒక ప్రశ్న. హిందువులు, ముస్లింల మధ్య కేవల రాజకీయ ఐక్యం సంభవమైతే చాలని కొంతమంది ఆలోచన. నా వరకూ అది గొప్ప భ్రాంతిలా తోస్తుంది. ఈ అభిప్రాయం ఉన్నవారికి ఒకటే ఆలోచన ఉంటుంది. అప్పటి పరిస్థితుల్లో స్వతంత్ర దేశ ప్రతిపత్తికోసం బ్రిటిష్ మీద ఒత్తిడి తీసుకు రావటంలో హిందువులతో బాటు ముస్లిములూ చేతులు కలపాలని, అందుకేం చేయాలో ఆలోచిస్తున్న వారికి ఆ అభిప్రాయం కలిగి ఉండవచ్చు. ఇది చాలా హ్రస్వదృష్టితో కూడిన ఆలోచనగా చెప్పవచ్చు. బ్రిటిష్ వారిపై ఒత్తిడి తీసుకురావటంలో హిందువులతో బాటు ముస్లిములనూ చేర్చుకోవటమెట్లా అనేది తులనాత్మకంగా పరిశీలిస్తే చాలా చిన్న ప్రశ్న. రాజ్యాంగంలో ఏ రకమైన మనోభావాలతో వారు పని చేస్తారు? కేవలం పరాయివాళ్ళుగా, అనవసర సంబంధంగా మాత్రమే వారు రాజ్యాంగానికి పని చేస్తారా? లేదా నిజమైన సంబంధం

ఉన్నవారుగా కార్యరంగంలోకి వస్తారా? అన్నదే ప్రధానమైన ప్రశ్న. నిజమైన ఆప్తులుగా పని చేయాలంటే కేవలం రాజకీయ ఏకత మాత్రమే చాలదు. హృదయానికీ, ఆత్మకూ నిజమైన ఐక్యం లాగా అంటే ఒక సామాజిక ఏకత తప్పనిసరి. నిజమైన ఏకతను వ్యక్తం చేయజాలని రాజకీయ ఏకత నిరర్థకమైంది. ఇద్దరు వ్యక్తులు మిత్రులు కాకుండానే సంబంధం కలుపుకోవటంలాగా - వారి మధ్య ఏకత ఎంత సందిగ్ధమైందో ఆ రాజకీయ ఏకత అనేది అంతే అనిశ్చితమైంది. ఇది ఎప్పుడూ ఎంత అనిశ్చితమైందో తెలియాలంటే జర్మనీ, రష్యాల మధ్య జరిగిన సంఘటనలు పరిశీలిస్తే సరి. అవి పై చెప్పినదానికి ఉదాహరణగా నిలుస్తున్నాయి. కొన్ని భౌతికమైన ప్రయోజనాల తృప్తి మీద మాత్రమే ఆధారపడి శాశ్వత ఏకత అన్నది ఏర్పడకూడదని నేను తలుస్తాను. ఒడంబడికలు ఐక్యాన్ని రూపొందించవచ్చు. కాని ఆ ఐక్యం ఒక ఏకీకృతమైన పరిపక్వతను సంతరించుకోజాలదు. ఒక ఏకీకృత భావనకు ఆధారంగా ఒడంబడిక ఉండటం అన్నది నిరర్థకం. ఒడంబడిక స్వభావమే చెబుతుంది దానిది ప్రత్యేకమైన లక్షణమని. ఒడంబడిక సర్దుబాటుకు స్థానం కల్పించే ఆసక్తిని కలిగించదు. త్యాగబుద్ధిని ప్రేరేపించదు. ప్రధాన లక్ష్యానికి రెండు పార్టీలనూ కట్టుబడి ఉండేట్లు చేయదు. ఒకదానికొకటి సర్దుకొని పోవటం బదులు ఒడంబడికకు వచ్చిన పార్టీలు ఒకదాన్నుంచి ఒకటి బయటపడాలనే ప్రయత్నం చేస్తుంటాయి. సామాన్యమైన లక్ష్యం కోసం త్యాగాన్ని చేయటం అలా ఉంచి ఒక పార్టీ చేసిన త్యాగాన్ని మరొకటి తన మంచికి వాడుకోవటానికి ప్రయత్నించటంలోనే తలమున్కలై ఉంటాయి. ఒక లక్ష్యంకోసం పోరాడ్డం అలా ఉంచి ఒడంబడిక లోని పార్టీలు ఆ లక్ష్యానికేసి పురోగమించి సాధించే క్రమంలో తమ అధికార బలాబలాలు సమతౌల్యంగా వుండేట్లు అనుక్షణం గమనిస్తూ వుంయి. రీనన్ గొప్ప సత్యాన్ని ఇలా చెప్పాడు.

ఒక ప్రయోజనాల సమూహం మనుషుల మధ్య శక్తివంతమైన సంబంధానికి కారణమవుతుంది. అయితే ఇలాంటి ప్రయోజనాలే ఒక దేశాన్ని తయారు చేసేందుకు సరిపోతాయా? నేను దీన్ని నమ్మను. ప్రయోజనాల సమూహం లేదా వర్గం వ్యాపారపరమైన ఒడంబడికలను చేస్తాయి. జాతీయతకు మరొక ఆర్ద్రస్పందనల పార్శ్వం ఉంది. అవి దాని శరీరం ఆత్మ కూడా. జాల్లివిరేన్ పితృభూమి కాదా.

ప్రసిద్ధ చరిత్ర విద్యార్థి జేమ్స్‌బ్రిస్ కూడా అలాంటి నిశిత అభిప్రాయాన్నే వ్యక్తం చేశాడు:

"ఒక సంస్థ శాశ్వత ఉనికి అది బలపరచే భౌతిక ప్రయోజనాల మీద మాత్రమే ఆధారపడి లేదు. అవి ఏ వ్యక్తుల కోసం తయారు చేశారో వారి స్పందన భావాలతో దానికున్న గాఢ నిబద్ధత మీద అది ఆధారపడింది. ఆ స్పందన భావాలను సరైన వ్యక్తీకరణను అవి ఇవ్వజాలనప్పుడు ఆ భావం స్వరబద్ధమై మరింత బలపడుతుంది. ఆ సంస్థకు మూలశక్తిగా తయారవుతుంది."

జర్మన్ సామ్రాజ్యానికి పునాదులు వేసిన బిస్మార్క్ గురించిన ప్రస్తావనలో బ్రిస్ యీ

పరిశీలనము చేశాడు. బ్రిస్ ప్రకారం బిస్మార్క్ ఒక సుదీర్ఘకాలం కొనసాగగల్గిన సామ్రాజ్యాన్ని నిర్మించటంలో విజయుడవటానికి కారణం అది ప్రజల స్పందన భావాల మీద ఆధారపడి చేయటమే. ఈ భావం కూడా....

"మనలో చాలామంది కూడా – జాతీయత కోసం మనం చెప్పుకునే ఉద్రేకం, తపన, నైతిక సామాజిక ఐక్యాన్ని గురించిన చైతన్యం అప్పటికే కలిగి ఉన్న ప్రజల ఆకాంక్ష, అలాంటి ఐక్యత ఒక ప్రభుత్వం కింద వ్యక్తం కాబడి వాస్తవంలోకి తీసుకు రాగలిగినప్పుడు నాగరిక రాజ్యాల మధ్య ఒక స్థానాన్ని, పేరును తప్పక పొందుతుంది."

శాశ్వతత్వాన్ని ఇచ్చే ఈ నైతిక, సామాజిక ఐక్యం ఏమిటి? ఒక ప్రభుత్వం కింద వ్యక్తం చేయబడి వాస్తవంలోకి తీసుకు రావటానికి ప్రజల్ని ప్రేరేపించేది ఏమిటి? నాగరిక రాజ్యాల మధ్య ఒక స్థానాన్ని, పేరును కల్పించేదేమిటి?

జేమ్స్‌బ్రిస్ కన్నా యీ ప్రశ్నకు జవాబు చెప్పగల సమర్థులు లేరు. రోమన్ సామ్రాజ్యంతో పోల్చి చూస్తే కనిపించే పవిత్ర రోమను సామ్రాజ్య శక్తి సామర్థ్యాలను గురించి చర్చిస్తున్నప్పుడు ఈ ప్రశ్నను అతను గుర్తించాల్సి ఉంటుంది. విభిన్నమైన ప్రజల మధ్య రాజకీయ ఏకతను సాధించగలిగిన సామ్రాజ్యం ఏదైనా ఉందా అంటే అది రోమన్ సామ్రాజ్యమే. క్లుప్తీకరించి బ్రిస్ భాషను అనువుగా మార్చి చెబుతున్నాను : కొత్త కొత్త కాలనీలను కనుగొంటూ పోతూ రోమన్ పౌరసత్వం కూడా విస్తరించటంతో ఇటలీ అంతటా కొన్ని కొన్ని ప్రాంతాలలోనూ సమానత్వాన్ని తెస్తున్న రోమన్ చట్టం ఒక పక్క, తన ప్రజలపై ప్రభుత్వం తెచ్చే ఒత్తిడి ఒక పక్క. బానిసల రవాణా, వ్యాపార నిమిత్తంగా రద్దీ కారణంగా జనాభాలో స్థానచలనం – ఇవన్నీ విభిన్న ప్రజలు నింపాదిగా కలిసిపోతూ ఒకటి కావటానికి దోహదం చేశాయి. ఈ ప్రాంతాల్లో చక్రవర్తులందరూ చాలావరకు దేశీయులు కావటం వల్ల ఇటలీపై తక్కువ శ్రద్ధ వహించారు. ఆంటోనీల తర్వాత కూడా రోము శాంతిని పెద్దగా పట్టించుకున్నట్లు లేరు. వారి పద్ధతి ఏమంటే ప్రతి వ్యక్తి తన భావిని నిర్మించుకునే స్వేచ్ఛను కల్పించటం. అవకాశాలను తెరిచి ఉంచటం. వారి స్వేచ్ఛ వల్లే ఆ చక్రవర్తుల గొప్పతనం అంతకంతకూ పెరిగింది. ఈ స్వేచ్ఛా మానవుల మధ్య చట్టపరమైన హోదాల తారతమ్యాలను నాశనం చేయటం ద్వారా ఆ పని పూర్తయ్యింది. వ్యాపారం, సాహిత్యం, అన్ని విశ్వాసాలను సహించటం – ఇవన్నీ అమలులోకి వచ్చాయి. జాతిపరమైన, మతపరమైన ఎలాంటి పోట్లాటలు కూడా ఆ ప్రశాంతతను భగ్నం చేయలేదు. ఎందుకంటే అందరికీ సామాన్యమైన రోమ్ సామ్రాజ్య భావనలో దేశాల ప్రత్యేకతలు అన్నీ కలిసిపోయాయి.

రోమన్ మహా సామ్రాజ్యం సాధించిన ఈ ఐక్యం కేవలం రాజకీయ ఐక్యం మాత్రమే. ఈ రాజకీయ ఐక్యం ఎంతవరకు నిలిచింది? బ్రిస్ మాటలలో :

"ఈ ఐక్యాన్ని తీసుకుని వచ్చిన అరుదైన ప్రభావాలు తగ్గిపోతూ వచ్చాయి. ఇతర

ప్రభావాలు వీటికి ప్రమాదకారులుగా తయారయ్యాయి. కొత్త శత్రువులు సరిహద్దులను ముట్టడించారు. ఒక రాజు మరణించగానే లేదా దిగిపోగానే అతని తర్వాత వారసుడి కోసం జరిగే అధికారాల కుమ్ములాటల సుదీర్ఘ పోరాటాలు ఈ మొత్తం నిర్మితిలోనే సడలింపు ఎలా ప్రారంభమయిందో తెలియజేస్తాయి. వలేరియన్ పతనం తర్వాత ప్రజ్వరిల్లిన అరాజక కాలంలో సామ్రాజ్యంలోని ప్రతి భాగంలోనూ తమ తమ సైన్యాల ద్వారా సైనికాధికారులు స్వతంత్రులయి నిరంకుశులుగా పెద్ద పెద్ద ప్రాంతాలను పరిపాలించారు. రాజధానిలో ఉన్న సామ్రాట్టుతో ఎలాంటి పొత్తు వారు పెట్టుకోలేదు. సామ్రాజ్యంలో పశ్చిమ భాగం విడిపోయి చిన్న చిన్న రాజ్యాలవుతాయన్నది రెండువందల సంవత్సరాలకు ముందే ఊహించాల్సిన విషయం. అయితే సామ్రాజ్య ం తన లోపలి ముఖ్య ప్రాంతాలతో అన్ని సంబంధాలనూ, సమన్వయాన్నీ పోగొట్టుకోక ముందు, మారిన పరిస్థితులను కొత్త మార్గాలతో సరిదిద్దుతూ డయెక్లిట్టన్‌లో ఒక రాజు క్రియాశీలతతో, చతురతతో ఈ ముక్కలను కలిపి వుంచకపోయి ఉన్నట్లయితే అదే జరిగి ఉండేది. అధికారాన్ని స్థానికం చేయటం, వికేంద్రీకరణ చేయటం ఆయన అనుసరించిన విధానం. శరీర విపరీతాలకు తగినట్లు ఇక ఏ మాత్రమూ బలహీనమైన గుండె కొట్టుకోజాలదన్న విషయం ఆయన గ్రహించారు. నలుగురు ప్రభువులకు అతడు పరమ అధికారాన్ని పంచి ఇచ్చాడు. నాలుగు రాజధానుల్లో కలిసి పాలించే రాజులుగా వారుండిపోయారు. దాని చుట్టూ ఆయన పురా వైభవాన్ని అలానే ఉంచటం జరిగింది. తద్వారా ఒక కల్పనాత్మక శక్తిని ఆ సింహాసనానికి ఇవ్వగలిగాడు. ఈ పద్ధతిని అతని ముందు వారు అవహేళన చేసి ఉండేవారు. నికొమెడియా వైరం, దరిదాపుల్లోని మిలాన్ ఔన్నత్యం రోమ్ విశేషాధికారాలకు వినాశకారిగా పరిణమించింది."

కాబట్టి రాజకీయ ఏకత ఒకటే రోమన్ సామ్రాజ్య సుస్థిరతకూ, శాశ్వతత్వానికీ సరిపోదని తెలిసి వచ్చింది. బ్రిస్ చెప్పినట్లు (రోమన్ సామ్రాజ్యంలో) పశ్చిమ భాగం కొన్ని రాజ్యాలుగా తయారు కావటాన్ని రెండు వందల సంవత్సరాలకు ముందే ఊహించవచ్చు. సరిహద్దుల్లోని ఆటవిక జాతుల వారు మరింత ధైర్యవంతులు అయి ఉంటే అలానే జరిగేది. డయాక్లిట్టన్‌లో ఒక యువరాజు రాజ్యభాగాలన్నీ సమన్వయం కోల్పోక ముందే అతికి, మారిన పరిస్థితులకు నూతన మార్గాలను తెలుసుకుని చురుగ్గా వాటినన్నిటినీ ఒక్కటిగా చేయలేకపోయి ఉంటే చరిత్రలో అలానే జరిగేది". అయితే వాస్తవం ఏమంటే పవిత్ర రోమను సామ్రాజ్యంగా అవతరించిన తర్వాత కొన్ని వందల సంవత్సరాల వరకూ ఒక సమన్విత కేంద్రంగా అది ఉండిపోయింది. దాని రాజకీయ ఐక్యం కదిలిపోతూ, ముక్కలుగా విడిపోతున్న రాజ్యాలను కలిపి ఉంచజాలక పోయినప్పుడూ అలాగే అన్నివందల సంవవత్సరాలూ అది కొనసాగింది. ఆచార్య మార్విన్ చెప్పినట్లు :

* ది యూనిటీ ఆఫ్ వెస్టర్న్ సివిలిజేషన్ (నాల్గవ ముద్రణ) పేజీ నెం 27.

"రోమన్ సామ్రాజ్య ఏకత కేవలం రాజకీయమైందీ, సైనికమైందీ – అది నాలుగు, అయిదు వందల సంవత్సరాల మధ్య వరకూ కొనసాగింది. కాథలిక్ చర్చ్‌లో పర్యవేక్షితమైన ఏకత మతపరమైంది, నైతికమైంది. అది వెయ్యేళ్లుగా కొనసాగింది"

రోమన్ సామ్రాజ్యం కన్నా, పవిత్ర రోమన్ సామ్రాజ్యం స్థిరంగా ఉండటానికి కారణం ఏమిటి? అన్నదే ప్రశ్న. బ్రిస్ సమాధానం ఇది : పవిత్ర రోమన్ సామ్రాజ్య సుస్థిరతకు ఒక సిమెంటు పూతలాగా పనికి వచ్చిన విషయాలు రెండు. ఒకటి – అందరికీ సామాన్యమైన మతం. అంటే క్రైస్తవ మతం. ఒకే సామాన్యమైన మత సంస్థ – క్రైస్తవ చర్చి. నిజానికి ఇలాంటి అతుకుపెట్టే విషయాలు రోమన్ సామ్రాజ్యానికి అప్పటికి చాలా అవసరంగా ఉన్నాయి. ఈ సిమెంటు పూత లేదా సంబంధం, లేదా అంతస్సూత్రం మొత్తం సామ్రాజ్యంలోని ప్రజలకూ ఒక నైతిక, సామాజిక ఏకతను ఇచ్చింది. ఒక ప్రభుత్వం కింద ఆ ఏకత వ్యక్తం కాబడి, వాస్తవీకరించబడేలా అవకాశాన్నిచ్చింది.

సామాన్యమతంగా క్రైస్తవమతం ఐక్యఘటనకు ఎంత ప్రభావవంతమైందో చెబుతూ బ్రిస్ ఇలా అంటారు* :

"దేశం అనేది, దాని జీవం అనేది అక్కడి మతం మీదే ఆధారపడి ఉంటుంది. దైవత్వం విభాజితమైంది. మానవత్వం విభాగించబడింది. కాబట్టి దేవుని ఏకీకరణ సిద్ధాంతం మానవుని ఏకీకరణకూ ఆపాదింపబడింది. క్రైస్తవ మతంలో మొదటి పాఠం ప్రేమ. అనుమానం, అసూయ, గర్వం, జాతిభేదం వల్ల విడిపోయిన మానవులను ఈ ప్రేమ ఒక్కటిగా చేస్తుంది. ఈ రకంగా కొత్తమతం ఒక మానవ సమూహాన్ని తయారు చేసింది. వీరందరూ విశ్వాసం ఉన్నవారు. ఈ సామ్రాజ్యం పవిత్రమైంది. ఒక్క హృదయంగా అందరూ మనుష్యులూ కలిసేట్లు ఇది నిర్మితమైంది. పురా ప్రపంచంలో బహు దేవతావాదానికి వ్యతిరేకంగా నిల్చింది. లెక్కలేనన్ని రాజ్యాలు, గణతంత్ర నగరాలు మొదలైన వాటికి వ్యతిరేకంగా నిల్చిన సీజరు శాసనంలాగా...."

రోమన్ సామ్రాజ్య అస్థిరత గురించి చెబుతూ బ్రిస్ దాని తర్వాత అధికారంలోకి

పవిత్ర రోమను సామ్రాజ్య ఏకీకరణ క్రమంలో క్రైస్తవ చర్చి ఉదాసీనమైన పాత్రను నిర్వహించలేదు. నిజానికి అది చాలా క్రియాశీల పాత్రను నిర్వహించింది. "తన చుట్టూ సంస్థ తర్వాత సంస్థ ముక్కలై కూలిపోతూ ఉంటే కొత్త తెగలు పుట్టుకొచ్చి తద్వారా నగరాలూ, దేశాలూ ఒకదానినొకటి ఖండించుకుంటూ వుంటే భావ వినిమయం అంతకంతకూ కష్టతరమవుతుంటే" చూస్తూ చర్చి దివ్య సంప్రదాయ చర్చిని బలపరుస్తూ తద్వారా మతాల అన్యోన్యతను రక్షించేందుకు ప్రయత్నించింది. వెలుపల ఏకతకు సంబధించిన ప్రతి అంశాన్నీ బిగదీయటం ద్వారానూ ఇందుకు ప్రయత్నించింది. విశ్వాసానికి సంబంధించిన అవసరాలు మరింత బలీయమైనవి. సత్యం అనేది ఒకటే నంటారు. దాన్ని నమ్మే వాళ్లందరినీ ఒక్కటిగా ఉంచేట్లు చూడాలి. అలాంటి ఒక్కటిగా ఉండటంవల్లనే దాన్ని వారు పరిరక్షించుకోగలుగుతారు. ఒకే గొర్రెల మంద ఉంది. ఒక కాపరి మాత్రమే ఉన్నాడు.

వచ్చిన పవిత్ర రోమన్ సామ్రాజ్య స్థిరత్వాన్ని పోల్చి చెప్పారు. కారణం రోమన్ సామ్రాజ్యానికి కేవలి రాజకీయ ఐక్యం మాత్రమే ఉందని దాని మీదే దాని స్థిరత్వం ఆధారపడిందనీ కాబట్టి అది స్థిరంగా లేదని అన్నాడు. పవిత్ర రోమన్ సామ్రాజ్యం ఒక సామాన్యమైన విశ్వాసాన్ని కలిగి తద్వారా ఒక సామాజిక నైతిక ఏకతను పునాదిగా కలిగి ఉండటం వల్ల దాని స్థిరత్వం కొనసాగిందని చెప్పారు. మానవ అనుభవంతో కూడుకున్నది. సహేతుకమైందీ యీ వాదన అనిపిస్తుంది. దీనిని బట్టి హిందూ ముస్లిముల మధ్య ఏకత్వానికి అవకాశాలు లేవని తెలుస్తుంది. సంబంధాన్ని ఏర్పరచే శక్తి, సామాన్యమైన మతం ఇప్పుడు కావాలి. ఆధ్యాత్మిక దృష్టితో చూస్తే హిందువులు, ముసల్మానులు కేవలం రెండు వర్గాలు, లేదా ప్రొటెస్టెంట్లు, కాథలిక్కులు లాగా శైవ వైష్ణవుల్లాగా రెండు మతభేదాలు కారు. వారు రెండు ప్రత్యేక జాతులు. ఈ దృష్టితో చూస్తే మానవత అన్న గుణం అత్యావశ్యకమైంది అని హిందువైనా, ముస్లిమైనా గుర్తించాలని అనుకోలేము. అంతేకాకుండా వారు అంతా ఒక్కటే అనీ, వారి మధ్య తేడాలు కేవల యాదృచ్ఛికాలు మాత్రమే అనీ వారు తెలుసుకోవాలి అనీ చెప్పలేము. వారి ప్రకారం దైవత్వం అన్నది విభజింపబడింది. ఈ విభజనతో మానవత్వం కూడా విభజితమైంది. ఈ మానవతా విభజనతో వారు ప్రత్యేకంగా విడిపోయి వుండాలి. వారిని ఒకే గొడుగు కిందికు చేర్చగలిగింది ఏదీ లేదు.

సామాజిక ఏకత లేకుండా రాజకీయ ఏకతను సాధించటం చాలా కష్టం. ఇది వేసవిలో నాటిన మొక్కలాగా అనిశ్చితమూ అస్థిరమైంది. ఒక పెద్ద గాలి వచ్చినపుడు వేళ్లతో సహా పెళ్లగించబడుతుంది. కేవలం రాజకీయ ఏకత్వంతో భారతదేశం ఒక రాజ్యంగా ఉండగలదు. అయితే రాజ్యంగా ఉండటం అంటే దేశంగా వుండటం కాదు. ఉనికి కోసం పోరాటంలో దేశం కాని కేవలం రాజ్యానికి బతికే అవకాశాలు తక్కువ. ఈ జాతీయవాదం అన్నది ఆధునిక కాలంలో ఒక ప్రబలశక్తిగా పని చేస్తున్నదనటం నిజం. మిశ్రమ రాజ్య వ్యవస్థలన్నిటినీ యీ ప్రబలశక్తి ధ్వంసం చేయటానికి, నాశనం చేయటానికి పూనుకుంటున్నది. మిశ్రమ, లేదా సంకీర్ణ రాజ్యానికి ఆపద బయటి దేశాల దురాక్రమణ నుంచి కన్నా లోపలి నుంచే ఎక్కువ. తమ ఇచ్ఛకు విరుద్ధంగా విడగొట్టబడి, అణచబడి, చిక్కులో పెట్టబడిన విభిన్న జాతీయతలు పునర్జీవనం పొంది అపాయకారులుగా తయారవుతాయి. పాకిస్తాన్‌ను వ్యతిరేకించే వారు ఈ అపాయాన్ని గుర్తుంచుకోవాలి. వారు ఇంకోటి కూడా తెలుసుకోవాలి. అణచబడిన జాతీయతలు మిశ్రమ రాజ్యాన్ని ధ్వంసం చేయటం, తమ ప్రత్యేక భూమిని తాము పొందటం - ఇవన్నీ స్వయం నిర్ణయ సూత్ర ప్రాతిపదికపైన ఒక నైతిక న్యాయంగా సమర్థించబడుతాయి. అంతేకాని దోషం కిందికి పరిగణించటం జరగదు.

అనువాదం : డా॥ కె.యెస్. రమణ

ఆర్చియార్

# పాకిస్తాన్ కోసం ముస్లిములు సూచించే ప్రత్యామ్నాయం

# పాకిస్తాన్ కోసం ముస్లిములు సూచించే ప్రత్యామ్నాయం

పాకిస్తాన్‌ను స్థాపించనవసరం లేకుండా ప్రత్యామ్నాయ ప్రతిపాదనలున్నాయని హిందువులు అంటున్నారు. ఇటువంటివి ముస్లిముల వద్ద కూడా ఉన్నాయా? అయితే దానికి హిందువులు అవును, ఉన్నాయని అంటున్నారు, లేవని ముస్లిముల ప్రతివాదన. కమ్యూనల్ అవార్డు ద్వారా సాధించిన విజయాలకు మరిన్ని చేర్చాలన్న ఉద్దేశంతో ముస్లిములు పాకిస్తాన్‌ను పాచికగా ఉపయోగించుకోవాలన్నదే ముస్లిముల ఉద్దేశం అని హిందువులు భావిస్తున్నారు. దీన్ని ముస్లిములు తిరస్కరిస్తున్నారు. వారి ఉద్దేశంలో పాకిస్తాన్‌కు సమానమైనది సరైనది మరొకటి లేదని వారి ఉద్దేశం అంటున్నారు. ముసల్మానులకు పాకిస్తాన్ తప్ప మరొక ఆలోచన లేదని దాని వల్ల స్పష్టమౌతోంది. అయితే ప్రత్యామ్నాయం ఉందని హిందువులు అనుకోవడం ఒక భ్రమే. ముస్లిముల జిత్తులు తెలుసుకునే తెలివితేటలు హిందువులకున్నాయనుకున్నా, పాకిస్తాన్‌కు ముస్లిముల ప్రత్యామ్నాయాన్ని హిందువులు ఆదరిస్తారా? ముస్లిములు ప్రతిపాదించే ప్రత్యామ్నాయం మీద దీని సమాధానం ఆధారపడి ఉంటుంది.

అసలు పాకిస్తాన్‌కు ఇతర ప్రత్యామ్నాయం ఏమిటో ఎవరికీ తెలియదు. ఒకవేళ ఉన్నా భవిష్యత్తులో తమ సంబంధాలు ఏ విధంగా ఉండాలన్న ఇరుపక్షాల ఆశయాలపై ఆధారపడి ఉంటాయి. ముందు జాగ్రత్తగా ఉండటం అంటే ముందే సాయుధం కావటం. పాకిస్తాన్‌కు ప్రత్యామ్నాయ ప్రతిపాదనపై కొంత అవగాహన ఉంటేనే హిందువుల రాబోయే అదురుపాటును తట్టుకోగల శక్తి కలిగి ఉంటారు. ఎందుకంటే – కమ్యూనల్ అవార్డ్ కంటే మరో మంచి ప్రత్యామ్నాయం ఉండబోదు. చెప్పాలంటే అనేక విధాలుగా దానికంటే హీనంగా ఉండవచ్చు.

స్పష్టమైన ప్రత్యామ్నాయం లేనప్పుడు ఊహాజనిత ప్రతిపాదనలకు మాత్రమే తావుంది.

అంటే ఇరువురి మధ్య ఒకే ఊహ ఉంటే తత్సంబంధిత పార్టీ ఒకటి ఎంపిక చెయ్యాలి. నా ఉద్దేశంలో ముస్లిముల ప్రత్యామ్నాయం కింది పేర్కొన్న కొన్ని అంశాలను కలిగి ఉంటుంది:

భవిష్యత్తులో రూపొందబోయే భారత రాజ్యాంగం ఈ అంశాలను -

1) ముస్లిములకు ప్రత్యేకించిన నియోజకవర్గాలతో రాష్ట్రశాసనసభలలో 50 శాతం వరకు ప్రాతినిధ్యం.

2) కేంద్ర రాష్ట్ర మంత్రివర్గాల్లో ముస్లిములకు 50శాతం ప్రాతినిధ్యం.

3) ఉద్యోగస్వామ్యంలో 50 శాతం ముస్లిములకు కేటాయింపు.

4) రక్షకదళాల ఉద్యోగాలలోనూ, ఇతర ఉన్నత పదవుల్లో ముస్లిములకు సగభాగం.

5) ప్రజావసరాలకై నియమించబోయే కమిషన్లలోనూ, సంస్థల్లోనూ, మండలులలోనూ, 50 శాతం ముస్లిములకు ప్రాతినిధ్యం.

6) భారతదేశం పాల్గొనే అంతర్జాతీయ వ్యవస్థల్లో ముస్లిములకు 50 శాతం ప్రాతినిధ్యం.

7) ఒక హిందువుగాని, భారత ప్రధానమంత్రి అయితే ఒక ముస్లిం ఉప ప్రధానిగానూ,

8) ఒక హిందువు రక్షక దళాల ప్రధాన అధిపతి అయితే ఒక ముస్లిం ఉప ప్రధాన అధిపతిగాను ఉండాలి.

9) 66 శాతం ముస్లిం శాసనసభ్యుల మద్దతు లేకుండా ఏ రాష్ట్ర ప్రాంత సరిహద్దు మార్పిడులు చెల్లవు.

10) 66 శాతం ముస్లిం శాసనసభ్యుల మద్దతుల లేకుండా ఏ ముస్లిం దేశంపై చర్య గైకొనకూడదనీ, అలాగే ఒడంబడికలు చేసుకోరాదని.

11) 66 శాతం ముస్లిము శాసనసభ్యుల అనుమతి లేకుండా ముస్లిముల సాంస్కృతిక, మత వ్యవహారాల్లో మార్పు చేయరాదని,

12) ఉర్దూ భారత జాతీయ భాషా గుర్తింపు.

13) 66 శాతం ముస్లిం శాసనసభ్యుల అంగీకారం లేకుండా గోవధ, ఇస్లాం వ్యాప్తిని, మార్పిడిని నిషేధించరాదు.

14) భారత రాజ్యాంగంలో ఏ సవరణ అయినా 66 శాతం ముస్లిం శాసనసభ్యుల ఆమోదంతోపాటు జరగాలని.

పైన పేర్కొన్నవి నావి కల్లెంలేని ఊహలు అని అనుకోకూడదు. హిందువులను ఏదో విధంగా భయపెట్టి త్వరగా పాకిస్తాన్ ఏర్పాటుకు అంగీకరించాలని ఉద్దేశించి ప్రతిపాదించినవి

అనుకోకూడదు. ముస్లిం వర్గాల ద్వారా లభించిన సమాచారం ఆధారంగా ఆలోచించి రూపొందించిన పథకం అని అనుకోవచ్చు.

హైదరాబాదు నిజాం అధీనంలో ఉండే ప్రాంతాలకు రాజ్యాంగ సవరణ ప్రతిపాదనల స్వభావం ఆధారంగా పాకిస్తాన్‌కు ముస్లిముల ప్రత్యామ్నాయ పథక రూపాన్ని గ్రహించవచ్చు.

హైదరాబాదు రాజ్యాంగ సంస్కరణలు ఒక వినూత్న ప్రయత్నం. బ్రిటీష్ ఇండియాలో ఉండే మత ప్రాతిపదిక ప్రాతినిధ్య సూత్రాన్ని తిరస్కరిస్తూ, దాని స్థానంలో ప్రాతిపదికగా ప్రాతినిధ్యం ఉండాలని ప్రతిపాదించారు. దీన్నే నిర్వాహక ప్రాతినిధ్యం అని ఉదహరించారు. దీన్నిబట్టి 76 మంది సభ్యులు కల శాసనసభ కింది పేర్కొన్న విధంగా పునర్మితమై ఉంటుంది.

| ఎన్నికైన | | | నామినేట్ కాబడిన | | |
|---|---|---|---|---|---|
| వ్యవసాయం | | | ఇల్లకులు | | 8 |
| పట్టాదార్లు | 8 | | సర్ఫ్-ఖాస్ | 2 | |
| కౌలుదార్లు | 4 | 12 | పైగాలు | 3 | |
| మహిళలు | | 1 | పేష్కారి | 1 | |
| పట్టభద్రులు | | 1 | సాలార్‌జంగ్ | 1 | |
| విశ్వవిద్యాలయం | | 1 | సమస్థానాలు | 1 | |
| జాగీర్‌దార్లు | | 2 | ఉద్యోగులు | | 18 |
| మాషదార్లు | | 1 | గ్రామీణ చేతివృత్తులు | | 1 |
| న్యాయవృత్తి | | 2 | వెనుకబడిన తరగతులు | | 1 |
| వైద్యవృత్తి (పాశ్చాత్య + దేశీయ) | | 2 | ప్రాతినిధ్యం లేని ఇతర వర్గాలు | | 3 |
| ఉపాధ్యాయ వృత్తి | | 1 | ఇతరులు | | 6 |
| వాణిజ్యం | | 1 | | | |
| పరిశ్రమలు | | 2 | | | |
| బ్యాంకులు (దేశీయ+సహకార) | | 2 | | | |
| వ్యవస్థీకృత కార్యవర్గం | | 1 | | | |
| హరిజనులు | | 1 | | | |
| జిల్లా మున్సిపాలిటీలు | | 1 | | | |
| నగర మున్సిపాలిటీలు | | 1 | | | |
| గ్రామీణ బోర్డులు | | 1 | | | |
| | | 33 | | | 37 |

మత ప్రాతిపదికన ప్రాతినిధ్యం కంటే విధులు, వృత్తుల ప్రాతిపదికన ప్రాతినిధ్యం

వివిధ వర్గాల మధ్య సంఘీభావాన్ని పెంచుతుందా? అన్న అనుమానానికి అవకాశం హెచ్చుగానే ఉంది. ఇది ప్రస్తుత సామాజిక మత వైషమ్యాలను కొనసాగిస్తూ వర్గ చైతన్యాన్ని పెంపొందించి, వర్గ పోరాటానికి దారి తీయవచ్చు. ఈ రకమైన ప్రాతినిధ్యం హానికరం అనిపించకపోవచ్చు. కాని, దాని అసలు స్వరూపం వివిధ వర్గాల వారి సంఖ్యను బట్టి ప్రాతినిధ్యం కోరినప్పుడు బయటపడుతుంది. హైదరాబాదు రాజ్యాంగ సంస్కరణల్లో వృత్తి ప్రాతిపదిక ప్రాతినిధ్యం ఒకటే ముఖ్య అంశం కాదు. హైదరాబాదు శాసనసభలో హిందువుల, ముస్లిములకు కేటాయింపు ప్రతిపాదనలు అతి ముఖ్యమైన అంశం. నిజాం ఆమోదం తెల్పిన సంస్కరణల్లో మత ప్రాతిపదిక ప్రాతినిధ్యాన్ని పూర్తిగా బహిష్కరించలేదు. వృత్తి ప్రధానంగా తలపెట్టిన ప్రాతినిధ్యంతో పాటు, మత ప్రాతిపదికగా ప్రాతినిధ్యం కూడా అమలులో ఉంది. అయితే ఇది జాయింట్ ఎలక్టరేట్ ఆధారంగా అమలు పరచబడుతుంది. శాసనసభతో సహా అన్ని ఎన్నిక గల సంస్థల్లో[1] "మెజారిటీ గల ఇరు మతాలకు" సమాన ప్రాతినిధ్యం ఉంటుంది. సంబంధిత మత సభ్యులు వేసిన ఓట్లలో 40 శాతం వస్తే తప్ప ఎవరూ ఎన్నికైనట్టు కాదు. సమాన ప్రాతినిధ్యం అన్నది ఇరుమతాల సభ్యుల మొత్తం సంఖ్యతో సంబంధించి లేదు. అలాగే ఎన్నిక ఆధారంగా ఏర్పడే సంస్థలకే కాకుండా, నామినేటెడ్ వాటికి కూడా ఇది అనుసరిస్తుంది.

నమూనా ప్రాతినిధ్య సిద్ధాంతానికి మద్దతు కింది పేర్కొన్న ప్రకటన ద్వారా తెలుసుకోవచ్చు[3].

"చారిత్రకంగానూ, రాజకీయ వ్యవస్థలోను ముస్లిములకు రాష్ట్రంలో ఎంత ఉన్నతస్థానం ఉందంటే, అసెంబ్లీలో దాన్ని మైనారిటీగా కుదించలేం."

బ్రిటీష్ ఇండియాలో హిందూ ముస్లిం సమస్యకు మీర్ అక్బర్ అలీఖాన్ అనే వ్యక్తి కొన్ని ప్రతిపాదనలు చేశారు. అవి వార్తాపత్రికల్లో ఈమధ్యనే ప్రచురించారు. అవి :

1. భావి భారత రాజ్యాంగం పటిష్టమైన మిలిటరీ/రక్షణ పునాదిపై స్థూలంగా నిర్మితమై ఉండాలి. ప్రజల మనోభావం కూడా దీనికి అనుకూలంగా ఉండాలి. హిందువులకు, ముస్లిములకు మల్లె, ఇదే వైఖరి అవసరం.

---

1. సంస్కరణతో కేంద్ర శాసనసభ కాకుండా పంచాయితీలు, రూరల్ బోర్డులు, మున్సిపాలిటీలు, టౌన్ కమిటీల వంటి ప్రజా సంస్థల స్థాపన ప్రతిపాదించారు.
2. బేరార్‌ను మినహాయించి 1931 జనాభా లెక్కల ప్రకారం హైద్రాబాదు రాష్ట్ర జనాభా ఈ విధంగా ఉంది.

| హిందువులు | అస్పృశ్యులు | ముస్లిములు | క్రిస్టియన్లు | ఇతరులు | మొత్తం |
|---|---|---|---|---|---|
| 96,99,615 | 24,73,230 | 15,34,666 | 1,51,382, | 5,77,255 | 1,44,36,148 |

3. జాతీయ పార్టీ నాయకుడైన మీర్ అక్బర్ అలీఖాన్ తన ప్రతిపాదనలను, కాంగ్రెస్ మాజీ అధ్యక్షుడు శ్రీనివాస అయ్యంగారితో చర్చించానని వాటికి అయ్యంగార్ అనుమతి ఉందని పేర్కొన్నాడు.

2. ఉభయ మతాల వారికి భద్రత/రక్షణ అడిగే తరుణం వచ్చింది. భారత సైన్యంలో చెరి వర్గాలకు సమానంగా ప్రాతినిధ్యం ఉండాలి. మత ప్రాతిపదికగా రెజిమెంట్లు రద్దు చేసి వాటి స్థానంలో ప్రాంతీయ రెజిమెంట్లు ఏర్పాటు చెయ్యాలి.

3. ప్రాంతీయ, కేంద్ర ప్రభుత్వాలు పూర్తిగా జాతీయ ప్రభుత్వ రూపంతో కూడుకుని ఉండాలి. కేంద్ర, ప్రాంతీయ మంత్రివర్గాల్లో హిందువులు, ముస్లిములు సమానంగా ఉండాలి. ఎక్కడ అవసరమైతే ఇతర మైనారిటీ వర్గాలకు తగిన ప్రత్యేక ప్రాతినిధ్యం ఇవ్వాలి. ఇటువంటి పథకం జాయింట్ ఎలక్టరేట్లతో సజావుగా నడుస్తుంది. కాని, దేశంలో నెలకొన్న పరిస్థితి దృష్ట్యా ప్రస్తుతానికి ప్రత్యేక ఎలక్టరేట్‌నే కొనసాగించాలి. హిందూ మంత్రులు, హిందువులచేత, ముస్లిములు వారి మతానికి చెందిన వారి చేతా ఎన్నిక కాబడతారు.

4. రెండింట మూడు వంతుల ముస్లిం, హిందూ సభ్యులతో విడివిడిగా ఆమోదించిన అవిశ్వాస తీర్మానంతోనే కేబినెట్‌ను తొలగించవచ్చు.

5. భాష, లిపి వీటితోబాటు మతపరమైన న్యాయ రాజ్యాంగంలో ఒక మతానికి చెందిన సభ్యులు తమ మతానికి సంబంధించిన మార్పులను శాసనసభలో వీటో హక్కు ద్వారా రక్షించుకుంటారు. ఒక వర్గ ఆర్థిక ప్రయోజనాలను దెబ్బతీసే ఏ చట్టం అయినా ఇదే విధంగా పరిరక్షించుకోవచ్చు.

6. సర్వీసుల్లో కూడా సరైన మత ప్రాతినిధ్యం అమలు జరగాలి. దీనివల్ల దైనందిన పాలనలోనో న్యాయం లభించే అవకాశం ఉంది.

హైదరాబాదు రాష్ట్రంలో ఉన్న నేషనలిస్ట్ పార్టీ ఒక ముస్లిం ప్రముఖుడు ప్రవేశపెట్టిన ప్రతిపాదనలను ఒక సూచికగా తీసుకుంటూ పాకిస్తాన్‌కు ప్రత్యామ్నాయంపై బ్రిటీష్ ఇండియా ముస్లిం నాయకులు ఏ అభిప్రాయంలో ఉన్నారో అవగతమవుతుంది. పాకిస్తాన్ కోసం ప్రత్యామ్నాయం పై నేను వెలిబుచ్చిన అభిప్రాయాలకు పైన చెప్పినవి అదనంగా మద్దతునిస్తున్నట్లే కదా!

'ఆజాద్ ముస్లిం కాన్ఫరెన్స్' పేరిట 1940 ఏప్రిల్‌లో ఢిల్లీలో ఒక ముస్లిముల సమావేశం జరిగింది వాస్తవమే. ఇక్కడ సమావేశం అయినవారు అటు ముస్లింలీగ్‌కు ఇటు నేషనలిస్టు ముస్లిములకు వ్యతిరేకులు. పాకిస్తాన్ ఏర్పాటు వాదనను బలపరచనందువల్లా, రెండోది తమ హక్కుల పరిరక్షణ కోసం బ్రిటీష్ ప్రభుత్వ సహాయం నిరాకరించడంవల్లా అజాద్ ముస్లిం కాన్ఫరెన్స్ వారికి ముస్లింలీగ్ వ్యతిరేకులయ్యారు. ముస్లిముల సాంస్కృతిక, మతహక్కుల పట్ల ఉదాసీన వైఖరి పట్ల నేషనలిస్టు ముస్లింలకు కూడా 'ఆజాద్ ముస్లిం కాన్ఫరెన్స్' వారు వ్యతిరేకులయ్యారు.

ఆజాద్ ముస్లిం కాన్ఫరెన్స్‌ను మైత్రీ సమావేశంగా హిందువులు హర్షించారు. ఆజాద్ ముస్లిం కాన్ఫరెన్స్ ఆమోదించిన రెండు తీర్మానాలకు ముస్లింలీగ్ ఆలోచనలకు పెద్దగా భేదం లేదు. ఈ కింది పేర్కొన్న మూడు తీర్మానాల ద్వారా ఈ స్థితిని గమనించవచ్చు.

భౌగోళిక, రాజకీయ సరిహద్దులతో ఒక స్వతంత్ర దేశంగా భారత దేశం ఉంటుంది. ఇందులో జాతి, మతాలతో సంబంధం లేకుండా ప్రజలందరికీ ఒక ఉమ్మడి స్వదేశంగా ఉంటుంది. ఈ దేశ వనరులను అనుభవించడానికి భాగస్వాములుగా ప్రజలందరూ, దేశం నలుమూలల్లోని, ముస్లిం ప్రజల హృదయాలు, స్వగృహాలు, వారి జీవితాలకంటే, వారిచారిత్రక ఔన్నత్యం, మతం, సంస్కృతి వారికి ప్రీతి. అయితే జాతీయతా భావ కోణం నుంచి చూస్తే ప్రతి ముస్లిమూ భారతీయుడే. ఉమ్మడి హక్కులు, బాధ్యతల విషయానికి కొస్తేఇతరులతో వీరు సమానమే. ఈ విధంగా పోలిస్తే, ప్రభుత్వ సర్వీసులలోనూ, ప్రభుత్వంలోనూ, ఆర్థిక రంగంలో, ఇతర రంగాల్లో ఒక ముస్లిం దేశంలో ఏ ఇతర పౌరుడితో సమానంగా హక్కులు పొందడానికి అర్హుడే. అదే విధంగా దేశ స్వాతంత్ర సాధనకు ఇతరులతో సమానంగా ముస్లిములు కూడా త్యాగాలు చెయ్యాలి. బాధ్యతలను నిర్వ ్ చాలి. ఈ ఆలోచనా విధానానికి ఏ ఉచితజ్ఞుడైన ముస్లిముకూ అభ్యంతరం ఉండకూడదు. వారి మతానికి సంబంధించిన అన్ని హక్కుల పరిరక్షణతో పాటు భారతదేశానికి సత్వరం స్వాతంత్ర్యం సాధనకై ఈ కాన్ఫరెన్సు తనకున్న సర్వ అధికారంతో నిర్ద్వంద్వంగా ప్రకటిస్తోంది. ఈ లక్ష్యంతోనే గతంలో అనేక త్యాగాలు చేశారు. ఇప్పుడు కూడా మరిన్ని త్యాగాలు చేయడానికి సిద్ధంగా ఉన్నారు.

"భారత దేశ స్వాతంత్ర్య సాధనకు భారతీయ ముస్లిములు నిరోధకులని సాగుతున్న బ్రిటీష్ సామ్రాజ్యవాద ఏజెంట్ల నిరాధార ఉపవాదును తీవ్రంగా ఖండిస్తున్నాం. భారత ముస్లిములు వారి బాధ్యతల్ని వారెరుగుదురు. స్వాతంత్ర్య సాధనలో ఏ ఇతర వర్గాలకంటే వెనుకంజ వేయడం వారి సాంప్రదాయాలకూ, గౌరవానికి విరుద్ధమైన చర్య" ఈ తీర్మానం ద్వారా పాకిస్తాన్ స్థాపనను తోసిపుచ్చారు.

రెండో తీర్మానం ఈ విధంగా ఉంది : భారతదేశ ప్రజలచే ఓటింగ్ ద్వారా ఎన్నుకోబడిన ప్రతినిధుల ద్వారా ఆమోదించబడిన రాజ్యాంగం ద్వారా ఏర్పడిన ప్రభుత్వమే భారత ప్రజలకు ఆమోదయోగ్యం అని, ముస్లిం కాన్ఫరెన్సు భావిస్తుంది. రాజ్యాంగ సభలో ముస్లిము సభ్యుల తమ ప్రయోజనాల రక్షణపై ప్రతిపాదనలను భారత రాజ్యాంగం పరిరక్షించాలి. ఈ ప్రయోజనాల పరిరక్షణతో ఇతర కులాల, మతాల వారికి ప్రమేయం లేదు. ముస్లిముల హక్కులను ఎలా పరిరక్షించుకోవాలో ముస్లిములే నిర్ణయించుకోవాలని ఈ తీర్మానం ద్వారా నిర్ణయించారు.

కాన్ఫరెన్సు మూడో తీర్మానం : "ప్రభుత్వ సుస్థిరతకు, భద్రతను కాపాడడానికి ప్రతి పౌరుడూ, వర్గమూ ప్రశాంతంగా ఉండటానికి, భావి భారత రాజ్యాంగంలో ముస్లిములను

సంతృప్తి పరచడానికి ఈ పరిరక్షణ పథకాన్ని తప్పనిసరిగా అమలు జరపాలని భావిస్తోంది."

27 మంది సభ్యులతో కూడిన ఒక మండలిని ఈ కాన్ఫరెన్సు నియమిస్తుంది. ఈ మండలి ఇతరులతో సంప్రదించిన తర్వాత పూర్తి దర్యాప్తు అనంతరం దేశంలో శాశ్వతంగా మతానికి సంబంధించిన జటిల సమస్య పరిష్కారానికి అధ్యయనం చేసిన తరువాత తన సిఫార్సులను రెండు నెలల్లో ఈ కాన్ఫరెన్సుకు తిరిగి సమర్పిస్తుంది. ఈ మండలికి నివేదించిన అంశాలు :

1. ముస్లిం సంస్కృతికి మతపరమైన న్యాయానికి సంబంధించిన హక్కుల పరిరక్షణ.

2. ముస్లిముల రాజకీయ హక్కులు వాటి రక్షణ.

3. పూర్తి ఫెడరల్ వ్యవస్థగా, భావి భారత రాజ్యాంగ రూపకల్పన ముస్లిముల ఆర్థిక, సామాజిక సాంస్కృతిక హక్కుల రక్షణ, ప్రభుత్వ సర్వీసుల్లో వారి వాటాకు సంబంధించి అంశాలు పొందు పరచడం.

మండలిలో ఏర్పడే ఖాళీల భర్తీకై ఎటువంటి చర్యలనైనా తీసుకోవచ్చు. ఇతర సభ్యులను కో ఆప్ట్ చేసుకొనే హక్కు బోర్డు కుంటుంది. ఈ బోర్డు దేశంలో ఇతర ముస్లిం వ్యవస్థలను సంప్రదించే అధికారం కలిగి ఉంటుది. అలాగే అవసరమైతే బాధ్యతాయుతమైన ఇతర సంస్థలతో కూడా సంప్రదింపులు జరపవచ్చు. ఈ మండలిలో 27 మంది సభ్యులను నియమించే అధికారం కాన్ఫరెన్స్ అధ్యక్షుడికుంది.

9 మంది సభ్యులతో ఈ మండలి సమావేశాలు జరపవచ్చు. ఈ కాన్ఫరెన్స్‌లో ఆమోదించిన తీర్మానం ప్రకారం వివిధ మతాల హక్కుల పరిరక్షణ రాజ్యాంగసభ నిర్ణయిస్తుం ది. కాబట్టి, ఇస్లాం మతానికి చెందిన ముస్లిములే వారి సభ్యులను రాజ్యాంగ సభకు ఎన్నుకుంటారని ఈ కాన్ఫరెన్సు ప్రకటిస్తోంది.

ముస్లిముల భద్రత హక్కుల కోసం ఆజాద్ కాన్ఫరెన్స్ నియమించిన మండలి ఏ సిఫార్సులు చేసిందో తెలుసుకోవడానికి వారి నివేదిక కోసం వేచి చూడాలి. పాకిస్తాన్‌కు ప్రత్యామ్నాయంగా నేను ఊహించిన ప్రణాళికకు విరుద్ధంగా వారి నివేదిక ఉంటుందని అనుకోవడానికి ఆస్కారం లేదు. ముస్లింలీగ్‌కే కాకుండా, జాతీయ ముస్లిములకు కూడా ఆజాద్‌ముస్లిం కాన్ఫరెన్స్ వ్యతిరేకిస్తున్నారన్నది ఇక్కడ మనం మరచిపోకూడదు. అందుచేతనే హిందువుల పట్ల ఆజాద్‌కాన్ఫరెన్స్ వారు ముస్లింలీగ్ కంటే ఇప్పుడు కాని మరింత మైత్రీ వైఖరి అవలంబిస్తారని అనుకోవడానికి తావు లేదు. ఈ విషయంలో నా ఊహే నిజమైతే హిందువుల ప్రతి స్పందన అన్నది తెలుసుకోవడం ఆసక్తికరంగా ఉంటుం ది. పాకిస్తాన్‌కు ప్రత్యామ్నాయాన్ని అంగీకరిస్తారా లేదా పాకిస్తాన్‌కోరేవారే ఇటువంటి ప్రత్యామ్నాయాన్ని అంగీకరించాలంటారా?

హిందువులు వారి నాయకులకే ఈ ప్రశ్నలకు జవాబు చెప్పాలి. ఈ ప్రశ్న పట్ల వారి

వైఖరిని కొన్ని అంశాలు నిర్ణయించాలని నేను భావిస్తున్నాను. వారు గుర్తుంచుకోవాల్సిన అంశాలు :

1. Macht Politicకి Gramavin Politicకి భేదం ఉందని అంటే అధికార రాజకీయాలలో (Macht Politic) అధికారం కోసం ఒక ముఖ్య వ్యూహంగా ఇక్కట్లను సృష్టించడం

2. కమ్యూనిటాస్, కమ్యూనిటేటం (Communitas, Communitatum)కు నేషన్ ఆఫ్ నేషన్స్‌కు భేదం ఉంది.

3. బలహీన వర్గాల భయాందోళనలను పారదోలడానికి ఉద్దేశించిన పరిరక్షణా చర్యలకు ఏ విధంగానైనా అధికారం పొందాలనే బలమైన వర్గానికి భేదాలు; చివరికి –

4. పరిరక్షణలు కల్పించడానికి, దేశాన్ని ఒప్పగించడానికి భేదం ఉందని గ్రహించాలని నేను భావిస్తున్నాను. వారు ఇంకా గుర్తుంచుకోవలసినవి ఏమిటంటే –

   ఎ) అధికారం కోసం ధైర్యంగా సమర్పించేది (Gramavin Politic)అటకార రాజకీయాలకు చేయక్కర లేదు.

   బి) ఒక మతానికి ధైర్యంగా అర్పించేది దేశానికి కాదు.

   సి) బలహీనవర్గం ఆందోళనలను తొలగించడానికి వారి రక్షణకు ఆయుధంగా ఉపయోగపడేది, అధికారం కోసం పాకులాడే వారికి ఇవ్వకూడదు. ఇవి చాలా ముఖ్యమైన సవాళ్ళు. వీటిని హిందువులు విస్మరింపలేరు. ఎందుకంటే ముస్లింల ప్రత్యామ్నాయం అంత భయంకరమైంది.

# ఇతర దేశాల నుంచి నేర్చుకోవలసిన పాఠాలు

భారతదేశాన్ని పాకిస్తాన్, హిందూస్తాన్‌గా చీల్చడం హిందువుల అభీష్టానికి విరుద్ధం. ఎందుకంటే వారు భారతదేశ భౌగోళిక స్వరూపాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ [illegible] కానివ్వమంటారు. ఈ భౌగోళిక ఐక్యతను కాపాడడానికి ఎంత మూల్యం [illegible] అంటున్నారు. ఇతర దేశాలు ఇటువంటి పరిస్థితులను ఎదుర్కొన్నాయి.

అన్ని దేశాల చరిత్రను ఇక్కడ వర్ణించడం సాధ్యం కాదు. టర్కీ, [illegible] ఇటువంటి పరిస్థితులను ఎలా ఎదుర్కొన్నాయో వివరిస్తాను.

## టర్కీ :

క్రీ.శ. 1230-40ల మధ్య మధ్య ఆసియా ప్రాంతం నుంచి మంగోలులు [illegible] కొట్టడం వల్ల టర్కులు ఎనటోలియా ఆగ్నేయంగా ఉన్న ప్రాంతంలో స్థిరపడ్డారు. 1326 [illegible] బ్రూసాని ఆక్రమించడం ఆ టర్కీ ఒక రాజ్యంగా రూపు దిద్దుకోవారంభించింది. [illegible] 61లో త్రేస్‌ని జయించారు. 1361-62లో కాన్‌స్టాంటినోపుల్‌లో బైజెంటైన్ ప్రభుత్వం టర్కుల అధికారాన్ని ఆమోదించింది. 1369లో బల్గేరియా, 1371-72లో మాసిడోనియా వారి వశమైంది. 1373 కల్లా ఓటమాన్ (Ottoman) వంశ సార్వభౌమాధికారాన్ని కాన్‌స్టాంటినోపుల్ పూర్తిగా ఆమోదించింది. 1389లో సెర్బియా, 1430లో సాలోనికు, 1453లో కాన్‌స్టాంట్‌నోపుల్, 1461లో ట్రెబిజాండ్, 1465లో ఖరామాన్ జయించారు. [illegible] 1514-17 మధ్య సిరియా, మొగుల్, ఈజిప్టు, హియాజ్, యమాన్‌లు కైవశపరచుకున్నారు. 1521-1526లలో బెల్‌గ్రేడ్, మెహంజ్‌లపై విజయం సాధించారు. బాగ్దాద్‌పై 1554, [illegible] రెండుసార్లు దాడి చేసి జయించారు. యూరప్‌తో వీరికి రెండుసార్లు ఎదురుదెబ్బలు [illegible] ఆ ఖండంలో విజయావకాశాలకు దెబ్బ తగిలింది. అయినప్పటికీ 1326-1683 [illegible]

సాధించిన విజయాలు ఒక అఖండ సామ్రాజ్య స్థాపనకు తోడ్పడ్డాయి. ఆ తర్వాత కొన్ని అపజయాలు తోడై కొన్ని స్థావరాలు కోల్పోయినప్పటికీ 1789, ఫ్రెంచి విప్లవానికి టర్కిష్ సామ్రాజ్యం :

1. బాల్కన్
2. ఆసియా మైనర్(సైప్రస్‌తో కలిపి)
3. సిరియా, పాలస్తీనా,
4. ఈజిప్టు
5. ఈజిప్టు నుంచి మొరాకో వరకున్న ఉత్తరాఫ్రికాతో కలిపి ఉండేది.

టర్కులు సామ్రాజ్య పతనాన్ని సులువుగా పేర్కోవచ్చు. 1769లో ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగానైనా ఈజిప్టు, బాల్కన్లలో క్రైస్తవులకు, 1812లో రష్యాతో యుద్ధంలో బెసరేనియాను పోగొట్టుకుంది. రష్యా సహాయంతో సెర్బియా 1812లోనే కోల్పోయింది. ప్రత్యేక ప్రభుత్వం ఆజమాయిషీలో టర్కులు ఉండాల్సి వచ్చింది. 1829లో డనుబియన్ ప్రాంతాలైన మొల్టావియా, వాలేబియాలు ఇటువంటి స్వాతంత్ర్యాన్ని పొందాయి. గ్రీకు స్వాతంత్ర సంగ్రామం 1822-29ల మధ్య జరిగి టర్కీ అధీనం నుంచి విడిపోయాయి. 1875-77లలో బాల్కన్‌తో అంతర్యుద్ధాలు పెచ్చు పెరిగాయి. బల్గేరియన్లు టర్కీ దేశస్థులపై అనేక అత్యాచారాలు జరిపారు. టర్కులు కూడా బల్గేరియన్లపై అనేక అత్యాచారాలకు పూనుకోవడం వల్ల, రష్యా, సెర్బియా, మాంటె నీగ్రోలు టర్కీపై యుద్ధం ప్రకటించాయి. బెర్లిన్ సంధి ఆధారంగా బల్గేరియాతో టర్కీ ఆధ్వర్యంలో స్వపరిపాలన ప్రవేశపెట్టబడింది. అదే విధంగా తూర్పు రొమేనియా, టర్కీ అధీనంలో క్రిస్టియన్ గవర్నర్ ద్వారా పాలించబడింది. 1881లో గ్రీస్ థెసలీని ఫ్రాన్స్‌ట్యునిస్ ఆక్రమించాయి. 1885 బల్గేరియా, తూర్పు రొమేనియాల ఏకీకరణ జరిగింది.

1906 వరకూ టర్కీ రాజ్యం అవతరణ, పతనం లేన్‌పూల్ మాటల్లో చెప్పాలంటే:

"పూర్వపు పార్టీ, ప్రస్తుతం వ్యవహరించే టర్కీ విస్తీర్ణం - గ్రీస్, బల్గేరియా, తూర్పు రొమేనియా, సెర్బియా, బోస్నియా, హెర్జ్‌గోలినా, (క్రెమియా, దక్షిణ రష్యాలో కొంత ప్రాంతం) ఈజిప్టు, సిరియా, ట్రిపోలిటునిస్, అల్జీర్స్, మెడిటెరేనియన్‌లో అనేక ద్వీపాలు, అరేబియా ఎడారిలో విస్తారమైన ప్రాంతాలతో కలిపి 5 కోట్ల ప్రజలతో టర్కీ రాజ్యం విస్తరించి ఉండేది. రష్యా మినహాయిస్తే టర్కీ యూరప్‌కు రెండింతలు ఉండేది. అయితే ఒక్కొక్క ప్రాంతాన్ని కోల్పోయింది. అల్జీర్స్, టునిస్‌లు ఫ్రాన్స్‌తో విలీనం చెందాయి. అరకోటి జనాభా 1,75,000 వేల మైళ్ల ప్రాంతం ఇతరుల కైవసమైంది. ఈజిప్టు స్వాతంత్రంతో 5 లక్షల మైళ్ళ ప్రదేశం 60 లక్షల మంది ప్రజలు టర్కీ నుంచి విడిపోయినట్లే. ఆసియా ప్రాంతంలో ఉన్న టర్కీకి అంత నష్టం కలగలేదు. దీని వైశాల్యమే 680 వేల చదరపు మైళ్ళు.

ఆఫ్రికాలో ట్రిపోలి తప్ప ఇతర ప్రాంతాలు టర్కీ కోల్పోయింది. సెర్బియా, బోస్నియాలు 40 వేల మైళ్ళ ప్రదేశం 35 లక్షల జనాభా ఆస్ట్రియా అధీనంలోకి వచ్చాయి. కలవడంతో వాలేబియా, మోల్టావియో, రొమేనియా 46 వేల మైళ్ళ ప్రాంతం, అరకోటి జనాభా టర్కీ కోల్పోయింది. 2.30 లక్షల మైళ్ళ విస్తీర్ణం, రెండు కోట్ల జనాభా కలిగిన టర్కీ చివరికి 66 వేల మైళ్ళ విస్తీర్ణాన్ని 45 లక్షల జనాభాకు కుదించుకుపోయింది. 3 వంతుల వైశాల్యం, మొత్తంలో మూడో వంతు జనాభాను నష్టపోయింది.

ఇది 1907కు టర్కీ పరిస్థితి. ఆ తర్వాత టర్కీ చరిత్రలో మరిన్ని దురదృష్ట సంఘటనలు జరిగాయి. యంగ్‌టర్క్‌లు తిరుగుబాటు మూలంగా 1908లో బోస్నియా ఆస్ట్రియా ఆక్రమించింది. హెర్జ్‌గోలినా బల్గేరియాలు స్వాతంత్రం ప్రకటించుకున్నాయి. ట్రిపోలీని 1911లో ఇటలీ కైవసం చేసుకొంటే 1912 ఫ్రాన్స్ మొరాక్కోను ఆక్రమించుకుంది. ఇటలీ 1912లో సాధించిన విజయాలతో ఉత్తేజితులై బల్గేరియా, గ్రీస్, సెర్బియా, మాంటినిగ్రోలు 'బాల్కన్‌కూటమి'గా గుమిగూడి టర్కీపై యుద్ధం ప్రకటించాయి. మొదట బాల్కన్ యుద్ధంగా ప్రాచుర్యంలోకి వచ్చిన ఈ యుద్ధం టర్కీ ఓటమిని చవి చూసింది. లండన్ సంధి (1913) ద్వారా ఈ యుద్ధం అంతం అయింది. దాని వల్ల టర్కీ పరిధి కాంస్టాంటినోపుల్ చుట్టూ పరిమితమై పోయింది. అయతే ఈ ఒడంబడిక చివరకు యుద్ధం ద్వారా పొందిన భూభాగాలను, ఇతర ఆస్తులను పంపకాల వివాదంపై వీగిపోయింది. 1913లో బల్గేరియా బాల్కన్‌కూటమిలోని ఇతర సభ్య దేశాలపై యుద్ధం ప్రకటించగా, రొమేనియా తన స్థావరాలను ఎంచుకోవడానికి బల్గేరియాపై తిరగబడింది. టర్కీ కూడా అదేమాదిరిగా యుద్ధాలలో పాల్గొంది. బుఖారెస్ట్ సంధి (1913) రెండో బాల్కన్‌సంగ్రామాన్ని పరిసమాప్తి చెందించింది. దీనివల్ల టర్కీ బల్గేరియా నుంచి థ్రెస్‌లను తిరిగి పొందింది. ఉత్తర దక్షిణ మాసిడోనావాను సెర్బియా, గ్రీసులు అదే విధంగా రాబట్టుకున్నాయి.

మాంటినిగ్రో టర్కీ భూభాగాన్ని కొంత సంపాదించుకుంది. 1914 యూరప్ మహా సంగ్రామం ఆరంభానికి టర్కీ నుంచి బాల్కన రాజ్యాలు స్వాతంత్రం పొందాయి. దీనివల్ల కాంస్టాంటినోపుల్ చుట్టూ ఉన్న ప్రాంతం, ఆసియాలో కొన్ని ప్రాంతాలు మినహాయించి టర్కీకి ఇంక ఏమీ మిగలలేదు. ఆఫ్రికాకు వస్తే ఈజిప్టు, ఉత్తర ఆఫ్రికాపై టర్కీ సుల్తాన్ అధికారం నామమాత్రంగానే ఉంది. అప్పటికి యూరప్ రాజ్యాలు తమ అధికారాన్ని స్థిర పరచుకున్నాయి. 1914 యూరప్ యుద్ధం టర్కీ పతనానికి నాంది పలికింది. మెడిటరేనియన్ నుంచి పెర్షియన్‌గల్ఫ్ వరకూ టర్కీ ప్రాంతాలన్నింటిలో శత్రు సైన్యాలు ఆక్రమించి బాగ్దాద్; జెరుసలం; డెమస్కస్, అలెప్పో వంటి మహా నగరాలను కైవస పరచుకొన్నాయి. మిత్రపక్షాల సేనలు కాన్‌స్టాంటినోపుల్‌ను ఆక్రమించాయి. టర్కీతో యుద్ధం సెవరెస్ సంధి ద్వారా అంతమై చుట్టూరా ఉన్న ప్రాంతాలైన అన్నింటిని కోల్పోయింది. వీటిలో అతి భూసారం గల ఆసియా మైనర్ ప్రాంతాలు కూడా ఉన్నాయి. మసిడోనియా, థ్రేస్ (Thrace), గ్రీకుకు,

...టోలియా, దక్షిణ టర్కీలో ఉన్న అనేక సుదీర్ఘ ప్రాంతాలు, ఆసియాలో ఇరాక్ సిరియా, ...లస్తీనా, హెడ్‌జజ్, నెడ్డ్ వంటివి ఇటలీకి ఉదారంగా ఇవ్వబడ్డాయి. టర్కీ ఒక్క ...న్‌స్టాంటినోపుల్‌తో సరిపడాల్సి వచ్చింది. టర్కీ సుల్తాన్‌కు ఈ సంధి ఆమోదమైనా దీన్ని ...మాల్ పాషా ఆధ్వర్యంలో ఉన్న నేషనల్ పార్టీ తీవ్రంగా వ్యతిరేకించింది. కొత్తగా సంక్రమించిన ప్రాంతాలను ఆక్రమించడానికి రాబోయే గ్రీకు సైన్యాలను టర్కీ సైన్యాలు తిప్పికొట్టి ఓడించాయి. 1920–22ల మధ్య జరిగిన ఈ యుద్ధంలో టర్కీ తిరిగి Smyrna ఆక్రమించాయి. ...పక్ష దేశాలు తిరిగి గ్రీక్‌లకు సైన్యాలను పంపనందువల్ల గ్రీకులు జాతీయ టర్క్‌లతో ఒప్పందానికి రావలసి వచ్చింది. 1923 లుసానే ఒప్పందం ద్వారా పశ్చిమ థ్రేస్ తప్ప ఇతర ...దేశాన్నింటిని గ్రీకులు ఆమోదించారు. సెవరిస్ ఒప్పందాన్ని తిరిగి టర్క్‌లు ఆమోదించారు. ...వల్ల ఆసియాలో అరబ్బు ప్రాంతాలన్నింటిని కోల్పోయింది. 1914 యుద్ధం ప్రారంభం ...మయానికే టర్కీ యూరప్‌లో ప్రాంతాలన్నింటిని వదులుకుంది. టర్కీ సామ్రాజ్యం పతనం ... తర్వాత మిగిలింది రిపబ్లిక్ ఆఫ్ టర్కీగా మిగిలింది అతి చిన్న రాజ్యం. ఇది పూర్వం ...జ్యంతో పోలిస్తే అతి చిన్నదో.

## II

ఇక చెకస్లోవేకియా విషయానికి వస్తే, 1914 యూరప్ యుద్ధం ట్రయనాన్ సంధి ...ంగా ఇది రూపు దిద్దుకుంది. దీని కన్న ఘోరమైన సంధి మరొకటి ఉండదు. ప్రొఫెసర్ ...రటనీ మాటల్లో "ఈ సంధి వల్ల విచ్ఛిన్నమే కాదు నిరూపి అయింది. క్రోషియా, స్లావోనియాను మినహాయించినా భూభాగంలో హంగేరి మూడో వంతుకు తగ్గిపోయింది. ...సుమారు అర్వై శాతం కోల్పోయింది. పూర్వపు హంగేరీ ఏడు రాజ్యాలుగా విడిపోయింది. ... రాజ్యాలలో పూర్వం లేనిది కొత్తగా సృష్టించబడింది చెకస్లోవేకియా."

చెకస్లోవేకియా రిపబ్లిక్ వైశాల్యం 54,244 చదరపు మైళ్ళు. దాని జనాభా 1,36,13,172. పూర్వం బొహిమియా, మొరాలియా, స్లోవాకియా, రుథినియాలు ఇప్పుడు దీని ప్రాంతాలు.

ప్రధానంగా బొహిమియా, మొరాలియాలలో ఉండే జెక్‌లు (2) స్లోవేకియాలో ఉండే స్లో...లు (3) రుథినియాలో ఉండే రుథినియన్లుతో కూడిన సంయుక్త రాష్ట్రంగా చెకస్లోవేకియా రూపు దిద్దకుంది.

చెకస్లోవేకియా రెండు దశాబ్దాలు రాజకీయంగా అతి తక్కువ కాలం మనుగడ ...ంచింది. 15 మార్చి 1939కి ఇది అంతం అయింది. జర్మనీ అధికరణ కిందకు పోయింది. ... అంతం కావడానికి దోహదపడిన పరిస్థితులు సంభ్రమాల్ని కల్గిస్తాయి. ఏ రాజ్యాలైతే దీని ... కారణమో అవీ దీని పతనానికి దారి తీశాయి. 1938 మ్యూనిచ్ ఒప్పందం పై

... విస్తీర్ణం 2,94,492 చదరపు మైళ్ళు. (3708 మైళ్ళ విస్తీర్ణం సరస్సులు మినహా అయింది) ... ప్రస్తుత విస్తీర్ణం 9,527 చదరపు మైళ్ళు మాత్రమే.

సంతకాలు చేసిన బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీలు ప్రపంచ యుద్ధంలో వారి ప్రత్యర్థి అయిన జర్మనీకి, ఒకప్పటి తమ తరఫున ఉన్న చెకస్లోవేకియాను కబళించడానికి సహాయపడ్డాయి. స్వాతంత్ర్యం కోసం గత వంద సంవత్సరాలుగా చెక్‌ల కృషి అంతా దాంతో తుడిచిపెట్టుకు పోయింది. జర్మన్ ప్రభువులకు తిరిగి బానిసలయ్యారు.

III

టర్కీ విచ్ఛిన్నానికి కారణాలేమిటి? 'టర్కిష్ ఎంపైర్' అనే గ్రంథంలో లార్డ్ ఎవర్స్లీ దీనికి కొన్ని అంతర్గత, బహిర్గత కారణాలను పేర్కొన్నాడు. అంతర్గత కారణాలు రెండు : ఒకటి ఓటుమాన్ వంశ అంతర్గత కలహాలు – సర్వాధికారం సుల్తాన్‌ల వజీర్ల చేతుల్లోకి, సుల్తాన్ వద్ద ఉండే స్త్రీల చేతుల్లోకి పోవడం జరిగింది. అధికారులతో తరచూ ఈ స్త్రీ ముఠాకు విభేదాలు తల ఎత్తేవి. అధికారులు అన్ని పదవులు – సాధారణ పాలన, మిలిటరీ పదవులు కూడా ఎవరు డబ్బులు ఎక్కువ ఇస్తే వారికి ఈ పదవులు ఇవ్వడం ప్రారంభించారు. తమ లక్ష్య సాధనకు సుల్తాన్ అంతఃపుర స్త్రీలకు లంచాలు ఇవ్వడం మొదలెట్టారు. దాంతో టర్కిష్ సామ్రాజ్యంలో లంచగొండితనం పెచ్చు పెరిగిపోయింది. రాజ్య పతనానికి కారణమైంది.

మూడు వందల సంవత్సరాల్లో సైనిక రంగం పూర్తిగా తన హంగుని కోల్పోయింది. ఈ సైనికశక్తి ద్వారానే ఓటమాన్ సుల్తాన్‌లు అనేక యుద్ధాలు గెలిచారన్నది మరవకూడదు. అయితే సైనికశక్తి కోల్పోవడానికి ప్రధాన కారణం టర్క్‌లను, అరబ్‌లనే కాకుండా ఇతరులని సైనికులుగా తీసుకోవడం. ఆ తర్వాత రాజ్య విస్తరణకు అవకాశాలు తగ్గిపోవడం, ప్రతి యుద్ధంలోనూ ధనాగారాలను కొల్లగొట్టే వారు ఆ ధనాన్ని పంచుకొనేవారు. ఆ తర్వాత కాలంలో ఆక్రమించిన ప్రదేశాలను పాలించవలసి వచ్చింది. కొత్త యుద్ధాలు లేవు. అందువల్ల సైనికులకు ప్రోత్సాహకం లేదు. దాంతో సైనికులకు ఆసక్తి తగ్గిపోయింది.

బహిర్గత కారణాలలో యూరోపియన్ దేశాల రాజ్య దాహం? ఇది నిజమైన కారణం కాకపోవచ్చు. యూరప్ ప్రజలలో ప్రజ్వరిల్లిన జాతిభావనం టర్కీ విచ్ఛిన్నానికి హేతువు. టర్కీపై గ్రీకు, సెర్బ్, బల్గేరియా ఇతర బాల్కన్ రాజ్యాల తిరుగుబాటు క్రైస్తవ-ఇస్లామ్ మతాల మధ్య సంఘర్షణను ప్రధానంగా సూచిస్తాయి. అయితే బహిర్గతంగా కనబడేదే ఇది. ముందు పేర్కొన్నట్టు పెరిగిన జాతీయతా భావనకు సూచికలు. టర్కీలో అరాచక పాలనే తిరుగుబాటుకు కారణం. ఇస్లాం మతం పట్ల ఏహ్య భావం, యూరోపియన్ దేశాల ముఠా రాజకీయాలు దానికి తోడైనాయి. అయితే పెరిగిన జాతీయతా భావనే అసలు ప్రేరణకారి. అరబ్బులు స్వాతంత్ర్యం కోసం పెచ్చు పెరిగిన జాతీయతా భావనే టర్కీ విచ్ఛిన్నానికి కారణం. ఇక్కడ ఇస్లాం క్రైస్తవుల మధ్య సంఘర్షణ లేదు. అలాగని టర్క్-అరబ్బుల మధ్య పీడిత-పీడనకారుల మధ్య ఉండే సంబంధం లేదు. అయినప్పటికీ టర్కీ నుంచి, అరబ్‌లు విముక్తి పొందామని పేర్కొన్నారు. కారణం అరబ్ జాతీయతా భావనకు లోనై టర్కీ రాజ్యంలో ప్రజలుగా ఉండడం కంటే, అరబ్

దేశ సోదరుడిగానే ఉండడానికి ఉద్యుక్తులవడం.

చెకస్లోవేకియా అంతం కావడానికి కారణం ఏమిటి? జర్మన్‌ల దాడి అని సాధారణంగా అనుకుంటారు. ఇది పూర్తి జవాబు కాదు. జర్మన్‌లు విరోధులైతే, తన సరిహద్దులో సుడేటాన్ జర్మన్ ఉంటే కొంత భాగాన్ని తప్ప ఇంకేమీ కోల్పోయేది కాదు. నిజానికి చెకస్లోవేకియా విచ్ఛిన్నం తన సరిహద్దుల్లో ఉండే స్లోవేకియా జాతీయ వాదం అనే శత్రువు వల్లే జరిగింది. రాజ్య ఐక్యతను విచ్ఛిన్నం కావించి స్వాతంత్ర్యం సాధించాలన్న దృఢ సంకల్పమే దీనికి కారణం.

చెక్‌లతో కలిపి స్లోవక్ ఐక్య రాజ్యం కొన్ని ఊహాజనితమైన కారణాలపై ఆధారపడింది. ఇరువర్గాల ప్రజలకు అనేక సారూప్యాలున్నాయని స్లోవక్‌లు – చెకస్లోవేకియాలో ఒక భాగమే అన్నది ఒకటి. రెండోది ఉభయ ప్రజలకి చెకొస్లోవక్ అనే ఒకే భాష మాట్లాడతారని. స్లోవక్ జాతీయతా భావన అన్నది లేదనేది మూడోది. ఈ ఊహా జనితాలను అపుడు ఎవ్వరూ నిశితంగా పరిశీలించలేదు. ఎందుకంటే 1918 శాంతి కాన్ఫరెన్సు ద్వారా స్లోవక్‌లే ఏకీకరణని లాంఛనంగా ప్రకటించుకున్నారు. ఇది తొందరపాటుకు నిదర్శనం. ప్రొఫెసర్ మెకారేట్ని మాటల్లో :

"చెక్, స్లోవక్ మధ్య సంబంధాలకు కేంద్ర రాజకీయ అంశం చరిత్ర పరిశీలన ప్రస్తుతం చేస్తే అవగతం అయ్యేది ఏమంటే స్లోవక్ జాతి భావన ఆవిర్భావం. ఐక్య స్లోవేకియా, దాని భాష అన్నది పైకి కనిపించేటంత దృఢంగా లేవు. అలా అనుకునే వారి సంఖ్యను వేళ్ళల్లో లెక్కించవచ్చు. స్లోవక్ భాషని అధికార భాషగా చెక్‌లు గుర్తించారు. చెకస్లోవేకియా అన్నది అధికారికంగా విదేశీయులకోసం మిగిలిపోయింది. ఆ దేశంలో అనేక వారాలున్న నాకు "చెకస్లోవేకియా" అన్న మాట ఒక మహిళ ప్రయోగించింది. జాత్యాహంకారం వల్ల లాభాలు లేవని ఆమె అనుకొని ఉండవచ్చు. ఏ చెక్, స్లోవక్‌లు చెకస్లోవేకియన్లుగా అభివర్ణించుకోరు. సుడేటాన్ జర్మన్‌లు స్వయంపాలన సాధన స్లోవక్‌ల జాతీయాభిమానికి ఆజ్యం పోసినట్లయింది. ముఠా రౌడీ రాజకీయాల ద్వారా సుడేటన్ జర్మన్లు లక్ష్యాన్ని సాధించుకున్నారు. స్లోవక్‌లు ఈ ఉదాహరణగా తీసుకొని వేరే మార్గాల ద్వారా స్వాతంత్ర్య సాధనకు పూనుకున్నారు. స్వాతంత్ర్య సాధన వారి లక్ష్యం కాదు. అక్టోబర్ 8న విడుదల చేసిన ఒక ప్రకటనలో స్వయంపాలనా పోరాట నాయకుడు డా. టిసో ఈ విధంగా పేర్కొన్నాడు. 'భగవంతుడు, దేశం కోసం క్రైస్తవ, జాతీయ స్ఫూర్తితో ఆశయసిద్ధికై ముందుకు పయనిస్తాం.

వారి నిజాయితీలో నమ్మకం ఉంచి అధికార సాధనకోసం అవలంబించే క్షుద్ర రాజకీయ ధోరణులను విడనాడి ప్రాగ్ జాతీయ అసెంబ్లీ, మ్యూనిచ్ సంధి తర్వాత ఒక చట్టాన్ని 1938లో ఆమోదించింది. స్లోవాకియా స్వయం ప్రతిపత్తిపై రాజ్యాంగ చట్టంగా దీన్ని వ్యవహరిస్తారు. ఈ చట్టంలోని అంశాలు విస్తృతమైనవి. వీటి ప్రకారం స్లోవేకియా ప్రత్యేక

పార్లమెంటును కలిగి ఉంటుంది. చెకస్లోవేకియా రిపబ్లిక్ న్యాయ పరిధిలో ఈ పార్లమెంట్ స్లోవక్, రాజ్యాంగాన్ని నిర్దేశిస్తుంది. స్లోవేకియా ప్రాంతాలను స్లోవక్ పార్లమెంట్ 2/3 వంతుల మెజారిటీ ఆధారంగా నిర్దేశిస్తుంది.

అదే విధంగా అంతర్జాతీయ ఒప్పందాలకు స్లోవక్ పార్లమెంట్ ఆమోదం అవసరం. కేంద్ర, రాష్ట్ర పాలన స్లోవక్ జాతీయులే నిర్వహిస్తారు. వీరికి తగిన ప్రాతినిధ్యం ఉంటుంది. శాంతి సమయంలో స్లోవక్ సైనికులు స్లోవేకియాలోనే ఉంటారు. స్లోవేకియా నుంచి ఎన్నుకోబడిన సభ్యుల ఆమోదంతోనే రాజ్యావసరాలకు ఆదరణ సాధ్యం. అందుకు స్లోవక్‌ల హక్కులను పరిరక్షించడానికి ఇది ఒక చర్య. చెకస్లోవేకియా అధ్యక్షుడి ఎన్నిక స్లోవక్ సభ్యుల ప్రాతినిధ్యం తోటే సాధ్యం. ప్రభుత్వంపై అవిశ్వాస తీర్మానం ప్రతిపాదించే హక్కు స్లోవక్ సభ్యులకు ఉంది. దీన్నిబట్టి ప్రభుత్వం స్లోవక్‌ల విశ్వాసం అవసరంగా భావించారని చెప్పాలి. చెక్‌ల మనోస్థితికి విరుద్ధంగా జరిగిన ఈ రాజ్యాంగ మార్పులు, వారికి స్లోవక్‌లకు మధ్య ఒక హంసపాదును సృష్టించాయి. ఈ రేఖామాత్రపు విభేదాలు తప్పిస్తే స్లోవక్‌ల జాతీయతా వాదం, చెక్ దేశస్థులకు మరింత దగ్గరకు చేరుస్తుందని ఆశించారు. స్లోవక్‌లకు స్వతంత్ర ప్రతిపత్తి ఈ రాజ్యాంగ సవరణ ద్వారా లభించింది. ఈ స్వతంత్ర స్థాయిని స్లోవక్‌ల ఆమోదం లేకుండా మార్చడానికి వీలులేదు. స్లోవక్ జాతీయతా భావన (గుర్తింపు) చెక్‌లతో విలీనం అయినప్పటికి చెక్కు చెదరదు. లభించిన స్వయం ప్రతిపత్తి వల్ల స్లోవక్‌ల సంస్కృతిని ప్రత్యేకతను కాపాడింది.

జనవరి 18, 1939న కొత్త రాజ్యాంగం ద్వారా ఎన్నికైన స్లోవక్ పార్లమెంటు ప్రారంభమైంది. పార్లమెంటు అధ్యక్షుడైన డా. మార్టిన్ సోకోవ ఈ విధంగా ప్రకటించారు: "స్లోవక్‌ల స్వాతంత్ర పోరాటం అంతమైంది. జాతీయ పునరుజ్జీవనం ఇపుడు ప్రారంభమైంది." కాబట్టి ఇక నుంచి చెక్‌లపై ద్వేషభావాలకు తావులేదని, చెక్-స్లోవక్ రాజ్యానికి ఇరువురు నిబద్ధులై ఉంటారని ఇతర నేతలు తమ ప్రసంగాల్లో పేర్కొన్నారు.

కాని ఒక నెలయినా గడవక మునుపే చెక్-స్లోవక్‌ల మధ్య ఉన్న రేఖామాత్ర అనుబంధం అంతం చేయడానికి స్లోవక్ రాజకీయ నాయకులు తమ దోపిడీని ప్రారంభించారు. తమ ఉత్తేజపూరిత ప్రసంగాల్లో స్లోవక్ నాయకులు చెక్‌ల అణచివేత విధానాలను దుయ్యబడుతూ స్లోవక్‌లకు పూర్తి స్వతంత్ర రాజ్యం కావాలని గట్టిగా కోరారు. మార్చి ప్రారంభానికి స్లోవక్‌ల ప్రత్యేక రాజ్యం కోసం జరిపే వివిధ ఆందోళనలు చెక్ రాజ్య ఐక్యతకు తీవ్ర భంగం కల్గించ నారంభించాయి. స్లోవక్ అధినేత టిసో మార్చి 9న స్వాతంత్రం ప్రకటిస్తాడన్న అనుమానంతో మార్చి 10న చెక్-స్లోవక్ అధ్యక్షుడు హాచా, స్లోవక్ నాయకుడైన టిసోను, ఇతర స్లోవక్ మంత్రులను బర్తరఫ్ చేసి స్లోవేకియాలోకి సైన్యాలను పంపించారు. ఆ తర్వాత రోజు అంటే మార్చి 11న పోలీస్ అధీనంలో ఉన్నాడన్న స్లోవక్ నాయకుడు టిసో బెర్లిన్‌కు టెలిఫోన్ చేసి,

సహాయం కోరాడు. ఆ తర్వాత సోమవారం టిసో జర్మన్ అధినేత అయిన హిట్లర్ బెర్లిన్‌లో 1.1/2 గంటసేపు సమావేశమయ్యారు. సంభాషణలు అంతమైన వెంటనే స్లోవక్ నాయకుడైన టిసో ప్రాగ్‌కు జర్మన్ ఆదేశాలు జారీ చేశాడు, అవి :

1) స్లోవేకియా నుంచి అన్ని చెక్ సైన్యాలు వైదొలగాలి.

2) జర్మనీ రక్షణతో స్లోవేకియా స్వతంత్ర రాజ్యంగా ఆవిర్భవిస్తుంది.

3) స్లోవేకియా స్వాతంత్ర ప్రకటనను వినడానికి స్లోవక్ పార్లమెంట్‌ను ప్రెసిడెంట్ హాబా సమావేశ పరచాలి.

ప్రెసిడెంట్ హాబా కాని, ప్రాగ్ ప్రభుత్వంగాని ఈ విషయంలో నిర్ణయించే అధికారం లేకపోయింది. ఎందుకంటే అరక్షిత చెకస్లోవేకియా సరిహద్దుల చుట్టూ వేలాది జర్మన్ దళాలు మోహరించి ఉండడం, జర్మనీ కోర్కెను ఆమోదించకపోతే ఏ క్షణంలోనైనా అవి చెకస్లోవేకియా ప్రవేశిస్తాయి. ఈ విధంగా కొత్త చెకస్లోవేకియా రాజ్యం అంతమైంది.

## IV

ఈ ఇరుదేశాల కథ ద్వారా మనం ఏం నేర్చుకోవాలి? అంశాలను విశదీకరించడంలో కొంత భేదం ఉంటుంది. సిప్పే బ్రూక్స్ ఉద్దేశంలో యుద్ధాలకు ప్రధాన కారణం జాతీయతా వాదం. అతని దృష్టిలో ఇదే విశ్వశాంతికి తీవ్ర అవరోధం అని. నార్మన్ ఏంజెల్ దృష్టిలో జాతీయతా వాదం దీనికి కారణం కాదు. జాతీయతా వాదానికి సంభవించబోయే ఉపద్రవాల వల్లే ఈ యుద్ధాలు సంభవించాయని ఏంజెల్ భావించాడు. రాబర్ట్‌సన్‌కు జాతీయతా భావం ఒక హేతురహితమైన అంతఃప్రేరణ. అవి ఒక విభ్రమం వంటివి. మానవజాతి ఎంత త్వరగా ఈ జాడ్యాన్ని వదిలించుకొంటే అంత మంచిది అని రాబర్ట్‌సన్ అభిప్రాయపడ్డాడు.

ఏ విధంగా నిర్వచించినా, జాతీయతా వాదనను వ్యతిరేకించి ఎంత బలంగా వాదించినా, జాతీయతావాదం అన్నది త్యజించలేం, నిరాకరించలేం. ఒకరు అహేతుబద్ధ అంతఃప్రేరణ అన్నా, విభ్రమం అన్నా, జాతీయతావాదం రాజ్యాలను అంతంచేసే ఒక బలమైన ఆయుధం. టోయన్‌బీ మాటల్లో మనం కోరుకున్నా, కోరుకోకపోయినా జాతీయతా వాదం యుద్ధాలను సృష్టించే శక్తి కలిగి ఉంది. జనన, మరణ సమస్య వంటిది. ఇది యూరప్‌నే కాదు, టర్కీ, చెకస్లోవేకియాకు కూడా. వీటినే కాదు, భారతదేశానికి కూడా. టోయన్‌బీ అంతకు ముందు గుర్తించినట్లు యూరప్‌లో జాతీయతావాదం గుర్తింపే యూరప్‌లో శాంతికి పునాది. టోయన్‌బీ అభిప్రాయాన్ని మనం మర్చిపోగలమా? ఈ అలక్ష్యం మన సర్వనాశనానికి దారి తీస్తుంది. ఈ రెండు రాజ్యాల చరిత్ర తెలుసుకున్న తర్వాత నేర్చుకోవలసింది జాతీయతా వాదం రాజ్య విచ్ఛేదక పోకడలు కలిగి ఉంటుందనే కాదు. మరెన్నో నేర్చుకోవాలి.

టర్కులు ఉదార భావాలంటే మక్కువలేని వారు కాదు. మైనారిటీలకు వారి దేశాలలో చాలా స్వయం ప్రతిపత్తిని కల్పించారు. వివిధ మతాలు, జాతులవారు, వివిధ సామాజిక ప్రవర్తనకు చెందినవారు కలిసి మెలిసి జీవించటానికి టర్కులు ఎదుర్కొన్న అనేక సమస్యలను పరిష్కరించారు. క్రిస్టియన్ల జాతీయభావాన్ని సంతృప్తి పరచడానికి వీరు అనేక ప్రయత్నాలు చేశారు.

టర్కులు అరబ్బులకు మతమే ప్రధాన సంధి. ఇస్లాం మతస్తులకు మత ఆధార సంబంధాలు గట్టిగా ఉంటాయి. టర్కులు, క్రిస్టియన్లను తమకంటే తక్కువ వారని పరిగణించి, ఆరబ్బులు తమతో సమానులను భావించారు. ముస్లిం మతానికి చెందని వారందరినీ ఓటమాన్ రాజ్యం తొలగించింది. కాని, అరబ్‌లను కుర్దులను తొలగించలేదు. వారితో సమానంగా విద్య, ఇతర సౌకర్యాలు కల్పించారు. ఓటమాన్ సివిల్ సర్వీసులలో వారికి అనేక అవకాశాలు కూడా ఏర్పరిచారు. రాజకీయంగా కాకుండా, సామాజిక పరంగా ఆరబ్‌ల హోదాకు ఈ రాజ్యంలో భంగం కలగలేదు. వీరిరువురికి వివాహ సంబంధాలు కూడా ఉన్నాయి. సౌభ్రాతృత్వము, సమానత్వం, ఉదారభావాలు ఉన్నప్పటికీ అరబ్-టర్కుల మధ్య ఉన్నప్పటికీ, ఆరబ్‌లు అసంతృప్తి చెందారు. ఇస్లాం మత సంబంధాలను ఛేదించి ఆరబ్ జాతీయతావాదం ఆవిర్భవించి, టర్కీతో స్వాతంత్ర్యానికై యుద్ధానికి పురికొల్పింది. గెల్చింది కూడా. కాని చివరికి టర్కీ నాశనమైంది.

స్లోవక్‌లు, చెక్‌లు ఒకే ప్రజ అని చెకస్లోవేకియా భావించింది. కొద్ది సంవత్సరాలలోనే స్లోవక్‌లు స్వాతంత్ర్యం ఆశించారు. చెక్ జాతిలో ఒక భాగంగా కూడా వారు పేర్కొనడానికి సమ్మతించలేదు. స్లోవక్‌లో ప్రజ్వరిల్లిన జాతీయతా భావం వల్ల, చెక్‌లు, స్లోవక్‌లు విభిన్న జాతికి చెందినవారుగా గుర్తించాల్సి ఉంటుంది. చెక్-స్లోవేకియా కూడా వారు అనుమతించలేదు. స్వాతంత్ర్యానికై స్లోవక్‌లు జర్మనీ సహాయాన్ని అర్థించి, సాధించారు.

స్థానిక స్వయం ప్రతిపత్తికాని, మతాధార సంబంధాలు కానీ జాతీయతను దాన్ని అణచలేవు అని చెకస్లోవేకియా, టర్కీల చరిత్ర అధ్యయనం చేస్తే మనకు అర్థమౌతుంది.

హిందువులు ఈ పాఠాన్ని గుర్తుంచుకోవాలి. టర్కీ, చెకస్లోవేకియాలు సర్వనాశనమవడానికి గ్రీకు, బాల్కన్, ఆరబ్ స్లోవక్‌లలో జాతీయతా భావం, భారతదేశం అంతం అవడానికి కారణం కారాదా? చారిత్రక అనుభవం ఈ సత్యాన్ని చెప్తే మనం విస్మరించగలమా? దీని బదులు మనమే భారత ఉపఖండాన్ని విభజించడానికి ఒప్పుకుంటే మంచిది కాదా?

## V

భారతదేశాన్ని - భారత్, పాక్‌లుగా విభజించి, హిందువులు ఏం నష్టపోతారు?

మూనిచ్ సంధి ద్వారా నష్టపోయిన ప్రాంతాలపై చెకస్లోవేకియా ప్రధానమంత్రి చేసిన

వ్యాఖ్యలు పేర్కొనాలి.

పౌరులు పై నికులు...... నా జీవితంలో అతిక్లిష్టపరిస్థితి దశలో ఉన్నాను, బాధాకరమైన కార్యాన్ని నిర్వర్తిస్తున్నాను. మరణమే దీని కంటే మేలు. పోరాడానుకాబట్టి, ఏ పరిస్థితుల్లో యుద్ధాన్నిగెలవగలమోతెలుసు కాబట్టి, మీతో సూటిగా చెప్తున్నాను. మనతో యుద్ధం చేసే సేనలు ఈ దశలో మనకంటే బలంగా ఉన్నట్లు గుర్తించవలసి వచ్చినందువల్ల మనం ఈ విధంగా నిర్ణయాలు తీసుకోవలసి వచ్చింది.

యూరప్‌కు చెందిన నాలుగు అగ్రరాజ్యాలు కోరిన మీదట దేశంలో ఉన్న జర్మన్ ప్రాంతాలు కోల్పోవలసి వస్తోంది. వేరే గత్యంతరం లేక ఇది ఒప్పుకోవాలి. దీన్ని ఒప్పుకోకపోతే పర్యవసానాలు యుద్ధంలో వయోజనులనే కాక, మహిళలను, పిల్లలను కూడా కోల్పోవాలి. శాంతికి మనం కూడా కొంత తోడ్పడాలి. ఎందువల్లంటే ఒప్పందం మనమీద రుద్దబడింది. అయితే మనం ఏకాకులం అయిపోయాం. సరిహద్దు ప్రాంతాలకు దేశ మరణానికి మధ్య ఎంపిక క్లిష్టమైనదే. మనం తిరిగి బలమైన దేశంగా ఆవిర్భవించడానికి కృషి చేయాలి.

చెక్‌లు చిన్న సరిహద్దులకు మరింత చిన్న చెకస్లోవేకియాకు నిర్ణయించుకుని, ప్రజల శ్రేయస్సు ముఖ్యమని భావించింది.

ఇక టర్కీకి వస్తే బ్రిటీష్ దూతైన సెయింట్ పీటర్స్ బర్గవా జార్ నికలస్। 1853లో వెలిబుచ్చిన అభిప్రాయం ఏమిటో పేర్కొందాం.

"మా చేతుల్లో ఒక రోగి ఉన్నాడు – అతడు ఎప్పుడయినా మరణించవచ్చు". ఆరోజు నుంచీ టర్కీ (రోగి) 'యూరప్ రోగి' అంతానికి టర్కీ ఇరుగు పొరుగు దేశాలు వేచి ఉన్నాయి. ఒక్కొక్క ప్రాంతం వదులుకోవడం రోగి మరణశాసనంగా పేర్కోవచ్చు.

ఈ ఉద్దేశ్యం సబబైనదేనా? టర్కీని యూరప్ రోగగ్రస్తునిగా జార్‌నికోలస్ వ్యాఖ్యపై టాయన్‌బి దృష్టిలో "జార్‌నికలస్ రెండో వ్యాఖ్య తప్పు. రోగ లక్షణాలను నిర్ధారించకుండా అకస్మాత్తుగా మరణిస్తాడనలేం. ప్రకృతిని గురించి తెలియని వ్యక్తి ఒక పాము తన చర్మాన్ని మార్చినప్పుడు చూశాడనుకోండి, అది తిరిగి కోలుకోదని భావిస్తాడు. అనుభవం ఉన్న ప్రకృతి శాస్త్రజ్ఞుడు చర్మం మార్చడం ఒక అలవాటుగా భావిస్తాడు. అయితే ఆ ప్రక్రియ క్లిష్టమైందే. ఈ ఉదాహరణే టర్కీకి వర్తిస్తుంది."

కొన్ని ప్రాంతాలు కోల్పోవటం టర్కీకి ఒక పాము తన చర్మం కోల్పోయి కొత్త చర్మం రావటంగా టాయన్‌బి పేర్కొన్నాడు.

అలాగే హిందువులకు ముస్లిములు పనికిరాని చర్మంలాంటి వారు. అలాగే ముస్లిములకు

---

అలెగ్జాండర్ హెండర్‌సన్, 'ఐ విట్నెస్ ఇన్ చెకస్లోవేకియా' (హరప్ 1939).

హిందువులు కూడా. ఈ ఇద్దరినీ కలిపితే, భారతదేశం ఆసియా రోగగ్రస్తునిగా తయారవుతుంది. భారతదేశంలో కొన్ని ప్రాంతాలను విభజించుకొని పోతే, సంఘర్షణ బదులుగా శాంతిని స్థాపిస్తోందని అనుకోవాలి. రెండు భాగాలు చేస్తే రెండింటికీ మతపరమైన గుర్తింపు ఉండాలి. పాకిస్తాన్‌కు భాషాపరమైన గుర్తింపు ఉంది. భారతదేశం కూడా హిందూస్తానీనో, హిందీనో, ఉర్దూనో ఉమ్మడి భాషగా చేసుకోవచ్చు. ఇరు రాజ్యాలు బలంగా కూడా ఉంటాయి. భారతదేశానికి ఒక పటిష్టమైన కేంద్ర ప్రభుత్వం అవసరముంది. పాకిస్తాన్ అంతర్భాగంగా ఉన్నంతకాలం అది సాధ్యం కాదు. 1935 చట్టంలో బలహీన కేంద్ర ప్రభుత్వాన్ని ప్రతిపాదించారు. అది ముస్లింలను మెప్పించడానికే. పాకిస్తాన్ ఆచరణలోకి వస్తే ఇవన్నీ మారుతాయి. భారత రాజ్యానికి సుస్థిరత, పాకిస్తాన్ స్థాపిస్తేనే సాధ్యమౌతుంది.

అను : డా॥ ఐ. రామబ్రహ్మం

హిందూ ముస్లిం సమస్య రెండు కోణాల నించి పరిశీలించవచ్చు. వారి అధికారాలు, అవి ఎలా సమన్వయ పరచుకోవాలో అన్నది ఒకటి. రెండోది వేర్పాటు సంఘర్షణ ధోరణి. ఇప్పటి దాకా సమస్యను మొదటి దృక్కోణం నుంచి చూశాం. రెండో అంశం ప్రాధాన్యం కలదే.

ప్రత్యర్థులుగా చూస్తే వారి చర్య ప్రతి చర్యల పరిశీలన. అధ్యయనాంశం. ఎందుకంటే వారి మీద దాని ప్రభావం ఉండటమే కాదు, దాని పర్యవసానాలు ఇరువురిపై ఉంటాయి. కనుక వివాద పరిష్కారానికి ఒక మార్గం అన్వేషించాలి. వీరి చర్య ప్రతి చర్యలు ఒక 'అస్వస్థత'కు దారి తీస్తాయి. దీని ప్రభావం మూడు విధాలుగా చూడవచ్చు.

(1) సామాజిక ప్రగతి కుంటు పడడం; (2) మత దురహంకారం (3) రాజకీయ ప్రగతిపై నిరాశాజనక వాతావరణం. ఇది తీవ్ర వ్యాధి. దీన్నించి బయట పడటానికి పాకిస్తాన్ స్థాపన ఒక పరిష్కారం! లేదా అస్వస్థతను తీవ్రతరం చేస్తుందా!

ఈ ప్రశ్నల పరిశీలన ఇపుడు చేపడదాం.

# సామాజిక స్తబ్ధత

హిందూ సమాజాన్ని పీడించే అంశాలు అందరికీ తెలిసినవే. మిస్‌మేయో ప్రచురించిన "మదర్ ఇండియా" ద్వారా ఇవి బహు ప్రాచుర్యంలోకి వచ్చాయి. హిందూ సమాజం ఈ రుగ్మతల బురదలో కొట్టి మిట్టాడుతూంటే ముస్లింలకు ఇటువంటి సమస్యలు లేవు. హిందువులతో పోలిస్తే ప్రగతి భావాలు కల ప్రజగా చెప్పవచ్చు. ముస్లింల గురించి క్షుణ్ణంగా తెలిసినవారికి వారిపట్ల ప్రపంచ ప్రజల ఉద్దేశం ఆశ్చర్యకరంగా ఉంటుంది.

ముస్లిములో లేని హిందువుల్లోనే ఉండే సామాజిక రుగ్మత ఏదైనా ఉందా? అని ఎవరైనా అడగవచ్చు.

ఉదాహరణకు బాల్య వివాహమే తీసుకోండి. అఖిల భారత మహిళా సమాఖ్య బాల్య వివాహాల నిరోధక కమిటీని నియమించింది. హిందూ మతానికి చెందిన వివిధ కులాల్లో బాల్య వివాహాలపై వివరాలు ప్రకటించింది. 1931 జనాభా వివరాల ప్రకారం ఈ విధంగా ఉన్నాయి.

ప్రతి వెయ్యిమంది మహిళల్లో 0-15 సంవత్సరాల వయసుల్లో వివాహిత బాలికలున్నారు.

| | హిందువులు | ముస్లిములు | జైన్లు | సిక్కులు | క్రిస్టియన్లు |
|---|---|---|---|---|---|
| 1881 | 208 | 153 | 189 | 170 | 33 |
| 1891 | 193 | 141 | 172 | 143 | 37 |
| 1901 | 186 | 131 | 164 | 101 | 38 |
| 1911 | 184 | 123 | 130 | 88 | 39 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1921 | 170 | 111 | 117 | 72 | 32 |
| 1931 | 199 | 186 | 125 | 80 | 43 |

బాల్య వివాహాలకు సంబంధించినంత వరకూ ముస్లీముల పరిస్థితి హిందువుల్లో ఉన్నదాని కంటే మెరుగ్గా ఉందని అనగలమా?

మహిళల పరిస్థితిని తీసుకోండి. ఇతర ప్రాచ్య దేశాల మహిళలతో, ఉదాహరణకు హిందూ మహిళలతో పోలిస్తే, ముస్లిం మహిళల పరిస్థితి చాలా మెరుగనీ,వాళ్లకి ఎక్కువ స్వాతంత్రం ఉందనీ, కొన్ని పాశ్చాత్య దేశాల మహిళల కంటే చాలా ఎక్కువ స్థాయిలో హక్కులున్నాయనీ ముస్లీములు నొక్కి చెప్తారు. దీనికి గాను ముస్లిం న్యాయం మీద ఆధారపడతారు.

మొదటగా వాళ్లు చెప్పేది ముస్లిం మహిళలకు వివాహ పరిమితి వయస్సు ఇంత అని నియమితం కాలేదని అంటారు. ఆడపిల్ల ఏ వయస్సులో నైనగాని పెళ్ళి చేసుకోవచ్చు. ఆ హక్కు వుంచి అదీగాక తల్లో తండ్రో పెళ్ళి చేస్తే తప్ప, ఓ ముస్లీం అమ్మాయికి బాల్యంలో వివాహం అయితే ఆ అమ్మాయి ఏ వయస్సులోనైనా దాన్ని తిరస్కరించే హక్కు వుంటుంది. ముఖ్యంగా ఎదిగిన తర్వాత.

రెండవది, ముస్లీములు మధ్య వివాహం ఒక ఒడంబడిక అని అంటారు. ఒప్పందం కావడంతో భార్యకు విడాకులు ఇచ్చే హక్కు భర్తకు ఉంటుంది. ముస్లిం న్యాయం విడాకులు ఇచ్చిన భార్యకు చాలా భద్రతలు కల్పించింది. వాటివల్ల విడాకులు పొందిన భర్తకు ఆ భార్యతో సమంగా స్థానం ఉంటుంది. ముస్లిం న్యాయం ప్రకారం భార్య కూడా కొన్ని పరిస్థితుల్లో ఒప్పందానికి వచ్చి విడాకులు తీసుకునే హక్కు ఉందని అంటారు.

మూడవగిగా, తన వ్యక్తిత్వం వదులుకునేందుకు ముస్లిం మహిళ భర్తనుంచి కొంత సొమ్మును లేకపోతే ఆస్తిని భరణం అని పిలిచేదాన్ని కోరవచ్చు. ఆ భరణం ఎంత ఉండాల్సిందీ పెళ్ళయింతర్వాత కూడా ఏర్పాటు చేసుకోవచ్చు. ఫలానా ఇంత అని నిర్ణయం చేసుకోకపోతే భార్య ఉచితమైన భరణం పొందే హక్కు ఉంటుంది. ఆ 'భరణం' సొమ్మును రెండు వాయిదాలుగా ఇవ్వవచ్చు. ఒకటి 'తక్షణం' ఇచ్చేది. అడగ్గానే ఇచ్చేది రెండవది 'వాయిదా' చేసేది. వివాహం భగ్నం అయినప్పుడో అదీ మృతివల్లా, విడాకులవల్లా, ఇచ్చేది. భరణాన్ని కోరే ఆమె హక్కు భర్త ఆస్తి మీద ఆమెకు ఉన్న అప్పుగా పరిగణిస్తారు. ఆమెకి ఆ భరణం మీద పూర్తి హక్కు ఉంటుంది. ఆమెకు ఆర్థిక స్వాతంత్ర్యం కలిగించే ఉద్దేశ్యంతో దాన్ని ఏర్పాటు చేసారు. ఆమె తన ఇష్టం వచ్చినట్లు దాన్ని చెల్లించుకోవచ్చు. గ్రహించవచ్చు.

మహిళలకు అనుకూలంగా ఇన్ని అధికరణాలు ఉండి కూడా ముస్లిం మహిళంత

అధ్వాన్నంగా ప్రపంచంలో ఏ మహిళా లేదు. ఒక ఈజిప్షియన్ నాయకుడు చెప్పినట్టు*:

"ఇస్లాం మతం, మహిళలు లోకువగా ఉండాలని ముద్ర వేసింది. ఆమెకు పూర్ణ వికాసావకాశం లేకుండా, తనకుగా తాను ఎదగడానికి లేకుండా, వ్యక్తిత్వ వికాసానికి అవకాశం లేకుండా చేసిన సాంఘిక ఆచారాలకి మతపరమైన ఆమోద ముద్రవేసింది".

వివాహాన్ని కాలదన్నే ధైర్యం ఏ ముస్లిం అమ్మాయికి లేదు. తను బాలికననీ, తల్లి దండ్రులు కాక వేరే వాళ్లు ఆ పెళ్లి చేసారని చెప్పి అలా చేసే ధైర్యం ఏ అమ్మాయికీ ముస్లిముల్లో లేదు. విడాకుల హక్కుని ఒప్పందంలోనే పెట్టించుకుని ఏ ముస్లిం మహిళా పెళ్ళి చేసుకోదు. అలాంటప్పుడు ఆమెరాత "ఒకసారి పెళ్లయితే, శాశ్వతంగా పెళ్లయినట్టే" ఉంటుంది. ఎంత ఇబ్బందిగా ఉన్నా ఆమె వివాహం నుంచి బయట పడలేదు. ఆమె అయితే పెళ్లిని కాలదన్నను లేదుగాని, భర్తకు మాత్రం ఏదో సాకు చూపించి వివాహాన్ని రద్దు చేసుకునే హక్కు వుంది. "తలాక్" అని ఉచ్చరించి, మూడు వారాలు మడికట్టుకు కూర్చుంటే ఆమెతో తెగ తెంపులు అయినట్టే. ఇక ఈ తలాక్ మీద ఉన్న ఆంక్ష అల్లా 'భరణం' ఇవ్వాలన్న నియమం. దాన్ని అంతకు ముందే చెల్లించి వుంటే ఇక విడాకులు ఇవ్వడం అనేది బుద్ధి పుట్టడంతో జరుగుతుంది.

విడాకుల విషయంలో ఇంత వెసులుబాటు ఉండటం అంటే మహిళల స్వేచ్ఛాయత పూర్ణ, ఆనందభరిత జీవితానికి మౌలికమైన భద్రతా భావం నాశనం అయినట్టే. ఇక ఈ భద్రతా రాహిత్యాన్ని అంతకింత చేసేది బహుభార్యాత్వం, ప్రియురాళ్ళను ఉంచుకోవడం అనేది. ముస్లిం న్యాయం భర్తకి వాటిని ప్రసాదిస్తోంది.

ముస్లి న్యాయం ప్రకారం భర్త నలుగురిని పెళ్ళి చేసుకోవచ్చు. అదీ ఒకేసారి. ఇది హిందూ న్యాయం కంటే మెరుగేనని, షియా న్యాయంలో ఒక భర్తకు ఇంత మంది భార్యలే ఉండాలన్న నియమం లేదనీ అంటూ ఉండటం వింటాం. కాని ఒక విషయం మరచి పోతున్నారు. నలుగురి భార్యలకు తోడుగా, బానిస మహిళలతో గడిపే హక్కు ముస్లిం న్యాయం ప్రకారం మగవాడికి ఉంది. ఇక వాళ్ళ సంఖ్య ఇంత అని మితి అంటూ లేదు. వాళ్లని పెళ్ళి పెటాకులూ ఏమీ లేకుండానే వాళ్లు అనుభవించవచ్చు.

బహు భార్యాత్వం చెడుగుల గురించి ప్రియురాళ్లుండడంలో చెడు గురించీ మాటల్లో చెప్పలేం. ముస్లిం మహిళ విషయంలో ఇది ఎంత దారుణంగా ఉందో చెప్పనేలేం. బహు భార్యాత్వం, ప్రియురాళ్ల ఏర్పాటు ఉండడం మాత్రాన్నే ముస్లిం లందరూ అలానే ఉన్నారని అనలేం. నిజమే అయినా ఆ హక్కులుండటమే చాలు, ముస్లిములు వాటి దురుపయోగం చేసేందుకు. భార్యలు అగచాట్లు పడేందుకు. శ్రీ జాన్‌పూత అనే ఆయన ఇస్లాంకి వ్యతిరేకి

* మహమ్మదీయ మతం గురించిన అధ్యయనాలు, పే. 34-35

కాదు. ఆయన ఇలా అన్నారు* :

"కొందరు మహమ్మదీయులు విడాకుల విషయంలో ఉన్న ఈ వెసులు బాటును చాలా వాడుకుంటున్నారు. "ఇస్లాం దాని స్థాపకులు" అన్న గ్రంథంలో స్టొబార్ట్ ఇలా అన్నారు. కొంత మంది ముస్లిములు పదే పదే పెళ్లాన్ని మార్చుకునే అలవాటు చేసుకున్నారు. ఇరవై, ముప్పై మంది పెళ్లాలున్న యువ ముస్లీముల గురించి వింటూ ఉంటాం. ప్రతి మూడు నెలలకూ ఒక పెళ్లాం. అంటే మహిళలు ఒక మగాడి నుంచి ఇంకో మగాడి దగ్గరకి ఆడవాళ్లు మాటిమాటికీ మారుతూనే ఉంటారన్న మాట. దొరికి నప్పుడల్లా ఆడవాళ్లు ఒక మగవాణ్ణి, ఇంటినీ పొందుతూనే ఉంటారు. ఒకవేళ విడాకుల వల్ల నిరాధారులైతే, ఇంకా నీచమైన వృత్తులకు దిగజారుతారు. ఆ రకంగా న్యాయాన్ని అక్షరాలా పాటించి, ఒక భార్యకు, నలుగురి కంటే ఎక్కువ మంది భార్యల్ని గ్రహించ కుండా ఉంటూనే, దయాదాక్షిణ్యం లేని వాళ్లు జీవితకాలంలో విడాకులిచ్చుకుంటూ ఎంతమంది భార్యలనైనా గ్రహించవచ్చు.

"మరి ఇంకో రకంగా కూడా ఒక మహమ్మదీయుడికి నలుగురి కంటే ఎక్కువ మంది భార్యలుండవచ్చు. అదీ చట్టం పరిధిలో ఉంటూనే. ప్రియురాళ్లను ఉంచుకోవడం ద్వారా అలా చేయవచ్చు. దానికి 'ఖురాన్' అనుమతి ఉంది. నలుగురి భార్యల్ని అనుమతించిన 'సుర'లో మీరు సంపాదించిన బానిసలని కూడా అని చేర్చివుంది. 70వ సురలో బానిసలతో కలవడం పాపం లేదని వుంది. అసలా మాటలు ఇవీ. "వారి దక్షిణ హస్తాలు పొందిన వారికి వాళ్ల దోషం లేదు. గతంలో మాదిరీ, ఇప్పట్లో మాదిరీ, అసంఖ్యాక ముస్లిం గృహాల్లో బానిసలున్నారు. 'మహమ్మద్ జీవితం' అన్న గ్రంథంలో మూర్ అన్నట్టు 'స్త్రీ బానిసలతో కలిసి ఉండవచ్చనే అనుమతీ విశృంఖలంగా ఉన్నంతకాలం ముస్లిం ఇళ్లల్లో దేశాల్లో బానిసలను లేకుండా చెయ్యలేరు. ఆ రకంగా బానిసత్వం విషయంలో, 'ఖురాన్' మానవజాతికే శత్రువు. మరి మామూలుగానే మహిళలు మరింత బాధితులు".

కుల సమస్య తీసుకోండి, ఇస్లాం సోదరత్వం గురించి చెపుతుంది. ఇస్లాం బానిసత్వం నుంచీ, కులం నుంచీ విముక్తం అని ప్రతి వాళ్లు భావిస్తారు. బానిసత్వం గురించి ఇపుడు ఏమీ చెప్పక్కరలేదు. చట్టరీత్యా అది రద్దు అయింది. అది వున్నప్పుడు దానికి అధిక భాగం తోడ్పాటు ఇస్లాం నుంచీ, ఇస్లాం దేశాల నుంచీ వచ్చింది. ఖురాన్‌లో బానిసల పట్ల ఎంత దయాపూరితంగా, ధర్మబద్ధంగా ఉండాలో ప్రవక్త చెప్పిన మాటలు శ్లాఘనీయమే. అయినా దాని నిర్మూలనకు ఇస్లాం చెప్పింది ఏమీ లేదు. సర్‌మూర్ బాగా* చెప్పినట్టు:-

"తగ్గించడానికి మారుగా, ఆయన శృంఖలాల్ని ఎక్కువ చేశాడు....బానిసల్ని విడుదల

* అదే గ్రంథం, అధ్యాయం xxxix (39)
* ది కురాన్ ఇట్స్ కంపొజిషన్ ఎండ్‌టీచింగ్ పే. 58

చేయాలన్న విధి నియమం ఏదీ ముస్లింలకు లేదు............."

కాని బానితసత్వం పోయినా. ముస్లీముల్లో కులం మిగిలింది. దీనికి ఉదాహరణగా బెంగాల్ ముస్లీముల విషయం చూడవచ్చు, 1901లో జనాభా లెక్కల సూపరింటెండెంట్, బెంగాల్ ముస్లీముల గురించి ఈ ఆసక్తికరమైన విషయాలు తెలియచేశాడు.

"మహమ్మదీయుల్లో అనూచనంగా వస్తూ ఉన్న నాలుగు తెగలు ఉన్నాయి - షేక్, సయ్యద్, ముఘల్, పఠాన్ - వాటికి బెంగాల్‌కి ఏ సంబంధమూ లేదు. మహమ్మదీయుల్లో రెండు ముఖ్య సాంఘిక విభాగాలు ఉన్నాయి. (1) అష్రాఫ్ లేక షరాఫ్ (2) అజ్లాఫ్ అష్రాఫ్ అంటే ఉన్నతుడు అని. అనుమానానికి తావులేకుండా విదేశీ వంశీకులు, షియా ఉన్నత కుటుంబాలనుంచి మతం మారి వచ్చిన వాళ్లు ఆ విభాగం వృత్తి పనుల విభాగంతో సహా, కింది కులాల నుంచి మతం మారిన వాళ్లు, - 'అజ్లాఫ్' విభాగం కిందికి వస్తారు, అంటే 'నీచులు; తక్కువవాళ్లు అని అర్థం. వాళ్లను కాలూ లేక ఇతార్, అంటే 'నీచ' అనీ అంటారు. రసిల్, రిజాల్‌కు భ్రష్టరూపం ఇది. దీనికి నీచ అనే అర్థం, పనికి మాలినవారు. వాళ్లతో ఏ మహమ్మదీయుడు కలవడు. వాళ్లకు మసీదులో ప్రవేశంలేదు, అందరి శ్మశానవాటికనూ వాడుకోవడానికి లేదు.

"హిందువుల్లో మాదిరి అనులోమక్రమంలో విభజన ఉంది

I. అష్రాప్ - ఉన్నతవర్గం మహమ్మదీయులు

1. సయ్యద్‌లు 2. షేక్‌లు 3. పఠాన్‌లు, 4 ముఘల్స్ 5. మల్లిక్ 6. మీర్జా

II. విలాఫ్ లేదా కింది తరగతి మహమ్మదీయులు

1. వ్యావసాయంచేసే షేక్, మొదట్లో హిందువులే అయినా ఏ వృత్తి విభాగానికి చెందకుండా అష్రాప్ వర్గంలోకి అనుమతి అభించని వర్గం, ఉదాహరణకు పిరాచి, ధకోరామ్

2. దార్జి, జిలానా, ఫకీర్, రంగ్రెజ్

3. బ్హార్హి, బదియర్, బిక్, చురిహార్, దాయ్, థావా, దునియా, గద్ది, కల్వార్, కాసై కులా కుంజార్, లహరి, మాహిఫారోష్, మల్లా , నాలియా, నికారి.

4. అబ్దల్, బాకో బెదియా, భర్, చంపా, ధోబి, హజ్జన, నాగర్జి, నాట్, తుతినా

III. అజాల్‌లేక పతనమైన వర్గం

భనారో, హలాల్‌కోర్, హిజ్ర, కాన్చి, లాల్బెగి, మౌతగ, మెహతాకొ.

జనాభా లెక్కల సూపరింటెండెంట్ ముస్లిం సాంఘిక వ్యవస్థను గురించి, మరో

విషయం చెప్పారు. అది "పంచాయతి వ్యవస్థ" గురించి ఆయన ఇలా అన్నారు:

"పంచాయతి అధికారం సాంఘిక విషయాలకూ, వృత్తి విషయాలకూ కూడ వర్తిస్తుంది. ఇతర కులస్థులతో వివాహం నేరం దాని గురించి పాలక వర్గం తీర్మానిస్తుంది. దానితో హిందూకులం మాదిరి పరవర్ణ వివాహం లేకుండా అంతా అంతర్వర్ణ వివాహాలే. ఈ నిషేధం పై నుంచి కింది దాకా అన్ని కులాలకీ వర్తిస్తుంది. దోషిని తక్షణం పంచాయితీ ముందు హాజరు పరచడమే కాక, కులం నుంచి హేయంగా బహిష్కరిస్తారు. అలాంటి వాళ్లను వేరే కులంలోకి రానివ్వరు. పుట్టిన కులం పేరు మిగుల్తుంది. దాని ప్రత్యేక వృత్తిని అతను విడిచిపెట్టినా, ఇతర జీవితాధారాన్ని అనుసరించినా కూడా అంతే... జోలాలు కసాయివాళ్లు ఇంకా వాళ్లకు ఆపేరే ఉంది."

భారత దేశంలోని ఇతర రాష్ట్రాల నుంచీ ఇలాంటి వాస్తవాలు వెల్లడవుతున్నాయి. జనాభా లెక్కల్ని బట్టి చూస్తే సరదా అయిన విషయాలు తెలుస్తాయి. కావైతే బెంగాల్ విషయాన్ని బట్టే చెప్పవచ్చు. మహమ్మదీయులు కులాన్నేగాక, అస్పృశ్యతను కూడా పాటిస్తారని.

హిందూ సంఘంలో ఏ నీతులు ఉన్నాయో అవే ముస్లిం సంఘంలోనూ భారతదేశంలో ఉన్నాయని చెప్పేందుకు అనుమానమే లేదు. నిజానికి ముస్లీములకు హిందువుల కున్న నీతులన్నీ ఉండటమే కాదు, ఇంకా ఎక్కువే ఉన్నాయి.

పర్దా ఉంది. దాంతో ముస్లిం మహిళల వేర్పాటుకూడా వచ్చింది. మహిళలు లోపలి మందిరాల నుంచి ఇవతలకు రాకూడదు. తోటల్లోకి వరండాల్లోకి రాకూడదు. వాళ్ళుండాల్సింది వెనకపెరట్లోనే. వృద్ధులు, బాలలూ అందరూ ఒక్క గదిలోనే కుక్కుకు పోయి వుండాలి. మగవాళ్లెవరూ వాళ్ల దగ్గర పని చెయ్యకూడదు. కొడుకుల్ని, సోదరుల్ని, తండ్రిని, పినతండ్రిని, పెదతండ్రుల్ని, దగ్గర బంధువులైన మగవాళ్లను తప్ప మరే ఇతర పురుషుల్ని చూడకూడదు. కొంతమంది మసీదుకు కూడా వెళ్లకూడదు. బురఖా వేసుకోవాల్సిందే. భారతదేశంలో వీధుల్లో బురఖాలు వేసుకున్న ఆడవాళ్లను చూడ్డం మహా దారుణంగా వుంటుంది. అలాంటి వేర్పాటు వల్ల ముస్లిం మహిళల శారీరక దారుఢ్యం మీద ప్రభావం ఉండి తీరుతుంది. సాధారణంగా వాళ్లు పాండురోగంతో, క్షయతో, దంత వ్యాధులతో బాధపడ్తూ ఉంటారు. వాళ్ల శరీరాలు వంకర్లుపోయి ఉంటాయి. నడుములు వంగిపోయి ఉంటాయి. ఎముకలు పొడుచుకు వచ్చి ఉంటాయి. చేతులూ, కాళ్లూ వంకరపోయి ఉంటాయి. వాళ్లల్లో గుండె జబ్బులు ఎక్కువ. కటిభాగం వంకరపోయి ఉండడంతో ప్రసవం అప్పుడు మరణాలు ఎక్కువ ఉంటాయి. పర్దావల్ల ముస్లిం మహిళల మానసిక నైతిక పుష్టి దెబ్బతింది. ఆరోగ్య వంతమైన సాంఘిక జీవితం లేకపోవడంతో నైతిక పతనం వచ్చి తీరుతుంది. వచ్చింది. బాహ్య ప్రపంచంతో సంబంధం ఏమీ లేకపోవడంతో, ఇళ్ళల్లో

చిల్లర తగవులతో తన్నుకుంటూ ఉంటారు. దాంతో సంకుచితం అయిపోతారు దృక్పథంలో.

ఇతర సోదర స్త్రీలకంటే వెనకబడి ఉంటారు. ఇల్లుదాటి బయట ఏ కార్య కలాపాల్లోనూ పాల్గొనలేరు. విజ్ఞాన సముపార్జన ఉండదు. బయట విషయాల పట్ల, నాలుగు గోడలకు బయట దేనిపట్లా ఆసక్తి ఉండరాదని వాళ్లకు బోధిస్తారు. ప్రత్యేకంగా పర్దాస్త్రీలు నిస్సహాయులు, పిరికి వాళ్లు, జీవితంలో ఏ పోరాటం చెయ్యడానికీ అసమర్థులు. భారత దేశంలో పర్దా మహిళలు అధిక సంఖ్యాకంగా ఉన్నారు. అంచేత పర్దా సమస్య ఎంత విస్తృతంగా, దారుణంగా ఉందో గమనించవచ్చు.

పర్దా నైతిక జీవితం మీద కలిగించేదాంతో పోలిస్తే శారీరక, భౌతిక ప్రభావాలు ఏమీ లేవనే చెప్పాలి. స్త్రీ, పురుషులు ఉభయుల్లోనూ శారీరక వాంఛల్ని గురించిన అనుమానాల మీదనే పర్దా పుట్టింది. వాళ్లను ఒకళ్ల నుంచి ఒకళ్లని విడదియ్యడం ద్వారా అది సాధ్యమని భావించారు. ఇంతాచేసి పర్దా ఆ లక్ష్యాన్ని సాధించడానికి బదులు ముస్లిం పురుషుల నైతిక నియమాల్ని ప్రతికూలంగా ప్రభావితం చేసింది. పర్దావల్ల తన ఇంట్లో వాళ్లతో బయట, ఏ మహిళతోనూ ముస్లిం పురుషులకి సంబంధం లేదు. ఇంట్లో వాళ్లతో కూడా సంబంధాలు సందర్భాన్ని బట్టి మాత్రమే ఉంటాయి. కబుర్లాడుకోవడం దాకా మగవాడికి ఇతర సాహచర్యంగాని, ఆడవాళ్లతో కలిసి తిరగడంకాని ఉండవు. పెద్ద వాళ్లతోనూ పిల్లలతోనూ తప్ప. ఆడవాళ్లకూ మగవాళ్లకూ మధ్య ఈ ఏర్పాటు వల్ల మగవాళ్ల నడతలో చెడు ప్రభావం కలుగుతుంది. స్త్రీ పురుషు లిద్దరికీ ఏ సంబంధమూ లేకుండా అడ్డుగోడలు పెట్టే సాంఘిక వ్యవస్థవల్ల శారీరక వాంఛలు అతిగా పెరుగుతాయని చెప్పడానికి, అస్వాభావిక, తదితర అవాంఛనీయ అలవాట్లు పెరుగుతాయని చెప్పడానికి ఎవళ్లో మనస్తత్వ శాస్త్రవేత్తల్ని సాక్ష్యం తెచ్చుకోనక్కర్లేదు.

పర్దావల్ల వచ్చే అనర్థాలు ఒక్క ముస్లిములకు మాత్రమే పరిమితం కావు. దీనివల్ల హిందువులు, ముస్లిములు ఎవళ్లకి వాళ్లు కేటాయింపుగా ఉండిపోతారు. భారత దేశ ప్రజా జీవితానికి అది అనర్థం. ఈ వాదం మరీ తెగలాగిందని అనిపించవచ్చు. ఈ ఏర్పాటు ఎక్కువగా హిందువులు నలుగురితోనూ కలవక పోవడంవల్ల వచ్చిందనీ, పర్దావల్ల కాదనీ అనవచ్చు. కాని హిందువులకూ ముస్లిములకూ మధ్య సాంఘికమైత్రిని స్థాపించవచ్చనీ హిందువులు అనడం సబబే... ఏమంటే అలాంటి కలయిక* అంటే ఒకవైపు ఆడవాళ్లనుంచీ,

* ముస్లిం మహిళ సాంఘికహోదా గురించి, శ్యామ్ కుమార్ నెహ్రూ నాయకత్వం వహించారు.

* యూరోపియన్లు భారతీయుల్ని తమ క్లబ్బుల్లోకి రానివ్వరు. అందుకు భారతీయులు వేసిన నిందలకు సమాధానంగా వాళ్లు చేసేవాదన ఆసక్తిదాయకంగా ఉంటుంది. "మేము మా మహిళల్ని క్లబ్బులకు తీసుకువస్తాం. మీరు మీ మహిళల్నీ తేగలిగితే మిమ్మల్నీ రానిస్తాం. మీ ఆడవాళ్లు రాకుండా, మా ఆడవాళ్లను మీతో కలిసి మాట్లాడేటట్లు చెయ్యలేం. సగం సగంగా ఉండటానికి సరేననండి. అప్పుడు మా క్లబ్బుల్లోకి రానియ్యమనండి".

మరోవైపు మగవాళ్లనుంచీ అని అర్థం.

దేశంలోని కొన్ని ప్రాంతాల్లో హిందువుల్లోని కొన్ని విభాగాల్లో పర్దా ద్వారా వచ్చిన చెడుగులు లేవని కాదు. అయితే ముస్లిముల్లో పర్దాకి మతపరమైన ముద్ర ఉంది. అలాంటిది హిందువుల్లో లేదు. ముస్లిముల్లో పర్దాకు ఇంకాలోతైన మూలాలున్నాయి. హిందువుల విషయంలో అలా కాదు. ముస్లిముల్లో పర్దా పోవాలంటే మత పరశాసనాలు, సాంఘిక అవసరాలనే వాటి మధ్యపోటీ ఎదుర్కోవాలి. ముస్లిముల్లో పర్దా సమస్య నిజమైన సమస్య. దాని ఆవిర్భావం ఎలాంటిదైనా గానీ, హిందువుల్లో అలాంటిది లేదు. దాన్ని తొలగించేందుకు ముస్లిముల వైపునుంచి ప్రయత్నమూ లేదు.

ఆ రకంగా భారత ముస్లిముల సాంఘిక జీవితంలోనే గాక రాజకీయ జీవితంలోనూ స్తబ్దత ఏర్పడింది. ముస్లిములకు రాజకీయాలుగా అవంటే ఆసక్తిలేదు. వాళ్ల ప్రధానమైన ఆసక్తి మతం. ఎన్నికల్లో పోటీచేసే అభ్యర్థినుంచి ఆ నియోజక వర్గం ఆశించేదల్లా మసీదులో పాత దీపాలకు బదులు కొత్త దీపాల్ని వేయించడం, మసీదులో కొత్త తివాసీ పరిపించమనీ, పాతది పాడైపోయిందనీ, లేకపోతే మసీదు శిధిలమై పోతుంది కాబట్టి దీన్ని బాగు చేయించమనీ అడగడం. కొన్ని నియోజక వర్గాల్లో అభ్యర్థి పెద్ద విందు ఏర్పాటు చేస్తేచాలు. వాళ్లకు సంబంధించి ఎన్నిక అంటే డబ్బు, అది ఒక సాంఘిక కార్యక్రమమో, సాధారణ జీవిత అభివృద్ధో కాదు. ముస్లిం రాజకీయాలు ఐహిక విషయాన్ని గురించి పట్టించుకోవు. అంటే పేదధనిక విభేదాలు, పెట్టుబడిదార్లు, శ్రామికులు, భూస్వాములు, కౌలుదార్లు, పూజారీ, సామాన్యుడూ, హేతువు మూఢనమ్మకం లాంటివేమీ పట్టవు. ముస్లిం రాజకీయాలు మతపరమైనవి. ఒక్క విభేదాన్నే గుర్తిస్తాయవి, హిందువులకీ, ముస్లిములకీ మధ్య ఉన్న విభేదాన్ని ఇష్టమైన వాటికి వేటికీ ముస్లిము రాజకీయాల్లో చోటులేదు. ఒకవేళ వాటికి చోటున్నా, తప్పదు ఏమంటే వాటిని అణచలేం. అవి ముస్లిము రాజకీయ ప్రపంచంలో ఒక్కదానికే అంటే మతానికి లొంగే ఉండాలి.

ముస్లిముల్లో ఈ చెడుగులుండడం విచారకరమైందే. కాని ఇంతకంటే విచారకరమైంది ముసల్మాన్లలో సాంఘిక సంస్కరణలు తేవడానికి ఒక వ్యవస్థీకృత ఉద్యమం ఏదీ లేకపోవడం. అప్పుడుగాని ఈ దౌర్భాగ్యం పోదు. హిందువులకూ సాంఘిక దుర్మార్గాలున్నాయి. కాని వాళ్లకి ఉపశమనం కలిగించే అంశం ఒకటుంది. ఆ చెడుగులు ఉన్నాయన్న స్పృహ కొంతమందికైనా ఉంది. కొంతమంది వాటి నిర్మూలన కోసం గట్టిగా కృషి చేస్తున్నారు. ముస్లిములకు ఇంత దౌర్భాగ్యం ఉందన్న విషయమే స్ఫురణకు లేదు. దాంతో వాటిని తొలగించే ప్రయత్నమే లేదు. ప్రస్తుతం వాళ్లల్లో అమల్లో ఉన్న ఆచారాలను తొలగించడానికి ఏ ప్రయత్నంచేసినా వాళ్లు ప్రతిఘటిస్తున్నారు. 1930లో బాల్య వివాహ చట్టాన్ని కేంద్ర శాసనసభలో ప్రవేశ పెట్టిన బిల్లుని వాళ్లు ప్రతిఘటించారు. బాలికల వివాహ వయస్సుని 14

ఏళ్లకు, బాలురకు 18 ఏళ్లకు పెంచడానికి ఉద్దేశించిన బిల్లు అది. ముస్లిముల మత న్యాయానికి ఇది పొసగదని ముస్లిముల వాదం. ఆ బిల్లుని ప్రతిదశలోనూ వాళ్లు ప్రతిఘటించడమే కాదు, అది చట్టం అయ్యేక సివిల్ డిస్ఒబీడియన్స్ ప్రారంభించారు. అదృష్టవశాత్తు ముస్లిములు ప్రారంభించిన ఈ ఆందోళన విస్తృతం కాలేదు. అది కాంగ్రెస్ సివిల్ డిస్ఒబిడియన్స్‌తో కలిసిపోయింది. కాని సాంఘిక సంస్కరణకు ముస్లిములు ఎంత వ్యతిరేకులో అన్న విషయాన్ని ఇది తెలియజేస్తుంది.

సాంఘిక సంస్కరణలకు ముస్లిములు ఎందుకు వ్యతిరేకం? ప్రపంచ వ్యాప్తంగా ముస్లిములు తిరోగాములని మామూలుగా ఇచ్చే జవాబు. చరిత్రలో లభ్యమయ్యే దాఖలాల వల్ల ఇది నిజమేనని నిస్సందేహంగా చెప్పవచ్చు. ముస్లిములు తొలి కార్యోత్సాహం తర్వాత చిత్రమైన స్తబ్ధతలోపడి పోయారు. ఆ తొలి కార్యోత్సాహం చాలా ఘనమైంది. ఎన్నో సామ్రాజ్యాలు స్థాపితమయ్యాయి. అయితేనేం స్తబ్ధత ఆవహించింది. దాన్నుంచి వాళ్లు మళ్లీ కోలుకోనే లేదు. ఈ స్తబ్ధతకి కారణం ఏమిటి? వాళ్ల పరిస్థితుల్ని అధ్యయనం చేసిన వాళ్ళు చెప్పేది ఏమిటంటే ఇస్లాం ఒక ప్రపంచమతం అన్న భావన ముస్లిములకు ఉండడం అని ఇలా వాదించడం కనిపిస్తుంది-

"మతానికి విధేయుడై యుండి ముసల్మాన్ పురోగమించడు. ఆధునిక శక్తులు చకచకా సాగిపోతున్న ప్రపంచంలో వాళ్లు స్థిరభావన అంటూ అలానే ఉండిపోయారు. తను బానిసలుగా మార్చిన జాతుల్ని తన సహజమైన అనాగరికత్వంలోనే కదలిక లేకుండా ఉంచెయ్యడం ఇస్లాంలో ఉన్న ప్రముఖ అంశాల్లో ఒకటి. అది ఘనీభవించి పోయింది. అలసత్వం మందమైన పొర కమ్ముకు పోయాయి. దీన్ని మార్చడం కుదరదు. రాజకీయ, సాంఘిక, ఆర్థిక పరిణామాలకి దీని మీద ప్రభావంలేదు.

"ఇస్లాం బయట రక్షణ లేదు అని బాగా బుర్రకు పట్టించిన దానివల్ల దీని ఆధ్యాత్మిక సందేశం బయట ఆనందం లేదని దీని న్యాయం బయట వేరే సత్యం లేదని బోధించిన దానివల్ల ఏ ముస్లిం కూడా తన పరిస్థితిని మించిన దాన్ని దేన్నీ ఊహించలేక పోతున్నాడు. ఇస్లామిక్ చింతనను మించిన చింతనను దేన్నీ చెయ్యలేడు. తను ప్రశాంతి సాధించేనని అతనిభావన. తనేసిన్సలైన విశ్వాసానికి హక్కుదారుడని అతని భావన. సత్యం తన సొత్తు-ఇక మార్పులకి గురయ్యే సాపేక్షసత్యం అనేది ఏదీ లేదు. అఖండసత్యమే.

"ముస్లిం మత న్యాయం భిన్న వ్యక్తులలో సమైక్య భావనను అనుభూతిని, వివేచననూ పాడుకొల్పింది."

ఈ ఏకరూపత మృత ప్రాయంగా ఉండేది. దాన్ని ముస్లిమే ముస్లిములకు బోధించడమే కాదు, ఒక అసహనభావంతో దీన్ని రుద్దారు. అలాంటిది ముస్లిం ప్రపంచం బయట ఎక్కడా ఉండదు. దానివల్ల వివేచనాజ్ఞానం లేకుండా పోయింది. వివేచనా జ్ఞానానికి ఇస్లాం

బోధనలకూ చుక్కెదురు. రెనాన్ చెప్పినట్టు* "ఇస్లాం ఆధ్యాత్మిక, ఐహికాల సన్నిహిత సంపుటీకరణ. మూఢ నమ్మకాల ఏలుబడి సాగుతుందిక్కడ. మానవాళి ఎన్నడూ మోయలేనంత భారమైన సంకెల ఇది. ఒక మతంగా ఇస్లాం అందాలు ఇస్లాంకు ఉన్నాయి. కాని మానవ వివేచనకు ఇస్లాం హానికరంగా తయారైందంతే. తేజస్సు తలుపులు బుద్ధికి మూసివేసింది. మనసులు అంతకు ముందే మూసుకుపోయాయి. స్వేచ్ఛాయుత చింతనని చిత్రహింసలు పెట్టింది. మిగతా మతాలంత తీవ్రంగా కాకపోయినా, మరింత పరిణామ యుతంగా చేసింది. తాను జయించిన దేశాన్ని మానసిక వివేచన సంస్కృతి లేకుండా చేసింది. ముసల్మాన్‌కు శాస్త్రజ్ఞానం అంటే ద్వేషం, పరిశోధన నిరుపయోగం అని అతని వాదన. పరిశోధన చవకబారుది, అపవిత్రం– ఏమంటే అవి భగవంతునితో పోటీ పడతాయి. ప్రకృతి శాస్త్రాలు; చారిత్రక శాస్త్రాలూ అంతే, ఏమంటే అవి ఇస్లాంకు ముందుకాలం నాటివి. ప్రాచీన అసత్యవాక్కుల్ని తిరగదోడతాయి..."

"ఇస్లాం శాస్త్ర విజ్ఞానాన్ని శత్రువుగా చూస్తుంది. అందులో మినహాయింపు లేదు. కాని అది ప్రమాదం. దురదృష్టమేమిటంటే ఇస్లాం విజయవంతం కావడం. శాస్త్రాన్ని చంపి అది తనని తానే చంపుకుంది. ప్రపంచంలో పరమ అధమ స్థాయికి పడిపోయింది".

ఈ జవాబు స్పష్టంగానే వుంది. కాని నిజమైన జవాబు కాదు. ఇదే నిజమైన జవాబు అయితే భారత దేశం ఓయట ముస్లిం దేశాల్లో జరుగుతూ వున్న ఆందోళనలకూ, కల్లోలాలకూ సమర్ధన ఏమిటి? పరిశోధనా జిజ్ఞాస, పరిణామ కాంక్ష, సంస్కరణ కామన జీవితంలో అడుగడుగునా కనిపిస్తున్నాయి. నిజానికి టర్కీలో జరిగిన సాంఘిక సంస్కరణలు చాలా విప్లవాత్మక మైనవి. ఆయా దేశాలకి అడ్డంరాని ఇస్లాం ఒక్క భారత ముస్లిములకు మాత్రమే రావడమేమిటి? ఇందుకేదో ప్రత్యేక హేతువు ఉండి ఉండాలి. సాంఘిక, రాజకీయ స్తబ్దతకి హేతువు ఏదో ఉండాలి.

ఏమిటి ప్రత్యేక కారణం? భారత దేశంలో ముస్లిములున్న ప్రత్యేక స్థానాన్ని బట్టి అది వచ్చింది. ప్రధానం హిందూ ఆధిపత్యమున్న వాతావరణంలో అతనున్నాడు. హిందూ వాతావరణం మెల్లి మెల్లిగా, కాని పట్టుగా అతన్ని ఆక్రమించు కుంటోంది. అది తన మానవత్వాన్ని హరించేస్తోందని అతని భయం. క్రమక్రమంగా సడలి పోవడం జరుగుతుందనీ,, అంచేత ఇస్లామిక్ అయిన ప్రతి దానికీ గట్టిగా కరుచుకు పోవాలనీ అతని భావం అది తన సమాజానికి అనర్థమేమోనన్న ఊహే అతనికి లేదు. హిందూ ఆధిపత్యం బలంగా ఉన్న రాజకీయ వాతావరణంలో ఉన్నాడు. తను అణగారిపోతాడని రాజకీయంగా అణగారిపోతే పతనమైపోతాడనీ అతని భయం. సాంఘికంగా రాజకీయంగా హిందువులు తనను ముంచేస్తారని అతని భయం. ముస్లిములు ఈ దేశంలో ఇలా ఉంటానికి ఇదే ముఖ్యమైన కారణం అని

* నేషనాలిటి అండ్ అదర్ ఎస్సేస్

నాకు తోస్తోంది. ఇతర దేశాల్తో పోలిస్తే సాంఘిక సంస్కరణలు లేకుండా వెనకబడి ఉండడానికి ఇదే కారణం. హిందువులకు వ్యతిరేకంగా అహరహమూ పోరాడ్డానికే సర్వ శక్తులూ ఖర్చవుతున్నాయి. సీట్లు, ఓట్లు అనేదే గొడవంతా, సాంఘిక సంస్కరణల ఊహేలేదు. ఒకవేళ ఏ మాత్రం అన్నా ఉన్నా మత ఉద్రేకాల ప్రేరణతో, ఆ భారం మోయలేక అణగారి పోయింది. హిందువులకు వ్యతిరేకంగా తమ భేదభావాలు పక్కన పెట్టి, సమైక్య సంఘటనలో కలిసి పోతారు. వాళ్లు తమ సాంఘిక-మత పర ఐక్యంతో హిందువులకు వ్యతిరేకంగా ఎలాగైనా పోరాడాలని వాళ్లకి ఉంది.

వాళ్ల రాజకీయ స్తబ్ధతకూ ఇదే కారణం. ఐహిక జీవిత అభివర్గాలున్న విషయాన్ని ముస్లిం నాయకులుససేమిరా ఒప్పుకోరు. అదంటే హిందూ వ్యతిరేక పోరాటంలో బలహీనం కావడమేనని వాళ్ల భయం. పేద ముస్లిములు పేద హిందువులతో కలవరు. సంపన్నుల నుంచి న్యాయం కోరడానికి, భూ స్వామికి వ్యతిరేకంగా పోరాడేప్పుడు పేద ముస్లిం కౌలుదార్లు పేద హిందూకౌలు దార్లతో కలవరు. పెట్టుబడి దారుడికి వ్యతిరేకంగా పేద ముస్లిం శ్రామికులు, పేద హిందూ శ్రామికులూ కలవరు. ఎందుకని? జవాబు కష్టమైందేమీ కాదు. ధనికులకు వ్యతిరేకంగా పేదలు జరిపే పోరాటంలో చేరితే ముస్లిమ్ సంపన్నుడికి వ్యతిరేకంగా తను పోరాడాలని పేద ముస్లింకు అనిపిస్తుంది. భూస్వామ్య వ్యతిరేక పోరాటంలో చేరితే ముస్లిం భూస్వామి వ్యతిరేక పోరాటంలో చేరడం అనిపిస్తాందతనికి. అదే రకంగా ముస్లిం శ్రామికుడికినీ, సంపన్న ముస్లిం భూస్వామికి పెట్టుబడి దారుడికి హాని కలిగించడం అంటే ఇస్లాంకు ద్రోహం చెయ్యడమవుతుంది. తద్వారా హిందువుల వ్యతిరేక పోరాటం సన్నగిలి పోతుంది.

భారత సంస్థానాల్లో జరిగిన రాజకీయ సంస్కరణల పట్ల ముస్లిము నాయకుల వైఖరిని బట్టి ముస్లిము రాజకీయాలు ఎంత వక్రంగా తయారయాయో చూడొచ్చు. హిందూ రాష్ట్రమైన కాశ్మీర్‌లో ప్రాతినిధ్య ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టమని ముస్లిములు, వాళ్ల నాయకులు పెద్ద ఆందోళన చేశారు. అదే ముస్లిములు, నాయకులు ముస్లిము రాష్ట్రాల్లో ప్రాతినిధ్య ప్రభుత్వాలకు చచ్చేటంతగా వ్యతిరేకులు. ఈ వింత వైఖరికి కారణం సులభ గ్రాహ్యమే. ముస్లిములకు సంబంధించి అన్ని కూడా ముస్లిం-హిందూ ఎదురు బొదురు వ్యవహారంగానే ఉంటాయి. ప్రాతినిధ్య ప్రభుత్వం ముస్లిములకు లాభిస్తే అది కావాలి. దానికోసం పోరాడాలి. కాశ్మీరు లాంటి చోట్ల పాలకుడు హిందు, జనాభా అధిక శాతం జనాభా హిందువులు. మరి ఆ రాష్ట్రాల్లో ప్రాతినిధ్య ప్రభుత్వం అంటే ముస్లిము పాలకుడి నుంచి అధికారాన్ని హిందువులకి బదలాయించడమే. అందుకనే వాళ్లు ఒక సందర్భంలో దాన్ని కోరుతున్నారు. మరో సందర్భంలో దాన్ని వ్యతిరేకిస్తున్నారు. ముస్లిములకు ప్రధానంగా కావల్సింది ప్రజాస్వామ్యం కాదు. అధిక సంఖ్యాక ప్రజాస్వామ్యం తమకు, హిందువులతో పోరాటంలో లాభిస్తుందా? లేదా అనే దానివల్ల తమ పోరాటం బలపడుతుందా? బలహీన

పడుతుందా? బలహీన పడితే ప్రజాస్వామ్యం అక్కర్లేదు. ముస్లిము రాష్ట్రాల్లో ఆ అధ్వాన్న పరిస్థితి కొనసాగడమే మేలు. హిందువుల చేతిలో ముస్లిం పాలకులది అధికారం కృశించి పోవడం కంటే.

ఒక్క కారణంతో ముస్లిముల రాజకీయ సాంఘిక స్తబ్దతను వివరించవచ్చు. హిందువులు, ముస్లిములు గుక్క తిప్పుకోకుండా పోట్లాడుతూ ఉండాల్సిందే. హిందువులకి వాళ్లమీద పెత్తనం కావాలి. వాళ్లకి హిందువుల మీద కావాలి. ముస్లిములు పాలక వర్గంగా ఉండేవాళ్లు, అది మళ్లీ సాగాలి. అందుకోసం తమ విభేదాన్ని పూడ్చి పెట్టుకోవాలి.

ఇతర ముస్లిం దేశాల్లో జరిగిన సాంఘిక సంస్కరణల్లాంటి వాటిని భారతదేశ ముస్లిములు తిరస్కరించారు. ఏమంటే ఆ దేశాలకి ప్రతి కక్షలతో పోటీపడే మతపర రాజకీయ వైరుధ్యాలు లేవు. భారతదేశంలో వాళ్లకు అవి ఉన్నాయి.

III

ఇదో అంధఛాందస వాదం. ముస్లిం సాంఘిక వ్యవస్థను బలంగా పట్టుకున్న వాటిని సంస్కరించాలన్న అవసరమే అతనికి కనిపించదు. అది వాళ్లనే కాదు హిందువుల్ని పట్టుకుంది. సాంఘిక సామర్థ్యం లేనట్లయితే ఇతర రంగాల్లో పురోగతి సాధ్యం కాదని హిందువులు ఒకప్పుడు గుర్తించారు. హిందూ సాంఘిక ఆచారాల దుర్మార్గం వల్ల హిందూ సమాజం సామర్థ్యాన్ని పోగొట్టుకుంది. ఆ చెడుగుల్ని తొలగించడానికి నిరంతరం కృషి చెయ్యాలి. ఈ విషయాన్ని గుర్తించడం వల్లే భారత జాతీయ కాంగ్రెస్ ఆవిర్భావంతో బాటు సాంఘిక కాన్ఫరెన్సుకి కూడా పునాది పడింది. కాంగ్రెస్ దేశ రాజకీయ వ్యవస్థలో ఉన్న బలహీన అంశాన్ని నిర్వచిస్తూ ఉంటే సాంఘిక కాన్ఫరెన్స్ ఒకే సంస్థకు చెందిన రెండు విభాగాలుగా వాటి వాటి వార్షిక సమావేశాల్ని ఒకే పందిట్లో జరుపుకునేవి. కాని త్వరలోనే రెండూ రెండు పార్టీలుగా విడిపోయాయి. ఒకటి రాజకీయ సంస్కరణ పార్టీ, మరొకటి సాంఘిక సంస్కరణ పార్టీ. వాటి మధ్య పేచీ తల ఎత్తింది. రాజకీయ సంస్కరణ పార్టీ జాతీయ కాంగ్రెసును సమర్థించింది. సాంఘిక సంస్కరణ పార్టీ సాంఘిక కాన్ఫరెన్స్‌ని బలపరిచింది. రెండూ రెండు శత్రు శిబిరాలయి పోయాయి. రాజకీయ సంస్కరణ ముందా? సాంఘిక సంస్కరణ ముందా? అనేది వివాదమయింది. ఒక దశాబ్దం పాటు బలాబలాలు సమంగానే ఉన్నాయి. ఏ పక్షానికీ విజయం దక్కలేదు. అయితే సాంఘిక కాన్ఫరెన్సు దశ వెనక్కి గబగబా మళ్ళింది. విద్యాధికులైన హిందువుల్లో చాలామంది రాజకీయంవైపే మొగ్గి, సాంఘిక సంస్కరణను నిర్లక్ష్యం చేస్తున్నారని సమావేశాలకి అధ్యక్షత వహించిన వాళ్లు విలపించారు. కాంగ్రెస్‌కు హాజరయ్యే వాళ్ల సంఖ్యచాలా ఎక్కువగా ఉంటే సాంఘిక కాన్ఫరెన్సుకు హాజరయ్యే వాళ్ల సంఖ్య తక్కువగా ఉండేది. ఈ ఉదాసీనత, సంఖ్య తగ్గడం లాంటి వాటిని అనుసరించి స్వర్గీయ తిలక్‌లాంటి రాజకీయవాదుల నుంచి వైముఖ్యం వచ్చింది. క్రమేణా రాజకీయ

సంస్కరణ పార్టీ నెగ్గింది. సాంఘిక కాన్ఫరెన్స్ లుప్తం అయిపోయింది. దీన్ని మరిచి పోయారు.[1] గాంధీ నాయకత్వం కింద హిందూ సమాజం రాజకీయ ఉన్మత్త గృహంగా కాకపోయినా ఖాయంగా రాజకీయాల పిచ్చి పట్టుకుంది. సహాయ నిరాకరణ, పౌర అవిధేయత, స్వరాజ్యం కోసం కేకలు, సాంఘిక సంస్కరణ స్థానాన్ని ఆక్రమించాయి. రాజకీయాందోళనల విలయావర్తపు పరివర్తనలో సంస్కరించు కోవాల్సిన చెడుగులున్నాయన్న విషయాన్ని హిందువులు మర్చిపోయారు. ఇంకా ఆ ఎరుక ఉన్నవాళ్లయినా రాజకీయ సంస్కరణలంతా ముఖ్యమైనదే సాంఘిక సంస్కరణ అని నమ్మడం లేదు. అది ముఖ్యమైందని ఒత్తిడి చేస్తే రాజకీయాధికారం లేకుండా సాంఘిక సంస్కరణ ఉండదని వాదిస్తారు. రాజకీయాధికారం సాధించాలన్న ఆతృత చాలా ఎక్కువైంది. దాంతో సాంఘిక సంస్కరణలకు అనుకూలంగా ప్రచారం చేసినా సహించలేక పోతున్నారు. దానివల్ల బోలెడు కాలమూ, శక్తీ, రాజకీయ ప్రచారం నుంచి మళ్లిపోతాయని వాళ్లంటున్నారు. గాంధీకి లేఖరాసిన ఒక వ్యక్తి జాతీయ వాదుల దృక్పథాన్ని, కొంచెం మొరటుగానే అయినా, సరిగ్గా చూపించాడు. గాంధీకి ఇలా రాశాడు.[2]

"రాజకీయాధికారం సాధించకుండా ఏ సాంఘిక సంస్కరణ సాధించలేమని మీకు తెలియదా? ప్రస్తుత ఆర్థిక పరిస్థితిని మార్చాలి. రాజకీయ పునర్నిర్మాణం లేకుండా ఏ పునర్నిర్మాణమూ సాధ్యంకాదుం. సన్నబియ్యం, ముతక బియ్యం గొడవలు సమీకృత ఆహారం గొడవలు లాంటివన్నీ వెర్రిఊహలు."

సాంఘిక సంస్కరణలపార్టీకి రెనడే నాయకుడు. ఆయన రంగాన్ని కాంగ్రెస్‌కు వదిలేసి మరణించాడు. హిందువుల్లో మరోపార్టీ పుట్టింది. అదీ కాంగ్రెస్‌కు పోటీ పార్టీయే. అది హిందూ మహాసభ, దాని పేరును బట్టి హిందూ సంస్కరణను తెచ్చే పార్టీ అని ఎవళ్ళైనా అనుకుంటారు. కాని అది అలాంటి పార్టీ కాదు. కాంగ్రెస్‌తో దాని పోటీకి సాంఘిక సంస్కరణా, రాజకీయ సంస్కరణా అన్న వాటితో సంబంధం లేదు. కాంగ్రెస్ వాళ్లల్లో ఉన్న ముస్లిం అనుకూల ధోరణిని ఇది వ్యతిరేకించింది. ముస్లింలకు వ్యతిరేకంగా ఒక ఐక్య సంఘటనను నిర్వహించడమే దాని లక్ష్యం. హిందువుల హక్కుల్ని కాపాడే వ్యవస్థగా అది సర్వదా రాజకీయ కార్యకలాపాలమీద, సీట్లమీద పదవులమీద ఓ కన్ను వేసి ఉంచింది. సాంఘిక సంస్కరణ గురించి అసలు ఊహలకే రానియ్యలేదు. హిందువుల ఐక్య సంఘటనను ఏర్పాటు చేయ్యాలని తలపెట్టినప్పుడు, సాంఘిక సంస్కరణలను తెచ్చి పెడితే లేనిపోని విభేదాన్ని కలిగించడం ఎందుకు దండగ. హిందువులందర్నీ కూడ గట్టుకు రావడం కోసం, హిందూ మహాసభ 1935 చట్టం ఉద్దేశించిన ఫెడరేషన్‌ని ఆహ్వానించింది.

---

1. మరింత వివరణాత్మక ప్రకటన కోసం 'కులవ్యవస్థ నిర్మూలన' అన్న నా వ్యాసం చూడండి.
2. హరిజన్ – 11 [illegible] 1936

అందులో ఎన్ని అసంబద్ధతలు, లోటుపాట్లు ఉన్నాగానీ హిందూ మహాసభ, భారత సంస్థానాల్నీ, వాటివాటి పాలనలతోనే అలా ఉంచాలని కోరుకుంది. హిందూ రాష్ట్రాలమీద చెయ్యివెయ్యండి అన్నది దాని అధ్యక్షుడి సమరనినాదం అయింది. ఈ వైఖరి ముస్లిముల వైఖరి కంటే వింతగా ఉంది. హిందువుల రాష్ట్రాల్లో ప్రాతినిధ్య ప్రభుత్వాలు హిందువులకు హాని చెయ్యవు. అలాంటప్పుడు హిందూ మహాసభ అధ్యక్షుడు దాన్ని వ్యతిరేకించాలా? అది బహుశా ముస్లిములకు తోడ్పడుతుందేమో, ముస్లిములను తను ఎంత మాత్రమూ సహించలేడు.

## IV

కేంద్ర అసెంబ్లీలో ముస్లిం వివాహ చట్టం viii- 1939ని రద్దు చేయడం విషయంపై జరిగిన చర్చకు మించి, హిందువుల, ముసల్మానుల ఛాందస వాద మూఢ విశ్వాసాలకు మరొక మంచి దృష్టాంతం చెప్పలేము. 1939కి ముందు కాలంలో, ముస్లిం చట్టం ప్రకారం వివాహితలైన ముస్లిం మహిళలు తమ మతం మార్చుకున్నట్లయితే, వారి వివాహం రద్దయిపోయేది. తను కొత్తగా స్వీకరించిన మతానికి చెందిన వ్యక్తిని ఎవరినైనా ఆ మహిళ వివాహమాడేందుకు అవకాశం ఉండేది. అప్పటికి 60 ఏళ్లుగా కోర్టులు నిర్ణయించిన* ఈ చట్టం భారతదేశ మంతటా అమలులో ఉండేది. అయితే viii- 1939 చట్టంలోని 4వ సెక్షన్ ప్రకారం ఈ చట్టం రద్దయిపోయింది. ఈ సెక్షన్ ఈ క్రింది విధంగా ఉంది.

ఒక వివాహిత ముస్లిం మహిళ ఇస్లాం మతాన్ని పరిత్యజించడం గానీ, వేరొక మతాన్ని స్వీకరించడం గానీ ఆమె వివాహాన్ని రద్దు చేయలేవు. ఇస్లాంను పరిత్యజించడం గానీ, కొత్త మతాన్ని స్వీకరించడంగానీ జరిగిన తర్వాత సెక్షన్ 2లో ఉదాహరించిన కారణాలను చూపిస్తూ తన వివాహాన్ని రద్దుచేసుకోవడం కోసం డిక్రీ పొందే అవకాశం ఆమెకు ఉంటుంది. అయితే వేరొక మతాన్ని పరిత్యజించి, ఇస్లాం మతం స్వీకరించిన మహిళకు ఈ సెక్షన్‌లోని అంశాలు వర్తించవు.

ఈ చట్టం ప్రకారం–మతం మార్పిడి కారణంగా ఒక ముస్లిం వివాహిత వివాహం రద్దుకాదు. అయితే ఆమెకు విడాకులు పొందే హక్కు ఉంటుంది. మతం పరిత్యజించడం గానీ, మతం మార్చుకోడం గానీ విడాకులకు ఒక కారణంగా సెక్షన్ 2 ప్రస్తావించక పోవడం ఒక ఆసక్తి దాయకమైన అంశం. వివాహిత ముస్లిం మహిళకు విచక్షణాధికారం లేకుండా చేసి, ఏమతం వాడైనప్పటికీ ఆమె తన భర్తకి కట్టుబడి వుండాలని ఈ చట్టం ముస్లిం మహిళలను శాసించింది.

ఈ మార్పుకు మద్దతుగా సూచించిన కారణాలు చాలా ఆసక్తిదాయకంగా ఉన్నాయి.

* జబరోస్త్ ఖాన్ వెర్సస్ అతని భార్య అన్న కేసులో వాయవ్య సరిహద్దు రాష్ట్ర హైకోర్టు 1870లో ఇచ్చిన తీర్పే మొదటిది.

ఈ బిల్లును ప్రతిపాదించిన శాసన సభ్యుడు క్వాజీ కజ్మీ ఈ మార్పును బలపరుస్తూబలమైన వాదన చేశారు. ఈ చట్టాన్ని ప్రతిపాదిస్తూ ఆయన మాట్లాడారు. *ఆయన ఏమన్నారంటే "అన్నిమతాలలానే ఇస్లాం మతం కూడా మత పరిత్యాగాన్ని రాజ్యాధికార నేరమంత గొప్ప నేరంగా పరిగణించింది. ఇది ఇస్లాం మతానికి కొత్తదేమీ కాదు. ఏ దేశంలోనైనా పురాతన చట్టాలను మనం పరిశీలించినట్టయితే వాటిలో కూడా ఇటువంటి అధికరణాలు అమలు కావడం మనకు తెలుస్తుంది. మత మార్పిడి నేరానికి పాల్పడిన ఒక పురుషుడికి 'మరణం'వంటి కఠిన శిక్ష విధిస్తే, మహిళకు మాత్రం జైలు శిక్ష లభిస్తుంది. మత పరిత్యాగం ఒక పాపం, ఒకనేరం, దానికిశిక్ష వేయాల్సిందే, మహిళకైతే ఒక భార్యగా ఆమె తన హోదాను కోల్పోవాలి అన్నది ఆ పురాతన చట్టంలో నిర్దేశించిన నియమం. భార్య హోదానే కాదు- సమాజంలో తన స్థానాన్ని కూడా ఆమె కోల్పోతుంది. ఆమె తన ఆస్తినీ, హక్కులనూ కూడా కోల్పోవలసి వస్తుంది.

"అయితే కుల పరమైన లోపాలను నిర్మూలించే చట్టం xxi 1850లోనే ఆమోదం పొందింది. ఈ చట్టంవల్ల, మత పరిత్యాగం ఒక వివాహిత మహిళ తన హక్కులను కోల్పోయే విధానం అంతరించింది. వారసత్వపు హక్కులపైన కానీ, ఆస్తులపైన కానీ, మరే విషయంపైన కానీ మతం మార్పిడి కారణంగా ఏర్పడిన నిషేధానికి వివాహిత ముస్లిం మహిళ బలి కానక్కర్లేదు. చట్టం ఆమెకు తోడ్పడి- ఆలోచనా స్వేచ్ఛను ఆమెకు ప్రసాదించింది. తనకు నచ్చిన మతాన్ని స్వీకరించే స్వాతంత్ర్యం ఇచ్చింది. మతం మార్పిడి కారణంగా ఆమెపై పడే నిషేధాజ్ఞల నుంచి ఆమెను విముక్తి చేసింది. అయితే, ఒక భార్యలాగా ఆమె హోదాపై ఉన్న ఆంక్షలను మనం ఎంతకాలం అమలు పరచాలి? అన్నదే ప్రశ్న. భార్యగా ఆమె హోదా సమాజంలో ఆమె కొకస్థానాన్ని కల్పిస్తుంది. ఆమె ఒక కుటుంబానికి చెందినట్లయితే ఆమెకు పిల్లలు ఉంటారు. ఇతర సంబంధాలు కూడా ఉంటాయి. ఆమెకో ఆలోచనా స్వేచ్ఛ ఇచ్చినట్లయితే- పాత మతంలోనే కొనసాగటాన్ని ఆమె ఇష్టపడక పోవచ్చు. ఆమె తన మతాన్ని మార్చుకొన్న పక్షంలో మన ఆధునిక భావాలననుసరించి ఒక భర్తకు భార్యగా ఉండే ఆమె గౌరవాన్ని మనమెందుకు కాదనాలి? ఆలోచనా స్వేచ్ఛనూ, మత స్వాతంత్ర్యాన్నీ కులాంతర మతాంతర వివాహాలను అనుసరిస్తున్న ఈ రోజుల్లో విశ్వాసాన్ని లేదా మతాన్ని మార్చుకున్న చిన్న కారణం మూలంగా ఒక భార్యగా ఆమె హక్కులను కాలరాచే నిబంధనను మనమెందుకు బలపరచాలి?

ఒక ముస్లిం వివాహితకు తన భర్తతో గల బాంధవ్యాన్ని అంతం చేసేందుకు మత పరిత్యాగం కారణమవుతుందన్న విరుద్ధ భావాన్ని ఈ ఆధునిక యుగంలో మన మెందుకు బలపరచాలి" ఇది వాదనలో ఒక భాగం.

---

* లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, 1938, వాల్యూం, పే 1098-1101

"పార్శీ వివాహం- విడాకుల చట్టం 1936లోని 32వ సెక్షన్ ప్రకారం- తన భర్త పార్శీ మతాన్ని పరిత్యజించాడన్న కారణంగా ఒక వివాహిత పార్శీయువతి విడాకుల కోసం కోర్టులో దావా వేయవచ్చు. ఇందులో మొదటిది, విడాకులకు కారణం మతభావనలు గానీ, మత విశ్వాసాలుగానీ కావు. ఎందువల్ల నంటే మత మార్పిడి జరిగి రెండు సంవత్సరాలు గడిచి పోయినా కక్షిదారు ఏ విధమైన అభ్యంతరం చెప్పకపోయినా ఆ వివాహాన్ని రద్దు చేసుకునే హక్కు ఇద్దరిలో ఎవరికీ ఉండదు. రెండవ దేమిటంటే- ఎదుటివారు మతాన్ని మార్చుకున్నారని ఆరోపించిన కక్షిదారుకు వివాహం రద్దు చేసుకునే హక్కు ఉంటుంది. ఈ చట్టంతో పాటు స్థానికులైన మతం మారినవాళ్ల (నేటివ్ కన్వర్ట్స్) వివాహాల రద్దు చట్టం- xxi- 1886ను పరిశీలిస్తే మతం మార్పిడి వివాహ బంధంపై ఇతర మతాల వారిలో కూడా ఎటువంటి ప్రభావం చూపుతున్నదో మనకు అర్థమవుతుంది. ఇది భారతదేశంలోని అన్ని మతాల వారికి వర్తిస్తుంది. ఒక భారతీయుడు క్రైస్తవ మతంలోకి మారడం వివాహాన్ని రద్దు చేయదన్న సత్యాన్ని ఈ చట్టం గుర్తించింది. అయితే ఆ వ్యక్తి కోర్టుకు వెళ్లి, మతం మార్చుకోని తన జీవిత భాగస్వామి తనకు సంబంధించి వివాహ విధులను సక్రమంగా నిర్వర్తించాలని కోరుకునే హక్కు ఉంటుంది. ఆ తరువాత వారికి ఒక ఏడాది గడువు ఇస్తారు. తమ వైవాహిక బంధాన్ని పునః ప్రారంభించే విషయమై కొంతమంది ఇతర వ్యక్తుల సమక్షంలో భార్యాభర్తలిద్దరూ పరస్పరం ముఖాముఖి మాట్లాడుకోవాలని వారిరువురూ ఒక అంగీకారానికి రాలేకపోతే ఆత్మీయత లోపించిన కారణంగా, వారి వివాహం రద్దవుతుందని న్యాయమూర్తి ఆదేశిస్తాడు. ఆ వివాహం రద్దు అవుతుంది. అయితే మతం మార్చుకున్న కారణంగా కాదు. అందువల్ల, మతం మార్పిడి వివాహాన్ని రద్దు చేయలేదన్న సిద్ధాంతం భారతదేశంలోని ప్రతి మతానికి వర్తిస్తుంది". కేంద్ర అసెంబ్లీలోని మరొక ముస్లిం సభ్యుడూ, బిల్లు సమర్థకుడూ అయిన సయీద్ గులాబిక్ నౌరంగ్ బిల్లులోని సూత్రాన్ని సమర్థిస్తూ ఇలా అన్నారు* : అన్ని పరిస్థితుల్లోనూ కూడా మతం విడిచిపెట్టడం అసంకల్పితంగా, తక్షణంగా, ఎటువంటి న్యాయ విచారణలతోనూ, కోర్టు ఆదేశాలతోనూ, ఇతర సంస్కారాలతోనూ పనిలేకుండా వివాహం రద్దవుతుందన్న అభిప్రాయం లేకుండానే బ్రిటిషు ఇండియాలోని కోర్టులు చాలా కాలం నడిచాయి. అదీ కోర్టు వారు చేపట్టిన న్యాయ విధానం. అయితే ఈ అంశంపై ప్రస్తుతం హనాఫీ జ్యూరిస్టులకు మూడు అభిప్రాయాలున్నాయి. బొకారా జ్యూరిస్టులు సంతరించుకున్న ఒక అభిప్రాయం వేరే చోట నుండి స్వీకరించినది. అయితే అది కూడా సంపూర్ణంగా లేదు. దాన్నే నేను అనేక పార్శ్వాలున్న పక్షపాత పరిస్థితి అంటాను. బొకారా అభిప్రాయం ఏమిటి అన్నది ఇప్పటికే కాజ్మీ తదితర వక్తలు చెప్పారు. మతాన్ని పరిత్యజించడం వల్ల వివాహం రద్దు అవుతుందని బొకారీ జ్యూరిస్టులు అంటారు. నిజానికి ఈ అంశంపై నేను సాధికారికంగా నూటికి నూరుపాళ్లు

* లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వ1938, వాల్యూం-V, పుట 1953-55

సరైన విధంగా చెప్పగలను. అదేమిటంటే- బాకారా అభిప్రాయం ప్రకారం, వివాహం రద్దుకాదు, తాత్కాలికంగా నిలువు అవుతుంది. వివాహం తాత్కాలికంగా నిలువు చేయబడుతుంది. అయితే, భార్య పశ్చాత్తాపపడి తిరిగి ఇస్లాం మతాన్ని స్వీకరించేటంత వరకూ ఆమె నిర్బంధంలో ఉంటుంది. రెండవ అభిప్రాయం ఏమిటంటే మత పరిత్యాగం వల్ల ముస్లిం మహిళ తన భర్తకు భార్యహోదాను కోల్పోతుంది. కానీ అతని బానిస స్త్రీగా మారుతుంది. ఈ అభిప్రాయం ఫలితంగా ఉద్భవించే మరొక అభిప్రాయ మేమిటంటే- ఆమె తన భర్తకు బానిసగా ఉండాల్సిన అవసరంలేదు. మొత్తం ముస్లిం జాతికంతటికీ ఆమె బానిసగా మారుతుంది కనుక ఎవరైనా ఆమెను ఉంచుకోవచ్చు. మూడవ అభిప్రాయం- మత పరిత్యాగం వల్ల వివాహ బంధానికి ఎటువంటి విఘాతమూ తగలదు. బాకారా అభిప్రాయం లోని మొదటి అభిప్రాయాన్ని కోర్టువారు స్వీకరించారు. తీర్పులు, విచారణలు ఆ అభిప్రాయంపై ఆధారపడే ఉన్నాయి.

ప్రత్యేకించి ఈ ఒక్క ఉదాహరణలో మాత్రమే చట్ట పూర్వకంగా సరిదిద్దవలసిన న్యాయపూరిత తప్పిదాలు లేవని ఈ సభకు తెలుసు. ఇతర కేసుల్లో కూడా న్యాయ తప్పిదాలు, న్యాయ అభిప్రాయాల్లో విభిన్నతలు, అనిశ్చితాలు, చట్టపరమైన అస్పష్టతలు ఉన్నాయి. న్యాయ అభిప్రాయంలోని తప్పిదాలు ఎప్పటికప్పుడూ చట్టం సరిదిద్దుతూ వుండాలి.

ప్రత్యేకించి ఈ విషయంలో మాత్రం తప్పిదం తరువాత తప్పిదం కొనసాగుతూనే ఉంది. ఈ ప్రశ్నను అర్థించే రూలింగుల్ని నాకు చూపండి. నా బిల్లుకు జవాబు లేదన్నది ఖచ్చితంగా గ్రహించవలసి ఉంది. ఎందుకంటే, కోర్టులు నాకు వ్యతిరేకంగా నిర్ణయించాలి. ఈ సభకు వచ్చి ఏదో ఒక విధంగా దీన్ని చట్టం చేయమని అడగనవసరం నాకు లేదు.

మార్పును తీవ్రంగా ఆకాంక్షిస్తూ, ఈ బిల్లుకు మద్దతుగా చేసిన పై వాదనల్లో దృఢత్వం లేదు. క్రైస్తవులు, ముస్లిములు, పార్శీలకు సంబంధించి విడాకుల చట్టాల మధ్య విభిన్నతలు ఉన్నపుడు, మత మార్పిడి వాస్తవమైనదని రుజువైన పక్షంలో- ముస్లిం చట్టం పార్శీ, క్రైస్తవ చట్టాల కన్నా ముందుందని ముస్లిం చట్టాన్ని వెనుకకు తీసుకు వెళ్లడానికి బదులు, పార్శీ-క్రైస్తవ చట్టాలను అభివృద్ధి పరచాలని గ్రహించడంలో కాజ్మీ విఫలమయ్యారు. ముస్లిమ్ జ్యూరిస్టులలో విభిన్న ఆలోచనా దృక్పధాలు ఉన్న పక్షంలో, ముస్లిమ్ మహిళల స్వేచ్ఛను గుర్తించే అభ్యుదయ దృక్పధాన్ని స్వీకరించే ముస్లిం మహిళలను ఉంపుడు కత్తెగా మార్చే అనాగరిక పద్ధతిని తొలగించే చట్టంతో సహకరించే విధంగా అది ఉందాలేదా అన్న విషయంపై నైరంగ్ పరిశోధిస్తూనే వున్నారు. అదలా ఉంచితే- ఈ మార్పు వెనుక అంతర్లీనంగా ఉన్న ఉద్దేశంతో ఈ చట్టపరమైన వాదనలకు సంబంధం లేకుండా పోయింది. ఒక వనిత కొత్త మతంలోకి అక్రమంగా మారడం, ఆమెను కొత్త మతంలోనే ఉండేలా

చూసి, తిరిగి పాత మతంలోకి వెళ్లకుండా చూసేందుకు కొత్త మతానికి చెందిన ఒక వ్యక్తితో త్వరత్వరగా వివాహం జరిపించడం– వీటిని ఆపాలన్నది ఈ మార్పు వెనకగల ప్రధాన ఉద్దేశం. ఒక ముస్లిం మహిళ హిందూత్వాన్ని స్వీకరించడాన్ని ఒక హిందూ మహిళ ఇస్లాం మతాన్ని పుచ్చుకోవడాన్ని సామాజిక, రాజకీయ దృక్పథాల నుండి చూస్తే గొప్ప పరిణామాలు కనబడతాయి.

అంటే – రెండు మతాల మధ్య ఉన్న సంఖ్యాపరమైన తులనాత్మక స్థితిలో వైరుధ్యాలు చోటు చేసుకుంటాయి. ఒక మహిళ మతం మారినందువల్ల ఉత్పన్నమైన వైరుధ్యాలు కాబట్టి దీనిని ఉపేక్షించరు. జాతీయత పట్ల మహిళకు నిర్దిష్ట ప్రమాణాలు ఉండవు. కానీ పురుషులలా కారు. జాతీయవాదాన్ని పరిరక్షించడంలో మహిళల పాత్ర 'సంతృప్తి కరంగాలేదు.* అందువల్ల మహిళల మతం మార్పిడి, అనంతరం వివాహాలను తమ సంఖ్య పరమైన బలానికి సంబంధించి మార్పు తెచ్చుకొనేందుకు హిందువులపై ముస్లిమ్‌లు, ముస్లిములపై హిందువులు అనుసరిస్తున్న విధ్వంసక చర్యలుగా పరిగణించారు. మహిళల మతం మార్పిడి పశువుల తోలివేతకన్నా అధ్వాన్నంగా దిగజారడంతో, మత పరమైన సమతుల్యతకు స్పష్టమైన సమతుల్యంగా పరిణ మించడంతో దాన్ని అరికట్టేందుకు ప్రయత్నించారు. ఈ చట్టం వెనుకగల ఈ వాస్తవమైన కారణాన్ని చట్టంలోని నాలుగవ సెక్షన్‌లోని రెండు నిబంధనల్లో చూడవచ్చు. ప్రతిబంధం–1లో ముస్లిం మతానికి చెందిన ఒక మహిళను తమ మతంలోకి మార్చుకున్నప్పటికీ మతం మార్పిడితో ప్రమేయం లేకుండా ఆమె ముస్లిం భర్తకే కట్టుబడి ఉండవచ్చని హిందువులు అంగీకరించారు. ప్రతిబంధం–2లో వివాహిత హిందూ మహిళను తమ ముస్లిం మతంలోనికి మార్చుకున్నప్పటికీ వేరొక ముసల్మాన్‌తో ఆమెకు వివాహం జరిగినప్పటికీ, ఆమె ఇస్లాం మతాన్ని వదిలిపెట్టిన పక్షంలో ఆమె వివాహం రద్దయిపోతుందని హిందూ మతానికి చెందిన పాతభర్త వద్దకు వెళ్లిపోయే స్వేచ్ఛ ఆమెకు ఉంటుందనీ ముస్లిములు అంగీకరించారు. అందువల్ల చట్టపరమైన ఈ మార్పులో అంతర్లీనంగా ఉన్న ఉద్దేశ్యం ఏమిటంటే – సంఖ్యాపరమైన సమతుల్యతను కాపాడటం, మహిళల హక్కులకు భంగం కలిగకుండా చూడటం. ఈ రుగ్మతలో తగినంతగా పేర్కొనని మరొక రెండు లక్షణాలు కూడా ఉన్నాయి. ఒకటి అసూయ, సామాజిక వ్యవస్థలోని ఒకరు సంస్కరణకు ఉద్యమిస్తే రెండవ వారికి సహజంగా పుట్టే అసూయ ఇది. అటువంటి సంస్కరణ ప్రభావం నియంత్రణా బలాన్ని ఇచ్చినట్లయితే ఒక్కోసారి అది శత్రుత్వానికి కారణమవుతుంది. ఈ వైఖరిని అద్భుతంగా చిత్రీకరించే ఒక ఆసక్తి కరమైన సంఘటనని స్వామి శారదానంద రాశారు. 1926 ఏప్రిల్ 26వ తేదీ లిబరేటర్ సంచికలో తన జ్ఞాపకాలను రాస్తూ ఆయన ఈ సంఘటనను ఉదహరించారు. ఆయన మాటల్లో–

* ఈ అంశంపై 'ఎస్సే ఆన్ నేషనాలిటీ' గ్రంథంలో గ్రంథ రచయిత రెనాన్ రాసినవి చూడండి.

"సోషల్ కాన్ఫరెన్స్‌కు 'జాతీయత' అన్నపదం రావడం అదే తొలిసారి, చివరి సారికూడా. దానికి నాయకత్వం వహించే బాధ్యత రనాడేది. మొదటినుంచీ, సర్వత్రా అది ఒక హిందూ కాన్ఫరెన్స్‌గానే ఉంది. నేషనల్ సోషల్ కాన్ఫరెన్స్‌లో చేరిన ఏకైక మహమ్మదీయ ప్రతినిధి బార్సిలీకి చెందిన ముఫ్తీసాహెబ్. సరే- ఒక హిందూ ప్రతినిధి నేనూ కర్సి బాల్య వితంతువుల పునర్వివాహానికి అనుకూలంగా ఒక తీర్మానాన్ని ప్రతిపాదించ చడంతో సదస్సు ప్రారంభమైంది. సనాతనులు, పండితులు దాన్ని వ్యతిరేకించారు. ఇంతలో ముఫ్తీ తాను మాట్లాడేందుకు అనుమతి కోరారు. ఈ తీర్మానం హిందువులకు సంబంధించి నదనీ అందువల్ల ముఫ్తీ మాట్లాడవలసిన అవసరం లేదనీ దివంగత బైజ్‌నాథ్ ముఫ్తీ సాహెబ్‌తో చెప్పారు. దాంతో ముఫ్తీ కోపోద్రిక్తులయ్యారు. అయితే, సదస్సు అధ్యక్షుడు లోపం తన మీద ఉంచుకోకుండా ముఫ్తీ మాట్లాడేందుకు అనుమతించారు. హిందూ శాస్త్రాలు పునర్వివాహాన్ని అనుమతించడం లేదనీ, అందువల్ల దానికోసం ఒత్తిడి తీసుకు రావడం పాపమనీ ముఫ్తీ సాహెబ్ అన్నారు. మళ్లీ తమ మతం నుంచీ వేరే మతానికి మారి, తిరిగి మొదటి మతాన్నే స్వీకరించిన క్రైస్తవుల గురించిన తీర్మానంపై చర్చ జరుగుతున్నప్పుడు ముఫ్తీ సాహెబ్ మాట్లాడుతూ- హిందూ మతాన్ని వదలి పెట్టి వెళ్లిన ఒక వ్యక్తికి తిరిగి ఎట్టి పరిస్థితుల్లోనూ హిందూ మతంలో చేరే అవకాశం కల్పించ కూడదని కోరారు" అస్పృశ్యులకు సంబంధించి కూడా ముస్లిముల వైఖరిని తెలియజేసే మరొక సంఘటన ఉంది. అణచి వేయబడ్డ వర్గాలను ముస్లిములు ఎప్పుడూ హేయంగానే చూస్తూ ఉంటారు. ఈ అణచివేయబడ్డ వర్గాలను కలుపుకొని హిందువులు మరింత బలపడవచ్చనన్న ముస్లిముల భయమే హిందువుల, ముస్లిముల మధ్య అసూయకు కారణమైంది. జనాభా వివరాల సేకరణలో- అణచివేయబడ్డ వర్గాలను హిందువులుగా చేర్చవద్దని 1909లో సంవత్సరంలో ముస్లిములు సూచించారు. 1929లో కాంగ్రెస్ అధ్యక్షుడిగా ఉపన్యసిస్తూ మహమ్మద్ అలా 1909లో ముస్లిములు చేసిన సూచన పరిమితులను దాటిపోయారు.

ఆయన చెప్పిన దేమిటంటే

"ఈ కలహాలన్నీ చిన్న పిల్లల చేష్టలు. మతపరమైన కార్య కలాపాలు స్నేహ పూరిత వాతావరణంలో సర్దుబాటు కాని పక్షంలో- ఈ శత్రువైఖరుల గురించి ఆరోపించేందుకు ఒక రంగాన్ని సులభంగా కల్పించగల వారెవరు? అన్న ప్రశ్న ఒకటుంది.

అణచివేయబడ్డ వర్గాలను హిందూ సమాజం త్వరగా తమలో విలీనం చేసుకోని పక్షంలో ఈ ప్రశ్న ఆ వర్గాల వారిదవుతుంది. క్రైస్తవ సంస్థ ఇప్పటికే తీరికలేకుండా ఉంది. దానితో ఎవరూ గొడవ పడరు. అయితే హిందూ సంస్థల, ముస్లిం సంస్థల పరిస్థితి ఒకేలా ఉంది. పీడితవర్గాల మత మార్పిడి కోసం భారీ స్థాయిలో మిషనరీ సొసైటీని నిర్వహించగల సమర్థుడూ, పలుకుబడి ఉన్నవాడూ, ధనవంతుడూ అయిన ఒక పెద్ద మనిషి నాకొక

సలహా ఇచ్చాడు. అదేమిటంటేః

"దేశంలోని ఏయే ప్రాంతాల్లో హిందూ, ముస్లిం మిషనరీలు పనిచేస్తున్నాయో, ఆ ప్రాంతాలను హిందూ ముస్లిం సంబంధిత ప్రాంతాలుగా విభజించాలి. ఒక్కో మతం ఒక్కో సంవత్సరానికి లేదా అవసరమైన పక్షంలో దీర్ఘ కాలికంగా పనిచేసేందుకు సిద్ధ పడాలి. విలీనానికి కానీ, మత మార్పిడికి కానీ సిద్ధపడిన వ్యక్తుల సంఖ్యను అంచనా వేయాలి. ఈ అంచనాలు కార్మికుల సంఖ్య, ఒక్కో మతం వెచ్చించగల నిధుల మీద ఆధారపడి వుండాలి. అంతకుముందటి వాస్తవ సంఖ్యలతో ఈ అంచనాలను పరీక్షించాలి. ఇవన్నీ కూడా హిందూ మతానికి చెందిన పెద్ద మనుషులతో ఒక ఒప్పందానికి వచ్చేలా ఉండాలి". ఈ పద్ధతిలో విలీనం కానీ, మత మార్పిడి కానీ చేసేందుకు రెండు మతాలకు కూడా స్వేచ్ఛ ఉంటుంది. హిందూ సోదరులు ఈ సలహాను ఏ విధంగా స్వీకరిస్తారో నేను చెప్పలేను. అయితే మనస్ఫూర్తిగా, నిజాయితీగా ఈ సలహాను నేను వారియందు తాత్కాలిక పద్ధతిపైననే ఉంచుతున్నాను. బరోడా రాష్ట్రంలోని 'కాళిప్రజల' కేంద్ర రాష్ట్రాల్లోని గోండుల పరిస్థితిని నేను కళ్లారా చూశాను. ఇది మనందరి బాధ్యతేనని నేను అంగీకరిస్తున్నాను. వారిని హిందువులు తమ సమాజంలో విలీనం చేసుకోకపోతే మిగిలిన వాళ్లంతా చివరకు సనాతన హిందువులతో సహా అందరూ కూడా వాళ్లని అస్పృశ్యులుగా చూడటానికి అర్హత కోల్పోతారు. మత మార్పిడి వారినందరినీ మారుస్తుంది. ఇది మతం మార్పిడికి కూడా గొప్ప విషయమే కదా.

మరొక అంశం సన్నాహాలు. ఎటువంటి తీవ్రత లేకుండా రెండు మతాలవారు పరస్పరం సన్నాహాలు ప్రారంభించారు. రెండు శత్రు రాజ్యాల మధ్య ఆయుధ పోటీలా ఉంది ఇది. హిందువులకు బెనారస్ విశ్వవిద్యాలయం ఉంటే ముస్లింలకు ఆలీఘడ్ విశ్వవిద్యాలయం ఉండి తీరాలి. హిందువులు 'శుద్ధి' ఉద్యమాన్ని ప్రారంభిస్తే ముస్లిములు తాబ్లిగ్ ఉద్యమాన్ని ప్రారంభించాల్సిందే. హిందువులు 'సంఘటన్' మొదలు పెడితే తంజీమ్‌తో ముస్లిములు దాన్ని ఎదుర్కోవల్సిందే. హిందువులకు ఆర్.ఎస్.ఎస్.ఎస్.[1] ఉంటే కాక్సార్[2] (ముస్లిం స్వచ్ఛంద కార్యకర్తల సంస్థ) నిర్వహించి ముస్లిములు జవాబు చెప్పితీరాలి.

సమాజ రణరంగంలోని ఈ పోటీ యుద్ధభూమిలో కృత నిశ్చయంతో ఉన్న దేశాలకు ఉండేటటువంటి స్ఫూర్తితో నడిపించింది. హిందువులు తమపై ఆధిపత్యం కొనసాగి ...రేమోనని ముస్లిములు భయపడేవారు. ముస్లిములు మళ్లీ తమని పాలిస్తారేమోనని ...వులు భావించేవారు. ఇరుమతాల వారు కూడా యుద్ధ సన్నద్ధులై కనబడేవారు. ...సన్నాహాలను గమనించేవారు.

---

[1]. హిందూ స్వచ్ఛంద కార్యకర్తలతో రూపొందింపబడిన రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘటన.
[2]. స్వచ్ఛంద కార్యకర్తల సంస్థ

ఇది ఒక భయంకరమైన పరిస్థితి. ఒక భీతావహమయం. హిందువులు తమలో తాము బలాన్ని కూడగట్టుకుంటే ముస్లిములు భీతావహమై పోయేవారు. ఆ భయాన్ని ఎదుర్కొనేందుకు ముస్లిములు తమ శక్తులను పెంచుకునేందుకు ప్రయత్నిస్తే హిందువులు అదే పనిచేసి వారితో సమానస్థితికి చేరుకునేవారు. ఇలా సన్నాహాలు జరుగుతుంటే మొత్తమంతటా అనుమానం, రహస్యం, కుట్ర అని అనిపించేది. రెండు మతాల మధ్య అనివార్యమైపోయిన 'యుద్ధం' గురించి ప్రతి ఒక్కరూ భయపడుతూ సన్నద్ధమవుతూండటం వల్ల ప్రశాంత పరిష్కారానికి గల అవకాశాలు కూడా విషపూరితమై పోయాయి. అటువంటి పరిస్థితుల్లో- హిందువులు, ముస్లిములు ఏమీ చేసుకోబోవటం లేదనీ, ఎదుటి వారి సవాల్‌ని ఎదుర్కొనేందుకు సన్నద్ధమవుతున్నారు తప్ప మరేమీ లేదనీ, ఇది చాలా సహజమనీ, తమంతట తామే తెలుసుకున్నారు. ఇది మనుగడకోసం పోరాటం. మనుగడలో ప్రమాణాలకోసం కాదు. దీన్ని మనం మనుగడ కోసం గానే లెక్క వెయ్యాలి. దీన్నించి రెండు సంగతులు చెప్పవచ్చు. మొదటిది ఏమిటంటే- హిందువులు, ముస్లిములు ఒకరినొకరు శత్రువులను ఎదుర్కొనేందుకు తమలో ఉన్న సామాజిక రుగ్మతలను నివారించడాన్ని ఒదిలి పెట్టేశారు. ఇది అభిలషణీయమైనదేనా? అది ఎలా అంతమవాలి? సామాజిక రుగ్మతలవల్లి సమస్యలు ఎదురైనప్పుడు వాటిని ఒక పక్కన పెట్టి వేయటం అభిలషణీయమని ఎవరూ అనరు. సామాజిక రుగ్మతలున్నచోట అవి బాధలకూ, అన్యాయానికీ చిహ్నాలుగా మారక ముందే వాటిని నిర్మూలించాలి. ప్రతిచోటా ఉన్న సామాజిక, ఆర్థిక రుగ్మతలే విప్లవానికి నాంది పలుకుతాయి. సాంఘిక సంస్కరణ రాజకీయ సంస్కరణకు నాంది పలుకుతుందా, రాజకీయ సంస్కరణ సాంఘిక సంస్కరణకు నాంది పలుకుతుందా అన్నది వివాదాస్పద విషయమే కావచ్చు. అయితే రాజకీయ సామాజిక సంస్కరణలకు ఉపయోగపడటమే రాజకీయాధికారానికి పరిపూర్ణత అనడంపై రెండు అభిప్రాయాలు ఉండవు. సమాజాన్ని పట్టి పీడించి నాశనం చేస్తున్న అనేక రుగ్మతలను రాజకీయాధికారం నిర్మూలిస్తుందన్న అభిప్రాయానికి న్యాయం జరగని పక్షంలో, రాజకీయాధికారం కోసం చేస్తున్న పోరాటమంతా బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది. అయితే ఏదో ఒక విధంగా హిందువులు ముస్లిములు రాజకీయాధికారం లోనికి ప్రవేశిస్తే- ఆ అధికారాన్ని వాళ్లు సాంఘిక సంస్కరణలకు ఉపయోగిస్తారని ఏం ఆశించగలం? ఆ విషయానికి సంబంధించి ఎటువంటి ఆశలు పెట్టుకోలేం. హిందువులు, ముస్లిములు ఒకరినొకరు శత్రువులుగానే పరిగణించుకుంటున్నంత కాలం, ఆ శత్రువులను ఎదుర్కొనేందుకు సన్నాహాలు చేయడంలోనే వారి శ్రద్ధాసక్తులు సరిపోతాయి. హిందువులకు వ్యతిరేకంగా ముసల్మానులు, ముసల్మానులకు వ్యతిరేకంగా హిందువులు ఐక్య సంఘటనలు నెలకొల్పు తున్నంతకాలం, నడుస్తున్నంత కాలం సామాజిక రుగ్మతల మీద నిశ్శబ్దమైన కుట్ర జరుగుతూనే వుంటుంది. ఈ రుగ్మతలు భయంకరమైనవిగా మారి, తక్షణ పరిష్కారం కోరే స్థితిలో ఉన్నప్పటికీ

ముస్లిములు కానీ, హిందువులు కానీ వాటిపై శ్రద్ధ చూపరు. దీనికి కారణం చాలా చిన్నది. సంఘ సంస్కరణలకు చేపట్టే ప్రతి చర్యా సంఘాన్ని విభాగాలుగా విభజించి తద్వారా తమ మతాన్ని బలహీనం చేస్తుందని, ఆ తరువాత అవతలి మతం వారి సవాలును ఎదుర్కొనేందుకు తమకు బలం సరిపోదని ఆలోచించి సంఘ సంస్కరణకు ఏ ఒక్కరూ కూడా చొరవ తీసుకోరు. ఒకమతం వేరొక మతాన్ని శత్రువుగా చూస్తున్నంత కాలం సామాజిక ప్రగతి ఉండదని స్పష్టంగా చెప్పవచ్చు. ఇరుమతాల వారి ఆలోచనలపై చర్యలపై ఛాందస వాదం ఆధిపత్యం కొనసాగుతూనే ఉంటుంది.

ఈ శత్రుభావన ఎన్నాళ్లకు అంతరిస్తుంది? ఒకే రాజ్యాంగం నీడలో, ఒకే దేశానికి చెందిన సహోదరులుగా హిందువులు, ముస్లిములు జీవించేకాలం వస్తే ఇది అంతరించినట్టే. ఒకే రాజ్యాంగం ఉంటే సంఖ్యాపరమైన సమతుల్యత దెబ్బతింటుందన్న భయమే హిందువులకు ముస్లిములను శత్రువులుగా, ముస్లిములకు హిందువులను శత్రువులుగా మారుస్తోంది.

ఇది ఇలాగేకొనసాగితే- దీనికి చికిత్స స్పష్టంగా పాకిస్తానే! శత్రుభావనలు ఏర్పడటానికి దారితీసిన ప్రధాన కారణాలను అది తొలగిస్తుంది. హిందువులు, ముస్లిముల మధ్యగల పరస్పర ఆక్రమణభయాన్ని, పరస్పర బానిసత్వ భయాన్ని కూడా పాకిస్తాన్ నిర్మూలిస్తుంది. పాకిస్తాన్‌కు, హిందుస్తాన్‌కు స్వతంత్ర్య రాజ్యాంగాలను కల్పిస్తే రోజూవారి జీవితంలో బలాల సమతుల్యతను కాపాడుకునేందుకు జరుగుతున్న నిరంతర పోరాటాన్ని అవి నిర్మూలిస్తాయి. ప్రస్తుతం ముడిపడుతున్న తక్షణ సామాజిక ప్రాముఖ్యంగల ప్రధానాంశాలను చేపట్టేలా చేస్తాయి. స్వరాజ్య పోరాటంలోని ప్రధానాంశమైన ప్రజల జీవిత విధానాలను మెరుగు పరుస్తాయి. అటువంటి వాదనలు ఏవీ లేకుండా, ఒకరి చేతుల్లో మరొకరు ఓడిపోతామేమోనన్న భయంతో ముస్లిములు, హిందువులు చర్య, ప్రతిచర్యలకు దిగుతున్నారు. పోరాట సన్నాహాలు ఎప్పుడూ కలిసి సంఘ సంస్కరణలకన్నా ముందే ఉంటాయి. అందువల్ల సామాజిక స్తబ్దత కొనసాగి తీరుతుంది. ఇది సహజం. ఎవరూ ఆశ్చర్య పడవల్సిన పనిలేదు. బెర్నార్డ్‌షా చెప్పినట్టు "విజేత దేశం క్యాన్సర్ రోగి వంటిది. అతడు దేన్ని గురించీ ఆలోచించడు. ఆరోగ్య వంతుడు తన ఎముకల గురించి పట్టించుకోనట్లే, ఆరోగ్య కరమైన దేశం కూడా జాతీయత గురించి ఆలోచించదు. అయితే, ఒక దేశ జాతీయతను ఛిన్నాభిన్నం చేసినట్టయితే, దాన్ని తిరిగి పొందడం గురించి తప్ప అది మరి దేన్ని గురించీ ఆలోచించదు. జాతీయవాదుల ఆకాంక్ష సఫలమయ్యేంత వరకూ, ఏ సంస్కర్తా, ఏ వేదాంతీ, ఏ మతబోధకుడి మాటలూ కూడ ఆ దేశం వినదు. ఏకీకరణ, సరళీకరణల గురించి తప్ప ఎంత ప్రధానమైన విషయాలనైనా ఆ దేశం పట్టించుకోదు".

హిందువులనుండి వేరు పడదామనుకుంటున్న ముస్లిమ్‌ల ఏకీకరణ జరగకపోతే, ఒకరిపై మరొకరి ఆధిపత్యం ఉంటుందేమోనన్న భయం నుంచీ ముస్లిములు, హిందువులు విముక్తి కాకపోతే, ఈ సామాజిక స్తబ్దత అనే అనారోగ్య పరిస్థితి బాగుకాదు అనడంలో సందేహంలేదు.

# మతపరమైన దాడి

హిందువులకు ముస్లిముల మీద, ముస్లిములకు హిందువుల మీద ద్వేషభావం వున్నట్లుగా ఆషామాషీ పరిశీలకునికి కూడా గోచరించే విషయం. హిందువులకు ఈ ద్వేషభావం ఇప్పుడిప్పుడే అలవడటం మొదలైంది. కాని ముస్లిములకు ద్వేషభావం స్వతహాగా ఆదినుండి ఉంది. కొంతకాలం తర్వాత హిందువులు ముస్లిములను ఈ విషయంలో అధిగమిస్తారనవచ్చును. కానీ నేడు మత ద్వేషాన్ని ప్రదర్శించడంలో ముస్లిములు హిందువుల కంటే చాలా ముందున్నారు.

మత కలహాలను గురించి చర్చించిన అధ్యాయంలో ముస్లిముల సాంఘిక ద్వేషాన్ని గూర్చి సవివరంగా చెప్పడమైంది. ముస్లిముల రాజకీయ ద్వేషాన్ని గూర్చి సంక్షిప్తంగా వివరించడం అవసరం. ఎందుకంటే ఈ రాజకీయ ద్వేషాన్ని మనం తేలిగ్గా తీసుకొనేందుకు వీలులేనంత రుగ్మతను సృష్టించింది.

ముస్లిముల రాజకీయ ద్వేషానికి మూడు ముఖ్య కారణాలున్నాయి. ఏనాటికానాటికి పెరుగుతున్న ముస్లిముల రాజకీయ ఆకాంక్షలు మొదటగా చెప్పుకోవాలి. వీటికి నాంది 1892 సంవత్సరం.

1885లో భారత జాతీయ కాంగ్రెస్‌ని స్థాపించారు. స్వపరిపాలనా కాకుండా సమర్థమైన పరిపాలన కావాలనే ధ్యేయంతో అది ప్రారంభమైంది. దీనికి జవాబుగా 1861 చట్టం ద్వారా ఏర్పాటైన ప్రాంతీయ కేంద్ర శాసనసభల స్వభావాన్ని మార్చవలసిన ఆవశ్యకతను ఆంగ్ల ప్రభుత్వం గుర్తించింది. కాంగ్రెసు ఆందోళన అంకుర దశలోనే ఉన్నందువల్ల వాటినే అందరి అభిమానం సంపాదించేటట్టు ఆంగ్ల ప్రభుత్వం సంపూర్తిగా రూపొందలేక పోయింది. రంగుపులిమితే చాలనుకున్నది. తదనుగుణంగా పార్లమెంటు

1892లో భారత శాసనసభా చట్టాన్ని అంగీకరించింది. ఈ చట్టంలోని రెండు ప్రధానాంశాల్ని మరచిపోకూడదు. ప్రభుత్వం తొలిసారిగా ప్రజాసభలను ఏర్పాటుచేయడానికి ప్రజాప్రాతినిధ్యం మూల సూత్రంగా అంగీకరించింది. ఇది ఎన్నిక సూత్రం మీద కాదు, నామినేషన్ల సూత్రం ప్రకారం.

అయితే ఈ నియామకానికి ముందు ఆ వ్యక్తి ముఖ్యమైన ప్రజాసంస్థలైన పురపాలక సంఘాలు, జిల్లా బోర్డులు, విశ్వవిద్యాలయాలు, వ్యాపారసంఘాలు, ఇత్యాదుల చేత ఎంపిక అయిఉండాలి. భారత రాజకీయ రాజ్యాంగ విధానంలో మత ప్రాతిపదికపై ముస్లిములకు ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని ఈ చట్టాన్ని పురస్కరించుకుని ఏర్పాటుచేసిన శాసన సభల్లో తొలిసారిగా కల్పించడమైంది.

ఈ మత ప్రాతిపదికను ఎలా ప్రవేశపెట్టారో అగమ్యగోచరం. ఎందుకంటే మూడో కంటికి తెలియకుండా అతి రహస్యంగా దీన్ని ప్రవేశపెట్టేరు. ప్రత్యేక ప్రాతినిధ్య సూత్రం ఈ చట్టంలో చోటుచేసుకోలేదు. చట్టం దీన్ని గూర్చి ఏమీ చెప్పటంలేదు. ఆసక్తి ఉన్నవారికీ, వర్గాలకూ ప్రాతినిధ్యం ఇవ్వాలనే దాంట్లో ముస్లిములను చేర్చాలన్న విషయం నియమావళిని తయారుచేసే బాధ్యత వహించిన వారికిచ్చిన ఆదేశాల్లోనే ఉంది కాని చట్టంలో కాదు.

దీన్ని ఎవరు ప్రవేశపెట్టారనేది పరమరహస్యం. ఏ ముస్లిం సంస్థల కోరిక మేరకీ ఈ ప్రాతినిధ్యాన్ని ఇవ్వలేదు. ఇది ఎవరి మస్తిష్కంలో మెదిలింది? వైస్రాయి డఫరిన్ శాసనసభలో ప్రాతినిధ్య ప్రాతిపదికను గూర్చి విపులీకరిస్తూ, ఇంగ్లండులో లాగ కాకుండా భారతదేశంలో ఆసక్తి దారులను దృష్టిలో పెట్టుకొని ప్రాతినిధ్యం ఇవ్వాల్సిన ఆవశ్యకతను 1888లోనే వక్కాణించారు. కాబట్టి డఫరినే ప్రవేశపెట్టారని అనుకోవచ్చు. మరొక చిత్రమైన ప్రశ్నేమంటే డఫరిన్ ఇలాంటి పథకాన్ని వేయడానికి కారణమేమిటి? మూడు సంవత్సరాల క్రితం స్థాపించిన భారత జాతీయ కాంగ్రెస్ నుండి[2] ముస్లిములను దూరంగా[3] ఉంచటానికే ఇది జరిగిందనుకోవచ్చు. అదిలా ఉండనీయండి, తొట్ట తొలిసారిగా భారత రాజ్యాంగంలో ముస్లిములకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఇవ్వడమనే ముఖ్యాంశం ఈ చట్టం మూలంగానే, చట్టం, నియమావళి, ఎంపిక చేసుకునే హక్కు ముస్లిం వర్గానికి ఇవ్వకపోగా, ఎన్ని స్థానాలు ముస్లిములకు కేటాయించబడాలో కూడా చట్టం చెప్పలేదు. ప్రత్యేక

1. మొదటి రౌండ్ టేబుల్ సమావేశంలోని అల్ప సంఖ్యాకవర్గాల ఉపకమిటీలో మహమ్మద్ షఫీ చేసిన ఉపన్యాసాన్ని చూడండి.
2. రాజా నరేంద్రనాథ్ ఉపన్యాసాన్ని చూడండి పేజీ 65లో 1887 డిశంబర్ 28 నాటి లక్నో.
3. 1887 డిశంబర్ 28నాటి లక్నో, 1888 మార్చి 11నాటి మీరట్ ఉపన్యాసాలందు సర్ సయ్యద్ అహమద్ ముస్లిములను కాంగ్రెస్‌లో చేరవద్దని ఉద్బోధించాడు. తన అధ్యక్షోపన్యాసంలో తన రెండు ఉపన్యాసాలను చారిత్రకమైనవని వర్ణించాడు.

ప్రాతినిధ్యం ఉండాలనే హక్కును ఈ చట్టం ముస్లిములకు ప్రసాదించింది.

ఈ ప్రత్యేక ప్రాతినిధ్య సూత్రం సలహా మొట్టమొదట ఇంగ్లీషువాళ్ల నుండే వచ్చినప్పటికీ ముస్లిములు ప్రత్యేక రాజకీయ హక్కుల సాంఘిక ప్రాముఖ్యాన్ని గుర్తించకపోలేదు. కాబట్టే శాసనభల సంస్కరణ, తర్వాత జరగబోతుందని 1909లోనే తెలుసుకున్న ముస్లిములు తమకుతామే* వైస్రాయి మింటోను కలుసుకొని కింది కోరికల్ని వెలిబుచ్చారు.

i) సంఖ్యా బలం, సాంఘిక అంతస్తు, ఒక ప్రాంతంలోని ప్రభావం లాంటి వాటిని బట్టి పురపాలక సంఘాలు, జిల్లా బోర్డుల్లో ముస్లిములకు ప్రాతినిధ్యం ఇవ్వాలి.

ii) విశ్వ విద్యాలయాల పాలక వర్గాల్లో ముస్లిములకు ప్రాతినిధ్యం కల్పిస్తామనే హామీ ఇవ్వాలి.

iii) మహమ్మదీయ భూస్వాములు, న్యాయవాదులు, వ్యాపారులు ఆసక్తి ఉన్న ఇతరులు స్థితి మంతులైన పట్ట భద్రులు జిల్లా బోర్డు సభ్యులు, పురపాలక సంఘాల సభ్యులు, ఓటర్లుగా ఉంటారు. ఓటర్లు ఎన్నుకున్న ముస్లిములకు ప్రాంతీయ మండలుల్లో ప్రాతినిధ్యం కల్గించాలి.

iv) ఇంపీరియల్ శాసనసభలో ముస్లిముల ప్రాతినిధ్య సభ్యుల సంఖ్య వారి సంఖ్యాబలంపై ఆధారపడి ఉండదు.ముస్లిములు నిష్ఫలమైన అల్ప సంఖ్యాకులుగా ఉండబోరు. ముస్లిం న్యాయవాదులు, వ్యాపారులు, ప్రాంతీయ శాసనసభ్యులు, ఉన్నత విద్యా వంతులు ఈ ఓటర్లచే వీరు సాధ్యమైనంత వరకూ ఎన్నిక అవ్వాలి.

ఈ కోరికలకు అనుమతి లభించింది. 1909 చట్టంలో వీటిని పొందు పరిచేరు. ఈ చట్టం కింద ముస్లిములకు

1) వారి ప్రతినిధులను ఎన్నుకొనే హక్కు 2) వారి ప్రతినిధులను ప్రత్యేక నియోజకవర్గం ద్వారా ఎన్నుకొనే హక్కు 3) జనరల్ నియోజక వర్గంలో కూడా ఓటు వినియోగించుకొనే హక్కు లభించాయి.

ఈ దిగువ పట్టికలో ముస్లిములకు 1909 చట్టం ద్వారా సంక్రమించిన ప్రాతినిధ్యపు నిష్పత్తి పొందు పరచడమైంది.

---

* ఈ ప్రతినిధి వర్గం "ఆదేశం మేరకి జరిగిన ప్రదర్శన" అని కాంగ్రెస్ అధ్యక్షునిగా మహమ్మదాలీ అన్నాడు'

## హిందువులకూ, ముస్లింలకూ 1909 చట్టం ప్రకారం మత ప్రాతిపదిక ఆధారంగా లభించిన ప్రాతినిధ్యం

| రాష్ట్రం/ ప్రాంతం | 1909 చట్టం వల్ల నియమితులైన అదనపు సభ్యుల అత్యధిక సంఖ్య | నిబంధన వల్ల అనుమతించబడిన అదనపు అత్యధిక సంఖ్య గళ్లు 512 | పదవి రీత్యా సభ్యులు | నిబంధనల మేరకు సభల సంఖ్యాబలం: ఎన్నికైన సభ్యులు – మొత్తం | ఎన్నికైన సభ్యులు – ముస్లిమేతరులు | ఎన్నికైన సభ్యులు – ముస్లిములు | నియమించబడిన సభ్యులు – అధికారులు – న్యాయాధికారులు | నియమించబడిన సభ్యులు – అధికారులు – ఇతరులు | నియమించబడిన సభ్యులు – అనధికారులు | నిపుణులు | మొత్తం | మొత్తం సంఖ్యాబలం గళ్ళు 4, 512 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| భారతదేశం | 60 | 60 | 8 | 27 | 22 | 5 | – | 28 | 5 | – | 33* | 68 |
| మద్రాసు | 50 | 45 | 4 | 21 | 19 | 2 | 1 | 16 | 5 | 2 | 24 | 49 |
| బొంబాయి | 50 | 45 | 4 | 21 | 17 | 4 | 1 | 14 | 7 | 2 | 24 | 49 |
| బెంగాలు | 50 | 50 | 4 | 28 | 23 | 5 | – | 16 | 4 | 2 | 22 | 54 |
| బీహారు | 50 | 41 | 4 | 21 | 17 | 4 | – | 15 | 4 | 1 | 20 | 45 |
| ఉత్తరప్రదేశ్ | 50 | 49 | 1 | 21 | 17 | 4 | – | 20 | 6 | 2 | 28 | 50 |
| పంజాబ్ | 30 | 26 | 1 | 8 | 8 | లేవు | – | 10 | 6 | 2 | 18 | 27 |
| బర్మా | 30 | 17 | 1 | 1 | 1 | లేవు | | 6 | 8 | 2 | 16 | 18 |
| అస్సాం | 40 | 25 | 1 | 11 | 9 | 2 | – | 9 | 4 | 1 | 14 | 25 |

* 9వ గడిలో ఇచ్చిన అత్యధిక అధికారుల సంఖ్య నియమిత సూత్రాల పరిమితిలో అనుమతించబడింది.

పంజాబు, మధ్య రాష్ట్రాలు మినహా అన్ని రాష్ట్రాల్లో ఈ ఏర్పాటు అమలయింది. పంజాబు ముస్లిములకు ఈ ప్రత్యేక రక్షణ అవసరమని పంజాబు రాష్ట్రంలోనూ, అప్పుడు శాసనసభ లేనందువల్ల సెంట్రల్ ప్రావిన్స్‌లో ఈ ఏర్పాటు అమలు పరచలేదు[1].

1916 అక్టోబరులో ఇంపీరియల్ శాసనసభ్యులు పందొమ్మిది మంది వైస్రాయి చేమ్స్ ఫర్డుకు రాజ్యాంగాన్ని సవరించాలని చిన్న నోటు పంపించేరు. తక్షణమే ముస్లిము వర్గం తరుపున ముస్లిములు అనేక కోరికలతో ముందుకు వచ్చారు. అవి :

i) పంజాబు మధ్య రాష్ట్రాలకు ప్రత్యేక ప్రాతినిధ్య సూత్రాన్ని విస్తృత పరచడం.
ii) ప్రాంతీయ శాసనసభలో, ఇంపీరియల్ శాసనసభలో ముస్లిములకు సంఖ్యాబలం నిర్ణయించడం
iii) ముస్లిములకు వర్తించే మతాచార వ్యవహారాల విషయంలో రక్షణ.

ఈ కోరికలపై హిందూ ముస్లిముల మధ్య జరిగిన మంతనాలు లక్నో ఒప్పందంగా జగద్విదితం. ఈ ఒప్పందంలో రెండు షరతులున్నాయి. ఒకటి శాసనసభ నిర్మాణానికి సంబంధించింది.

అనధికార బిల్లు, షరతు, లేదా తీర్మానం హిందూ ముస్లిములలో ఏ ఒక్కరికి వర్తించినప్పటికీ ఆ వర్గంలో నాలుగింట మూడువంతుల సభ్యులు (ఆ శాసనసభలో లేదా ఇంపీరియల్ సభలో) అంగీకరించినట్లయితేనే కార్యక్రమం కొనసాగాలి. రెండో షరతు ముస్లిం ప్రాతినిధ్య నిష్పత్తికి సంబంధించింది. పెక్కు రాష్ట్రాల్లో ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా ప్రాంతీయ శాసనసభలకు ఎన్నుకోబడిన విధంగానే, ఇంపీరియల్ శాసన సభకు కూడా ఎంపికైన భారత సభ్యుల్లో సాధ్యమైనంత వరకూ మూడింట ఒక వంతు ముస్లిములు తప్పనిసరిగా ఉండటం.

ముస్లిం ప్రాతినిధ్య విషయంలో ప్రాంతీయ శాసనసభలో ముస్లిముల దామాషా ప్రాతినిధ్యం ఈ విధంగా ఉండాలని అంగీకరించారు[2].

| | | ప్రాంతీయ శాసనసభలకు ఎంపికైన భారతీయ సభ్యుల శాతం |
|---|---|---|
| పంజాబు | - | 50 |
| ఐక్య రాష్ట్రాలు | - | 30 |
| బెంగాలు | - | 40 |
| బీహారు, ఒరిస్సా | - | 25 |
| మధ్య రాష్ట్రాలు | - | 15 |
| మద్రాసు | - | 15 |
| బొంబాయి | - | 33 |

1. సెంట్రల్ ప్రావిన్సెస్ శాసనసభ 1914లో ఏర్పడింది.
2. కారణాంతరాలవల్ల ముస్లిం ప్రాతినిధ్య దామాషా పరిష్కృతం కాలేదు.

ముస్లిములకు ఈ ప్రాతినిధ్య నిష్పత్తి స్థానాలను కల్పిస్తూ 1909 చట్టం ప్రకారం ఉన్న జనరల్ నియోజక వర్గంలోని రెండవ ఓటు హక్కును తీసివేస్తారు. లక్నో ఒప్పందాన్ని మాంటేగు–చేమ్స్‌ఫర్డు నివేదిక ప్రతికూలంగా విమర్శించింది. ఇది ఇరువురి మధ్య ఒప్పందం కావడం వల్ల ఆంగ్ల ప్రభుత్వం దీన్ని త్రోసి రాజని దీనిస్థానే తన నిర్ణయాన్ని రుద్ద దలచుకోలేదు. రెండు షరతులు ప్రభుత్వం అంగీకరించి భారత ప్రభుత్వ 1919 చట్టంలో రూపొందించినట్టివి. శాసనానికి సంబంధించిన షరతును మరొక విధంగా అమలు పరిచారు[1]. ఆంగ్ల ప్రభుత్వంలోని పౌరులు పాటించే మతం, మతపరమైన ఆచార వ్యవహారాలను వ్యతిరేకించే బిల్లును శాసన సభ్యులకు వదిలే బదులుగా భారత శాసన సభల్లో ఏ సమావేశంలో కూడా గవర్నరు జనరలు ముందు అనుమతి లేనిదే ప్రవేశ పెట్టరాదని పొందు పరిచారు.

ప్రాతినిధ్యానికి సంబంధించిన షరతును ప్రభుత్వం అంగీకరించింది కానీ పంజాబు, బెంగాలు ముస్లిములకు సరిగ్గా ప్రాతినిధ్యం లభించలేదని ప్రభుత్వం అభిప్రాయపడింది. ఈ అనుకూల ప్రభావం- 1919 భారత చట్టం ద్వారా ఏర్పడిన శాసనసభల కూర్పులో ప్రతిబింబిస్తుంది.

| | | శాసనసభా నిర్మాణం | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | | ఎంపికైన సభ్యులు | | | నియమిత సభ్యులు | | మొత్తం |
| | చట్ట పరమైన కనీస సంఖ్య | మొత్తం | ముస్లింలు | ముస్లిం కానివారు | అధికారులు | అనధికారులు | |
| శాసనసభ | 145 | 104 | 52 | 52 | 26 | 15 | 145 |
| శాసనసమండలి | 60 | 33 | 11 | 22 | 17 | 10 | 60 |
| మద్రాసు | | | | | | | |
| ప్రాంతీయ మండలి | 118 | 98 | 13 | 85 | 11 | 23 | 132 |
| బొంబాయి I | 111 | 86 | 27 | 59 | 19 | 9 | 114 |
| బెంగాలు I | 125 | 114 | 39 | 75 | 16 | 10 | 140 |
| ఐక్య రాష్ట్రాల I | 118 | 110 | 29 | 71 | 17 | 6 | 123 |
| పంజాబు I | 83 | 71 | 32 | 39 | 15 | 8 | 94 |
| బీహారు I | 98 | 76 | 18 | 58 | 15 | 12 | 103 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 70 | 55 | 7 | 48 | 10 | 8 | 73 |
| అస్సాం ప్రాంతీయ మండలి | 53 | 39 | 12 | 27 | 7 | 7 | 53 |

లక్నో ఒప్పందం ద్వారా ముస్లిములకు ఎంతమేరకు ప్రాతినిధ్యం లభించిందో ఈ దిగువ పట్టికలో చూడవచ్చు[2].

1. 1919 భారత ప్రభుత్వ చట్టం సెక్షన్ 67(2) (బి)
2. స్టాట్యుటరీ కమీషన్ 1929 నివేదిక, వాల్యూం -I పేజీ. 189.

| శాసన సంస్థ | మొత్తం నియోజకవర్గ ప్రాంత ప్రజల్లో ముస్లింల శాతం 1921 జనాభా లెక్కలు | మొత్తం సభ్యత్వానికి ముస్లిం సభ్యుల శాతం | ఎంపికైన మొత్తం భారతీయ సభ్యులకూ, ఎంపికైన ముస్లిం సభ్యుల శాతం[1] | జనరలు నియోజక వర్గాలకు ఎంపిక ద్వారా భర్తీ కాబడిన మొత్తం సభ్యులకు ముస్లిం సభ్యుల శాతం | లక్నో ఒప్పందం శాతం |
|---|---|---|---|---|---|
| పంజాబు | 55.2 | 40 | 48.5 | 50 | 50 |
| ఐక్య రాష్ట్రాలు | 14.3 | 25 | 30 | 32.5 | 30 |
| బెంగాలు | 54.6 | 30 | 40.5 | 46 | 40 |
| బీహారు, ఒరిస్సా. | 10.9 | 18.5 | 25 | 27 | 25 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 4.4 | 9.5 | 13 | 14.5 | 15 |
| మద్రాసు | 6.7 | 10.5 | 14 | 10.5 | 15 |
| బొంబాయి | 19.8 | 25.5 | 35 | 37 | 33.3 |
| అస్సాం | 32.2 | 30 | 35.5 | 37.5 | ఏర్పాటు లేదు |
| విధాన సభ | 24 | 26 | 34 | 38 | 33.3 |

చట్టపరమైన కమీషను 1929 నివేదిక 1వ పుస్తకం 189 పేజీ 3వ గడి ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా ఎంపికైన సభ్యులు (ఉదా : వ్యాపారులు)తో కలిసి ఒక్కొక్కసారి ప్రాతినిధ్య నిష్పత్తి మారుతుంది. అదే విధంగా 2వ గడి, అధికారులతో నియమింపబడిన అనధికారులతో సహా వివిధ సమయాల్లో స్వల్ప తేడాతో మారుతుంది.

లక్నో ఒప్పందం మూలంగా ముస్లిములకు జనాభా ప్రాతిపదికపై ప్రాప్తించిన ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని ఈ పట్టిక స్పష్టంగా సూచించదు. లార్డ్ సింత్‌బరో[2] అధ్యక్షతన ఏర్పాటైన భారత ప్రభుత్వ (ఓటుహక్కు) కమిటీ నివేదిక వార్తా ద్వారా విదితం. దిగువ

1 మూడవ **గడిలో** ప్రత్యేక నియోజకవర్గాల ద్వారా ఎన్నికైన భారతీయులున్నారు. ఉదాహరణకు వాణిజ్యం. అందులో మతపరమైన దామాషా తడవతడవకూ కొద్దిగా మారవచ్చు. అలాగే, రెండవ **గడిలో** అధికారులు, నియమించిన అనధికారులు ఉన్నారు. భిన్న దశల్లో కొద్దిగా తేడా ఉండే ఫలితం రావచ్చు.

2. భారత రాజ్యాంగ సంస్కరణ ఎన్నికలు 5వ బట్వాడా 1919 ఏప్రిల్ 23, 21వ పేరా .

ఉదాహరించిన పట్టిక ఆ నివేదిక నుండి సంగ్రహించబడింది. లక్నో ఒప్పందం వల్ల ముస్లిములకు 1909లో ప్రాప్తించిన ప్రత్యేక ప్రాతినిధ్యం కంటే చాలా ఎక్కువగా లభించిందని విదితం చేస్తుంది.

| | జనాభాలో ముస్లింల శాతం | ప్రతి ముస్లిం స్థానాల శాతం | శాతం |
|---|---|---|---|
| బెంగాలు | 52.6 | 40 | 76 |
| బీహారు, ఒరిస్సా | 10.5 | 25 | 238 |
| బొంబాయి | 20.4 | 33.3 | 16.3 |
| మధ్య రాష్ట్రాలు | 4.3 | 15 | 349 |
| మద్రాసు | 6.5 | 15 | 231 |
| పంజాబు | 54 ? | 50 | 91 |
| ఐక్య రాష్ట్రాలు | 14 | 30 | 214 |

భారత రాజ్యాంగం పనిచేస్తున్న తీరును పరిశీలించటంకోసమూ, ఇంకా తేవలసిన సంస్కరణలను సూచించటం కోసమూ 1927 సంవత్సరంలో ఆంగ్ల ప్రభుత్వం సైమను కమీషనును నియమించినట్లు ప్రకటించింది. వెంటనే ముస్లిములు ఇంకా రాజకీయ కోర్కెలను అభిలషించేవారు. ముస్లింలీగు, అఖిలభారత ముస్లిం సమావేశం, అఖిల పక్ష ముస్లిం సమావేశం, జమైతే ఉలేమా, ఖిలాఫత్ సమావేశం మొదలైన అనేక ముస్లిం సంస్థలు ఈ కోరికల్ని ముందుంచాయి. వారి కోరికలన్నీ ఒకే విధంగా ఉన్నాయి కాబట్టి ముస్లింలీగు తరపున జిన్నా* సూత్రీకరించిన ప్రతిపాదనలను చెపితే సరిపోతుంది. అవి ఈ క్రింది షరతులకు అనుగుణంగా ఉండాలి :

1. భారత రాజ్యాంగం ఫెడరలుగా ఉండి మిగతా అధికారాలు రాష్ట్రాలకుండాలి.
2. అన్ని రాష్ట్రాలకూ ఒకే విధమైన స్వతంత్రతను ఇవ్వాలి.
3. ప్రతి రాష్ట్రంలోనూ అల్ప సంఖ్యాక వర్గాలకు ఫలప్రదమైన ప్రాతినిధ్యాన్ని కల్పించాలి. ప్రాతినిధ్యాన్ని కల్పించటం ద్వారా ఏ రాష్ట్రం అధిక సంఖ్యాకవర్గం అల్ప సంఖ్యాకవర్గంగా మారడం లేదా ఉభయవర్గాలు సమానం కావడం జరగరాదు. దేశంలోని శాసనభల, ఇతర సంస్థల పునర్నిర్మాణం జరగాలి.
4. కేంద్ర శాసనసభలో ముస్లిములకు ప్రాతినిధ్యం మూడవ వంతు కంటే తక్కువ

* **ఈ కోరికలు జిన్నా** 14 సూత్రాలుగా విదితం. ఇవి 15 సూత్రాలు. 1927 మార్చినెలలో ఢిల్లీలో ముస్లిం నాయకులు ప్రతిపాదించిన ఈ 15 సూత్రాలు ఢిల్లీ ప్రతిపాదనలుగా విదితం. జిన్నా 14 సూత్రాల పుట్టు పూర్వోత్తరాలను గురించి అఖిల భారత రిజిష్టరు 1929, మొదటి పుస్తకం, 367 పుటను చూడండి.

ఉండరాదు.

5. ఇప్పటి మాదిరిగానే మత ప్రాతినిధ్యం ప్రత్యేక నియోజకవర్గాల ద్వారానే కొనసాగాలి. అయితే ఏ వర్గమయినా అవసరమనుకుంటే ప్రత్యేక నియోజకవర్గం నుండి సంయుక్త నియోజకవర్గంకు మారడానికి వీలుండాలి.

6. ఏ సమయంలోనైనా భౌగోళిక విభజన అవసరమైతే పంజాబు, బెంగాలు, ఆగ్నేయ రాష్ట్రాల్లో ముస్లిం ఆధిక్యతకు ఏ విధమైన భంగం వాటిల్లదు.

7. పూర్తి మతపరమైన స్వేచ్ఛ - నమ్మకం, ప్రార్థన, ఆచార వ్యవహారాలు, ప్రచారం, కలయిక, విద్య అన్ని వర్గాలకూ ఉంటుందని హామీ ఇవ్వాలి.

8. బిల్లు లేదా తీర్మానం లేదా వీనికి సంబంధించిన ఏ అంశం పైనా ఏ శాసనసభలో లేదా ఏదైనా ఎన్నిక కాబడిన మండలిలో నాల్గింట మూడు వంతులు ఏ వర్గానికి చెందిన వారు వ్యతిరేకించినప్పటికీ చేయరాదు. తమ వర్గానికి హానికరమని భావించి వ్యతిరేకించే పక్షంలో ఆచరణ యోగ్యమైన పద్ధతిని పాటించాలి.

9. బొంబాయి రాష్ట్రం నుండి సింధ్‌ను విడదీయాలి.

10. వేరే రాష్ట్రాల్లో మాదిరిగా వాయవ్య సరిహద్దు రాష్ట్రం బెలూచిస్థానమందు సంస్కరణలు ప్రవేశపెట్టాలి.

11. రాష్ట్రాలు, స్వపరిపాలిత సంస్థల్లో అన్ని ఉద్యోగాలల్లో ముస్లిములకు సరిపోయినంత ప్రాతినిధ్యం కల్పించాలని రాజ్యాంగంలో పొందు పరచాలి.

12. ముస్లిం మతం, సంస్కృతి, ఆ మత న్యాయసూత్రాలకు సరిపోయినంత రక్షణ కల్పించాలని ముస్లిం విద్య, భాష, మతం, వ్యక్తిగత న్యాయసూత్రాలు, ధర్మసంస్థలను పెంపు చేయాలని ప్రభుత్వం, స్వపరిపాలన సంస్థలు ఇచ్చే నిధుల్లో తమకు తమ వాటా ఉండడం రాజ్యాంగంలో పొందుపరచాలి.

13. 3వ పంతు ముస్లిములు లెకుండా కేంద్ర ప్రాంతీయ మంత్రి మండలులు ఏర్పాటు కాకూడదు.

14. భారత ఫెడరేషన్‌లో భాగాలైన రాష్ట్రాల అనుమతి లేనిదే రాజ్యాంగంలో మార్పు కేంద్ర శాసనసభ తేకూడదు.

15. ఈ పరిస్థితుల్లో దేశంలోని వివిధ శాసనసభల్లోనూ, ఎన్నుకోబడిన మిగతా సంస్థల్లోనూ ముస్లిముల ప్రాతినిధ్యం ప్రత్యేక నియోజకవర్గాల ద్వారా అవశ్యం.

గమనిక : ముస్లిములు అల్ప సంఖ్యాకంగా ఉన్న రాష్ట్రాల్లో జనాభాను పరిగణనలోనికి

తీసుకుంటే వారికుండవలసిన దానికన్నా ఎక్కువగా ఉన్న ప్రాతినిధ్యాన్ని గురించి తర్వాత చూద్దాం.

ఇవీ ముస్లిముల కోరికలు. వీటిలో కొన్ని పాతవి. మరికొన్ని కొత్తవి. అనుకూల పరిస్థితి కొనసాగించేందుకు పాతవి ఉంచబడ్డాయి. ముస్లిముల స్థితిలో బలహీనతను తొలగించేందుకు కొత్తవి జోడింపబడినవి. కొత్తవి ఐదు :

1. జనాభా నిష్పత్తి ప్రకారం బెంగాలు, పంజాబులలో ప్రాతినిధ్యంలో ముస్లిములకు ఆధిక్యత.
2. కేంద్ర, ప్రాంతీయ మంత్రిమండలుల్లో మూడవ వంతు ముస్లిములకు ప్రాతినిధ్యం.
3. ఉద్యోగాల్లో ముస్లిములకు తగిన ప్రాతినిధ్యం.
4. బొంబాయి రాష్ట్రం నుండి సింధ్‌ను విడదీయడం, వాయవ్య సరిహద్దు రాష్ట్రం బెలూచీస్తాన్‌లను స్వతంత్ర ప్రతిపత్తి గల రాష్ట్రాలుగా పెంపొందించడం.
5. కేంద్ర ప్రభుత్వానికి మారుగా రాష్ట్ర ప్రభుత్వాల్లో మిగిలిన అధికారాలను ఇవ్వటం.

ఈ కొత్త కోరికలు బహుశా 1,4,5 మినహా సుస్పష్టం. 6 రాష్ట్రాల్లో ఉండే హిందూ ఆధిక్యతను వమ్ము చేసేందుకుగాను ముస్లిం ఆధిక్యత ఉన్న 4 రాష్ట్రాల్లో చట్టపరమైన ముస్లిము ఆధిక్యతను తేవటమే మొదటి నాలుగు కోర్కెల ధ్యేయం. దీన్ని హిందూ ముస్లిములు తమ తమ రాష్ట్రాల్లోని అల్పసంఖ్యాక వర్గం పట్ల సుహృద్భావంతో మెలగుతారనే నమ్మకం కోసం పట్టుబట్టారు.

సింధ్ వాయవ్య సరిహద్దు రాష్ట్రం, పంజాబు, బెంగాలులల్లో ముస్లిము పరిపాలన ఉంటుందనే నమ్మకం 5వ కోరిక ధ్యేయం. ముస్లిము ఆధిక్యత ఉన్న ఈ ముస్లిము రాష్ట్రాలు కేంద్ర ప్రభుత్వ ఆధీనంలో ఉంటే, కేంద్ర ప్రభుత్వం హిందూ ఆధీనంలోనే తప్పక ఉండవలసి వస్తుంది. ముస్లిము పరిపాలన అంతసార్థకమైనదిగా ఉండదనే భయం ఉంది. 5వ కోరిక ధ్యేయం కేంద్రంలోని హిందూ ప్రభుత్వ ఆధీనం నుండి ముస్లిము రాష్ట్రాలను విడిపించటం కోసమే.

హిందువులు ఈ కోర్కెలను వ్యతిరేకించారు. ఈ కోర్కెల్లో అంతగా ఏమీ లేకపోవచ్చు. సైమను కమీషను కూడా వీటని వ్యతిరేకించంటం గమనార్హం. ఏ విధంగానూ ముస్లిం వ్యతిరేకం కాని సైమను కమీషను, ముస్లిము కోరికలను తిరస్కరించడానికి పటిష్టమైన కారణాలను చూపింది. ఈ కోర్కె తమదని వాదించే హక్కు 6 రాష్ట్రాల్లో ముస్లిములకు ఇవ్వబడిన ప్రాతినిధ్యాన్ని పూర్తిగా పదిలపరచుకోవటం కోసం ప్రత్యేక నియోజకవర్గాల ద్వారా తమ జనాభా నిష్పత్తిలో తూగే ప్రాతినిధ్యం వల్ల బెంగాలు,

పంజాబుల్లో ఇప్పుడిచ్చిన స్థానాల్ని పెంపొందించుకోవటం వరకూ వెళ్తుంది. రెండు రాష్ట్రాల్లో జనరల్ నియోజకవర్గాల్లో ముస్లిములకు స్థిరమైన, స్థానాలను ఇస్తుంది. మేము **అంత దూరం** వెళ్లజాలం. 6 రాష్ట్రాల్లో ముస్లిములకు ప్రస్తుతం ఉన్న ప్రత్యేక ప్రాతినిధ్యం **కొనసాగింపు** – ఇరువర్గాల మధ్య కొత్త ఒడంబడిక జరగని పక్షాన – బెంగాలు, పంజాబుల్లో **ప్రస్తుతం ఉన్న** కేటాయింపుకు చాలా భిన్నంగా సహేతుకంగా కలపడం జరగదు. "ఆ **రాష్ట్రాల్లో** ముస్లిములు అనుభవిస్తున్న ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని నిలిపి ఉంచుకోవటం సబబు **కాదు.** హిందువుల, సిక్కుల వ్యతిరేకత ఉన్నప్పటికీ పంజాబు, బెంగాలుల్లో మార్చటానికి **వీల్లేని** ముస్లిం ఆధిక్యతని విధించాలి"

హిందువులు, సిక్కులు వ్యతిరేకించినప్పటికీ సైమను కమీషను తిరస్కరించినప్పటికీ మధ్యవర్తిగా ఉండమని కోరినపుడు ఆంగ్ల ప్రభుత్వం పాత, కొత్త కోర్కెలనన్నిటిని ముస్లిములకు ప్రసాదించింది. ఇండియా గజెట్ 1932 జనవరి 25వ నాటి ప్రచురణలో భారత ప్రభుత్వ 1916 చట్టం సెక్షను 52(ఎ) నందలి ఉపసెక్షను (2) ద్వారా సంక్రమించిన అధికారం వల్ల వాయవ్య సరిహద్దు రాష్ట్రం గవర్నరు రాష్ట్రంగా పరిగణించ బడుతుంది. శాసనమండలి భారత ప్రభుత్వ చట్టం 1935 సెక్షను 289 ఉపసెక్షను (1) ద్వారా 1936 ఏప్రిల్ 1వ తేదీ నుండి బొంబాయి నుండి సింధు విభజన జరిగినట్లు, ఇక మీదట గవర్నరు రాష్ట్రంగా, సింధు రాష్ట్రంగా పరిగణింపబడుతుంది.

1934 జూలై 7వ తేదీన జారీ అయిన సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా తీర్మానం ప్రకారం ప్రభుత్వ కొలువులో ముస్లిం భాగం 25 శాతం అని నిర్ణయం చేసినట్లుంది. అన్ని ఇంపీరియల్ ప్రావిన్సియల్ ఉద్యోగాలకి ఇది వర్తిస్తుంది. రెసిడ్యుయరీ అధికారాల విషయంలో వాటిని రాష్ట్రాలకే ఉంచాలన్న ముస్లిం అభ్యర్థనను ఆమోదించలేదు, నిజమే. కాని మరో సందర్భంలో ముస్లిం అభ్యర్థనను అంగీకరించినట్లే భావించవచ్చు. ముస్లిములు అడిగిందీ రెసిడ్యుయరీ అధికారాలు కేంద్రంలో ఉండకూడదనేగా. అంటే, ఇంకోలా చెప్పాలంటే ఆ అధికారాలు హిందువుల చేతిలో ఉండరాదు. భారత ప్రభుత్వ 1935 చట్టం అధికరణం 104 ప్రకారం, ఆ అధికారాల్ని వాడుకునే హక్కు గవర్నరు

1. నివేదిక 2వ పుస్తకం 71వ పుట.
2. భారత ప్రభుత్వ అసాధారణ గజెటు 1932 జనవరి 25 ప్రకటన ఎఫ్ 173/31 ఆర్.
3. "వాయవ్య సరిహద్దు రాష్ట్రానికి రాజ్యాంగపరమైన అభివృద్ధి అవసరం లేదనే బ్రే కమిటీ అభిప్రాయంతో మేం పూర్తిగా ఏకీభవిస్తాం" అంటూ సైమను కమీషను ఆ కోర్కెను తిరస్కరించింది. అయినప్పటికీ ఈ రాష్ట్రపు కీలక ఉనికి దృష్ట్యా భారత ప్రభుత్వ రక్షణకు సన్నిహితం వలన ప్రత్యేకమైన ఏర్పాటు ఆవశ్యకత ఉందని ఒప్పుకుంటాం. అంచేత అది వీలు కాకపోతే ప్రాంతీయ భాగాలకి సరిపడ్డ ప్రతిపాదనల్లో వేరే చోట అలానే వినియోగించలేం. "సిగరెట్ కాల్చే మనిషికి అతని హక్కు మీద మందుగుండు సామాను ఉన్నచోట ఆంక్ష ఉంటుంది."

జనరలు విచక్షణకి వదలటం జరిగింది. 33.1/2 శాతం అభ్యర్థనను, మంత్రివర్గంలో ప్రాతినిధ్యం గురించే, - అవి కేంద్రానికి చెందినా, రాష్ట్రాలకు చెందినా, - ఈ చట్టంలో న్యాయపరమైన అవకాశం లేదు. మంత్రివర్గంలో ప్రాతినిధ్యానికి సంబంధించి ముస్లిముల హక్కుని బ్రిటీషు ప్రభుత్వం ఒప్పుకుంది. దాన్ని అమలు జరిపేందుకు గవర్నర్లకూ, గవర్నరరు-జనరలుకూ ఆదేశపూర్వకంగా ఇచ్చిన సూచనలలో అవకాశం కల్గించారు. ఇక బెంగాల్, పంజాబులలో చట్టపర మెజారిటీకి సంబంధించిన కోర్కెని కమ్యూనల్ అవార్డులో పొందుపరిచారు. ముస్లిములకు చట్టపరంగా మొత్తం సభలో మెజారిటీ ఇవ్వలేదనేది నిజమే, ఇతర ప్రయోజనాలన్నీ అలాంటి ప్రాతినిధ్యం కలిగించే అవసరాన్ని దృష్టిలో ఉంచుకుంటే ఇవ్వడానికి లేకపోయింది. కానైతే హిందువులలో చూస్తే బెంగాల్, పంజాబ్‌లలోని ముస్లిములకి చట్టపరమైన మెజారిటీ వచ్చింది. లక్నో ఒడంబడిక మేరకి వచ్చిన రాయితీకి భంగం లేకుండానే అలా జరిగింది.

బ్రిటీషు ప్రభుత్వం ముస్లిములకు ఇచ్చిన ఈ రాజకీయ హక్కులకు భద్రత లేదు. వాటిని మార్చమని హిందువుల నుంచి ప్రభుత్వం మీద ఒత్తిడి రావచ్చని ముస్లిములకు భయం. ఈ భయానికి రెండు కారణాలున్నాయి. ఒకటి, గాంధీ అవార్డులో దళిత వర్గాలకు సంబంధించిన భాగాన్ని ఆమరణ నిరాహారదీక్ష బెదిరింపుతో మార్పించేడు[1]. ఈ విషయం చూసి కొంతమందికి ఉత్సాహం వచ్చి, ముస్లిములకు సంబంధించి అవార్డులో ఉన్న భావాన్ని పునః పరిశీలించేటట్టు ఆందోళన చేశారు కూడా. కొంతమంది ముస్లిములు అలాంటి సంభాషణలలోకి దిగే సంసిద్ధత కూడా కనబరిచేరు[2]. దాంతో ముస్లిం వర్గాల్లో కలకలం రేగింది. మరో కారణం, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా బిల్లులోని కొన్ని క్లాజులకి ప్రతిపాదించిన కొన్ని సవరణలు. ఆ సవరణల్ని దిగువ సభలో చేశారు. కొన్ని పరిస్థితుల్లో అలాంటి పునః పరిశీలన చెయ్యవచ్చన్నవి ఆ సవరణలు. ఈ భయాల్ని తొలగించి, తొందరపాటుగా, ఆదరాబాదరాగా పునః పరిశీలన జరక్కుండా ముస్లిములకు పూర్తి భద్రత కలిగించేందుకు ఘనత వహించిన చక్రవర్తి వారి ప్రభుత్వం ఈ ప్రకటనని చేసేందుకు భారత ప్రభుత్వానికి అధికారం ఇచ్చింది[3] :

"ప్రభుత్వం వారి కమ్యూనల్ అవార్డు పేరుతో వ్యవహారంలో ఉన్న దాని మీద ఆధారపడ్డ రాజ్యాంగ నిబంధనలకు ఎప్పుడైనా ఇష్టం వచ్చినట్లు సవరణలు చెయ్యగలిగే సానుకూలాన్ని బిల్లుని ఆమోదించేటప్పుడు ప్రతిపాదించిన సవరణల ద్వారా కలిగించినట్టు, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా బిల్లులోని 304 అధికరణం (బిల్లుకు మొదట ప్రవేశపెట్టి

1. దానివల్ల 1932 సెప్టెంబరు 24న పూనా ఒడంబడిక పరిణామం వచ్చింది.
2. అవార్డులో ముస్లిం భాగాన్ని పునఃపరిశీలింప చేసే ప్రయత్నాలకి, చూడండి ఆలిండియా రిజిస్టర్, 1932. వాల్యూం 2 పేజి. 281-315.
3. సిమ్లా, జూలై 2, 1935 నాడు జారీ అయిందిది.

నప్పుడు సంఖ్య 285గానూ, కామన్స్ కమిటీ సవరించినప్పుడు 299గానూ ఉన్నటువంటిది) విస్తృతమైన ఒక అభిప్రాయాన్ని కల్పిస్తున్నట్టు ప్రభుత్వం దృష్టికి వచ్చింది.

"ఇందుకు ఒక చిన్న సవరణ ఇవ్వడం ఉచితమని ఘనత వహించిన చక్రవర్తిగారి ప్రభుత్వం భావిస్తోంది. కమ్యూనల్ అవార్డ్‌ను మార్చడంలో క్రియాత్మకంగా 304వ నిబంధన ఎలా వర్తించేదీ దానికి సంబంధించి, అసలు అలాంటి మార్పు ఏదైనా చేయాలని సంకల్పిస్తే దానికి సంబంధించి ఈ వివరణ ఇవ్వడం జరుగుతోంది."

"ఈ నిబంధన వల్ల, ప్రభుత్వానికీ, శాసనసభలకీ ఒక హక్కుని ఇవ్వడం జరుగుతుంది. పదేళ్ళ తర్వాత శాసనసభ ఏర్పాటుకు సంబంధించీ, కమ్యూనల్ అవార్డ్ స్పృశించిన సమస్యలకి సంబంధించి మార్పులు, కూర్పులూ చేసే అధికారం ఉంటుంది."

"సందర్భాన్ని బట్టి గవర్నరు - జనరలు నుంచి గాని ఆ ప్రతిపాదిత సవరణలకు సంబంధించీ, ప్రత్యేకంగా మైనార్టీ వర్గాల మీద దానికి ఉండే ప్రభావం గురించీ, త అభిప్రాయాన్ని పార్లమెంట్ ముందుంచే కర్తవ్యం సెక్రటరీ ఆఫ్ స్టేట్ మీద ఉంది; తాను తీసుకోబోయే చర్యల గురించి పార్లమెంట్‌కు తెలియజేయాలి."

ఈ ప్రక్రియ ద్వారా వచ్చే రాజ్యాంగ నిబంధనల ఏ మార్పునైనా ఒక కౌన్సిల్ తీర్మానం ద్వారా జరిపించవచ్చు. కానైతే ఒక షరతు ఉంది. ఆ ముసాయిదా కాని పార్లమెంట్ ఉభయసభలు ఒక తీర్మానం ద్వారా నిర్ద్వంద్వంగా ఆమోదించి ఉండాలి. ఈ షరతును బిల్లులోని 305వ నిబంధన నిర్దేశిస్తుంది.

"పదేళ్ళలోపున ప్రభుత్వం వారికి గాని, శాసనసభలకి గాని అలాంటి రాజ్యాంగబద్ధమైన చొరవ తీసుకోవడం జరగదు. ఏదైనా మార్పును చేసే అధికారం కౌన్సిల్ ఆర్డర్ ఉండాలని ఈ నిబంధన నిర్దేశించిన దాంట్లో ఉంది. (అదీ సర్వదా పార్లమెంట్ ఉభయసభల అనుమతితోనే) ఆ ఆర్డర్ ఉంటే పదేళ్ళలోపునే మార్పు చేయవచ్చు. కాని మొదటి పదేళ్ళలోనూ (నిజానికి తర్వాతా, భారతదేశ శాసనసభల నుంచి ఆ చొరవ రాకపోతే) సెక్రటరీ ఆఫ్ స్టేట్ భారత ప్రభుత్వాన్ని సంబంధిత శాసనసభల్ని (ఆ మార్పు ఏదో చిన్నదైతే తప్ప) సంప్రదించాలి. ఇది కూడా పార్లమెంట్ ముందర అనుమతి కోసం ఏ కౌన్సిల్ ఆర్డర్‌ని ఉంచకముందే జరగాలి."

ఈ కింది కారణాల వల్ల పైన ప్రస్తావించుకున్న పేరాగ్రాఫుల్లోకి అధికారాల అవసరం కలుగుతుంది :

అ) ఓటు హక్కుకి సంబంధించిన చిన్న వివరాలను సవరించే అవసరం ఎప్పుడు తలెత్తుతుందో చెప్పడం అసాధ్యం. అలాంటి సవరణకి పార్లమెంట్ నుంచి సవరించే కొత్త చట్టానికి తక్కువైన పద్ధతి ఏదీ లేకపోవడం అననుకూలం. అంతేకాదు,

కమ్యూనల్ అవార్డు నిబంధనల విషయానికి సంబంధించి మరింత ముఖ్యమైన వాటి నుంచి ఇలాంటి వివరాల్ని ప్రత్యేక పరచాలి.

ఆ) భారతదేశంలోని మతవర్గాల మధ్య కమ్యూనల్ అవార్డ్‌కి సవరణలు చేయడం వాంఛనీయమే. అలాంటి ఒప్పందభరితమైన మార్పుకు పార్లమెంట్ సవరణ చట్టంకంటే వేరే పద్ధతి లేకపోవడం మంచిది కాదు.

"కమ్యూనల్ అవార్డ్ పరిధిలో, ఈ అధికరణం వల్ల దత్తమైన అధికారాన్ని వినియోగించడంలో ఘనత వహించిన చక్రవర్తిగారి ప్రభుత్వం ఏ మార్పులూ చెయ్యమని పార్లమెంట్‌కి సిఫార్సు చెయ్యరు; అలాంటి మార్పును సంబంధిత మతవర్గాలు ఏకాభిప్రాయంతో అంగీకరిస్తే తప్ప.

"ఇక ముగింపుగా ఘనత వహించిన చక్రవర్తిగారి ప్రభుత్వం మళ్ళీ ఈ అంశాన్ని నొక్కి చెబుతుంది. 305వ క్లాజులోని నియమాల దృష్ట్యా, 304 క్లాజులోని ఏ అధికారాన్ని వాడదు అని పార్లమెంటులోని ఉభయసభలూ కరాఖండంగా తీర్మానం చేస్తే తప్ప అలా జరగదు."

రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సులో ముస్లిములు చేసిన అభ్యర్థనల్ని వాళ్ళకు దత్తం చేసిన వాటినీ దృష్టిలో ఉంచుకుంటే, ముస్లిముల కోరికలు వాటి పరిమితిని అందుకున్నాయని, 1932నాటి ఏర్పాటు తుది ఏర్పాటు అనీ ఎవరికైనా అనిపిస్తుంది. కాని, దీంతో కూడా ముస్లిములకు సంతృప్తి కలగనట్టనిపిస్తుంది. ముస్లిముల స్థానాన్ని భద్రపరచుకుందుకు కొత్త కోరికల పట్టీ తయారుగా ఉన్నట్టే ఉంది. కాంగ్రెస్‌కీ జిన్నాకి 1938లో జరిగిన వాగ్వివాదంలో జిన్నాని తన కోరికలేమిటో చెప్పమన్నారు. జిన్నా చెప్పలేదు. ఆ వివాద మప్పుడు జిన్నాకీ, పండిట్ నెహ్రూకీ మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల్లో ఆ కోరికలు పైకి తేలాయి. జిన్నాకి రాసిన ఓ ఉత్తరంలో పండిట్ నెహ్రూ వాటిని క్రోడీకరించాడు*.

1. 1929లో రూపొందించిన ముస్లింలీగ్ 14 సూత్రాలు.

2. కాంగ్రెసు, కమ్యూనల్ పట్ల వ్యతిరేకతని త్యజించాలి, దాన్ని జాతీయవాద నాస్తికరణగా వర్ణించకూడదు.

3. రాష్ట్ర ఉద్యోగాల్లో ముస్లిముల వాటాని చట్టరీత్యా పెంచుతూ రాజ్యాంగంలో నిక్కచ్చిగా తేల్చి చెప్పాలి.

4. చట్టరీత్యా ముస్లిం మతపర న్యాయానికీ, సంస్కృతికీ హామీ ఉండాలి.

5. షాహిద్‌గంజ్ మసీదుకి సంబంధించిన ఆందోళనను కాంగ్రెసు అందుకోవాలి.

* ఇండియన్ ఏన్యువల్ రిజిస్టరు, 1938, వాల్యూం – I, పేజి 369.

ముస్లిములు ఆ మసీదును హక్కుభుక్తం చేసుకొందుకు తన పలుకుబడిని వాడాలి.

6. అజాన్ జరిపేందుకు, తమ మతపర విధులు నిర్వర్తించుకునేందుకూ ముస్లిములకు ఉన్న హక్కుకూ ఎట్టి పరిస్థితుల్లోనూ ఆటంకం కలగకూడదు.

7. గోవధ హక్కు ముస్లిములకు ఉండాలి.

8. ముస్లిములకి మెజార్టీ ఉన్నచోట, ఆ మెజార్టీ ప్రాదేశిక సవరణల ద్వారా, పునఃపంపిణీ ద్వారా విఘాతం కలగకూడదు.

9. 'వందేమాతరం' గీతాన్ని త్యజించాలి.

10. ఉర్దూని భారత జాతీయభాషగా చెయ్యాలి. ఉర్దూ వాడకాన్ని తగ్గించడం కాని, హాని కలిగించడం కాని జరక్కుండా చట్టపరమైన హామీ ఉండాలి.

11. కమ్యూనల్ అవార్డు సూత్రాల మేరకు స్థానిక సంస్థల్లో ముస్లిం ప్రాతినిధ్యం ఉండాలి. అంటే ప్రత్యేక నియోజకవర్గాలు, జనాభా ఉండాలి.

12. త్రివర్ణ పతాకాన్ని మార్చాలి; లేదా దాన్నీ, ముస్లింలీగ్ జెండానీ ఒకే ప్రాముఖ్యత ఉండాలి.

13. భారత ముస్లిముల అధికారిక, ప్రాతినిధ్య సంస్థగా ముస్లిములను గుర్తించాలి.

14. సంకీర్ణ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలి.

ఈ కొత్త జాబితాని చూస్తే, అసలు ముస్లిముల కోర్కెలకు అంతం అంటూ ఉందా అనిపిస్తుంది. ఒక ఏడాదిలో, అంటే 1938కీ 1939కీ మధ్య మరో కోరిక వచ్చింది. అది చాలా గట్టి కోరిక. ప్రతి దాంట్లోను 50 శాతం వాటా కావాలన్న కోరిక అది. ఇన్ని కోరికలు చూస్తే, పైనే అవి ఎంత అసంబద్ధమో, అసాధ్యమో తెలుస్తుంది. ఎంత బాధ్యతారహితంగా ఉన్నవో తెలుస్తుంది. అన్నింట్లోనూ సగం సగం అన్నది కాని, భారతదేశ జాతీయభాషగా ఉర్దూ ఉండాలన్నది కాని ఇలాంటివే. శాసనసభలో సీట్లని కేటాయించేటప్పుడు మెజార్టీని మైనార్టీని గాని, సమానంగా ఉండేట్టుగాని తగ్గించకూడదని 1929లో ముస్లిములు పట్టుబట్టారు*. వాళ్ళే ప్రతిపాదించిన సూత్రాన్ని ఇప్పుడు వర్జించేరు. మెజార్టీని, సమానంగా ఉండే రీతిలో తగ్గించాలని కోరుతున్నారు. 1929లో, ఇతర మైనార్టీలకి రక్షణ కావాలని ముస్లిములు అన్నారు, ముస్లిములకు ఉన్నట్టే ఉండాలని అన్నారు. వాళ్ళకీ ఇతర మైనార్టీలకూ మధ్య ఉన్న విశిష్టమల్లా భద్రత ఏ మేరకి అన్నదాని మీదనే. ముస్లిములకు హెచ్చు భద్రత కావాలిట, ఇతర మైనారిటీల కిచ్చిన దానికంటే

* జిన్నా 14 సూత్రాల్లో 3వ అంశం చూడండి.

ఎక్కువగా రాజకీయ ప్రాముఖ్యం వల్ల అలా జరగాలట. ఇతర మైనార్టీలకు రక్షణ, తగినంత ప్రాతినిధ్యం కావాలన్న విషయాన్ని ముస్లిములు ఎన్నడూ కాదనలేదు. కాని 50 శాతం కావాలన్న కొత్త కోరికతో హిందూ మెజార్టీ తగ్గించడమే కాక, ఇతర మైనార్టీల రాజకీయ హక్కులతో జోక్యం చేసుకుంటున్నారు. ముస్లిములు ఇప్పుడు హిట్లరు భాషనే వాడుతున్నారు, హిట్లరు జర్మనీలో చేస్తున్నట్టు చేస్తున్నారు. 50 శాతం కావాలన్న వాళ్ళ కోరిక జర్మన్ల "డ్యూయల్ లేండ్ ఉచెర్ అల్లెస్", "లెచన్ స్రమ్"లకి రెండో భాగం తప్ప మరేం కాదు. మైనార్టీలకి ఏమైనా వాళ్ళకు ఫరవాలేదు.

భారతదేశంలో ఉర్దూని జాతీయభాషగా గుర్తించాలన్న వాళ్ళ అభ్యర్థన కూడా అంతే మితిమీరి ఉంది. ఉర్దూను యావద్భారతంలోనూ మాట్లాడరు, మాట్లాడకపోవడమే కాదు భారత ముసల్మానులందరూ మాట్లాడే భాష కూడా కాదు. భారతదేశంలో 68 మిలియన్ల మంది ముస్లిములుంటే ఒక 28 మిలియన్లు మాత్రమే ఉర్దూ మాట్లాడతారు. ఉర్దూను జాతీయ భాష చెయ్యడమంటే 28 మిలియన్ల మంది ముస్లిములని 40 మిలియన్ల మంది ముసల్మాన్ల మీద రుద్దడం లేదా సామాన్యంగా 322 మిలియన్ల భారతీయుల మీదా రుద్దడం[1].

రాజ్యాంగానికి కొత్త సంస్కరణ ప్రతిపాదన వచ్చినప్పుడల్లా, ముస్లిములు కొత్త రాజకీయ కోరికలతో హాజరుగా ఉంటారని దీన్నిబట్టి తెలుస్తోంది. ముస్లిముల కోరికల విస్తృతిని అదుపు చేసేది ఒక్క బ్రిటిషు ప్రభుత్వమే. హిందువులకు ముస్లిములకూ మధ్య తలెత్తే ఏ వివాదానికైనా అదే మధ్యవర్తి అవుతుంది. వాళ్ళ మధ్యవర్తిత్వానికి ఆ తగాదాని పంపిస్తే అది ముస్లిములకే ఖాయంగా అనుకూలంగా ఉండదని ఎవళ్ళనగలరు? ముస్లిములు కోరేకొద్దీ బ్రిటిష్ వాళ్ళు ఊ అంటూనే ఉంటారు. ఏమైనా ముస్లిములు అడిగినదానికంటే ఎక్కువే బ్రిటిషు వాళ్ళు ఇస్తూ ఉంటారు అని గత అనుభవం తెలియజేస్తోంది. అలాంటి ఉదాహరణల్ని రెండింటిని చూద్దాం.

ఒకటి లక్నో ఒడంబడికకు సంబంధించినది. బ్రిటిషు ప్రభుత్వం ఆ ఒడంబడికను ఆమోదించాలా వద్దా అన్నది సమస్య. మాంటేగ్-ఛేమ్స్ ఫర్డ్ నివేదిక తయారు చేసిన వాళ్ళకి ఇష్టం లేదు, అందుకు తగ్గ బరువైన కారణాలున్నాయి. లక్నో ఒడంబడిక వల్ల ముస్లిములకు వచ్చిన రాయితీల గురించి మాట్లాడుతూ సంయుక్త నివేదికకర్తలు ఇలా అన్నారు[2].

ఇలాంటి హోదా స్థానం అభ్యంతరకరమౌతుంది. ఇకపైన ఏ మతవర్గమైనా, కులమైనా ప్రత్యేక ప్రాతినిధ్యం కోసం సహేతుకంగా అడిగితే, ముస్లిమేతర సీట్లకి తగ్గించి

1. ఇవి 1921 నాటి జనాభా లెక్కల రీత్యా.
2. మాంటేగ్ - ఛేమ్స్‌ఫర్డ్ నివేదిక 1918, పేరా 163.

మాత్రమే దాన్ని తృప్తి పరచగలం. లేదా ముస్లిం, ముస్లిమేతర సీట్ల నుంచి దామాషా తగ్గించాలి. ఏ పద్ధతి అనుసరించాలీ అన్నదాని మీద ముస్లిములకూ హిందువులకూ అభిప్రాయం కుదరదు. అంచేత తర్వాత మేం వివరించబోయే కారణాల రీత్యా మహమ్మదీయులకి ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని మేం అంగీకరిస్తున్నాం. అయితే ముందున్న ప్రతిపాదనల ఆమోదాన్ని నిలుపు చేస్తున్నాం. ఇతర ప్రయోజనాలకి సంబంధించి ఇదెలా ఉంటుందో తెల్సుకుని వాటికి అవకాశం కలిగించేదాకా."

లక్నో ఒడంబడికలో ఈ లొసుగు ఉన్నా, భారత ప్రభుత్వం, పైన పేర్కొన్న తాఖీదులో, బెంగాల్ ముస్లిములకు సంబంధించి ఒప్పందంలో ఉన్న షరతుల్ని మెరుగు పరచాలని సిఫార్సు చేసింది. అది చెప్పిన కారణాలు చిత్రంగా ఉన్నాయి. అదిలా వాదించింది.

"వాళ్ళు (అంటే ఒడంబడిక తయారుచేసిన వాళ్ళు) బెంగాల్ కోసం ప్రతిపాదించిన మహమ్మదీయ ప్రాతినిధ్యం చాలు*, ఆ విషయం విదితమే. కాంగ్రెసు-లీగ్ ఒప్పందం తయారయ్యేటప్పుడు తూర్పు బెంగాల్ మహమ్మదీయుల కోరికల్ని తగినంతగా నొక్కి ప్రస్తావించారా అన్నది సందేహార్థకం. వాళ్ళు వెనుకబడిన వాళ్ళు పేదలు - అది తేటతెల్లమే. ప్రెసిడెన్సీని 1912లో తిరిగి విభజించడం వాళ్ళకి నిరాశ కలిగించింది. ఇప్పుడు వాళ్ళ ప్రయోజనాల్ని తగినంతగా కాపాడకపోవటం మన దోషం అవుతుంది. బెంగాల్ ముస్లిములకి వాళ్ళ జనాభాతో తూగేట్టుగా ప్రాతినిధ్యం ఇచ్చేందుకు - అంతకు మించి కాదు, ఒప్పందం మేరకి వాళ్ళకి రావాల్సిన 34 స్థానాలకిగాను మనం 44 స్థానాలు ఇవ్వాలి.

బెంగాల్ ముస్లిముల పట్ల భారత ప్రభుత్వం చూపించినంత ఉత్సాహాన్ని బ్రిటిషు ప్రభుత్వం చూపించలేదు. బెంగాల్ ముస్లిముల కిచ్చిన ప్రాతినిధ్యం ఒప్పందం ఫలితంగా వచ్చినదని అది అభిప్రాయపడింది. ఏ తగువుల్లో లేనప్పుడు ఏ మాత్రం జోక్యం చేసుకున్న బ్రిటిషు ప్రభుత్వం ముస్లిములకు ప్రత్యేక స్నేహం ప్రదర్శిస్తోందనిపించవచ్చు. పెంపు చెయ్యడంలో భారత ప్రభుత్వం ఓ విషయాన్ని మర్చిపోయింది. ఒడంబడికలోనే బెంగాల్, పంజాబ్ రాష్ట్రాల ముస్లిములకు వాళ్ళ జనాభా దామాషాన ఎందుకు జరగలేదోనన్న విషయాన్ని మర్చిపోయారు. ఒక మతమో, కులమో దానికి రాజకీయ రక్షణకి హక్కుదారు కాదు అన్న సూత్రం మీద లక్నో ఒడంబడిక ఆధారపడింది. ఇప్పుడా సూత్రం గాలికి కొట్టుకుపోయింది. మైనార్టీగా ఉన్నప్పుడే ఓ మతానికి రక్షణ ఉంటుంది. అదే లక్నో ఒడంబడిక సూత్రం. బెంగాల్, పంజాబ్‌లలో ముస్లిములు మైనార్టీలు కాదు;

* పంజాబ్‌కి అన్యాయం జరిగిందని ప్రభుత్వం భావించింది. కాని బెంగాల్ మాదిరి ప్రత్యేక కారణం లేదు, అంటే, విభజనను తప్పించడం. ఒడంబడికలో తీర్మానించిన ప్రాతినిధ్యం పెంపును ప్రతిపాదించలేదు.

అంచేత ఇతర రాష్ట్రాల్లో అది మైనార్టీగా ఉన్నది కాబట్టి అక్కడ ఉన్నట్టి రక్షణకు ఇక్కడ హక్కు లేదు. మెజార్టీగా ఉన్నాగాని బెంగాల్, పంజాబ్‌లలోని ముస్లిములకు ప్రత్యేక నియోజకవర్గాల ఆవశ్యకత కనిపించింది. ఒడంబడికలోని సూత్రం ప్రకారం మైనార్టీ అయితేనే ఆ హక్కు వస్తుంది. వాళ్ళు అందుకు ఒప్పందం అయ్యారు. మైనార్టీ సీట్లు పొందారు. బెంగాల్, పంజాబ్‌ల లోని ముస్లిములకు జనాభా రీత్యా రావాల్సిన సీట్లు రాకపోవడానికి కారణం అదీ[1].

బెంగాల్ ముస్లిములు అడిగినదానికంటే ఎక్కువ ఇవ్వాలని భారత ప్రభుత్వం చేసిన ప్రతిపాదన నెగ్గలేదు. కాని వాళ్ళు అడగడమే వాళ్ళ ఉద్దేశ్యానికి సాక్ష్యం.

ముస్లిములు అడిగినదానికంటే ఎక్కువే బ్రిటిషు ప్రభుత్వం మధ్యవర్తిగా ఇచ్చిన సందర్భం ఇంకొకటి ఉంది. అది 1932లో కమ్యూనల్ తీర్పు ఇచ్చినప్పుడు జరిగింది. రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్ సబ్ కమిటీకి రెండు విభిన్న ప్రతిపాదనలు సర్ మహ్మద్ షాషి చేశాడు. 1931 జనవరి ఆరవ తేదీన చేసిన ఉపన్యాసంలో ఈ ప్రతిపాదనని ఆయన కమ్యూనల్ సమస్య పరిష్కారానికి పునాదిగా ఉంచాడు[2].

నేను చేసిన షరతుల మేరకి సంయుక్త నియోజకవర్గాల్ని ఆమోదించడానికి మేము సిద్ధంగా ఉన్నాం; ఒకటి మైనార్టీగా ముసల్మాన్లు రాష్ట్రాల్లో అనుభవించే హక్కులు కొనసాగాలి. బెంగాల్, పంజాబ్‌లలో రెండు సంయుక్త నియోజకవర్గాలుండాలి. జనాభా రీత్యా ప్రాతినిధ్యం ఉండాలి. సీట్లు రిజర్వేషన్ మౌలానా మహ్మద్ ఆలీ షరతుతో కలిసి ఉండాలి[3].

1931 జనవరి 14న అదే కమిటీ ముందు ఆయన మరో ప్రతిపాదన చేశారు. ఆయన ఇలా అన్నాడు[4].

ఇవాళ నేనే ప్రతిపాదన చేసే అధికారం నాకుంది. పంజాబ్‌లో ముసల్మాన్లు, కమ్యూనల్ నియోజక వర్గం ద్వారా 49 శాతం పొందాలి. మొత్తం సభలో ఉన్న సీట్లలో

1 ఈ విషయాన్ని ముస్లిములు బాగా అర్థం చేసుకున్నారు. వాళ్ళు ఒడంబడికలో భాగస్వాములు. 1919లో భారత ప్రభుత్వం నియమించిన పార్లమెంటరీ సంయుక్త సెలెక్ట్ కమిటీకి సాక్ష్యం ఇస్తూ జిన్నా ఇలా అన్నాడు. ప్రశ్న 3808; "బెంగాల్ స్థానం ఇదీ : అక్కడ ముస్లిం మెజార్టీ ఉంది. మెజార్టీ వాళ్ళకి ప్రత్యేక నియోజకవర్గాలు ఉండవని అంటున్నారు. అవి మైనార్టీ రక్షణకేనని అంటున్నారు. అయితే ప్రతిగా ఉన్న వాదనా నిజమే. మేం మెజార్టీయే, కాని వోటర్లు మైనార్టీ, వెనుకబాటుతనం వల్ల, పేదరికం వల్ల, వేరే అయితే 40 శాతం ఓటర్లు కాలేరు. అప్పుడు ఇతర రాష్ట్రాల్లో ఆ సౌకర్యం ఉంది."

2. రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌మైనార్టీస్ సబ్ కమిటీ నివేదిక (మొదటి ఎడిషన్) పే 96.

3. కనీసం 40 శాతం అయినా సీట్లు రాకపోతే ఏ అభ్యర్థీ నెగ్గినట్టు కాదని మహమ్మదాలీ సూత్రం. తన మతం వాళ్ళ ఓట్లే అన్నీ ఉండాలి, పైన కనీసం 5 శాతం ఇతరులకి ఉండాలి.

4. అదే, పేజీ 123.

ఆ శాతం ఉండాలి. ఆ రాష్ట్రంలో ఏర్పాటు చేయ తలపెట్టిన ప్రత్యేక నియోజకవర్గాల్లో పోటీ చేసేట్టు ఉండాలి. ఇక బెంగాల్‌కి సంబంధించి మొత్తం సభలో 46 శాతం అలా ఉండాలి, ప్రత్యేక నియోజకవర్గాల్లో పోటీ చెయ్యగలిగి ఉండాలి. ఇక మైనార్టీ రాష్ట్రాలకు సంబంధించి ముస్లిములకున్న రాయితీలు ఉండాలి. వాళ్ళకిప్పటికే ప్రత్యేక నియోజకవర్గాల ద్వారా అవి ఉన్నాయి. అలాంటి రాయితీని సింధ్‌లోని హిందూ సోదరులకు, వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోని హిందూ సోదరులకివ్వాలి. ఇక పైన ఏ రాష్ట్ర శాసనసభ అయినా, కేంద్ర శాసనసభ అయినా మూడింట రెండు వంతుల మెజార్టీతో మతపర నియోజకవర్గాల్ని వదులుకోవాలనుకుంటే, సంయుక్త నియోజక వర్గాలుండాలని కోరుకుంటే, సంయుక్త నియోజకవర్గాలు ఏర్పడాలి."

ఈ రెండు ప్రతిపాదనల్లోని భేదమూ స్పష్టమే. "చట్టపరమైన మెజార్టీ ఉంటే, సంయుక్త నియోజక వర్గాలు. దాన్ని నిరాకరిస్తే ప్రత్యేక నియోజకవర్గాలు, మైనార్టీ సీట్లు." బ్రిటిషు ప్రభుత్వం మొదటి దాన్నుంచి చట్టపర మెజార్టీకి, రెండవ దాన్నుంచి ప్రత్యేక నియోజకవర్గాన్ని తీసుకొని ముస్లింలకి రెండింటినీ ఇచ్చింది వాళ్ళు అడక్కపోయినా.

ముస్లిములలో కనిపించే రెండవ విషయం ఏమంటే హిందువుల బలహీనతని వాటంగా వాడుకోవటం. హిందువులు దేనికైనా అభ్యంతరం పెడితే దాన్ని గురించి పట్టుబట్టటం, హిందువులు దాన్ని ఇవ్వ సంసిద్ధపడితే వదులుకోవడం ముస్లిముల విధానంగా కనబడుతుంది. దీనికి ఉదాహరణగా ప్రత్యేక నియోజకవర్గాల విషయం, సంయుక్త నియోజకవర్గాల విషయం చూడవచ్చు. సంయుక్త నియోజకవర్గాల విషయమై హిందువులు పోరాడ్డం శుద్ధ తెలివి తక్కువతనం అని నాకు అనిపిస్తుంది. ముఖ్యంగా ముస్లిములు మైనార్టీగా ఉన్న చోట్ల జాతీయవాదానికి అవి ఎన్నటికీ ఆధారం కాలేవు. జాతీయవాదం అనే రాజకీయ సంబంధం, సామ్యం సంబంధం ఏమీ లేదు. ఏమంటే ఒట్టి బాహ్య విషయాల కూడికలకీ తీసివేతలకీ ఇది అతీతం. రెండు మతపర వర్గాలు అయిదేళ్ళ పాటు వేర్పాటుగా, ఎవళ్ళ గూట్లో వాళ్ళు ఉంటూ ఉండగా అవి ఒకటి కాలేవు. ఏమంటే అయిదేళ్ళలో ఒకసారే ఆ రెండు వర్గాలు కలిసి దగ్గరకు వస్తాయనుకోవడం, ఎన్నికల కోసం కుదరదు. సంయుక్త నియోజకవర్గాల వల్ల మెజార్టీ వర్గంలో మైనార్టీ వర్గం బానిస అవుతుంది. అయితే వాళ్ళకుగా వాళ్ళు జాతీయ వాదాన్ని రూపొందించలేదు. సరే అదెలా ఉన్నా హిందువులు సంయుక్త నియోజకవర్గాలు కావాలన్నారు కాబట్టి ముస్లిములు ప్రత్యేక నియోజకవర్గాల కోసం పట్టుబడుతున్నారు. ఈ పట్టుబట్టడం ఊరికే బేరం సాగించడానికన్నది స్పష్టమే. జిన్నా 14 సూత్రాలు చూస్తే ఇది తెలుస్తుంది*. 1927 డిసెంబరు 30న,

* జిన్నా సూత్రాల్లో 15వ అంశం చూడండి.

ఆలిండియా ముస్లింలీగ్ తీర్మానాన్ని బట్టి[1] తెలుస్తుంది. హిందువులు సింధ్ విభజనకు అంగీకరిస్తే, వాయవ్య సరిహద్దు రాష్ట్రాన్ని ముసల్మాన్లు స్వయంపాలిత హెూదానిస్తేనూ, ప్రత్యేక ఎల్క్టరేట్‌ను వదులుకుంటారు వాళ్ళు[2]. ప్రత్యేక నియోజకవర్గాలు అంత ముఖ్యం అని ముస్లిములు భావించలేదు. తమ ఇతర కోర్కెల సాధనకి వాటిని వాడుకున్నారంతే.

ఈ మాదిరి వాటంగా వాడుకోవటం మరో ఉదాహరణ ద్వారా చూడవచ్చు. గోవధ గురించి ముస్లిముల పట్టుదల, మసీదుల ముందు సంగీతం గురించిన పట్టుదల, బలి ప్రయోజనాల కోసం గోవుల్ని వధించమని ముస్లిం న్యాయం ఏమీ చెప్పదు. హజ్ వెళ్ళిన ఏ ముసల్మానూ కూడా మక్కాలో, మదీనాలో బలి ఇవ్వడు. కాని భారతదేశంలో ఏ జంతువుని బలి ఇవ్వడానికి వాళ్ళు అంగీకరించరు. అన్ని ముస్లిం దేశాల్లోనూ మసీదుల్లో సంగీతం చేస్తూనే ఉన్నారు. ఆఫ్ఘనిస్తాన్‌లో కూడా. అదేం లౌకిక రాజ్యం కాదు. అక్కడ కూడా ఉంది. కాని ఇక్కడ మాత్రం వాళ్ళు అభ్యంతరం పెడుతున్నారు. హిందువులు ఒక హక్కుగా వాదిస్తారని తప్ప అభ్యంతరానికి కారణమే లేదు.

ఇక మూడవ విషయం. రాజకీయాల్లో ముస్లిం దౌష్ట్య వ్యవహారంతో ఉన్నారు. అందుకు సాక్ష్యం మతకల్లోలాలు. అవి రాజకీయాల్లో భాగం అయ్యాయి. వాళ్ళు కావాల్సి జర్మనులు చెక్‌ల విషయంలో అనుసరిస్తున్న వైఖరే అనుసరిస్తున్నట్టుంది. ముస్లింలు దండయాత్ర చేసేవాళ్ళుగా ఉన్నంతకాలం హిందువులు కిమ్మనాస్తిగా ఉన్నారు. ఆ తగువుల్లో ముస్లిముల కంటే ఎక్కువ బాధలు పడ్డారు. కాని అది నిజం కాదు. ఎదురు తిరగడం నేర్చుకున్నారు హిందువులు. ముస్లిములను కసక్కిన నరికేందుకు కూడా జంకడం లేదు. దాంతో దౌష్ట్యతనానికి.

ఈ సమస్యని ఎలా పరిష్కరించాలన్నదే అందరికీ ఆలోచనాత్మకం కావాలి. హిందూ మహాసభ దేశభక్తులున్నారు. కలుషితం కాని మనస్కులు. ముసల్మానులు లేకుండా పోవాలి వాళ్ళకి. అటుపక్క కాంగ్రెసు హిందూ జాతీయవాదులున్నారు. రాజకీయ రాయితీలు ఇచ్చి వాళ్ళని దువ్వడం వాళ్ళ విధానం. లేకపోతే ప్రియమైన స్వాతంత్ర్య లక్ష్యాన్ని సాధించలేమని వాళ్ళ భయం. హిందూ మహాసభ పథకం వల్ల ఐక్యం రాదు. అందుకు వ్యతిరేకంగా అవి ఆటంకం కూడా. హిందూ మహా సభాధ్యక్షుని నినాదం – హిందువులకే హిందుస్తాన్ – పొగరుమోతుగా ఉండడమే కాదు, అర్థం లేనిది కూడా. ఇక మిగిలిన ప్రశ్న – కాంగ్రెసు పరిధి సరైందాని? కాంగ్రెసు రెండు విషయాలు గమనించటంలో విఫలమైంది. దువ్వడానికి, పరిష్కారానికి తేడా ఉందని గుర్తించకపోవడం మొదటిది.

---

1. ఆ సమావేశంలో బర్కత్ ఆలీ ఉపన్యాసం కోసం, తీర్మానం కోసం చూడండి. ఇండియన్ క్వార్టర్లీ రిజిష్టర్, 1927, వాల్యూం, 447-48 పేజీలు.
2. ముస్లిములకు ఆ మినహాయింపులు వచ్చాయి కాని, హిందువులకు ఏమీ రాలేదు, దురదృష్టం.

దువ్వడం అంటే దాడి చేసేవాళ్ళ దుర్మార్గాల్ని - హత్యలు, మానభంగాలు లాంటి వాటిని ఉపేక్షించి చూసీ చూడనట్టు ఉండటం. వాడు అమాయకుల్ని అలా పీడిస్తాడు. అలా కాక పరిష్కారం అంటే ఉభయ పక్షాలూ హద్దు దాటలేని గీతలు పెట్టడం. మొదటిది దుండగుడి కోరికలకి హద్దు పెట్టదు. పరిష్కారం చేస్తుంది. కాంగ్రెసు విఫలమైన రెండవది: మినహాయింపులు ఇచ్చుకురంటూ పోవడం వల్ల ముస్లిముల దురంతం పెరిగింది. హిందువులు దాన్ని ఆపే దశలో లేదు. ఇదెలాంటి పరిస్థితి అంటే హిట్లరు విధానం వల్ల మిత్రరాజ్యాలు బాధలు పడ్డ పరిస్థితి లాంటిది. మరో ఉధృతం ఉంది. సాంఘిక స్తబ్ధతని మించింది. ఇది దువ్వడం పరిస్థితిని ఉధృతం చేస్తుంది. ఉన్న మందు అల్లా పరిష్కారమే. పాకిస్తాన్ మాత్రమే పరిష్కారం అనుకుంటే దాన్ని పరిశీలించాలని. ఏమంటే పరిష్కారం ఒప్పందం వల్ల వస్తుంది. దానివల్ల లొంగుబాటు పోతుంది. శాంతి సౌఖ్యాలు పరిష్కారం వల్ల వస్తాయి. హిందువులలో ముస్లిముల వ్యవహారాల వల్ల రాజకీయ ఆకలివల్ల వచ్చే భద్రతా రాహిత్యం పరిష్కారం వల్ల పోతుంది.

అనువాదం :

డా॥ ఐ. రామబ్రహ్మం,

ఆర్వీయార్,

డా॥ ప్రసన్నకుమార్

# జాతీయ నిస్పృహ

మీ దేశానికి ఎలాంటి మహోన్నత భవితవ్యం ఉండాలని కోరుకుంటావు అని ఏ భారతీయుణ్ణి అయినా అడిగారనుకోండి. జవాబు ఏమై ఉంటుంది? ఈ ప్రశ్న ముఖ్యమైంది, జవాబు ఉద్బోధకంగా ఉండక తప్పదు.

ఇతర విషయాలన్నీ సమతూకంగా ఉండి, తన దేశం అంటే గర్వపడే నికార్సైన భారతీయుడు "సమైక్య స్వతంత్ర భారతదేశమే నా ఆదర్శం, అదే భారత భవిష్యత్‌కి కావాలి" అని అంటాడు. హిందువులూ, ముస్లిములూ ఉభయులూ కూడా ఇలాంటి భవితవ్యమే ఉండాలని అనుకుంటే తప్ప, ఈ ఆదర్శం ఒక పవిత్ర కామనగానే మిగిలిపోతుందన్న ముక్కా అంతే నిజం. అలా తప్ప దీనికి కార్యరూపం ఎన్నటికీ రాదు. ఇది ఏదో కొందరి పవిత్రాశయం మాత్రమేనా లేక యావన్మందీ నడుంకట్టి సాధించాల్సిన లక్ష్యమా?

రాజకీయ గమ్యాల ప్రకటనల మేరకు అన్ని పార్టీలూ ఏకాభిప్రాయంతో ఉన్నట్టే కనిపిస్తున్నాయి. ఏమంటే అన్ని పార్టీలూ భారత రాజకీయ పరిణామం స్వాతంత్ర్యమే అని ప్రకటించాయి. భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించడమే తన లక్ష్యమని మొట్టమొదటగా ప్రకటించింది కాంగ్రెస్ పార్టీ. 1927 డిసెంబరు నెలలో మద్రాస్‌లో జరిగిన సభలో కాంగ్రెస్ సిద్ధాంతాన్ని ఒక తీర్మానంలో వివరించేరు. భారత ప్రజల* గమ్యం సంపూర్ణ స్వాతంత్ర్యం

---

* కాంగ్రెస్ సిద్ధాంతాన్ని మార్చింది మద్రాస్‌లో కాదు, లాహోర్‌లో. 1929 డిసెంబర్ 31న ఆమోదించిన లాహోర్ తీర్మానంలో ఈ మార్పు జరిగింది. మద్రాస్ సమావేశంలో స్వాతంత్ర్యానికి అనుకూలంగా మాత్రమే తీర్మానం జరిగింది. 1928 డిసెంబరులో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో అధినివేశ ప్రతిపత్తికి - దాన్ని గనక 1929 డిసెంబరు 31 అర్ధరాత్రి లోపున బ్రిటిష్ ప్రభుత్వం ఇస్తే - తమ సమ్మతిని గాంధీజీ, కాంగ్రెస్ అధ్యక్షులు ప్రకటించేరు.

అని దాంట్లో వివరించేరు. హిందూ మహాసభ కూడా 1932 దాకా, భారత రాజకీయ పరిణామ లక్ష్యంగా, బాధ్యతాయుత ప్రభుత్వం అనే దాంతో సరిపెట్టుకుంది. 1937 దాకా అది తన రాజకీయ దృక్పథాన్ని మార్చుకోలేదు. అపుడు అహమ్మదాబాద్‌లో జరిగిన సమావేశంలో హిందూ మహాసభ "పూర్ణ స్వరాజ్యం" – భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం – అన్న వైఖరిని అందుకుంది. ముస్లింలీగ్ కూడా 1912లో భారతదేశానికి బాధ్యతాయుత ప్రభుత్వం అనే రాజకీయ సిద్ధాంతాన్ని అనుసరించింది. 1937 నాటికి అదీ తన రాజకీయ వైఖరిలో పై వాటిలాగా తన దృక్పథాన్ని మార్చుకుంది. బాధ్యతాయుత ప్రభుత్వ భావన నుంచి "స్వాతంత్ర్యం" అనే వైఖరికి వచ్చింది. ఆ మాదిరిగా అదీ కాంగ్రెస్, హిందూ మహాసభలు అనుసరించే దారికి వచ్చింది.

ఈ మూడు రాజకీయ విభాగాలూ నిర్వచించుకున్న స్వాతంత్ర్యం అనేది ఏమిటంటే బ్రిటిష్ సామ్రాజ్యవాదం నుంచి విముక్తి. కాని బ్రిటిష్ సామ్రాజ్యవాద శృంఖలం నుంచి విముక్తి అనేదాన్ని అంగీకరించడమే చాలదు. స్వతంత్ర భారతావనిని నడిపించడం మీద కూడా అంగీకారం ఉండాలి. అందుగ్గాను, భారతదేశం బ్రిటిష్ వాళ్ల నుంచి విముక్తమై స్వతంత్రంగా ఉండడమే కాదు, ఆ స్వాతంత్ర్యం విదేశీ శక్తికి లొంగకుండా ఉండాలి. దాని విషయంలో కూడా ఏకాభిప్రాయం ఉండాలి. నిజం చెప్పాలంటే, బ్రిటిష వాళ్ల నుంచి స్వాతంత్ర్యం సాధించడంతోనే అయిపోదు, ఆ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవడమనే కర్తవ్యం ఇంకా ముఖ్యమైంది. అయితే ఈ ముఖ్యమైన కర్తవ్యం మీద అదే ఏకాభిప్రాయం ఉన్నట్టు లేదు. ఏమైనా, ఈ విషయానికి సంబంధించి ముస్లిమ్‌ల వైఖరి అంత నమ్మకం కలిగించేట్టు లేదు. భారతదేశ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టాలన్న కర్తవ్యాన్ని తమ నెత్తిమీద మోపుకోమని ముస్లిం నాయకులు శతధా చేస్తున్న ప్రకటనల ద్వారా విశదమవుతూనే ఉంది యీ విషయం. అలాంటి ఉద్ఘాటనల్ని రెండింటిని క్రింద ఇస్తాను.

1925లో లాహోర్‌లో జరిగిన ఒక సభలో డాక్టర్ కిచ్‌లూ ఇలా అన్నాడు* :

"ఖిలాఫత్ కమిటీ ఊపిరిపోసే దాకా కాంగ్రెస్ జీవం లేకుండానే ఉంది. ఖిలాఫత్ కమిటీ చేరేక, అంతకు ముందు 40 సంవత్సరాలుగా హిందూ కాంగ్రెస్ చెయ్యలేని దాన్ని అది ఒక ఏడాదిలో చేసింది. ఏడుకోట్ల మంది అస్పృశ్యుల్ని పైకి తీసుకు వచ్చే పనిని కూడా కాంగ్రెస్ చేసింది. సరే ఆ పని పూర్తిగా హిందువులకి సంబంధించిందే, అయినా కాంగ్రెస్ సొమ్మని దానికి ఖర్చు చేశారు. దానికోసం నా సొమ్మునీ, నా ముస్లిం సోదరుల సొమ్మునీ మంచినీళ్ల ప్రాయంగా ఖర్చు చేశారు. అయినా నిబ్బరం కల ముసల్మాన్లు దాని గురించి పట్టించుకోలేదు. అలాంటప్పుడు, మన ముసల్మాన్లం తాంజిమ్ పనిని తీసుకుని దానికి సొమ్ము ఖర్చుపెడుతూ వుంటే హిందువులు పేచీ పెట్టడం ఎందుకు? ఆ సొమ్ము హిందువులదీ,

* 'భారత నేత్రాల గుండా' – టైమ్స్ ఆఫ్ ఇండియా 14.3.25.

కాంగ్రెస్‌దీ కాదు కదా?

"ఈ దేశం నుంచి బ్రిటిష్ వాళ్లని సాగనంపేక స్వాతంత్ర్యం స్థాపిస్తాం అనుకోండి. అప్పుడు ఆఫ్ఘన్లో, మరో ఇతర ముస్లిమ్‌లో భారతదేశం మీద దాడిచేస్తే, మన ముసల్మాన్లందరం వాళ్లని ఎదిరిస్తాం, దాడి నుంచి దేశాన్ని రక్షించుకుందుకు మన పుత్ర సంతానాన్ని బలి ఇస్తాం. అయితే ఒక విషయం నేను నిర్మొహమాటంగా చాటదలచుకున్నాను. ప్రియమైన నా హిందూ సోదరులారా, వినండి, శ్రద్ధగా వినండి! మీరు మా తాంజిమ్ ఉద్యమానికి ఆటంకాలు కల్పిస్తే గనక, మా హక్కుల్ని మాకు ఇవ్వకపోతే గనక, మేం ఆఫ్ఘనిస్తాన్‌తోనో, మరో ముస్లిం రాజ్యంతోనో ఉమ్మడి లక్ష్యం ఏర్పాటు చేసుకుంటాం, ఈ దేశంలో మా పరిపాలనని స్థాపిస్తాం."

సిల్హెట్‌లో 1939 జనవరి 27న మౌలానా అజాద్ శోభాని చేసిన ఉపన్యాసం*లోని భావనలు కూడా శ్రద్ధగా గమనించదగ్గవి. ఒక మౌలానాగారు అడిగిన ప్రశ్నకి జవాబుగా అజాద్ శోభాని ఇలా చెప్పేరు :

"ఈ దేశం నుంచి ఇంగ్లీషు వాళ్లను తరిమెయ్యాలని చెప్పే ప్రముఖ నాయకుడెవడన్నా ఉన్నాడు అంటే ఆ నాయకుణ్ణి నేనే. అయినాగానీ, ముస్లింలీగ్ తరఫు నుంచి ఇంగ్లీషు వాళ్లతో పోరు ఉండకూడదని నా అభిప్రాయం. మనం చెయ్యాల్సిన పెద్ద యుద్ధం 22 కోట్ల హిందూ శత్రువులతోనే. వాళ్లే అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. కేవలం 4.1/2 కోట్ల మంది ఇంగ్లీషు వాళ్లు దాదాపు యావత్ప్రపంచాన్నీ, శక్తివంతులై, కబళించేరు. ఈ 22 కోట్ల మంది హిందువులూ, సంఖ్యలో వున్నంతగానూ చదువులో, వివేకంలో, సంపదలో అన్నింటిలో సమానంగా పురోగమిస్తే, వాళ్లు శక్తి సంపన్నులైతే అపుడింకెలా ఉండచ్చునంటారు? వాళ్లు ముస్లిం భారత్‌ని క్రమేపీ ఈజిప్టుని, టర్కీని, కాబూల్ మక్కాల్ని, మదీనాని, యాజూజ్-మజూజ్ లాంటి ఇతర ముస్లిం ప్రాంతాల్ని కబళించేస్తారు. (కొరాన్‌లో వుంది - ప్రపంచ ప్రళయం సంభవించడానికి ముందు, వాళ్లు భూమ్మీద ప్రత్యక్షమై, దొరికిన దాన్ని దొరికినట్టు మింగేస్తారట).

"ఇంగ్లీషువాళ్లు రాను రాను శుష్కించిపోతున్నారు వాళ్లు రేపోమాపో భారతదేశం నుంచి వెళ్లిపోతారు. అంచేత, మనం ఇస్లాంకి బద్ధశత్రువులైన హిందువులతో పోరాడి, వాళ్లని బలహీన పరచకపోతే వాళ్లు భారతదేశంలో రామరాజ్యాన్ని స్థాపించడమే కాదు, క్రమేపీ భూమండలమంతా వ్యాపిస్తారు. వాళ్లని (అంటే హిందువుల్ని) బలోపేతుల్ని కావించడమో లేక నిర్వీర్యుల్ని చెయ్యడమో అనేది 9 కోట్ల మంది భారతదేశ ముస్లిమ్‌ల మీదా ఉంది. అంచేత, హిందువులు ఇక్కడ స్థాపితం కాకుండా, ఇంగ్లీషువాళ్లు నిష్క్రమించిన వెంటనే ముస్లిం

* ఈ ఉపన్యాసం బెంగాలీ పాఠం 'ఆనందబజార్ పత్రిక'లో వచ్చింది. ఇక్కడ ఇచ్చిన ఇంగ్లీషు పాఠం 'హిందూస్తాన్ స్టాండర్డ్' సంపాదకులు చేసిన అనువాదం.

పాలన స్థాపితమయ్యేందుకుగాను ముస్లింలీగులో చేరి పోరాడ్డం ప్రతి పవిత్ర ముస్లిమ్‌కీ తప్పనిసరి కర్తవ్యం.

"ఇంగ్లీషువాళ్లు ముస్లిములకు శత్రువులే, అయినా మన ప్రస్తుత పోరాటం ఇంగ్లీషువాళ్ల మీద కాదు. మొదటగా, ముస్లింలీగు ద్వారా మనం హిందువులతో ఒక ఒప్పందానికి రావాలి. అపుడే మనం ఇంగ్లీషువాళ్లను సునాయాసంగా తరిమేసి, భారతదేశంలో ముస్లింపాలనను స్థాపించగలం.

"జాగ్రత్త! కాంగ్రెస్‌లో వున్న మౌల్వీల వలలో పడకండి, ఏమంటే 22 కోట్ల హిందూ శత్రువుల చేతిలో ముస్లిం ప్రపంచం ఎన్నటికీ భద్రంగా ఉండలేదు."

మౌలానా అజాద్ శోభాని ఇచ్చిన ఈ ఉపన్యాసాన్ని ఆనందబజార్ పత్రిక విలేఖరి సంగ్రహంగా ఇచ్చేడు. కాంగ్రెస్ రాష్ట్రాల్లో ముస్లిముల పాట్లు అంటూ అనేక కల్పిత సంఘటనల్ని మౌలానా అజాద్ శోభాని వర్ణించినట్టు ఆ సారాంశంలో ఉంది.

"స్థానిక స్వయం ప్రతిపత్తిని ప్రవేశపెట్టేక కాంగ్రెస్ మంత్రివర్గాన్ని ఆమోదించినపుడు, హిందూ ఆధిపత్యంలోని కాంగ్రెస్ చేతుల్లో ముస్లిం ప్రయోజనాలు సురక్షితంగా ఉండవని తాను భావించినట్టు ఆయన అన్నారు. కానైతే హిందూ నాయకులు ఉదాసీనంగా ఉండిపోయేరు. అంచేత తను కాంగ్రెస్‌ను వదిలి లీగ్‌లో చేరేనని ఆయన అన్నారు. కాంగ్రెస్ మంత్రులు తన భయాన్ని నిజం చేశారు. ఇలా భవిష్యత్‌ని ఊహించడమే రాజకీయం అంటారు. అంచేత తాను గొప్ప రాజకీయ నాయకుడు. భారతదేశం స్వాతంత్ర్యం పొందకముందే హిందువులతో నయాన్నో, భయాన్నో ఒక ఒప్పందానికి రావాలని తను ఇప్పుడు భావిస్తున్నారు. అలా రాకపోయినట్లయితే, 700 ఏళ్లు ముస్లింలకి బానిసలుగా ఉన్న హిందువులు ముస్లిములను బానిసల్ని చేసి పారేస్తారు అన్నాడాయన."

ముస్లిముల బుర్రల్లోని ఊహలేమిటో హిందువులకి తెలుసు. దాంతో స్వాతంత్ర్యాన్ని ముస్లిములు తమని బానిసలుగా చేసేందుకు వాడతారని వాళ్ల భయం. తత్ఫలితంగా హిందువులు భారత రాజకీయ పరిణామ లక్ష్యంగా స్వాతంత్ర్యం అన్న భావన పట్ల ఉత్సాహంగా స్పందించడం లేదు. ఈ భయాలు ఉచితానుచితజ్ఞతలు తెలియని వాళ్లు వ్యక్తం చేస్తున్నవి అనుకునేరు, కాదు. కాకపోగా, ఈ భయాల్ని వెల్లడి చేసేవాళ్లు, ముస్లిం నాయకులతో బాగా సంబంధాలుండి, తమ అభిప్రాయాల్ని వెల్లడించగల ఉచితజ్ఞత కలవాళ్లు.

శ్రీమతి అనిబిసెంట్ ఇలా అంటున్నారు* :

"మరో తీవ్ర సమస్య ఉత్పన్నం అవుతుంది. అది భారతదేశ మహమ్మదీయులకి సంబంధించింది. హిందువులకీ ముస్లిములకూ మధ్య సంబంధాలు లక్షన్ని రోజుల మాదిర

* భారత రాజకీయాల భవితవ్యం, పుటలు 301–305

ఉంటే ఈ సమస్య అంత హడావుడి పడాల్సిందేమీ కాదు. స్వతంత్ర భారతదేశంలో, ఇవాళ కాకపోతే రేపైనా ఈ సమస్య తలెత్తవచ్చు. అయినా ఇప్పుడే దాని కోసం కంగారు పడక్కర్లేదు. అయితే ఖిలాఫత్ ఆందోళన నాటి నుంచీ పరిస్థితులు మారేయి. ఖిలాఫత్ ధర్మయుద్ధాన్ని ప్రోత్సహించడం వల్ల భారతదేశానికి పెద్ద దెబ్బల్లో ఇదొకటి. 'విశ్వాస రహితుల'కి వ్యతిరేకంగా ముస్లిముల మనోగత భావాల్లో ద్వేషం ఉబికింది. గడిచిన సంవత్సరాలలో మాదిరి లజ్జారహితంగా, నగ్నరూపంతో ఉందా ద్వేషం. ప్రత్యక్ష రాజకీయాల్లో చోదకంగా పాత ముస్లిం మత కరవాలం మళ్లీ ఊపిరి పోసుకోవడం చూశేం. ఎన్నో శతాబ్దాలుగా విస్మృతం అయినదాన్ని, పాత వేర్పాటుతత్వాన్ని బయటికి లాక్కురావడం చూశాం. జాజిరుత్-ఆరబ్ అంటూ, అరేబియా ద్వీపాన్ని పవిత్రభూమిగా చాటడం, ముస్లిమేతర చరణాలు తొక్కి దాన్ని అపవిత్రం చెయ్యనివ్వకూడదని చాటడం చూశేం. ఆఫ్ఘన్లు గనక భారతదేశం మీదికి దాడి వస్తే తమ మతస్థులు వాళ్లతో చేతులు కలిపి శత్రువుకి వ్యతిరేకంగా మాతృభూమి రక్షణకి నడుంకట్టే హిందువుల్ని హతమారుస్తామని ముస్లిమ్ నాయకులు చాటడం విన్నారు. ముసల్మాన్లు మౌలికంగా తమ మాతృదేశానికి గాక ఇస్లాం దేశాలకు విధేయంగా ఉంటారన్న దాన్ని చూడక తప్పలేదు. వాళ్లకు ప్రాణప్రదమైంది 'దేవుని రాజ్యాన్ని' స్థాపించడం అని మనకు తెలియవచ్చింది. ఆ దేవుడు లోకపితగా, సర్వప్రాణుల్ని ప్రేమించే దేవుడు కాదు; ప్రవక్తల ఆదేశాల ద్వారా ముసల్మాన్ కళ్లద్దాల గుండా కనిపించే దేవుడు. పరాయి మతస్థుల్ని ఆదరించే విషయంలో ఆ దేవుడు అంతే వాళ్లకి - తొలినాటి హిబ్రూల మోజెస్ ధోరణి యెహోవా ప్రవక్త తమకి ప్రసాదించిన మతాన్ని అనుకరించే స్వేచ్ఛకోసం తొలినాటి ముస్లిమ్‌లకి వ్యతిరేకంగా పోరాడినట్టు. దేవుడు తన ఆదేశాల్ని మానవుడి ద్వారా అందించే మత సిద్ధాంతాలని పిలిచే ఆ దశ దాటిపోయింది. తాము వశిస్తూ వున్న రాజ్యచట్టాల్ని మించి ఆ ఫలానా ప్రవక్త బోధనల్ని మన్నించాలని ముసల్మాన్ నాయకులు చేసే ప్రతిపాదన పౌర క్రమశిక్షణకీ, రాజ్య స్థిరత్వానికీ భంజకం. దానివల్ల వాళ్లు దుష్ట పౌరులవుతారు. ఏమంటే వాళ్ల భక్తిప్రపత్తులు దేశం వెలుపల ఉన్నవాటి పట్ల ప్రదర్శితమవుతాయి. ముస్లిమ్‌లు మౌలానా మహమ్మద్ ఆలీ, షౌకత్ ఆలీ - ఈ బాపతు ముస్లిం నాయకుల్లో ప్రముఖులైన ఒకటి రెండు పేర్లు చెప్పుకోవాలంటే చాటుతున్న దృక్పథాల్ని అంటిపెట్టుకుంటే, వాళ్లని సాటి పౌరులు నమ్మరు. భారతదేశం గనక స్వతంత్రమైతే జనాభాలో ముస్లిం విభాగం భారతదేశ స్వాతంత్ర్యానికి ప్రత్యక్షంగా ప్రమాదకరం అవుతుంది. ఏమంటే అజ్ఞానులైన జన సమూహం ప్రవక్తపేరుతో తమకి విజ్ఞప్తి చేసేవాళ్ల వెనకాలే పడిపోతుంది గనక. ఆఫ్ఘనిస్తాన్, బెలూచిస్తాన్, పర్షియా, ఇరాక్, అరేబియా, టర్కీ, ఈజిప్టులతోనూ, మధ్య ఆసియాలోని ముస్లిం తెగలతోనూ కలిసి 'బ్రిటిష్ ఇండియా'లో వున్న వాళ్లకి ఇండియన్ సంస్థానాల్లో ఉండే ముస్లిమ్‌ల తోడ్పాటు ఉంటుంది. భారతదేశాన్ని ఇస్లాం పాలన కిందకి తేవడానికి, ముస్లిం పాలనని స్థాపించడానికి ఉద్యుక్తులవుతారు. భారతదేశ ముస్లిమ్‌లు తమ మాతృభూమికి విధేయులై

ఉంటారని అనుకున్నాం. నిజానికి, అలాంటి ముసల్మాన్ పాంగుని విద్యాధికులైన వర్గం వాళ్లు కొందరు నిరోధిస్తారని ఇంకా ఆశిస్తూ ఉన్నాం. కానైతే, వాళ్లు నిరోధించ కలిగేటంత సంఖ్యలో లేరు, మతభ్రష్టులయ్యారన్న నెపంతో వాళ్లు హత్యకి గురి కావచ్చు. ఇస్లామిక్ పాలన అంటే ఏమిటో మలబార్ మనకి రుచి చూపించింది. భారతదేశంలో మరో 'ఖిలాఫత్ రాజ్' నమూనా మనకి వద్దు. మలబార్ బయట ఉన్న ముస్లిమ్‌లు మోప్లాస్ పట్ల ఎంత సానుభూతి చూపించేరో, వాళ్ల రక్షణకిగాను తోటి మతస్థులు చేసిందాన్ని బట్టి తెలుస్తుంది. గాంధీ కూడా చేశాడు. మతం కార్యోన్ముఖులు కమ్మని వాళ్లకి బోధించినట్టుగానే వాళ్లు నమ్మి ఉద్యుక్తులైనారని ఆయన అన్నాడు. ఇది నిజమే కావచ్చు. అయితే చంపు, దోచుకో, మానభంగాలు చెయ్యి, తగల పెట్టు, తమ పాత నమ్మకాల్ని వదులుకోలేని వాళ్లని దేశం నుంచి తరిమి తగలెయ్యి అని తమ మతం బోధించినదాన్ని నమ్మేవాళ్లకి నాగరిక ప్రపంచంలో చోటు లేదు. ఆ మత పీఠాల్లో, దాని అజమాయిషీ కింద, దాని గమ్యాలకి లొంగి వుండే తావుల్లో తప్ప వాళ్లకి నాగరిక ప్రపంచంలో చోటు లేదు. తమ దేవుడు లోకుల పీకలు – ముఖ్యంగా సొమ్ము ఉన్న బాటసారుల పీకలు – నొక్కి పిసికెయ్యమన్నాడని థగ్గులు నమ్మేరు. అలాంటి 'దైవ శాసనాలు" నాగరిక దేశ శాసనాల్ని అధిగమించనియ్యకూడదు. ఇరవైయవ శతాబ్దంలో ఉంటున్న వాళ్లు ఇలాంటి మధ్యయుగాల విశ్వాసాలున్న వాళ్లకి నేర్పాలి. లేకపోతే దేశం నుంచి వెళ్లగొట్టాలి. వాళ్ల స్థానం ఎక్కడ ఉందయ్యా అంటే ఆ బాపతు అభిప్రాయాలున్న దేశాల్లో, అక్కడ వాళ్లు తమతో విభేదించే వాళ్లకి వ్యతిరేకంగా ఇంకా ఆ బాపతు వాదనల్ని వాడుకోవచ్చు.నిజానికి పర్షియాలో, ప్రాచీన పారశీకులలో, మన కాలం నాటి బాహై మతస్థులలో వాళ్లకి స్థానం ఉంటుంది. యదార్థానికి ఛాందస ముస్లింలు పాలించే దేశాల్లో ముస్లిం శాఖీయులకి భద్రత లేదు. షియాలు, సున్నీలు, సూఫీలు, బాహైలు, బ్రిటిష్ రాజ్యంలోనే హాయిగా ఉండగలరు. బ్రిటిష్ ప్రభుత్వం అన్ని శాఖల స్వేచ్ఛనీ సదిలంగా చూసింది. ఏదన్నా ఓ శాఖ అల్ప సంఖ్యాకవర్గంగా ఉన్నప్పుడు సాంఘికమైన వెలి నుంచి వాటిని కాపాడలేకపోయి ఉండచ్చు, అది వేరే విషయం. ముస్లిం పాలకులున్న దేశాల్లో కంటే ముస్లింలు బ్రిటిష్ పాలనలోనే స్వేచ్ఛగా ఉన్నారు. స్వతంత్ర భారతదేశం గురించి ఆలోచించే టప్పుడు, మహమ్మదీయ పాలన ప్రమాదం గురించి యోచించాలి."

సి.ఆర్. దాస్‌కు లాలాలజపత్ రాయ్ రాసిన ఒక ఉత్తరంలో ఇదే రకం భయాలు వ్యక్తమయ్యాయి.

"మరో విషయం ఉంది. ఈమధ్య కొంతకాలంగా అది నన్ను కలవరపెడుతోంది. దీన్ని గురించి మీరు జాగ్రత్తగా ఆలోచించాలని నాకనిపిస్తోంది. అది హిందూ – ముస్లిం ఐక్యం అన్న సమస్య. గత ఆరునెలలుగానూ నేను ఎక్కువ వ్యవధిని ముస్లిం చరిత్ర, ముస్లిం ధర్మశాస్త్రం అధ్యయనం చెయ్యడానికే ధారపోశాను. కాని ఆ పని సాధ్యం కావడమూ లేదు, చేతికి అంది వచ్చేటట్టూ లేదు అనిపిస్తోంది. సహాయ నిరాకరణ ఉద్యమంలో మహమ్మదీయ

నాయకులు త్రికరణశుద్ధిగానే వున్నారన్న విషయాన్ని ఒప్పుకుంటున్నా, వాళ్ల మతం ఐక్యానికి గట్టిగానే అడ్డంగా ఉంటుదనిపిస్తోంది. హకీమ్ ఆజమ్‌ఖాన్‌తో, డాక్టర్ కిచ్లూతో కలకత్తాలో జరిగిన సంభాషణ గురించి మీకు చెప్పేను, గుర్తు ఉంది కదా. హకీమ్ సాబ్ కంటే మంచి మహమ్మదీయుడు హిందూస్తాన్‌లో ఎవరూ లేరు. కాని ఏ మహమ్మదీయుడైనా 'కురాన్'ని ఎదిరించగలడా? ఇస్లాం మత న్యాయం నాకర్థమైన పద్ధతి తప్పయితే బాగుండుననే నేను ఆశిస్తున్నాను. అంతకి మినహా మరేదీ నాకు ఊరట కలిగించలేదు. కాని అది ఒప్పు అయితే గనక, తేలబోయే విషయం ఏమిటంటే, మనం బ్రిటిష్ వాళ్లకి వ్యతిరేకంగా ఐక్యం కాగలిగినా హిందుస్తాన్‌ని బ్రిటిష్ పద్ధతిలో పరిపాలించడానికి అలా మనం ఐక్యం కాలేం, హిందూస్తాన్‌ని ప్రజాస్వామిక పంథాలో పరిపాలించడానికి ఐక్యం కాలేం. మరైతే దీనికి మందు ఏమిటి? హిందుస్తాన్‌లోని ఏడుకోట్ల మంది అంటే నాకు భయం లేదు. కాని హిందుస్తాన్‌లోని ఏడుకోట్లు, ఆఫ్ఘనిస్తాన్, మధ్య ఆసియా, అరేబియా, మెసపొటేమియా, టర్కీలలోని దళాలు కలిస్తే అప్రతిహతంగా తయారవుతాయి. హిందూ-ముస్లింల మధ్య ఐక్యం అవసరం లేదా వాంఛనీయం అని నేను మనస్ఫూర్తిగా, గుండెమీద చెయ్యి వేసుకుని విశ్వసిస్తున్నాను. ముస్లిం నేతల్ని విశ్వసించేందుకు కూడా నేను ఏ మాత్రం జంకను. కానైతే కురాన్, హదీలు విధించే అనుశాసనాల మాట ఏమిటి? ఆ నాయకులు వాటిని కాదనలేరు. అయితే మరి మన రాత యింతేనా? అలా కాదనే ఆశిస్తున్నాను. ఈ చిక్కుల నుంచి బయటపడ్డానికి విద్యావంతులు, వేత్తలు ఏదో మార్గం చూస్తారనే ఆశిస్తున్నాను."

1924లో ఓ బెంగాలీ పత్రికా సంపాదకుడు రవీంద్రనాధ్ టాగోర్‌తో ఇంటర్వ్యూ జరిపేడు. ఆ ఇంటర్వ్యూ నివేదిక ఇలా తెలియజేస్తోంది*.

"..... హిందూ-ముస్లిం ఐక్యం సాధించడం అసంభవం అని కవిగారి అభిప్రాయం. మహమ్మదీయులు ఏ ఒక్క దేశానికి తమ దేశభక్తిని సీమితం చెయ్యలేరనేది బలమైన అంశం అని ఆయన అభిప్రాయం. ఏ మహమ్మదీయ రాజ్యం అయినా భారతదేశం మీద దండయాత్ర చేస్తే ఆ సందర్భంలో హిందువులకి తోడ్పాటుగా తమ ఉమ్మడి భూమిని రక్షించుకుందుకు మహమ్మదీయులు నిలుస్తారా అని ఆయన ఎంతోమంది మహమ్మదీయుల్ని నిర్మొహమాటంగా అడిగాడు. అందుకు వాళ్లు ఇచ్చిన సమాధానం ఆయనకి తృప్తి కలిగించలేదు. ఓ మహమ్మదీయుడి దేశం ఏదైనా కానీ, అతను మరో మహమ్మదీయుడికి వ్యతిరేకంగా పోరాడ్డం ఎట్టి పరిస్థితుల్లోనూ ఆమోదయోగ్యం కాదని మహమ్మద్ ఆలీ లాంటివాళ్లే చాటారని తను నిక్కచ్చిగా చెప్పగలనని ఆయన అన్నారు."

---

* టైమ్స్ ఆఫ్ ఇండియా 18.4.24 నాటి సంచికలో "భారత నేత్రాలు దర్శించినట్టు" అన్నదాంట్లో ఉల్లేఖితం.

## II

స్వాతంత్ర్యం అసంభవం అనుకుందాం. అప్పుడు నికార్సైన భారతీయుడికి ఆమోద యోగ్యం అయిన రెండవ ఉత్తమ మార్గం భారత దేశ భవితవ్యానికి సంబంధించి బ్రిటిష్ సామ్రాజ్యంలో అధినివేశ ప్రతిపత్తి. అలాంటి భవిష్యత్ ఎవళ్లకి తృప్తిగా ఉంటుంది? హిందువులు తప్పకుండా అధినివేశ ప్రతిపత్తితో సంతృప్తి చెందితే, ముసల్మాన్లు మాత్రం తమకిగా తాము దాంతో తృప్తిపడరు అని గట్టిగా చెప్పగలను. ఇలాంటి ప్రకటన ఇండియన్లకి, ఇంగ్లీషు వాళ్లకి కటువుగా వినిపించవచ్చు. కాంగ్రెస్‌వాళ్లు స్వాతంత్ర్యమో అని కర్ణభేరులు పగిలేట్టు ఘోష పెడుతూ వుంటే, హిందువులు స్వాతంత్ర్యం కోసం అర్రులు చాస్తున్నారనీ, ముస్లిమ్‌లు అధినివేశ ప్రతిపత్తి కోసం పాకులాడుతున్నారనీ అనిపిస్తుంది. ఇంగ్లీషు వాళ్లల్లో ఈ అభిప్రాయం ఎంత గాఢంగా వుందో, కాంగ్రెస్ లేవనెత్తిన జంట నినాదాల వల్ల – అంటే స్వాతంత్ర్యం, ఋణాల నిరాకరణ – హిందువుల ప్రయోజనాలకి ఎంత విఘాతం కలిగిందో రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌కి హాజరయిన వాళ్లు గమనించకపోలేదు. ఈ ఘోష విని హిందువులు బ్రిటిష్ వాళ్లకి శత్రువులని, స్వాతంత్ర్యం కోసం గాని, ఋణాల మాఫీ గాని అడగని ముస్లిమ్‌లు తమ మిత్రులనీ ఇంగ్లీషువాళ్లు అనుకున్నారు. కాంగ్రెస్‌వాళ్లు శపథం పట్టిన ప్రణాళికలని బట్టి చూస్తే ఈ అభిప్రాయం ఎంత నిజమని అనిపించినా, దొంగ ప్రచారం వల్ల కలిగిన దొంగ అభిప్రాయం. ఏమంటే, హిందువులు అంతరంగంలో అధినివేశ ప్రతిపత్తికి సుముఖులు, ముస్లిములు అంతరంగంలో స్వాతంత్ర్యాన్ని కాంక్షిస్తున్నారు అన్న విషయంలో అనుమానం లేదు. సాక్ష్యం కావాలంటే బోలెడు ఉంది.

స్వాతంత్ర్యం అనే సమస్య మొట్టమొదట 1921లో తలెత్తింది. ఆ ఏడు అఖిలభారత జాతీయ కాంగ్రెస్, అఖిలభారత ఖిలాఫత్ కాన్ఫరెన్స్, అఖిలభారత ముస్లింలీగు తమ వార్షిక సదస్సుల్ని అహమ్మదాబాద్‌లో నిర్వహించేయి. ప్రతీ పార్టీ తమ సమావేశాల్లో స్వాతంత్ర్యానికి సంబంధించిన తీర్మానాల్ని ఆమోదించేయి. కాంగ్రెస్ వాళ్ల చేతుల్లో, ఖిలాఫత్ కాన్ఫరెన్స్‌లో, ముస్లింలీగ్ సమావేశంలో ఆ తీర్మానానికి పట్టిన గతి చూస్తే విచిత్రంగా ఉంటుంది.

కాంగ్రెస్ అధ్యక్షుడు హకీమ్ ఆజామ్ ఖాన్. ఆయన సి.ఆర్. దాస్ బదులు అధ్యక్షత వహించేరు. సి.ఆర్.దాస్‌ను యథావిధిగా ఎన్నుకున్నప్పటికీ సమావేశ ప్రారంభానికి ముందు ఆయన్ని అరెస్ట్ చెయ్యడం వల్ల సభకి అధ్యక్షత వహించలేకపోయారు. ఆ సమావేశంలో మౌలానా హస్రత్ మొహానీ కాంగ్రెస్ తన సిద్ధాంతాన్ని మార్చుకోవలని పట్టుబడుతూ తీర్మానం ప్రవేశపెట్టాడు. ఆ తీర్మానానికి సంబంధించిన కార్య నిర్వహణ సరళి* సారాంశం ఇదీ :

"సంపూర్ణ స్వరాజ్యం గురించి తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ మౌలానా హస్రత్ మొహానీ ఉర్దూలో సుదీర్ఘమైన, ఉద్వేగభరితమైన ఉపన్యాసం చేశారు. స్వరాజ్యాన్ని తెస్తామనీ, ఖిలాఫత్,

* ఇండియన్ ఏన్యువల్ రిజిస్టర్, 1922, అనుబంధం పేజీలు 64-66.

పంజాబ్ దురంతాలకి పరిహారం చెల్లించడం జరుగుతుందనీ కిందటి ఏడే వాగ్దానం చేసినా ఇంతవరకూ అలాంటిదేమీ జరగలేదని ఆయన అన్నాడు. అంచేత కార్యక్రమానికి అంటి పెట్టుకు ఉండడం వల్ల లాభం ఏమీ లేదు. బ్రిటిష్‌సామ్రాజ్యంలోనో, బ్రిటిష్‌కామన్వెల్తులోనో ఉండడం వల్ల స్వాతంత్ర్యం లేకపోవచ్చు. అయితే అవసరం పడితే గనక అందుకు సిద్ధం కావడనికి జంకనక్కర్లేదని ఆయన భావిస్తున్నట్టు చెప్పాడు. లోకమాన్య తిలక్ చెప్పినట్టు 'స్వాతంత్ర్యం మా జన్మహక్కు'. ఏ ప్రభుత్వమేనా తన ప్రజలకి వాక్స్వేచ్ఛనీ, కార్యాచరణ స్వేచ్ఛనీ తిరస్కరిస్తే దానికి ప్రజల విధేయతను పొందే హక్కు లేదు. జన్మతః పొందే స్వేచ్ఛకి అధినివేశ పంథాలో హోమ్ రూల్‌గాని వలస స్థానిక ప్రభుత్వంగాని ప్రత్యామ్నాయాలు కావు. చిత్తరంజన్ దాస్, పండిట్ మోతీలాల్ నెహ్రూ, లాలా లజపత్‌రాయ్ తదితరులులాంటి ప్రముఖ నాయకుల్ని కారాగృహాల్లో బంధించే ప్రభుత్వం ప్రజల భక్తిని పొందే హక్కు కోల్పోయింది. ఏడాది గడిచిపోయినా స్వరాజ్యం రాలేదు కాబట్టి, ఇప్పుడిక మిగిలిన ఒక్క మార్గాన్నీ అనుసరించే అవకాశాన్ని ఏదీ అడ్డలేదు. ఆ మార్గం ఏమిటంటే సకల విదేశీ అజమాయిషీ నుంచీ స్వేచ్ఛని సంపాదించడం. ఆ తీర్మానం ఇలా ఉంది :

"సకల ధర్మబద్ధమైన, శాంతియుత మార్గాల ద్వారా భారత ప్రజలు యావత్ విదేశీ అజమాయిషీ నుంచి స్వరాజ్యాన్ని సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించడమే బారత జాతీయ కాంగ్రెస్ లక్ష్యం."

చాలామంది ప్రతినిధులు దానికి అనుకూలంగా మాట్లాడేక, ఆ తీర్మానాన్ని వ్యతిరేకిస్తూ మాట్లాడ్డానికి గాంధీ ముందుకు వచ్చాడు. తీర్మానాన్ని వ్యతిరేకిస్తూ గాంధీ ఇలా అన్నాడు:

"మిత్రులారా, శ్రీ హస్రత్ మొహాని ప్రతిపాదించిన దానికి సంబంధించి నేను హిందీలో కొన్ని ముక్కలు మాత్రం చెప్పేనంతే. ఇంగ్లీషులో నేను మీకు చెప్పదలచుకున్నదల్లా ఈ ప్రతిపాదనకు కొంతమంది గ్రహించిన తేలికదనం నాకు బాధ కలిగించిందని మాత్రమే. నాకు బాధ ఎందుకు కలిగిందంటే అందులో బాధ్యతా భావం లోపించింది. బాధ్యత గల పురుషులుగా, స్త్రీలుగా మనం నాగపూర్, కలకత్తా రోజులకి వెళ్లాలి. ఓ గంట క్రితం ఏం చేశామో గుర్తించాలి. ఓ గంట క్రితమే తీర్మానాన్ని ఆమోదించేం. ఆ తీర్మానం యదార్థానికి ఖిలాఫత్, పంజాబ్ దురంతాలకి చివరి పరిష్కారాన్ని, కొన్ని నిర్దిష్టమార్గాల ద్వారా ప్రజల చేతుల్లోకి బ్యూరాక్రసీ నుంచి అధికారం బదలాయింపునూ ఉద్దేశిస్తోంది. ఒక ఉన్నత సమస్యని లేవనెత్తడం ద్వారా, భారత వాతావరణంలో మధ్యలో ఒక బాంబుని విసరడం ద్వారా మీ మనో ఫలకాల నుండి ఆ పరిస్థితి అంతటికీ మెరుగు దిద్దెయ్యగలరా? లోగడ ప్రతి ఓటు చేసినవాళ్లు ఈ తీర్మానాన్ని తీసుకుని ఓటు చేసే ముందు యాభై సార్లు ఆలోచిస్తారని నా ఆశ. మనం ఎక్కడ ఉన్నామో యదార్థానికి మనం ఎరగమని ప్రపంచంలోని ఆలోచనాశీలురు మనల్ని తప్పు పడతారు. మన పరిమితుల్ని కూడా మనం అర్థం చేసుకుందాం. హిందువులకీ, ముసల్మాన్లకీ మధ్య

అబేధ్యమైన అపరిమిత ఐక్యాన్ని రానియ్యండి. "అవును, భారత జాతీయతకి హిందూ-ముస్లిం ఐక్యం అభేద్యమైన అంశం అయింది" అని గుండె మీద చెయ్యి వేసుకుని చెప్పగల వాళ్లెవరేనా ఇక్కడ ఉన్నారా? పార్శీలు, సిక్కులు, క్రైస్తవులు, మీరీ మధ్యాహ్నం ఎవళ్ల గురించి విన్నారో ఆ అస్పృశ్యులు – ఈ జనమే ఈ భావానికి వ్యతిరేకంగా తలెత్తరని చెప్పేవాళ్లు ఇక్కడ ఎవరున్నారు? అంచేత అడుగు వెయ్యబోయే ముందు యాభై సార్లు ఆలోచించండి. ఆ వేసే అడుగు తలకిందులైతే మీకు లాభదాయకమూ అనుకూలమూ కావడం మాట పరేసరి, పూడ్చలేనంత నష్టం జరుగుతుంది. మొట్టమొదటగా మనం మన శక్తిని కూడదీసుకుందాం. మొట్టమొదటగా మన లోతులేమిటో తెలుసుకుందాం. మనకి తెలియని లోతు నీళ్లల్లోకి వెళ్లవద్దు. హస్రత్ మొహానీ చేసిన ఈ ప్రతిపాదన మిమ్మల్ని అడుగు అందని అగాధంలోకి తీసుకుపోతుంది. ఓ గంట క్రితం మీరు ఆమోదించిన తీర్మానాన్ని మీరు నమ్మేటట్టయితే, దాన్ని తిరస్కరించమని భరోసాగా చెపుతున్నాను. ఇప్పుడు మీ ముందు వున్న ప్రతిపాదన ఓ క్షణం క్రితం మీరు ఆమోదించిన తీర్మాన ఫలితాన్ని తుడిచి పెట్టేస్తుంది. మనిషి ఇష్టం వచ్చినట్టు మార్చుకునే బట్టల లాంటివా సిద్ధాంత విశ్వాసాలు? తాము నమ్మిన సిద్ధాంతాల కోసం ప్రజలు ప్రాణత్యాగం చేస్తారు, వాటి కోసమే ఈ ప్రజలు యుగయుగాలు జీవిస్తారు. నాగపూర్‌లో ఎంతో చర్చ తర్వాత, ఎంతో యోచన తర్వాత మీరు ఆమోదించిన సిద్ధాంతాన్ని మీరు మార్చుకుంటారా? మీరు దాన్ని ఆమోదించినపుడు ఏడాది గడువు అన్నదేమీ లేదు. ఇది విస్తృతి పొందే సిద్ధాంతం; ఇది అన్నిటిన్నీ ఇముడ్చుకుంటుంది; దుర్బలమైందాన్నీ, దృఢమైందాన్నీ కూడా. మీరు గనక మౌలానా హస్రత్ మొహానీ ప్రతిపాదించిన పరిమిత సిద్ధాంతాన్ని గనక ఆమోదించినట్లయితే మీలో అతి దుర్బలంగా వున్న వాళ్లని రక్షణతో ఆచ్ఛాదించే హక్కుకి మీరు కాలదన్నుకుంటున్నారు. హస్రత్ మొహానీ సిద్ధాంతం మీలో వున్న అతి దుర్బల సోదరుల్ని చేర్చుకోదు. అంచేత మీరీ ప్రతిపాదనని తిరస్కరించాలని భరోసాగా అడుగుతున్నాను."

ఓటింగ్ పెట్టినపుడు తీర్మానం వీగిపోయిందని ప్రకటించేరు. ఆలిండియా ఖిలాఫత్ కాన్ఫరెన్స్ సమావేశానికి కూడా హకీమ్ అజ్మల్‌ఖాన్ అధ్యక్షత వహించేడు. ఆ సమావేశపు విషయ నిర్ణాయక సభలో కూడా స్వాతంత్ర్యానికి అనుకూలంగా తీర్మానం వచ్చింది. ఆ తీర్మానానికి ఏం జరిగిందో అక్కడి కార్యక్రమ సారాంశాన్ని బట్టి స్పష్టమవుతుంది. కార్యక్రమ నివేదిక ఇలా వుందో :

"సమావేశం రాత్రి పదకొండు గంటలకి మర్నాటికి వాయిదా పడే ముందు అధ్యక్షుడైన హకీమ్ అజ్మల్‌ఖాన్ ఒక ప్రకటన చేశాడు. అజాద్ శోభాని ఒక తీర్మానం ప్రతిపాదించేడనీ, దాన్ని హస్రత్ మొహానీ బలపరిచేడనీ, దాన్ని విషయ నిర్ణాయక కమిటీ అధిక సంఖ్యలో

---

• ది ఇండియన్ ఏన్యువల్ రిజిస్టర్, 1922, అనుబంధం, పేజీలు 133-134

ఆమోదించిందనీ ఆయన ప్రకటించేడు. బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని నిర్మూలించేందుకూ, సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించేందుకూ కృషి చెయ్యవలసిందిగా యావన్మంది మహమ్మదీయులీన్నీ, ఇతర మతాల వాళ్లని అర్థించాలని తీర్మానించినట్టు ఆయన చెప్పేరు.

"బ్రిటిష్ ప్రభుత్వం అనుసరిస్తున్న మొండి విధానం వల్లా, వైఖరి వల్లా బ్రిటిష్ సామ్రాజ్యవాదం జాజిరట్-ఉల్-ఆరబ్‌ని అనుమతిస్తుందనీ ఇస్లాం ప్రజానీకం ముస్లిమేతర్ల అజమాయిషీ నుంచీ, ప్రభావం నుంచీ పూర్తిగా విముక్తులవుతారనీ ఆశించలేం. అంటే షారియత్‌కి అవసరమైన మేరకి ఖిలాఫత్‌ని సాధించడం జరగదన్న మాట. అంచేత, ఖిలాఫత్‌కి సంబంధించి శాశ్వత భద్రతనూ, భారత పురోభివృద్ధినీ సాధించేందుకుగాను బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని నిర్మూలించే కృషి జరపడం అవసరం. ఈ ప్రయత్నం జరిపించేందుకు ఉన్న ఏకైక మార్గం, ముస్లిమ్‌లకి సంబంధించి, భారతదేశంలో నివశిస్తున్న ఇతరులతో కలిసి సంయుక్తంగా పనిచేసి భారత దేశాన్ని పరిపూర్ణంగా స్వతంత్ర్యం కావించడమని సమావేశం భావిస్తోంది. స్వరాజ్ అంటే ముస్లిమ్‌ల అభిప్రాయం ఒకటేనని, అంటే సంపూర్ణ స్వాతంత్ర్యం అని, సమావేశం అభిప్రాయపడుతోంది. భారతదేశంలో నివశిస్తున్న ఇతరులు కూడా ఇదే దృక్పథంతో ఉన్నారని సమావేశం భావిస్తోంది.

"మర్నాడు, 1921 డిసెంబరు 27న సమావేశం పునః ప్రారంభమైంది. అపుడు స్వాతంత్ర్య తీర్మానం మీద సభ్యుల్లో అభిప్రాయభేదాలు వచ్చినట్టు తేలింది. తమ లక్ష్యం స్వాతంత్ర్యమనీ, బ్రిటిష్‌సామ్రాజ్యవాద నిర్మూలన అనీ ప్రకటిస్తూ హస్రత్ మొహానీ తీర్మానం ప్రతిపాదించబోగానే దాన్ని పరిశీలించడం కుదరదని ఖిలాఫత్ విషయ నిర్ణాయక కమిటీ సభ్యుడొకరు అభ్యంతరం చెప్పేరు. విషయ నిర్ణాయక కమిటీలో మూడింట రెండు వంతుల మెజార్టీ ఏ తీర్మానానికేనా లేనట్లయితే తమ సిద్ధాంత వైఖరిలో మార్పు వచ్చినట్టు భావించడానికి తమ కాన్‌స్టిట్యూషన్‌లో అవకాశం లేదన్న దానిమీద ఆ అభ్యంతరం లేవదీశాడు.

"అధ్యక్షులైన హకీం అజ్మల్‌ఖాన్ ఆ అభ్యంతరం సక్రమమేనని తీర్పు చెప్పి స్వాతంత్ర్య తీర్మానం క్రమబద్ధంగా లేదని తోసిపుచ్చారు.

"హస్రత్ మొహానీ తీవ్రంగా నిరసన తెలియజేశారు. విషయ నిర్ణాయక కమిటీలో అదే సభ్యుడు లేవనెత్తిన అలాంటి అభ్యంతరాన్నే అధ్యక్షుడు తోసిపుచ్చారని ఎత్తి చూపించేడు, దాన్నే బహిరంగ సమావేశంలో అనుమతించారని చెప్పేడు. తమ స్వరాజ్ అంటే పూర్ణ స్వాతంత్ర్యం అని ఆ సమావేశం ప్రకటించనివ్వకుండా అడ్డగించేందుకే తన తీర్మానాన్ని తోసిపుచ్చేటట్లు అధ్యక్షుడు ఎత్తు వేశాడని అన్నాడు."

ఆలిండియా ముస్లింలీగ్ అధ్యక్షుడు మౌలానా హస్రత్ మొహానీ ఈ తీర్మానానికి

సంబంధించిన లీగు కార్యక్రమ నివేదిక ఇలా ఉంది* :

"ముస్లింలీగ్ 1921 డిసెంబరు 31న ఉదయం 9 గంటలకి సమావేశమైంది. ఏ రకమైన పేచీపూచీలు లేని తీర్మానాల్ని కొన్నింటిని ఆమోదించేక కరతాళ ధ్వనుల మధ్య హస్రత్ మొహానీ ఒక ప్రకటన చేశాడు. స్వాతంత్ర్య సముపార్జన గురించీ, బ్రిటిష్ సామ్రాజ్యవాద నిర్మూలన గురించి తను ప్రతిపాదించిన తీర్మానాన్ని తిరస్కరిస్తున్నట్టు విషయ నిర్ణాయక కమిటీ తీసుకున్న నిర్ణయం తిరగతోడేందుకు వీల్లేనిదని, లీగ్ సభ్యుల్లోని అధిక సంఖ్యాకుల అభిప్రాయాన్ని ప్రతిబింబిస్తోందనీ ఒప్పుకుంటున్నట్టు ఆ ప్రకటనలో అన్నాడు. అయితే విషయానికి గల మహత్తర ప్రాముఖ్యం దృష్ట్యా, ఆ తీర్మానాన్ని చర్చించేందుకు అనుమతి ఇస్తున్నాననీ, ఓటింగ్ లేకుండా చర్చ సాగించవచ్చనీ అన్నాడు.

"విషయ నిర్ణాయక కమిటీలో శ్రీ అజాద శోభాని ఆ తీర్మానాన్ని ప్రతిపాదించేడు. ఆయనే దాన్ని లీగ్‌లో కూడా ప్రవేశపెట్టేడు. ముస్లిం హిందూ ఐక్యం తిరుగులేకుండా అవసరం అని, తమ పోరాటాన్ని అహింసా సహాయ నిరాకరణ పద్ధతుల్లో నడిపించడం ఒక్కటే మార్గమని తను నమ్ముతున్నట్టు చాటేడు. గాంధీజీకి కాంగ్రెస్ దత్తం చేసిన నియంతృత్వ హక్కుకి ఆయన సర్వవిధాలా తగినవాడని అన్నాడు. అయితే బ్రిటిష్ సామ్రాజ్యవాదం భారతదేశం పాలిటి ఘోరవిపత్తనీ, ముస్లిం ప్రపంచం పాలిటి ఘోర విపత్తనీ, స్వాతంత్ర్యం అనే ఆదర్శగమ్యాన్ని ముందు ఉంచి దాన్ని నిర్మూలించాలనీ అన్నాడు.

అజాద్ శోభాని తర్వాత అదే బాణీలో ఆయన్ని సమర్థిస్తూ చాలామంది మాట్లాడారు.

"కాంగ్రెస్ తీసుకున్నలాంటి చర్యని లీగు తీసుకోవడం ఇష్టం లేకపోవడమే అధ్యక్షుల వారు అలాంటి తీర్పు నివ్వడానికి హేతువని గౌరవనీయుడైన రజా ఆలీ ప్రకటించేడు. సరిగా అర్థం చేసుకోకుండా పెద్ద పెద్ద కబుర్లు చెప్పకూడదని ఆయన హెచ్చరించేడు. భారతదేశం, ఒకవేళ స్వాతంత్ర్యాన్ని సాధించినా, ప్రస్తుతంలో దాన్ని నిలబెట్టుకునేందుకు సంసిద్ధంగా లేదని ఆయన ప్రేక్షకులకి గుర్తు చేశాడు.

"రేపు బ్రిటిష్‌వాళ్లు వెళ్లిపోతే, మాటకి, సర్వ సైన్యాధ్యక్షుడు ఎవరని ఆయన అడిగేడు. ('అన్వర్ పాషా' అని) ఎవరిదో గొంతుక వినిపించింది.

"విదేశీయుడెవణ్ణీ తాను సహించనని వక్త కుండబద్దలు కొట్టినట్టు చెప్పేడు. తనకి కావాల్సింది భారత్ కమాండర్ ఇన్ చీఫ్ అని అన్నాడు."

కాకినాడలో 1923 మార్చిలో జరిగిన కాంగ్రెస్ సభలో స్వాతంత్ర్య సమస్య మళ్లీ తలెత్తింది కాని గొంగళీ కదల్లేదు. బెల్గాంలో 1924లో జరిగిన కాంగ్రెస్ సభకి అధ్యక్షత

* అదే రిజిస్టర్, అనుబంధం, పేజీ 78.

వహిస్తూ గాంధీ ఇలా అన్నారు :

"బ్రిటిష్‌వాళ్లు తాము చెప్పేదాన్నే ఉద్దేశిస్తూ ఉంటే, సమానత్వం పొందడానికి చిత్తశుద్ధితో మనకి సాయం చేస్తే, బ్రిటిష్‌వాళ్లతో పూర్తిగా తెగతెంపులు చేసుకోవడం కంటే ఎక్కువ విజయం అదేనని నా అభిప్రాయం. అంచేత సామ్రాజ్య పరిధిలోనే నేను స్వరాజ్యం కోసం పాటు పడతాను. బ్రిటిష్ వాళ్ల స్వయం కృతాపరాధం వల్ల తప్పక అలాంటి పరిస్తితి ఏర్పడినట్లయితే వాళ్లతో సమూలంగా తెగతెంపులు చేసుకోవడానికి ఏ మాత్రం జంకను. ఆ రకంగా వేర్పాటు భారం బ్రిటిష్‌వాళ్ల నెత్తిమీదే పెడతాను."

1925లో సి.ఆర్.దాస్ మళ్లీ అదే పాట అందుకు అన్నాడు. ఆ సంవత్సరం జరిగిన బెంగాల్ రాష్ట్రీయ కాంగ్రెస్ సమావేశంలో ప్రసంగించేడు. స్వాతంత్ర్య భావనకి చావుదెబ్బ కొట్టే ఉద్దేశ్యంతోనే, స్వాతంత్ర్య భావనలో ఉన్న నిమ్నతని ఎత్తి చూపేందుకు మహా తంటాలు పట్టాడు. అధినివేశ ప్రతిపత్తితో పోలిస్తే ఈ స్వాతంత్ర్య భావన నిమగ్నమైందని చూపించ ప్రయత్నించాడు.

"..... స్వరాజ్ కంటే తక్కువ సంకుచితమైన ఆదర్శం స్వాతంత్ర్యం అని నా అభిప్రాయం. పరాధీనతకి వ్యతిరేకమైన భావాన్ని అది నిర్దేశిస్తుంది. నిజమే. కాని దానికిగా అని మనకి మేలైన ఆదర్శాన్ని ఇవ్వదు. స్వాతంత్ర్యం అనేది స్వరాజ్యంతో పొసగదని నేను సూచించను గాక సూచించను. అయితే ముఖ్యంగా కావాల్సింది స్వాతంత్ర్యం కాదు, స్వరాజ్య స్థాపన. బ్రిటిష్ వాళ్లు మన ఖర్మకి మనల్ని వదిలేసి వెళ్లిపోయే అర్థంలో స్వతంత్రం రేపే రావచ్చు, కాని దానివల్ల నేను అర్థం చేసుకున్నట్టు స్వరాజ్యం సిద్ధించాలని లేదు. నేను గయ కాంగ్రెస్ అధ్యక్షోపన్యాసంలో ఓ సంగతి చెప్పేను. భారత్ చిత్రమైన, సంక్లిష్టమైన సమస్యని ప్రదర్శిస్తుంది. 'భారత ప్రజ' శిలా సదృశంగా నిర్మితమైంది కాదు. అనేక విరుద్ధ అంశాలతో ఏర్పడింది. ఒక ప్రజగా సంపుటీకరణం చెందడం అనేది చాలా దీర్ఘకాలికంగా జరగాల్సిందే, అది చాలా విసుగు కలిగించే ప్రక్రియ కావచ్చు కూడా. అయితే, అది లేకుండా స్వరాజ్ లేదు...."

"ఇక రెండవ విషయం. స్వరాజ్ అనేది అంతస్సారంలో అందించే క్రమబద్ధతని స్వాతంత్ర్యం ఇవ్వలేదు. నేను చెప్పిన సంపుటీకరణ కృషి అంటే ఆ క్రమబద్ధతని స్థాపించడమే. కాని ఓ విషయాన్ని మాత్రం అర్థం చేసుకోవాలి. దేన్ని స్థాపించాలని అనుకుంటూ ఉన్నా అది భారత ప్రజల సంప్రదాయాలతో పొసిగేటట్టు ఉండాలి. స్వరాజ్ అంటే నా దృష్టిలో మొదటగా భారత ప్రజానీకంలో వున్న విభిన్నతలన్నింటినీ సంపుటీకరణం చెయ్యడం; రెండవది : ఈ కర్తవ్యంతో మనం జాతీయస్థాయిలో సాగాలి; రెండువేల సంవత్సరాలు వెనక్కి వెళ్లడం కాదు, మన జాతీయ మేధా సంపత్తులతో, జాతీయ స్వభావ లక్షణాలతో ముందుకు సాగాలి.....

“మూడవది : మన ముందున్న కర్తవ్య నిర్వహణలో, ఏ పరాయిశక్తీ మనకి ఆటంకం రాకూడదు. అంచేత మన ఆదర్శంగా మనం దేన్ని నిర్ణయించుకోవాలి అంటే ఒట్టి స్వాతంత్ర్యం కాదు, నేను చెప్పే స్వరాజ్. స్వాతంత్ర్యం స్వరాజ్‌కి వ్యతిరిక్తం కావచ్చు. విమోచనకి సంబంధించి మన జాతీయ ఆదర్శం ఏమిటీ అంటే మనం ఇవ్వగల ఏకైక సమాధానం స్వరాజ్. హోమ్‌రూల్ గాని స్వయం పాలనగాని నాకు ఇష్టం లేదు. అవి బహుశా నేను స్వరాజ్ అని పిలిచేదాంట్లో ఇమిడి ఉండనే ఉంటాయి. కాని నా సంస్కారం ఎందుకనో ‘పాలన’ అనేదానికి విముఖంగా ఉంటుంది – అది హోమ్‌రూల్ గానివ్వండి, విదేశీ పాలన గానివ్వండి.

☆ ☆ ☆

“ఈ ఆదర్శాన్ని సామ్రాజ్యంలో అంతర్భాగంగా ఉంటూ సాధించడమా లేక బయట నుంచి సాధించడమా అన్న సమస్య వస్తుందిప్పుడు. కాంగ్రెస్ సర్వదా ఇచ్చిన జవాబు ఉండనే ఉంది. “సామ్రాజ్యం గనక మన హక్కుని గుర్తించినట్లయితే “సామ్రాజ్యాంతర్గతంగా ఉండి”; గుర్తించదూ “బయట ఉండి” అని. మన బతుకు మనం బతికే అవకాశం మనకి ఉండాలి – మన ఆత్మావిష్కరణకి, అభివృద్ధికి, స్వయం పరిపూర్ణత సాధించడానికి. ఇది మన బతుకు మనం బతకడానికి సంబంధించిన సమస్య. సామ్రాజ్యం గనక మన జాతీయ జీవిత వృద్ధికీ, అభివృద్ధికీ తగినంత అవకాశాన్ని ఇస్తే గనక సామ్రాజ్య భావం గ్రహించదగ్గదే. తద్విరుద్ధంగా, సామ్రాజ్యం తన ఉధృత వేగంతో జగన్నాథ రథచక్రాలలాగా మన జీవితాన్ని అణగదొక్కేస్తూ ఉంటే, సామ్రాజ్యానికి బయట స్వరాజ్య స్థాపన అనే భావమే సమర్థనీయం అవుతుంది.

“నిజానికి సామ్రాజ్యం అన్న భావన మనకి ఎన్నో సౌకర్యాల గురించిన స్పష్టమైన అర్థాన్నిస్తుంది. అధినివేశ ప్రతిపత్తి అనేది ఏ విధంగానూ దాస్యం కాదు. అసలైన సహకార భావంతో ప్రయోజనాపేక్షతో సామ్రాజ్యంలో భాగంగా ఏర్పడే వాళ్ల ఒప్పందలతో రూపు తీసుకునే సమాఖ్యే అది మౌలికంగానని చెప్పచ్చు. స్వేచ్ఛాయుత సమాఖ్య అంటే అందులో విడిపోవడానికీ హక్కు ఉంటుంది. యుద్ధానికి ముందు సామ్రాజ్యమో, దాని అనుషంగిక భాగాలో ఒక పెద్ద సమాఖ్యగా ఉండడమేనని సాధారణంగా భావించేవారు. ఆధునిక పరిస్థితుల్లో ఏ దేశమూ గిరిగీసుకుని ఉండలేదన్న గుర్తింపు వచ్చింది. బ్రిటిష్ సామ్రాజ్యం అని పిలిచే జాతుల మహత్తర కామన్వెల్తులో భాగంగా అధినివేశ ప్రతిపత్తి అనేది అందులో చేరిన ప్రతిభాగస్వామికీ పూర్తి భద్రతని కలిగిస్తుంది. అంతేకాదు, ప్రతిభాగస్వామ్య పక్షమూ తను అభివృద్ధి చెందడానిక, పరిపూర్ణం కావడానికి, వ్యక్తం కావడానికి దోహదపడుతుంది. అంతేకాక, నేను ప్రస్తావించిన స్వరాజ్య భావనలోని అంశాలన్నిట్నీ పొదువుకుంటుంది.

“నాకైతే ఈ భావన ఆకర్షణీయంగా ఉంది, దాంట్లో ఇమిడి ఉన్న గాఢమైన ఆధ్యాత్మిక ప్రాముఖ్యం వల్ల నేను ప్రపంచ శాంతిని, ప్రపంచ సమాఖ్యలో, కాంక్షించేవాణ్ని,

బ్రిటిష్ సామ్రాజ్యం అని పిలిచే ఈ మహత్తర సమాఖ్య – ఏ జాతికిగా ఆ జాతికి తనదైన జీవన విధానం, తనదైన నాగరికత, తనదైన మానసిక దృక్పథం వున్నటువంటి విభిన్నజాతుల సమాఖ్య – సరైన రాజనీతిజ్ఞుడు అగ్రభాగంలో ఉండి నడిపిస్తూ ఉంటే, రాజనీతిజ్ఞుల్ని వేధించే గొప్ప సమస్యకి పరిష్కారం చూపిస్తుంది. మానవుడి ఊహలో రూపు తీసుకునే "వసుధైక కుటుంబమ్" అన్న జాతుల అల్లిక, మానవజాతి సమాఖ్య, అనేది ఏర్పడ్డానికి దోహదపడుతుంది. కాని సరైన రాజనీతిజ్ఞుడు అగ్రభాగంలో ఉండి అలా నడిపిస్తేనే అలా జరుగుతుంది. ఏమంటే ఈ భావన అభివృద్ధి చెందడానికి భాగస్వామ్య పక్షాల తరపు నుంచి కొంత త్యాగం అవసరమవుతుంది. అందులో ఆధిపత్య నిర్దేశకంగా ఉన్న సామ్రాజ్యం అనే పదాన్నే శాశ్వతంగా త్యజించవలసి రావచ్చు. తన క్షేమం కోసం, ప్రపంచ క్షేమం కోసం భారతదేశం కామన్వెల్తులో భాగంగా విముక్తి కోసం కృషి చెయ్యాలి, ఆ రకంగా మానవాళికి సేవ చెయ్యగలుగుతుంది."

అధినివేశ ప్రతిపత్తి స్వాతంత్ర్యం కంటే మెరుగని సి.ఆర్. దాస్ నొక్కి చెప్పడమే కాదు, ఈ కింది తీర్మానాన్ని భారత రాజకీయ పరిణామగమ్యంగా ఉండేటట్టు ఆమోదింపచేశాడు.

1. భారతదేశం తన జీవన విధానాన్ని తను ఏర్పాటు చేసుకునే హక్కు స్వరాజ్ అనే జాతీయాదర్శంలో ఇమిడి ఉందని ఈ సమావేశం ప్రకటిస్తోంది. తన ఆవిష్కరణకీ, తన పురోగతికీ, విభిన్న అంశాల సంపుటీకరణకూ, స్వయంపూర్ణతకూ ఏ బాహ్యశక్తి ఆధిపత్యమూ లేకుండా కృషి చేసే అవకాశం ఇందులో ఉంటుంది.

2. బ్రిటిష్ సామ్రాజ్యం అలాంటి హక్కుని గుర్తించి, స్వరాజ్య సాధనకు ఆటంకం కలిగించకుండా, అలాంటి వకాశాన్ని ఇవ్వ సంసిద్ధం అయి, అలాంటి హక్కులు ఫలవంతం కావడానికి అవసరం అయిన త్యాగాలు చేస్తే బ్రిటిష్ కామన్వెల్తులో అంతర్భాగంగా భారతదేశం స్వరాజ్యం సాధించుకోవచ్చని ఈ సమావేశం పిలుపు ఇస్తోంది."

గాంధీగారు ఈ సమావేశంలో ఆది నుంచి తుదిదాకా హాజరయే వున్నారన్న విషయం గమనార్హం. కాని ఆయన ఏ అభ్యంతరమూ లేవనెత్తలేదు. అభ్యంతరం చెప్పకపోగా, ఆయన శ్రీదాస్ వైఖరిని సమర్థించేరు.

యదార్థాలు ఇలా ఉండగా హిందువులు అధినివేశ ప్రతిపత్తికీ, ముస్లిమ్‌లు స్వాతంత్ర్యం కోసమూ చూశేరన్న విషయాన్ని ఎవళ్లు సందేహించగలరు? ఇంకా ఒకవేళ ఏ పిసరన్నా అనుమానం మిగిలితే, 1928లో నెహ్రూ కమిటీ రిపోర్టు మీద ముస్లిం పక్షీయుల్లో కలిగిన ప్రతిధ్వనులు దాన్ని పటాపంచలు చెయ్యాలి. కాంగ్రెస్ నెహ్రూ కమిటీని నియమించింది. భారతదేశం స్వాతంత్ర్యాన్ని కాదని, అధినివేశ ప్రతిపత్తిని అంగీకరించే అంశం ఆధారంగా భారత రాజ్యాంగం తయారు చెయ్యడం ఆ కమిటీ పని. కాంగ్రెస్, ముస్లిం రాజకీయ సంస్థలు

నెహ్రూ నివేదికపట్ల అనుసరించిన వైఖరుల్ని గమనిస్తే అసలు సంగతి తెలుస్తుంది.

1928లో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ సభ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. దాన్ని గాంధీజీ ప్రతిపాదించారు. అది ఇలా ఉంది :

"అఖిల రాజకీయ కమిటీ నివేదిక సిఫార్సు చేసిన రాజ్యాంగాన్ని కాంగ్రెస్ పరిశీలించింది. భారతదేశ రాజకీయ, మతపర సమస్యల పరిష్కారానికి ఇది గొప్ప కృషి చేస్తుందని దీన్ని ఆహ్వానిస్తోంది. దాదాపు దీన్ని ఏకగ్రీవంగా సిఫార్సు చేసినందుకు కమిటీని అభినందిస్తోంది. మద్రాస్ కాంగ్రెస్ సభలో సంపూర్ణ స్వాతంత్ర్యానికి సంబంధించిన తీర్మానానికి కట్టుబడి ఉంటూనే, కమిటీ రూపొందించిన ఈ రాజ్యాంగాన్ని ఆమోదిస్తోంది. రాజకీయ పరంగా ఇది గొప్ప ముందంజగా భావిస్తోంది.

"బ్రిటిష్ పార్లమెంట్ ఈ రాజ్యాంగాన్ని 1929 డిసెంబరు 31కి ముందుగాని, ఆనాడేగాని ఆమోదిస్తే రాజకీయ పరిస్థితులు ఉండే సందర్భాన్నిబట్టి కాంగ్రెస్ ఈ రాజ్యాంగాన్ని సంపూర్తిగా అనుసరిస్తుంది. కాని ఆ గడువు లోపల దీన్ని ఆమోదించకపోయినా, ఆ లోపలే దీన్ని తిరస్కరించినా కాంగ్రెస్ అహింసాయుత సహాయ నిరాకరణోద్యమాన్ని నడుపుతుంది. పన్నుల్ని బహిష్కరించమనో, లేక అప్పుడు నిర్ణయించుకునే ఇతర మార్గాల ద్వారానో ఆ ఉద్యమాన్ని నడపమని దేశానికి పిలుపునిస్తుంది. ఈ పై వాటితో అనురూపంగా ఉండేటట్టు, కాంగ్రెస్ పేరు మీద సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం ప్రచారం సాగించేందుకు, ఈ తీర్మానం లోనిదేదీ అభ్యంతరం కలిగించదు."

హిందూ అభిప్రాయం స్వాతంత్ర్యం వైపు కాక అధినివేశ ప్రతిపత్తి వైపు మొగ్గి ఉందని దీనివల్ల తెలుస్తోంది. కొంతమంది ఈ మాటలకి అభ్యంతరం చెప్పవచ్చు. అయితే 1927 నాటి కాంగ్రెస్ తీర్మానం సంగతేమిటని అడగవచ్చు. 1927లో కాంగ్రెస్ మద్రాస్‌లో జరిపిన సభలో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ప్రతిపాదించిన ఈ తీర్మానాన్ని ఆమోదించిందన్న విషయం నిజమే.

"భారత ప్రజల లక్ష్యం సంపూర్ణ జాతీయ స్వాతంత్ర్య సాధన అని ఈ మహాసభ ప్రకటిస్తోంది."

అయితే ఈ తీర్మానం కాంగ్రెస్‌లో ఉన్న సిసలైన హిందూ వైఖరిని ప్రతిబింబించడం లేదని చెప్పడానికి తగ్గంత సాక్ష్యాధారాలు ఉన్నాయి.

ఆ తీర్మానం ఒక్క ఉదుటున వచ్చింది. 1927 సభకి డాక్టర్ అన్సారీ [1] అధ్యక్షత

1 అన్సారీ ఉపన్యాసంలో చెప్పిందల్లా ఇది : "రాజ్యాంగం తుది రూపం ఏదైనా కానివ్వండి. అది ఫెడరల్ పంథాలో, ప్రస్తుతం ఉన్న రాష్ట్రాలకి స్వయం ప్రతిపత్తి నిలుస్తూనే యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ ఇండియా అవుతుంది. దేశ రక్షణలో, విదేశీ వ్యవహారాల్లో ఉమ్మడి ప్రయోజనాలకోసం అన్నీ కలిసి ఉంటాయి.

వహించారు. ఆయన ఉపన్యాసంలో దీని సూచనైనా లేదు. ఆహ్వాన సంఘ అధ్యక్షులూ దీని గురించి యధాలాపంగా ప్రస్తావించేరు. అతి జరూరు విషయంగా కాకుండా, తప్పకపోతే చేపట్టే కార్యపథకంగా ప్రస్తావించేరు.

ఈ తీర్మానం గురించి ముందు ఆలోచించలేదు. అది ఏదో కుట్ర ఫలితం. ఆ కుట్ర మూడు కారణాల వల్ల నెగ్గింది.

కాంగ్రెస్‌లో పండిట్ మోతీలాల్ నెహ్రూకి, గాంధీకి వ్యతిరేకంగా ఓ విభాగం ఉండేది- ముఖ్యంగా మోతీలాల్‌కి. ఆ విభాగానికి శ్రీనివాస్ అయ్యంగార్ నేత. ఆయన మోతీలాల్ నెహ్రూకి రాజకీయ ప్రత్యర్థి. పండిట్ మోతీలాల్ నెహ్రూ, గాంధీజీల అధికారాన్ని, హోదాన్ని మట్టుపెట్టే పథకం కోసం వాళ్లు చూస్తున్నారు. ప్రజల్ని తమవేపు తిప్పుకోవాలంటే తీవ్రమైన స్థానాన్ని తీసుకోవాలనీ, తమ ప్రత్యర్థులు నిజంగా మితవాదులని చూపించాలనీ, మితవాదం అంటే కాంగ్రెస్ పాపం అని భావిస్తుందనీ వాళ్లకి తెలుసు. అందుకని ఈ పథకం నెగ్గుకొస్తుందని వాళ్లు భావించేరు. మోతీలాల్ నెహ్రూ, గాంధీజీలు అధినివేశ ప్రతిపత్తి వేపు ఉంటారని తెలిసే భారత ప్రజల గమ్యం స్వాతంత్ర్యం అని ముందుకు ఈ ప్రతిపాదనని తోశారు. ఇక రెండవ అంశం ఉంది. కాంగ్రెస్‌లో విఠల్‌బాయ్ పటేల్ నాయకత్వం కింద మరో విభాగం ఉంది. ఈ విభాగానికి ఐరిష్‌సిన్ ఫెయిన్ పార్టీతో సంబంధం ఉంది. భారతీయులు స్వాతంత్ర్యం తమ లక్ష్యమని ప్రకటించకపోతే ఐరిష్ సిన్‌ఫెయిన్ ఏ సహాయం చెయ్యడానికీ సుముఖంగా లేదు. అధినివేశ ప్రతిపత్తి నుంచి స్వాతంత్ర్యానికి లక్ష్యం మారేటట్టు చెయ్యాలని ఈ విభాగం వాళ్లు ఆత్రంగా ఉన్నారు. అలా అయితే వాళ్లకా సాయం వస్తుంది. ఈ రెండు కారణాలకీ మరో మూడవది జత అయింది. అది లార్డ్ బర్కెన్ హెడ్ చేసిన ఉపన్యాసం. ఆయన అప్పట్లో సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా. సైమన్ కమీషన్‌ని నియమించే సందర్భంలో ఒక రాజ్యాంగం తయారు చేసుకోలేని అసమర్థులు అని భారతీయుల్ని ఆయన ఎత్తి పొడిచేడు. ఆ ఉపన్యాసం భారత రాజకీయ నాయకులకి చెడ్డ అవమానకరంగా ఉండింది. ఈ మూడు కారణాల కలయిక వల్ల ఆ తీర్మానం నెగ్గింది. నిజానికి ఆ తీర్మానం, దేశం కాంక్షించే లక్ష్యానికి నిర్వచనంగా కంటే అధికంగా లార్డ్‌బర్కెన్ హెడ్‌కి గట్టిగా బుద్ధి చెప్పాలన్న ఉద్దేశ్యంతోనే జరిగింది.[2] గాంధీగాని, మోతీలాల్ నెహ్రూ గాని కిమ్మనాస్తిగా కూర్చున్నారంటే

1. ముతరంగ మొదలియార్ ఇలా చెప్పేరు. "పార్లమెంట్ గనక తన ప్రస్తుత నిర్లక్ష్య వైఖరిని కొనసాగిస్తే బ్రిటిష్ సామ్రాజ్యంతో తెగతెంపులు చేసుకునే ప్రచారం మనం ఖాయంగా ప్రారంభిస్తాం. భారత జాతీయతత్వాన్ని దృఢంగా చాటే అవసరం ఎప్పుడు వచ్చినాగానీ, భారత ఆకాంక్ష జాతీయత వైపే ఉంటుంది. స్వేచ్ఛా జాతీయతవైపు బ్రిటిష్ నామమాత్ర రాజరికపు పదఘట్టనలకి లొంగకుండా ఉంటుంది. ఈ విషయాన్ని గుర్తించడం బ్రిటిష్ రాజనీతిజ్ఞతకి ఉచితం. మనల్ని తెగింపు కార్యాచరణకి వాళ్లు తరమకుందురుగాక."ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్, 1927 వాల్యూం 11, పేజీ 356.

2. తీర్మానాన్ని సమర్థిస్తూ సాంబమూర్తి ఇలా అన్నారు : 'లార్డ్ బర్కెన్ హెడ్ సవాల్‌కి ఈ తీర్మానమే సరైన జవాబు" ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్, వాల్యూం 2, పేజి 381.

అందుకు కారణం లార్డ్ బర్కెన్ హెడ్ భారతీయులకి వ్యతిరేకంగా వాడిన మొరటు భాష రేపెట్టిన తుఫాన్ అనే చెప్పాలి. ఆయన వాడిన భాష ఎంత హద్దులు మీరిందంటే, ఆ తుఫాన్‌కి లొంగి ఊరుకోవడమే, దాన్ని వాదనలోకి దింపు తగ్గించడం కంటే తెలివైన పని అని వాళ్లు భావించేరు. మామూలుగా అయితే అలాంటి పనిని వాళ్లు నల్లేరుపై బండిలా చేసి ఉండేవాళ్లు.

ఈ తీర్మానం సిసలైన భారతీయ భావాల్ని వ్యక్తం చెయ్యడం లేదన్నది అనుమానానికి తావులేని విషయం. లేనట్లయితే రాజ్యాంగ నిర్మాణానికి అధినివేశ ప్రతిపత్తి పునాదిగా స్వీకరించి, మద్రాస్‌లో జరిగిన 1927 తీర్మానాన్ని తీసి అవతల పారేసి నెహ్రూ కమిటీ రిపోర్టు ఇవ్వడం సాధ్యపడదు. అంతేకాదు, ఆ తీర్మానం చెప్పినట్టు 1927లో నిజంగా, స్వాతంత్ర్యాన్ని[1] ఆమోదించి 1928లో కాంగ్రెస్ అధినివేశ ప్రతిపత్తిని ఎలా అంగీకరించిందో వివరించడమూ సాధ్యపడదు. 1929 డిసెంబరు 31 లోపున అధినివేశ ప్రతిపత్తిని ఇస్తే కాంగ్రెస్ అంగీకరిస్తుందనీ, లేకపోతే, అధినివేశ ప్రతిపత్తి నుంచి స్వాతంత్ర్యానికి తన పద్ధతి మార్చుకుంటుందనీ చెప్పే అధికరణాన్ని తీర్మానంలో చేర్చడం ఏదో మర్యాద దక్కించుకోవడం కోసం చేసిందే కాని అసలు మనసు మార్చుకొన్నదని అర్థం కాదు. ఏమంటే అలాంటి తీవ్ర ఆందోళనాభరిత విషయంలో దేశ రాజకీయ భవిత్యంగా కాలవ్యవధి అంతస్సారంగా ఎన్నడూ ఉండదు.

1927 తీర్మానం ఎలా ఉన్నా స్వాతంత్ర్యాన్నిగాక అధినివేశ ప్రతిపత్తినే కాంగ్రెస్ నమ్ముకుందని చెప్పడానికి తడవ తడవకీ గాంధీ చేసిన ప్రకటనలు సాక్ష్యంగా ఉన్నాయి. మరి కాంగ్రెస్‌కి దైవవాణి ఆయనే. 1929 నుంచీ గాంధీ చేస్తూ వున్న ప్రకటనల్ని చూసినవాళ్ళకి స్వాతంత్ర్య తీర్మానం ఆయనకి సంతోషం కలిగించలేదని తెలుస్తుంది. అప్పట్నుంచీ కాంగ్రెస్‌ని అధినివేశ ప్రతిపత్తి వేపే చక్రాన్ని నడిపించాల్సిన అవసరం కనిపించిందని వాటివల్ల తెలుస్తుంది. దాన్ని వ్యాఖ్యానించే సాధారణ ధోరణిలో ఆయన ఆరంభించేడు. లక్ష్యాన్ని స్వాతంత్ర్యం నుంచి మొదటగా స్వాతంత్ర్య తాత్పర్యానికి కుదించడం జరిగింది. స్వాతంత్ర్య తాత్పర్యం నుంచి దాన్ని సమాన భాగాస్వామ్యం నుంచి వెనకటి యధాస్థానానికి తీసికెళ్లడం జరిగింది. చక్రం ఒక చుట్టు తిరిగింది. ఎప్పుడు? ఇంగ్లీషు ప్రజలకి తెలియపరిచే నిమిత్తం శ్రీ పొల్లక్‌కి 1937లో గాంధీ ఈ ఉత్తరం ఇవ్వడం ద్వారా :

"1931లో రౌండు టేబిల్ సమావేశంలో నేను ప్రకటించిన అభిప్రాయానికే నేను ఇంకా కట్టుబడి ఉన్నానా అనేది మీ ప్రశ్న. అప్పుడు చెప్పనే చెప్పేను, మళ్లీ ఇపుడూ

1. తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ పండిట్ జవహర్‌లాల్ ఇలా అన్నారు. "కాంగ్రెస్ ఇవాళా పూర్తి స్వాతంత్ర్యం కోసం కట్టుబడి ఉందని ఇది చాటుతుంది. ఏమైనా అంతకు తక్కువ గమ్యంతో తృప్తి పడేవాళ్లకు కాంగ్రెస్ తలుపులు తెరిచే వుంచుతుంది."

చెపుతున్నాను. నా వరకైతే, వెస్ట్ మినిస్టర్ స్టాట్యూట్ నిబంధన మేరకి, అంటే, ఇష్టం పడితే ఉపసంహరించుకోవడానికి అంగీకరించే పక్షంలో, అధినివేశ ప్రతిపత్తిని ఇస్తే గనక నేను నిస్సంకోచంగా దాన్ని అంగీకరిస్తాను.[1]"

ఇక నెహ్రూ రిపోర్టు మీద ముస్లిం సంస్థల ప్రకటనలు చూస్తే, దాన్ని నిరాకరించడానికి వాళ్లు ముందు పెట్టిన కారణాలు ఆసక్తికారకంగా ఉంటాయి. ఈ కారణాలు బొత్తిగా ఎవళ్లూ ఊహించనటువంటివి. ముస్లింలీగ్‌లాంటి సంస్థలు ఆ రిపోర్టుని నిరాకరించడానికి కారణం ఉంది. అందుకు సందేహం లేదు. ఏమంటే ఆ నివేదిక ప్రత్యేక ఎలక్టోరేట్లని రద్దు చెయ్యాలని చెప్పింది. కాని ఖిలాఫత్ కాన్ఫరెన్స్‌గాని జమాయిత్ ఉల్ ఉలేమా గాని ఆ తీర్మానాన్ని తోసి రాజనడానికి అది కారణమే కాదు. ఈ రెండు సంస్థలూ కాంగ్రెస్‌తో పాటు సమంగా సహాయ నిరాకరణ, సివిల్ డిస్ ఒబీడియన్స్ ఉద్యమాల అగ్నిపరీక్షల్లో వెళ్లేయి. ఆ సంస్థల ప్రకటనలే ముస్లిం ప్రజా బాహుళ్య యదార్థ అభిప్రాయాన్ని వెల్లడి చేస్తాయి. దేశ రాజకీయ వ్యవహారాలకి సంబంధించి త్రికరణశుద్ధిగా ముస్లిం ప్రజాబాహుళ్య అభిప్రాయాలు ఎలా ఉన్నదీ మరే ఇతర ముస్లిం సంస్థ కన్నా బాగా ఈ సంస్థలు వ్యక్తం చేస్తాయి.

1928లో కలకత్తాలో జరిగిన ఆలిండియా ఖిలాఫత్ కాన్ఫరెన్స్‌కి మౌలానా మహమ్మద్ ఆలీ అధ్యక్షులు. తన అధ్యక్షోపన్యాసంలో నెహ్రూ రిపోర్ట్‌ని తిరస్కరించేందుకు కారణాల్ని ఆయన చెప్పేడు. ఆయన ఇలా అన్నారు[2] :

"(నేను) భారత జాతీయ కాంగ్రెస్ సభ్యుణ్ణి. దాని వర్కింగ్ కమిటీ సభ్యుణ్ణి. ఆలిండియా ముస్లింలీగ్ సభ్యుణ్ణి. (నేను) ఈనాటి ప్రముఖ రాజకీయ సమస్యల మీద నా అభిప్రాయాల్ని చెప్పడానికి ఖిలాఫత్ కాన్ఫరెన్స్‌కి వచ్చాను. ఆ సమస్యల గురించి ముస్లిమ్‌లు యావన్మందీ చాలా శ్రద్ధగా ఉండాలి.

★ ★ ★

"అఖిల రాజకీయ పక్ష సమావేశంలో పాల్గొంటూ, భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలనీ, ఈ విషయంలో మత భావన ఏదీ లేదనీ ఆయన అన్నారు. అయినా ఆయన ఉపన్యాసాన్ని అడుగడుక్కీ హేళన చేశారు, ప్రతిసారీ ఆయన ఉపన్యాసం ఆపేయాల్సి వచ్చింది."

★ ★ ★

1. టైమ్స్ ఆఫ్ ఇండియా 1.2.1937. దీని దృష్ట్యా, ఢిల్లీలో 1937 మార్చి 20న జరిగిన జాతీయ సమితి – ఆ సమితిలో నూతన రాజ్యాంగం ప్రకారం స్థానిక శాసనసభలకు ఎన్నికైన ప్రతినిధులు ఉన్నారు. స్వాతంత్ర్యానికి అనుకూలంగా చేసిన ప్రకటనకే ఏ ప్రాముఖ్యమూ లేదు. కాని క్విట్ ఇండియా ఉద్యమం ఆరంభించడంతో గాంధీజీ ఇప్పుడు స్వాతంత్ర్యానికి అనుకూలురని చెప్పవచ్చు.
2. ది ఇండియన్ క్వార్టర్లీ రివ్యూ, 1928, వాల్యూం II పేజీలు 402-403.

"నెహ్రూ రిపోర్టు తన ప్రస్తావనలో దాస్య శృంఖలాల విషయం అంగీకరించింది..... స్వాతంత్ర్యం, అధినివేశ ప్రతిపత్తి రెండూ రెండు ఎదురుబొదురు విషయాలు."

★ ★ ★

"మీ జాతీయ తత్వాన్ని గురించి గొప్పలు పోతూ, మత భావనల్ని ఖండిస్తున్నారే, ఏదీ ప్రపంచంలో ఇండియాలాంటి దేశాన్ని ఒకదాన్ని మా జాతీయ భారత్‌లాంటిదాన్ని ఒకదాన్ని చూపించండి."

★ ★ ★

"ప్రతిరోజూ తప్పుడు సిద్ధాంతాలతో, నీతి బాహ్యమైన ఊహలతో, దురభిప్రాయాల్తో మీ రాజ్యాంగంతో రాజీ పడుతున్నారా, కాని మీ మతవాదుల్తో – ప్రత్యేక ఎలక్టోరేట్లు, రిజర్వ్‌డ్ సీట్లు ఇచ్చి, రాజీ పడలేరా. మా జనాభా విభాగం 25 శాతం ఉంది అయినా అసెంబ్లీలో మాకు 33 శాతం ఇవ్వరు. మీరు ఒక యూదులాంటివారు, బనియాలాంటివారు. కాని ఇంగ్లీష్ వాళ్లకి మాత్రం అధినివేశ హోదానిస్తారు. ఆ సమావేశం నూటి పదబంధాల్తో ఓ చిన్న తీర్మానాన్ని ఆమోదించింది.

"సంపూర్ణ స్వాతంత్ర్యమే మా లక్ష్యమని ఈ సమావేశం మరోసారి ప్రకటిస్తోంది."

1931లో అలహాబాద్‌లో జరిగిన జమాయిత్ – ఉల్ – ఉలేమా సమావేశానికి మౌలానా హస్రత్ మొహాని అధ్యక్షుడు. నెహ్రూ రిపోర్టుని ఖండించడానికి ఆయన ఆచితూచి మాటలు వాడి – అయినా చీల్చి చెండాడంలో ఏ మాత్రం లొక్కు లేకుండా – కారణాలు చెప్పారు. ఆయన* ఇలా అన్నారు :

"భారత దేశానికి సంబంధించి నా రాజకీయ సిద్ధాంతం ఏమిటైందీ ప్రతివాళ్లకీ బాగా విశదమే. సంపూర్ణ స్వాతంత్ర్యానికి తక్కువ అయిందన్ని దేన్నీ నేను అంగీకరించను. అది కూడా అమెరికా సంయుక్త రాజ్యాల నమూనా మీదనో, సోవియట్ రష్యా నమూనా మీదనో ఉండాలి. ముఖ్యంగా 1) ప్రజాస్వామికంగా 2) ఫెడరల్‌గా 3) కేంద్రాపసారిగా ఉండాలి. అక్కడ ముస్లిం అల్ప సంఖ్యాక వర్గాల హక్కులకి రక్షణ ఉండాలి.

"ఢిల్లీ జమాయిత్-ఉల్-ఉలేమా కొంతకాలంగా సంపూర్ణ స్వాతంత్ర్యం మీదనే గట్టి పట్టుగా ఉంది. ముఖ్యంగా ఆ కారణం వల్లనే నెహ్రూ రిపోర్ట్‌ని తిరస్కరించింది. నెహ్రూ రిపోర్ట్ ఫెడరల్ స్వరూపానికి బదులు ఏక కేంద్రీయ (Unitary) రాజ్యాంగాన్ని రూపొందించడం అందుకు హేతువు. దీనికితోడు, లాహోర్ కాంగ్రెస్ సమావేశం తర్వాత, గాంధీజీ చొరవతో రావి నదీ తీరంలో నెహ్రూ రిపోర్టు భూస్థాపితమైందని ప్రకటించి, సంపూర్ణ స్వాతంత్ర్య

* ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్ 1931, వాల్యూం 2, పేజీలు 238-239.

తీర్మానం ఆమోదం కాగానే ఢిల్లీ జమాయిత్ కాంగ్రెస్‌తో సహకరించ సాహసించింది. దాని సివిల్ డిస్ ఒబీడియన్స్‌తో సహకరించింది. ఏమంటే స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడం, హిందువైనా ముస్లిం అయినా, ప్రతి భారతీయుడికీ కర్తవ్యం కాబట్టి.

"కాని దురదృష్టవశాత్తూ గాంధీజీ ఆ తర్వాత కొంతకాలానికే మాట మార్చేడు. జైల్లో ఉండగానే స్లోకాంబ్ అనే బ్రిటిష్ జర్నలిస్ట్‌తో 1) స్వాతంత్ర్యం అంటే తన అభిప్రాయంలో స్వాతంత్ర్య తాత్పర్యమేనని చెప్పేడు. 2) దానికితోడు, సర్దుబాటుకి సుముఖత ప్రదర్శించడం వల్ల విడుదల అయి వచ్చే, 'పూర్ణ స్వారాజ్' అనే మిధ్యా పద బంధాన్ని కనిపెట్టేడు. సంపూర్ణ స్వాతంత్ర్యం బదులు వచ్చిందీ పదం. 'పూర్ణ స్వరాజ్'లో బ్రిటిష్ వాళ్లతో సంబంధాల్ని తెగతెంపులు చేసుకోవడం ఉండదని బహిరంగంగా ప్రకటించేడు. 3) లార్డ్ ఇర్విన్‌తో రహస్య ఒప్పందం కుదుర్చుకోవడం ద్వారా ఆయన ఖాయంగా బ్రిటిష్ రాజరికంలో అధినివేశ ప్రతిపత్తి గమ్యాన్ని అనుసరించేరు.

"గాంధీజీ ఇలా రకం తిప్పినప్పుడే ఢిల్లీ జమాయితీ గాంధీజీని, నెహ్రూ రిపోర్ట్ లాంటి దాన్ని గుడ్డిగా బలపర్చకుండా అడ్డుకొని ఉండాల్సింది. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఫార్ములాని కూడా త్రోసిరాజని ఉండాల్సింది. బొంబాయిలో నెహ్రూ రిపోర్టు ద్వారా దానికి ప్రాణ ప్రతిష్ట జరిపేందుకు చూశారు.

"పూర్ణ స్వరాజ్" అంటే సంపూర్ణ స్వాతంత్ర్యం కాదు. 'సంపూర్ణ స్వాతంత్ర్యం కంటే కూడా ఇంకా అధమమైందే అని అర్థం. ఈ విషయం తెలిసినా కూడా ఢిల్లీ జమాయితీ-ఉల్-ఉలేమాని ఏ అజ్ఞాత కారణాలు తమ ఆదర్శంగా 'పూర్ణ స్వరాజ్'ని ఆమోదించేటట్లు చేశాయో మనకి తెలియదు. ఈ ఆమోదానికి ఒక వివరణ మాత్రం చెపుతున్నారు. అదేమిటట? గాంధీజీ అధినివేశ ప్రతిపత్తిని ఒప్పుకున్నాగానీ భారతీయులకి బ్రిటిష్ సామ్రాజ్యం నుంచి విడిపోయే హక్కు ఉండాలని నొక్కినొక్కి చెప్పేరట.

"ఈ ఒత్తి చెప్పడానికి లోగడ చేసిన సంపూర్ణ స్వాతంత్ర్యం ప్రకటనల కంటే ఎక్కువ విలువ లేదన్నది స్పష్టం. ఇంకోలా చెప్పాలంటే గాంధీజీ సంపూర్ణ స్వాతంత్రం మీద పట్టుబట్టింది బ్రిటిష్ ప్రభుత్వాన్ని అధినివేశ ప్రతిపత్తికి అంగీకరించేట్టు చేసే లక్ష్యంతోనే. ఆయన అలా చేసినట్టే కాంగ్రెస్ నాయకులు కూడా విడిపోయే హక్కు గురించి పట్టుబట్టేరు. బ్రిటిష్ వాళ్ల నుంచి సాధ్యమైనన్ని ఎక్కువ హక్కులు గుంజడానికి అలా చేసేరు. బ్రిటిష్ వాళ్లయినా మరీ అసంతృప్తి కలిగించేటట్టు ప్రవర్తించరు, ఓ పరిమితి అంటూ ఉంటుంది కదా."

"నేను చేస్తున్న ఈ వాదన అనుమానపూరితమైందనీ అవసరం పడితే కాంగ్రెస్‌వాళ్లు సామ్రాజ్యం నుంచి వేర్పాటుని తప్పకుండా ప్రకటిస్తారనీ వాదిస్తారనుకోండి. ఇప్పుడు చెప్పండి, బ్రిటిష్ వాళ్లతో సంబంధం తెంపుకున్నాక భారత ప్రభుత్వ రూపం ఎలా

ఉండేదీనీ? ఓ నియంతృత్వ రూపం అనిగాని, ఓ ప్రజాస్వామిక రూపం అనిగాని ఉంటుందని ఎవళ్లూ ఊహించలేరు. ఇది విశదం. అది కేంద్రీయమైనా, మధ్యాభిగామి ఫెడరల్ అయినా హిందూ రాజ్యంగా ఉంటుందే తప్ప మరోలా ఉండదు. అలాంటి దాన్ని ముసల్మాన్లు ఏ పరిస్థితుల్లోనూ అంగీకరించరు. ఇక ఇపుడు మిగిలేది ఒక్క రూపమే. అంటే, బ్రిటిష్ వాళ్లు సంపూర్తిగా భారత్‌తో తెంచుకుని వెళ్లిపోయేక భారతదేశంలో స్వయంపాలిత ప్రాంతాలతోనూ, రాష్ట్రాలతోనూ ఒక ఏకీకృత మధ్యస్థలావగర్షిత ప్రజాస్వామిక ప్రభుత్వం అమెరికా సంయుక్త రాష్ట్రాల మాదిరీ, సోవియట్ రష్యా మాదిరీ ఏర్పడుతుంది. అయితే అలాంటిది హిందూ మహా సభ వాదులైన కాంగ్రెస్ వాళ్లకీ, బ్రిటిష్ ప్రియులైన మహాత్మాగాంధీ లాంటివాళ్లకీ జుట్టు పీక్కున్నా ఆమోదయోగ్యం కాదు.

"ఆ రకంగా ఢిల్లీ జమియాత్-ఉల్-ఉలేమా సంపూర్ణ స్వాతంత్ర్యంతో చేతులు కడుక్కుని వెర్రిమొగం వేసింది. కాని దేవుడి దయవల్ల కాన్పూరు, లక్నో, బదౌనీ మొదలైన ప్రాంతాల ఉలేమాలు ఇంకా తమ మాదిరి గట్టిగా నిలబడి వున్నాయి, దేవుడి దయ ఉంటే అలానే ఉంటాయి కూడా. ఈ అత్యున్నత ఆదర్శానికి వ్యతిరేకంగా కొంతమంది దుర్బలులు ప్రోద్బలం చేస్తూ ఉంటారు, ప్రస్తుతంలో దాన్ని సాధించడం వల్ల పడేట్టు లేదు. అంచేత దాన్ని గురించి మాట్లాడ్డం లాభం లేదు అంటారు. వాళ్లకి చెపుతున్నాం అది లాభం లేకపోవడమే కాదు, కాదు, ఎంతో అవసరం అని. ఏమంటే అత్యున్నత ఆదర్శాన్ని ముందర పెట్టుకోకపోతే దాన్ని మరిచిపోవచ్చు.

"అంచేత మనం అధినివేశ ప్రతిపత్తిని అన్నివిధాలా వ్యతిరేకించాలి. ఏమంటే ఇదేమీ సగం నీడకోరే ఇల్లులాంటిదీ కాదు, పరమలక్ష్యంలో భాగమూ కాదు. ఇంకా చెప్తే ఆహర లక్ష్యాన్ని నాస్తీకరించేది, ప్రతిద్వంద్విగా ఉండేది. గాంధీజీ ఇంగ్లండ్ వెళ్లి భారత్‌కి ఏదోరకమైన అధినివేశ ప్రతిపత్తిని, హామీలతోనే హామీలు లేకుండానే పొంది, రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్ ముగిసిందనుకోండి సంపూర్ణ స్వాతంత్ర్యం అనే భావన ఆమూలం హరించుకుపోతుంది. కనీసం, చాలాకాలం పాటు దీన్ని గురించి అనుకోకుండా మరుగున పడిపోతుంది."

ఆలిండియా ఖిలాఫత్ కాన్ఫరెన్స్, జమాయిత్ ఉల్ ఉలేమాలు తీవ్రవాద సంస్థలు, సందేహం లేదు. పరమ బ్రిటిష్ వ్యతిరేక సంస్థలు. అయితే ఆలిండియా ముస్లిం కాన్ఫరెన్స్ అతివాదుల సంస్థకానేకాదు, బ్రిటిష్ వ్యతిరేక ముసల్మాన్ల సంస్థా కాదు. అయినా దాని యు.పి. శాఖ 1928 నవంబర్లో కాన్పూరు సమావేశంలో ఈ కింది తీర్మానాన్ని ఆమోదించింది.

"అఖిలపక్ష యు.పి. ముస్లిం కాన్ఫరెన్స్ అభిప్రాయం ప్రకారం భారత ముసల్మాన్లు సంపూర్ణ స్వాతంత్ర్య గమ్యం కోసం నిలబడతారు. సంపూర్ణ స్వాతంత్ర్యం ఫెడరల్ రిపబ్లిక్ రూపాన్నే విధిగా తీసుకుంటుంది."

ఈ తీర్మాన ప్రతిపాదకుని అభిప్రాయంలో ఇస్లాం సర్వదా స్వేచ్ఛనే బోధించింది.

ఆ విషయానికి వస్తే భారతదేశ ముస్లిమ్‌లు సంపూర్ణ స్వాతంత్ర్యానికి ఎదురు నిలిస్తే తమ మత కర్తవ్యానికి ద్రోహం చేసిన వాళ్లవుతున్నారన్న మాట. భారతీయ ముస్లింలు పేదలే కావచ్చు, కాని భూమ్మీద ఎవళ్లూ కానంతగా ఇస్లాం భక్తికి వాళ్లు అంకితమయ్యేరు అని వక్త అన్నాడు.

ఈ సమావేశంలో విషయ నిర్ణాయక కమిటీలోదే ఆసక్తికరమైన సంఘటన[1] జరిగింది. మౌలానా అజాద్ శొభాని ఆ సమావేశం సంపూర్ణ స్వాతంత్ర్యానికి అనుకూలంగా ప్రకటించుకోవాలని ప్రతిపాదించినప్పుడు అది జరిగింది.

ఖాన్ బహాదూర్ మసూదుల్ హసన్, ఇంకా మరికొందరు, అలాంటి ప్రకటనకి అభ్యంతరం తెలియజేశారు. వాళ్ల అభిప్రాయంలో అది ముసల్మాన్ల ప్రయోజనాలకి వ్యతిరేకం. దాని మీద చాలామంది మహిళలు, పర్దా గేలరీ నుంచి, అధ్యక్షుడికి ఓ లిఖిత ప్రకటనని పంపేరు. మగవాళ్లకి సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం నిలబడే దమ్ము లేకపోతే, మహిళలు పర్దా తొలగించి ముందుకు వస్తారనీ, స్వాతంత్ర్య పోరాటంలో పాలు పంచుకుంటారనీ రాశారు.

★ ★ ★

మహోన్నత భవితవ్యం గురించిన భిన్నాభిప్రాయాలు ఎలా ఉన్నా, హిందువుల్ని ముస్లింలని ఒకే దేశంలో, ఒకే ప్రజగా, ఏక రాజ్యాంగ రాజకీయ బంధనాలతో కట్టివేసి బతికేట్టు చేసే ప్రయత్నం ఒకటి జరిగింది. ఇది సాధ్యపడిందనే అనుకుందాం, ఏదోరకంగా ముసల్మాన్లని ఇందులోకి లాగేరని అనుకుందాం. ఆ రాజ్యాంగం విచ్ఛిన్నం కాదన్న హామీ ఏం ఉంది?

పార్లమెంటరీ ప్రభుత్వం విజయవంతంగా పని చెయ్యడానికి కొన్ని పరిస్థితులు ఉండాలి. ఆ పరిస్థితులున్నప్పుడే ఆ పార్లమెంటరీ ప్రభుత్వం వేళ్లు పాతుకుంటుంది. అలాంటి ఒకదాన్ని స్వర్గీయ లార్డ్ బాల్‌ఫోర్ ఎత్తి చూపించేరు. తన మేనకోడలు బాన్షె దుగ్దాలెతో ముచ్చటిస్తూ, 1925లో ఆరబ్ ప్రజల రాజకీయ భవితవ్యం గురించి చర్చించే సందర్భంలో ఈ విషయం ప్రస్తావించారు.

అప్పుడు ఆయన ఇలా అన్నారు[2] :

"ఇది ఓ రకంగా బ్రిటిష్ దేశం చేసిన తప్పు – అమెరికన్లదీనీ; వాళ్లని కూడా తప్పు పట్టకుండా ఉండలేం. అసలు బాలూ మూలం ఏమిటో తెలియకుండా వున్న వాళ్ల చేతుల్లో ప్రాతినిధ్య ప్రభుత్వాన్ని పెట్టడం. దీన్ని వివరించడం కష్టం. ఆంగ్లో శాక్సన్ జాతులకి వివరించడం చేతకాదు. పైగా మనకి దాన్ని గురించి ఎంత బాగా తెలుసునంటే దీన్ని వివరించాల్సిన అవసరం వుందికదా అని మనకి తట్టనే తట్టదు. బ్రిటిష్ పార్లమెంటరీ ప్రభుత్వ

1 ఇండియన్ క్వార్టర్లీ రిజిష్టరు, 1928, వాల్యూం 2, పేజీ 425.

2. దుగ్గాలె : బాలెఫోర్ హచిన్సన్, వాల్యూం 2, పేజీలు 363-364

భావనసారం యావత్తూ 'పనిచేసేటట్టు దాన్ని చెయ్యడం' అనే ఉద్దేశంలోనే ఉంది. ఈ విషయం బ్రిటిష్ రాజ్యాంగం గురించి రాసిన ఏ గ్రంథంలోనేనా కనిపిస్తుందంటావా? అదేదో అలా సాగిపోయేదేనని మనం అనుకుంటాం. దాని మీదనే ఆధారపడ్డ వ్యవస్థని విస్తరించుకుందుకు మనం వందల ఏళ్లు శ్రమించాం. అది మనలో ఎంత గాఢంగా పాదుకొందంటే మనం దాన్ని గురించి మరిచేపోయేం. కాని ఇది ఇతరులకి అంత విశదంగా ఉండదు. వీళ్లు – అంటే ఇండియన్లు ఈజిప్షియన్లు, మొదలైన వాళ్లు – మనం నేర్చుకున్న దాన్ని అధ్యయనం చేస్తారు. వాళ్లు మన చరిత్రని, మన తత్వశాస్త్రాన్ని మన రాజకీయాల్ని చదువుతారు. మన పార్లమెంటరీ ఆటంక పద్ధతుల గురించి తెలుసుకుంటారు. కాని దానివల్ల విషయాని కొచ్చేటప్పటికి ఏం తేలుతుందో ఎవళ్ళకి ఎవళ్లూ చెప్పరు. మన పార్లమెంటరీ పార్టీలన్నీ యంత్రం ఆగకూడదన్న నిర్ణయంతోనే ఉంటాయి. డ్యూక్ ఆఫ్ వెల్లింగ్టన్ చెప్పినట్టు 'రాజుగారి ప్రభుత్వం సాగుతూ ఉండాల్సిందే.' కాని వాళ్ల భావన ఏమిటంటే యంత్రాన్ని ఆపు చెయ్యడమే ప్రతిపక్షం చేసే పని అని. ఏదీ సునాయాసం కాదు, కాని ఏం లాభం లేదు."

ఇంగ్లండ్‌లో ప్రతిపక్షం యంత్రాన్ని ఆపుచేసే దాకా ఎందుకుపోదు అని అడిగిందానికి ఆయన చెప్పాడు :

"మన యావత్ రాజకీయ యంత్రాంగంలోనూ ఒక ప్రజ ఉంది.... మౌలికంగా ఒక దానికోసమే."

పార్లమెంటరీ ప్రభుత్వం విజయవంతంగా పని చెయ్యడానికి అవసరమైన పరిస్థితుల గురించి బాల్‌ఫోర్ చెప్పిన అభిప్రాయాల్ని లాస్కీ బాగా క్రోడీకరించేడు. ఆయన ఇలా అన్నాడు* :

"పార్లమెంటరీ ప్రభుత్వ బలం, దాని మౌలిక లక్ష్యాల గురించి రాజకీయ పార్టీలలో ఉన్న ఐక్యంతో కొలవచ్చు."

ప్రాతినిధ్య ప్రభుత్వ యంత్రాంగం విజయవంతంగా నడవడానికి అవసరమైన పరిస్థితుల గురించి చెప్పేక, ఈ పరిస్థితులు భారతదేశంలో ఉన్నాయో లేవో చూడడం బాగుంటుంది.

ప్రాతినిధ్య ప్రభుత్వం పని చేసేటట్టు చూసే ఉద్దేశ్యం హిందువుల్లోనూ ముస్లింలలోనూ ఏ మేరకి ఉందని చెప్పగలం? ప్రాతినిధ్య ప్రభుత్వం వ్యర్థం, పని చెయ్యలేదు అని రుజువు చెయ్యడానికి ఏ ఒక్క పక్షం ప్రభుత్వ యంత్రాంగాన్ని ఆపుచేసే ఉద్దేశం ప్రదర్శించినా చాలు కదా. అలాంటి ఉద్దేశ్యమే సరిపోతే అది ముస్లిమ్‌లలో ఉన్నా, హిందువులలో ఉన్నా ఒకటే. హిందువుల కంటే ముస్లింలు మరింత దాపరికం లేకుండా బయటపడతారు కాబట్టి వాళ్ల

* పార్లమెంటరీ గవర్నమెంట్ ఇన్ ఇంగ్లండ్ పేజి 37.

మనస్తత్వం తెలుసుకోవడం సులభం. వాళ్ల మనసు ఎలా ఉంటుంది? ఏం అంశాలు వాళ్ల మనసుల్ని లొంగదీస్తాయి? అనే అంశాలు ముస్లిం రాజకీయాల మీద పట్టు ఉన్న ఇస్లాం మత మౌలిక సూత్రాలని బట్టి స్పష్టమవుతుంది. ప్రముఖ ముస్లిం నాయకులు భారత ప్రభుత్వం పట్ల ముస్లిం వైఖరి ఎలా ఉండేదీ చాటే అభిప్రాయాల్ని బట్టి స్పష్టమవుతుంది. ఆ మత సూత్రాల్ని కొన్నింటిని ముస్లిం నాయకుల అభిప్రాయాల్నికొన్నింట్ని, నిష్పక్షపాతంగా విషయాల్ని అవలోకించగల వాళ్ల సౌకర్యం కోసం కింద ఇస్తున్నాం. బాల్‌ఫోర్ ప్రతిపాదించిన పరిస్థితులు భారతదేశంలో ఉన్నాయో లేవో దాన్నిబట్టి నిర్ణయించుకోవచ్చు.

ముస్లిం నిబంధనల్లో గమనించదగ్గ ఓ నిబంధన ఇస్లాం మతానికి చెందింది. ముస్లిం పాలన కింద లేని దేశంలో ముస్లిం ధర్మానికీ ఆదేశ న్యాయానికీ మధ్య సంఘర్షణ వచ్చినట్లయితే ముస్లిం న్యాయమే పై చెయ్యితో ఉండాలి. ముస్లిం ఎవరేనా ముస్లిం న్యాయాన్ని విధేయంగా అనుసరించి, తాము ఉన్న దేశపు న్యాయాన్ని ధిక్కరించడమే ధర్మం.

అలాంటి సందర్భాల్లో ముసల్మాన్ కర్తవ్యం ఏమిటైందీ మౌలానా మహమ్మద్ ఆలీ బాగా సూచించేరు. కరాచీ మేజిస్ట్రేట్ ముందర 1921లో చేసిన ప్రకటనలో అది వెల్లడైంది. ఆయన మీద ప్రభుత్వం నేరారోపణ ఏదో చేసి విచారణకి పంపింది. అప్పుడు ఆయన ఆ ప్రకటన చేశారు. ఆలిండియా ఖిలాఫత్ కాన్ఫరెన్స్ 1921 జూలై 8న కరాచీలో జరిగింది. దానికి మహమ్మద్ ఆలీ అధ్యక్షత వహించి చర్చనీయాంశంగా ఉన్న తీర్మానాన్ని ప్రవేశపెట్టేడు. దాన్ని ఆమోదించేరు. ఆ తీర్మానం గురించి ప్రాసిక్యూషన్ ఆరోపణలు వచ్చాయి.

ఆ తీర్మానం ఇదీ :

"ప్రస్తుత సమయంలో బ్రిటిష్ సైన్యంలో కొనసాగడం గాని, సైన్యంలో చేరడం గాని, ఇతరుల్ని సైన్యంలో చేరమని ప్రేరేపించడంగాని ముసల్మాన్‌కి సంబంధించి అధర్మం అని ఈ సమావేశం చాటుతోంది. సైన్యంలో వున్న ప్రతి ముస్లిమ్‌కీ అర్థం అయ్యేట్టుగా ఈ మతపర ఆదేశాల్ని తీసికెళ్లడం సామాన్యంగా యావన్మంది ముసల్మాన్లకీ, ప్రత్యేకం ఉలేమాలకీ వర్తించే కర్తవ్యం."

మౌలానా మహ్మమద్ ఆలీతోబాటుగా మరో ఆరుగురి* మీదా అధికరణం 120-బి, అధికరణం 131, భారత శిక్షాస్మృతి ప్రకారం 114 అధికరణం కింద 505 నిబంధన మేరకి, 117 భారత శిక్షాస్మృతి కింద 505 నియమం ప్రకారం ప్రాసిక్యూషన్ ఆరోపణ చేశారు. తను దోషిని కానని మహమ్మద్ ఆలీ చేసిన సమర్థన ప్రకటన ఇదీ :

"ఈ ప్రాసిక్యూషన్‌కి ఇంతా చేసి అర్థం ఏమిటి? భారతదేశంలో ఉన్న ముసల్మాన్లం,

* వాళ్లలో శారదాపీఠం అధిపతి శంకరాచార్య ఉండడం చిత్రం.

హిందువులం ఎవరి విశ్వాసాల మేరకి నడుచుకోవాలి? నేను ముసల్మాన్‌గా ఋజుమార్గం తప్పి వర్తిస్తే నన్ను తప్పు పట్టడం పవిత్ర కొరాన్ మేరకిగాని, ఆఖరి ప్రవక్త అధికారయుత సంప్రదాయం మేరకి గాని – ఆయనకి భగవంతుని ఆశీస్సు, శాంతి ఉండుగాక – భూతవర్తమాన కాలాల మత అధినివేశాల మేరకిగాని జరగాలి. ఈ వాక్కులు ఇస్లాం మత మౌలిక అధికారం కిందకి వచ్చేవి. సైతాన్ ప్రభుత్వం అని పిలవడానికి అంగీకరించని ఈ ప్రభుత్వం నన్ను ప్రాసిక్యూట్ చేసే ఈ సందర్భంలో నేను చేసిన కచ్చితమైన పనికి ఆ మత గ్రంథాలే తీర్పు చెప్పాలి."

"ఆ పవిత్ర గ్రంథాల నిర్దేశాన్ని నేను ఉపేక్షించినట్లయితే, అది నా ఉపేక్ష వల్ల ఘోరమైన పాపం అవుతుంది. కాని నా ఉపేక్ష వల్ల అది నేరం కాకపోతే, ఈ దేశంలో నాకు భద్రత ఉందని నేనెలా భావించాలి?

నేను పాపినైనా కావాలి, దోషినైనా కావాలి... ఇస్లాం ఒక సార్వభౌమత్వాన్నే శిరోధార్యంగా చూస్తుంది. అది భగవంతుని సార్వభౌమత్వం. అది పరమోత్కృష్టం, నిర్నిబంధం, అవిభాజ్యం, పరాధీనం కావించలేనిదీ....



ముసల్మాన్ పౌరుడు కావచ్చు, సైనికుడు కావచ్చు, ముస్లిం పాలనలో ఉండవచ్చు, ముస్లిమేతర పాలనలో ఉండవచ్చు. అతని విధేయతని శాసించేది కొరాన్ మాత్రమే, దేవుడు మాత్రమే, ప్రవక్త మాత్రమే. ముస్లిం అధికారం అయితే గనక ప్రవక్తల్లో ముఖ్యమైన మార్గానుసారిగా ఉండాల్సింది ప్రవక్త అనుయాయుడు గాని, విశ్వాస అధిపతిగాని.... ఏకతా సిద్ధాంతం అనేది శుష్క పండితులు వివరించే గణిత శాస్త్ర సూత్రం కాదు. విద్యావంతుడైనా, అవిద్యావాడైనా ప్రతి ముసల్మాన్‌కి నిత్య జీవిత చోదకంగా ఉండేది అది. ముసల్మాన్లు ఇంతకు ముందూ వేరేచోట కూడా ముస్లిమేతర పాలనల కింద శాంతియుత, విధేయపౌరులుగా బతికేరు. అన్నిచోట్లా సర్వదా ఉన్న అవక్ర నియమం ఏమిటంటే, "సర్వం సహాధిపతి' అయిన పవిత్ర కొరాన్‌లో స్పష్టంగా వ్యక్తమైన ఆదేశాలకి అవిధేయంగా ఉండని శాసనాల్లాంటివాటిని లౌకిక పాలకులు జారి చేస్తేనే అనుసరించడం, లేకపోతే లేదు. విధేయత విషయంలో ఇలాంటి స్పష్టమైన అనుల్లంఘనీయమైన పరిమితుల్ని విధించింది ముస్లిమేతర పాలనకి సంబంధించి మాత్రమే కాదు. తద్భిన్నంగా అవి విశ్వవ్యాప్తంగా వర్తిస్తాయి. ఏ సందర్భంలోనూ వాటిని విస్మృత పరచడానికీ లేదు, కుదించడానికీ లేదు."

స్థిరమైన ప్రభుత్వాన్ని కాంక్షించే ఎవళ్ళకేనా ఇది బెదురు పుట్టించి తీరుతుంది. ఓ ముస్లింకి ఓ దేశం మాతృదేశమైనా, కాకపోయినా ముస్లిం నిర్దేశిత మత నియమాలకి పట్టదు.

ముస్లిం మతధర్మం ప్రకారం లోకం రెండుగా విభజితమైంది. ఒకటి దార్–ఉల్–ఇస్లాం

(ఇస్లాం ఆవాసం), రెండవది దార్-ఉల్-హర్బ్ (యుద్ధ ఆవాసం). ముస్లింలు పాలిస్తూ ఉంటే ఆ దేశం దార్-ఉల్-ఇస్లాం. ముస్లింలు కాపరం మాత్రమే ఉండి, ఆ ప్రాంత పాలకులుగా లేకపోతే అది దార్-ఉల్-హర్బ్, ముస్లిం మతధర్మం అది కాబట్టి భారతదేశం హిందువులకీ, ముస్లింలకీ కలిపి మాతృదేశంగా ఉండలేదు. దీన్ని ముసల్మాన్ల దేశం అని పిలవచ్చు. కాని దీన్ని 'హిందువులు, ముస్లింలు సమాన హోదాతో జీవిస్తున్న దేశం' అని అనలేరు. అంతేకాదు, ముస్లింలు పాలిస్తూ వుంటేనే ఇది ముసల్మాన్ దేశం అవుతుంది. ముస్లిమేతర అధికారం కిందికి వెళ్లిన మరుక్షణం, అది ముస్లిం దేశం కాకుండా పోతుంది. దార్-ఉల్-ఇస్లాం అవడానికి బదులు దార్-ఉల్-హబ్ అవుతుంది.

ఇదేదో శుష్క చర్చకి చెందిన విసయం అనుకోకూడదు. ఏమంటే ముస్లిం ప్రయోజనాల్ని ప్రభావితం చెయ్యగల బలమైన శక్తి దీనికి ఉంది. బ్రిటిష్ వాళ్లు భారతదేశాన్ని ఆక్రమించుకున్నప్పుడు ఇది ముస్లింల నడవడికని ప్రభావితం చేసింది. అదే బ్రిటిష్ వాళ్ల ఆక్రమణ వల్ల హిందువుకి ఏ అనుతాపం కలగలేదు. కాని ముస్లిమ్‌లకైతే భారతదేశం ఇకపైన ముస్లింలకి వాసయోగ్యమైందేనా అన్న సమస్య ఎదురైంది. ముస్లిం మతస్థుల్లో విచికిత్స మొదలైంది. ఆ చర్చ అర్థ శతాబ్దంపాటు సాగిందని డా. టైటస్ అన్నాడు. భారతదేశం దార్-ఉల్-హర్బ్ అవుతుందా, దార్-ఉల్-ఇస్లాం అవుతుందా అన్న చర్చతో సయ్యద్ అహ్మద్ నాయకత్వం కొంతమంది ఆవేశపరులు నిజంగానే పవిత్ర యుద్ధం ప్రకటించేరు. దేశం వదిలి వెళ్లిపోవాలని (హిజరత్), ముస్లిం పాలితప్రాంతాలకి వెళ్లాలని ప్రచారం చేశారు. యావద్భారతంలోనూ దాన్ని కొనసాగించేరు.

ముస్లిం పాలన కింద లేనంతమాత్రాన బ్రిటిష్ అధిపత్యంలోని భారతదేశాన్ని దార్-ఉల్-హర్బ్ అనకూడదని భారత ముసల్మాన్ని ఒప్పించడానికి, ఆలీఘర్ ఉద్యమ వ్యవస్థాపకుడైన సర్ సయ్యద్ అహ్మద్ తన యుక్తినంతా ఒడ్డాల్సి వచ్చింది. దీన్ని దార్-ఉల్-ఇస్లాంగానే పరిగణించమని ఆయన ముస్లింలని అర్థించాడు. ఏమంటే తమ మౌలిక మత కర్మకాండల్నీ, మతవిధుల్నీ నిర్వర్తించుకుందుకు కావలసినంత స్వేచ్ఛ ఉందని ఆయన బోధించాడు. తాత్కాలికంగా 'హిజరత్' ఉద్యమం చల్లారింది. కానైతే భారతదేశం దార్-ఉల్-హర్బ్ అన్న సిద్ధాంతాన్ని మాత్రం త్యజించలేదు. దాన్ని ముస్లిం భక్తులు 1920-21 కాలంలో, ఖిలాఫత్ ఉద్యమం సాగేరోజుల్లో, మళ్లీ మొదలుపెట్టేరు. ఆ ఉద్యమానికి ముస్లిం ప్రజాబాహుళ్యం నుంచి ప్రతిస్పందన లేకపోలేదు. ముస్లిం మత ధర్మానుగుణంగా నడుచుకునేందుకు సంసిద్ధంగా ఉన్నామని కొంతమంది ధార్మిక ముస్లింలు అనడమే కాదు, యదార్థానికి భారతదేశంలో ఉన్న తమ ఇళ్లని వదిలిపెట్టి, ఆఫ్ఘనిస్తాన్‌కి వెళ్లిపోయేరు.

దార్-ఉల్-హర్బ్‌లో ఉన్నామనుకున్న ముస్లింలకి దాన్ని తప్పించుకుందుకు "హిజరత్" ఒక్కటే కాదు మార్గం. ముస్లిం ధార్మిక అనుశాసనాల్లో 'జిహాద్' (పవిత్ర యుద్ధం) అనే

ఇంకోటి ఉంది. దానివల్ల "యావత్ప్రపంచమూ తన అధీనంలోకి వచ్చేవరకూ ఇస్లాం పరిపాలనని విస్తరించుకుంటూ వెళ్లవలసిన బాధ్యత ముస్లిమ్ పాలకుడిపై ఉంది. ప్రపంచం దార్-ఉల్-హర్బ్ నుంచి దార్-ఉల్-ఇస్లాంకి, శక్తి ఉంటేగనక మార్చాల్సిన బాధ్యత, సాంకేతికంగా, ముస్లిం పాలకులందరిదీని. భారతదేశంలోని ముస్లింలు 'హిజరత్'ని పునః స్థాపించిన సందర్భాలున్నట్టే 'జిహాద్'ని ప్రకటించడానికీ వాళ్లు జంకలేదు. కుతూహలం గల వాళ్లు 1857 తిరుగుబాటు చరిత్రను చూడవచ్చు. చూస్తే గనక, పాక్షికంగా ముస్లింలు బ్రిటిష్ వాళ్లకి వ్యతిరేకంగా చాటిన 'జిహాద్' అనే తెలుస్తుంది. ముస్లింవరకైతే అది సర్ సయ్యద్ అహ్మద్ ఊపిరి ఊదుతూ ఉన్న తిరుగుబాటు ప్రకోపం అనే చెప్పాలి. బ్రిటిష్‌వాళ్లు ఆక్రమించుకుని ఉన్నందువల్ల దేశం దార్-ఉల్-హర్బ్ అయిపోయిందని కొన్ని దశాబ్దాలుగా ఆయన ముస్లింలకి బోధిస్తూనే ఉన్నాడు. భారతదేశాన్ని దార్-ఉల్-ఇస్లాంగా పరివర్తన చెందించేందుకు ముస్లింలు చేసిన యత్నమే ఆ తిరుగుబాటు. ఇంకా ఇటీవలి కాలానికి వస్తే 1919లో ఆఫ్ఘనిస్తాన్ భారతదేశం మీద దాడి చేసే సందర్భం ఉంది. దాన్ని భారతదేశంలో ఉన్న ముస్లింలే తెరవెనక నుంచి నడిపించేరు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా వున్న ఖిలాఫతీయులు దాన్ని నడిపించేరు. భారతదేశ విమోచన కోసం వాళ్లు ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వాన్ని సాయం అర్థించేరు. ఆ దండయాత్ర వల్ల భారత్‌కి విమోచనం జరిగేదో, లేక బానిసత్వంలో ఉండేదో చెప్పడం సాధ్యం కాదు. ఏమంటే ఆ దాడి క్రియకి రాలేదు. ఇదెలా ఉన్నా, ఒకటి మాత్రం మిగిలే ఉంది. భారతదేశం సంపూర్తిగా ముస్లిం ఏలుబడిలో లేనందువల్ల దార్-ఉల్-హర్బ్‌గా ఉంటుంది. ముస్లిం ధర్మశాస్త్ర నియమాల ప్రకారం ముసల్మాన్లు 'జిహాద్' ప్రకటించడం న్యాయమే.

'జిహాద్' చాటడమే కాదు, దాన్ని విజయవంతం చేసేందుకు విదేశీసాయాన్ని కూడా అర్థించవచ్చు. అలాకాక ఆ విదేశీ ముస్లిం పాలకులు 'జిహాద్' ప్రకటిస్తే, ఆ ప్రయత్నం సఫలమయేట్టు దోహదపడచ్చు. ఈ విషయాన్ని సెషన్స్ కోర్టులో జూరీకి చేసిన విజ్ఞాపనలో శ్రీ మహమ్మద్ ఆలీ స్పష్టంగా చెప్పనే చెప్పాడు. ఆయన ఇలా అన్నాడు* :

"మేం చేసే సకల కార్యాల్ని ఇస్లాం ఎలా ప్రభవింప చేస్తుందో, ప్రభవింప చెయ్యాలని ఉద్దేశిస్తుందో ఆ పద్ధతి గురించి ప్రభుత్వానికి సరిగా ఎరుక లేదు. ఆ చర్యలు, సామాన్యంగా ఐహికమైనవని విశ్లేషించినా వాటి మీదా ఇస్లాం ప్రభావం ఉంది. అంచేత ఒక విషయాన్ని ఇక్కడ స్పష్టం చెయ్యాలి. తగినంత సాక్ష్యం లేకుండా ఇస్లాం మతానుయాయులు మరో ఇస్లాం మతానుయాయి మీద ప్రతికూలమైన తీర్పు చెప్పరాదు అని ఇస్లాం అంటోంది; ముస్లిం సోదరులు ఉద్దేశ్యపూర్వకంగా దాడి చేస్తున్నారన్న దోషాన్ని రుజువు చేసుకోకుండా మేం వాళ్ల మీద పోరాడలేం, వాళ్ల మత విశ్వాసరక్షణకి వ్యతిరేకంగా ఆయుధాలు అందుకోలేం."

* చిత్రంగా, గంభీరంగా ఉండే ఈ ఘటన విశేషాల్ని, అందులో గాంధీ నిర్వహించిన పాత్రనీ వివరిస్తూ 'మరాఠా'లో ఆ ఏడు శ్రీ కరాండికర్ వ్యాసాలు రాశాడు.

(ఇది 1919లో బ్రిటిష్ వాళ్లకి వ్యతిరేకంగా ఆఫ్ఘన్లు చేసిన యుద్ధానికి సంబంధించి చెప్పిన సంగతి). ప్రస్తుతం మా స్థానం ఇదీ. అమీర్ విరోధం లేక ఉన్మత్తత సరిగా రుజావు కాకుండా భారత సైనికులు, ముసల్మాన్లతో సహా -అదీ మా ప్రోత్సాహంతో, సాయంతో ఆఫ్ఘనిస్తాన్ మీద దాడి చెయ్యడం మేం ఇష్టపడం. దాన్ని ముందుగా ఆక్రమించి, తర్వాత మరింత చిక్కుకీ, మనస్తాపానికీ గురి కాలేం.

'అయితే, తద్విరుద్ధంగా ఘనత వహించిన అమీర్‌కి భారత దేశంతోగాని, దాని ప్రజలతోగాని యుద్ధం లేదు అనుకోండి. సెక్రటరీ ఆఫ్ స్టేట్ బహిరంగంగా ప్రకటించినట్టు, ఆయనకి యావత్ ముస్లిం ప్రపంచంలోనూ ఉన్న అసంతృప్తి అన్నదే ఉద్దేశ్యం అనుకోండి, ఆ అసంతృప్తితో ఆయన బహిరంగంగా హృదయపూర్వక సానుభూతి ప్రకటించేడనుకోండి. అంటే అదే మతోద్దేశ్యంతో, ఏదైతే 'హిజరత్' అనుసరించేట్టు ముస్లింలని ఒత్తిడి చేసిందో దాంతో - దుర్బలులైన వాళ్లకి తమ పరిమిత పద్ధతుల్లో మిగిలేది హిజరత్ మాత్రమే కదా - ఘనత వహించిన ప్రభువు 'జిహాద్' గురించి యోచించేడనుకోండి. బలప్రయోగం విశ్వసించేవాళ్ల సవాళ్లని అందుకున్నాడనుకోండి. ఖిలాఫత్‌కి, జిహాద్‌లో ఉన్నవాళ్లకీ వ్యతిరేకులైన వాళ్లతో పరిష్కారం ఉద్దేశించేడనుకోండి. జాజిరుత్-ఉల్-అరబ్‌నీ, ఇతర పవిత్ర స్థలాల్నీ అన్యాయంగా ఆక్రమించిన వాళ్లకి, ఇస్లాంని దుర్బలం కావించ తలపెట్టినవాళ్లకీ, దాని పట్ల విచక్షణ చూపించినవాళ్లకీ, మా విశ్వాసాన్ని వెల్లడించే పూర్తి స్వేచ్ఛని నిరాకరించిన వాళ్లకీ, ఏం చెయ్యాలో ఇస్లాం చెప్పింది. మొదటగా, ముసల్మాన్ ఎట్టి పరిస్థితుల్లోనూ వాళ్లకి ఏ సాయమూ అందించకూడదు. జిహాద్‌గనక తన ప్రాంతానికి వచ్చినట్టయితే ఆ ప్రాంతంలోని ప్రతి ముసల్మానూ ముజాహిద్దీన్‌తో చేతులు కలిపి తమ తమ శక్తి సామర్థ్యాల మేరకి వాళ్లకి సాయం చెయ్యాలి.

"అదీ స్పష్టంగా, నిర్ద్వందంగా ఉన్న ఇస్లాం ధర్మం. ఈ విషయాన్నే మేం మా కేసు విచారణ జరిపేక కమిటీకి చెప్పేం. ముస్లిమేతర ప్రభుత్వం కింద ఓ ముస్లిం ఉంటే, ఆ పాలనకి వ్యతిరేకంగా జిహాద్‌ని ప్రకటిస్తే అప్పుడు ముస్లిం పౌరుడి మత విహిత కర్తవ్యం ఏమిటి అన కమిటీ అడిగిన ప్రశ్నకి జవాబుగా ఈ ముక్క చెప్పేం. ఈ సంగతి ప్రస్తావించి చెప్పింది ఎన్నడనగానో, అప్పటికి సరిహద్దుల్లో ఏ ఇబ్బందీ లేదు, అమీర్ సజీవులుగానే ఉన్నారు."

ఇక మూడో నియమం ఉంది. ఇస్లాం ఏ భౌగోళిక బంధనాల్నీ గుర్తించదన్నద్ది. దాని బంధనాలు సాంఘికమైనవీ, మతపరమైనవీని. అంచేత భౌగోళిక పరిధిని దాటి ఉంటాయి. ఈ సందర్భంలో కూడా మౌలానా మహమ్మద్ ఆలీయే సాటిలేని సాక్షి. కరాచీలో సెషన్స్ కోర్టులో విచారణ జరిగినప్పుడు జూరీకి ఆయన ఇలా చెప్పేరు :

"ముస్లిమేతర బృందాల్లోగాని, అధికార బృందాల్లో గాని, మేం నిర్దేశించే సిద్ధాంతం గురించి తెలియ వలసినంతగా సామాన్యంగా తెలియదు అని మాకు ఎరుకలోకి వచ్చింది.

కాబట్టి ఓ విషయాన్ని విశదం చెయ్యాలి. ఏదో కొన్ని సిద్ధాంతాల్ని నమ్మడం, వాటికి అనుగుణంగా తను నడచుకోవడం మాత్రమే ఇస్లాం మతానికి సరిపోదు. తన శక్తి సామర్థ్యాల మేరకి, ఇతరులు కూడా ఈ నియమిత విశ్వాసాలకి, ఆచారాలకీ అనురూపంగా వచ్చేట్టు చెయ్యాలి. సరే, అలా చెయ్యడానికి ఒత్తిడి చెయ్యక్కర్లేదనుకోండి. దీన్ని పవిత్ర కురాన్‌లో అమ్రిబిల్ మారూఫ్ అనీ నహీ ఇల్‌ముంకార్ అనే పేర్లతో సూచిస్తారు. పవిత్ర ప్రవక్త సంప్రదాయంలో కొన్ని విస్పష్టమైన అధ్యాయాలు ఇస్లాం మతంలోని ఈ మౌలిక సిద్ధాంతానికి సంబంధించి వున్నాయి. 'నా సోదరుడి పూచీ నాకు లేదు' అని ఏ ముసల్మానూ కూడా అనరాదు. అంటే, ఇతరుల్ని కూడా మంచివాళ్లయేట్టు చెయ్యడానికీ, చెడు నుంచి నివారించడానికీ ఉత్తేజపరచాలి. లేకపోతే అతనికి మోక్షం ఖాయంగా వస్తుందని అనలేం. అంచేత ఏ ముసల్మాన్‌ని అయినా ఇస్లాం ముజాహిద్దీన్‌కి వ్యతిరేకంగా యుద్ధం చెయ్యమని ఒత్తిడి చేస్తే, అతను తనకుగా చైతన్యవంతంగా ప్రతిఘటించడమే కాదు, తను మోక్షగామి అయినట్లయితే, ఇతరుల్ని కూడా అదే ప్రతిఘటనకి పురిగొల్పాలి. ఇది ప్రతి ముసల్మాన్‌కీ ఉన్న విశ్వాసం, మాకూ ఉన్న విశ్వాసం. మేం యథాశక్తి తదనుగుణంగా వర్తించ యత్నిస్తాం. ఈ విశ్వాసాన్ని ప్రచారం చేసుకునే స్వేచ్ఛని మాకు తిరస్కరిస్తే, ఆ స్వేచ్ఛ లేని గడ్డ ఇస్లాంకి భద్రమైన గడ్డగా లేదన్న నిర్ణయానికి మేం రావాల్సి ఉంటుంది."

ఇదీ ముస్లిం ప్రపంచ సమైక్య భావన పునాది. భారతదేశంలోని ప్రతి మహమ్మదీయుడు తాను మొదటగా ఇస్లామ్ మతస్థుడనీ, తర్వాతే భారతీయుడనీ చెప్పేందుకు వీలు కల్పించేది ఇదే. ఈ భావన వల్లనే ప్రతి భారతీయ మహమ్మదీయుడూ ముస్లిం దేశాల లక్ష్యాన్ని మొదటగా స్వీకరించడం తర్వాతనే భారత్ అతని భావనలో స్థానం ఆక్రమిస్తుంది. అందుకనే భారత మహమ్మదీయుడు దేశ పురోగతిలో అంత తక్కువ పాలు పంచుకుని తను నీరస పడిపోయేడు.*

ఘనత వహించిన ఆగాఖాన్ దీన్ని సమర్థిస్తున్నాడు, ఈ విధంగా :

"ఇదే సక్రమమైన, న్యాయబద్ధమైన ముస్లిం ప్రపంచ సమైక్య భావన. నిజాయతీ విశ్వాసం ఉన్న ప్రతి మహమ్మదీయుడు దీనికే బద్ధుడు. అంటే, ఆధ్యాత్మిక సోదరత్వం ప్రవక్త సంతాన ఐక్యం అన్న భావనకి. పర్షియన్-అరబిక్ సంస్కృతిలో గాఢమైన, అవిచ్ఛన్నమైన అంశం ఇది. అదో నాగరిక మహా కుటుంబం. దానికే మొదటి ప్రకరణంలో మేము ఇస్లామిక్ అని పేరు పెట్టాం. చైనా నుంచి మొరాకో దాకా, వోల్గా నుంచి సింగపూర్ దాకా ప్రతిచోటా ఉన్న తోటి మతస్థుల పట్ల దయ, సుహృద్భావం ఉండాలని దీని అర్థం. ఇస్లాం సాహిత్యంలో, ఇస్లాం సౌందర్యభరిత కళలలో, అందమైన వాస్తు సంపదలో, మంత్రముగ్ధం కావించే ఇస్లాం కవిత్వంలో ఎనలేని ఆసక్తి ఉండడం అని దీని అర్థం. సిసలైన సంస్కరణ అని కూడా దీని

* ఇండియా ఇన్ ట్రాన్సిషన్, పేజీ 57.

అర్థం. తొలినాటి పరిశుద్ధ అకలంక విశ్వాసం కేసి మళ్లడం, వాదనల ద్వారా, ఇతరుల్ని ఒప్పించడం ద్వారా బోధ చెయ్యడం వేపు మళ్లడం, వ్యక్తిగత జీవితాల్లో ఆధ్యాత్మిక శక్తి ఆవిష్కరణ అయేట్టు చెయ్యడం, మానవజాతి కార్యకలాపాలకి ప్రయోజనం చేకూర్చడం అనీ దీని అర్థం. ఇందులోని నిసర్గమైన యోగ్యమైన ఆధ్యాత్మిక సంపత్తి యజమానినీ, ఆయన బోధనలకీ ప్రేమాస్పదుల్ని చెయ్యడం మాత్రమే కాదు, సకల దేశాలలో ఉన్న ఆయన సంతానాన్ని, ఓ టర్క్‌ని, ఓ ఆఫ్ఘన్‌ని, ఓ భారతీయుణ్ణి, ఓ ఈజిప్షియన్‌ని ఒకళ్ల కొకళ్లని ప్రేమాస్పదుల్ని చేస్తుంది. ఖాస్‌గర్‌లోనో, సరయేవ్‌లోనో ఓ కరువు వచ్చిందనుకోండి. ఓ అగ్నిప్రమాదం జరిగిందనుకోండి. వెంటనే ఢిల్లీలోనో, కైరోలోనో ఉన్న మహమ్మదీయుడి సానుభూతి అందేట్టు చేస్తుంది. ఇస్లాం మతంలో ఉన్న ఈ అసలైన ఆధ్యాత్మిక, సాంస్కృతిక ఐక్యం ఇంకా వృద్ధి చెందాలి. ప్రవక్త బోధనని అనుసరించే వాడికి ఇదే ఆధ్యాత్మిక జీవిత పునాది."

ఈ ఆధ్యాత్మిక ముస్లిం సమైక్య భావన రాజకీయ ముస్లిం సమైక్య భావనలో వెల్లడైతే అదేం అస్వాభావికం అని అనలేం. బహుశా ఇదే భావం ఆగాఖాన్ మనసులో ఉండి ఉంటుంది, ఆయన ఇలా అంటున్నప్పుడు* :

"ఇవాళ కాకపోతే రేపేనా పర్షియా, ఆఫ్ఘనిస్తాన్, బహుశా అరేబియా ఏదో ఖండీయ అధికారం కిందకు-జర్మనీలాంటిదో భిన్నమైన రష్యా నుంచి ఉత్పన్నమైన లాంటిదో - కిందకు వస్తాయని భారతదేశ భక్తుడు గుర్తించాలి. లేదా తన భవితవ్యాన్ని భారత సామ్రాజ్య భవితవ్యంతో కలపాలి, ఇప్పుడు దీంతోనే వాళ్లు ఎక్కువ బాంధవ్యంతో ఉన్నారు. ప్రపంచ శక్తులు భిన్న రాజ్యాల్ని శక్తివంతమైన పొరుగువాళ్లతో కలుపుతున్నాయి. ఇంత ఇది యూరప్‌లోనే బాగా గోచరమవుతోంది. ఆ శక్తులు విధిగా ఆసియాలో కూడా గోచరమవుతాయి. శక్తివంతమైన, విద్వేషవంతమైన పొరుగువాళ్లు ఓ కన్ను వేసి ఉంచడం, ఆ రకంగా భారీ సైనిక భారం మోపుకోవడం ఇష్టపడకపోతే తప్ప, భారతదేశం తన పొరుగు మహమ్మదీయ రాజ్యాల్ని పరస్పర ప్రయోజనాలబంధంతో, సహృద్భావ బంధంతో తనవైపు ఆకర్షించుకోవడాన్ని ఉపేక్షించలేదు."

"ఒక ముక్కలో చెప్పాలంటే, ప్రయోజనవుట్టువైన, వృద్ధికర సమాఖ్య ఫెడరల్ భారతదేశం మీదనే ఆధారపడాలి. ప్రతి సభ్యత్వ భాగమూ తన సొంత హక్కులనీ, తన చారిత్రక విశిష్టతనీ, స్థానిక ప్రయోజనాల్నీ కలిగి ఉండాలి. అయితే అవి ఉమ్మడి రక్షణ వ్యవస్థతో, కస్టమ్స్ సమాఖ్యతో ఉండాలి. బాహ్య ప్రమాదం నుంచీ బలమైన శక్తుల ఆర్థిక దోపిడీ నుంచీ ఇవి కాపుదలగా వుంటాయి. ఆ బాపతు ఫెడరల్ భారతం సిలోన్‌ని తన మాతృహృదయ[illegible]కి తక్షణం గ్రహిస్తుంది. మేం సూచించిన పరిణామాలు దాన్ని అనుకరించి

* ఇండియా ఇన్ ట్రాన్సిషన్, పేజి 169.

వస్తాయి. న్యాయం, స్వేచ్ఛ, ప్రతి జాతికీ గుర్తింపు, ప్రతి మతానికీ గుర్తింపు, ప్రతి చారిత్రక అంశానికీ గుర్తింపు అన్న విస్తృత, గాఢ పునాది వేసి మనం మహత్తర దక్షిణ ఆసియా ఫెడరేషన్‌ను నిర్మించగలం."

"ఆధునిక పరిస్థితులు ఆపేక్షిస్తున్న పర్షియా, ఆఫ్ఘనిస్తాన్ పురోగమన యాత్రకి తోడ్పాటు అందించే మనఃపూర్వక సిద్ధాంతం వల్ల భారత్‌కి వాయవ్యమూలలో రెండు సహజమైన కోటగోడలు ఏర్పడతాయి. వాటిని జర్మన్లుగాని, స్లావ్‌లుగాని టర్క్‌లుగాని మంగోలులు గాని కలలో కూడా ధ్వంసం చెయ్యలేరు. తమంతతామే అవి ఆ శక్తి వేపు ఆకర్షితమవుతాయి. ఆ శక్తి భారతదేశంలో ఆరోగ్యభరిత నమూనా ప్రాయమైన ఫెడరలిజాన్ని అందిస్తుంది. సిసలైన స్వయం ప్రతిపత్తి ప్రతి రాష్ట్రానికీ ఉంటుంది. ఆంతరంగిక స్వేచ్ఛ భాగస్వాములకి ఉంటుంది. నైజామ్ కింద, బీరార్స్‌తో సహ పునరుజ్జీవిత, ఉదారయుత హైద్రాబాద్ రాజ్యం ఉంటుంది. భారతదేశంలో స్వేచ్ఛ, క్రమశిక్షణ కనిపిస్తాయి. స్వయం ప్రతిపత్తి ఉంటుంది, అయినా సామ్రాజ్య సమాఖ్య ఉంటుంది. సమైక్య సమాఖ్య ప్రయోజనాలని అనుభవిస్తారు. స్థానిక స్వయంపాలన, సుహృద్భావంతో, అపరిమిత, విస్తృత శక్తితో కలిసి కొనసాగుతుంది. ఆ మహాసామ్రాజ్యం రవి అస్తమించని సామ్రాజ్యంగా వెలుస్తుంది. నేను ప్రతిపాదించిన సిద్ధాంతం వల్ల మెసపొటేమియా, అరేబియాలలో కూడా బ్రిటిష్ స్థానం – శాశ్వత వాటి నామమాత్ర రూపం ఏదైనా కానీ – బ్రహ్మాండంగా బలపడుతుంది."

ఈ దక్షిణ ఆసియా ఫెడరేషన్ అనేది అరేబియా, మెసపొటేమియా ఆఫ్ఘనిస్తాన్‌లాంటి ముస్లిం దేశాలకి, భారతదేశం కంటే ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటుంది.* భారత ముస్లింల ఆలోచనలు ఎంత స్వాభావికంగా భారతదేశం కంటే ఇతర ముస్లిం దేశాల గురించి ఉన్నాయో దీన్నిబట్టి తెలుస్తుంది.

అధికారానికి విధేయంగా ఉండడం అనే దానిమీదే ప్రభుత్వం ఆధారపడుతుంది. హిందువుల, ముస్లింల స్వయంపాలనని స్థాపించాలన్న ఆతృతతో ఉన్నవాళ్లు ఆ విధేయత

* ఈ దక్షిణ ఆసియా ఫెడరేషన్ అనేది ఏర్పడి ఉంటే ఎంత దారుణంగా ఉండేది? హిందువులు దిక్కులేని మైనారిటీ అయిపోదురు. "ఇండియన్ మాన్యువల్ రిజిష్టర్" అంటోంది: "భారతదేశంలోని ముస్లిములలో బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని బలపరిచే వాళ్లు ఆంగ్లో–ముస్లిం సంఘటన ద్వారా, దక్షిణ ఆసియాలో, అరేబియా నుంచి మలయా ద్వీపకల్పం దాకా బ్రిటిష పాలన సుస్థిరతకి ప్రయత్నిస్తూ చురుగ్గా ఉండేవారు. అక్కడ సంస్థలో ముస్లింలు మొదట జూనియర్ భాగస్వాములుగానే ఉన్నా, క్రమేణా సీనియర్ భాగస్వాములవుతామని ఆశిస్తూ ఉండేవారు "ఇండియా ఇన్‌ట్రాన్సిషన్" అన్న గ్రంథంలో ఘనత వహించిన ఆగాఖాన్ స్థూలంగా చెప్పిన పథకానికి అలాంటి భావనే, భవిష్యత్ దర్శనే ఉందని మనం భావించాలి. ఈ పథకం సౌత్ వెస్టన్ ఆసియాటిక్ ఫెడరేషన్‌ని స్థాపించాలని ఉద్దేశించింది. అందులో భారతదేశం ఒక భాగస్వామి. యుద్ధం తర్వాత సర్ విన్‌స్టన్ చర్చిల్ బ్రిటిష్ కేబినెట్లో వలసలకి సెక్రటరీ ఆఫ్ స్టేట్‌గా ఉన్నారు. అప్పుడాయనకి మధ్య ప్రాచ్య సామ్రాజ్య పథకం ఒకటి మధ్య ప్రాచ్య శాఖ ఆలేఖన భాండాగారంలో సిద్ధంగా ఉన్నట్టు కనిపించింది." – 1938, సాల్యూం 2 "ఇండియా ఇన్ హెూమ్ పాలసీ"లో అధ్యాయం, పేజీ 48.

అనేది దేనిమీద ఆధారపడుతుందో, మామూలు గతిలో ఏ మేరకి ఆ విధేయత వస్తుందో, సంక్షోభ సమయాల్లో అది ఎలా ఉంటుందో వివేచన చెయ్యడం మానేశారు. ఇది చాలా ముఖ్యమైన సమస్య. ఏమంటే విధేయత తప్పినప్పుడు, స్వయంపాలన అంటే కలిసి పని చెయ్యడం, ఒదిగి పని చెయ్యడం కాదు. ఆదర్శప్రాయంగా అంతే కావచ్చు. కాని ఆచరణకి, రోజువారీ లౌకిక వ్యవహారానికి వచ్చేటప్పటికి, ప్రాతినిధ్య ప్రభుత్వం కింద అసమ సంఖ్యలో అంశాలు ఉన్నాయనుకోండి, తక్కువ సంఖ్యవాళ్ళు అధిక సంఖ్యవాళ్ళ కింద పని చెయ్యాలి. అది అధిక సంఖ్య కింద పనిచేస్తుందా లేదా అన్నది అధిక సంఖ్య ఉన్న ప్రభుత్వం నిర్వహించే అధికారాన్ని ఏ మేరకి తల ఒగ్గి అంగీకరిస్తుంది అన్న విషయం మీద ఆధారపడి ఉంటుంది. స్వయంపాలనలో ఈ విషయం ఎంత ముఖ్యమైందంటే బాల్‌ఫోర్ అర్థసత్యం మాత్రమే చెప్పేడనిపిస్తుంది - విజయం భాగస్వామ్య పక్షాలు ఏక లక్ష్యంతో ఉండడం మీద ఆధారపడుతుందని. ప్రభుత్వ అధికారాన్ని ఆమోదించడం కూడా ఏ స్వయంపాలన పథకానికీ అంతే అవసరం అని గుర్తించలేదు.

రెండవ షరతు ప్రాముఖ్యం గురించి జేమ్స్ బ్రిసే* చర్చించేడు. పార్లమెంటరీ ప్రభుత్వం విజయవంతం గా పని చేసేందుకు అది అవసరం. జేమ్స్‌బ్రిసే రాజకీయ సంయోగం పునాది గురించి చర్చిస్తూ రాజ్యాల నిర్మాణానికి బలప్రయోగం ఎక్కువ చేసి ఉండవచ్చని అంటూనే, అనేక ముఖ్యాంశాల్లో బలప్రయోగం ఒకటేగాని అదే అతి ముఖ్యమైంది కాదని అన్నాడు. రాజకీయ సంఘాల్ని సృష్టించడంలో, రూపొందించడంలో విస్తృతపరచడంలో, సన్నిహితం చెయ్యడంలో బలప్రయోగం కంటే ముఖ్యం అయింది విధేయత. ప్రభుత్వాజ్ఞల్ని తలదాల్చి, తదనుగుణంగా ఉండడానికి అవసరమైన ఈ సుముఖత ఆయా ప్రత్యేక వ్యక్తుల, బృందాల మానసిక దృష్టిపై ఆధారపడి ఉంటుంది. విధేయతను కలిగించే వైఖరి అలసత్వం, మన్నన, సానుభూతి, భయం, హేతువు వల్ల వస్తుంది. అన్నీ ఒకేలాంటివి కావు. నిజానికి అవి సాపేక్షం. అంతరాలుగా అవి విధేయతా వైఖరిని కలిగిస్తాయి. భయంవల్లా హేతువువల్లా కలిగే విధేయత శాతం అలసత్వం వల్ల కలిగే దానికంటే తక్కువ. మన్నన వల్ల, సానుభూతివల్ల కలిగే శాతం కంటే ఇంకా తక్కువ అని బ్రిసే అంటాడు. అంటే మన్నన, సానుభూతి చాలా బలమైన అంశాలు. వాటినిబట్టే ఆయా ప్రభుత్వాల అధికారాన్ని విధేయతా పూర్వకంగా మన్నించే వైఖరి ఉంటుంది.

ఆ ప్రభుత్వ అధికారానికి విధేయంగా కట్టుబడి ఉండాలన్న సంకల్పం ఆ ప్రభుత్వ స్థిరత్వానికి ముఖ్యం, రాజ్యంలోని రాజకీయ పార్టీల ఐక్యంలాగానే. రాజ్య నిర్వహణలో విధేయత ప్రాముఖ్యాన్ని బుద్ధి ఉన్నవాడెవడూ ప్రశ్నించడు. పౌర ఉల్లంఘన, సివిల్ డిస్ ఒబీడియన్స్‌ని నమ్మడమంటే అరాజకత్వాన్ని నమ్మడమే.

* స్టడీస్ ఇన్ హిస్టరీ అండ్ జ్యూరిస్ అండ్ ప్రూడెన్స్, వాల్యూం 2. మొదటివ్యాసం

హిందువులు అధికారం చెలాయించే ప్రభుత్వాలకి ముస్లింలు ఏ మేరకి విధేయంగా ఉంటారు? దీనికి జవాబు చెప్పడానికి తలబద్దలు కొట్టుకోనక్కర్లేదు. ముస్లిములకు సంబంధించి హిందువు కాఫిర్.[1] కాఫిర్‌కి గౌరవం ఇవ్వకూడదు. తక్కువ పుట్టుకవాడు, హోదాలేని వాడు. అంచేత కాఫిర్ ఏలుబడిలోని ప్రాంతం ముసల్మాన్‌కి దార్-ఉల్-హర్బ్. ఇంత చూశేక ఏ ముస్లిమేనా హిందూ ప్రభుత్వాన్ని మన్నిస్తాడని చెప్పడానికి సాక్ష్యం అక్కర్లేదు. ప్రభుత్వాధికారాన్ని మన్నించేట్టు చేసే మౌలిక భావాలు మన్నన, సానుభూతి అనేవి. అవి లేవంతే. దీనికి సాక్ష్యం కావాలంటే కొరతే లేదు. అయితే దేన్ని ప్రస్తావించుకోవాలి దేన్ని వదులుకోవాలి అన్నదే సమస్య.

ఖిలాఫత్ ఉద్యమం జోరుగా సాగేటప్పుడు ముసల్మాన్లకి హిందువులు ఎంతో సాయం చేశారు. ముసల్మాన్లు అప్పుడు కూడా తమతో పోలిస్తే హిందువులు తక్కువ, నీచజాతి వాళ్లు అన్నదాన్ని మర్చిపోలేదు. ఓ ముసల్మాన్[2] 'ఇన్‌సాఫ్' అనే ఖిలాఫత్ పత్రికలో ఇలా రాశాడు:

"స్వామి, మహాత్మ అనె పదాల అర్థం ఏమిటి? ముస్లింలు ఈ పదాల్ని ముస్లిమేతరుల గురించి రాసేటప్పుడు వాడవచ్చా? 'స్వామి' అంటే 'యజమాని' 'మహాత్మా' అంటే 'మహత్తర ఆత్మ కలవాడు' - అంటే 'రూహ్-ఇ-ఆజమ్"కి సమానం - అత్యున్నత ఆత్మ".

ముస్లిమేతరుల్ని అలాంటి గౌరవపూర్వక నామాల్తో న్యాయంగా పిలవచ్చో లేదో అధికారయుత ఫత్వా ద్వారా నిర్ణయించమని ధర్మవేత్తల్ని కోరేడు అతను.

1924లో గాంధీజీ జైలు నుంచి విడుదల అయ్యారు. ఢిల్లీలో హకీమ్ ఆజ్మల్ ఖాన్ నిర్వహించే యునాని వైద్య కళాశాలలో సన్మానం ఏర్పాటు చేశారు ఆయనకు. అప్పుడో గొప్ప సంఘటన[3] జరిగింది. ఓ హిందూ విద్యార్థి గాంధీని హజరత్ ఇసాత్ (జీసస్)తో పోల్చేడని వార్త. ముసల్మాన్ భావాలకి దీనివల్ల బాధ కలిగింది. దాంతో ముసల్మాన్ విద్యార్థులు రెచ్చిపోయి, తన్ని తగలేస్తామని ఆ హిందూ విద్యార్థిని బెదిరించేరు. కొంతమంది ముస్లిం ప్రొఫెసర్లు కూడా వాళ్లతో చేతులు కలిపేరని వార్త వచ్చింది.

1923లో భారత జాతీయ కాంగ్రెస్‌కి మహమ్మద్ ఆలీ అధ్యక్షత వహించేడు. ఆయన తన ఉపన్యాసంలో గాంధీ గురించి ఇలా అన్నాడు :

"గాంధీ బోధనలని, ఇటీవలి కాలంలో ఆయన అనుభవించిన బాధల్ని చాలామంది జీసస్‌తో (ఆయనకి శాంతి కలుగుగాక) పోల్చేరు.... జీసస్ మతపరంగా ప్రపంచంలో పాదం

---

1. కాఫిర్లని పిలిస్తే హిందువులు బాధపడక్కర్లేదు. వాళ్లు ముస్లింలని మ్లేచ్ఛులని అంటారు - తాకకూడని వాళ్లని.

2. [illegible] ఇండియన్ [illegible]ప్స్ ఆఫ్ ఇండియా 21.1924.

3. [illegible] ఇండియన్ [illegible]మ్స్ ఆఫ్ ఇండియా, 11.3.1924.

మోపినపుడు సంస్కరణాయుధాలని వేటిని ఎంచుకోవాలన్నది ఎదురైంది... బాధవల్లా, నిరాసక్తత వల్లా సర్వశక్తివంతుడు కావడం, బలప్రయోగం మీద హృదయ పరిశుద్ధతతో విజయం సాధించడం అనే భావం, మానవుడి తొలి సంతానమైన ఏబెల్, కైన్ కాలం నాటిది..."

'అదేమైనా మహాత్మా గాంధీక్కూడా అది అంతే విశేషం. కాని మన కాలంనాటి మహోన్నత క్రిస్టియన్‌ని మహాపరాధిగా చూడ్డం క్రిస్టియన్ ప్రభుత్వానికే చెల్లింది. (సిగ్గు, సిగ్గు) శాంతిదూతకి అతి సన్నిహితంగా రాగల ఈ ఒక్క మానవుణ్ణి శాంతి విఘాత నేరం మోపి శిక్షించడం క్రిస్టియన్ ప్రభుత్వానికే చెల్లింది. గాంధీజీ రంగం మీదకి రానప్పుడు రాజకీయ రంగం జీసస్ రాక నాటి జూడాలా ఉంది. భారతదేశ రుగ్మతలకి ఆయన ప్రతిపాదించిన ఔషధం సరిగ్గా జీసస్ జూడాకి ఇచ్చినలాంటిదే. బాధ పడడం ద్వారా ఆత్మ పరిశుద్ధత పొందడం; బాధ్యతాయుతమైన ప్రభుత్వం కోసం నైతిక సంసిద్ధత; స్వరాజ్‌కి ముందు ఆత్మ సంయమనం - ఇదీ మహాత్మా బోధించిన సిద్ధాంతం. ఆయన దృఢ విశ్వాసం. అహమ్మదాబాద్ కాంగ్రెస్ మహాసభ జరిగిన వైభవ భరిత కాలంలో వుండే అదృష్టం కలిగిన మాబోటి వాళ్లం, ఆయన విస్తృత ప్రజాబాహుళ్యం ఆలోచనల్లో, అనుభూతుల్లో, ఆచరణలో ఎంతటి మహత్తర పరిణామం కలిగించేడో చూశేం."

ఓ ఏడాది తర్వాత ఆలీఘర్‌లోనూ, అజ్మీర్‌లోనూ మాట్లాడుతూ ఇదే మహమ్మద్ ఆలీ ఇలా అన్నారు :

"గాంధీజీ వ్యక్తిత్వం ఎంత పరిశుద్ధమైనదైనా, మత దృష్ట్యా చూస్తే నాకు ఆయన ఏ ముసల్మాన్ కంటే కూడా లొక్కుగా కనిపిస్తాడు, ఆ ముసల్మాన్ సచ్ఛీలుడు కాకపోయినా సరే."

ఈ ప్రకటనతో పెద్ద గొడవ రేగింది. గాంధీని అంతటా ఆకాశానికి ఎత్తిన ఆ మహమ్మద్ అలీ ఇలాంటి నీచమైన మాటలు ఆయన్ని గురించి అంటాడని ఎవళ్లూ ఊహించలేదు. లక్నో అమినాబాద్ పార్క్‌లో మహమ్మద్ ఆలీని అడిగేరు, ఆ ముక్కలు నిజంగా తను అన్నవేనా అని. ఆయన నిస్సంకోచంగా ఏ పరితాపం లేకుండా ఇలా జవాబిచ్చేడు[1] :

"అవును. నా మత విశ్వాసాల ప్రకారం ఒక పతిత, దుశ్శీల ముసల్మాన్ గాంధీకంటే మెరుగు."

అప్పట్లో మొత్తం ఛాందసవాద ముస్లిం వర్గీయులందరూ, ఓ కాఫిర్ అయిన గాంధీ జీసస్‌తో పోల్చి అంతటి గౌరవం ప్రదర్శించినందుకు, మహమ్మద్ ఆలీని తప్పు పట్టింది. తనన్న మాటల్ని ఆయన వెనక్కి తీసుకోవాలని సూచించింది. ఓ కాఫిర్‌కి అలాంటి పొగడ్తని

1. త్రూ ఇండియన్ ఐస్, టైమ్స్ ఆఫ్ ఇండియా, 21.3.24

ఇవ్వడం ముస్లిం ధర్మం నిషేధించింది.

1928లో హిందూ-ముస్లిం సంబంధాలకు[1] సంబంధించి ఖ్వాజా హసన్ నిజామీ ఇలా చాటేరు :

"ముస్లింలు హిందువులు వేరు ముసల్మాన్లు హిందువులతో కలవలేరు. రక్తసిక్తమైన యుద్ధాల తర్వాత ముసల్మాన్లు భారత్‌ని జయించేరు. ఇంగ్లీషు వాళ్లు భారత్‌ని వాళ్ల నుంచి తీసుకున్నారు. ముసల్మాన్లు ఓ ఏకీకృత జాతి, వాళ్లు మాత్రమే భారత్‌ని పాలించగలరు. తమ ప్రత్యేకతని వాళ్లు ఎన్నడూ వదులుకోరు. వందల సంవత్సరాలు వాళ్లు భారత్‌ని పరిపాలించారు. అంచేత వాళ్లకి ఈ దేశం మీద విధికృత హక్కు ఉంది. హిందువులు ప్రపంచంలో అల్ప సంఖ్యాకులు. అంతర్గత కలహాలతో కుమ్ములాడుకుంటూనే ఉంటారు. వాళ్లకి గాంధీ పట్ల విశ్వాసం, ఆవుని పూజిస్తారు. ఇతరుల చేతుల నుంచి నీళ్లు అందుకుని కలుషితం అయిపోయేరు. వాళ్లకి స్వయంపాలన అంటే పట్టదు. వాళ్ల కుమ్ములాట్లతో వాళ్లని చావనీయండి. మనుషుల్ని పాలించే సామర్థ్యం వాళ్లకి ఏం ఉందీ? ముసల్మాన్లు లోగడ పరిపాలించేరు, ఇక ముందూ పరిపాలిస్తారు."

హిందువులకి విధేయత ప్రదర్శించడం మాట సరేసరి, వాళ్లతో ముస్లింలు మళ్లీ అమీ తుమీ తేల్చుకుందుకు సిద్ధంగా ఉన్నట్లు కనిపిస్తున్నారు. 1926లో పానిపట్ యుద్ధంలో ఎవళ్లు నిజంగా నెగ్గేరు అన్న గొడవ మళ్లీ రేగింది. అది తమకి గొప్ప విజయం అని ముస్లింలు అన్నారు. ఏమంటే అహ్మద్ షా అబ్దాలీకి 1 లక్ష సైన్యమే ఉందిట, కాని మరాఠాలకి 4 నుంచి 6 లక్షల సైన్యం ఉందిట. ఆ విజయం తమదేనని హిందువులు అన్నారు. ఏమంటే దానివల్ల ముస్లిం దండయాత్రలకి అడ్డుకట్ట పడింది. హిందువుల చేతిలో ఓడిపోవడమన్న ముక్కను ముస్లిములు ఇష్టపడలేదు. తాము సర్వదా హిందువుల కంటే అధికులమని రుజువు చెయ్యదలచుకున్నారు. సర్వకాల సర్వావస్థల్లోనూ ముస్లింలే అధికులు అన్న విషయాన్ని రుజువు చేసేందుకు ముస్లింలు హిందువులు ప్రయోగంగా యుద్ధం చెయ్యాలని నిజంగానే మౌలానా అక్బర్ షాఖాన్ అన్నాడు. అదే పానిపట్‌లో నాల్గవ యుద్ధం చెయ్యాలట. తదనుగుణంగా ఆ మౌలానా పండిట్ మదనమోహన మాలవ్యాకు ఈ కింది సవాల్ విసిరేరు[2]:

"మాలవ్యాజీ, పానిపట్ ఫలితాన్ని తప్పని మీరు చూపించ ప్రయత్నిస్తే నేనో చక్కని మార్గాన్ని చూపిస్తాను (దాన్ని పరీక్షించేందుకు) బ్రిటిష్ ప్రభుత్వం దగ్గర మీకు ఉన్న ప్రఖ్యాతమైన పలుకుబడిని ఉపయోగించి, అధికారుల నుంచి ఏ ఆటంకమూ లేకుండా నాల్గవసారి పానిపట్ యుద్ధానికి అనుమతీ ఇవ్వమనండి. నేను సిద్ధంగా ఉన్నాను... హిందువులకీ ముస్లింలకీ మధ్య పోరాట ఉత్సాహం ఎలాంటిదో సరిపోల్చుకుందుకు

1. త్రూ ఇండియన్ ఐస్, టైమ్స్ ఆఫ్ ఇండియా, 21.4.24.

2. అదే పుస్తకం, పత్రిక 14. 328.

పరీక్షకు... భారతదేశంలో ఏడుకోట్ల మంది ముసల్మాన్లు ఉన్నారు గనక, ఈ ఏడు కోట్లకీ కోటికి వంద చొప్పున ప్రాతినిధ్యం వహించేటట్టు 700 మంది ముస్లిములను అనుకున్న తేదీకి పానిపట్ మైదానం మీదకు తెస్తాను. హిందువులు 22 కోట్లమంది ఉన్నారు. మీరు 2,200 మంది హిందువులతో రండి. ఫిరంగులు, మెషీన్‌గన్‌లూ, బాంబులూ కాదు, ఉండాల్సింది; కత్తులు, బల్లేలు, ఈటెలు, విల్లంబులు, బాకులు ఉండాలి. మీకు గనక హిందూ సైన్యానికి ఆధిపత్యం వహించడానికి ఇష్టం లేకపోతే మీరా పదవిని సదాశివరావు* వారసులకో, విశ్వాసరావు* వారసులకో ఇవ్వచ్చు. అలా అయితే వాళ్ల ముద్దుబిడ్డలకి 1761లో తమ పూర్వులు చవి చూసిన ఓటమికి ప్రతీకారం తీర్చుకునే అవకాశం ఉంటుంది. ఏమైనా ప్రేక్షకుడిగా మాత్రం తప్పక రండి. ఏమంటే యుద్ధ ఫలితాలు చూసేక మీరు మీ అభిప్రాయాల్ని మార్చుకోవలసి వస్తుంది. అప్పుడు ప్రస్తుతం దేశంలో ఉన్న భిన్నాభిప్రాయాలు భేదాలు సమసిపోతాయని అనుకుంటున్నాను. ముగింపు మాట ఒకటి చెప్పదలచుకున్నాను, నేను తీసుకు వచ్చే 700 మంది ముస్లింలలో పఠాన్లుగాని, ఆఫ్ఘన్లు కాని వుండరు, వాళ్లంటే మీకు చచ్చేంత భయం కదా. షారియత్‌ని మనోవాక్కాయ కర్మణా అనుసరించే ఉన్నత కుటుంబీకులైన భారత ముస్లిమును మాత్రమే తీసుకు వస్తాను."

★ ★ ★

హిందువులకూ, ముస్లిములకూ ఉన్న మత విశ్వాసాలు, సాంఘిక దృక్పథాలు, అంతిమ లక్ష్యాలు అవి. వాళ్ల మతపర, రాజకీయ బహిర్గత అంశాలు అవీ. పరమ లక్ష్యాలకి సంబంధించిన మతపర దృక్పథాలే ఆచరణకి చోదకశక్తిగా ఉంటాయి, అని సహకరించేవైనా స్పర్థించేవైనా. అవి అసలు కలవవని, ఉత్తర దక్షిణ ధృవాలనీ గత అనుభవం తెలియజెప్తోంది. హిందువులు, ముస్లింలు కలిసి ఒక దేశంగా సమరసపూర్వక జాతులుగా ఉండలేవని తెలుస్తోంది. ఈ విభేదాల వల్ల వాళ్లు ఖాయంగా వేర్పాటుగా ఉంటారు, అంతేకాదు కీచులాడుకుంటూనే ఉంటారు. ఈ విభేదాలకి అంతం లేదు, హిందూ–ముస్లిం సమస్య అంతం కాకుండా అలానే సాగుతుంది. హిందువులు – ముస్లింలు ఒకటే, ఒకవేళ ఇదివరలో కాకపోతే ఇప్పుడు అవుతారు అనేది శుష్కవాదం. చెకొస్లొవేకియా విషయం చూపిస్తున్నట్టుగా అంత శుష్కమూనూ. అంతేకాదు, కొన్ని విషయాలు అవి యెంత చేదుగా వున్నాకానీ, నిర్బంధంగా ఒప్పుకోవాల్సిన సమయం వచ్చింది. హిందువుల్ని ముస్లింలని ఏకతాటి మీదకి తీసుకు వచ్చే ప్రయత్నాలు ఎన్నో జరిగాయి. అన్నీ విఫలమయేయి.

ఈ ప్రయత్నాల చరిత్ర 1909లో మొదలైంది. ముస్లిం ప్రతినిధి వర్గం చేసిన డిమాండ్‌ని బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరిస్తే, దాన్ని హిందువులు సరేనని ఒప్పుకోవాలి. ముఖ్యులైన వాళ్లలో గోఖలే అలా ఒప్పుకోవాలి. ప్రత్యేక ఎలక్టొరేట్స్‌కి ఆయన సరేనని

* మూడవ పానిపట్ యుద్ధంలో హిందువుల వైపు సైన్యాధిపతులు

అన్నందుకు చాలామంది హిందువులు ఆయన్ని దుమ్మెత్తిపోశారు. కానైతే అంగీకారం తెలియ చెయ్యకపోవడం అంత తెలివైన పనికాదని ఆయన్ని విమర్శించేవాళ్లు మర్చిపోతున్నారు. మహమ్మద్ ఆలీ బాగా చెప్పినట్టు :

"…. ఈ విషయం విరోధభావనగానే కనిపించవచ్చు, కాని హిందూ–ముస్లిం ఐక్యాన్ని ప్రత్యేక ఎలక్టరేట్స్ త్వరితం చేస్తాయి. మొట్టమొదటిసారిగా, అసలైన వోటింగ్ భారతీయులకి వస్తోంది, అది ఎంత పరిమితులతో ఉన్నాగానీ, హిందువులూ, ముసల్మాన్లూ అలా ఎవరికి వారే యమునాతీరే అన్నట్టు ఉండిపోతే, ఒకళ్లకి ఒకళ్లు విద్వేషులుగానే ఉండిపోతే, సంయుక్త నియోజకవర్గాలు అంతర్గత కుమ్ములాటలకి మంచి పసందుగా తయారై ఉండేవి. ఈ రెండు మతవర్గాల మధ్య వేర్పాటు ఇంకా వెడల్పై ఉండేది. ఎన్నికల్లో ప్రతి అభ్యర్థీ తమ తమ మతం వాళ్లకే విజ్ఞప్తి చేసేవాడు. అవతల వాళ్ల పట్ల నాకు ఇంత ద్వేషం ఉందంటే, నాకు ఇంత ద్వేషం ఉందని ద్వేష తీవ్రతని బాగా చాటేవాడు. 'మత ప్రయోజనాల పరిరక్షణ' అని ఎంత షోగ్గా ముసుగు తగిలించి చెప్పుకున్నా ఇలా సాగేది. ఇది అధ్వాన్నం. అలాంటి పరిస్థితి రెండు పక్షాలకీ మధ్య సమ ఉజ్జీ లేకపోతే మరీను. ఏమంటే తమ అభ్యర్థి ఎన్నిక కాలేదని బాధపడే మతవర్గం అవతలి పక్షం మీద పగ పెంచుకుంటుంది. అలా రెండు వర్గాలూ చీలిపోతే ఎన్నికల్లో ఏ రాజకీయ సూత్రాలకీ అవకాశమే ఉండదు. ప్రత్యేక నియోజకవర్గాల వల్లి అంతర్గత యుద్ధాలు పోతాయి. పరస్పర విద్వేషాలు ఉన్నప్పుడు నెగ్గే అభ్యర్థులు కూడా అవతలి పక్షం పట్ల ద్వేషం ఎక్కువ ఉన్నవాళ్లే ఉంటారు.

కాని 1909లో ప్రత్యేక నియోజకవర్గాలుండడానికి హిందువులు అంగీకరించినా హిందూ–ముస్లిం ఐక్యం ఏర్పడలేదు. తర్వాత 1916లో లక్నో ఒప్పందం వచ్చింది. దానికింద హిందువులు ముస్లిములకు అన్ని విధాలా తృప్తి కలిగించారు. అయినా దానివల్లా ఏమీ ఒరగలేదు. ఆరేళ్ల తర్వాత హిందూ–ముస్లిం ఐక్యానికి మరో ప్రయత్నం జరిగింది. 1923లో లక్నోలో ఆలిండియా ముస్లింలీగు వార్షిక సమావేశం జరిగింది. అదీ ఓ తీర్మానాన్ని* ఆమోదించింది. ఒక జాతీయ ఒడంబడిక వుండాలని అందులో అర్థించేరు. దాని వల్ల మతవర్గాల మధ్య, శాఖల మధ్య ఐక్యం, సామరస్యం ఏర్పడతాయని భావించేరు. ఇతర సంస్థల కమిటీలతో సహకరించేందుకు కమిటీలు ఏర్పాటు కావాలని సూచించేరు. 1923 సెప్టెంబర్లో ఢిల్లీలో భారత జాతీయ కాంగ్రెస్ మౌలానా అబుల్ కలామ్ అజాద్ అధ్యక్షతన సమావేశమైంది. ముస్లింలీగు వ్యక్తం చేసిన ఈ భావనలనే వాళ్ల తీర్మానమూ ఉల్లేఖించింది. రెండు కమిటీల్ని నియమించాలని కాంగ్రెస్ అంది. 1) రాజ్యాంగాన్ని తిరిగి రాయడానికీ, 2) ఒక జాతీయ ఒడంబడికని తయారు చేయడానికీ ఆ కమిటీలు. భారత

* పూర్తి పాఠం కోసం ఇండియన్ ఏన్యువల్ రిజిస్టర్ 1923, వాల్యూం1 పేజీ 395 –96 చూడండి

జాతీయ ఒడంబడిక కమిటీ నివేదిక[1] మీద డాక్టర్ అన్సారీ, లాలా లజపతిరాయ్ సంతకాలు చేశారు. 1923లో కాకినాడలో జరిగిన సమావేశంలో దాన్ని ప్రవేశపెట్టేరు. భారత జాతీయ ఒడంబడికతోబాటు బెంగాల్ రాష్ట్ర కాంగ్రెస్ ఓ బెంగాల్ ఒడంబడికని[2] తయారు చేసింది. బెంగాల్ ముస్లింలతో కలిసి సి.ఆర్. దాస్ ప్రోత్సాహంతో దాన్ని తయారు చేసింది. ఈ రెండు ఒడంబడికలూ విషయ నిర్ణాయక కమిటీ ముందు చర్చకి[3] వచ్చాయి. బెంగాల్ ఒడంబడికని 678 ఓట్లతో నిరాకరించేరు, అనుకూలంగా 458 ఓట్లు వచ్చాయి. జాతీయ ఒడంబడికకి సంబంధించి తీర్మానం[4] జరిగింది. కమిటీ ఇతర అభిప్రాయాలకోసం విజ్ఞప్తి చేసి, ఆ నివేదికని 1924 మార్చి 31 లోపున ఆలిండియా కాంగ్రెస్ కమిటీకి పరిశీలనార్థం పంపాలని. ఏమైనా ఆ కమిటీ దాని మీద మళ్లీ ముందుకు సాగలేదు. బెంగాల్ ఒడంబ డికకి వ్యతిరేకంగా హిందువుల వ్యతిరేకత చాలా ఎక్కువగా ఉండబట్టి అలా జరిగింది. లాలాలజపత్ రాయ్ చెప్పినట్టు కమిటీ పడిన శ్రమ మీద ఆధారపడి మరి ముందుకు వెళ్లడానికి అది అదనుకాదని.[5] అదీగాక, అప్పటికి గాంధీజీ జైలు నుంచి విడుదల అయేరు. ఆ సమస్యను ఆయనే చూసుకుంటారని అనుకున్నారు. దాంతో, డాక్టర్ అన్సారీ తను సేకరించిన సమాచారాన్ని కాంగ్రెస్‌కు అందించడంతో తృప్తి పడ్డారు.

జైలు నుంచి రాగానే గాంధీజీ సమస్యని అందుకున్నారు. 1924లో బొంబాయిలో యథోచితంగా చర్చలు సాగేయి. ఆ చర్చల ఫలితంగా ఒక అఖిలపక్ష కమిటీని ఏర్పాటు చేశారు. ఐక్యం సాధించే సమస్యని పరిశీలించేందుకు ఓ కమిటీని వేశారు. ఆ కాన్ఫరెన్స్ నిజంగానే అఖిలపక్ష కమిటీ, కాంగ్రెస్ నుంచి, హిందూ మహాసభ నుంచి, జస్టిస్ పార్టీ నుంచి, లిబరల్ ఫెడరేషన్ నుంచి, ఇండియన్ క్రిస్టియన్ల నుంచి, ముస్లింలీగ్ నుంచి, ఇంకా ఇతర సంస్థల నుంచి ప్రతినిధులు వచ్చారు. 1925 జనవరి 23న ఆ కాన్ఫరెన్స్ ఏర్పాటు చేసిన కమిటీ[6] సమావేశం అయింది. అందులో 40 మంది సభ్యులు ఉన్నారు. జనవరి 24 ఆ కమిటీ అన్ని సంస్థల ప్రతినిధులతోనూ ఓ ఉప కమిటీని నియమించింది. 1) అన్ని పార్టీలూ కాంగ్రెస్‌లె చేరేందుకు తగ్గ సిఫార్సులు చేసేందుకూ 2) స్వరాజ్యంలో అన్ని జాతులు, మతాలు, ఉపవర్గాలు శాసన తదితర ఎన్నిక సంఘాలలో ప్రాతినిధ్యం పొందే పథక కల్పన కోసమూ, ఏ ఆటంకమూ లేకుండా అందరికీ ప్రాతినిధ్యం ఉండగలిగే పథక కల్పన కోసమూ 3) స్వరాజ్య పథకం తయారు చేసేందుకూ ఆ కమిటీని వేశారు. ఫిబ్రవరి 15 లోపున

---

1. బెంగాల్ ఫాక్ట్ షరతుల కోసం, చూడండి, పై గ్రంథమే, పేజి 127.
2. ఆ ఒడంబడిక ముసాయిదా కోసం, నివేదిక కోసం అదే గ్రంథం, వాల్యూం 2 అనుబంధం పేజీ 104-108 చూడండి.
3. ఈ చర్చల గురించి, అదే గ్రంథం, పేజి 121-127.
4. తీర్మానం కోసం, అదే గ్రంధం, పేజి 122.
5. 1925లో జరిగే అఖిలపక్ష కాన్ఫరెన్స్ స్టేట్‌మెంట్ చూడండి, వాల్యూం 1, పేజి నెం. 70.
6. కమిటీ కార్య నిర్వహణ గురించి, ఇండియన్ క్వార్టర్లీ రిజిష్టరు, 1925 వాల్యూం 1, పేజీ 66-67.

నివేదికని వ్వాలని ఆ కమిటీకి సూచించేరు. పని చురుగ్గా సాగగలందుకు సభ్యులు తమలో తాము ఇంకా చిన్న కమిటీలుగా ఏర్పడ్డారు. స్వరాజ్ పథకం, ప్రధాన కమిటీకి మత ప్రాతినిధ్యం మీద పథకం తయారుచేసేందుకు అలా ఏర్పడ్డారు.

స్వరాజ్ సభ కమిటీ శ్రీమతి అన్నిబిసెంట్ అధ్యక్షతన రాజ్యాంగ నివేదికని విజయవంతంగా తయారు చేసింది. అఖిలపక్ష కమిటీకి దాన్ని సమర్పించింది. కమ్యునల్ రిప్రజెంటేషన్ పథకం రూపొందించే ఉపకమిటీ మార్చి 1న ఢిల్లీలో సమావేశమై నిరవధికంగా, ఏ తీర్మానానికీ రాలేక, వాయిదా పడింది. లాలా లజపత్ రాయ్, ఇతర హిందూ ప్రతినిధులు హాజరు కాకపోవడం వల్ల అలా జరిగింది. గాంధీ, మోతీలాల్ నెహ్రూ ఈ ప్రకటన చేశారు[1]:

"శ్రీయుతులు జయకర్, శ్రీనివాస అయ్యంగార్, జైరామ్ దాస్‌లు సమావేశానికి హాజరు కాలేకపోవడం వల్ల లాలాలజపత్‌రాయ్ వాయిదా కోరేరు. మా బాధ్యత మీద మేము వాయిదా వెయ్యలేకపోయేం. అంచేత వాయిదా విషయాన్ని కమిటీ ముందు పెట్టమని లాలా లజపత్‌రాయ్‌ని అడిగేం. తర్వాత అలానే జరిగింది. లాలాలజపత్‌రాయ్ పైన చెప్పిన పెద్దలూ హాజరు కాకపోవడంతో కమిటీ ఏ నిర్ణయం తీసుకోడానికి చాలలేదు. అదీగాక ఏ తీర్మానానికి రావడానికి కచ్చితమైన విషయ జ్ఞానం లేకపోయింది. దగ్గర్లో ఏ తీర్మానానికీ వచ్చే అవకాశమూ కనిపించడం లేదు..."

ఈ ప్రకటన ఆయా పార్టీల మనోభావాల్ని క్రోడీకరించిందని చెప్పడానికి సందేహం లేదు. ఆ కమిటీలో హిందువుల వాణి స్వర్గీయ లాలా లజపత్‌రాయ్. అలహాబాద్‌లోని 'లీడర్' పత్రికకి ఆయన చెప్పనే చెప్పేడు. తాజా ఒప్పందం కోసం తొందరలేదనీ, కొన్ని రాష్ట్రాల్లో హిందూ మెజారటీ, కొన్ని రాష్ట్రాల్లో ముస్లిం మెజారిటీలు మాత్రమే హిందూ-ముస్లిం ఐక్యానికి అన్న అభిప్రాయాన్ని అంగీకరించలేననీ అన్నాడు.

హిందూ ముస్లిం ఐక్యం గురించిన సమస్య మళ్లీ 1927లో వచ్చింది. ఈ ప్రయత్నం సైమన్ కమీషన్ విచారణకి ముందు వచ్చింది. 1916లో మాంటేగ్-ఛేమ్స్ ఫోర్డ్ విచారణకి మందులాంటి ప్రయత్నం లాగా అది విజయవంతమవుతుందని ఆశించేరు. అది లక్నోప్యాక్ట్‌లో ఫలవంతమైంది. దానికి సమాయత్తంగా ప్రముఖ ముస్లింలు ఢిల్లీలో 1927 మార్చి 20న సమావేశమయేరు. అందులో ముస్లిం ప్రయోజనాల పరిరక్షణకి కొన్ని ప్రతిపాదనల్ని[2] పరిశీలించారు. వాటిని ఢిల్లీ ప్రతిపాదనలు అంటారు. వాటిని 1927 డిసెంబర్లో మద్రాస్‌లో జరిగిన కాంగ్రెస్‌లో పరిశీలించేరు. అదే సమయంలో భారతదేశానికి స్వరాజ్ రాజ్యాంగ ముసాయిదాని ఇతర సంస్థలు తయారు చేసేందుకు ఆ బాపతు కమిటీలని నియమకాన్ని

1 సబ్ కమిటీ కార్యకలాపాల గురించి, ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్, 1925, వాల్యూం 1, పేజి 77.

2. ఈ ప్రతిపాదనలు ఇండియన్ క్వార్టర్లీ జర్నల్‌లో ఉన్నాయి, 1927, వాల్యూలం 1, పేజి 33. ఈ ప్రతిపాదనలే తర్వాత జిన్నా 14 సూత్రలకి ఆధారం అయేయి.

జరిపే అధికారాన్ని వర్కింగ్ కమిటీకి ఇస్తూ తీర్మానం[1] చేశారు. లిబరల్ ఫెడరేషన్, ముస్లిం లీగ్ చర్చల్లో పాల్గొందుకు తమ ప్రతినిధుల్ని నియమిస్తూ అలాంటి తీర్మానాల్నే చేశాయి. తమ ప్రతినిధుల్ని పంపవలసిందిగా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఇతర సంస్థల్ని అర్థించింది. అఖిల పక్ష కాన్ఫరెన్స్[2]- అని ఈ కమిటీలని పిలిచారు. 1928 ఫిబ్రవరి 12న సమావేశం అయింది. రాజ్యాంగాన్ని రూపొందించేందుకు ఓ ఉపసంఘాన్ని నియమించింది. కమిటీ రాజ్యాంగ ముసాయిదా మీద ఓ నివేదిక తయారు చేసింది. దాన్నే నెహ్రూ రిపోర్ట్ అంటారు. ఆ నివేదికని కాంగ్రెస్ మహాసభ జరగడానికి ముందు కలకత్తాలో 1928 డిసెంబర్ 22న డాక్టర్ అన్సారీ అధ్యక్షతన సమావేశమైన అఖిలపక్ష కమిటీ ముందు ఉంచేరు. 1929 జనవరి 1న సమావేశం నిరవధికంగా వాయిదా పడింది. ఏ నిర్ణయానికీ రాలేదు. ఏ సమస్య గురించీ, ఆఖరికి మత సమస్య మీద కూడా ఏ నిర్ణయమూ జరగలేదు.

ఇది కొంచెం ఆశ్చర్యంగానే ఉంటుంది. ఏమంటే ముస్లిం ప్రతిపాదనలకీ, నెహ్రూ కమిటీ రిపోర్టులోని ప్రతిపాదనలకీ మధ్య విభేదాలు మౌలికమైనవి కావు. తన సవరణలని సమర్థించుకుంటూ జిన్నా అఖిలపక్షసమావేశంలో చేసిన ఉపన్యాసం[3] బట్టి ఇది స్పష్టమవుతుంది. నెహ్రూ కమిటీ రిపోర్టుకి నాలుగు సవరణలు చెయ్యాలని జిన్నా కోరేడు. 33.1/3 శాతం కేంద్ర శాసనసభలో కావాలని ముస్లిములు చేసిన అభ్యర్థనకు సంబంధించిన సవరణ మీద మాట్లాడుతూ జిన్నా ఇలా అన్నాడు :

"తమ ప్రణాళిక ప్రకారం కేంద్ర శాసనసభలో ముస్లింలకి 33.1/3 శాతం ప్రాతినిధ్యం ఉంటుందనీ, పంజాబ్, బెంగాల్‌లలో ఇంకా ఎక్కువే ఉంటుందనీ నెహ్రూ రిపోర్టులో ఉంది. మేం అనుకునేది ఇది. ముస్లిములకు మూడోవంతు వచ్చేటట్టుంటే మీరు అనుసరించే విధానం సరైంది కాదు, ముస్లింలు మైనారిటీగా ఉన్నచోట. ఏమంటే బెంగాల్, పంజాబ్‌లు కేంద్ర శాసనసభలో తమ జనాభా రీత్యా ఎక్కువ పొందుతారు. జనాభాని దృష్టిలో ఉంచుకుని పేదల్ని ధనికుల్ని ఉంచదలచుకున్నారు. ఇది తార్కికమే కాని యుక్తం కాదు.

"అంచేత నెహ్రూ రిపోర్టు ప్రకారం ముస్లిములకి మూడోవంతు వచ్చేట్టు ఉంటే, పంజాబ్‌కి బెంగాల్‌కి ఎక్కువ ఇవ్వకూడదు. చాలా తక్కువ మైనార్టీలో ఇప్పటికే ఉన్న రాష్ట్రాలకి మరో ఐదారు సీట్లకి పంచడం మంచిది – మద్రాస్, బొంబాయి లాంటి రాష్ట్రాలకి. ఏమంటే, సింధ్ విడిపోతే బొంబాయి రాష్ట్రం ఓ ఎనిమిది శాతానికి పడిపోతుంది గుర్తుంచుకోండి. మేం మైనార్టీలుగా ఉన్న ఇతర రాష్ట్రాలున్నాయి. అంచేత, మూడోవంతు నిర్ణయించండి,

1. కాంగ్రెస్ తీర్మానం కోసం చూడండి. అదే వాల్యూం 2. పేజీ 397 – 398.
2. అఖిలపక్ష కమిటీ ఆవిర్భావం, చరిత్ర, నిర్మాణం గురించి, నివేదిక పాఠం కోసం చూడండి. అదే గ్రంథం, వాల్యూం 1, పేజీలు 1–42.
3. ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్ వాల్యూం 1, పేజి 123–124 చూడండి.

దాన్ని ముస్లింలు వాళ్లు చేసుకునే సర్దుబాట్ల ద్వారా విభజించుకోనివ్వండి."

బెంగాల్, పంజాబ్‌లలో జనాభా ఆధారంగా రిజర్వేషన్‌కి సంబంధించి – అంటే చట్టబద్ధమైన మెజార్టీకి గల హక్కుకి సంబంధించి, రెండవ సవరణ ఉంది. దాని గురించి జిన్నా ఇలా అన్నాడు :

"మొట్టమొదట్లో ముస్లిముల తరఫు నుంచి 1927 మార్చిలో ఢిల్లీ ప్రతిపాదనలని పేరున్న ప్రతిపాదనలు వచ్చేయి. వాటిని ఎ.ఐ.సి.సి. బొంబాయి, మద్రాస్ మహాసభల్లో చర్చించింది. గత ఏడాది కలకత్తాలో ముస్లింలీగు వాటిలో ఈ భాగాన్నే సుష్ఠుగా సమర్థించింది. వివరమైన చర్చల్లోకి నేను వెళ్లడం లేదు. ఇది ఒకే ఒక ప్రతిపాదనగా తేలుతుంది. అదేమిటంటే, పంజాబ్, బెంగాల్ రాష్ట్రాల్లో ముస్లింలు మెజార్టీగా ఉన్న వాళ్ల జనాభాతో తూగేట్టుగా వాళ్ల ఓటింగ్ బలం లేదు అని. ఇదొక కారణం. నెహ్రూ రిపోర్టు ఇప్పుడు మరో ప్రత్యామ్నాయం చూసింది. సార్వజనీన ఓటింగ్ హక్కు వస్తే గనక రిజర్వేషన్ అవసరం లేదని అంటోంది. అది రాని పక్షంలో పంజాబ్, బెంగాల్‌లోని ముస్లింలకి రిజర్వేషన్ ఉంటుంది అన్న విషయానికి సంబంధించి మాకు అనుమానం ఉండకూడదు. అయితే ఆదనంగా సీట్లకి హక్కు ఉండదు."

ఆయన చేసిన మూడవ సవరణ కేంద్ర ప్రభుత్వానికి రెసిడ్యుయరీ అధికారాన్ని నెహ్రూ రిపోర్టు అప్పజెప్పడం గురించి. ఆ అధికారాల్ని రాష్ట్ర ప్రభుత్వాలకి ఇవ్వాలని జిన్నా సవరణ ప్రతిపాదించేడు :

"పెద్దలారా, ఇది సంపూర్తిగా రాజ్యాంగ సమస్య. మతపరమైన గతంతో ఏ సంబంధమూ లేనిది. మా నిశ్చితాభిప్రాయం – ముస్లింలు మతభావాలకి లొంగి పోయేరని హిందువులు అంటారు, నాకు తెలుసు – ఏమంటే, మీరు ఈ సమస్యని శ్రద్ధగా పరిశీలిస్తే గనక ఆ అధికారాలు రాష్ట్రాలకే ఉండాలని".

ఆయన నాల్గవ సవరణ సింధ్ వేర్పాటుకి సంబంధించి, సింధ్ వేర్పాటుకి నెహ్రూ కమిటీ ఒప్పుకుంది. అయితే ఓ మినహాయింపు పెట్టింది. ఆ వేర్పాటు "నివేదికలో స్థూలంగా వివరించిన ప్రభుత్వం స్థాపితమయేకే"జరగాలని అంది. ఆ షరతుని తొలగించాలని సవరణ ప్రతిపాదిస్తూ జిన్నా ఇలా అన్నాడు :

"ఈ ఇబ్బంది ఉంది... ఈ రాజ్యాంగానికి లోబడి ఆ ప్రభుత్వం ఏర్పాటవక ముందే వచ్చే ఆర్నెల్లలోనో, ఏడాదిలోనో, రెండేళ్లల్లోనో ప్రభుత్వం సింధ్‌ని వేర్పాటు చెయ్యాలను కుందాం . మహమ్మదీయులు "మాకు వద్దు" అనాలంటారా... ఈ నిబంధన ఉన్నంతకాలం, రాజ్యాంగం మేరకి ఏకకాలంలో ప్రభుత్వం ఏర్పాటు జరిగేదాకా, మహమ్మదీయులు సింధ్ వేర్పాటుని వ్యతిరేకించాలని అర్థం వస్తుంది. ఈ మాటల్ని తొలగించండి. వాయవ్య

రాష్ట్రాలకి సంబంధించి అలాంటి మాటల్ని మీరు అనరని నా వాదనకి సాక్ష్యం తెస్తున్నాను. లక్నోలో సంతకం చేసిన పార్టీలు ఓ అంగీకారానికి వచ్చేయన్నట్టు దీన్ని తీర్మానంగా అంగీకరించలేమని కమిటీ అంటోంది. కమిటీ సభ్యులంటే నాకున్న అపరిమితమైన గౌరవంతోనే ఇది సమర్థనీయమైన వాదం కాదని చెప్ప సాహసిస్తున్నాను. కొంతమంది వ్యక్తుల మధ్య ఓ అంగీకారం కుదిరి ఓ ప్రత్యేక తీర్మానం ఆమోదించడం జరిగింది కాబట్టి, ఈ సమావేశంలో మనం దానికి బద్ధులమై ఉండాలా?"

హిందువులకూ, ముస్లిములకూ మధ్య విభేదం అంత పెద్దదికాదని ఈ సవరణల్ని బట్టి తెలుస్తోంది. అయినా వాటిని సర్దుబాటు చేసే కోరికా ఏదీ లేకపోయింది. హిందువులు, ముస్లిములు సాధించ విఫలమైన దాన్ని చెయ్యడానికి బ్రిటిష్ ప్రభుత్వానికి అప్పగించేరు. అది కమ్యునల్ అవార్డ్ ద్వారా ఆ పని చేసింది.

హిందువుల మధ్యా దళిత వర్గాల మధ్యా పూనాలో జరిగిన ఒప్పందం ఐక్యం[1] తేవడానికి మరో ఊపు ఇచ్చింది. 1932 నవంబరు-డిసెంబరు నెలల్లో ముస్లింలు, హిందువులు ఏదో ఒప్పందానికి రావడానికి శాయశక్తులా ప్రయత్నించేరు. ముస్లింలు అఖిల పక్షకాన్ఫరెన్స్‌లలోనూ, హిందువులు, ముస్లింలు, సిక్కులు ఐక్య కాన్ఫరెన్స్‌లలోనూ కలిశేరు. ప్రతిపాదనలు, ఎందురు ప్రతిపాదనలు జరిగేయి. అయినా అవార్డ్‌ని ఓ ఒప్పందం ద్వారా తప్పించేందుకు జరిగిన చర్చల వల్ల ఏమీ జరగలేదు. కమిటీ 23 సమావేశాలు జరిపాకా ఆఖర్న చర్చల్ని వదులుకున్నారు.

రాజకీయ సమస్యల మీద ఐక్యం సాధించడానికి ప్రయత్నాలు జరిగినట్టే సాంఘిక, మతపర సమస్యల మీద ఐక్యం సాధించడానికి ప్రయత్నాలు జరిగేయి. అవెలాంటివీ అంటేః

1) గోవధ 2) మసీదుల ముందర సంగీతం 3) మత మార్పిడి. వీటి మీద విభేదాలుండేవి. మొట్టమొదట ప్రయత్నం భారత జాతీయ ఒడంబడిక జరిగినపుడు 1923లో చేశారు. అది విఫలమైంది. అప్పట్లో గాంధీ జైల్లో ఉన్నాడు. ఆయన 1924 ఫిబ్రవరి 5న జైలు నుంచి విడుదల అయేడు. హిందూ-ముస్లిం ఐక్యం కోసం తను చేసిన కృషి బూడిద పాలైందని చూసి నిర్ఘాంతపోయాడు. దాంతో 21రోజుల ఉపవాస దీక్షకి నిర్ణయించుకున్నాడు. హిందువులకీ ముస్లిములకీ మధ్య పరస్పర హత్యాకాండకి నైతికంగా తనదే బాధ్యత అని భావించి ఆ దీక్ష పట్టేడు. ఆ ఉపవాస దీక్షని ఆసరా చేసుకుని అన్ని మతాల భారతీయుల్ని ఒక ఐక్య సమావేశం[2]లో కలవ ప్రయత్నించేరు. దానికి కలకత్తా మెట్రోపాలిటన్ కూడా హాజరవడం జరిగింది. 1924 సెప్టెంబరు 26 నుంచి అక్టోబరు 2 దాకా ఆ కాన్ఫరెన్స్

1 ఈ ప్రయత్నాల గురించిన వివరాలకి ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్, 1932, వాల్యూం 2, పేజీ 296 చూడండి.

2. పట్టాభి సీతారామయ్య, కాంగ్రెస్ చరిత్ర పేజీ 532.

దీర్ఘ సమావేశాలు జరిపింది. మత విశ్వాసాలని అనుసరించే స్వేచ్ఛా సూత్రాల్ని అమలు పరచడానికీ, రెచ్చగొట్టినా గానీ పక్కకి ఏ మాత్రం మళ్లినా ఖండించడానికీ ఆ కాన్ఫరెన్స్ ప్రతిజ్ఞ చేసింది. గాంధీ అధ్యక్షతన ఓ కేంద్ర జాతీయ పంచాయితీని ఏర్పాటు చేశారు. మత విశ్వాసాల్ని వెల్లడి చెయ్యడానికీ, అనుసరించడానికీ సంబంధించీ, మత అనుష్ఠానాల్ని అనుసరించడానికీ, ఆరాధనా స్థలాల పవిత్రత కాపాడ్డానికీ, గోవధకీ, మసీదుల ముందు సంగీతానికీ సంబంధించీ కొన్ని మౌలిక సూత్రాల్ని రూపొందించింది. వాటిని ఏ పరిమితులకి లోబరిచి ఉంచాలో ప్రకటన చేసింది. ఈ ఐక్య సమావేశం మతవర్గాల మధ్య శాంతిని స్థాపించలేకపోయింది. ఆనాడు సర్వ సామాన్యం అయిపోయిన కల్లోలాలని కొంత ఉపశమింప చేసిందంతే. 1925-26 మధ్య అల్లర్లు మళ్లీ చెలరేగాయి. అంతకు ముందెన్నడూ యెరగనంత తీవ్రతలో, దౌష్ట్యంతో చెలరేగాయి. ఈ అల్లర్లతో కలవరపడిన, ఆనాటి వైస్రాయి లార్డ్ ఇర్విన్ 1927 ఆగస్టు 29న కేంద్ర శాసనసభకి ఒక విజ్ఞప్తి చేశాడు. ఆయన విజ్ఞప్తి తర్వాత మరో ఐక్య సమావేశం జరిగింది. దాన్ని సిమ్లా సమావేశం అంటారు.[1] ఈ సమావేశం 1927 ఆగస్టు 30న జరిగింది. సత్ఫలితకరమైన ఒడంబడికని వచ్చేటందుకు తమ తమ నాయకులు చేసే ప్రయత్నాలకి తోడ్పాటు ఇమ్మని ఆ సమావేశం ఉభయపక్షాల వాళ్లకీ విజ్ఞప్తి చేసింది. ఒక ఐక్య కమిటీని నియమించింది. ఆ కమిటీ జిన్నా అధ్యక్షతన సెప్టెంబరు 16 నుండి 22 దాకా సమావేశమైంది. గోవధ, సంగీతం సమస్యలాంటి ప్రధాన అంశాల మీద ఏ తుది ఏర్పాటూ జరగలేదు. కమిటీ ముందు పరిష్కారం కోసం పడి వున్న వాటిని అసలు ముట్టుకోనే లేదు. కమిటీ ముగింపు అవుతుందని కొందరు అనుకున్నారు. భవిష్యత్‌లో మరో అనుకూలమైన తేదీన కమిటీ మళ్లీ కలవాలని హిందూ సభ్యులు పట్టుబట్టేరు. ముస్లిం సభ్యులు మొదట తలా ఓ అభిప్రాయం చెప్పేరు, ఆఖరికి కమిటీ ముగుస్తుందని అన్నారు. పదకొండుమంది నిర్దిష్టసభ్యులు గనక అభ్యర్థన చేస్తే ఆరు నుంచి పదకొండు వారాలలోపుగా, అధ్యక్షుడు కమిటీని మళ్లీ సమావేశపరచాలని కోరారు. అలాంటి అభ్యర్థన రానూ లేదు, కమిటీ మళ్లీ కలవనూ లేదు.

సిమ్లా కాన్ఫరెన్స్ విఫలమవడంతో, అప్పటి కాంగ్రెస్ అధ్యక్షులు 1927 అక్టోబరు 27, 28 తేదీల్లో కలకత్తాలో హిందువులకీ ముస్లింలకీ ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేశాడు. దాన్ని కలకత్తా సమావేశం[2] అంటారు. ఉద్రిక్తమైన సమస్యలకి సంబంధించి ఆ సమావేశం కొన్ని తీర్మానాలు ఆమోదించింది. ఆ తీర్మానాలకి ఏ వెనక దన్నూ లేదు, ఏమంటే హిందూ మహాసభగాని, ముస్లిం లీగు గాని ఆ సమావేశంలో పాల్గోలేదు.

ఒకప్పుడైతే హిందూ–ముస్లిం ఐక్యం అనేది ఓ ఆదర్శనీయం అనేదాన్ని సాధించ

1. ఈ కార్యక్రమ వివరాలకోసం, ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టరు, వాల్యూం 2, పేజీలు 39–50 చూడండి.
2. ఆ వివరాల కోసం ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్, వాల్యూం 2, పేజి 50–58 చూడండి.

తీరాలనడమే కాదు సాధించగలమనీ, తగినంత ప్రయత్నం చెయ్యకపోవడం తప్పు నాయకులదేననీ అనగలిగేవాళ్ల అలాంటి అభిప్రాయాన్ని 1911లో, హిందూ ముస్లిం ఐక్యం కోసం ఏ ప్రయత్నమూ ప్రత్యేకంగా చెయ్యని, మౌలానా మహమ్మద్ ఆలీయే వెల్లడి చేశాడు. 'కామ్రేడ్' అనే పత్రికలో 1911 జనవరి 14న రాస్తూ ఆయన అన్నాడు [1]:

"ఇండియా ఐక్యంగా ఉందన్న ఘోషలో మాకు నమ్మకం లేదు. ఐక్యం ఉండి ఉంటే గనక ఈ ఏటి కాంగ్రెస్ అధ్యక్షుణ్ణి ఏ సుదూర ప్రాంతం నుంచో ఈడ్చుకు రావాల్సిన అగత్యం ఏం ఉంది? విందు గురించిన ఊహ మాత్రమే ఆకలి నకనకల్ని చల్లార్చలేదు. పేరాశతో ఉన్న గుత్తాధిపత్యం తీవ్రమైన దేశభక్తిగా సూక్ష్మ పరుసవేదితో మారుతుందన్న సద్భక్తి నటనలో మాకు ఇంకా అంత నమ్మకం లేదు... మనం గాఢంగా ప్రేమించి, అమితంగా భయపడి, ఏ మాత్రం నమ్మని వ్యక్తి అసహనపూరిత ఆదర్శవాది బైరన్ అద్భుతాశ్చర్య జనక కవి అనీ, కాని ఆలోచనలో పడితే పసివాడనీ గాథె అన్నాడు. ఎక్కువ ఆదర్శాల్ని, అధిక అసహనాన్నీ మేళవించుకున్న వ్యక్తి గురించి మనం అంతకంటే ఎక్కుగానూ అనుకోలేం, తక్కువగానూ అనుకోలేం. ఎంతో సదుద్దేశపూరిత యత్నాలు, అలానే అక్రమంగా పుట్టిన యత్నాలు ఈ దారి తప్పిన దేశానికి ఐక్యాన్ని ప్రసాదించడంలో విఫలం అయేయి. మనం మరో తప్పుడు నిర్ణయం చేస్తే దాని సమాధి మీదకి వాసనలేని, చవకబారు భావనా పుష్పాన్ని కూడా మిగల్చలేం. పగిలిన గాజుపెంకుల్ని అతికించే ప్రయత్నం చెయ్యవద్దు. తర్వాత అయ్యో అని ఏడవనూ వద్దు, లేదా కట్టుకు లొంగని పదార్థాన్ని నిందించనూ వద్దు, మరోమాటలో చెప్పాలంటే పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కొనే ప్రయత్నం చేద్దాం, వాస్తవాల్ని వాస్తవాలుగా చూద్దాం, అవి ఎంత వికారంగా, నచ్చనివిగా ఉన్నాగానీ ఇబ్బంది కలిగించే వాస్తవాల్ని మసి పూసి మారేడుకాయ చెయ్యడం యుక్తమైన రాజనీతిజ్ఞత కాదు. ఐక్యాన్ని సాధించడానికి లోతుగా పాతుకుపోయిన దురభిప్రాయాల్ని – విభజించే అగాధంలాంటి విభేదాల్ని, ఐక్యాన్ని అడ్డగించే వాటిని – నిష్కంకోచంగా, నిర్మొహమాటంగా గుర్తించడం తక్కువ విజయం ఎంతమాత్రం కాదు."

ఈ ముప్పై ఏళ్ల చరిత్రను తిరిగి చూసుకుంటే హిందూ ముస్లిం ఐక్యం సాధించేమా అని ఎవరేనా అడగచ్చు. దాని సాధించడం కోసం ప్రయత్నాలు జరగలేదా? ఇంకా చెయ్యాల్సిన ప్రయత్నాలున్నాయా? హిందూ ముస్లిం ఐక్యం ఏర్పడలేదని ఈ ముప్పై ఏళ్ల చరిత్ర తెలియజేస్తోంది. తద్భిన్నంగా, వాళ్ల మధ్య ఎన్నడూ లేనంత అనైక్యం ఉంది. నిజాయితీపూర్వకమైన, నిరంతరమైన ప్రయత్నాలూ జరిగాయి. ఇక చెయ్యవలసింది ఏమీ మిగల్లేదు, ఏదో ఒక పక్షానికి లొంగిపోవడం తప్ప. ఏ మాత్రం అవకాశం లేని చోట ఆశావాదాన్ని కలిగించుకునే అలవాటు ఉన్న ఎవళ్లైనా, హిందూ ముస్లిం ఐక్యం అనేది మరీచిక

1. కాకినాడ కాంగ్రెస్ అధ్యక్షోపన్యాసంలో (1923) ఉల్లేఖితం.

అనీ, ఆ భావాన్ని త్యజించడం మంచిదనీ అంటే ఎవరూ అతన్ని నిరాశావాది అనీ, అవకాశ పూరిత ఆదర్శవాది అనీ నిందించడానికి లేదు. ఈ ఎండమావుల వెంట గత ప్రయత్నాలు విఫలం అయ్యేక కూడా పడతారా లేదా, ఐక్యాన్ని సాధించే యత్నం విరమించుకుంటారా, లేక వేరే పరిష్కారం కోసం చూస్తారా అనేది చెప్పాల్సింది హిందువులు.

ఇక రెండవదిగా ప్రస్తావించుకోవాల్సింది ముస్లిం దృక్పథం. ఇది ఆమూలాగ్రం మారిపోయింది. ఎంత మార్పో అనేది రెండు దేశాల సిద్ధాంతాన్ని పాకిస్తాన్ ఏర్పాటుని హిందూ–ముస్లిం ఐక్యం సమస్య పరిష్కారానికి సూచించే వాళ్లు లోగడ చేసిన ప్రకటనల్ని బట్టి అది తెలుస్తుంది. వీళ్లల్లో జిన్నాని మొట్టమొదట చెప్పుకోవాలి. హిందూ–ముస్లిం ఐక్యం విషయంలో ఆయన అభిప్రాయాలు ఎంత మారిందీ చూస్తే తల తిరగకపోయినా, చాలా కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. ఆయన అభిప్రాయాలు ఎంతలా మారిందీ తెలుసుకోవడానికి లోగడ ఆయన అన్న మాటల్ని ఇప్పుడు చేస్తున్న ప్రకటనల్నీ పోల్చి చూడాలి.

ఆయన లోగడ చేసిన ప్రకటనల పరిశీలన 1906తో మొదలు పెడితే బాగుంటుంది. అప్పుడు ముస్లిం నాయకులు లార్ మింటో దర్శనం కోసం వెళ్లి, ముస్లింలకి ప్రత్యేక నియోజకవర్గాలు కావాలని అభ్యర్థించేరు. జిన్నా ఆ ప్రతినిధివర్గంలో సభ్యుడు కాదు. ఆయన్ని ప్రతినిధివర్గంలోకి ఆహ్వానించేరో లేదో తెలీదు. లేకపోతే ఆయన నిరాకరించేడో తెలీదు. ఏమైనా ఆయన ప్రత్యేక నియోజకవర్గాల కోసం చేసిన విజ్ఞాపన బలపర్చలేదు 1906లో.

1918లో జిన్నా ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యత్వానికి రాజీనామా చేశాడు, రౌలట్ బిల్లుకి వ్యతిరేకంగా.* రాజీనామా చేస్తూ జిన్నా ఇలా అన్నాడు :

"ప్రస్తుతం ఉన్న పరిస్థితుల్లో, కౌన్సిల్‌లో నేను కొనసాగడం వల్ల నా ప్రజలకి ఏమీ ఉపయోగపడలేను. ఆత్మగౌరవం చంపుకుని, కౌన్సిల్‌లో సభ్యుల పట్ల అంత అగౌరవం చూపించే ప్రభుత్వంతో సహకరించడమూ సాధ్యం కాదు. ఆ ప్రభుత్వం బయట ఉన్న ప్రజానీకం భావాల్ని, అనుభూతుల్ని అగౌరవ పరుస్తోంది."

అప్పట్లో చర్చలో ఉన్న సంస్కరణ బిల్లు మీద భారత ప్రభుత్వం పార్లమెంట్ జాయింట్ సెలెక్ట్ కమిటీని నియమించింది. 1919లో దాని ముందు జిన్నా సాక్ష్యం చెప్పేడు. హిందూ–ముస్లిం సమస్య మీద సభ్యులు అడిగిన ప్రశ్నలకి ఆయన ఇలా జవాబులు ఇచ్చేరు.

* కౌన్సిల్‌లో భారత సభ్యుల నిరసన ఉన్నాగానీ ఆ బిల్లుని చట్టం చేశారు, 1919, IX 'అనార్కికల్ అండ్ రివల్యూషనరీ క్రైమ్స్ ఆక్ట్' అన్న పేరుతో.

# మేజర్ ఆర్మ్ బీ. గోర్ విచారణ

ప్రశ్న 3806 - మీరు ముస్లింలీగు తరపున వచ్చేరు. అంటే భారతదేశంలో విస్తృతంగా వ్యాపించిన మహమ్మదీయ సంస్థ తరపున?

- అవును.

ప్రశ్న 3807 - ఇవాళ ఉదయం మీరు చేసిన ఉపన్యాసంలో గాని, అడిగిన ప్రశ్నలకు మీరు చెప్పిన జవాబుల్లో గాని మీరు భారతదేశంలో ఉన్న మహమ్మదీయుల ప్రత్యేక ప్రయోజనాలకి సంబంధించి ఏ సూచనా చెయ్యలేదు. మీకు ఏమీ చెప్పాలని లేక అలా చేశారా ?

- లేదు, సౌత్‌బరో కమిటీ దాన్ని ఆమోదించిందని నేను భావించడం వల్ల వాళ్ళు వెయ్యదలచుకున్న ఏ ప్రశ్ననైనా వేశారు. లక్నో ఒప్పందంలో నేను ప్రముఖపాత్ర వహించేను. ఆ సమస్యమీద నేను ముస్లింలకి ప్రాతినిధ్యం వహించేను.

ప్రశ్న 3809 - ఆలిండియా ముస్లింలీగు తరపున మీరీ కమిటీని భారత ప్రభుత్వ ప్రతిపాదనల్ని తిరస్కరించమని కోరతారా?

- ఆ విషయం అడిగేందుకు నాకు అధికారం ఇచ్చేరు, బెంగాల్‌కి సంబంధించి (అంటే బెంగాల్ ముస్లింలకి మరింత ప్రాతినిధ్యం ఇచ్చే విషయాన్ని లక్నో ఒడంబడిక ద్వారా వచ్చిన ఆ విషయాన్ని) తిరస్కరించేట్టు అడగాలి.

ప్రశ్న 3810 - మీరు భారతదేశ వైఖరి నుంచి మాట్లాడుతున్నానని అన్నారు. మీరు నిజంగా భారత జాతీయవాదిగానే మాట్లాడుతున్నారా ?

- ఆఁ, మాట్లాడుతున్నాను.

ప్రశ్న 3811 - ఆ వైఖరితో ఉంటే మహమ్మదీయులకి ఉన్న ప్రత్యేక ప్రాతినిధ్యం త్వరలో పోతుందని మీరు భావిస్తున్నారా?

- అవును, అలానే భావిస్తున్నాను.

ప్రశ్న 3812 - అంటే రాజకీయ జీవితంలో ముస్లింలకీ హిందువులకీ మధ్య విభేదం అతి త్వరలో పోవాలని మీరు కోరుతున్నారా ?

- అవును, ఆరోజు వస్తే నాకు అంతకంటే సంతోషం మరి ఉండదు.

ప్రశ్న 3813 - మహమ్మదీయులకి ఒక్తి భారతదేశంలోనే గాక, బయట ఒక ప్రత్యేక మహమ్మదీయ జాతిగా విశిష్టత ఉందని ప్రత్యేకం ఆత్రుతగా ఉంటారు కదా, అలాంటి మహమ్మదీయులకి చాలా ప్రత్యేక ప్రయోజనాలు భారతదేశంలో ఉంటాయని అనడం నిజమని మీరు భావిస్తున్నారా?

– ఇక్కడ రెండు విషయాలున్నాయి. ప్రత్యేక ప్రయోజనాలు అని మీరు పిలిచేవి మహమ్మదీయులకి భారతదేశంలో చాలా తక్కువ ఉన్నాయి, అంటే లౌకికమైనవని నా అభిప్రాయం.

ప్రశ్న 3814 - నేను వాటి గురించే అంటున్నానుకోండి ?

– అందుకనే ప్రత్యేక నియోజకవర్గాలు మాసిపోయే రోజు ఎంతో దూరం లేదనే నిజంగా నా ఆశ.

ప్రశ్న 3815 - అయితే, భారతదేశంలో ఉన్న ముస్లింలు భారత ప్రభుత్వ విదేశాంగ విధానం పట్ల ప్రత్యేక ఆసక్తి చూపించడమూ నిజమే కదా ?

– ఆ, చాలా ఎక్కువగా - కాదు, మీరు రూపొందించి ప్రతిపాదించింది చాలా ఎక్కువ ఆసక్తిని. అధిక సంఖ్యాకులకి చాలా దృఢమైన అభిప్రాయాలున్నాయి, భావనలు ఉన్నాయి.

ప్రశ్న 3816 - మహమ్మదీయుల ప్రతినిధిగా మాట్లాడేటప్పుడు, ఓ నియోజకవర్గం పట్ల భారత ప్రభుత్వం మరింత బాధ్యతగా ఉండాలన్న మీ ఆతృతకి కారణాల్లో ఒకటి అదేనా ?

– కాదు.

ప్రశ్న 3817 - బ్రిటిష్ సామ్రాజ్యంలో ఉంటూ భారత్‌కి ఒక విధానం, మంత్రివర్గం సలహా మేరకి ఘనత వహించిన ప్రభువులు అనుకరించే విధానం మరొకటి ఉండడం సాధ్యమని మీరు భావిస్తున్నారా ?

– నన్ను ఓ విషయం స్పష్టం చెయ్యనీయండి. ఇది విదేశాంగ విధానానికి సంబంధించిన విషయం కానే కాదు. ఇది చాలా క్లిష్టమైన పరిస్థితి అని భారతదేశంలో ఉన్న ముస్లింలు అనుకుంటున్నారు. ఆధ్యాత్మికంగా సుల్తాన్‌గాని, ఖిలాఫ్ గాని వాళ్ల అధినేత.

ప్రశ్న 3818 - ఒకే మతానికి అనా?

– సున్నీ శాఖకు, అయితే అదే అధిక సంఖ్య కలది. భారతదేశంలో చాలా

అధిక సంఖ్యలో ఉన్న శాఖ అదే. మా అభిప్రాయం ప్రకారం ఖిలాఫ్ పవిత్ర స్థలాల న్యాయబద్ధమైన ఉపద్రష్ట, పవిత్ర స్థలాల్ని ఒట్టామాన్ సామ్రాజ్యం నుంచి విడదీయరాదని ముస్లింలు చాలా గట్టిగా భావిస్తారు. అవి సుల్తాన్ నేతృత్వంలో ఒట్టామాన్ సామ్రాజ్యంలోనే ఉం డాలి.

ప్రశ్న 3819 - సంస్కరణ బిల్లు నుంచి విదేశాంగ విధానానికి మళ్లాలనుకోవడం లేదు నేను.

- దానికీ విదేశాంగ విధానానికీ ఏ సంబంధమూ లేదని అంటున్నాను. ప్రపంచ వ్యాప్తంగా ముస్లింలకి సంబంధించిన విషయాల్లో భారత ముస్లింలు ఓ ప్రత్యేక వైఖరిని అవలంబిస్తారా అన్నది మీరు సూచించిన విషయం.

ప్రశ్న 3820 - నే చెప్పేదేమిటంటే, భారత ప్రభుత్వ విదేశీ విధానానికి సంబంధించి కేంద్ర ప్రభుత్వం మీద ఏదన్నా నియంత్రణ ఉండాలని వాళ్లు కోరుతున్నారా అని.

- లేదు.

## బెన్నెట్ విచారణ

ప్రశ్న 3853 - అలాంటిది ఏదన్నా జరిగితే (మత కల్లోలాలు) లా అండ్ ఆర్డర్ నిర్వహణని ప్రభుత్వ కార్య నిర్వాహక పక్షంలో ఉంచడం శ్రేయస్కరం కదా?

- నేనలా అనుకోవడం లేదు, నన్నడిగితే. కాని మీరు అన్నట్టు ఇబ్బందికరమైన విషయాల జోలికి పోదలచుకోలేదు.

ప్రశ్న 3854 - పాత చిక్కుల్ని పైకి తియ్యాలని నా ఉద్దేశం కాదు. వాటిని మర్చిపోవడం మంచిదే.

- నన్నడిగినట్లయితే గనక ఓ విషయం చెప్తాను. ఈ చాలా సందర్భాల్లో ఈ అల్లర్లు దురవగాహన మీద లేచినటువంటివి. దాంతో ఈ పక్షమో, ఆ పక్షమో ఆగ్రహపూరితం అవుతుంది. భారత సంస్థానాల్లో హిందూ-ముస్లిం అల్లర్లు అనేవి దాదాపు ఏవీ లేవు. పేరు చెప్పను గాని, ఓ ముస్లిం యువరాజుని నేను అడిగేను "ఇది ఎలా జరుగుతుందని మీ అభిప్రాయం?" అని,ఆయన చెప్పేడు నాకు "ఎక్కడ గొడవ చెలరేగినా పోలీసులే ఖాయంగా అందులో ఉన్నట్లు తేలింది, వాళ్లు పక్షపాత వైఖరితో ఉండడం. మేం చూసిన పరిష్కారం ఏమంటే గొడవ జరగ్గానే ఆ పోలీసు అధికార్ని అక్కణ్ణుంచి తప్పించడం. దాంతో అది ఆఖరు."

ప్రశ్న 3855 – ఈ సమాచారం ఉపయోగకరమైంది. అయినా ఈ అల్లర్లు మతాల మధ్య చెలరేగినవన్న యదార్థం ఉండనే ఉంది కదా. ఓ పక్క హిందువులు, మరోపక్క ముస్లింలు. అలాంటి సందర్భాల్లో ఓ మతానికి చెందిన ప్రతినిధి ఉంటే శాంతిభద్రతలు స్థాపనకి భంగం లేకుండా మంత్రి కావచ్చా?

– ఎందుక్కాదు ?

ప్రశ్న 3856 – ఎందుక్కాదా?

– మరోలా భావించి ఉంటే నా మీద నేనే ఆరోపణ చేసుకున్నట్టు. నేను మంత్రిని అయితే న్యాయం, ధర్మం తప్ప మరేదీ నాకు పట్టదని నేను గుండె మీద చెయ్యి వేసుకుని ప్రకటిస్తాను.

ప్రశ్న 3857 – మీరు అవతలి పక్షానికి న్యాయం చేస్తారు లెండి. అయినా ప్రతి మనిషికీ రాగద్వేషాలు అనేవి ఉంటాయి కదా. పక్షపాతం లేకపోవడమే కాదు, ప్రజలు భావించేదేదో ఓ వైఖరి ఉంటుంది కదా, వాళ్లు అనుమానించవచ్చు కదా?

– అంటే ఈ పక్షమో, ఆ పక్షమో తనకి అన్యాయం జరిగిందనీ లేకపోతే న్యాయం జరగలేదనో భావిస్తుందనేనా మీ ఊహ ?

ప్రశ్న 3858 – అవును. ఎంత నిర్మమకారంగా ఉన్నామనుకున్నా ఉండేది అది.

– నా జవాబు ఇది. ఈ చిక్కులు శీఘ్రంగా సమసి పోతున్నాయి. అంతెందుకు, ఇటీవల కూడా బొంబాయి, థానా జిల్లాలో పై నుంచి కింద దాకా అందరూ భారత అధికార్లే – ఒక్క మహమ్మదీయుడు కూడా లేడు, అందరూ హిందువులే. అయినా ఒక ఫిర్యాదు వినలేదు. ఇటీవలే అలా ఉంది. పదేళ్లనాడు అలాంటి భేదభావం ఉందన్నారూ ఒప్పుకుంటాను. కాని ఇప్పుడది సమసిపోతోంది.

## లార్డ్ విల్లింగ్‌టన్ విచారణ

ప్రశ్న 3892 – హిందువులతో మహమ్మదీయులకి ప్రాతినిధ్యం వుండాలన్న స్థాపించ పూనుకున్న, స్థాపించిన మతపర ప్రాతినిధ్యం కొన్ని ఏళ్లల్లో సమసి పోతుందని ఆశిస్తున్నట్టు మీరు మేజర్ ఆర్మ్ బీగార్‌కి జవాబుగా మత ప్రాతినిధ్యం గురించి చెప్పారు. దాన్ని దర్శించాలని మీ ఆకాంక్ష అన్నారు. అలాంటి మహద్భాగ్యం ఎప్పుడు ఎంత త్వరగా సాధ్య పడుతుందంటారు?

– నేను కొన్ని యదార్థాల్ని మాత్రమే మీకు చెప్పగలను, అంతకు మించి ఏమీ చెప్పలేను. మీకు ఒక అవగాహన కలిగేందుకు ఈ విషయం చెప్తాను. 1913లో ఆలిండియా ముస్లింలీగు సమావేశం ఆగ్రాలో జరిగింది. అప్పుడు ముస్లింలు ప్రత్యేక నియోజకవర్గాల గురించి పట్టుబట్టాలా అక్కర్లేదా అన్నదాన్ని పరీక్షకు పెట్టేం. దాని మీద ఓటింగ్ జరిగింది. అది ప్రాంతాలవారీగా జరిగింది. ఒకో ప్రాంతానికి కొన్ని ఓట్లే ఉంటాయి. ఆ ఓటింగ్‌లో అనుకూలంగా 40 శాతం, అంటే ప్రత్యేక నియోజకవర్గాల అవసరం లేదన్న దానికి ఆ వోట్లూ, ప్రతికూలంగా 80 శాతమో ఏమో – నాకు కచ్చితంగా గుర్తు లేదు వచ్చాయి. అది 1913లో. అప్పట్నుంచి ఈ విషయం గురించి ముస్లిం నాయకులతో చర్చించే సందర్భాలు నాకు చాలా వచ్చేయి. ఈ విషయానికి సంబంధించి వాళ్ల దృష్టి మారుతోంది. కచ్చితంగా ఇన్ని ఏళ్లల్లో, ఇంత కాలంలో అని చెప్పలేనుగాని, మరీ దూరం కాదని నా అభిప్రాయం. బహుశా తరవాతి విచారణ నాటికి దీన్ని గురించి ఎంతోకొంత వింటాం.

ప్రశ్న 3893 – అంటే మళ్లీ విచారణ నాటి మహమ్మదీయులు దేశంలోని యావన్మందితో కలిసిపోవాలని అడుగుతారంటారా?

– ఆ, తరవాతి విచారణ నాటికి ఏదో కొంత తేలుతుంది.

జిన్నా ముస్లింలీగు తరపున సాక్షిగా వెళ్లేడు. అయినా దేశంలో ఉన్న ఇతర రాజకీయ సంస్థల పట్ల తనకి ఉన్న విధేయతకి తన లీగు సభ్యత్వాన్ని అడ్డు రానీయలేదు. జిన్నాకి ముస్లింలీగు సభ్యత్వంతో బాటు, హోమ్‌రూల్ లీగ్‌లోనూ, కాంగ్రెస్‌లోనూ సభ్యత్వం ఉంది. ఆయన జాయింట్ పార్లమెంటరీ కమిటీ ముందు తను మూడు సంస్థల్లో సభ్యుణ్ణని చెప్పుకున్నాడు. ఆయన కాంగ్రెస్‌తో బహిరంగంగానే విభేదించినా, ముస్లింలీగ్‌తో విభేదించినా, హోమ్‌రూల్ లీగ్‌తో విభేదించినా అలా అన్నాడు. ఆయనకి ఖిలాఫత్ ముసల్మాన్లతో ఉన్న సంబంధాల్ని బట్టి స్వతంత్రుడనీ, కాని జాతీయవాది అనీ తేలుతుంది. 1920లో ముస్లింలు ఖిలాఫత్ కాన్ఫరెన్స్ నిర్వహించేరు. అది ఎంత బలోపేత సంస్థ అయిందంటే 1924 దాకా ముస్లింలీగ్ నిష్క్రియాపూర్వకంగా అలా ఉండిపోయిందంతే. ఆరోజుల్లో ఖిలాఫత్ కాన్ఫరెన్స్‌లో సభ్యుడు కాని ఏ ముస్లిం నాయకుడూ ముస్లిం వేదిక మీద నుంచి ముస్లిం ప్రజా బాహుళ్యాన్ని ఉద్దేశించి మాట్లాడలేకపోయేడు. ముస్లింలు, ముస్లింలు కలుసుకునే వేదిక అది ఒక్కటే. అప్పుడు కూడా జిన్నా ఖిలాఫత్ కాన్ఫరెన్స్‌లో చేరలేదు. అప్పట్లో ఆయన ఇప్పుడున్నంత ఇస్లాం మతావేశంతో రగిలిపోయే నైష్ఠిక ముసల్మాన్ కాదు, శాస్త్రానికి నామకః ముస్లింగా ఉన్నాడన్నది నిస్సందేహం. ఆయన ఖిలాఫత్ కాన్ఫరెన్స్‌లో చేరకపోవడానికి అసలు కారణం

మునల్మాన్లు, భారతదేశానికి బయట ఉన్న ముస్లింల వ్యవహారాలతో ప్రాదేశికాతీత జోక్యం కలిగించుకోవడం వ్యతిరేకించడమే.

కాంగ్రెస్ సహాయ నిరాకరణ, పౌర అవిధేయత, కౌన్సిళ్ల బహిష్కరణ ఆమోదించేక ఆయన కాంగ్రెస్‌ని వదిలేశాడు. ఆయన కాంగ్రెస్‌ని విమర్శించేడు, అయితే అది హిందువుల సంస్థ అని ఎన్నడూ నిందించలేదు. తన ప్రత్యర్థులు అలాంటి ప్రకటనని తనకి ఆపాదిస్తే ఆయన నిరసన వ్యక్తం చేశాడు. అప్పట్లో 'టైమ్స్ ఆఫ్ ఇండియా' పత్రిక సంపాదకునికి ఆయన రాసిన ఉత్తరం ఒకటుంది. దాన్ని చూస్తే ఇప్పటి జిన్నాకి అప్పటి జిన్నాకీ ఎంత తేడా ఉందా అనిపిస్తుంది. కాంగ్రెస్ గురించి అప్పటి జిన్నాకి ఇప్పటి జిన్నాకీ ఉన్న అభిప్రాయాలకి హస్తిమశకాంతర విభేదం ఉంది. ఆ ఉత్తరం ఇదీ[1] :

"టైమ్స్ ఆఫ్ ఇండియా సంపాదకులకు –

అయ్యా,

నేను కాంగ్రెస్‌ను ఓ హిందూ సంస్థ అని నిందించినట్టు అక్టోబరు 1వ తేదీ సంచికలో, రెండవ కాలంలో, మీ విలేఖరి "బేంకర్" చెప్పిన విషయాన్ని మీరు ప్రాచుర్యం ఇచ్చి ఒకటికి రెండుసార్లు అదే పాట పాడడాన్ని సవరించాలని నా అభిప్రాయం. మీ పత్రికలో నా ఉపన్యాసం వచ్చినపుడే ఈ తప్పుడు వార్తని నేను బహిరంగంగా తప్పని చెప్పేను. కాని ఆ ముక్క మీ పత్రికలో రాలేదు, అంచేత నేనిస్తున్న ఈ సవరణని ప్రచురించాలని అభ్యర్థన"

ఖిలాఫత్ తుఫాన్ తగ్గిపోయింది. ముస్లింలు భారతదేశ ఆంతరంగిక రాజకీయాల మీద తిరిగి దృష్టి పెట్టేరు. ముస్లింలీగ్‌కి మళ్లీ ప్రాణప్రతిష్ఠ జరిగింది. 1924 డిసెంబరు 30న బొంబాయిలో రజాఅలీ అధ్యక్షతన జరిగిన లీగ్ సమావేశం చాలా ఆసక్తికరమైంది. జిన్నా, మహమ్మద్ ఆలీ[2] ఇద్దరూ అందులో పాల్గొన్నారు.

ఆ సమావేశంలో ఓ తీర్మానాన్ని ఆమోదించేరు. భారతదేశంలో అనేక ముస్లిం సంఘాలున్నాయి. అనేక రాజకీయ ఆలోచనల్ని అవి ప్రతిబింబిస్తున్నాయి. వాటి వాటి ప్రతినిధులందరూ త్వరలో ఢిల్లీలోనో, మరో ప్రముఖ స్థానంలోనో సమావేశం కావాలి. ముస్లిం పక్షీయులు అవసరాలకి తోడ్పడేందుకు "ఒక ఐక్య, దృఢమైన కార్యాచరణ"ని అభివృద్ధి చేసుకునే ఉద్దేశ్యంతో అలా జరిగితే బాగుంటుంది, జరగాలి. అదీ ఆ తీర్మానం. ఆ తీర్మానాన్ని వివరిస్తూ జిన్నా ఇలా అన్నాడు[3] :

1. 3.10.25న ఆ పత్రికలో ప్రచురితం.
2. కాకినాడలో జరిగిన కాంగ్రెస్ సభలో మహమ్మద్ ఆలీ సరదాగా 'జిన్నా మళ్లీ తిరిగి మన దగ్గరికి వస్తాడు' అన్నాడు. (సంతోషం వెల్లడైంది) విశ్వాసరహితుడు కాఫిర్ కావచ్చు, కాఫిర్ అలా అవచు, జిన్నా కాంగ్రెస్‌లో ఉన్నపుడు నేను లేను. నేను కాంగ్రెస్‌లో వున్నా లీగ్‌లో వున్నా ఆయన దూరంగా వున్నాడు. ఏదో ఓ రోజున రాజీకి వస్తాడు" (నవ్వుతూ)
3. టైమ్స్ ఆఫ్ ఇండియా రిపోర్టు జనవరి 1, 1925

"ముస్లిం మతస్థుల్ని వ్యవస్థీకరించడం ఇక్కడ గమ్యం. హిందువు మతంతో తగువులాడే ఉద్దేశ్యంతో కాదు, దానితో కలిసి మాతృదేశం కోసం సహకరించి, ఏకం కావడం ఉద్దేశ్యం. తాము ఒక వ్యవస్థగా ఏర్పడితే గనక హిందూ మహాసభతో చేతులు కలిపి హిందువులు మహమ్మదీయులు సోదరులు అని ప్రపంచానికి చాటవచ్చు."

అదే సమావేశంలో లీగు మరో తీర్మానాన్ని ఆమోదించింది. 33 మంది ప్రముఖ ముసల్మాన్లతో ఓ కమిటీని నియమించి, ముస్లిం పక్షీయుల రాజకీయ కోరికలని రూపొందించేందుకు ఆ కమిటీ పని చెయ్యాలని ఆ తీర్మానం. దాన్ని జిన్నాయే ప్రతిపాదించేడు. ఆ తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ జిన్నా[1] :

"తను మత దురహంకారిగా లీగు వేదిక మీద ఉన్నాడన్న ఆరోపణని ఖండించేడు. తను ఎప్పటిలాగానే జాతీయవాదినని హామీ ఇచ్చేడు. దేశ శాసనసభకి మణిపూసల్లాంటి, యోగ్యులైన వాళ్లని పంపాలని అన్నాడు. (భేష్, భేష్ అని కరతాళ ధ్వనులు). దురదృష్టవశాత్తూ సోదర ముస్లింలు అంతదూరం వెళ్లగలిగేట్టు లేరు. తను పరిస్థితి ఎలా ఉందో చూడకుండా కళ్లు మూసుకోలేడు. చాలామంది ముస్లింలు శాసనసభలో ప్రత్యేక ప్రాతినిధ్యం కావాలని కోరుతున్నారు, అది యదార్థం. దేశంలో ఉన్న ఉద్యోగాల్లోనూ అంతే. మత సామరస్యం గురించి మాట్లాడుతున్నారు. సరే, అదెక్కడ ఉంది? ఏదో ఉచితమైన పరిష్కారంతో దాన్ని సాధించాలి. చెవులు చిల్లులు పడే హర్షధ్వానాల మధ్య, ఆయన అన్నాడు తన తోటి మతస్థులు స్వరాజ్యం కోసం పోరాడతారని. కాని కొన్ని రక్షణలు కావాలని అన్నాడు. తన అభిప్రాయం ఏదైనాగానీ, క్రియాశీల రాజకీయవాదిగా తను పరిస్థితిని అంచనా వెయ్యాలని అన్నాడు. ఐక్యానికి నిజంగా అవరోధంగా ఉన్నది మతాలు కాదు, రెండువేపులా ఉన్న తుంటరులు అన్నాడు."

సిసలైన జాతీయవాది మాత్రమే నిందించగల పదబంధాల్తో తుంటరుల్ని చీల్చి చెండాడేందుకు ఆయన జంకలేదు. 1924 మే 24న లాహోర్‌లో అధ్యక్షునిగా లీగ్ సమావేశంలో ఆయన అన్నాడు[2] :

"స్వేచ్ఛాయుతులైన వాళ్లు కావాలనుకుంటారా ఐక్యం కండి. లేక బ్యూరాక్రసీకి దాసులుగా ఉండాలనుకుంటారా మీలో మీరు కొట్టుకు చావండి. అల్ప విషయాల మీద లేనిపోని గొప్పలు పొండి, ఇంగ్లీషు వాళ్లు పిట్ట తగువు పిట్ట తగువు తీర్చే పిల్లిలా ఉంటారు."

1925లోను, 1928లోనూ రెండు అఖిలపక్ష సమావేశాలు జరిగేయి. సంయుక్త నియోజకవర్గాల పునాది మీద హిందూ-ముస్లిం సమస్యని పరిష్కరించేందుకు జిన్నా

1. ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్, 1924, వాల్యూం 2 పేజి 481.
2. ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్, 1924, వాల్యూం 1, పేజీ 658.

సంసిద్ధుడయేడు. 1927లో ఆయన లీగు వేదిక మీద నుంచి బహిరంగంగా ఇలా అన్నాడు[1]:

"నేను ప్రత్యేక నియోజకవర్గాలకి కట్టుబడి లేను. తమ భద్రతకి ఇదొక్కటే పద్ధతి అని అధిక శాతం ముస్లిములు దృఢంగా, నిజంగా నమ్ముతూ ఉన్నాగానీ."

1928లో సైమన్ కమీషన్‌ని బహిష్కరించేందుకు జిన్నా కాంగ్రెస్‌తో కలిశేడు. హిందువులు ముస్లింలు ఒక పరిష్కారానికి రాలేకపోయినా, లీగ్‌ని రెండుగా చీల్చే స్థితి వచ్చినా ఆయన అలా చేశాడు.

మత సమస్య అనే బండరాతికి ఢీకొని రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్ అనే ఓడ భంగం కాబోతూ ఉన్నాగానీ, అందుకు బాధ్యుడైన మతవాదిగా పేరు పడ్డాన్ని జిన్నా నిరసించేడు. మత సమస్యకి అందరికీ ఆమోదయోగ్యమైన పరిష్కారం ఉండాలి గాని బ్రిటిష ప్రభుత్వ మధ్యవర్తిత్వాన్ని తాను కోరనన్నాడు. 1931 ఆగస్టు 8న అలహాబాద్‌లో జరిగిన యు.పి. ముస్లిం కాన్ఫరెన్స్‌లో మాట్లాడుతూ ఆయన ఇలా అన్నాడు[2] :

"మొట్టమొదటగా నేను మీకు చెప్పదలచుకున్నది ఒకటే. ముస్లిమ్‌లంతా ఏకతాటి మీద ఉండడం చాలా ముఖ్యం, ఆవశ్యకం. మీకు పుణ్యం ఉంటుంది. అంతర్గత తగాయిదాలు మానండి, విభేదాలు విస్మరించండి. ఈ విషయం గురించి త్రికరణశుద్ధిగా డా॥ అన్సారీతో, టి.ఎ.కె. షేర్వానీతో, మౌలానా అబుల్ కలాం అజాద్‌తో, డా॥ సయ్యద్ మహమూద్‌తో నా శక్తివంచన లేకుండా మాట్లాడేను. భారతదేశ తీరందాటి నేను వెళ్లే ముందుగానే, మన విభేదాలు ఏమైనాగానీ, మన విశ్వాసాలు ఏమైనాగానీ, మనలో మనం పోట్లాడుకునే తరుణం ఇది కాదన్న ముక్క వింటానని ఆశిస్తున్నాను."

"నేను చెప్పదలచుకున్న మరో విషయం ఇదీ. నన్ను సర్వదా అనేక విధాల తప్పుడుగా చిత్రించే పత్రికలవాళ్లూ, హిందువులూ కొందరున్నారు. ఇవాళ గాంధీ ఉపన్యాసం చదివేను. ముస్లింలనీ, హిందువులనీ సమానంగానే తాను అభిమానిస్తానని ఆయన అన్నాడు. ఇక్కడ ఈ వేదిక మీద నుంచి నేను మళ్లీ చెపుతున్నాను, అంతలాంటి మాటలు నేను అనకపోయినా ఉభయపక్షాల మధ్యా న్యాయమైన దారి ఉండాలన్నది నా కోరిక అని మనఃపూర్వకంగా, నిజాయితీగా అంటున్నాను."

ఉపన్యాసం కొనసాగిస్తూ జిన్నా ఇంకా ఇలా అన్నాడు : "అతి ముఖ్యమైన సమస్యకి సంబంధించి చెప్పాలంటే హిందూ–ముస్లిం సమస్య పరిష్కారమే నాకు అన్నిటిన్నీ మించిందని అంటాను. హిందువులు బెంగాల్‌లోనూ, పంజాబ్‌లోనూ ముస్లింలకి మెజార్టీ అంగీకరించాలి. అలా జరిగితే క్షణాల మీద పరిష్కారం కుదురుతుంది అన్నది నా విశ్వాసం."

1. అదే పుస్తకం 1927, పేజి 37, వాల్యూం 1.
2. ఇండియన్ ఏన్యువల్ రిజిస్టర్, 1931, వాల్యూం 2, పేజీలు 230-231.

"ఇక తర్వాత తలెత్తే సమస్య ప్రత్యేక నియోజకవర్గాలు, పోటీగా ఉమ్మడి నియోజకవర్గాలు అన్నది మీకందరికీ తెలుసు, బెంగాల్, పంజాబ్‌లలో ముస్లింలకి మెజార్టీని అంగీకరిస్తే ఉమ్మడి నియోజకవర్గాల మీద పరిష్కారాన్ని వ్యక్తిగతంగా నేను కోరతాను. (కరతాళ ధ్వనులు) కాని అధిక సంఖ్యాక ముస్లింలు – మెజార్టీ ముస్లింలు – ప్రత్యేక నియోజకవర్గాలని నమ్ముతున్నారని నాకు తెలుసు. ప్రత్యేక నియోజకవర్గాల ప్రతిపాదనకి సంబంధించి కూడా నేను పరిష్కారానికి ఉన్నాను. మనం మన నూతన రాజ్యాంగాన్ని ఏర్పాటు చేసుకున్నాక, హిందు ముస్లింలు పరస్పర అవిశ్వాసాన్ని పోగొట్టుకున్నాక, భయాల్నీ అనుమానాల్నీ తొలగించుకున్నాక, స్వాతంత్ర్యం సంపాదించినప్పుడు మనం సందర్భోచితంగా మారతాం, మనలో చాలామంది అనుకున్న దానికంటే ముందుగానే ప్రత్యేక నియోజకవర్గాలు పోతాయి."

"అంచేత ముస్లిములలో మొదటగా నాకు పరిష్కారం, శాంతి కావాలి. ముస్లిమ్‌లకీ, హిందువులకీ మధ్య పరిష్కారం, శాంతి నాకు కావాలి. ఇది వాదులాడుకోవడానికి సమయం కాదు, ప్రచార కార్యక్రమానికి ఇది అదను కాదు, రెండు పక్షాల మధ్య పగలు రగిలించుకునే సందర్భం కాదు. ఏమంటే శత్రువు పొంచి ఉన్నాడు. నేను నీళ్ల నమలకుండా చెపుతున్నా, హిందూ–ముస్లిం సమస్య పరిష్కారం కాకపోతే, బ్రిటిష్ వాళ్లే మధ్యవర్తిత్వం చేస్తారు, సందేహం లేదు. మధ్యవర్తిత్వం చేసేవాడు బలాన్నీ, అధికారాన్నీ సుమారుగానే తన చేతిలో ఉంచుకుంటాడు. అంచేత, నన్ను దూషించరనే అనుకుంటాను. ముస్లింలు ఏం కోరినా ఇవ్వడానికి సిద్ధమేనని ఇంతా చేసి గాంధీయే అన్నాడు. మరి నేను చేసిన పాపం అల్లా ముస్లింలకి యీ 14 సూత్రాల్ని ఇవ్వండని హిందువులకి చెప్పడం, నిజానికి ఇవి గాంధీ అందిస్తున్న 'బ్లాంక్ చెక్' కంటే చాలా తక్కువే. నాకు 'బ్లాంక్ చెక్' వద్దు. 14 సూత్రాల్ని ఎందుకు ఒప్పుకోరు? 'మాకు బ్లాంక్ చెక్ ఇవ్వండి' అని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అన్నప్పుడు, 'మాకు బ్లాంక్ చెక్కు ఇవ్వండి, స్వదేశీ పెన్‌తో స్వదేశీ కాగితం మీద సంతకం పెడతాం' అని పటేల్ అంటున్నప్పుడుగాని వాళ్లు మతవాదులు కారు, నేను మతవాదిని! నేను హిందువులకి చెపుతున్నా ప్రతివాళ్లనీ పొరపాటుగా అర్థం చేసుకోవద్దని. మనం ఈ సమస్యని పరిష్కరిస్తామని, తద్వారా శాంతి సౌఖ్యాలు లక్షలాది దేశవాసులకి సమకూరతాయనీ నా ఆశ, విశ్వాసం."

"మరో విషయం వుంది చెప్పాల్సింది. రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌లో– ఇప్పుడది బహిరంగ గ్రంథమే, ఎవళ్లైనా దాన్ని చదివి తెలుసుకోవచ్చు నేను ఒకే ఒక సూత్రాన్ని గమనించాను. అప్పుడే, నేను బొంబాయి తీరం వదిలి వెడుతూ, భారత ప్రయోజనాలే నాకు పవిత్రమైనవనీ, నన్ను విశ్వసించమనీ ప్రజలకి చెప్పేను. ఆ కాన్ఫరెన్స్ కార్యకలాపాల నిర్వహణ గురించి చదివితే మీకు తెలుస్తుంది నేను గొప్పలు చెప్పుకోవడం లేదని. నేను విధేయంగా, విశ్వాసపూరితంగా పరిపూర్తిగా నా వాగ్దానం నెరవేర్చేనని నేను అనుకున్నదాని కంటే కాంగ్రెస్‌గాని, గాంధీగాని ఎక్కువ సాధించినట్లయితే, చెపుతున్నా, వాళ్లని నేను

అభినందిస్తా."

"తాము పరిష్కారానికి రావాలనీ, క్రమేణా మిత్రులు కావాలనీ" ముగింపుగా జిన్నా అన్నాడు. అంచేత, సంయమనం పాటించమని, విచక్షణ, రాజీ వైఖరి చూపించమనీ ముస్లింలకి విజ్ఞప్తి చేసేడు. అప్పుడు జరిగే చర్చల్లో, కాన్ఫరెన్స్‌లో చేయబోయే తీర్మానానికి సంబంధించి అలా ఉండమనీ విజ్ఞప్తి చేశాడు.

ముస్లిం భావజాలంలో వచ్చిన పరివర్తనని చూపించడానికి మరో ఉదాహరణగా బర్కత్ ఆలీకి ఒకప్పుడున్న అభిప్రాయాల్ని తెలియజేస్తాను. ఆయన ఇప్పుడు జిన్నా అనుయాయి, పాకిస్తాన్ ఏర్పాటుని గట్టిగా సమర్థించే వ్యక్తి అయ్యాడు.

సైమన్ కమీషన్‌కి సహకరించడం విషయం మీద ముస్లిం లీగు రెండుగా చీలినపుడు ఓ దానికి సర్ మహమ్మద్ షాఫ్ నాయకుడు. సహకరించాలన్న వర్గం అది. మరో దానికి జిన్నా నాయకుడు. కమీషన్‌ని బహిష్కరించాలన్న కాంగ్రెస్‌ని సమర్థించే వర్గం అది. బర్కత్ ఆలీ లీగ్‌లో జిన్నా విభాగానికి చెందిన వ్యక్తి. లీగులోని ఈ రెండు వర్గాలూ 1928లో రెండు వేర్వేరు చోట్ల తమ వార్షిక సమావేశాన్ని జరుపుకున్నాయి. షాఫీ విభాగం లాహోరోనూ జిన్నా వర్గం కలకత్తాలోనూ సమావేశం అయేయి. మత సమస్య పరిష్కారానికి సంబంధించిన తీర్మానాన్ని ప్రతిపాదించుకున్నాయి. ఆ పరిష్కారానికి ఆధారభూతమైంది ఉమ్మడి నియోజకవర్గాలు. తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ బర్కత్ ఆలీ ఇలా అన్నాడు[1] :

"లీగు చరిత్రలో మొట్టమొదటిసారిగా దృక్పథంలో మార్పు వచ్చింది. ఈ మార్పువల్ల మేం, ప్రత్యేక నియోజకవర్గాల సూత్రాన్ని వ్యతిరేకించిన హిందువులకి స్నేహపూర్వక హస్తాన్ని చాస్తున్నాం."

1928లో డాక్టర్ అన్సారీ నాయకత్వంలో నేషలిస్ట్ పార్టీ ఏర్పడింది.[2] ఈ నేషనలిస్ట్ ముస్లిం పార్టీ ముస్లింలీగ్ జిన్నా వర్గం కంటే ఓ మెట్టు ముందే ఉంది. నెహ్రూ రిపోర్టుని ఆమోదించేందుకు తయారుగా వుంది. ఏ సవరణలు లేకుండా, జిన్నా ఒత్తిడి చేసేవి కూడా లేకుండా ఆ రిపోర్టుని ఆమోదించడానికి సిద్ధ పడింది. 1927లో జిన్నా పక్షాన ఉన్న బర్కత్ ఆలీ, జిన్నా పక్షం తగినంత నేషనలిస్ట్‌గా లేదని దాన్ని వదిలేసి డాక్టర్ అన్సారీ స్థాపించిన నేషనలిస్ట్ ముస్లిం పార్టీలో చేరేడు. అప్పట్లో బర్కత్ ఆలీ ఎంత గొప్ప జాతీయవాదో సర్ మహమ్మద్ ఇక్బాల్ భారత విభజనకి ఒక పథకం తన అధ్యక్షోపన్యాసంలో[3] ప్రతిపాదించాడు. అదే పాకిస్తాన్ పేరుతో చలామణీ అయింది, దాన్నే ఇపుడు జిన్నా, బర్కత్ ఆలీలు భుజాన

1. ది ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్, 1927, వాల్యూం 2 పేజీ 448.
2. ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్, 1929, వాల్యూం 2, పేజీ 350.
3. ఆ ఉపన్యాసంకావాలంటే 'ది ఇండియన్ ఏన్యువల్ రిపోర్టు, 1930, వాల్యూం 2, పేజీ 334-45 చూడండి.

వేసుకున్నారు. దాన్ని అప్పట్లో బర్కత్ ఆలీ చాలా గట్టిగా విమర్శించేడు. 1931లో లాహోర్‌లో పంజాబ్ నేషనలిస్ట్ ముస్లిం సమావేశం జరిగింది. బర్కత్ ఆలీ ఆహ్వాన సంఘం అధ్యక్షుడు. ఆనాడు పాకిస్తాన్ గురించి ఆయన వెల్లడించిన అభిప్రాయాలు గమనార్హం.* తన పార్టీ రాజకీయ విశ్వాసాన్ని, దృఢ సంకల్పాన్ని ఉద్ఘాటిస్తూ ఆయన ఇలా అన్నాడు :

"మొట్టమొదటగా భారతదేశానికి పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉండాలని మేం విశ్వసిస్తున్నాం. భారతదేశం మా జన్మస్థలం. మాకు ప్రాణప్రదమైన బంధాలన్నీ అల్లుకున్నది ఇక్కడనే. నువ్వు మొదట ముస్లిమ్‌వి, తర్వాతనే భారతీయుడివి అని అమాయక జనాలకి బోధించే దుష్ట ప్రచారాన్ని మేం సమర్థించం. ఇలాంటి నినాదం శుష్క, అర్థరహితమైన పడికట్టు పదబంధం మాత్రమే కాదు, సాంతం కుత్సితం కూడా. ఇస్లాం పరమ ఉత్కృష్ట ప్రయోజనాల రీత్యా భారత దేశ పరమ, ఉత్కృష్ట ప్రయోజనాలకి శత్రుత్వంతోనూ ఉండదు, పోటీతోనూ ఉండదు. ఇస్లాం, భారత్ సమరూపత కలవి. భారతదేశానికి ఆటంక పూరితమైంది. ఏదన్నాగానీ ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా ఇంకా చెప్పాలంటే నైతికంగా కూడా ఇస్లాంకూ ఆటంకపూరితమైనవే. ఇస్లాంకూ భారత సంక్షేమానికీ మధ్య స్వతహాగానే పోటీ ఉందని చెప్పే రాజకీయ నాయకులు దొంగ ప్రవక్తలు, లోపల్లోపల ఇస్లాం శత్రువులు. భారత దేశం బయట వున్న మన ముస్లిం సోదరుల పట్ల మన సానుభూతి ఎలాంటిదైనా కానీ, అంటే టర్క్, ఈజిప్షియన్, లేక ఆరబ్‌ల పట్ల, అది సమున్నతమైన భావేమ, ఆరోగ్యవంతమైన భావమే సందేహం లేదు. ఆ సానుభూతి వల్ల భారత మౌలిక ప్రయోజనాలకి ఆటంకం కలిగించే రీతిలో మనం ఉండరాదు. ఆదేశాల పట్ల మన సానుభూతి నిజంగా ఎప్పుడు ఘనంగా ఉంటుందంటే, భారతదేశం దానికి స్రోతస్సుగా, పోషకంగా ధారాసదృశంగా వున్నప్పుడే. ఒకవేళ దురదృష్టవశాత్తూ దేవుడు దయతలచి అలాంటివి రాకుండుగాక. సరిహద్దులు దాటి ఏ ముస్లిం దేశమన్నా భారతదేశాన్ని బానిసను కావించడానికి వచ్చినట్లయితే, ఈ దేశ ప్రజల స్వేచ్ఛని హరించడానికి వచ్చినట్లయితే సర్వ ముస్లిం సోదర భావన ఎంతటిదైనా గానీ, దాని అర్థం ఏమైనాగానీ, ముస్లిమేతర భారతంతో ముస్లిం భారతం చెయ్యీ చెయ్యీ కలిపి భారత స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని కాపాడుకునేట్టు ముందు వస్తుంది. ఏదీ అలాంటి చర్యని అడ్డగించలేదు.

"అంచేత ముస్లిమేతర బృందాల్లో ఈ విషయం గురించి ఏ రకమైన అనుమానాల్నీ ఉండనివ్వకండి. సంకుచిత మనస్కులైన హిందూ రాజకీయవేత్తలు కొందరు భారతదేశానికి ఇస్లామ్ భూతం పట్టుకుంటుందన్న పాట పాడుతున్నారు. నాకు తెలుసు. వాయవ్య కనుమల నుండి ఆ ప్రమాదం వస్తుందంటున్నారు. కాని అలాంటి భయాలూ, ప్రకటనలూ శుద్ధ తప్పనీ, వాటికి ఆధారం లేదనీ చెప్పదలచుకున్నాను. ముస్లిం భారతం ముస్లిమేతర

* ఇండియన్ ఏన్యువల్ రిజిస్టర్, వాల్యూం 2, పేజి 234-235.

భారతం అంతగానూ భారత స్వేచ్ఛని పరిరక్షిస్తుంది. ఆ దాడి చేసే దుండగీడు ఇస్లాం అనుయాయి అయినా గానీ.

తర్వాత, మాకు స్వతంత్ర భారతం మీద విశ్వాసం వుంది. ఉండడమే కాదు, అది ఐక్య భారతంగా ఉంటుందని మా విశ్వాసం – ముస్లిం భారతమూ కాదు, హిందూ భారతమూ కాదు, సిక్కు భారతమూ కాదు. ఈ మతానికి చెందినదీ కాదు, ఆ మతానికి చెందిందీ కాదు. అందరి భారతమూనూ. ఇది మా అచంచల విశ్వాసం కాబట్టి, మేం భావిలో భారతదేశం ఓ హిందూ భారతదేశమూ కాదు, ముస్లిం భారతదేశమూ కాదు. ఓ హిందూ భారతభావనో, ఓ ముస్లిం భారత భావనో ఛాందస మానసిక దృష్టి ఉన్న ఆయా పక్షాల్ని ఎంత ఉన్మత్త పారవశ్య స్థితికి తీసుకుపోయినా మేం గొంతెత్తి దాన్ని వ్యతిరేకిస్తాం. అది ఏకపక్షంగా ఆచరణ యోగ్యం కాకపోవడమే కాదు, పరమ ఏహ్యం అయింది కూడా. ఏమంటే అది ఈనాటి ఆధునిక భారతదేశంలో ఉన్న సకల సమున్నత, శాశ్వతమైన వాటికీ మృత్యు ఘంటికని మోగించడమే కాదు, అది భారత దేశ ప్రధాన చారిత్రక సంప్రదాయానికి విరుద్ధమూ, వ్యతిరిక్తమూ కూడా. భారతదేశం అశోకుని కాలంనాడు, చంద్రగుప్తుని కాలం నాడు ఒకటిగానే ఉంది. రాజదండమూ, రాజలాంఛనమూ ప్రతీకగా నిలిచిన సార్వభౌమ అధికారం హిందువుల నుంచి మొగలాయీలకీ, ముస్లిం హస్తాల్లోకి మారినపుడూ అలానే ఉంది. మనం కోరుకునేది మనకి సిద్ధించినపుడు కూడా భారతదేశం అలానే ఉంటుంది. మనం స్వాతంత్ర్య శిఖరాలు అధిరోహించినపుడు అలానే ఉంటుంది. మనల్ని దీప్తవంతం చేసే ఆ దీధితులు బింబ ప్రతిఫలనంగా ఉండవు. మన వదనాల నుంచి ఉన్నవి ఉన్నట్టుగా ఉద్భూతమయే కాంతిలాగా ఉంటాయి.

"లీగ్ అధ్యక్షపీఠం నుంచి సర్ మహమ్మద్ ఇక్బాల్ ప్రతిపాదించిన విభక్త భారత భావన వల్ల ఎవరూ మోసపోకూడదు, అదేదో భారతదేశం వరించిన ముస్లిం భావన అని. ఆయన ఆ ప్రతిపాదనని ఆ సంస్థ దాదాపు మాసిపోయిన దశలో, ఇస్లాంకి ప్రతినిధిగా లుప్తం అయిన దశలో చేశాడు – సర్ మహమ్మద్ ఇక్బాల్ తర్వాత ఆ భావనని వెనక్కి తీసుకున్నందుకు నాకు సంతోషంగా ఉంది. ఒకవేళ సర్ మహమ్మద్ ఇక్బాల్ ఆ మాటల్ని ఉపసంహరించుకోకపోయినా కూడా, నేను దాన్ని నదురూ బెదురూ లేకుండా, నిస్సందేహంగా మన ప్రతిభకి ఆవిర్భూత ఇస్లాం తరానికి సంబంధించి పరాయి భావనగా ఖండించి ఉండేవాణ్ణి, భారతదేశ మతపర విభజన ఉండడానికి వీల్లేదని దృఢంగా చాటేవాణ్ణి. ఇస్లాం, హిందూ మతం రెండూ కూడా భారతదేశ సరిహద్దులోపలే సమానంగా ఉండాలి. ఏ సంకుచిత హద్దులకీ భారతదేశం కృశించి, కుంటి, కురచ అయిపోకూడదు. డాక్టర్ ఇక్బాల్ సూచించిన ముస్లిం భారతం, హిందూ భారతంలాంటిదే కొంతమంది సిక్కు మతవాదులు పంజాబ్ విభజనని, చీలికని కోరడం కూడా.

స్వేచ్ఛా భారతదేశంలో ఉన్న యావత్ జనాభా సమాన హక్కులు, ఏ విచక్షణలూ

లేకుండా, అపశ్రుతులూ లేకుండా అనుభవిస్తారు. సిసలైన ప్రజాస్వామిక పద్ధతిలో, వయోజన ఓటు హక్కు పద్ధతి మీద ఉమ్మడి నియోజకవర్గాల ద్వారా ఎన్నికైన ప్రతినిధులు చట్టాలు చేసి వాటిని కాపాడతారు. ఆ చట్టాల్ని నిష్పక్షపాతంగా అమలు జరిపే పరిపాలన ఉంటుంది. అది తన చర్యలకి పూర్తి బాధ్యత వహిస్తుంది. ఎక్కడో సుదూరంలో ఉన్న విదేశీ పార్లమెంట్ కాక ఈ దేశప్రజలే ఎన్నుకున్న ప్రతినిధులు ఉంటారు. అలాంటి స్వతంత్ర, ఐక్య భారత భావన అంత విస్తృతంగా ఉంటుంది. అలాంటి సందర్భంలో నేనూహించిన చిత్రం గురించి వివరాలన్నిట్నీ మీ ముందుంచక్కర్లేదు. ఇక్కడ నేను నేషనలిస్టు ముస్లిం పార్టీ లక్ష్యాల గురించీ, ఉద్దేశ్యాల గురించీ నా సాధారణ అభిప్రాయాల్ని ముగించి వుండేవాణ్ణి, ప్రత్యేక నియోజకవర్గాలా, ఉమ్మడి నియోజకవర్గాలా అన్న చర్వితచరణ చర్చ ఇంత ప్రాముఖ్యాన్ని సంతరించుకుని ప్రజా జీవితంలో పాల్గొంటున్న ఎవళ్లూ ఉపేక్షించలేనిదిగా అవకుండా ఉంటే.

"ఇవాళ ఆస్తి వర్గ సంపన్న వర్గాలు కృత్రిమంగా రూపొందించిన ఓటు హక్కుతో, ఎన్నికల పట్టికలో మైనారిటీగా అధిక సంఖ్యాక జనం పడిపోయే ఈ స్థితిలో, మత పూరిత ఆవేశ కావేషాలు ఎక్కువగా ఉన్నప్పుడు, సర్వవ్యాప్తిగా తయారయ్యే చీడలా వాతావరణాన్ని సర్వే సర్వత్రా అవిశ్వాసం విష కలుషితం చేసేటప్పుడు ప్రత్యేక నియోజకవర్గం విలువ, ఉపయోగం ఎలాగేనా ఉండనీయండి. ఇవాళ్టి భారతదేశంలోనూ, భవిష్యత్ భారతదేశంలోనూ, ప్రత్యేక నియోజకవర్గాలకి ఎలాంటి స్థానమూ ఉండదు."

జాతీయవాదం గురించీ, ప్రత్యేక నియోజకవర్గాల గురించీ, పాకిస్తాన్ గురించీ జిన్నా, బర్కత్ ఆలీల అభిప్రాయాలు అవీ. ఇవాళ ఇదే సమస్యల మీద వాళ్లకి అటు సూర్యుడు ఇటు పొడిచినట్టు అభిప్రాయాలు ఎలా మారిపోయేయి?

ముస్లిం నాయకులలో ఉద్భవించిన నూతన భావజాలం గురించీ, హిందు-ముస్లిం ఐక్యాన్ని స్థాపించడంలో వాళ్ల ఘోర పరాజయం గురించీ ఎత్తి చూపించ ప్రయత్నించేను ఇంతవరకూ. ఇక మరో మూడవ విషయం ఉంది. దాన్ని కూడా ప్రస్తుత సందర్భంలోనే ప్రస్తావించాలి. అది సందర్భోచితమూ, ప్రస్తుతం మన పరిశీలిస్తున్న దానికి సంబంధం ఉన్నదీను. అదేమిటంటే, రాజకీయ తత్వవేత్తలు అంగీకరించగలిగేటంత సమర్థనీయత ముస్లిం భావజాలానికి ఉందా అని ?

పాకిస్తాన్ ఎట్టి పరిస్థితుల్లోనూ సమర్థనీయం కాదని చాలామంది హిందువుల అభిప్రాయం. మనం పాకిస్తాన్ సిద్ధాంతానికి మాత్రమే పరిమితమైతే అది చాలా పొరపాటు అభిప్రాయం. తాత్వికంగా పాకిస్తాన్‌కి సమర్థన ఎలా వస్తుందీ అంటే మతవర్గానికీ జాతికీ ఉండే విభేదాన్ని బట్టి. మొదటగా చెప్పాలంటే, ఈ విషయాన్ని ఇటీవలే గుర్తించేరు. రాజకీయ తత్వవేత్తలందరూ చాలాకాలంగా రెండు సమస్యలతోనే సతమతమయేరు.

ప్రభుత్వానికి హేతుబద్ధ పునాదిగా మైనారిటీ మీద మెజారిటీ ఏలుబడి ఏ మేరకి సమర్థనీయం అన్నది ఒకటి. ఇక రెండవది, పాలితుల ఒప్పుదల మీద ప్రభుత్వ న్యాయవిహిత ఏలుబడి యే మేరకి ఆధారపడి ఉంటుంది? పాలితుల ఒప్పుదల మీదనే ప్రభుత్వ న్యాయవిహిత పాలన ఆధారపడి ఉంటుందని నొక్కి చెప్పేవాళ్లు కూడా, తమ ప్రతిపాదన నెగ్గడంతో తృప్తి చెంది ఊరుకున్నారు. ఆ విషయం గురించి ఇక తరచి చూడలేదు. "పాలితుల" వర్గంలో ఏ తేడాల్నీ చూసే అవసరం వాళ్లకి కనిపించలేదు. పాలితులనే విభజన కిందకి వచ్చేవాళ్లు ఓ మతమైనా, ఓ జాతైనా అదేమంత పట్టించుకోవలసిన విషయం కాదని వాళ్లు అనుకున్నారు. పరిస్థితుల ఒత్తిడితో రాజకీయవేత్తలు ఈ విభేదాన్ని అంగీకరించక తప్పలేదు. ఇక రెండవ విషయం : ఇది తారతమ్యం లేని ఒట్టి తేడా మాత్రమే కాదు. ఈ భేదం యదార్థమైందీ, ఫలితంగా మౌలికమైందీనీ. మతవర్గం, జాతి వేరు అన్న విషయం రాజకీయ తత్వవేత్తలు ఓ మతానికి ఇవ్వచూపుతున్న రాజకీయ హక్కుల్ని బట్టి, చట్టబద్ధంగా ఏర్పడ్డ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఓ జాతికి ఇవ్వదలచుకున్న రాజకీయ హక్కుల్ని బట్టి తెలుస్తుంది. ఓ మతవర్గానికి తిరుగుబాటు హక్కుని ఇవ్వగలుగుతున్నారు, ఓ జాతికి హక్కునే ఇవ్వగలుగు తున్నారు. ఈ రెండింటి మధ్యా వున్న తేడా స్పష్టం, మౌలికం. ప్రభుత్వ విధానంలో, పద్ధతిలో మార్పు కావాలని ఒత్తిడి చెయ్యడం మేరకే తిరుగుబాటు హక్కు పరిమితం. దీనికంటే ఓ మెట్టు ఎక్కువది విచ్ఛిత్తి హక్కు. ఓ రాజ్యంలో ఉన్న ఓ బృందం తాము ఉంటున్న భూభాగంతో బాటుగా విడిపోయే హక్కు మేరకి అది విస్తరించుకుంటుంది. ఈ భేదానికి ఆధారం ఏమిటో తెలీదు. ఈ విషయాన్ని చర్చించిన రాజకీయ తత్వవేత్తలు ఒక మత బృందానికి తిరుగుబాటు[1] హక్కునీ, ఓ జాతికి విచ్ఛేద హక్కునీ[2] సమర్థించేందుకు వాళ్ల

1. సిద్విక్ ఇలా అంటాడు : '.... చర్చలో ఉన్న విషయం ప్రాణభూతమైందైతే తిరుగుబాటు చెడుగులు లొంగుబాటు చెడుగుల కంటే ఎక్కువే అని అనుకోవచ్చు, ఓ తిరుగుబాటు వల్ల ఒకోసారి బాధల నివారణ కలగవచ్చు, తిరుగుబాటుదార్లు శారీరకంగా దుర్బలంగా వున్నాగానీ. ఏమంటే వాళ్ల చర్యల వల్ల ఎంత గాయం అయిందో మెజార్టీ గ్రహించవచ్చు. అదే కారణాల వల్ల రాబోయే పేచీని అంగీకారం ద్వారా పరిష్కరించుకోవచ్చు. ఒక్కముక్కలో చెప్పాలంటే అల్లర్లు రేగుతాయన్న భయం రాజ్యాంగబద్ధ ప్రభుత్వానికో మరో రకం ప్రభుత్వానికో దత్తమైన అపరిమిత అధికారం మీద అది అదుపు. చాలా ఆదరణతో పాలితమయే మతవర్గానికి తిరుగుబాటుకి నైతిక హక్కు ఉండాలి' – ఎలిమెంట్స్ ఆఫ్ పాలిటిక్స్ (1929) పేజి 646–47.

2. విచ్ఛేద హక్కు గురించి సిద్విక్ ఇలా అంటాడు : "..... ప్రభుత్వం చట్ట విహితం అనే వాళ్లు పాలితుల ఒప్పుదల మీద ఆధారపడాలి. వాళ్ల ఈ అనుమితం నుంచి జంకకూడదు. పురాతన రాజ్య భూభాగంలో అధిక సంఖ్యాకులు అల్ప సంఖ్యాకుల మీద పాలిస్తూ వుంటే, అల్ప సంఖ్యాకులకి చీలిపోయి వేరే కొత్త రాజ్యం ఏర్పాటు చేసుకునే హక్కు వుండాలన్న నిబంధనతో ఆ పాలన ఉండాలి. విచ్ఛిత్తి వల్ల మొత్తం అవర్గ ప్రయోజనాలు మెరుగు పడే సందర్భాలున్నాయి. ఉదాహరణకి ఒక రాజ్య భూభాగాలు దీర్ఘ కేంద్రం వల్ల వేర్పాటుగా ఉన్నాయనుకోండి. మత విభేదాలు, గత చరిత్ర, ప్రస్తుత సాంఘిక పరిస్థితులు, ఆయా ప్రజల పరస్పర విరుద్ధ అవసరాలు, చట్టపర అవసరాలు, ఇతర రకమైన ప్రభుత్వ జోక్యాలు లాంటివి వున్నాయనుకోండి. వాళ్ల అంతరంగిక విషయాలకి ఉమ్మడి ప్రభుత్వం ఉండాలి. నేనైతే వాళ్ల సంఘటనతో సంబంధంలేని బాహ్య వ్యవహారాలుంటాయి, అవి చాలా తేడాగా వుంటాయి, ఇతరుల పేచీల్లో తలదూరిస్తే, అంటే సైనికబలం వల్లలబ్ధిపొందేవి వుంటాయి. ఇలాంటి పరిస్థితుల్లో చారిత్రక దేశభక్తి గాని, విస్తృత భూభాగం వుందన్న జాతీయ స్వామ్యంగానీ ఆటంకం రాకుండా అతకని ముక్కల్ని సహజ భాగాలుగా శాంతియుతంగా చీలిపోయేట్టు చూడాలి, శాశ్వతంగా దాన్ని ఆపలేరు. – ఎలిమెంట్స్ ఆఫ్ పాలిటిక్స్ (1929) పేజి 648–49.

వాళ్ల కారణాలు చెప్పేరు. ఈ విభేదం ఇదీ : ఓ మతవర్గానికి భద్రత నపేక్షించే హక్కు వుంది, ఓ జాతికి విడిపోయే హక్కు ఉంది. ఈ తేడా స్పష్టంగానూ వుంది, నిర్ణాయకంగానూ ఉంది. కానైతే ఒకళ్ల హక్కు తిరుగుబాటుకి పరిమితం అనడమేం, మరొకళ్ల హక్కు విచ్ఛేదానికి విస్తరించడం అన్న దానికి కారణాలు వాళ్ళు చెప్పలేదు. అసలా సమస్యనే వాళ్లు ఎత్తుకోలేదు. ఆ కారణాలూ అంత అందేవి కావు. కాని, ఆ తేడా ఎందుకు వచ్చిందో తెలుసుకోవాలి, అది ఆసక్తికరంగా ఉంటుంది. ఈ విభేదాలకు కారణం మహోన్నత భవితవ్యానికి సంబంధించింది. ఓ రాజ్యంలో అనేక మతవర్గాలుండవచ్చు, లేదా అనేక జాతులుండవచ్చు. మతవర్గాలున్న రాజ్యంలో ఓ మతం మరో మతాన్ని వ్యతిరేకించవచ్చు. కాని భవిష్యత్తుకి సంబంధించి రెండూ ఒకటేనని వాటికి అనిపించవచ్చు. కాని అనేక జాతులున్న రాజ్యంలో ఒకటి గనక మరోదానికి వ్యతిరేకంగా ఎదురు తిరిగితే ఆ తగూ మహోన్నత భవిష్యత్ ఎలా ఉంటుందోనన్న దానికి సంబంధించే అయి ఉంటుంది. ఇదీ మతవర్గాలకీ, జాతులకీ మధ్య తేడా, వాళ్ల రాజకీయ హక్కుల్ని వివరించేది ఇదే. మతవర్గాలకి ఒకేలాంటి హక్కు ఉండడమేం, జాతులకి మరొకలాంటిది ఉండడమేం అన్నదానికి ఇది వివరణ ఇస్తుంది. తిరుగుబాటుతో తృప్తి పడుతుంది కాబట్టి మతవర్గానికి ఆ హక్కు ఉంది. దాని పేచీ పరమ భవితవ్యం గురించి కాదు. జాతికి విచ్ఛేదన హక్కు ఉంది. ఏమంటే ప్రభుత్వం మార్పుతో అది తృప్తి పడదు. దాని పేచీ పరమ భవితవ్యానికి సంబంధించింది. తనని బంధించే కృత్రిమ బంధనం తెగిపోతేనేగాని అది తృప్తి పడదు. ఆ బంధనాలు తెగిపోవాలి అని విజ్ఞత, ధర్మం కూడా ఆపేక్షిస్తున్నాయి. అప్పుడు వాటి మానాన అవి తమ భవిష్యత్ చూసుకుంటాయి.



హిందూ–ముస్లిం ఐక్యం కోసం చేసిన ప్రయత్నాలు విఫలమయేయి. ముస్లిం ఆలోచనా ధోరణి బొరుసువైపు మళ్లింది. వీటిని గుర్తించడం ఎంత అవసరమో, ఈ మార్పులకి గల కారణాల్ని గుర్తించడమూ అంతే అవసరం. ఈ వైఫల్యాలకీ, ఆలోచనా ధోరణి మార్పు చెందడానికీ బ్రిటిష్ వాళ్ల విభజించి పాలించు అనే నీతే కారణం అని హిందువులు అంటారు. హిందువులకి, ఐరిష్ వాళ్లల్లాగా, ప్రభుత్వ వ్యతిరేకంగా ఉండడం తప్ప వేరే సిద్ధాంతం ఏదీ లేదు. ప్రతిదానికీ, గట్టిగా వాతావరణం బాగా లేకపోయినా కూడా, ప్రభుత్వాన్నే దుమ్మెత్తి పొయ్యడం అలవాటు వాళ్లకి. హిందువులకి చాలా తేలికగా కనిపించే ఈ సాకుని తొలగించే సమయం వచ్చింది. ఏమంటే రెండు ముఖ్యమైన విషయాల్ని దృష్టిలో ఉంచుకోకుండా వదిలెయ్యడం దీనివల్ల జరుగుతోంది మొదటిది : విభజించు పాలించు అనే నీతి – బ్రిటిష్ వాళ్లు దానికి పాల్పడతారాని ఒప్పుకుంటూనే అసలు, దానికి మూలభూతంగా ఉండాల్సిన అంశాలు లేకపోతే నెగ్గదు. రాజీకి రాలేని అంశాలుండాలి, ఊరికే పైపై భేదాలు మాత్రమే కాదు. రెండవది : ఆలోచనా ధోరణి మార్పుని సూచించే జిన్నా, బ్రిటిష్ వాళ్ల చేతిలో కీలుబొమ్మలా మారతాడన్న అనుమానాన్ని ఆయన ఆగర్భ శత్రువులు కూడా వెల్లడి

చెయ్యలేరు, ఆ విషయం మరిచిపోకూడదు. ఆయన చాలా దురభిమాని, అహంకారి. ఏ ముసుగూ లేని అహంకారి. ఇక తల బిరుసుతనం ఉండనే ఉంది, పోనీ దానికి తగ్గ మేధా సంపత్తి, ప్రతిభ ఉన్నాయా అంటే అవీ లేవు. అందువల్లనే ఆయనకి ద్వితీయ స్థానం పనికిరాదు, ఇతరుల్తో కలిసి పని చెయ్యలేడు. ఆయన శత్రువులు ఆరోపించుతున్నట్టు పై వాళ్ల అభిప్రాయల్ని షోగ్గా ముస్తాబు చేసి లాక్కొచ్చే చవట బుర్ర కాకపోయినా, కొత్తకొత్త ఊహలు వచ్చే మనిషి కాదు. ఆయన కీర్తి అసలు సత్తా మీదకంటే నైపుణ్యం మీద ఎక్కువ పైకి లేచింది. అయితేనేం, అవినీతికి లొంగని నిప్పు అనే మాటని ఆయనకి సంబంధించి చెప్పినట్టుగా మరే రాజకీయ నాయకుడి గురించేనా చెప్పగలమా అన్న ముక్క అనుమానా స్పదమే. బ్రిటిష ప్రభుత్వంతో ఆయన సంబంధాలు ఎలాంటివో తెలిసిన ఎవళ్లేనా గానీ, ఆయన బ్రిటిష్ వాళ్ల విమర్శకుడనే అంటారు. నిజానికి ఆయన వాళ్లకి ప్రత్యర్థి. ఆయన్ని ఎవళ్లూ ప్రలోభ పెట్టలేరు. ఆయన తనకి బత్తెం ఇచ్చే దేశానికి స్తోత్రపాఠం చేసే మనిషి కానేకాదు. జిన్నాలో వచ్చిన ఈ మార్పుని ఆచారవతుగా హిందువులు ఇచ్చే వివరణల్ని బట్టి అర్థం చేసుకోలేం.

ఈ విషాదకర పరిణామానికి మరి కారణం ఏమిటి? ఐక్యం కోసం చేసిన ప్రయత్నాలు, ఎందుకు విఫలమయేయి? ముస్లిం ధోరణిలో ఈ మార్పు ఎందుకు వచ్చింది?

ఈ వైఫల్యానికి అసలు కారణం వేరే ఉంది. హిందువులకి ముస్లిమ్‌లకీ మధ్య ఉన్న అంతరం ఊరికే భేదాలకి సంబంధించి కాదు, ఈ వైరుధ్యాన్ని పాదార్థిక హేతువులకి ఆపాదించరాదు. ఆ విషయాన్ని గుర్తించాలి. చారిత్రక, మతపర, సాంస్కృతిక, సాంఘిక ద్వేషంలో దానికి మూలాలు ఉన్నాయి. రాజకీయ ద్వేషం వాటి ప్రతిఫలనం మాత్రమే. అవి గాఢమైన అసంతృప్తి అనే నది అవుతున్నాయి. పై వాటి వల్ల ఎప్పుడూ ఆ నదికి నీరు అందుతూనే ఉంది, మధ్యమధ్యన కట్టలు తెగి పారుతోంది. ఏ నదీ ప్రవాహమైనా, మరోచోటి నుంచి నీరు వచ్చి కలిసినపుడు అదెంత స్వచ్ఛమైనదైనా గానీ, రంగు మారకుండా, ఆ శక్తి సడలకుండా ప్రధాన ప్రవాహంలో కలిసిపోతుంది. ఈ వైరుధ్యమనే వండలి లోతుగా, శాశ్వతంగా నిలదొక్కుకుంది. ఈ వండలి పేరుకుంటూ ఉన్నంతకాలం హిందువులకీ – ముస్లింలకీ మధ్యన ఉన్నవైరుధ్యం పోయి ఆ స్థానంలో ఐక్యం వస్తుందనుకోవడం భ్రమ.

టర్కిష్ సామ్రాజ్యంలో క్రిస్టియన్లు ముస్లిములు మాదిరి హిందువులు ముస్లింలు శత్రువులుగా ఎన్నో యుద్ధ రంగాల్లో ఒకళ్ల నొకళ్లు ఎదిరించుకున్నారు. వాటి ఫలితాల వల్ల పరాజితులు, విజేతలు అన్న సంబంధాల్లోకి వాళ్లు పడ్డారు. ఏ పక్షం నెగ్గినా వాటి మధ్యల గాధం మిగిలిపోయింది. మొగలాయీల కిందగాని, బ్రిటిష్ వాళ్ల కిందగాని బలవంతంగా ఏర్పడ్డ ఐక్యం, అంగాంగభావ ఐక్యానికి చేరడానికి బదులు, వాళ్ల పరస్పర విద్వేషాన్ని పదునుబెట్టింది.

మతంగానీ, సాంఘిక నియమావళిగాని ఈ అగాధాన్ని పూడ్చలేవు. ఈ రెండు విశ్వాసాలు పరస్పర విరుద్ధం, మౌలికంగానే అవి పొత్తు కుదరనటువంటివి. ఇద్దరి మధ్యా స్వతహాగానే వైరుధ్యం ఉన్నట్టుంది. శతాబ్దాల కలయిక కూడా దాన్ని నిర్మూలించలేకపోయింది. అక్బర్, కబీర్‌లాంటివాళ్లు సామరస్యం కుదిర్చే ప్రయత్నాలు చేశారు. అయితేనేం, వాటి వెనక వున్న ధార్మిక పదార్థాలు, అలానే నిలిచిపోయేయి. గణితశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే క.సా.గు. (కనిష్ట సామాన్య గుణకం) లేని పూర్ణాంకం లేనిదిగానే మిగిలిపోయేయి. హిందువు ఎవడేనా ఏ ఉత్పాతమూ, బీభత్సమూ లేకుండా హిందూమతం నుంచి క్రైస్తవ మతంలోకి పోవచ్చు. కాని మతకల్లోలాలు లేకుండా హిందూ మతం నుంచి ఇస్లాం మతంలోకి వెళ్లలేడు, కనీసం వమన వికారమేనా ఉంటుంది. హిందువులకీ ముస్లింలకీ మధ్య వాళ్లని విభజించే వైరుధ్యం అంత లోతైందని దీన్నిబట్టి తెలుస్తోంది.

మతవిశ్వాసాల రీత్యానే హిందువుల్ని, ముస్లింలని ఆయా మతాలు దూరంగా ఉంచితే, వాటివల్లనే సాంఘిక సమ్మేళనం కూడా ఆటంక పడింది. హిందువుల మధ్యా ముస్లింల మధ్యా అంతర్వివాహాల్ని హిందూమతం నిషేధిస్తోంది. ఈ సంకుచిత మనస్తత్వం ఒక్క హిందూ మతానికి చెందిన దుర్గుణం మాత్రమే కాదు. ఇస్లాం కూడా సాంఘిక ప్రవర్తనా నియమావళిలో అంతే సంకుచితం. ఆ రెండు మతాల మధ్యా వివాహాన్ని అదీ నిషేధిస్తోంది. ఇలాంటి సాంఘిక నియమాలతో సాంఘిక సమ్మేళనం ఏం జరుగుతుంది. తత్ఫలితంగా పద్ధతులు, విధానాలు, దృక్పథాలు సాంఘీకీకృతం కాలేదు, అంచుల మొనవాడి తగ్గలేదు, యుగయుగాల తిక్కలు తగ్గలేదు.

హిందూ మతంలోనూ, ఇస్లాం మతంలోనూ ఇతర దోషాలు కూడా ఉన్నాయి. వాటివల్ల హిందువులకీ, ముస్లింలకీ మధ్య పుండు మానకుండా పచ్చిగా సలుపుతూనే ఉంది. హిందూమతం జనాల్ని విడదీస్తుందనీ, ఇస్లాం కలుపుతుందనీ అంటారు. కాని ఈ ముక్క పూర్తిగా నిజం కాదు. ఇస్లాం ఎంత పట్టు సడలకుండా కలుపుతుందో అంతలాగా విడదీస్తుంది కూడా. ఇస్లాం సన్నిహిత సంఘం, ముస్లిములకూ ముస్లిమేతరులకీ మధ్య అది చేసే విచక్షణ యదార్థం, చాలా గట్టిది, చాలా పరాయీకరణ చేసే విచక్షణ. సోదరత్వం ఉంది, కానిఅది విశ్వవ్యాప్త సోదరత్వం కాదు. అది ముస్లిం సోదరత్వం, ముస్లింలకి మాత్రమే ఉండే సోదరత్వం. సౌభ్రాతృత్వం ఉంది, కాని దాని లాభాలు అందులో వున్న వాళ్లకి మాత్రమే పరిమితం. ఆ సంఘానికి బయట ఉన్నవాళ్ల పట్ల ద్వేషం, శత్రుత్వం తప్ప మరేం ఉండవు. ఇస్లాంలో ఉన్న రెండవ దోషం ఏమిటంటే అదొక సాంఘిక స్వయంపాలనా ప్రభుత్వం. దానికీ స్థానిక స్వయంపాలనా ప్రభుత్వానికీ పొసగదు. ఏమంటే ముస్లింల విధేయత ఏ దేశంలో వాళ్లుంటారో ఆ దేశానికి చెందదు, తన విశ్వాసానికి చెందుతుంది. ముస్లిం విషయంలో మాతృదేశంలో ఉన్నది మంచిది అనేది చెల్లదు. ఇస్లాం పాలన ఎక్కడ ఉంటే అదే అతని దేశం. వేరేలా చెప్పాలంటే సిసలైన ముస్లిం భారతదేశాన్ని తన మాతృదేశంగా

భావించనియ్యదు ఇస్లాం. హిందువుని తన రక్త సంబంధీకునిగా చూడనియ్యదు. బహుశా అందుకనే మహోన్నత భారతీయుడైనా, ముస్లిం కావడం వల్ల మౌలానా మహమ్మద్ ఆలీ తనని ఇండియాలో కాక జెరూసలెంలో ఖననం చెయ్యమని కోరేడు.

ముస్లిం నాయకుల్లో ఆలోచన పరివర్తనకి అసలు వివరణ వాళ్ల అభిప్రాయాల్లో నిజాయితీ లేని జారుడు వల్ల వచ్చిందని కాదు. ఒక కొత్త భవితవ్యం మిరుమిట్లు గొలుపుతూ వుంటే, కొత్తపేరుతో, పాకిస్తాన్ అన్న పేరులో అది ప్రతినిధి రూపమై నిలిచింది. మొట్టమొదటిసారిగా ముస్లింలు నూతన భవితవ్యాన్ని ఆరాధించనారంభించేరు. కాని అది నిజంగా అంతే కాదు. అప్పటిదాకా మేఘాలమాటున కప్పడిపోయిన నూతన భవితవ్య భాస్కరుడు ఇప్పుడే పూర్తిగా ప్రకాశమానం అయేడు. ఆ నూతన భవితవ్య అయస్కాంతం ముస్లింలని ఆకర్షించకుండా ఉండలేదు. దాని ఆకర్షణ ఎంత ఘనమైందంటే జిన్నాలాంటి వాళ్లు కూడా సమూలం కదిలిపోయేరు, దాని శక్తిని నిరోధించ లేకపోయేరు. భారతదేశ పటం మీద ఆ భవిష్యత్తు నిర్దిష్ట రూపంలో గోచరమవుతుంది. ఈ నవ్య భవిష్యత్‌ని సులభంగా రూపొందించుకోవడమే కాదు, నిర్దిష్టరూపంలో నిర్మించుకోవడమే కాదు అది సులభంగా అందుతోంది కూడా. ఏమంటే సకల ముస్లిం సహోదరుల్ని ఒక ఇస్లామిక్ రాజ్యంగా బంధించే ముస్లిం భావనని ఆచరణ యోగ్యం చేసుకునే అవకాశాలు తెరుచుకుంటున్నాయి. ఆ రకంగా విభిన్న దేశాల్లో వున్న ముస్లింలు ఆయాదేశాల జాతీయతని నెత్తిమీద పెట్టుకునే ప్రమాదాన్ని తప్పిస్తోంది అది. అలా జాతీయతల్ని అంగీకరిస్తే వచ్చే ఇస్లాం సోదర విచ్ఛిత్తి దీనివల్ల తప్పుతుంది.* హిందూస్తాన్ నుంచి పాకిస్తాన్‌ని వేర్పాటు చేస్తే ఇరాన్, ఇరాక్, ఆరేబియా, టర్కీ, ఈజిప్టులు ఒక ఫెడరేషన్‌గా ఏర్పడవచ్చు, కాన్‌స్టాంటినోపుల్ నుంచి లాహోర్ దాకా విస్తరించుకున్న ఇస్లామిక్ రాజ్యం ఏర్పడుతుంది. ఈ నూతన భవిష్యత్ దీధితులకి ఆకర్షితుడు కాని ముస్లిం ఎవడేనా వుంటే వాడు బుద్ధాయి అన్నమాట. భారత నభో మండలంలో ముస్లింల స్థానం గురించి పూర్తిగా అభిప్రాయ పరివర్తనతో ఉన్నాడన్న మాట.

ఈ భవిష్యత్ ఎంతో స్పష్టంగా ఉంది. అసలు దీన్ని అందుకోవడానికి ముస్లింలకి అంతకాలం పట్టడమే ఆశ్చర్యం. 1923లోనే ఇలాంటి భవిష్యత్తు గురించి కొందరికి తెలుసునని చెప్పడానికి సాక్ష్యం ఉంది. దీనికి దాఖలాగా ఖాన్ సాహెబ్ సర్దార్ గుల్‌ఖాన్ ఇచ్చిన సాక్ష్యాన్ని చూపించవచ్చు. భారత ప్రభుత్వం సర్ డెన్నిస్ బ్రే అధ్యక్షతన వాయవ్య ప్రాంత కమిటీని నియమించింది. వాయవ్య ప్రాంతంలోని సెటిల్ డిస్ట్రిక్ట్‌కి, తెగల ప్రాంతాలకి మధ్యనున్న సంబంధాలనీ, వాటిని పంజాబ్‌లో విలీనం చెయ్యడాన్ని గురించి నివేదించడానికి దాన్ని నియమించేరు. దాని ముందు ఖాన్ సాహెబ్ సాక్ష్యం ఇచ్చేరు. ఆ సాక్ష్య ప్రాముఖ్యాన్ని

* ముస్లిమేతర దేశాల్లోని ముస్లింల జాతీయతని సర్ మహమ్మద్ ఇక్బాల్ ఖరాకండిగా ఖండించేడు. మాతృదేశ బంధనం అనే అర్థంలో దీంట్లో భారతీయ ముసల్మాన్లూ ఉన్నారు.

ఏ సభ్యుడూ గమనించలేదు. ఒక్క ఎన్.ఎమ్. సమర్థ్ మాత్రమే గమనించేడు. తన మైనార్టీ రిపోర్టులో ప్రత్యేకంగా దాన్ని గురించి చెప్పిన సభ్యుడు ఆయన ఒక్కడే. ఈ నూతన భవిష్యత్ పరిణామ చరిత్రలో చీకటి కోణాన్ని వెలుగులోకి తెచ్చేందుకు ఈ క్రింది భాగాల్ని ఆయన నివేదిక నుంచి ఎత్తి చూపిస్తున్నాం[1] :

"వాయవ్య సరిహద్దు రాష్ట్రం గురించీ, స్వతంత్ర భూభాగం గురించీ మాత్రమే కాక బెలూచిస్తాన్, పర్షియా, ఆఫ్ఘనిస్తాన్‌ల గురించి కూడా సాధికారంగా, సొంత పరిజ్ఞానంతో మాట్లాడగలిగే సాక్షి మరొకళ్లు కమిటీ ముందు లేరు. ఈ సాక్షి హక్కుతో అలా చెప్పేడు. ఆయన కమిటీ ముందు, ఇస్లామిక్ అంజుమన్, డైరా ఇస్మాయిల్ ఖాన్, అధ్యక్షునిగా, సాక్షిగా రావడం గమనార్హం. ఆ సాక్షిని (ఖాన్ సాహెబ్ సర్దార్ మహమ్మద్ గుల్‌ఖాన్) నేను ఇలా అడిగేను. "సింధ్‌లో వున్నట్టే సరిహద్దు రాష్ట్రంలో పౌర ప్రభుత్వం రూపొందింది అనుకోండి. సింధ్ బొంబాయి ప్రెసిడెన్సీలో ఉన్నట్టు అది పంజాబ్ భాగంగా వుందనుకోండి. దాన్ని గురించి మీ అభిప్రాయం ఏమిటి?" ఆయన జవాబిస్తూ ఇలా అన్నాడు : 'ఇస్లాంకి సంబంధించినంతవరకూ నేను దానికి వ్యతిరేకిని" దాని మీద నేను మరిన్ని ప్రశ్నలు అడిగేను. ఆయన నిర్మొహమాటంగా, ఖరాకండిగా జవాబులు ఇచ్చేడు. సంబంధిత భాగాన్ని ఇక్కడ ఇస్తున్నాను :

ప్రశ్న : మీ అంజుమన్ వెనక ఉన్న ఆలోచన పాక్-ఇస్లామిక్ ఆలోచన. అంటే ఇస్లాం లీగ్ ఆఫ్ నేషన్స్ అన్నది. అలాంటప్పుడు ఈ రాష్ట్రాన్ని పంజాబ్‌తో కలపడం అవరోధంగా ఉంటుంది, ఆ ఆలోచనకి భంగకరంగా ఉంటుంది. మీలాగే ఆలోచించేవాళ్ల ఉద్దేశం ముఖ్యంగా అదే, కదా?

జవాబు : అవును. అయితే మరికొన్ని విషయాలు చెపుతాను. వాళ్ల ఆలోచన ఏమిటంటే హిందూ ముస్లిం ఐక్యం అనేది ఎన్నటికీ కార్యరూపం ధరించదు, అది ఎన్నటికీ సిద్ధించదు. ఆ రాష్ట్రం విడిగానే ఉండాలని, ఇస్లాంకీ, బ్రిటిష్ కామన్వెల్త్‌కీ సంబంధం ఉండాలని. నా అభిప్రాయం ఏమిటి నన్నడిగినపుడు – అంజుమన్ సభ్యునిగా ఈ అభిప్రాయాన్ని చెపుతున్నా – హిందువుల్ని ముస్లింలనీ విడదియ్యడమే మంచిదని మా అభిప్రాయంగా చెపుతాను. 23 కోట్ల మంది హిందువుల్ని దక్షిణాదికి 8 కోట్ల మంది ముస్లింల్ని ఉత్తరాదికి. రస్కుమారి[2] నుంచి ఆగ్రా దాకా హిందువులు, ఆగ్రా నుంచి పెషావర్ దాకా మహమ్మదీయులకి, అంటే ఓ చోటి నుంచి మరోచోటికి బదలాయింపు అని నా భావం. ఇది బదలాయింపు ఉన్న ఆలోచన, అంతే కాని అంతమొందించే ఆలోచన కాదు. ప్రస్తుతం బోల్షెవిజం సొంత ఆస్తిని రద్దు చేసింది. మొత్తం అన్నిటినీ జాతీయం చేసింది, ఇది

1. నార్త్ వెస్ట్ ఫ్రాంటియర్ ఎంక్వైరీ కమిటీ రిపోర్టు, 1924, పేజి 122-123
2. *మూలంలో ఇలానే ఉంది, బహుశా కన్యాకుమారి బదులు పొరపాటు అచ్చయి ఉంటుంది.

బదలాయింపు వ్యవహారానికి సంబంధించింది మాత్రమే. ఇది గనక ఆచరణ సాధ్యమైతే మేం దీన్నే దాని బదులు కోరతాం.

ప్రశ్న : అంటే పంజాబ్‌తో విలీనం కూడదని మిమ్మల్ని ఒత్తిడి చేసే ఆలోచన అదన్న మాట.

జవాబు : కచ్చితంగా.

★ ★ ★

ప్రశ్న : మీరు ఇస్లామిక్ లీగ్ ఆఫ్ నేషన్స్ అని సూచించేటప్పుడు. మీ మనసులో రాజకీయ దృక్పథం కంటే ఎక్కువ మతపర దృష్టి ఉందన్న మాటే కదా?

జవాబు : రాజకీయమైందేననుకోండి. అంజుమన్ అనేది రాజకీయమే. మొదట్లో మహమ్మదీయ అనేదంతా రాజకీయమే, అంజుమన్ రాజకీయమైందే కదా.

ప్రశ్న : నేను మీ అంజుమన్‌ని ఉద్దేశించడం లేదు. ముసల్మాన్లని ఉద్దేశిస్తున్నాను. ఈ ఇస్లామిక్ లీగ్ ఆఫ్ నేషన్స్ అంటే ముసల్మాన్లు ఏమనుకుంటున్నారు? వాళ్ల దృష్టిలో ప్రముఖంగా ఉన్నదేమిటి? అది మతపరమైందా లేక రాజకీయమైందా?

జవాబు : ఇస్లాం రెండూనూ, మతమూ రాజకీయమూ కూడా.

ప్రశ్న : అంటే మతం రాజకీయం కలిసి ఉంటాయి కదా?

జవాబు : సందేహమూ.

★ ★ ★

వాయవ్య రాష్ట్రాన్ని విడదీసి పంజాబ్‌తో కలవకుండా పఠాన్ రాష్ట్రాన్ని శాశ్వతంగా అలా ఉంచడం ప్రమాదకరం, ఏమంటే పఠాన్‌లకి ఆఫ్ఘన్లతో ఉన్న సంబంధాలు అందుకు కారణం, భారతదేశం బయట ఉన్న ముస్లిం దేశాలతో వాళ్లకి గల సంబంధాలు కారణం అవే. పరిమిత లక్ష్యాన్ని చూపించేందుకే శ్రీ సమర్థ్ ఈ సాక్ష్యాన్ని వాడుకున్నారు. కాని ఈ సాక్ష్యం వల్ల పాకిస్తాన్ పథకం 1923లో బీజరూపం ధరించిందని తెలుస్తుంది.

మాంటేగ్–ఛేమ్స్‌ఫర్డ్ సంస్కరణలని వాయవ్య సరిహద్దు రాష్ట్రాలకి విస్తరింప చెయ్యాలని బాంబేలో జరిగిన ముస్లింలీగ్ సమావేశంలో తీర్మానం వచ్చింది, 1924లో. మహమ్మద్ ఆలీ దాని మీద మాట్లాడేడు. ఆయన సరిహద్దు రాష్ట్రాల మహమ్మదీయులకి స్వయం నిర్ణయాధికారం ఉండాలని సూచించేడు.[1] ఇండియాతో గాని కాబూల్‌తో గాని సంబంధం పెట్టుకునే స్వేచ్ఛ

1. రిఫరెన్స్ కోసం కలకత్తాలో 1925 ఏప్రిల్ 11న జరిగిన హిందూ మహాసభ సమావేశంలో లాలా లజపత్‌రాయ్ అధ్యక్షోపన్యాసం చూడండి. ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్, 1925, వాల్యూం 1, పే 379.

ఉండాలన్నాడు. కాన్‌స్టాంటినోపుల్ నుంచి ఢిల్లీ దాకా ఒక సరళరేఖని గీస్తే కనక అది మహమ్మడన్ హద్దుని ఎకాఎకీ షహరన్‌పూర్ దాకా వెల్లడిస్తుందని ఎవరో ఒక ఇంగ్లీషాయన అన్నట్టు ఉల్లేఖించాడు. పాకిస్తాన్ పథకం యావత్తూ మహమ్మద్ అలీకి తెలుసని, సమర్థ్ సూచించినట్టు సాక్ష్యంలో వెల్లడైందనీ చెప్పవచ్చు. ఏదో కడకి పాకిస్తాన్ ఆఫ్ఘనిస్తాన్‌తో కలుస్తుందని సాక్షి చెప్పకుండా వదిలేసిన విషయాన్ని ఏదో ఏమరుపాటుగా ప్రస్తావించేడు.

1924, 1930ల మధ్య ఈ పథకం గురించి ముస్లింలు ఏమీ చెప్పలేదు, చెయ్యలేదు. ముస్లింలు దీన్ని దాచేసి, రక్షణ హామీల కోసం హిందువులతో చర్చలు సాగించినట్టు కనిపిస్తోంది. విభజన కంటే విడిగా, సాంప్రదాయిక ఏకరాజ్య సిద్ధాంతం మీద అలా చర్చలు సాగించినట్టు తెలుస్తోంది. కాని 1930లో రౌండ్ టేబిల్ సమావేశం జరిగేటప్పుడు కొంతమంది ముస్లింలు ఓ కమిటీగా ఏర్పడ్డారు. దాని కేంద్రస్థానం లండన్. పాకిస్తాన్ పథకం గురించి ఆలోచించించేందుకు దాన్ని ఉద్దేశించేరు. ఆ కమిటీ కరపత్రాల్నీ, సర్క్యులర్లనీ జారీ చేసింది. రౌండ్‌టేబిల్‌సమావేశ ప్రతినిధులు పాకిస్తాన్‌ఏర్పాటుకిక తోడ్పాటు ఇచ్చేందుకువ ఆటిని అందించింది. అప్పుడు కూడా ఎవళ్లూ దానిపట్ల ఆసక్తి కనబర్చలేదు. ఆర్.టి.సి. ముస్లిం సభ్యులు దాన్ని ఏ రకంగానూ ఎదిరించలేదు.[1]

ఈ భవిష్యత్ ఆచరణలో కార్యరూపం ధరించేదా చచ్చేదా, ఏదో స్వప్నం లాంటిది మాత్రమే అని మొదట్లో ముస్లింలు అనుకున్నారు. అది క్రియకి సిద్ధించే అవకాశం ఉందని తర్వాత అనిపించగానే దాన్ని గురించి ఏ సమస్యనీ లేవనెత్తలేదు. బ్రిటిష్ వాళ్లు, హిందువులు అందుకు ఒప్పుకునేట్టు తగినంత కృషి వాళ్లు జరపకపోవడం దానికి కారణం. ఆర్.టి.సి.లో పాకిస్తాన్ గురించి ముస్లింలు ఎందుకు ఒత్తిడి చెయ్యలేదో చెప్పడం కష్టం. ఆ పథకం వల్ల బ్రిటిష్‌వాళ్లు నొచ్చుకుంటారని వాళ్లకి తెలిసిఉండచ్చు.[2] 14 సూత్రాల విషయంలో నిర్ణయం తీసుకోవల్సింది బ్రిటిషవాళ్లేనని తెలుసు. ముస్లింలు అందె వేసిన రాజనీతిజ్ఞులు. రాజకీయాలు సాధ్యావకాశాల క్రీడ ని బిస్మార్క్ చెప్పినట్టు, వేచి చూద్దాం, 14 సూత్రాల తగాయిదాకి మొగ్గగా బ్రిటిష్ వాళ్ల నిర్ణయం తేలనీ అన్నట్టు ఆగేరు.

పాకిస్తాన్ పథకాన్ని ముందుకు తేకుండా ఆలస్యం చెయ్యడానికి మరో కారణం ఉంది. నిన్న, మొన్నటిదాకా పాకిస్తాన్‌కి తాత్విక సమర్థన ఏమిటైందీ ముస్లిం నాయకులకి

1. పాకిస్తాన్ పథకంలో ప్రధాన సూత్రం ఒకే ఉమ్మడి కేంద్ర ప్రభుత్వం. దానికి వ్యతిరేకంగా, ఆ పేరు ప్రస్తావించకుండా దాన్ని సమర్థించిన ఒకే ఒక సభ్యుడు సర్ మహమ్మద్ ఇక్బాల్. భారతదేశానికి ఒక కేంద్ర ప్రభుత్వం ఉండాలని, రాష్ట్రాలు స్వయం పాలితంగా ఉండాలని, స్వతంత్ర ప్రతిపత్తితో ఎకాఎకీ లండన్‌లోని సెక్రటరీ ఆఫ్ స్టేట్‌తో సంబంధం ఉండాలని మూడవ ఆర్.టి.సి.లో ఆయన అభిప్రాయపడ్డాడు.
2. బ్రిటిష్ అధికార్లతో ప్రైవేట్‌గా ముచ్చటించినపుడు వాళ్లు దీనికి అనుకూలంగా లేరని తెలిసింది. వాళ్లకి కోపం తెప్పించడం ఇష్టం లేక ముస్లింలు దాన్ని గురించి పట్టుబట్టలేదు.

తెలియలేదన్న అవకాశమూ వుంది. ఇంత పెద్ద ప్రతిపాదన ఎన్నడూ రాలేదు, ఏమంటే ఒక రాజ్య విచ్ఛిత్తి ఇందులో ఉంది. ఏ మహమ్మదీయుడైనా ఈ ప్రతిపాదనని ముందు పెడితే ఇంత తీవ్రమైన పథకానికి తగ్గ నైతిక, తాత్విక సమర్థన ఏం ఉందయ్యా అని అడిగి ఉండేవాళ్లు, అలాంటి తాత్విక సమర్థన అంతకాలం ఎందుకు రాలేదో కూడా చెప్పవచ్చు. అందుకని ముస్లిం నాయకులు భారతదేశంలో ముస్లింలు మైనారిటీగా ఉన్నారు అనడం మొదలెట్టేరు. ముసల్మాన్లని ఒక జాతిగా వాళ్లు ఎన్నడూ ప్రస్తావించలేదు. ఓ మైనారిటీగానో, ఒక మతవర్గంగానో మాత్రమే చెప్పేరు. మతవర్గానికీ, జాతికీ తేడా వెంట్రుక వాసిలాంటిది. ఒకవేళ మరోలా ఉన్న అన్ని సందర్భాల్లోనూ అది నదురుగా కనిపించదు. ప్రతి దేశం కొంచెం హెచ్చుతగ్గుల్లో సంకీర్ణం గానే ఉంటుంది. అధికభాగం దేశాల్లో జనాభా ఎంతో విభిన్నంగా ఉంటుంది. అనేక భాషలు, మత నియమాలు, సాంఘిక సంప్రదాయాలు ఉంటాయి. ఇవన్నీ కలిసి బృందాలుగా ఏర్పడతాయి. ఏ దేశమూ ఒకే ఒక సంఘంగా ఉండదు, ఆలోచనల్లో కార్యాచరణలో ఏక సమ్మితమై ఉండదు. అలా ఉండగా, ఓ బృందం పొరపాటుగా తనని మతవర్గంగా పిలుచుకోవచ్చు, ఒక జాతి అయే అంశాలు అందులో ఇమిడి ఉన్నాగానీ, ఇక రెండవది, ఇంతకు ముందే ప్రస్తావించుకున్నట్టు, ఒక జాతిగా ఏర్పడే అంశాలన్నీ ఉన్నాగానీ ఆ ప్రజలకి జాతీయ చైతన్యం లేకపోవచ్చు.

మైనారిటీ హక్కులకూ, భద్రతకూ సంబంధించి చూసేటప్పుడు ఈ విభేదం అముఖ్యం. ఒక మైనారిటీ తనకిగానే జాతి అయినా, మతవర్గం అయినా అది మైనారిటీయే. ఒక మైనర్ మతవర్గానికి అవసరమైన భద్రతల కంటే ఒక మైనారిటీ జాతి భద్రత హక్కులు భిన్నంగా ఉండవు. ఆ రక్షణ అడిగేది దేనికీ అంటే మెజార్టీ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా. అంచేత ఒక మైనారిటీ భద్రత హక్కుల్ని ఒక జాతిగా అడిగినా ఒకటే, ఒక మతవర్గంగా అడిగినా ఒకటే, తేడా లేదు. అలా అని మతవర్గానికీ జాతికీ తేడా లేదనలేం. తేడా చాలా ఉంది. ఓ మతవర్గం చిన్నదైనా పెద్దదైనా ఇతర మతవర్గాలకి ఎంత స్పర్థిస్తూ ఉన్నా – అవి మెజార్టీని గాని, మైనార్టీని గాని – అందరి అంతిమ లక్ష్యం విషయంలో అదీ ఒకటే. ఒక జాతి కాదు, రాజ్యంలోని ఇతర విభాగాల కంటే భిన్నం కాదు. కానైతే రాజ్యంలో వున్న ఇతర విభాగాల కంటే భిన్నమైన ఆశలు, విశ్వాసాలు దానికి ఉంటాయి. ఆ విభాగాలకి వీటికి ఎదురు చుక్కగా ఉండచ్చు. నాకైతే ఈ విబేదం చాలా ఎక్కువదని అనిపిస్తుంది. ఒక మతవర్గానికీ, జాతికీ విభేదం చూపించే పరీక్షగా దీన్ని చూసేందుకు సందేహించను. విభేదాలు ఎన్ని ఉన్నాగానీ, తమ ప్రత్యర్థులకీ తమకీ ఒకే ఉమ్మడి భవితవ్యం ఉందనుకున్న వాళ్లు ఒక మతవర్గం. ఉమ్మడి భవితవ్యాన్ని అంగీకరించకుండా మిగతావాళ్లతో అన్నికాలా విభేదించి ఉండేవాళ్లు ఒకజాతి. ఈ అంగీకార, అనంగీకారాలే అస్పృశ్యులు, క్రైస్తవులు పార్శీలు. హిందువులకి సంబంధించి ఒక మతవర్గం ఎలా అవుతున్నారో, ముస్లింలు ఒక జాతి ఎలా అవుతున్నారో తెలియజేస్తాయి. జనజీవిత సామరస్యం పరంగా చూస్తే పరమ భవితవ్యం గురించిన స్వభావంలోనే ఈ **భేదము**

ఉంది. ఈ విభేదానికి ఉన్న చలన శీలత తిరుగులేనిది. అవి అలానే ఉంటే, రాజ్యం ముక్కలు అవడం తప్పదు. అయితే భద్రత హక్కులకి సంబంధించినంతవరకూ ఒక మతవర్గానికీ, ఒక జాతికీ తేడా ఏమీ ఉండదు. ఒక జాతికి ఉన్నలాంటివే హక్కులూ, భద్రతలూ ఒక మతవర్గానికీ ఉంటాయి.

ముస్లింలు తామొక మతవర్గమనీ, మైనార్టీ అనీ మాత్రమే ప్రస్తావించుకునే అలవాటు పడ్డారు. దాంతో పాకిస్తాన్ ఏర్పాటుకి తాత్విక సమర్థనని కనిపెట్టడం ఆలస్యమైంది. ఈ పదబంధాలని వాడడంతో వాళ్లు పక్కదారి పట్టేరు, అది వాళ్లను ముప్పు అంచులోకి తీసుకుపోయింది. మైనార్టీ మతవర్గం అని తామే ఒప్పేసుకోవడంతో, భద్రతలు, హామీలు రక్షణలు అడుగుతూ ఉండడం తప్ప మరేం చెయ్యలేదు. అర్థశతాబ్దం పాటు అలా చేశారు. తాము మైనార్టీ అని చెప్పుకోవడమే చాలదనీ, ఇంకా ముందుకు పోయి మతవర్గ మైనార్టీకీ మైనార్టీ జాతికీ తేడా ఉందని విభజించుకున్నట్లయితే వాళ్లకి పాకిస్తాన్ ఏర్పాటు విషయమై తాత్విక సమర్థన దొరికి ఉండేది. అలాంటి సందర్భంలో పాకిస్తాన్ విషయం ఇంతకు ముందెప్పుడో వచ్చి ఉండేది.

సరే, ఆ విషయమంతా ఎలా ఉన్నా, ముస్లింలు పూర్తిగా బొమ్మ వేపు నుంచి బొరుసు వేపు తిరిగిపోయేరు. అది ఏ పిశాచం పట్టిందాని వల్లనో వచ్చింది కాదు, తమ అసలైన, పరమ భవితవ్యం ఏమైందీ కనిపెట్టడం వల్ల వచ్చింది. ఈ హఠాత్పరిణామం కొందరికి మతి పోగొట్టవచ్చు. కాని గత ఇరవై ఏళ్లుగా హిందూ-ముస్లిం రాజకీయాల్ని అధ్యయనం చేసే వాళ్లకి, ఈ పరిణామం, దారుల చీలిక, కొత్తగా పూడిపడ్డది కాదు అన్న భావం కలుగుతుంది. హిందూ-ముస్లిం రాజకీయాల గమనం విషాదభరితంగా, దుశ్శకున సూచక సమాంతర రేఖల్లో సాగింది. హిందువులు, ముస్లింలు సమాంతర మార్గాల్లో నడిచేరు. ఒకే దిశలో వెళ్లేరు, అందులో సందేహం లేదు. కాని ఒకే పథం మీద ఎన్నడూ వెళ్లలేదు. 1885లో బ్రిటిష్ వాళ్లకి వ్యతిరేకంగా రాజకీయ హక్కుల కోసం హిందువులు కాంగ్రెస్ స్థాపించేరు. 1885 నుంచి 1906 దాకా ముస్లింలు ఈ హిందూ రాజకీయ స్రవంతికి దూరంగానే ఉండిపోయేరు. 1906లో ముస్లిములు కూడా రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొనే అవసరం ఉందని చూసేరు. అప్పుడు వాళ్లు తమ కాలవని వేరే తవ్వుకున్నారు, ముస్లిం రాజకీయ జీవిత ప్రవాహానికి. ఆ ప్రవాహాన్ని ప్రత్యేక రాజకీయ సంస్థ నిర్వహించింది. అదే ముస్లిం లీగ్. అది ఏర్పడిన నాటి నుంచీ విడిగా తనంతతానే సాగింది. ఎక్కడో నూటికి కోటికి ఒకసారి తప్ప, కాంగ్రెస్, లీగ్‌లు రెండూ విడిగానే ఉన్నాయి, విడిగానే పనిచేశాయి. వాళ్ల లక్ష్యాలూ, గమ్యాలూ కూడా సర్వదా ఒకలానే లేవు. తమ తమ వార్షిక సమావేశాల్ని ఒకే తావులో నిర్వహించడం మానుకున్నారు, ఒకళ్ల నీడ ఒకళ్ల మీద ఎక్కడ పడుతుందోనని. కాంగ్రెస్, లీగ్ అసలు కలవనే లేదని కాదు. కలిశాయి, అయితే సంప్రదింపుల నిమిత్తం మాత్రమే. కొన్నిసార్లు సంప్రదింపుల్లో నెగ్గేయి, చాలాసార్లు విఫలమయేయి. 1916లో లక్నోలో

కలిసేరు, విజయ కిరీటం వచ్చింది. 1925లో కలిసేరు, నిష్ఫలం అయింది. 1928లో ముస్లింలలో ఓ విభాగం కాంగ్రెస్‌ని కలవాలని ప్రయత్నించింది. మరో విభాగం తిరస్కరించింది. బ్రిటిష్ వాళ్ల మీద ఆధారపడ్డానికే అది సుముఖంగా వుండింది. విషయం ఏమిటంటే, వాళ్లు కలిసేరు గాని, మిళితం కాలేదు. అదుగో ఖిలాఫత్ ఆందోళనప్పుడు మాత్రం రెండు స్రవంతులూ మళ్లీ ఏక ప్రవాహంగా సాగేయి. భగవంతుడు సుగమం కలిగించిన ఆ ప్రవాహాన్ని ఏదీ విడదియ్యలేదని నమ్మేరు. కాని ఆ ఆశ వమ్ము అయింది. వేర్పాటునే ఎప్పుడూ తీసుకు వచ్చేదేదో ఆ శక్తుల్లో ఉందని పించింది. ఆ రెండింటి సంగమం జరిగిన కొన్ని ఏళ్లల్లోనే, ఖిలాఫత్ ఉద్యమ ఆర్తి సమసిపోయేక – ఒక స్రవంతి నుంచి జలం మరో దాని ఉనికికి తీవ్రంగా కంపించింది, ఏదో పరాయి పదార్థం శరీరంలో ప్రవేశించినట్టుగా, దాన్ని అవతలకి తోసెయ్యాలని ఇదీ, దీన్ని అవతలకి తోసెయ్యాలని అదీ తీవ్ర కాంక్షని వెల్లడి చేసుకున్నాయి. ఒక దాన్నుంచి ఒకటి విడిపోవాలనుకున్నాయి. అవి అలా విడిపోయేక ఇంకా లోతుగా తమ తమ గట్ల మధ్య, ఇంకా ఇంకా దూరమవుతూ ప్రవహించేయి. తీవ్రమైన వేగంతో, కసి పట్టిన తీవ్రతతో నీటికి సంబంధించి అలాంటి భాషని వాడగలిగినట్లయితే ప్రవహించేయి. తాత్కాలికంగా సంగమించిన తటాకం నుంచి విడిపోయి అవి ప్రవహించిన వేగం, తీవ్రత వాటి ప్రవాహ గతిని మార్చేయి. ఒకప్పుడు వాటి దిశ సమాంతరంగా ఉండేది. ఇప్పుడవి స్పర్థించుకున్నాయి. ఒకటి పూర్వంలాగానే తూర్పు దిశలోనే పారింది. మరొకటి వ్యతిరేక దిశలో పడమటికి పారింది. సరే, నేను వాడిన ఈ ఆలంకారిక పదబంధానికి ఏ అభ్యంతరం ఉన్నా, హిందూ ముస్లిం రాజకీయాల విషయంలో ఇది తప్పుడు అధ్యయనం కాదని ఆ నమ్మకం. ఈ పోలికని దృష్టిలో ఉంచుకుంటే ఈ పరివర్తన హఠాత్తుగా జరిగింది కాదనే చెప్పచ్చు. పరివర్తన విప్లవాత్మకమైందనుకుంటే హిందూ ముస్లిం రాజకీయాల్లో ఈ పోలిక ఆ విప్లవానికి పరిణామం అవుతుంది. ముస్లిం రాజకీయాలు సమాంతర దిశలో సాగడం, హిందూ రాజకీయ ప్రవాహంలో ఎన్నడూ మిళితం కాలేకపోవడం ఆధునిక భారతదేశ చరిత్రలో ఒక విచిత్రమైన విషయం. అలా వేర్పాటుగా ఉండడానికి ముస్లింల మీద ఏ తెలియని తీవ్ర శక్తో, ప్రభావం కలిగించింది. దాని మూలం ఏమైందీ వాళ్లు నిర్వచించలేకపోయారు. ఆ అదృశ్య హస్త దర్శకత్వంలో వాళ్లు హిందువులకి దూరంగా ఉండిపోయేరు. ఈ వింత శక్తీ ఈ అదృశ్య హస్తమూ పూర్వ నిర్ణిత భవితవ్యం తప్ప మరేం కాదు. అది పాకిస్తాన్ అనే భావనతో ప్రతీక అయింది. అది వాళ్లకి తెలియకుండానే లోపల్లోపల పని చేస్తూ ఉంది. ఆ రకంగా చూసినట్లయితే, పాకిస్తాన్ ఏర్పాటు భావనలో తెలియనిదీ, అప్పటికప్పుడు పుట్టుకొచ్చిందీ ఏదీ లేదు. అప్పటిదాకా మసక మసగ్గా ఉన్నది ఇప్పుడు పూర్తి ప్రభతో గోచరమైంది. పేరు తెలియకుండా అప్పటిదాకా ఉన్నదానికి ఓ నామకరణం జరిగింది.

## VI

ఇప్పటిదాకా జరిగిన చర్చని క్రోడీకరించుకుని చూస్తే సమైక్య భారతం అనేది

స్వతంత్ర భారతంతో పొసగదని, భారతదేశ అధినివేశ ప్రతిపత్తితో కూడా పొసగదని తెలుస్తుంది. భారతదేశం ఒక సమైక్య పూరిత ఏకతతో ఉండాలన్న విషయానికి సంబంధించి, స్వాతంత్ర్యరేఖ భవిష్యత్తు మీద విశాలంగా లిఖించిన సకల ఆశలూ ఒక నిస్పృహకి గురవుతున్నాయి. జాతీయ భవిష్యత్ గురించి స్వాతంత్ర్యం రీత్యా మాట్లాడితే నిస్పృహ కనిపిస్తోంది. ఏమంటే హిందువులు ఆ దారిలో వెళ్లరు. అలా వెళ్లకపోవడానికి వాళ్లకి కారణమూ ఉంది. ఆ దారిలో హిందువుల మీద ముస్లిముల పెత్తనం ఉంటుందని వాళ్ల భయం. స్వాతంత్ర్యం కోసం ముస్లింలు చేసే ప్రతిపాదన అమాయకమైంది కాదని హిందువులకి తెలుసు. బ్రిటిష్ వాళ్ల రక్షక ఛత్రం కింద నుంచి హిందువుల్ని బయటికి లాగడానికే దాన్ని వాడతారు, అప్పుడు ఇరుగు పొరుగున ఉన్న దేశాలతో సంధి చేసుకుని వాళ్ల వత్తాసుతో అణగదొక్కుతారు. ముస్లింలకి స్వాతంత్ర్యమే కడపటి లక్ష్యం కాదు. ముస్లిం రాజ్‌స్థాపనకి అదొక మార్గం మాత్రమే. అధినివేశ ప్రతిపత్తి రీత్యా చూసినా నిస్పృహే మిగులుతుంది. ఏమంటే ముస్లింలు దానికి బద్ధులై ఉండరు. అధినివేశ ప్రతిపత్తి కింద హిందువులు హిందూరాజ్‌ని తమ నెత్తిమీద రుద్దుతారనీ, ఒక మనిషికి ఒకే ఓటు అన్న సూత్రాన్ని సాకుగా తీసుకుని అలా లబ్ధి పొందుతారని భయం. ముస్లింలకి ఎంత రాయితీ ఇచ్చినా ఆ సూత్రం వల్ల హిందువుల వల్ల హిందువుల కోసం ఏర్పడే హిందూ రాజ్యం రాకుండా పోదు. అది అంచేత భవిష్యత్తు గురించిన తీవ్ర నిస్పృహ భారతదేశానికి రాసిపెట్టినట్టే ఉంది, భారతదేశం ఏకైక సమగ్ర దేశంగా ఉండాలని ఒత్తిడి చేస్తే.

సమైక్య భారతం అనే ఆదర్శం పోరాడదగిన ఆదర్శమేనా అని ఆలోచించాలి. ఒకవేళ భారతదేశం అలా ఉన్నా అది ఒక సజీవ మూర్తిగా ఉండలేదు. పేరుకి భారతదేశం ఒక దేశంగానే ఉండచ్చు, యదార్థానికి పాకిస్తాన్, హిందూస్తాన్ అని రెండు విడి దేశాలుగానే ఉంటుంది. ఏదో బలవంతపు బ్రాహ్మణార్థం లాగా, కృత్రిమ కలయికతో ఉంటుంది. ద్విజాతీయ సిద్ధాంతం ఒత్తిడితో మరీ అలా తయారవుతుంది. ఉన్నదున్నట్టుగా చెప్పాలంటే ఏకత భావనకి యదార్థ, వాస్తవ భారతం మీద ఏ పట్టూ లేదు. సామాన్య భారతీయుణ్ణి ఏ మాత్రం మరిపించదు. వాళ్లు హిందువులైనా, ముస్లింలైనా గానీ. వాళ్ల వాళ్ల దృక్పథాలు వాళ్లు బతికే లోయల్లో సీమితమైపోయేయి. అయితే అది ఉభయ పక్షాల్లోనూ ఉన్న కాల్పనిక, అ కుతర్క మనస్సులని అలరించింది. ఆ ద్విజాతి సిద్ధాంతం ఏకత కావాలన్న మమకార పూరిత కామన పెరగడానికి కూడా సందు వదలదు. ద్వైత సిద్ధాంత క్రిమి ప్రజా జీవితంలో విస్తరిస్తుంది. ఏదో ఒక రోజున ఆ బలవంతపు ఏకతని నిర్మూలించే జీవన్మరణ పోరాటం చేసే మనస్తత్వాన్ని కల్పించి తీరుతుంది. ఏ బలవత్తర శక్తి కారణంగానో ఆ నిర్మూలన జరగకుండా ఆగినా, ఒకటి మాత్రం భారతదేశానికి మూడి తీరుతుంది. అంటే ఆ ఏకత భారతదేశపు మూలాలుగుల్ని పీల్చేస్తూనే ఉంటుంది. దాని సంయోగాన్ని వదులు చేస్తూనే ఉంటుంది, తన ప్రజల ప్రేమాభిమానాల మీద పట్టుని దుర్బలం చేసుకుంటూనే ఉంటుంది. నైతిక పాదార్థిక

వనరుల ఉపయోగాన్ని వాటి వృద్ధిని అడ్డ లేకపోయినా, నిరాకరిస్తూనే ఉంటుంది. భారతదేశం రక్తహీనమై జబ్బు పడ్డ రాజ్యం అవుతుంది. నిష్ప్రయోజకంగా, జీవచ్ఛవంలా, ఖననం జరక్కపోయినా మృతంగా పడి ఉంటుంది.

ఇలా బలవంతంగా రుద్దిన ఏకతకి మరో అననుకూలత ఉంది. అది హిందూ-ముస్లిం సమస్యకు పరిష్కారం చూడాల్సిన ఆవశ్యకత. పరిష్కారాన్ని చేరుకోవడమనేది ఎంత దుర్ఘటమో ఎవళ్లు ఎవళ్లకీ చెప్పనక్కర్లేదు. పేరుకి భారతదేశం పాకిస్తాన్ అని విడిపోవడం తప్ప, మరి లేనిది ఏమిటి? దేశంలో ఇతర ప్రయోజనాలకి ముప్పు లేకుండా, ఇక ఇవ్వగలిగింది ఏమి ఉంటుందో ఊహించడం కష్టం. సరే, కష్టనష్టాలు ఏం ఉన్నాగానీ, ఈ బలవంతపు ఐక్యం కొనసాగితే గనక భారతదేశానికి రాజకీయ పురోగతి ఉండదు. మత సమస్య పరిష్కారం అయి తీరాల్సిందే. నిజానికి మత సమస్య పరిష్కారం – బహుశా ప్రస్తుతానికి ఒక అంతర్జాతీయ పరిష్కారం, ఆపైన హిందువుల్ని, ముస్లింలని రెండు వేర్వేరు జాతులుగా చూడ్డం – బలవంతపు ఐక్యంలో ప్రతి అంగుళం రాజకీయంగా ముందుకు సాగడానికి పూర్వ నిబంధనగా తయారవుతుంది.

ఈ బలవంతపు ఐక్యం వల్ల వచ్చే మూడో అనర్థం ఇంకోటుంది. మూడవ పక్షం దీనివల్ల తొలగిపోదు. మొదట్లోనే, రాజ్యాంగం – అలాంటిదంటూ ఏర్పడితే – పరస్పరం అనుమానించే, శత్రుపూరిత రాజ్యాల ఫెడరేషన్‌గా ఉంటుంది. ఆ రాజ్యాలు తమకిగా తాము మూడోపక్షం కావాలని కోరుకుంటాయి, ఏదన్నా పేచీ వస్తే మధ్యవర్తిత్వం చెయ్యడానికి – వాటి మధ్య అనుమానం, శత్రుత్వం ఉండడం వల్ల పరస్పర చర్చల ద్వారా అవి తృప్తికరమైన పరిష్కారాలకి రాలేవు. భవిష్యత్తులో భారతదేశానికి బ్రిటిష్ వాళ్లకి వ్యతిరేకంగా ఉండే ఐక్యం కూడా ఉండదు. గతంలో ఎందరికో హృదయాలు పొంగింప చేసిన ఐక్యం. ఏమంటే ఆ రెండు దేశాలూ ఒకదానికి ఒకటి ఎంత ఉత్తర దక్షిణ ధృవాల్లా తయారయి ఉంటాయంటే, ఎన్నటికీ బ్రిటిష్ వాళ్లకి వ్యతిరేకంగా ఐక్యంగా ఉండలేవు, రెండవదిగా, ఆ రాజ్యాంగానికి పునాది హిందువులకీ ముస్లింలకీ మధ్య పరిష్కారం, అలాంటి రాజ్యాంగం సొడ్డు లేకుండా సాగాలీ అంటే మూడోపక్షం ఉండాలి. ఆ ఉండడం కూడా తగినంత సాయుధ బలగంతోనని గుర్తించాలి. ఆ పరిష్కార భగ్నం కాకుండా చూసేందుకు అది అవసరం.

మరి దీనంతటి అర్థమూ ఏమిటయ్యా అంటే రాజకీయ భవితవ్యం భగ్నం కావడం. హిందువులూ, ముస్లింలూ కూడా ఎంతో అపేక్షించే ఆ భవితవ్యం, ఎంతగానో వాళ్లు మనఃపూర్వకంగా కాంక్షించే భవితవ్యంతో భగ్నం కావడం. లేకపోతే రెండు కుమ్ములాడుకునే జాతులు ఒకే దేశం ఒడిలో, ఒకే రాజ్యాంగం నీడలో బంధితమైపోతే ఇలా కాక మరి ఎలాగ ఉంటుంది?

ఇండియా భారత, పాకిస్తాన్‌లుగా విడిపోతే ఏర్పడే ఈ దృశ్యంలో ఈ చీకటి దృశ్యాన్ని

పోల్చి చూడండి. విభజన వల్ల, ఎవళ్లకి వాళ్లు నిర్దేశించుకున్న భవితవ్యం పరిపూర్తి చేసుకోవచ్చు. ముస్లింలు తమ పాకిస్తాన్‌కి స్వాతంత్ర్యాన్నో, అధినివేశ ప్రతిపత్తినో, తమకి ఏది మంచిది అంటే దాన్ని ఎంచుకొనవచ్చును. హిందువులు స్వాతంత్ర్యాన్నో, అధినివేశ ప్రతిపత్తినో తమ పరిస్థితులకి ఏది నప్పితే దాన్ని ఎంచుకోవచ్చును. ముస్లింలు హిందూరాజ్ పీడకల నుంచి విముక్తులవుతారు. ఆ విధంగా రాజకీయ పురోగతి ఇద్దరికీ సుగమంగా తయారవుతుంది. నిస్పృహకి తమ లక్ష్యం గురవతుందేమో నన్న భయం నుంచి, ఆశ, కాంక్షా పరిపూర్తికి దారి వస్తుంది. భారత దేశం ఏ రాజకీయ పురోగతి సాధించాలన్నా మత సమస్య పరిష్కారం అందుకవసరమైన పూర్వ నియమం అవుతోంది. కాని అప్పుడు పాకిస్తాన్, హిందూస్తాన్ దేశాలు అలాంటి పూర్వ నిబంధన శృంఖలాల నుంచి స్వేచ్ఛ పొందుతారు. మైనార్టీ వర్గాలతో పరిష్కారం అనేది పూర్వ నిబంధనగా ఉన్నా దాన్ని సాధించడం ఏమంత కష్టం కాదు. ఉభయపక్షాల మార్గం ఈ అవరోధం నుంచి విముక్తమవుతుంది. పాకిస్తాన్‌కు మరో లాభం కూడా ఉంటుంది. దాన్ని గురించీ చెప్పుకోవాలి. హిందువులకీ ముస్లింలకీ మధ్య విద్వేషం ఉంది, దాన్ని అంతమొందించకపోతే భారతదేశ శాంతికీ, అభివృద్ధికీ ప్రాణాంతక మవుతుంది. ఈ విషయాన్ని సర్వే సర్వత్రా అంగీకరిస్తూనే ఉన్నారు. అయితే ఓ విషయాన్ని మర్చిపోతున్నారు. దురంతం సంభవించేది పరస్పర విద్వేషం వల్లకాదు, దాన్ని ప్రదర్శించడానికి ఉమ్మడి రంగం ఉండబట్టి. అదే ఆ విద్వేషాన్ని ఆచరణకు లాగుతోంది. ఇంకోలా ఉండడానికి లేదు. ఇద్దరికీ ఆచుర్దా కలిగించే అంకాలలో నటించటమని ఇద్దర్నీ అడిగితే స్వతహాగా ఉన్న విద్వేషాలు తప్ప మరేం ప్రదర్శనకి వస్తాయి? ఇపుడు పాకిస్తాన్ పథకానికి సౌకర్యం కలుగుతుంది. అంటే, హిందువులకీ ముస్లింలకీ మధ్య పచ్చగడ్డి భగ్గుమనే సాంఘిక విద్వేష నాటక ప్రదర్శనకి రంగమే ఉండదు. భారతదేశాన్ని ఎన్నో ఏళ్లుగా చీల్చి చెండాడిన కల్లోలాలకి, శాంతి భద్రతల విఘాత హేతువుకీ వణికిపోయే భయం పోతుంది. ఇక ఆఖరిది మూడవ పక్షం ప్రమేయం లుప్తం కావడం. ఈ బలవంతపు ఐక్యం వల్ల ఒకళ్ల మీద ఒకళ్లకి పడే అవరోధాల నుంచి విముక్తి అయి, పాకిస్తాన్ భారతదేశాలు, అంతర్గత విఘాత భయం లేకుండా సుస్థిరమైన రాజ్యాలుగా వృద్ధి చెందుతాయి. రెండు విడి భాగాలుగా, అవి వాటి వాటి భవిష్యత్తుని సాధించుకుంటాయి, ఏక ఖండంలో భాగాలుగా ఉన్నప్పుడు సాధించుకోనేవి దాన్ని సాధించుకుంటాయి.

సమైక్య భారతాన్ని కోరుకునే వాళ్లు 1923లో కాంగ్రెస్ అధ్యక్షునిగా మహమ్మద్ ఆలీ చెప్పిన మాటల్ని గుర్తుంచుకోవాలి. భారతీయుల మధ్య ఐక్యం గురించి చెపుతూ మహమ్మద్ ఆలీ ఇలా అన్నాడు :

"ఈ సువిశాల భరత ఖండాన్ని తప్పుదారి పట్టించే ప్రతిపక్ష ఐక్యం అన్న భావన కంటే, మరో బలవత్తర నవీన శక్తి ఏదన్నా ఐక్యం చేస్తే తప్ప ఇది ఒక భౌగోళిక భ్రష్టపదంగానే మిగిలి పోతుంది."

పగ్గాలు వెయ్యకుండా విడిచిపెట్టే నూతన శక్తి ఇంకా ఏదన్నా మిగిలి ఉందా? ఇతర శక్తులన్నీ ఉడిగిపోయేయి, కాంగ్రెస్, రోజువారీ ప్రభుత్వంగా మారేక, 'ప్రజా సంబంధాల' ప్రణాళికలో నూతన శక్తిని కనిపెట్టింది. ముస్లిం నాయకుల్ని ఉపేక్షించో, పక్కన పెట్టో హిందూ ముస్లిం ప్రజా బాహుళ్యం మధ్య ఐక్యాన్ని రూపొందించడానికి కాంగ్రెస్ ఆలోచన చేసింది. ఈ పథకం, లేబర్‌ని "టోరీ బంగారం"తో కొనాలని బ్రిటిష్ కన్సర్వేటివ్ పార్టీ చేసిన లాంటిది, అసలు విషయం చెప్పాలంటే. కొన్ని వస్తువులు యజమానికి ఎంతో ప్రియమైనవి ఉంటాయని అతనికే వాటి విలువ తెలుసనీ, ఏ ప్రలోభాలకి, మోసాలకీ లొంగదీసినా అతను వాటిని వదులుకోలేడనీ – అలాంటి ప్రయత్నాలు నిరసననీ, పగనీ కలగజేస్తాయి తప్ప మరొకటి కాదనీ, కాంగ్రెస్ మరిచిపోయింది. ఓ మతవర్గం రాజకీయాధికారాన్ని పరమ పవిత్రంగా ఎంచుతుంది, ముఖ్యంగా నిరంతర బెదిరింపులకీ, సవాళ్లకీ గురయినప్పుడు తన స్థానాన్ని కాపాడుకోవడానికి దానికి ఉన్న మార్గం అల్లా రాజకీయ అధికారమే. తప్పుడు ప్రచారం ద్వారా దాన్ని తప్పించే ప్రయత్నంగాని విషయాన్ని మరుగు పరిచే ప్రయత్నం గాని దాని పోరాట పటిమని తగ్గించడంలో బానిసలాగా అణిగి ఉండేట్టు చెయ్యడంతో సమానం. ఐక్య సాధననేది ఓ మార్గమే కావచ్చు, కాని ఏహ్యమైన పద్ధతి. ఏమంటే ప్రతిపక్షాన్ని తప్పుడు మార్గంలో, అధర్మరీతిలో అణిచి ఉంచే పద్ధతి అది. దానివల్ల ఏ ఐక్యమూ కాదు. దానివల్ల ఆయాసం, విద్వేషం, పగ మాత్రమే వస్తాయి. కాంగ్రెస్ వాళ్ల "ప్రజా బాహుళ్య సంబంధాల" పథకం చేసింది సరిగ్గా ఇదే. ఈ పిచ్చి పథకమే పాకిస్తాన్ ఆవిర్భావానికి చాలా అనుకూలించిందని చెప్పేందుకు సందేహం లేదు.

"ప్రజా బాహుళ్య సంబంధాల"ని రాజకీయ తులాదండంగా వాడుకోవాలని ఆలోచించి, ప్రయోగించడం దురదృష్టం. ఆ పథకాన్ని సాంఘిక ఐక్యానికి తోడ్పడే శక్తిగా ఇంకా బలంగా వాడుకుని వుండచ్చు. కాని దాని వల్ల హిందువుల్ని ముస్లింలనీ విడగొట్టే గోడని పగలగొట్టడం జరిగేదా? హిందువుల్ని ముస్లింలనీ దగ్గరికి తెచ్చే సాంఘిక బంధం ఏదీ లేకపోవడం ప్రతి భారతీయుడికీ బాధ కలిగిస్తుంది. ఒకళ్లతో కలిసి ఒకళ్లు భోజనాలు చెయ్యడం లేదు, అంతర్వివాహాలు లేవు. వాటిని తెచ్చిపెట్టగలమా? వాళ్ల పండుగలు వేరు. వాటిని హిందువులు అనుసరించేట్టు చెయ్యగలమా? లేకపోతే వాటితో కలిసేట్టు చెయ్యగలమా? వాళ్ల వాళ్ల మతభావనలు విభేదించడమే కాదు, ఒకళ్ల భావనలంటే ఇంకొకళ్లకి వికారం. దాంతో మతవేదిక మీద ఒకళ్లు ప్రవేశించడమంటే మరొకళ్లు నిష్క్రమించడమే. వాళ్ల సంస్కృతులు వేరు. వాళ్ల సాహిత్యాలు, చరిత్రలు వేరు. వేరు కావడమే కాదు, ఒకళ్లవి ఒకళ్లకి రుచించవు. ఒకళ్లవి ఒకళ్లకి వికారం, వెలపరం పుట్టిస్తాయి. జీవిత నిత్య జలధార నుంచి వాళ్లని ఎవళ్లేనా నీరు తాగించగలరా? ఇద్దరూ కలుసుకునే ఉమ్మడి జాగాయే లేదు. దేన్ని తయారు చెయ్యనూ లేము. అసలు సరైనంత ముఖాముఖీ సంబంధాలు కూడా లేవు, అనుభూతుల్ని, ఉమ్మడి సంస్కృతిని పంచుకోవడం మాట సరేసరి. ఇద్దరూ కలిసి బతకరు. ఎవళ్ల బతుకులు

వాళ్లవి విడివిడిగా. హిందువులు గ్రామాల్లో ఉంటారు, ముస్లిములు బస్తీల్లో ఉంటారు హిందువులు మెజార్టీగా ఉన్న రాష్ట్రాల్లో. ముస్లిములు మెజార్టీగా ఉన్న రాష్ట్రాల్లో హిందువులు బస్తీల్లోనూ, ముస్లింలు పల్లెల్లోనూ ఉంటారు. ఉన్న చోటుల్లోనేనా విడివిడిగా ఉంటారు. ప్రతి పల్లెటూళ్లో, ప్రతి బస్తీలో హిందువుల పేటలూ, ముస్లింల పేటలూ విడివిడిగా ఉంటాయి. ఇద్దరూ పాల్గొనడానికి తగ్గ ఉమ్మడిది ఏదీ లేదు. వ్యాపారం కోసం కలుస్తారు, చంపుకోవడం కోసం కలుస్తారు. ఒకళ్ళతో ఒకళ్ళు స్నేహం చేసేందుకు కలవరు. వ్యాపారం అగత్యం లేకపోయినా, చంపుకునే సందర్భం లేకపోయినా కలవరు, కలవడం మానుకుంటారు. శాంతిగా ఉన్నపుడు హిందూ పేటలు, ముస్లిం పేటలు రెండు పరాయి శిబిరాల్లా ఉంటాయి. యుద్ధం వచ్చిందో రెండు శిబిరాలూ సాయుధ శిబిరాలవుతాయి. శాంతి సమయాలూ, యుద్ధ సమయాలూ తక్కువ వ్యవధిగానే ఉంటాయి. కాని ఆ విరామ సమయాన సదా ఉద్రిక్తంగానే ఉంటుంది. అలాంటి అవరోధాలు ఉండగా ప్రజా బాహుళ్య సంబంధాలు ఏం చేస్తాయి? అవరోధం దాటిపోలేవు, అసలైన సజీవ ఐక్యాన్ని ప్రసాదించడమా సరేసరి.

అనువాదం : ఆర్వియార్

* సర్ అబ్దుల్ రహీమ్‌లాంటి సాత్వికుడు కూడా ఈ విద్వేషం వెల్లడించేడు. 1925 డిసెంబరు 30న అలీఘర్‌లో జరిగిన ముస్లింలీగ్ సమావేశానికి అధ్యక్షత వహిస్తూ హిందువుల కుటిల యత్నాలని నిరసించేడు. "శుద్ధి, సంఘట రూపాల్లో ముస్లిం పక్షీయుల మీద దాడినీ, హిందూ మహాసభ ఎత్తుల్ని, లాలా లజపత్‌రాయ్, స్వామీ శ్రద్ధానంద లాంటి నాయకుల చర్యల్నీ" ఆయన ఖండించేడు. స్పానియర్డ్స్ మూర్స్‌ని స్పెయిన్‌నుంచి తరిమి వేసినట్టుగా భారతదేశం నుంచి ముస్లింలని తరిమెయ్యాలని కొంతమంది హిందూ నాయకులు బహిరంగంగానే అన్నారు. ముసల్మాన్లు హిందువులకి మిగుడుపడరు. తాము ఉన్న కృత్రిమ పరిస్థితుల ధర్మమా అని హిందువులు పై చెయ్యిగా ఉన్నారు. ఇంగ్లీషు వాళ్లకి కూడా వాళ్ల విషపూరిత ప్రచారం బెదురు పుట్టిస్తోంది. ప్రభుత్వ ఉద్యోగాల్లో ఉన్న ముసల్మాన్లని చిన్నచూపు చూడ్డంలో కూడా హిందువులు నేర్పరులే. హిందూ విశ్వాసాల్ని మన్నించేవాళ్లని తప్ప హిందువులు ఎన్నడూ లేనంతగా ముస్లింల పట్ల రెచ్చగొట్టే వైఖరినీ, దుందుడుకు వైఖర్ని సృష్టం చేశారు. హిందువుల చేతిలో ఉంచలేరు, ఆత్మరక్షణ కోసం.

# పాకిస్తాన్ సమస్య గురించి

పాకిస్తాన్ సమస్య గురించి ముందు పేజీల్లో ప్రస్తావించుకున్న విషయాల్ని పలులకాలుగా అర్థం చేసుకున్నారు. కేవలం సమస్యకు ఉన్న రెండువైపుల నుండి ఉత్పన్నమయ్యే సమస్యలను మాత్రమే చెప్పి అసలుకు నా వ్యక్తిగత అభిప్రాయాలేమిటో వ్యక్తీకరించలేదని ఒకవర్గం వారు ఆరోపించారు. ఇది నిజం కాదు. ముందు భాగాలను చదివిన ఎవరికైనా సరే, నేను అన్ని ప్రశ్నలకూ కాకపోయినా చాలా ప్రశ్నలకు ఖచ్చితంగా, నిర్దిష్టంగా నా అభిప్రాయాలను ప్రకటించానని ఒప్పుకుంటారు. ప్రత్యేకించి ఈ వివాదంలో రెండు ముఖ్య ప్రశ్నలైన ముస్లిములు ఒక జాతా? పాకిస్తాన్‌కు వాళ్లు అర్హులా? వాళ్లకు వస్తు పునాది ఉందా? అనే ఈ వివాదంలోని రెండు ప్రశ్నలను ప్రకటించడంలో విఫలమయ్యానని వాళ్లనడం లేదు కాని మినహాయింపు లేకుంటే ఆచరణలో నిరపేక్ష అని భావించే కొన్ని ప్రతిపాదనలపై ఆధారపడ్డానన్నదే వాళ్ల బాధ.

"మీ అంతిమ నిర్ధారణలు అతి సాధారణమైనవి కావా? ఏ సాధారణ ప్రతిపాదనైనా పరిస్థితులకు పరిమితులకు లోబడి ఉండవా? కొన్ని జటిలమైన సమస్యల విషయంలో మీరు క్లుప్తంగానూ దూకుడుగానూ వ్యవహరించారా? "న్యాయబద్ధంగా శాంతియుతంగా పాకిస్తాన్ ఎలా సాధ్యమో మీరు సూచించారా?" అని నన్ను ప్రశ్నించారు. అయితే ఈ విమర్శ కూడ అంతా సరికాదు. ఈ ప్రశ్నలను నేను చర్చించకుండా వదిలి వేశాననడం సబబు కాదు. వీటిపైన వ్యాఖ్యానం సంక్షిప్తంగానూ ఉండియుండవచ్చు. ఇక్కడో అక్కడో చెప్పినట్లు కన్పించవచ్చు. ఏది ఏమైనా, ఈ విమర్శ శక్తివంతమైనదని ఒప్పుకోవడానికి నేను సిద్ధపడుతున్నాను. వైఫల్యాన్ని సరిదిద్దుకోవడం నా బాధ్యత. కాబట్టే దిగువ పేర్కొన్న అంశాలను పరిశీలించడానికి ఈ భాగాన్ని ప్రత్యేకిస్తున్నాను.

1. పాకిస్తాన్ అనే ముస్లిముల వాదాన్ని ప్రభావితం చేయగల పరిమితమైన పరిశీలనాంశాలేమి?

2. పాకిస్తాన్ సమస్యలేవి? వీటికి పరిష్కారమేమి?

3. పాకిస్తాన్ సమస్యపై నిర్ణయం చేసే అధికారం ఎవరికుంది?

# పాకిస్తాన్ ఉండతగునా ?

## I

క్రితం వరకు జరిగినదంతా చూశాకా "పాకిస్తాన్ ఉండదగునా" అని శంకితుడు జాతీయవాది, సాంప్రదాయవాది, పాత ప్రపంచపు భారతీయుడైన వారెవరూ అడగకుండా వుండలేరు. అలాంటి దృక్పథాన్నెవరూ అంత తేలికగా తీసి వేయలేరు. పాకిస్తాన్ సమస్య వాస్తవానికి ఎంత తీవ్రమైనదంటే అది కేవలం ముస్లిములను పాకిస్తాన్ ప్రచారకులను ప్రశ్నించ యుక్తమైన చక్కని ప్రశ్నగాక మనందరికీ కూడ చాలా ముఖ్యమైనదని ఒప్పుకోవాల్సిందే. అంత సులభంగా తీసివెయ్య వీలులేని శక్తివంతమైన పరిమితులుండబట్టే పాకిస్తాన్ కోరిక ఎంత ప్రాముఖ్యత గల అంశమో అవగతమౌతుంది. కేవలం ఈ పరిమితులను వర్ణించినంత మాత్రాన వాని ప్రభావాన్ని అర్థమయ్యేలా చేయలేం. ఈ విషయం వాటిని చూస్తేనే తెలుస్తుంది. అలాంటప్పుడు, పాకిస్తాన్ కోరికకు మద్దతుగా బలీయమైన సాక్ష్యాధారాలను చూపాల్సిన భారం ముస్లింలపై ఆజ్ఞాపూర్వక విధిగా వుంది. యదార్థంలో పాకిస్తాన్ అనండి. ఇంకా తేటతెల్లంగా ఇండియా విభజన అనండి. ఎంత తీవ్రమైనదంటే ముస్లింలు కేవలం సాక్ష్యాధారాలు చూపగలగడమే గాదు అంతర్జాతీయ ట్రిబ్యునల్ వారు వ్యాజ్యం గెలవగలిగేంత పటిష్టంగా ఆ సాక్ష్యాలు ఉండాలి. ఈ పరిమితుల వెలుగులో పాకిస్తాన్ వ్యాజ్యానికి ఉండే భవిష్యత్తు ఏమిటో పరిశీలిద్దాం.

## II

సులభంగా వేరు పరచడాని కనువైన విధంగా ఇండియాలోని ముస్లిమ్‌లు కొన్ని నిర్ధారిత ప్రాంతాల్లోనే సమీకృతమై వున్నంత మాత్రాన పాకిస్తాన్ ఉండదగునా? ముస్లిం జనాభా కొన్ని నిర్ధారిత ప్రాంతాల్లోనే ఎక్కువగా ఉండవచ్చు. ఆ ప్రాంతాల విభజనకు తగిన

విధంగా కూడ ఉండవచ్చు. అంతమాత్రాన విభజన గురించి ఆలోచించే ముందు ప్రకృతి దృష్ట్యా ఇండియా ఒకే ఒక భౌగోళిక భాగమన్న ప్రాథమిక వాస్తవాన్ని ఎవరూ విస్మరింపరాదు. భారతీయులు ఎప్పుడూ కొట్టుకుంటూనే వున్నారు. వీరిలో కలహ వైఖరి ఎప్పుడు పోతుందో ఏమో ఏ జ్యోతిష్కుడు కూడా చెప్పలేడు. ఈ వాస్తవాన్ని ఒప్పుకుందాం. అయితే దీనివల్ల తేలేదేమిటి? భారతీయులు కలహ ప్రియులన్న అంశం మాత్రమే. అంతమాత్రాన ఇండియా భౌగోళికంగా ఒకే ఒక భాగమన్న వాస్తవానికి ఢోకా లేదు. దాని ఏకత ప్రకృతంతా పురాతనమైంది. ఈ భౌగోళికమైన ఏకతలో అంతర్లీనంగా సాంస్కృతిక ఐక్యం కూడ అనాదిగా వుంటూ వస్తుంది. సర్వ విధ రాజకీయ, జాతి విభజనలని ఎదురొడ్డి నిలబడగల్గింది ఈ సాంస్కృతిక ఏకత్వం. ఏ రకంగా చూసిన గత నూట ఏభై సంవత్సరాలుగా సాంస్కృతిక, రాజకీయ, చట్ట పరిపాలనా సంస్థలన్నీ ఒకే గొడుగు క్రింద పనిచేస్తున్నాయి. పాకిస్తాన్ గురించిన ఏ చర్చకయినా భారతదేశ మౌలిక ఏకత అన్న అంశం శాసనాత్మకంగాకున్నా పునాదిగా వుంటుంది. వాస్తవంలో ఇదివరకే రెండు రకాలైన ప్రస్ఫుటమైన విభజనలున్న వైనాన్ని గుర్తించగలగాలి. ఒకేరకమైన విభజన ప్రస్తుతం అనుకునే విభజనకు ముందున్న స్థితిలో మొదలౌతుంది. కాబట్టి ప్రస్తుతం విభజన అనేది ఒకప్పుడు విడివిడిగా ఉండి తర్వాత విలీనం చేయబడిన ప్రాంతాల విచ్ఛేదన మాత్రమే. నిరంతర ఏకత అనే భావనతో ప్రారంభమయ్యేది మరో విభజన. కాబట్టి ఇవి రెండు వేరు వేరు. అవి రెండవ విధంగా చూసినట్లయితే ఒకే మొత్తంగా ఉన్న ప్రదేశాన్ని వేర్వేరు భాగాలుగా చీల్చడమే విభజన అవుతుంది. మొదటి రకమైన విభజనలో ప్రాదేశిక ఏకత మూల బిందువు కాదు. అంటే మనం అనుకునే ఏకతకు పూర్వమే అనైక్యత ఉండి వుంది కనక విభజన అనేది యధాస్థితికి చేరడమే అవుతుంది. అందుచేత ఇదంత విభ్రాంతికరం కాదు. కాని భారతదేశం లో ఏకత అనేది మూలబిందువు. కొందరు ముస్లిములకసంతృప్తి కల్గినంత మాత్రాన ఈ ఐక్యతనెందుకు విచ్ఛిన్నం చేస్తారిపుడు? చరిత్ర కాలాల నుండి ఒకే భాగంగా వున్న దాన్ని ఎందుకు చించి వేస్తారు?

### III

హిందువులకు ముస్లిములకు మతవైషమ్యాలున్నంత మాత్రాన పాకిస్తాన్ ఉండదగునా? మత వైషమ్యాలున్న విషయం నిర్వివాదాంశం. అంతమాత్రాన, ఒకే దేశంగా ఒకే రాజ్యం క్రింద మనుగడ సాగింప వీలు లేనంత తీవ్రమైనదా ఈ వైషమ్యం అన్నదే ప్రశ్న. కలిసి మెలిసి ఉండాలన్న కాంక్ష 1937 వరకు ఖచ్చితంగా ఉంది. భారత ప్రభుత్వ చట్టం 1935 నిర్మాణ దశలో వుండగా హిందూ ముస్లిం లిరువురూ సమైక్యంగా ఉండాలనే ఆకాంక్షించారు. ఒక దేశం, ఒక రాజ్యాంగం లక్ష్యంగా 1935 చట్ట నిర్మాణ చర్చలలో పాల్గొన్నారు. 1920-35 మధ్యకాలంలో మత వైషమ్యాల స్థితి ఎలా ఉంది? ముందు పేజీలలో పేర్కొన్నట్లుగా

1920-35 మధ్య భారత చరిత్ర మత సంఘర్షణల చరిత్ర. ఈ ఘర్షణలో మనందరం సిగ్గు పడేస్థాయిలో ధన, ప్రాణ నష్టం జరిగింది. 1935 చట్టం తేవడానికి ముందరి 15 సంIలలో ఉన్నంతటి మత వైషమ్యం మరెన్నడూ లేదు. అయినా సుదీర్ఘ వైషమ్యపూరిత చరిత్ర హిందూ ముస్లింలు ఒకే దేశంగా ఒకే రాజ్యాంగం క్రింద కల్సి వుండాలనుకోవడం నుంచి నిరోధించలేదు. అలాంటపుడు ఇంతటి వైషమ్యం ఇప్పుడే ఎందుకొచ్చినట్టు?

మత వైషమ్యం అనేది ఒక్క భారత దేశంలోనే ఉందా? కెనడా మాటేమిటి? కెనడాలోని ఆంగ్లేయులు ఫ్రెంచి వారి మధ్య సంబంధాల గురించి అలెగ్జాండర్ బ్రాడి ఏమంటున్నాడో ఆలోచించండి :

"నాల్గు మూల రాష్ట్రాలకు గాను నోవాస్కాటమా, న్యూబ్రన్స్విక్, ఆంటారియో అనే మూడింటిలో అవే ఆచార వ్యవహారాలు గల ఆంగ్లో శాక్సన్ ప్రజలు గణనీయంగా ఉన్నారు. అమెరికన్ విప్లవ కాలంలో 50,000 మంది ఏకసామ్రాజ్య విధేయులు ఊచకోత బారి నుండి తప్పించుకోడానికి ఉత్తరం వైపు కనుమలు దాటి వచ్చి అక్కడి నిర్జన ప్రదేశంలో నివాసాలేర్పరచుకొన్నారు. అమెరికా విప్లవానికి ముందు నోవాస్కాటిమాకు స్కాచ్, అమెరికన్ ఆవాసా కాంక్షితులు ఎక్కువ సంఖ్యలో వస్తుండేవారు. అయితే అన్ని కాలాలలోనూ విప్లవానంతరం గ్రేట్ బ్రిటన్, ఐర్లండు నుండి వలస వచ్చిన వారితో విధేయుల ప్రాంతాలు నిండిపోతాయి.

దీనికి భిన్నమైంది క్యూబెక్ రాష్ట్రం. జాతి, మత, అడ్డంకుల కారణంగా బ్రిటిష్ జాతుల కతీతమైన ప్రత్యేక సాంస్కృతిక భాగంగా ఫ్రెంచ్ కెనడా 1867 వరకూ వుంది. మధ్యయుగాల నాటి తీవ్రత గల కాథోలిక విశ్వాస ప్రభావితులై వారు తమతో కల్సి ఉంటున్న ప్యూరిటానిస్టులు, కాల్వినిక్ ప్రొటెస్టంటస్టుల పట్ల గౌరవ రాహిత్యాన్ని పెంచుకున్నారు. మతపరంగా కాక సామాజిక కోణం నుంచి చూసినట్లయితే ఇంగ్లీషు ప్రొటెస్టంటు వాదులు ప్రజాస్వామ్యం, వాస్తవిక వాదం ఆధునికత వైపు మొగ్గారు. కాగా కాథలిక్కులైన ఫ్రెంచివారు పితృత్వారాధన, ఆదర్శవాదం వైపు మొగ్గారు. గతాన్ని గురించి గర్వించేవారు.

## కెనడా : అధ్యాయం 1

1867లో ఫ్రెంచ్ కెనడా ఎలా ఉండిందో నేటికి వాస్తవంలో అలాగే ఉంది. ఇంగ్లీషు రాష్ట్రాలలో అంత ప్రభావకరం కాని నమ్మకాలు, ఆచారాలు, వ్యవస్థలపై ఫ్రెంచి కెనడా విశ్వాసం కల్గి వుంది. తమకంటూ ఒక విశిష్టమైన ఆలోచనా విధానం, ఉత్సాహం, విలువలూ కల్గి ఉంది. ఉదాహరణకు, వివాహం విడాకులులాంటి అంశాలపై ప్రబలంగా వున్న ఆలోచనలకు భిన్నమైన దృక్పథాన్ని కల్గి వుంది. కేవలం ఫ్రెంచి కెనడాయేతర కెనడా గాక ఆంగ్లో సాక్సన్ ఉత్తర అమెరికాకు కూడ భిన్నమైంది వీరి ధృక్పథం.

కెనడాలోని అతిపెద్ద నగరమైన యాంట్రియల్ అక్కడి ఇరువర్గాల ప్రజలు మధ్య సాంగత్యం ఎంత అరుదుగా ఉంటుందో విశదపరుస్తుంది. అక్కడ నూటికి 64 మంది ఫ్రెంచివారు కాగా 24 మంది బ్రిటిష్‌వారు. కల్సి మెల్సి ఉండడానికిక్కడ విస్తృత అవకాశాలున్నప్పటికీ రాజకీయ, వ్యాపార విషయాలలో తప్ప మిగిలిన విషయాలలో వారు ఎడముఖం పెడముఖంగాను ఎవరికి వారే యమునా తీరేగాను ఉంటుంటారు. ఎవరి నివాస ప్రాంతాలువారికే. ఎవరి విక్రయకేంద్రాలు వారివే. జాతీయభావాలు ఇంగ్లీషు వారిలో మరింత హెచ్చు.

ఫ్రెంచి భాషమాట్లాడే తమ సహపౌరులను గురించి తెలుసుకోవడానికి గాని, వారి భాష నేర్చుకోవడానికి వారి ఆచారాలు, ఆకాంక్షల నర్థం చేసుకోవడానికి గాని, వారి లక్షణాలను లోపాలను సునిశితంగా పరిశీలించడానికి గాని – యాంట్రియల్‌వాసులైన ఇంగ్లీషు వారు ఎటువంటి ప్రయత్నం చేయలేదు. భాషాపరమైన అడ్డుగోడలు ఈ రెండు జాతుల ప్రజలను మరింతగా విడదీశాయి. 1921 జనాభా లెక్కలలో చాలా ఆసక్తికరమైన అంశాలు వెలుగులోకి వచ్చాయి. ఏమంటే కెనడాలో ఉంటున్న ఫ్రెంచి మూల జాతి ప్రజలలో నూటికి 50 మంది ఇంగ్లీషు మాట్లాడలేరు. అలాగే 95 శాతం బ్రిటిషు మూలజాతివారు ఫ్రెంచి మాట్లాడలేరు. యాంట్రియల్‌లో కూడ నూటికి 70 మంది బ్రిటిష్ వారు ఫ్రెంచిని నూటికి 34 మంది ఫ్రెంచివారు ఇంగ్లీషు మాట్లాడలేరు. ఒక ఉమ్మడి భాష లేకపోవడమనేది ఈ రెండు జాతుల మధ్య అగాధంగా మారి వారి కలయికను నిరోధిస్తోంది.

"వారి విశిష్ట జాతీయ జీవనాన్ని కొనసాగిస్తూనే బ్రిటిషు వారితో సంతోషంగా కల్సి వుంటూ, కేవలం వారి జాతికే గాక యావత్ కెనడాకు విధేయులుగా వుంటూ సమోన్నత కెనడా జాతీయతను కూడ అనుభవించడానికి అక్కడి మిళిత రాజ్యాంగం ఫ్రెంచి వారికి అనువైన ప్రభుత్వాన్ని ప్రసాదించింది.

కెనడాలో విశాల జాతీయతా దృక్పథాన్ని పెంపొందించడానికి అక్కడి సమాఖ్య వ్యవస్థ చక్కని మార్గం ఏర్పరిచింది. అయినప్పటికీ ఫ్రెంచి, బ్రిటిషు వారి మధ్య కొన్ని సమయాల్లో జరిగే హింసాయుత సంఘర్షణల మూలంగా సమ్మేళన వ్యవస్థ అందించిన సహకార సుహృద్భావాలపై తీవ్రమైన ప్రయాస కలుగజేసేది. అనేక సందర్భాల్లో కెనడియన్ విశిష్ట జాతీయతే మరుగున పడిపోయేది.

దక్షిణాఫ్రికా మాటేమిటి? అక్కడి బోయరసలకి బ్రిటిష్ వారికి మధ్య సంబంధాల గురించి తెలీనివారి కోసం ఇ.హెచ్. బ్రూక్స్ 'ది పొలిటికల్ ఫ్యూచర్ ఆఫ్ సౌత్ ఆఫ్రికా', (1927)లో ఏమంటున్నాడో చూడండి.

"దక్షిణాఫ్రికా జాతీయత అనేది ఆ దేశంలోని రెండు శ్వేత వర్ణజాతులలోనూ

ఎంతవరకూ ప్రచలితంగా వుంది? ఆఫ్రికాండర్ జాతీయత అనేది అక్కడి ప్రబలంగా ఉన్న మాట వాస్తవమే అయినప్పటికీ అది కేవలం ఒక శ్వేత జాతికి మాత్రమే పరిమితమై ఉంది. ఈ జాతీయతకు పునాది హాలెండు దేశం నుంచి ఏనాడో వచ్చి స్థిరపడిన వారుపయోగించిన భాషపట్ల వారికి గల మక్కువ. ఈ భాషే తరువాతి కాలంలో హ్యూగో నాచ్ జర్మనీ భాషల ప్రభావంతో కాలక్రమంలో అభివృద్ధి చెందింది. ఆఫ్రికా జాతీయవాదం వేర్పాటుగా ఉండే ధోరణిలో ఉంది. దక్షిణాఫ్రికా పట్ల ఎంత విధేయత గల పుత్రరత్నం అయినా మొత్తంగానో ప్రధానంగానో ఇంగ్లీషు మాట్లాడేవాళ్లకి ఈ జాతీయతలో స్థానం లేదు."

ఈరోజున దక్షిణాఫ్రికా జాతీయతనేది ఉందా? "దక్షిణాఫ్రికా జీవన విధానంలోని కొన్ని అంశాలు ఈ ప్రశ్నకు నిశ్చయార్థక సమాధానాన్ని అనుమతించవు."

జాతీయ సమైక్యం అనే భావనను బలహీనపరచే ధోరణులనేకం ఇంగ్లీషు మాట్లాడే దక్షిణాఫ్రికా వారి మధ్య కనిపించాయి. ఎన్నో గొప్ప సుగుణాలు కల్గి వున్నప్పటికీ ఈ జాతికి గల ప్రధాన లోపమేమంటే భావనాత్మకత లేకపోవడమే. అవతలి వ్యక్తి దృక్పథంలో చూడలేకపోవడమే. ఈ బలహీనతలు అన్నిటికన్నా భాషదగ్గర ఎక్కువగా బయటబడతాయి. ఏదో మొక్కుబడిగానో (సివిల్ సర్వీసులో వుండినందున) లేక పరిస్థితుల ఒత్తిడి మూలంగానో తప్ప ఇటీవలి వరకు ఇంగ్లీషు భాషని అలవాటుగా మాట్లాడే దక్షిణాఫ్రికా వాసులు చాలా కొద్దిమందే ఇంకా అతి కొద్దిమంది మాత్రమే తమ సంభాషణల్లో ఆఫ్రికన్ భాషను వాడారు. అలా మాట్లాడటాన్ని చాలామంది వారికి గల ఆ భాషా పరిజ్ఞానానికి విలోమస్థాయిలో అవమానకరంగా భావించారు. కొద్దిపాటి సహనం గల వాళ్లు మాత్రం వాళ్ల వాళ్ల ప్రవృత్తిని బట్టి వినోదించడమో ఉద్వేగపడడమో చేసేవారే."

ఇదే అంశంపై మరో సాక్ష్యాన్ని విందాం. ఆ సాక్షి మాన్‌ఫ్రెడ్ సాధన్. దక్షిణాఫ్రికాలోని బోర్స్, బ్రిటిషు జాతుల మధ్య సంబంధాలపై ఆయనిలా అంటున్నాడు :

"ముఖ్యంగా వాళ్లు ఉభయులూ కూడ ప్రొటెస్టెంట్‌లే. అయితే మతపరమైన భేదాలకింత పట్టింపు నివ్వని ఈరోజుల్లో ఇదంత ప్రాధాన్యం గల అంశం కాకపోవచ్చు. వాళ్లిద్దరి మధ్య వ్యాపార వాణిజ్యాలు స్వేచ్ఛగా జరిగిపోతూనే వున్నాయి."

"ఏది ఏమైనప్పటికీ శ్వేతజాతికి చెందిన ఈ రెండు గొప్ప వర్గాల మధ్య అపరిమిత సామాజిక సాంగత్యం ఉండే ఉన్నదనడానికి దాఖలాలు లేవు. దానికి కారణం పెద్ద పెద్ద పట్టణాల జనాభాలో ఇంగ్లీషు వాళ్ళు గణనీయంగా వు ండటమనే కొందరు సూచించారు. కనుక సహజంగానే వాళ్లకి గ్రామాల్లో ప్రజల గురించి వారి జీవన విధానం గురించి అంతగా తెలీదు. కాని దేశవాళీ పట్టణాల్లో ప్రాంతాలలో ఉండే బోర్స్ అతిథుల పట్ల సాదర పూర్వకంగా, స్నేహపూర్వకంగా వుండే నియమం వుంది. అయినప్పటికీ కేవలం వ్యాపార

వృత్తి అవసరాలకో, ధార్మిక ఇతర సామాజిక ఉత్సవాల వరకో వారి సహకారం పరిమితం తప్ప వారి మధ్య సాంగత్యం విస్తృతం కాలేదు."

ఇంగ్లీషు వాళ్లు గణనీయంగా వుండటమనే కొందరు సూచించారు. కనుక సహజంగానే వాళ్ళకి గ్రామాల్లో ప్రజల గురించి వారి జీవన విధానం గురించి అంతగా తెలీదు. కాని దేశవాళీ పట్టణాల్లో ప్రాంతాలలో ఉండే బోర్స్ అతిథుల పట్ల సాదర పూర్వకంగా, స్నేహ పూర్వకంగా వుండే నియమం వుంది. అయినప్పటికీ కేవలం వ్యాపార వృత్తి అవసరాలకో, ధార్మిక ఇతర సామాజిక ఉత్సవాల వరకే వారి సహకారం పరిమితం తప్ప వారి మధ్య సాంగత్యం విస్తృతం కాలేదు".

కాబట్టి మత వైషమ్య మనేది కేవలం ఇండియాకే పరిమితం కాదని స్పష్టమవుతుంది. కెనడాలో ఇంగ్లీషు వారిలో రాజకీయంగా సఖ్యతగా ఉండడానికి, ఫ్రెంచి వారికి డచ్ వారితో రాజకీయంగా కల్సి వుండడానికి ఇంగ్లీషు వారికి, స్విట్జరులాండులో రాజకీయంగా కల్సి వుండడానికి, ఫ్రెంచి, ఇటలీ, జర్మనీ వారికి - వారెవ్వరికి మత వైషమ్యం అడ్డుగోడగా నిలువనపుడు ఒకే రాజ్యాంగం క్రింద ఒకే దేశంగా భారత దేశంలో హిందూ ముస్లిములు కల్సి జీవించడం అసాధ్యమైన విషయమా?

## IV

కాంగ్రెస్ ఆధిక్యత పట్ల ముస్లిములు విశ్వాసం కోల్పోయారు కనుక పాకిస్తాన్ ఉండాలనదగునా? కొన్ని సందర్భాలలో హిందువులు ముస్లిముల పట్ల అవలంబించిన క్రూరత్వం, అణచివేత, కాంగ్రెసు అధికారంలో ఉన్న రెండు సంవత్సరాల మూడు నెలల కాలంలో ముస్లిముల పట్ల అనుసరించిన ఉపేక్ష మొదలైన కారణాలను తమకు కాంగ్రెస్ పై విశ్వాసం కోల్పోడానికి కారణాలుగా ముస్లింలు చెప్పవచ్చు. దురదృష్టవశాత్తు ముస్లిముల విచారణకై రాయల్ కమీషన్‌ను నియమించాలన్న తనడిమాండుపై జిన్నా వత్తిడి చేయలేదు. అలాగాని చేసి వుంటే ఈ అభియోగాల వాస్తవమేపాటిదో ఆయన తెల్సికోగల్గేవారు. ఈ అభియోగాలపై ముస్లిం లీగ్ కమిటీల నివేదికలు పరిశీలించిన ఏ పాఠకుడైనా ఈ విషయంలో కాంగ్రెస్ పాత రాష్ట్రాలలో ముస్లిం వ్యధల గురించి ఆల్ ఇండియా ముస్లింలీగ్‌చే నియమింపబడిన పిర్పూర్ నివేదికను చూడండి. అలాగే బీహార్‌లో ముస్లింల వ్యధల విచారణకై బీహార్ రాష్ట్ర ముస్లిం లీగ్ కూడ ఒక కమిటీని నియమించింది. ఈ నివేదికాంశాలను 13-3-39 నాటి అమ్రిత బజార్ పత్రికలో ముద్రించగా వాటికి సమాధానంగా బీహార్ రాష్ట్ర సమాచార అధికారి విడుదల చేసిన పత్రికా ప్రకటనను కూడ సంప్రదించవచ్చు. దీనిలో కొంత వాస్తవం ఉన్నప్పటికీ ఎక్కువ భాగం అతిశయోక్తి ఉన్నదనే భావనకు గురౌతాడు. ఈ కమిటీల ఆరోపణలను తిరస్కరిస్తూ సంబంధిత కాంగ్రెస్ మంత్రి వర్గాలు ప్రకటనలు కూడ చేశాయి. కాంగ్రెసు అధికారంలో ఉన్న ఈ రెండు సంవత్సరాల మూడు నెలల కాలంలో విజ్ఞత

ప్రదర్శించి ఉండకపోవచ్చు. మైనారిటీలలో విశ్వాసాన్ని ప్రేరేపించి ఉండకపోవచ్చు. కాని అణచివేసే ప్రయత్నం చేయలేదు. అంత మాత్రంచేతం ఇదే విభజనకు హేతువౌతుందా? గతంలో కాంగ్రెస్‌కు మద్దతిచ్చిన ఓటరు వాస్తవాన్ని గ్రహించి తెలివితో ఈ సారి కాంగ్రెసుకు మద్దతును మాని వేయవచ్చు గదా? ఒక వేళ కాంగ్రెస్ తిరిగి అధికారంలోకి వచ్చినా కూడ గతంలో తాను చేసిన తప్పిదాల అనుభవంతో లాభపడి తనతుంటరి విధానాలను సంస్కరించుకొని తద్వారా తనగత ప్రవర్తన ద్వారా ముస్లిములలో ఏర్పడిన భయాన్ని పారద్రోలవచ్చును గదా?

## V

ముసల్మానులు ఒక జాతి కనుక పాకిస్తాన్ కావాలని కోరవచ్చునా? ఒక ప్రక్క యావత్ ప్రపంచం జాతియవాద విష ప్రభావాలను నిరశిస్తూ ఏదో ఒక అంతర్జాతీయ సంస్థ నాశ్రయింప చూస్తున్న తరుణంలో ముస్లిం జాతీయత మీద సమర్ధకుడుగా, పోరాట యోధుడుగా జిన్నా ముందుకు రావడం విచారకరమే. ముస్లిం జాతీయతావాదం పట్ల జిన్నాలో నూతనంగా అంకురించిన విశ్వాసం బాగా పాతుకుపోయింది. కొన్ని భాగాలు విలీన రహితమైన సమాజానికి, అలా కాక కొన్ని భాగాలు కేవలం సరళమైన సమాజాలకు మధ్య తేడా వుంది. స్థిర చిత్తత గల వాళ్లెవరూ దీన్ని కాదనలేదు. కాని జిన్నా మాత్రం ఈ వాస్తవాన్ని గుర్తించి నిరాకరిస్తున్నారు. సమాజమే చీలిపోతున్నప్పుడు రెండు జాతుల సిద్ధాంతాన్ని ప్రతిపాందించడం సమాజాన్ని దేశాన్ని ఖాయంగా చీల్చడమే అవుతుంది. కార్లైల్ మహాశయుడు భావించినట్లుగా సమైక్యంగా కలిపి వుంచగానే జీవ శక్తులు అంటే జీవనాడులు లోపించడం అన్న స్థితికి ఇది తార్కాణం. అలా సమాజం విలీనరహిత మవడం విచారించవల్సిందే తప్ప నివారించలేం. కాని అలాంటి జీవ నాడులు ఉన్నప్పటికీ వాటిని కావాలని ప్రస్తుతం ముస్లిములు చేయిస్తున్నట్లుగా సమాజాన్ని బలవంతంగా విలీన రహితంగావించడం నేరం. వారు ప్రత్యేకంగా వుండాలనే వుద్దేశ్యంతోనే ముసల్మానులు తాము ప్రత్యేక జాతి అంటున్నారు తప్ప వారెప్పుడూ ప్రత్యేక జాతి కాదు. వారు కోరుకున్నట్లయితే వారి నొక జాతిగా మార్చి వేయగల అంశాలు ముసల్మానులలో ఉన్నాయి. అదే సమయంలో, హిందూ ముస్లిముల మధ్య నున్న సాంగత్యాలను అభివృద్ధి చేసినట్లయితే ఒక ప్రజగా అవతరింపవచ్చు గదా? అనేకమైన పద్ధతులూ, సంస్కారాలూ, ఆచారాలూ, వారిరువురి మధ్య ఒకేలా ఉన్న విషయాన్నెవరైనా కాదన గలరా? అదే సమయంలో హిందూ – ముస్లిములను మతపరంగా విభజించగల అలవాట్లు, ఆచారాలు, వాడికలు సంప్రదాయాలు కూడ వున్న వాస్తవాన్నెవరైనా కాదన గలరా! అయితే ఈ రెంటిలో వేనికి ప్రాధాన్యత ఇచ్చి చూసినట్లయితే ఇండియాలో రెండు జాతులుండవలసిన అగత్యం లేదు. విభేదించే అంశాలకు ప్రాధాన్యత ఇచ్చి చూస్తే మాత్రం రెండు జాతులుండవల్సిన అగత్యం కన్పిస్తుంది. ఇండియన్లు కేవలం ఒకే ప్రజ మాత్రమే గాని వారెన్నటికీ జాతిగా వేరు అన్న ధోరణే జిన్నాను నడిపిస్తున్నట్లు కన్పిస్తుంది.

చాలామంది బ్రిటిష్ రచయితలు ఇండియా ఒక జాతి అన్న అంశాన్ని విస్మరించి భారతీయులను కేవలం ఇండియా దేశపు ప్రజలు గానే రాస్తుంటారు. జిన్నా వైఖరి కూడ దీనిలోంచి వచ్చినదే. భారతీయులు ఒక జాతి కాదు ప్రజలే అనుకొందాం అయితే ఏమిటి? జాతులు గొప్ప సామూహిక వ్యక్తిత్వంగా అవిర్భవించక ముందు ప్రజలు మాత్రమే ఉండినారని చరిత్ర పేర్కొంటుంది. ఇండియన్లు కేవలం ప్రజలు మాత్రమే అన్నంత మాత్రాన్నే సిగ్గుపడాల్సిందేమి లేదు. వారనుకొన్నట్లయితే ఒక జాతిగా భారతీయులు ఎదగలేరని నిరుత్సాహపడదగ్గ కారణం ఏదీ లేదు. జాతి అనేది కాల ప్రభావితమూ, కళా ప్రభావితమూ అయినది అని డిజ్రాయిలీ అంటాడు. హిందువులు, ముసల్మానులు కూడ తమను విభజించే అంశాలను మరచి తమను ఐక్య పరచే అంశాలపై కేంద్రీకరించడానికి అంగీకరించినట్లయితే కాలక్రమంలో వారు ఒకే జాతిగా ఎదగడాన్ని నిరోధించగల సహేతుక కారణాలేమీ లేవు. అట్టి జాతీయత అనేది ఫ్రెంచి వారి మాదిరిగానో జర్మనుల మాదిరిగానో అంత సమీకృతమైనది కాకపోవచ్చు. అయినప్పటికీ వారు సారూప్యం గల అంశాలపై ఏకీకృత ఆలోచనల మొత్తమనేది జాతీయతా స్ఫూర్తి వల్ల ఉత్పన్నమయ్యే ఐక్యానికి అనులోమంగా ఉండి అది ఎంతో బహుమానకృతంగా ఉంటుంది. తమను కలిపి ఉంచే కారకాలను మరచి కేవలం విభేదాలకే ప్రాధాన్యం ఇవ్వటం ముస్లిం లీగ్‌కు భావ్యమా? ఒక వేళ రెండు జాతులే గాని ఆవిర్భవించవలసి వస్తే అది కేవలం ఉద్దేశ పూర్వక రూపకల్పన ద్వారానే గాని పూర్వ నిర్దిష్టమై ఉండి మాత్రం కాదన్న అంశం మరువరాదు.

ఇంత క్రితమే నేను చెప్పినట్లుగా ఇండియా దేశపు ముసల్మానులు వస్తుతః గాని న్యాయతః గాని ఇంకా ఒక జాతిగా పరగణింప అనర్హులు అయితే మాత్రం వారిలో జాతిగా రూపొందగల మూల అంశాలు మాత్రం వున్నాయి. కాని ఇండియా దేశపు ముసల్మానులను ప్రత్యేక జాతిగా అనుమతించినట్లయితే ఇండియా ఒక్కటే రెండు జాతులుగా దేశంగా వుండబోతుందా? కెనడా మాటేమిటి?

కెనడా దేశంలో ఇంగ్లీషు, ఫ్రెంచి అనే రెండు జాతులున్నవన్న సంగతి అందరికీ తెల్సిందే. దక్షిణాఫ్రికాలో కూడ డచ్, ఫ్రెంచి అనే రెండు జాతులు లేవా? స్విట్జర్లాండ్ మాటేమిటి? జర్మన్, ఫ్రెంచి, ఇటాలియన్ అనే మూడు జాతుల వారు స్విట్జర్లాండులో నివశిస్తున్న విషయం ఎవరికి తెలీనిది? తామొక ప్రత్యేక జాతి అయినంతనే కెనడాలోని ఫ్రెంచి వారు దేశ విభజన కోరారా? బోయర్ల కన్నా భిన్నమైన జాతి అయినంత మాత్రాన ఇంగ్లీషు వారు దక్షిణాఫ్రికా విభజన కోరారా? స్విట్జర్లాండులోని ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్లు విభిన్న జాతులైనంత మాత్రాన స్విట్జర్లాండును ముక్కలుగా చేయమని ఆందోళన జరగడం ఎవరైనా ఎప్పుడైనా విన్నారా? ఒకే రాజ్యాంగం కింద, ఒకే దేశంలో పౌరులుగా జీవించినంత మాత్రాన తమ తమ విశిష్ట సంస్కృతులు అంతరించిపోగలవని జర్మనులు, ఫ్రెంచి, ఇటాలియనులెన్నడైనా భావించారా? తద్భిన్నంగా ఈ విశిష్ట జాతులన్ని కూడ తమ విశిష్ట

జాతి, సంస్కృతులకే మాత్రం నష్టం లేని విధంగా ఒకే రాజ్యాంగం క్రింద ఒకే దేశంలో నివశించడానికి అలవాటు చేసుకొన్నాయి. కెనడాలో ఇంగ్లీషు వారితో కల్సి జీవించినంత మాత్రాన ఫ్రెంచి వారు ఫ్రెంచి వారు కాకుండా పోలేదు. దక్షిణాఫ్రికాలో బోయర్లతో కల్సి జీవించినంత మాత్రాన ఇంగ్లీషువారు ఇంగ్లీషువారుగాకుండా పోలేదు. ఒకే దేశానికి, ఒకే రాజ్యానికి విధేయులుగా వున్నప్పటికీ జర్మను, ఫ్రెంచి, ఇటాలియన్లు విశిష్టజాతులుగా కొనసాగుతున్నారు కదా? స్విట్జర్లాండ్‌లోని జాతీయతలతో మత జాతిపరంగా అత్యంత సారూప్యత గల జాతీయతలు గల్గిన దేశాలు దాని చుట్టూతా వున్నాయి. ఈ సమీప సారూప్యతల నధిగమించి స్విట్జర్లాండ్‌లోని భిన్న జాతీయతలన్నీ మొదట స్విస్ జాతీయతలు ఆ తర్వాతే జర్మన్‌గాని, ఫ్రెంచి, ఇటాలియన్ గాని.

కెనడాలో ఫ్రెంచి, దక్షిణాఫ్రికాలో ఇంగ్లీషు, స్విట్జర్లాండ్‌లోని ఫ్రెంచి, ఇటాలియనుల అనుభవాన్ని బట్టి భారత దేశాన్ని పోల్చి చూడండి. ఇండియాలో మాత్రం తద్విరుద్ధమైన పరిస్థితి ఎందుకున్నట్లు? హిందువులు, ముస్లీములు రెండు జాతులుగా విభాజితులను కొన్నప్పటికీ, వారు ఒకే దేశంగా ఒకే రాజ్యాంగం కింద ఎందుకు వుండలేదు? ద్విజాతి సిద్ధాంతం అంటే అర్ధం దేశ విభజన తప్పనిసరనా? హిందువులతో కల్సి నివసించినంత మాత్రాన్నే తమ జాతీయత, జాతీయ సంస్కృతులు పోతాయని ముస్లింలెందుకు భయపడుతున్నారు? వేర్పాటు గురించి ముస్లింలు పట్టుదలగా వున్నారంటే అర్ధం హిందువులకీ ముస్లింలకీ మధ్య ఎంతో సారుప్యత వున్నప్పటికీ విభజనేగనుక జరక్కపోయినట్లయితే హిందువులతో సుదూర సామాజిక సంపర్కం అనివార్యమయినట్లయితే అసలే పలచబడివున్న తమ ఇస్లామిక్ విశిష్టత అంతరించిపోయే ప్రమాదం ఉందని ముస్లింలు భయపడుతున్నట్లుగా రంధ్రాన్వేషి నిర్ధారిస్తాడు. ముస్లిం జాతీయతే కనుక అంత బలహీనంగా వుండి వుంటే విభజనోద్దేశం కృత్రిమమే గాక పాకిస్తాన్ నినాదానికి పునాది లేకుండా పోతుంది.

## VI

స్వరాజ్యమంటే హిందూ రాజ్యమే గనుక పాకిస్తాన్ కావాలని అడగవచ్చా; ముస్లీములు ఈ నినాదానికి చాలా సులభంగా స్పందిస్తుంటారు. గనుక దీనిలో నిబిడీకృతమై వున్న భ్రాంతి జనితాంశాలను బహిర్గత పరచాల్సిన అవసరం ఎంతైనా ఉంది. మొదటగా హిందూ రాజ్యం పట్ల ముస్లింలకు గల వ్యతిరేకత అంతః కరణ జనితమైనదా లేక రాజకీయజనిత అభ్యంతరమా అన్నది చూడాలి. అదే కనుక అంతః కరణ జనితమైనదంటే ఆ అంతఃకరణ విచిత్రమైనదని మాత్రమే ఎవరైనా చెప్పగలరు. మిలియన్లకొద్దీ ముసల్మానులు అపరిమిత హిందూ రాజాల కింద హిందూ రాజ్యంలో ఉంటున్నప్పటికీ ముసల్మానుల నుండి కాని ముస్లిం లీగ్ నుండి గాని ఎటువంటి అభ్యంతరం రాలేదు. ముసల్మానులో కెనడా బ్రిటిషు రాజ్యానికి అంతఃకరణ జనిత అభ్యంతరం లేవనెత్తారు. కాని ఈ రోజున వారికి బ్రిటీషు రాజ్యం నిరభ్యంతరకరమే

గాక వారు దానికి గట్టి మద్దతుదారులు కూడా. బ్రిటిష్ రాజ్యం పట్ల అభ్యంతరం లేదు. సజలం కాని హిందూ ప్రభువు క్రింద హిందూ రాజ్యమన్నా అభ్యంతరం లేదు. కాని స్వరాజ్యమంటే ముస్లింలకు అభ్యంతరం. ఎందుకంటే వారి ఉద్దేశ్యం స్వరాజ్యమంటే హిందూరాజ్యమే. కాని ఈ హిందూ రాజ్య భావన కూడ నిరోధ సమతుల్యాలకు అతీతమైనదన్న భావన వెనుకగల తర్కాన్ని అర్థం చేసుకోవడం కష్టం.

హిందూ రాజ్యానికి గల రాజకీయ అభ్యంతరాలకు ఆధారాలు అనేకం. మొదట ఆధారమేమంటే – హిందూ సమాజం ప్రజాస్వామిక సమాజం కాదనేది. అది వాస్తవమే. మతాంతీకరణను మినహాయించినట్లైయితే, హిందూ సమాజాన్ని సంస్కరించడానికై ఉద్దేశించిన వివిధ సంస్కరణోద్యమాలలో ముస్లింలు పాల్గొన్నారా అని అడగడం భావ్యం కాకపోవచ్చు. కాని ఆ ప్రజాస్వామిక స్వాభావికమైన హిందూ సమాజం నుండి ఉత్పన్నమైనవని భావించే అరిష్టాలవలన బాధితులైన వారు కేవలం ముసల్మానులే అని అడగడం భావ్యమే కదా? ఈ దేశంలోని లక్షల కొద్దీ శూద్రులు, బ్రాహ్మణేతరులు, లక్షల సంఖ్యలో ఉన్న అస్పృశ్యులు కూడా ఆ ప్రజాస్వామిక స్వాభావిక హిందూ సమాజ ఫలితమైన ఘోర పరిణామాల వల్ల బాధపడ్డం లేదా? విద్య, ప్రజా సంక్షేమము రాజకీయ సంస్కరణలు లాంటివి ఎవరికి లబ్ధినిస్తున్నాయి. సమాజంలో 10 శాతం కూడా లేని హిందూ అగ్రవర్ణాలచే ఏర్పడ్డ హిందూ పాలక వర్గం మాత్రమే కదా? హిందూ రాజకీయాలను శాసిస్తున్న హైందవ పాలకవర్గం శూద్రులు, అస్పృశ్యులకు హక్కులు, ప్రయోజనాల పరిరక్షణ కన్నా ముసల్మానుల హక్కులు, ప్రయోజనాల పరిరక్షణకే అధిక ప్రాధాన్యత ప్రదర్శించింది కాదా? అస్పృశ్యులకి విధమైన రాజకీయ రాయితీలు కల్పించబడడాన్ని కూడ కంకణ బద్ధంగా నిరోధించిన గాంధీ ముస్లింల విషయంలో ఖాళీ చెక్కు పైనా సంతకం చేయడానికి సిద్ధపడినాడు కదా? యదార్థంగా చూస్తే, శూద్రులు, అస్పృశ్యులతో కలసి అధికారాన్ని పంచుకోవడం కంటె, ముసల్మానులతో కల్సి అధికారాన్ని పంచుకోవడానికే హిందూపాలక వర్గం ఆసక్తి, సంసిద్ధత ప్రదర్శించింది కాదా? హిందూ సమాజపు అప్రజాస్వామిక స్వభావం పై ఫిర్యాదు చేయడానికి ముస్లిములకు ఖచ్చితంగా అతి సూక్ష్మమైన ఆధారం మాత్రమే ఉంది.

'హిందూ రాజ్య వ్యతిరేకతకు ముస్లింలకు గల మరో ఆధారమేమంటే హిందూ ఆధిక్యత గల సమాజంలో ముస్లింలు అల్ప సంఖ్యాక వర్గమని నిజమే! కాని అలాంటి పరిస్థితి ఒక్క ఇండియాలోనే వున్నదా? ఇండియాలో పరిస్థితులను కెనడా, దక్షిణ అమెరికా, స్విట్జర్లాండులలో వున్న పరిస్థితులతో పోల్చి చూద్దాం. జనాభా వితరణనే తీసుకోండి కెనడాలోని (కెనడా ఇయర్‌బుక్, 1936) 10, 376, మంది మొత్తం ప్రజానీకంలో కేవలం 2, 927, 990 మంది మాత్రమే ఫ్రెంచ్‌వారు. దక్షిణాఫ్రికా (దక్షిణాఫ్రికా ఇయర్ బుక్) లో 1, 120, 770 మంది డచ్చివారైతే ఇంగ్లీషువారు 783,071 మందే. స్విట్జర్లాండు (స్విట్జర్లాండు ఇయర్ బుక్, 1941) మొత్తం జనాభా అయిన 4,066,400 మందిలో

2,924,313 మంది జర్మనులు, 831,097 మంది ఫ్రెంచి, 242,034 మంది ఇటాలియన్లు.

దీన్నిబట్టి అధిక సంఖ్యాకవర్గ ఆధీన రాజ్యాల క్రింద కల్సి వుండడానికి చిన్న చిన్న జాతీయతలకు భయం లేదని తెలుస్తుంది. అసలలాంటి భావనే వారికి క్రొత్తగా వుంటుంది. దీనికి కారణమేమి? అధిక సంఖ్యాక జాతీయతకు అధికార ప్రభావ కేంద్రాలైన శాసన, కార్య నిర్వాహక శాఖలపై సర్వాధికారం సాధించడానికి అవకాశం లేదు. కనుకనా? అలా కాదు. దురదృష్టవశాత్తు స్విట్జర్లాండు, కెనడా, దక్షిణాఫ్రికా దేశాలలో అధిక, అల్ప సంఖ్యాకవర్గాలవారు ఏఏ మేరకు ప్రాతినిధ్యం వహిస్తున్నారో చూపగల గణాంక వివరాలు లభ్యం కావడం లేదు. దానికి కారణం ఇం డియాలో మాదిరిగా ఆ దేశాలలో కమ్యూనల్ రిజర్వేషన్ లేకపోవడమే. బహిరంగ పోటీలోనే తనకు వీలైనన్ని స్థానాలు గెల్చుకోడానికి ప్రతి వర్గానికి స్వేచ్ఛవుంది. అయితే తమ తమ జనాభా కనుగుణంగా ప్రతివర్గం కూడ శాసనసభ మొత్తం సీట్లలో ఎన్ని స్థానాలు గెల్చుకోడానికి ప్రతినిధి వర్గానికి స్వేచ్ఛవుంది. అయితే తమ తమ జనాభా కనుగుణంగా ప్రతివర్గం కూడ శాసనసభ మొత్తం సీట్లలో ఎన్ని స్థానాలు గెలుచుకోగలదా ఉజ్జాయింపుగా ఊహించి చెప్పవచ్చు. దీనిని ఆధారంగా చూస్తే మనకేం తెలుస్తుంది. స్విట్జర్లాండ్ దిగువ సభలో మొత్తం ప్రతినిధుల సంఖ్య 187 దీనిలో జర్మనులు 138, ఫ్రెంచి **42**, ఇటాలియన్లు 7 స్థానాలు గెలుచుకునే అవకాశం వుంది. దక్షిణాఫ్రికా సభలోని మొత్తం 153 స్థానాలలో ఇంగ్లీషువారు 62, డచ్చివారు 94 స్థానాలు గెలుచుకోగలరు. కెనడాలో మొత్తం ప్రతినిధుల సంఖ్య 245. దీనిలో 65 మందియే ఫ్రెంచి వారున్నారు. (క్యూబెక్ రాష్ట్రానికి చెందిన వివరమిది) పరిశీలనలో స్పష్టంగా తెల్సిందేమంటే ఈ దేశాలన్నిటిలోను అల్పసంఖ్య జాతీయతలపై అధిక సంఖ్యాక జాతీయులు పై సర్వోన్నతాధికారాలను సాధించడానికి అవకాశముందని. వాస్తవానికి న్యాయతః కెనడాలో బ్రిటిష్ రాజ్యం క్రింద ఫ్రెంచివారున్నారు. దక్షిణాఫ్రికాలో డచ్చి ఆధిపత్యం క్రింద ఇంగ్లీషువారున్నారు. స్విట్జర్లాండులో జర్మనుల క్రింద ఫ్రెంచి ఇటాలియనులున్నారు. కానివాస్తవ పరిస్థితేమిటి? బ్రిటిష్ ఆధిపత్యం క్రింద వుండలేమని కెనడాలోని ఫ్రెంచివారు గళమెత్తారా? డచ్చివారి కింద ఉండలేమని దక్షిణాఫ్రికాలోని ఇంగ్లీషువారు అరిచారా? జర్మను రాజ్యం క్రింద వుండడానికి స్విట్జర్లాండులోని ఫ్రెంచి వారు ఇటాలియన్లు అభ్యంతరం తెలిపారా? మరి హిందూ ఆధిపత్యం పట్ల ముస్లిముల కెందుకు అభ్యంతరముండాలి.

హిందూ రాజ్యమంటే అధిక సంఖ్యాక వర్గాల నగ్నశాసనమనెక్కడైనా ప్రతిపాదించ బడిందా? హిందూ ఆధిపత్యం వలన ఉత్పన్నమవుతుందనే నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ముస్లిములనేక రక్షణలు ఇవ్వబడి నారు కదా? ఇండియాలోని ముసల్మానులకు కల్పించబడిన రక్షణలు కెనడాలో ఫ్రెంచి వారికి, దక్షిణాఫ్రికాలో ఇంగ్లీషువారికి, స్విట్జర్లాండులో ఫ్రెంచి, ఇటాలియనులకు ఇవ్వబడిన రక్షణల కన్నా మెరుగైనవి విశాలమైనవి కాదా? ఈ రక్షణల జాబితాలోంచి ఒక్క అంశాన్ని తీసుకుందాం. శాసనసభలో ప్రాతినిధ్యానికి సంబంధించి

ముసల్మానులు గణనీయమైన ప్రాధాన్యత పొందినారు కదా! అసలు కెనడా, దక్షిణాఫ్రికా, స్విట్జర్లాండులలో ఇలాంటి ప్రాధాన్యత గురించి తెలుసా? శాసన సభలో హిందూ మెజారిటీని కుదించడానికి కుదించ లేదా ఇలా? ఏ మేరకు జరిగిందీ కుదింపు? బ్రిటిషు ఇండియానే తీసుకోండి. భారత ప్రభుత్వ చట్టం 1935 ప్రకారం అనుమతించబడిన ప్రాదేశిక నియోజక వర్గాలనే తీసుకుంటే దిగువ సభలోని మొత్తం 187 స్థానాలలో హిందువులు 105 ముస్లింలు 82 స్థానాలు కల్గివున్నారు. ఈ అంకెలను గమనించిన వారెవరైనా హిందూ రాజ్య భయమనేది ఎక్కడుందని ప్రశ్నించక మానరు.

హిందూ రాజ్యమనేది వాస్తవ రూపం ధరిస్తే నిస్సందేహంగా అంతకన్నా మించిన ఘోర విపత్తు ఈ దేశానికి మరొకటుండదు. హిందువులేమి చెప్పినప్పటికీ స్వేచ్ఛా, సమానత్వం, సౌభ్రాతృత్వములకు హిందూయిజమ్. ఈ లెక్కలో అది ప్రజాస్వామ్యంలో పొసగనిది ఎంతటిమూల్యమైనా సరే హిందూ రాజ్యావతరణ నిరోధించబడాలి. కాని అదే సమయంలో దానికి నిజమైన విరుగుడు పాకిస్తాన్? దేశంలోనివశిస్తున్న వివిధ వర్గాల సాపేక్షక బలాల్లో తీవ్రవ్యత్యాసాలు నెలకొన్నప్పుడే మతరాజ్యం సాధ్యమౌతుంది.

పైన సూచించినట్లుగా ఈ వ్యత్యాసాలు కెనడా, దక్షిణాఫ్రికా, స్విట్జర్లాండులలో కన్నా ఇండియాలో గణనీయం కాదు. అయినా కూడ, కెనడాలో బ్రిటిషు రాజ్యం కాని, దక్షిణాఫ్రికాలో డచ్ రాజ్యం గాని స్విట్జర్లాండులో జర్మన్ రాజ్యంగాని లేవు. ఫ్రెంచి, ఇంగ్లీషు, ఇటాలియన్లు రాజ్య వ్యవస్థలో అధిక సంఖ్యకల ఆధిపత్యస్థానానికి ఎదగనీయకుండా విజయవంతంగా ఎలా ఎదుర్కొన గలరు? విభజన ద్వారానైతే ఖచ్చితంగా కాదు. మరి వారి పద్ధతేమిటి? మత వాద పార్టీలను రాజకీయ ప్రవేశం చేయకుండా నిషేధించడమే వారి పద్ధతి. కెనడా, దక్షిణాఫ్రికా, స్విట్జర్లాండులలో ఏమత వర్గం కూడ వారి ప్రత్యేక మతవాద రాజకీయ సంస్థ ఆవశ్యకత ఆవిర్భావాన్ని గురించి ఆలోచించరు. అంతకన్నా ముఖ్యంగా గుర్తించబడవల్సిన అంశమేమంటే మతవాద పార్టీల ఆవిర్భవానికి వ్యతిరేకంగా అక్కడి అల్ప సంఖ్యాక మత వర్గాలే ముందుండి నిలిచాయి. అలా చేసినట్లయితే దానికి ప్రతిచర్యగా అధిక సంఖ్యాక మతవర్గం కూడ తమ సొంత మతవాద పార్టీని ఏర్పాటు చేయగల్గుతుంది. అపుడు అధిక మతాధికార రాజ్య స్థాపన మరి సులువే అవుతుందన్న విషయం అక్కడి అల్ప సంఖ్యాకులకు తెల్సు. స్వీయ సంరక్షణ పేరిట జరిగే ఈ పద్ధతి చాలా విషపూరితం అల్ప సంఖ్యాక జాతులకి బాగా తెలుసు తమ గోతిలో తామే పడతామని. అంచేత మతపరమైన రాజకీయ పార్టీల ఏర్పాటుని వాళ్లు వ్యతిరేకించారు.

హిందూ రాజాన్ని నిరోధించగలిగే ఈ పద్ధతిని గూర్చి ముస్లిములు ఎప్పుడైనా ఆలోచించారా? ఇదెంత సులభతరమైన పద్ధతో పరిశీలించారా వీరు? లీగ్ యొక్క ప్రస్తుత విధానం ఎంతటి నిష్ఫలమూ, నష్టదాయకమూ అయిందో వారెప్పుడైనా పరిశీలించారా?

హిందూ మహా సభను, దాని నినాదాలైన హిందూత్వం, హిందూ మహాసభ, హిందూ రాజ్యం రెండూ కూడ ముస్లిం లీగ్ స్థాపన ద్వారా ముస్లింలు కొనితెచ్చుకున్న కర్మఫలాలే. ఇది చర్యకు ప్రతిచర్య. ఒకదాని పుట్టుకకు మరొకటి ఆధారం. హిందూ రాజ్య భూతాన్ని భూస్థాపిత మొనరించడానికి సరైన మార్గం దేశవిభజనకాదు - ముస్లింలీగ్‌ను రద్దుపరచి హిందూ ముస్లిముల సమైక్య రాజకీయ పార్టీని స్థాపించడమే. రాజ్యాంగ బద్ధ రక్షణల గురించి విభేదాలు కొనసాగినంత కాలం ముస్లింలు గాని ఇతర అల్ప సంఖ్యాకులు గాని కాంగ్రెసు, హిందూ మహాసభల్లో చేరగలగడం సాధ్యం కాదనేది నిజమే. కాని ఈ ప్రశ్న పరిష్కరింపబడ్తుంది. ఖచ్చితంగా పరిష్కరించబడగలదు కూడా. ముస్లిముల కవసరమైన రాజ్యాంగ రక్షణల్ని పొందుపరుస్తూ పరిష్కారం లభించగల ఆశలు ప్రస్ఫుటంగా వున్నాయి. మనం ఎంతగానో వాంఛించే ఈ పరిష్కారం వచ్చినపుడు పార్టీల పునః పొందికని ఏదీ అడ్డలేదు. కాంగ్రెస్ మహాసభలు విడిపోతాయి. హిందువులు, ముస్లిములు మిశ్రరాజకీయ పార్టీలు ఏర్పాటు చేస్తారు. తద్వారా హిందూరాజ్యమో, ముస్లిం రాజ్యమో ఏర్పడడాన్ని తప్పించుకుంటారు.

ఇండియాలో హిందూ ముస్లిముల సమైక్య రాజకీయ దీర్ఘస్థాపన కష్టమూకాదు. హిందూ సమాజంలో ఇంకా అనేక క్రింది స్థాయిల ప్రజలున్నారు? వారి ఆర్థిక, రాజకీయ, సామాజిక అవసరాలు ముస్లిములు అధికంగా కోరేవే. శతాబ్దాలుగా తమకు కనీస మానవ హక్కులను తిరస్కరిస్తూ, కాలరాస్తున్న వర్ణ హిందువుల కన్న ఉమ్మడి ధ్యేయాల సాధనకై ముస్లిములతో కల్సి ఉమ్మడి పోరుకు వారు ఎప్పుడైనా సన్నద్ధంగా ఉన్నారు. అలాంటి కార్యాచరణకు దిగడం సాహసమని అనిపించుకోదు.

మాంటేగ్ - ఛామ్స్‌ఫర్డ్ సంస్కరణలలో భాగంగా 1920 -37 మధ్య కాలంలో ఆ సంస్కరణల అమలులో ముస్లిములు, బ్రాహ్మణేతరులు, దళిత ప్రజలంతా కల్సి ఒకటిగా పనిచేసిన విషయం వాస్తవం కాదా? హిందూ రాజ్య ప్రమాదాన్ని విచ్ఛిన్నం చేసి హిందూ ముస్లిముల మధ్య సఖ్యతను సాధించగల ఫలవంతమైన పద్ధతి ఈ పంథాలోనే ఇమిడి ఉంది. ఈ పద్ధతిలో జిన్నా సులభంగా ఆచరించి ఉండవలసింది. లేదు ఇప్పుడైనా ఈ పంథావైపుకు మరలడం జిన్నా కంత కష్టమేమికాదు. అలాంటి మతరహిత పార్టీ స్థాపన లక్ష్యంగా జిన్నా ప్రయత్నమే గనుక చేసినట్లయితే జిన్నాకు విజయావకాశాలు దండిగా వున్నాయి. సంఘటనా సామర్థ్యం గల వ్యక్తి ఈయన. జాతీయవాది అనే ఖ్యాతి ఉంది. ఆయనే గనుక భావ సారూప్యంగల హిందూ ముస్లిముల సమైక్యపార్టీ కోసం ఒక్క పిలుపు ఇచ్చి ఉన్నట్లయితే, కాంగ్రెసును వ్యతిరేకించే అనేకమంది హిందువులు తక్షణమే అతనిదరి చేరి ఉండేవారు. కాని జిన్నా ఏం చేశాడు? 1937లో ముస్లిం రాజకీయాలలోకి దిగాడు. కొద్ది సంవత్సరాల క్రితం సమాధిలోకి పోబోతున్న ఏ ముస్లింలీగ్‌కు అత్యంత క్రియలు జరిగితే సంతోషంగా చూడాలను కున్నాడో? అదే ముస్లింలీగ్‌ను, ఆశ్చర్యకరంగా, జిన్నా తట్టిలేపి పునరుజ్జీవింప చేశాడు. ఇదెంత విచారకరమైన అంశమైనప్పటికీ, ఇందులో ఒక ఉపశమనకరమైన విషయం కూడ

ఉంది. అదేమంటే దానికి జిన్నా యే నాయకత్వం వహించడం. జిన్నా నాయకత్వం మూలంగా లీగ్ పూర్తిగా మతతత్వ సంస్థగా మారబోదనే ప్రతి ఒక్కరూ సంతోషించారు. లీగ్ ఆవిర్భావానంతరంతో రెండు సం॥లలో దాని తీర్మానాలను పరిశీలించినట్లయితే హిందూ ముస్లిముల సమైక్య పార్టీగా అవతరించగల సూచనలందులో కన్పిస్తాయి. 1937 అక్టోబరులో లక్నోలో జరిగిన లీగ్ వార్షిక సమావేశంలో మొత్తం 15 తీర్మానాలు ఆమోదించిబడ్డాయి. ఈ సందర్భంలో దిగువ నివ్వబడిన రెండు తీర్మానాలు ప్రత్యేకంగా ఆసక్తిదాయకమైనవి. తీర్మానం సంఖ్య 7.

భారత ప్రభుత్వ చట్టం, 1935ను సూచనల నిర్దేశాన్ని ఖాతరు చేయక, ఆ చట్టాన్ని మనసావాచా గాలికి వదిలేసి కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రి వర్గాల ఏర్పాటు ననుమతించడాన్ని ఈ అఖిల భారత ముస్లిం లీగ్ సమావేశం తీవ్రంగా నిరశిస్తోంది. ఖండిస్తోంది.

ముస్లిములు ఇతర ప్రముఖ మైనారిటీల ప్రయోజనాలనూ, ప్రాముఖ్యతనూ కాలరాచి ఈ వర్గాల ప్రయోజనాల పరిరక్షణకై వారి కివ్వబడిన ప్రత్యేకాధికారాల అనువర్తనలో విఫలమైన గవర్నర్ల చర్యను ఈ సమావేశం ఖండిస్తుంది. తీర్మాన సంఖ్య – 8

"ముస్లిములు ఇతర మైనారిటీల హక్కులకు, ప్రయోజనాలకు సముచిత సమర్ధవంతమైన రాజ్యాంగ పరిరక్షణలుండే విధంగా స్వేచ్ఛాయుత ప్రజాస్వామ్య రాష్ట్రాల సమాఖ్యగా స్వతంత్ర భారతదేశ స్థాపనే లక్ష్యంగా అఖిల భారత ముస్లింలీగ్ మహాసభతీర్మానిస్తుంది."

1938 డిశంబరులో పాట్నాలో జరిగిన లీగ్ తదుపరి వార్షిక సమావేశంలో ఇదే సంఖ్యలో తీర్మానాలు ఆమోదించబడ్డాయి. తీర్మానం నంబరు 10 గమనించదగ్గది. అది ఈ విధంగా ఉంది.

1935 నాటి భారత ప్రభుత్వ చట్టంలో నిర్దేశించబడిన సమాఖ్య స్వరూపం తమకామోదయోగ్యం కాదని అఖిల భారతీయ ముస్లిం లీగ్ పునరుద్ఘాటిస్తుంది. కాని తదనంతరం చోటు చేసుకున్న పరిణామాలను, భవిష్యత్తులో జరగబోయే కాలానుగుణమైన మార్పులను దృష్టిలో వుంచుకొని ఇండియాలో ముస్లింలు ఇతర మైనారిటీల ప్రయోజనాల సముచిత సంరక్షణ ధ్యేయంగా తగిన ప్రత్యామ్నాయ విధానాన్ని అన్వేషణ దిశగా అవసరమగు కార్యాచరణను అవలంబించడానికి అఖిల భారత ముస్లింలీగ్ అధ్యక్షునికి అధికారమిస్తూ ఈ మహాసభ తీర్మానాన్నిస్తుంది.

ముస్లిములు, ఇతర ముస్లిమేతర మైనారిటీల సంఘటనకు తాను సుముఖమేనని ఈ తీర్మానం ద్వారా జిన్నా తెలియ జేశాడు. దురదృష్టవశాత్తు ఈ తీర్మానాల వెనుకగల ఉదార భావం, రాజనీతిజ్ఞత ఎక్కువకాలం నిలువ లేదు.

1939 కొచ్చే సరికి జిన్నా పల్టీ వేశాడు. అపకీర్తి కారకమైన పాకిస్తాన్ అనుకూల తీర్మానాన్ని ఆమోదించడం ద్వారా ముస్లిముల కత్యంత ప్రమాదకరమూ, వినాశకరమూనైన ముస్లిం పృధఃకరణ విధానానికి శ్రీకారం చుట్టాడు. ఈ పృధఃకరణకు కారణమేమిటి? ముసల్మానులు ఒక ప్రత్యేక జాతిగాని తెగకాదు అన్న ధృక్పధం తప్ప మరొకటి కాదు. ఇక్కడ ముస్లిములు జాతి లేక తెగ అన్న అంశం పై వివాదం అవసరం. ముస్లిముల రాజకీయ పృధః కరణ అనేది ఏ విధంగా సురక్షితము, సమర్ధవంతమైన విధానమనేది ఊహాతీతమైన జటిల సమస్య. దురదృష్టవశాత్తు ఇట్టి విధానానికి శ్రీకారం చుట్టడం ద్వారా జిన్నా ముస్లిముల కెంతటి హాని చేశాడో వారు గుర్తించలేకపోతున్నారు. ముస్లిం లీగ్‌ను ముసల్మానుల ఏకైక ప్రతినిధిగా చేయడం ద్వారా జిన్నా ఏమి సాధించగలిగారన్న విషయం ముస్లిములు ఒక్కసారి పరిశీలించగల్గాలి. దాని వల్ల తందానతాన అనే గతి తప్పి ఉండొచ్చు. ఏమంటే ముస్లిం లీగ్‌లో ఆయన సర్వదా ప్రథమస్థానంలోనే ఉంటాడు. కాని ఈ విధమైన పృధఃకరణ విధానం ద్వారా హిందూరాజ్యం బారి నుండి ముస్లింలే విధంగా నిరోధింపబడగలరని లీగ్ భావిస్తుంది? ముస్లింలు అల్పసంఖ్యలో వున్న రాష్ట్రాలలో హిందూ రాజ్యస్థాపనను పాకిస్తాన్ నివారించగల్గుతుందా? ఖచ్చితంగా చేయలేదు. పాకిస్తాన్ గనుక ఏర్పడినట్లయితే ముస్లిములు మైనారిటీలుగా వున్న రాష్ట్రాలలో జరుగబోయేదిదే. యావత్ దేశస్థాయిలో ఎలావుంటుందో చూద్దాం. హిందూస్తాన్‌లో మిగిలి పోయిన ముస్లిం మైనారిటీల పై కేంద్ర స్థాయిలో హిందూ రాజ్యావతరణను పాకిస్తాన్ నిరోధించగలదా? అదివల్లగాని పని అని ఇట్టే తెలుస్తుంది. మరైతే పాకిస్తాన్ ఒరగ బెట్టే దేమిటి? ముస్లింలు మెజారిటీగా గల రాష్ట్రాల్లో హిందూ రాజ్యావతరణను నిరోధించగల్గడం తప్ప అక్కడెటు తిరిగీ హిందూ రాజ్యావతరణన్న సమస్యే ఉత్పన్నం కాబోదెన్నటికీ. మరోరకంగా చూస్తే - ముస్లింలధికంగా గల రాష్ట్రాల్లో పాకిస్తాన్ అవసరమే ఉండదు. ఎందుకంటే అక్కడ హిందూ రాజ్యావతరణ అన్న సమస్యే ఉత్పన్నం కాబోదెన్నటికీ. మరో రకంగా చూస్తే ముస్లిం అధికంగా గల రాష్ట్రాల్లో పాకిస్తాన్ అవసరమే ఉండదు. ఎందుకంటె అక్కడ హిందూరాజ్య భయమనేది లేదు గనుక. ముస్లిములు మైనారిటీలో ఉన్నచోట పాకిస్తాన్ ఉన్నా లేకున్నా వారు హిందూ రాజ్యం క్రింద మ్రగ్గాల్సిందే కనుక అది వారికి నిరర్ధకం కన్నా అతి చెడ్డది. ముస్లిం లీగ్ రాజకీయాలకన్నా నిరర్ధకమైన రాజకీయం మరొకటుంటుందా? మైనారిటీగా వున్న ముస్లిముల సహాయార్ధమై ఆరంభమై ముస్లింలీగ్, మెజారిటీగా వున్న ముస్లింల సమస్య నెత్తిచూపుతూ అంతమైంది. ముస్లిం లీగ్ యొక్క మూల ఆశయం ఎంత విపరీతంగా గాడి తప్పింది. ఎంతటి ఉత్కృష్ట స్థితినుంచి ఎంత అపహాస్య స్థాయికి దిగజారి పోయింది. హిందూ రాజ్యానికి విరుగుడుగా పాకిస్తాన్ నిరర్ధకం కన్నా హీనం.

## VI

ఇది ముస్లిముల పాకిస్తాన్ కోర్కెలో నాకు గోచరించిన కొన్ని బలహీనతలు. నాకు గోచరించని బలహీనతలింకా కొన్ని ఉండి వుండవచ్చు. కాని ఇప్పటికీ ఉన్న జాబితా భయంకల్గించక మానదు. ముస్లిములు వీటినే విధంగా ఎదుర్కోవాలనుకొంటున్నారు. ఈ ప్రశ్న సంపూర్ణంగా ముస్లిములకే గాని నాకు గాదు. ఈ బలహీనతలను ముందు పరచడం వరకే ఈ విషయానికి చెందిన విద్యార్థిగా నా విధి. ఆ పని నేను పూర్తి చేశాను. ఇంతకు మించి సమాధానం ఇవ్వాల్సిన అవసరం నాకు లేదు.

అయినప్పటికి ఇంకా రెండు ముఖ్య ప్రశ్నలు మిగిలిపోయాయి. వాటిని పరిశీలించనట్లయితే పై మొత్తం చర్చ అసమగ్రంగానే మిగిలిపోతుంది. నాకు నా విమర్శలకు మధ్య నున్న అగాధాలను పూడ్చడమే ఈ ప్రశ్నలలోని ఆంతర్యం. ఈ రెంటిలో ఒక ప్రశ్న నేను విమర్శలకు వేయదగినది కాగా రెండోది విమర్శకులు నన్ను ప్రశ్నించ దగ్గది.

మొదటి ప్రశ్నతో ప్రారంభిస్తే ఈ బలహీనతల గురించి ప్రకటింప చేయడం ద్వారా వారు ఏ మంచిని ఆశిస్తున్నారు? అని నేను విమర్శకులనడగాలనుకొంటున్నాను. పాకిస్తాన్ కోర్కె యొక్క సుగుణాల గురించి తర్కంలో ఓడిపోయినంతనే ముస్లింలు వారి కోర్కెను ఉపసంహరించుకోవాలని అనుకొంటున్నారా? ఈ వివాద పరిష్కారంలో ఎలాంటి పద్ధతి నవలంబిస్తున్నారు అన్న అంశంపై ఆ విషయం ఆధారపడి ఉంది. హిందువుల నుండి మతాంతరీకరణ జరుపడానికై వారి తొలి దినాల్లో క్రైస్తవ మిషనరీలు అవలంబించిన పద్ధతినే హిందూ ముస్లిము లిక్కడ అవలంబించవచ్చు.

ఈ విధానం ప్రకారం ముందుగా ఒక దినాన్ని సంవాదపు దినంగా నిర్ధారిస్తారు. ఆ రోజున ఈ సంవాదంలో క్రైస్తవ మత వ్యాపకుడైన ఒక బ్రాహ్మణుడు బహిరంగంగా సంవాదంలో పాల్గొంటారు. ఇక్కడో షరతుంది. ఏమంటే ఎవరైతే ఓడిపోతారో వారు గెలిచిన వారి మతం స్వీకరించాలి. అది పాకిస్తాన్ సమస్య పరిష్కారంలో అలాంటి పరిస్థితి నవలబించడానికి గాని ఒప్పందం కుదిరినట్లయితే ఈ బలహీనతల తుట్టెను కదిలించడం వలన కొంతైనా ప్రయోజనం ఉండవచ్చు. వివాదాన్ని తొలగించడంలో జాన్సనియన్ పద్ధతనేది మరొకటి కూడ వుందని మరువరాదు. డా॥ జాన్సన్ అనుసరించిన రీతిని బట్టి దానికా పేరు వచ్చింది.

బాస్వెల్ ఇలా రాశాడు. ఓ రోజు బాస్వెల్ డా॥ జాన్సన్‌తో మాట్లాడుతూ బిషప్ బర్కలీ యొక్క సిద్ధాంతాన్ని గూర్చి ప్రస్తావించడం జరిగింది. బర్కలీ ప్రకారం యదార్థ మనేది మిధ్య అని విశ్వంలో ప్రతిదీ భావనేనని, కేవలం తార్కికమైన సగ్నసత్యమని ఇది తిరస్కరింప వీలులేనిదని చెప్పాడు. దీనికి సమాధానంగా డా॥ జాన్సన్ శరవేగంతో తన ముందున్న రాయిని బలంగా తన్ని "దాన్ని నేనీవిధంగా తిరస్కరిస్తున్నాను" అంటాడు. తమ పాకిస్తాన్ కోర్కెను

హేతు బద్ధంగా, తార్కికంగా పరిష్కరించుకోవాలని హేతుబద్ధులైన ముస్లిములనేక మంది అనుకోవచ్చును. కాని ముస్లిములు జాన్సన్ ఫక్కీలో, పో నువ్వూ నీ వాదనలూ. మాకు కావల్సింది పాకిస్తానే, అని అన్నా నేను ఆశ్చర్యపడను. అలాంటి పరిస్థితుల్లో పాకిస్తాన్ కోర్కెలో ఇమిడి ఉన్న పరిమితులపై ప్రాధాన్యత నుంచడం ద్వారా ప్రయోజనం శూన్యమని విమర్శకులు గమనించాలి. కాబట్టి పాకిస్తాన్ కోర్కెలోని అనౌచిత్యాన్ని గూర్చిన వాదనల తర్కపటిమ పై గంతులు వేసినంత మాత్రాన ఒరిగేది దేమీ వుండదు.

విమర్శకులు నాకు వేయదగిన ప్రశ్న ఒకటుందన్నాను కదా! దానిని తీసుకుందాం. నేను వ్యక్తపరిచిన అభ్యంతరాల వెలుగులో పాకిస్తాన్ సమస్యపై నా వైఖరి ఏమిటి? అనేది. నా వైఖరి గురించి నాకెలాంటి అనుమానాలు లేవు. రానున్న అధ్యాయాలలో పేర్కొన్న విధంగా ముస్లిములు పాకిస్తాన్ కోసం రాజీలేని విధంగా ఉన్నట్లయితే కొన్ని షరతులకు లోబడి, వారికి పాకిస్తాన్ ఇవ్వవల్సిందేనని దృఢంగా విశ్వసిస్తున్నాను. ఇలా అంటున్నందుకు విమర్శకులు తక్షణమే నన్ను చంచల మనస్కుడిగా నిందిస్తారని నాకు తెలుసు. ఇంతటి అసాధారణమైన నిర్ధారణకు కారణాలేమిటని నన్ను ప్రశ్నిస్తారు. అసాధారణమని ఎందు కంటున్నానంటే ఇదే అధ్యాయం ముందు భాగాల్లో నిర్లక్ష్యంగా పాకిస్తాన్ సాధ్యనీయత కవసరమైన బలం ఆ కోర్కెలో లేదని చెప్పాను. కాబట్టి ముస్లిముల పాకిస్తాన్ కోర్కెలోని బలహీనతలను చెప్పిన వాటితో ఒక్కటి కూడ నేను వెనుకకు తీసుకోవడం లేదు. అయినప్పటికీ, ముస్లిముల పాకిస్తాన్ కోర్కె బలంగా ఉన్నట్లయితే దానిని అనుమతించడం మినహా మరోదారి లేదని విశ్వసిస్తున్నాను. నేనీ నిర్ధారణకు రావడానికి దారితీసిన కారణాలేవంటే పాకిస్తాన్ కోర్కెని బలహీనత లేక బలాలు మాత్రం కాదని చెప్పడానికి నేను సంకోచించను. నా అభిప్రాయంలో ఇలాంటి నిర్ధారణకు మలచడంలో రెండు ప్రధానాంశాలున్నాయి. భారత దేశ రక్షణ మొదట అంశం కాగా ముస్లిముల మనో భావం రెండోది. ఈ రెండు ఎందుకు కీలకమైనవని నేను భావిస్తున్నానో ఆ రెండు పాకిస్తాన్‌కు ఎంతటి సమర్థనీయ అంశాలో వివరిస్తాను.

మొదటి దాన్నితో ప్రారంభిద్దాం. కేవలం స్వాతంత్ర్యం సంపాదించడం ఒకటే కాదు ముఖ్యం దానిని పరిరక్షించుకోగల్గిన నిర్దుష్టసాధనాలు కూడ కలిగివుండాలన్న విషయాన్నెవరూ విస్మరించరాదు. ఏ దేశ స్వాతంత్ర్యానికైనా అంతిమ హామీ సురక్షిత సైన్యం. దేశం కోసం ఏ క్షణంలోనైనా ఎలాంటి పరిస్థితిలోనైన కూడ పోరాడదల్గేదిగా వుండాలి సైన్యం. ఇండియాలో సైన్యం అనివార్యంగా హిందూ ముస్లింల కలయికగా ఉంటుంది. ఏదైనా విదేశీ రాజ్యం భారతదేశాన్ని దురాక్రమిస్తే సైన్యంలోని ముస్లిములు భారత రక్షణ కోసం పోరాడగలరని విశ్వసించ వచ్చా? దురాక్రమణ దారుడు కూడ ముస్లిం మత రాజ్యమే అయితే! ముస్లిములు వారితో కుమ్మక్కవుతారా లేక వారికి వ్యతిరేకంగా నిలిచి దేశ రక్షణ గావిస్తారా? ఇది చాలా కీలకమైన ప్రశ్న. అయితే దీనికి సమాధానం పాకిస్తాన్‌కు పునాది అయిన ద్విజాతి సిద్ధాంతం

గాని సైన్యంలోని ముస్లిములకు ఏ మేరకు సోకింది అన్న అంశం పై ఆధారపడి వుంటుంది. వారే గాని ఆ అంటువ్యాధి పీడితులైతే ఇండియా సైన్యం క్షేమకరం కాదనే అంటే ఇండియా దేశపు స్వాతంత్ర్యానికి ప్రమాదకారిగాను పరిణమిస్తుంది. ఇండియా రక్షణ కోసమైనా మీరు పాకిస్తాన్‌ను తిరస్కరించండి అని కొందరు బ్రిటిషు వారు నాతో అన్నప్పుడు నేను భారతీయుడనయ్యాను. కొందరు హిందువులది గూడ ఇదే బాణీ. స్వతంత్ర్య ఇండియాను నిర్ధారించగలిగే విషయమే గాని వారు గుర్తించలేక పోతున్నారని నాకు తెల్సు. లేకుంటే వారు మాట్లాడే ఇండియా – తన రక్షణకు తానే బాధ్యత వహించ వలసిన స్వతంత్ర్య ఇండియాగాక, దురాక్రమణ బారి నుండి బ్రిటిషు వారిచే రక్షింపబడే బ్రిటిషు ఆధీన సంపత్తిగా అయివుంటుంది. ఇది చాలా పనికి మాలిన దృష్టి వక్రీకరణ ఫలితం. విభజనే గాని లేకుంటే బ్రిటిషు వారెంత మెరుగ్గా భారతదేశాన్ని రక్షించగలరన్నది గాదు ప్రశ్న.

ఇండియనులు స్వతంత్ర్య ఇండియాను పరి రక్షించు కోగలరా? అన్నదే అసలు ప్రశ్న. దీనికి నా ఒకే ఒక సమాధానం ఏమంటే భారతీయులు స్వతంత్ర భారతాన్ని కాపాడుకోగలరు. అయితే ఒక్కటి షరతు – అదేమంటే భారత సైన్యం పాకిస్తాన్ విష ప్రభావానికి లోను గాకుండా రాజకీయాతీతంగా ఉండి ఉండాలి. సైన్యాన్ని స్వాతంత్ర్యం నుండి విడదీసి చర్చించే ఒక ప్రయోజన రహితమైన అలవాటే దేశంలో పెరిగిపోతోంది. ఇది తప్పని ఇండియనులను హెచ్చరిస్తున్నాను. సైన్యం రాజకీయమయమైపోతే భారత స్వేచ్ఛ దారుణంగా ప్రమాదంలో పడుతుంది అని గుర్తించలేకపోయినట్లయితే అంతకన్నా వినాశకరమైంది మరొకటుండదు. సైన్యం లేకపోవడం కంటె అతిహేయమైనదిది.

అంతే ప్రాముఖ్యం గల మరో వాస్తవముంది. ప్రభుత్వాన్ని అవిధేయ, విప్లవకర శక్తుల నుండి కాపాడి అధికార ప్రయోగంతో మన్న గల్గేలా చేయగల్గే అంతిమ సాధనం సైన్యమే. ముస్లిములలోని ఒక వర్గంచే తీవ్రంగా వ్యతిరేకించబడే విధానాన్ని ఆనాడధికారంలో వుండే ప్రభుత్వం ప్రకటిస్తుందే అనుకొందాము. తన ప్రకటిత విధానాల అమలు కోసం నాడుండే ప్రభుత్వం సైన్యాన్ని వినియోగించవలసి రావచ్చు. తన ఆజ్ఞలను స్వీకరించి ముస్లిం తిరుగుబాటు దార్ల పై కాల్పులు జరపడానికి సైన్యంలోని ముస్లింలపై ప్రభుత్వం ఆధార పడగలదా? ఇది మరల సైన్యంలోని ముస్లిములకు ఏ మేరకు ద్విజాతి సిద్ధాంత జాడ్యం పాకిందన్న అంశంపై ఆధారపడి ఉంటుంది. ఆ జబ్బేగాని సోకినట్లయితే ఇండియాకు సురక్షిత, భద్రతాయుత ప్రభుత్వం ఉండే ప్రశ్న లేదు.

రాజకీయాల్లో మనోవాంఛితాన్ని ఒక శక్తిగా హిందువులు గౌరవించరనే రెండో శాసనాత్మక అంశానికి వద్దాం. ముస్లిములపై చేయి సాధించడానికి హిందువులు రెండు అంశాలపై కేంద్రీకరిస్తారు. వానిలో మొదటదేమంటే హిందువులు ముస్లిములు రెండు వేర్వేరు జాతులనుకొన్నప్పటికీ వారు ఒకే రాజ్యంగా కలసి ఉండడము అనేది.

మరో అంశమేమంటే ముస్లిముల పాకిస్తాన్ కోరిక కేవలం వారి మనో వాంఛితమేగాని దానికి స్పష్టమైన వాదనా పునాది లేదనేది. ఇలాంటి వాదనలతో హిందువులు తమను తామెంత కాలం మోసగించుకుంటారో నాకైతే తెలీదు. మొదటి వాదనకు రివాజు లేక పోలేదన్నది నిజమే. అయితే దీని ప్రభావం చాలా పరిమితమైందని తెల్సుకోవడానికి ఎంతో తెలివి పని లేదు. రెండు జాతులు ఒకే రాజ్యమనే అభ్యర్థన అందమైనదే. ధర్మోపదేశంవలె ఇది ఆకర్షణీయంగా ఉండి ముస్లిం నాయకుల మనసులో కూడ మార్చవచ్చు. కాని ధర్మోపదేశంగా ప్రవచింపబడడానికి బదులు ముస్లిములు విధిగా అనుసరించవల్సిన ఓ ఆర్డినెన్సుగా వెలువడినట్లయితే అది ఏ స్థిరచిత్తుడైన ఏ వ్యక్తి కూడా అంగీకరింప జాలని పిచ్చిపథకం అవుతుంది. స్వరాజ్యం యొక్క ధ్యేయాన్నే ఇది దెబ్బ తీస్తుందని ఖచ్చితంగా చెప్పగలను. రెండో వాదన కూడ అంతే వివేకమైనది. ముస్లిములు పాకిస్తాన్ కోర్కె కేవలం మనోవాంఛితార్థమైనదనుకోవడం దానికి బలహీనత కాకపోగా మరింత బలాన్ని చేకూరుస్తుంది. రాజ్యాంగం యొక్క చెల్లుబాటు కేవలం సిద్ధాంతపునాది చాలదని చెప్పడానికి ఎక్కువ రాజకీయ పరిజ్ఞానం అవసరం లేదు. అది కేవలం మనో వాంఛితమే. రాజ్యాంగం వంటి వస్త్రధారణ కూడ అవసరమే. ఎంత పకడ్బందీగా వున్నప్పటికీ, ఆహ్లాదపరచలేని రాజ్యాంగం ఆచరణలో మనజాలదు. దృఢ సంకల్పం గల ఒక వర్గం వారి బలమైన మనో వాంఛలకు వ్యతిరేకమైన రాజ్యాంగాన్ని కావాలనుకోవడం విప్లవాన్ని గాకపోయినా వినాశనాన్ని ఆహ్వానించడమే అవుతుంది.

సురక్షితమైన సైన్యం ఉందనే అనుకొన్నప్పటికీ రక్షణ దళాల ఆధ్వర్యంలో ప్రజలను పాలించడం సాధారణ పాలనా పద్ధతి కాబోదనే విషయాన్ని హిందువులు గుర్తించడం లేదు. సమిష్టి పౌర వ్యవస్థ అనారోగ్యపూరితమైనపుడు బలప్రయోగం ఒక ఔషధమే - నన్న వాస్తవం కాదనలేం. అయితే ఈ ఔషధం ఔషధంగానే పరిమితంగా ప్రయోగించాలి కాని దాన్ని సమిష్టి పౌరవ్యవస్థ దైనందిన ఆహారంగా మార్చబడడాన్ని అనుమతించరాదు. స్వాభావిక చర్యల పరంపర ద్వారా సమిష్టి పౌరవ్యవస్థలోని వివిధ భాగాలు కల్సి పనిచేయాలంటే ఏక మనస్కులై రాజ్యాంగాది వ్యవస్థాజనిత చట్టాలకూ, ఆజ్ఞలకూ విధేయులై ఉన్నప్పుడే ఇది సాధ్యం. ముస్లిముల ప్రయోజనాల రక్షణ కవసరమగు భద్రతలన్నీ ఐక్య భారత రాజ్యాంగంలో పొందుపరచారనుకొందాం. కాని ముస్లిములు అనవచ్చు, "మీ భద్రతలకు మేం కృతజ్ఞులం. కాని మీచే పరిపాలించబడడమే మాకిష్టం లేదు." అని చెప్పి శాసనసభలను బహిష్కరించవచ్చు. చట్టాలను ధిక్కరించవచ్చు. పన్నులు కట్ట నిరాకరించవచ్చు. అప్పుడేం జరుగుతుంది? హిందూ తుపాకి మొనలను ముస్లిములపై ఉంచి వారిని విధేయులుగావించడానికి హిందువులు సిద్ధం గా ఉన్నారా? స్వరాజ్యమనేది ప్రజలకు సేవ చేయడానికా లేక హిందువులు ముస్లిములు ఒకరిపై మరొకరు పెత్తనం చెలాయించుకోవడానికా? స్వరాజ్యామంటే ప్రజల చేత, ప్రజలకొరకు, ఏర్పడ్డ ప్రజలయొక్క ప్రభుత్వంగా వుండాలి. ఇదే స్వరాజ్యావతరణకు

న్యాయబద్ధమైన పునాది కారణమౌతుంది. స్వరాజ్యమనేది హిందువులు, ముస్లిములు ఒకరి నొకరు ఏ విధంగా ఆక్రమించుకోవాలనే నిరంతర దుష్ట పథక రూపకల్పనా ప్రక్రియా సంస్కృతిని ప్రవేశపెట్టడానికి దోహదకారి అయినట్లయితే మనకా స్వరాజ్యమెందుకు? అసలలాంటి స్వరాజ్యావతరణకు ప్రజాస్వామ్య దేశాలు ఎందుకు అనుమతించాలి? అలాంటి స్వరాజ్యం ఒక వల, భ్రమ, వికృతమే కాగలదు.

తాము విభిన్న ప్రత్యామ్నాయాల కూడలిలో నిలబడి తమ మార్గమేదో ఎంపిక చేసుకోవాల్సిన సమయ మాసన్నమైనదని ముస్లిమేతరులు గ్రహించినట్లుగా లేదు. ప్రత్యా మ్నాయ మేమిటో వివరిస్తాను. మొట్టమొదటిగా వారు ఇండియాకు స్వాతంత్ర్యమా లేక ఇండియా ఐక్యతా అన్న ప్రాధాన్యత నిర్ధారించుకోవాలి. ముస్లిమేతరులు భారత సమైక్యమే గనుక అతి ప్రధానమని భావిస్తే భారత స్వాతంత్ర్యమే ప్రమాదంలో పడుతుందని తక్షణమే వారు గ్రహించగలరు. భారత సమైక్యాన్ని ఖచ్చితంగా కాపాడగల పద్ధతి ఏది అనే దానిని గురించి రెండో ప్రత్యామ్నాయం.

స్వతంత్ర, ఐక్య భారతంలో ముస్లిం, ముస్లిమేతర ఇరువర్గాల ఉమ్మడి స్వేచ్ఛలు కాపాడబడే విధంగా ఒక దృఢ సంకల్పాన్ని పెంపొందించడంలో ముస్లిములపై ఆధారపడటమా? లేక భారత విభజనే శ్రేయస్కరమా? దీనివలన ముస్లిం ఇండియా రక్షణ బాధ్యత ముస్లిములకు, ముస్లిమేతర ఇండియా రక్షణ బాధ్యత ముస్లిమేతరులకే వదలి వేయబడుతుంది కనుక.

మొదటి వికల్పానికి సమాధానంగా భారత ఐక్యం కన్నా విముక్తికే నేను ప్రాధాన్యత ఇస్తాను. ప్రపంచంలో కెల్లా అంకిత జాతీయవాదులుగా పేర్కొనబడే సిన్‌ఫెన్నర్స్ కూడ భారతీయుల మాదిరి సమస్యనే ఎదుర్కొన్నారు. ఐర్లాండ్ విముక్తా? ఐర్లండు ఐక్యమా? ఏది ప్రధానం అన్న మీమాంసకు గురి చేయబడ్డారు. విభజనకు వ్యతిరేకులైన ముస్లిమేతరులకు ఒకనాటి ఫిన్నిష్ ఉపాధ్యక్షుడు రెవ మైఖేల్ ఓఫ్లానగన్ ఐర్లాండ్ విభజన విషయమై ఐరిష్ జాతీయ వాదులకిచ్చిన సలహా ఉపయోగకరం కావచ్చు. ఈయనేమన్నాడంటే :

"యూనియనిస్టు ప్రాంతమైన అల్స్టర్‌ను వేరు చేయడానికి అంగీకరించేకన్నా, మనం హోం రూల్ (స్వతంత్ర్య పాలన) వ్యతిరేకించినట్లయితే ప్రపంచానికి మనమేమని చెప్పుకోగలం? ఐర్లాండ్ అనేది నిర్దుష్టమైన భౌగోళిక సరిహద్దులు గల దీవి అనే విషయాన్ని మనం స్పష్టపరచవచ్చు. ఐర్లండులోనే నిర్దుష్టమైన భౌగోళిక సరిహద్దులు కల్గి వున్న జాతులవారికి మనం నివేదిస్తున్నట్లయితే ఆ వాదన సబబుగానే వుంటుంది. కాని మనం నివేదిస్తుంది నిర్దిష్ట భౌగోళిక పరిధులు లేని ఖండాంతర జాతులవారికే. కాబట్టి మన వాదనలో పస ఉండదు. జాతీయ, భౌగోళిక పరిధులు చాలా అరుదుగా మాత్రమే ఏకీభవిస్తాయి. భౌగోళికంగా స్పెయిన్, పోర్చుగల్ ఒకే జాతి గావచ్చు. కాని చరిత్ర వారిని రెండుగా చీల్చింది. నార్వే స్వీడన్‌లను ఒకే దేశంగా రూపొందటానికి భౌగోళికమైన విశ్వ ప్రయత్నం జరిగింది.

కాని వాటి రెంటిని వేరుపర్చడంలో చరిత్ర విజయవంతమైంది. ఉత్తర అమెరికా ఖండం పై ఎన్ని జాతులుండాలనే విషయంలో భౌగోళిక పాత్ర దాదాపు శూన్యం. చరిత్రే అంతా చూసుకొంది. యూరప్ యొక్క భౌగోళిక చిత్రపటం మాదిరిగానే యూరప్ రాజకీయపటాన్ని నిర్మించడాని కెవరైనా ప్రయత్నిస్తే అది చీకటిలో తడుములాటే అవుతుంది. ఐర్లాండును కూడ ఒకే జాబితాగా రూపొందించాలన్న భౌగోళిక ప్రయత్నాలు చరిత్ర వ్యతిరేకత ముందు తలవొంచక తప్పలేదు. అందుకే ఐర్లాండ్ దీవి, ఐర్లండ్ జాతి ఒకే యూనిట్‌గా ఏకీభవించడం లేదు. అంతిమ విశ్లేషణలో తేలేదేమంటే జాతీయతకు ప్రమాణం ప్రజాభీష్టమే."*

పై పదాలన్నీ తీవ్ర వాస్తవికతా దృక్పథం నుంచి జనించినవి. శోచనీయంగా ఇదే వాస్తవికత మనకు భారతదేశములో లోపించింది.

ఇక రెండో పద్ధతికి వస్తే, ఇరువర్గాలకు ఖచ్చితమైన విశ్వసనీయమైన రక్షణ ఉండాలంటే ఇండియా ముస్లిం ఇండియా, ముస్లిమేతర ఇండియాగా విభజించబడడమే మేలని నేను భావిస్తాను. ఉన్న రెండు ప్రత్యామ్నాయాలలో కెల్ల ఇది చాలా సురక్షితమైనది. ద్విజాతి సిద్ధాంతమనే అంటువ్యాధి ఫలితంగా స్వతంత్ర్య, సమైక్య ఇండియా పట్ల సైన్యంలోని ముస్లిముల విధేయతపై నేను వ్యక్తపరచిన సందేహాలు, భయాందోళనలు కేవలం ఊహాజనితమైనవిగా కొట్టి పారవేస్తారని నాకు తెల్సు. ముమ్మాటికి అది వాస్తవమే. అంతమాత్రాన అది నా ఎంపిక వైశిష్ట్యాన్ని ప్రతికూలింపలేదు. నాది తప్పు కావచ్చు. కాని ఎట్టి వైరుధ్యానికి తావు లేకుండా నేను స్పష్టం చేయదల్చుకున్నాను. ఒక్క మాటలో చెప్పాలంటే తమ భద్రతపై మితిమీరిన విశ్వాసానికి గాను హేళనకు గురి కావడమే మేలు, ఆ విశ్వాసం వల్ల నాశనమయేకంటే.

విషయాలను గాలికి వదలి వేయడం నా కిష్టం లేదు. ఇండియా భద్రత లాంటి అతి ప్రముఖమైన విషయాన్ని అవకాశానికి వదిలేయడమంటే భారీ నేరానికి అపరాధి కావడమే.

ముస్లిముల పాకిస్తాన్ కోర్కెకు అనివార్యమైతే తప్ప ఎవరూ బలపరచరు. అదే సమయంలో అనివార్యమైన కఠోర వాస్తవాన్ని ధైర్యంతో, విమోచనా జ్ఞానంతో ఎదుర్కొనవలె గాని అసలు గుర్తించ నిరాకరించడం మూర్ఖత్వమే అవుతుంది. మొత్తాన్ని నిలుపుకోవాలనే ప్రయోజన రహిత ప్రయత్నంలో నిలుపుకోగల ఒక భాగాన్ని కోల్పోవడం కూడ అంతే అజ్ఞానమవుతుంది.

పాకిస్తాన్ విషయమై ముస్లిములు లొంగుబాటు వైఖరికి రానట్లయితే పాకిస్తాన్ ఏర్పడక తప్పదని నేను నిర్ధారణకు రావడానికి దారి తీసిన కారణాలివే. నాకు సంబంధించినంత వరకు ఒకే ఒక్క ప్రశ్న ముఖ్యం : పాకిస్తాన్ సాధనకై ముస్లిములు దీక్షాబద్ధులై ఉన్నారా? లేక

* హిస్టరీ ఆఫ్ ఐర్లండ్ వాల్యూం 2, పేజీ 257 నుండి సర్‌జేమ్స్ ఓకానర్ చే కోట్ చేయబడింది.

పాకిస్తాన్ కేవలం ఒక నినాదమేనా? గతిస్తున్న మానసిక స్థితికి దర్పణమా? లేక వారి శాశ్వత ఆకాంక్షలను ప్రతిబింబిస్తుందా? ఈ ప్రశ్నలకు సమాధానం ఒక్కొక్కరి అభిప్రాయాల్ని బట్టి మార్చవచ్చు.

ముస్లిములు పాకిస్తాన్ విషయమై దృఢ సంకల్పులై వున్నారని స్పష్టమైనట్లయితే దానిని అనుమతించడమే విజ్ఞత గల విధానమవడానికి సందేహించాల్సిన పని లేదు.

# పాకిస్తాన్ సమస్యలు

ఇండియాను పాకిస్తాన్, హిందూస్తాన్‌గా విభజించడం వలన ఉత్పన్నమయ్యే అనేక సమస్యల్లోనూ ఈ క్రింది మూడు సమస్యలు ఉన్నాయి.

1. ఆర్థిక వనరులను, ప్రభుత్వ ఋణాలను విభజించడం.

2. సరిహద్దులను నిర్ణయించడం.

3. పాకిస్తాన్ నుండి హిందూస్తాన్‌కు, హిందూస్తాన్ నుండి పాకిస్తాన్‌కు ప్రజలమార్పిడి.

ఇందులో మొదటి సమస్య దేశ విభజనకు సంబంధిత వర్గాలు అంగీకరించినపుడు దాని పర్యవసానంగా ఉద్భవించేవి. మిగిలినవి రెండు వేరు వేరుగా నిలుస్తాయి. అవి రెండు హిందూస్తాన్ ఆవిర్భావానికి ముందు ఉండే పరిస్థితులని చెప్పవచ్చు. ఈ సమస్యలకు కారణ యోగ్యమైన, న్యాయపూరితమైన పరిష్కారం లభిస్తుందన్న నమ్మకం కుదిరితే కాని అనేకమంది ప్రజలు పాకిస్తాన్‌కు పోయే విషయంలో నిర్ణయం తీసుకొనరు. కాబట్టి నేను ఈ రెండు సమస్యలకు సంబంధించిన వివరణ వరకు మాత్రమే పరిమితమౌతాను.

II

ఇంతవరకు మనకు ముస్లింలీగ్ నుండి పాకిస్తాన్ సరిహద్దులకు సంబంధించి స్పష్టమైన లేదా సాధికారికమైన ప్రకటన లేదు. జిన్నా గురించి వాస్తవంలో హిందువులు చేసే ఫిర్యాదుల్లో ఇదొకటి. రాజకీయ వాతావరణాన్ని కలుషితం చేస్తూ, పాకిస్తాన్‌కు అనుకూలంగా సుడిగాలి పర్యటన చేస్తున్న జిన్నా పాకిస్తాన్ సరిహద్దుల గురించిన వివరాలను తన విమర్శకులకు వివరించటం తగినదిగా భావించలేదు. సరిహద్దులను గురించిన ఏ చర్చ కూడా పాకిస్తాన్ విషయంలో సూత్రప్రాయంగా అంగీకారం కుదిరినపుడే సాధ్యమని, అంతవరకు దాన్ని

గూర్చిన చర్చ అపరిపక్వమని జిన్నా వాదన. ఇదొక వాగ్ధోరణి పూర్వకమైన మంచి సమాధానం కాగలదేమో కాని, ఈ సమస్యకు ఎవరి పక్షం వహించకుండా శాంతియుత పరిష్కారం కోసం కృషి చేసేవారికి ఎటువంటి సహాయం చెయ్యదు. పాకిస్తాన్ నిర్మాణానికిసూత్రప్రాయంగా అంగీకరించిన వ్యక్తి తన పాకిస్తాన్ ప్రణాళికకు తప్పక కట్టుబడి ఉంటాడనే అభిప్రాయం జిన్నాకు ఉన్నట్లుంది. దీన్ని మించిన పొరపాటు మరొకటి లేదు. భారతదేశ విభజన అనే అర్థంలో మాత్రమే ఒక వ్యక్తి పాకిస్తాన్ సూత్రాన్ని ఆమోదించవచ్చు. అయితే ఇది ఏ విధంగా ఆ వ్యక్తిని జిన్నా పాకిస్తాన్ ప్రణాళికకు కట్టుబడేట్లు చేయగలదో అర్థం చేసుకోవటం కష్టం. పాకిస్తాన్‌కు సంబంధించిన ఏ ప్రణాళిక కూడా జిన్నాకు నిజంగా సంతృప్తికరంగా లేకపోతే అతనికి వాటిని వ్యతిరేకించే స్వేచ్ఛ ఉంది. పాకిస్తాన్ ఏర్పాటుకు సంబంధించిన సూత్రానికి అతను అనుకూలమైనప్పటికీ, ఈ విషయంలో అతనికి వ్యతిరేకించే స్వేచ్ఛ ఉంది. కాబట్టి పాకిస్తాన్ ప్రణాళిక, పాకిస్తాన్ సూత్రము అనేవి రెండూ వేర్వేరు ప్రతిపాదనలు. ఈ అభిప్రాయంలో ఏ విధమైన తప్పు లేదు. స్వయం నిర్ణయాధికార సూత్రమనేది ఒక ప్రేలుడు పదార్థం వంటిదని వివరింపవచ్చు. ఒక సందర్భం యొక్క అవసరాన్ని, ఆవశ్యకతలను బట్టి దానిని ఉపయోగించటానికి ఎవరైనా సూత్రప్రాయంగా అంగీకరింపవచ్చు. అయితే అది పేల్చివేసే ప్రదేశం తెలియకుండా దానిని ఉపయోగించేందుకు ఎవ్వరూ అంగీకరింపరు. అది నిర్మాణం మొత్తాన్ని కూల్చివేసే పక్షంలో లేదా దాని ప్రభావ యోగ్యతను ఒక నిర్దిష్ట ప్రదేశానికి పరిమితం చేయలేని పక్షంలో ఒక వ్యక్తి ప్రేలుడు పదార్థ ఉపయోగాన్ని తిరస్కరించవచ్చు. సమస్య పరిష్కారానికి అతడు మరికొన్ని ఇతర మార్గాలను ఉపయోగించవచ్చు. కాబట్టి సరిహద్దు రేఖలకు సంబంధించిన ప్రత్యేకతలు పాకిస్తాన్ రూపాన్ని నిర్దిష్టంగా నిర్ణయించే ప్రాథమిక కార్యాచరణలో అత్యంత ఆవశ్యకాలుగా గోచరింపవచ్చు. పాకిస్తాన్‌ను సమర్థించే నిజమైన నాయకుడు పాకిస్తాన్ ప్రణాళికకు సంబంధించిన అవసరమైన వివరాలను ప్రజలకు గోప్యంగా ఉంచరాదనేది కూడా అత్యంత ఆవశ్యకం. పాకిస్తాన్‌కి సరిహద్దులను ప్రకటించకుండా జిన్నా చూపుతున్న మొండితనం, వ్యతిరేకతలు ఒక రాజనీతిజ్ఞుడిలో క్షమార్హం కానటువంటివి. అయితే పాకిస్తాన్ సమస్య పరిష్కారంలో ఆసక్తి చూపుతున్న వారందరూ జిన్నా దిగివచ్చి వివరాలు ఇచ్చేవరకు నిర్ణయాలు తీసుకోకుండా వేచి ఉండనవసరం లేదు. ముందుగా ఏర్పరచుకొన్న కొన్ని ఆలోచనలు ప్రాతిపదికగా ఈ వాదనను కొనసాగింపవచ్చు. ఈ చర్చలో నేను భావించేది ఏమిటంటే పశ్చిమ పాకిస్తాన్ సరిహద్దులు ఈనాటి ఉత్తర-పశ్చిమ భూభాగం, పంజాబు, సింధ్, బెలూచిస్తాన్‌ల సరిహద్దులుగా ఉండాలని, తూర్పు పాకిస్తాన్ సరిహద్దులు ప్రస్తుత బెంగాల్ భూభాగం, అస్సాంలో కొన్ని జిల్లాలుగా ఉండాలని ముస్లింలీగ్ కోరుకొంటోంది.

## III

అందుచేత గమనించాల్సిన ప్రశ్న ఏమిటంటే, ఈ కోర్కె న్యాయమైనదా? కోర్కె స్వయం నిర్ణయాధికార సూత్రం మీద ఆధారపడిందని చెప్పబడింది. దీన్ని న్యాయబద్ధంగా అంచనా వేయాలంటే స్వయం నిర్ణయాధికార సూత్రపు పరిధిని, పరిమితులను గూర్చిన స్పష్టమైన అవగాహన ఉండాలి. దురదృష్టవశాత్తు అలాటి అవగాహన పూర్తిగా లోపించినట్లు కనిపిస్తుంది. కాబట్టి దీనిని ఈ ప్రశ్నతో ప్రారంభించాలి. స్వయం నిర్ణయాధికార సూత్రం యదార్థంలోనూ, చట్టరీత్యానూ ఎలా ఉంటుంది. గత కొద్ది సంవత్సరాలుగా స్వయం నిర్ణయాధికారమనే పదం వ్యాప్తిలో ఉంది. అయితే అది అంతకన్నా పురాతనమైనదాన్ని గూర్చి వివరిస్తుంది. స్వయం నిర్ణయాధికార సూత్రంలో అంతర్లీనంగా ఉండే భావన రెండు పాయలుగా వృద్ధి చెందింది. 19వ శతాబ్దంలో స్వయం నిర్ణయాధికారమంటే ప్రజల కోర్కెల కనుగుణంగా ప్రభుత్వాన్ని ఏర్పరచటం అని అర్థం. రెండవది, పరాయిజాతుల నుండి ప్రభుత్వ స్వరూపాన్ని గురించిన పట్టింపు లేక జాతీయ స్వాతంత్ర్యం పొందే హక్కు. పాకిస్తాన్ ఆందోళన ఈ రెండవ దానిని సూచిస్తుంది. చర్చను ఈ విషయానికి మాత్రమే పరిమితం చేస్తాను. నాకు ఆవశ్యకంగా కనిపించేదేమంటే స్వయం నిర్ణయాధికారానికి సంబంధించి ఈ క్రింది విషయాలను మనసులో ఉంచుకోవాలి.

మొదటగా స్వయం నిర్ణయాధికారం ప్రజలకు సంబంధించి ఉండాలి. గమనింప నవసరం లేని చాలా చిన్న విషయం ఇది. కాని దీన్ని నొక్కి చెప్పవలసిన అవసరం వచ్చింది. స్వయం నిర్ణయాధికారం సూత్రంతో ముస్లింలీగ్, హిందూ మహాసభ రెండూనూ, పరాచికాలాడుతున్నట్లు కనిపిస్తుంది. ఒక ప్రదేశంలో ముస్లిములు ఎక్కువగా ఉన్నారనే కారణం వలన దానిని పాకిస్తాన్‌లో విలీనం చేయాలని ముస్లింలీగ్ కోరుతోంది. ఇంకొక ప్రదేశంలో ముస్లిమేతరులు ఎక్కువగా ఉన్నప్పటికి దాని పరిపాలకుడు ముస్లిం అయితే ఆ ప్రదేశాన్ని సైతం పాకిస్తాన్‌లో విలీనం చెయ్యాలని ముస్లింలీగ్ కోరుతోంది. ఇండియాలో స్వయం నిర్ణయాధికారం యొక్క లాభాలను ముస్లింలీగ్ కోరుతోంది. అదే సమయంలో స్వయం నిర్ణయాధికార సూత్రాన్ని పాలస్తీనాకు అన్వయించటానికి ముస్లింలీగ్ వ్యతిరేకం. కాశ్మీర్‌లో అధిక సంఖ్యాకులు ముస్లిములు కాబట్టి, హైదరాబాద్ సంస్థాన పరిపాలకుడు ముస్లిం కాబట్టి ఈ రెంటిని ముస్లింలీగ్ ముస్లిం రాజ్యాలని చెప్పుకొంటోంది. అదే విధంగా ఈ సంస్థానంలో హిందువులు ఎక్కువ, అంచేత దానిని హిందూస్తాన్‌లో విలీనం చెయ్యాలని హిందూ మహాసభ కోరుతోంది. హిందూవేతరులు తక్కువ ఉన్న ప్రదేశాన్ని సైతం పరిపాలకుడు హిందువనే నెపంతో దానిని హిందూస్తాన్‌లో భాగంగా గుర్తించాలనే కోర్కెతో హిందూ మహాసభ ముందుకొస్తోంది. ఇటువంటి చిత్రమైన ఘర్షణాయుతమైన కోర్కెలు కోరటానికి కారణం పాకిస్తాన్ విషయంలో అటు హిందువులు కాని, ఇటు ముస్లిములు కాని స్వయం నిర్ణయాధికార సూత్రాన్ని పెడదారి పట్టించే పనిలో ఉన్నారు. ప్రజలకు స్వయం

నిర్ణయాధికార సూత్రం గురించి సరియైన అర్థం తెలియకపోతే వారికి ఈ సూత్రాన్ని అనుసరించి నిలబడే నీతి కొరవైతే, ఎట్టి పర్యవసానాలకైనా సిద్ధపడి ఉంటే భూభాగాల పునర్వ్యవస్థీకరణ ప్రశ్న ఉదయించినపుడు ఇండియా పూర్తి అయోమయంలోనికి విసిరి వేయబడుతుంది. కాబట్టి చాలా చిన్న విషయంగా కనిపించే స్వయం నిర్ణయాధికార సూత్రాన్ని, అది ప్రజల చేతనే కాని వేరొకరి చేత జరిగేది కాదు అనే విషయాన్ని గూర్చి నొక్కి చెప్పటం మంచిది.

గమనార్హమైన రెండవ విషయం ఏమంటే స్వయం నిర్ణయాధికార సూత్రంతో ముడిపడి ఉన్న దాని ఆవశ్యకమైన పాత్ర. ఓకానర్ పేర్కొన్నట్లు :

"స్వయం నిర్ణయాధికార సిద్ధాంతమనేది ఎట్టి పరిస్థితుల్లోనూ విశ్వజనీనమైనది కాదు. మామూలుగా దాన్ని గూర్చి ఎక్కువ చెప్పాలంటే అది న్యాయబద్ధమైన, ఒక ఆరోగ్యవంతమైన కార్యాచరణ నియమం. వారి స్వంత పద్ధతి కనుగుణంగా ప్రజల మధ్య శాంతి, సామరస్యాలను పెంపొందించేందుకు, వారిలో అభివృద్ధిని సాధించేందుకు తోడ్పడే నియమం. అదే ఉత్తమమైంది. అయితే అది పరిమాణం, భౌగోళిక స్థితుల విషయంలో పరిస్థితులకు తల ఒగ్గవలసి ఉంటుంది. పరిస్థితుల మీద నియమం చెల్లుబాటు కావాలా లేదా నియమాల మీద పరిస్థితులే చెల్లుబాటు కావాలా అనేది వ్యక్తుల సాధారణ వివేకం లేదా న్యాయదృష్టులను అన్వయించినప్పుడే నిర్ణయింపబడుతుంది. లేదా దీనిని అత్యంత ఎక్కువ మందికి అత్యంత ఎక్కువ మంచి అనే దానిని బట్టి నిర్ణయించడాన్ని బెంథామ్ అనుచరుడు సమర్థిస్తాడు. సరిగా అర్థం చేసుకొంటే ఈ మూడు కూడా ఒకే విషయాన్ని వ్యక్తీకరించే విభిన్న పద్ధతులు. రెండు వైపులా వాస్తవాలు ఉన్నాయి. ఒకరకమైన వాస్తవాలు కొందరి ఆలోచనకే పరిమితమై మిగతా వారి దరి చేరవు. ఇది ఖచ్చితంగా అంచనా వేయదగ్గ సమస్య కాదు. అంటే సమస్త మానవాళి అంగీకరించే నిర్దుష్టమైన ముగింపు అనేది సాధ్యపడకపోవచ్చు. ఒక దేశం మరొక దేశపు స్వయం నిర్ణయాధికారంలో కల్పించుకొనే సందర్భాలు ఉన్నాయి. అది తప్పు అని చెప్పే దానికంటే, ఒప్పు అని చెప్పే వీలు ఎంతమాత్రం లేదు. ఇది ఒక అభిప్రాయమే. నిజాయితీకలవారు, పక్షపాతబుద్ధి లేనివారు ఈ అభిప్రాయంతో విభేదించ వచ్చు."*

ఇది ఇలా ఎందుకుండాలనే దానికి రెండు కారణాలున్నాయి. ఒకటి, మిగతా అన్ని విషయాలను అధిగమించి పోయేటట్లు ఉండే ఆవశ్యకమైన పాత్రను జాతీయతకు ఇవ్వనవసరం లేదు. అది పవిత్రం కాదు. నిరపేక్షము కాదు. రెండు, ప్రత్యేకమైన జాతీయతను నిలబెట్టుకోడానికి, భద్రపరచుకోడానికి విభజన అనుకున్నంత ఆవశ్యకమైనదేమీ కాదు.

స్వయం నిర్ణయాధికారానికి సంబంధించి మూడవ విషయం ఒకటి గుర్తుంచుకోవాలి.

* హిస్టరీ ఆఫ్ ఐర్లండ్, సంపుటం 2.

ఒకజాతి స్వయం నిర్ణయాధికారం సాంస్కృతికపరమైన లేదా భౌగోళికపరమైన స్వాతంత్ర్య రూపాన్ని పొందవచ్చు. ఏ రూపాన్ని సంతరించుకొంటుందనే విషయం ఆ భూభాగంలోని జనాభా ఉనికిపై ఆధారపడి ఉంటుంది. మిగతా విషయాలన్నీ సమానంగా ఉండి, ఒక ప్రదేశంలో ప్రజలు సేవలందుకోటానికి, దరి చేరటానికి వీలుగానూ ఉంటే ఆ ప్రజలకు భౌగోళిక స్వాతంత్ర్యాన్ని గురించి ఆలోచించవచ్చు. విడదీయరాని విధంగా కలిసిపోయి మిశ్రమజాతులుగా ఉన్న ప్రజల విషయంలో, వారు ఆక్రమించుకొన్న భూభాగాలలో సేవలందించడం కష్టమైనపుడు వారు నోచుకొనేది సాంస్కృతిక పరమైన స్వాతంత్ర్యం. ఇటువంటి విషయంలో భూభాగ విభజన అనేది అసాధ్యం. వారికి మిగిలి ఉన్న ఒకే ఒక అవకాశం వలసపోవడం.

స్వయం నిర్ణయాధికార భావన పరిధులను, పరిమితులను నిర్వచించటం వల్ల మనం ఇప్పుడు పాకిస్తాన్ సరిహద్దుల ప్రశ్నను చేపట్టవచ్చు. ప్రస్తుత సరిహద్దే పాకిస్తాన్ సరిహద్దులుగా ఉండాలనే ముస్లింలీగ్ వాదన ఇప్పుడు ఏ విధంగా ఉంటుంది? ఈ ప్రశ్నకు సమాధానం చాలా స్పష్టంగా ఉన్నట్లు నాకనిపిస్తోంది. భౌగోళికమైన ఉనికి ఈ విషయాన్ని నిర్ణయించేట్లు స్పష్టమౌతుంది. ఇక ఇతరత్రా ఏ విధమైన వాదన అవసరం లేదు. వాయవ్య భూభాగం, బెలూచిస్తాన్, సింధ్‌ల విషయంలో హిందువులు, ముస్లింలు కలిగలసి ఉన్నారు. ఈ భూభాగాలలో హిందువుల కుద్దేశించిన భూభాగ విభజన అనేది అసాధ్యంగా కనిపిస్తోంది. వారు సాంస్కృతికపరమైన స్వాతంత్ర్యంతో, వారి రక్షణ కవసరమైన రాజకీయపరమైన ఏర్పాట్లతో సంతృప్తి చెందాలి. పంజాబు, బెంగాలుల విషయం వేరుగా నిలుస్తుంది. ఒకసారి దేశపటాన్ని పరికిస్తే, పంజాబు, బెంగాల్‌లలో హిందూ ముస్లిముల ఉనికి మిగిలిన మూడు ప్రాంతాలకంటే భిన్నమని తెలుస్తుంది. పంజాబు, బెంగాల్‌లోని ముస్లిమేతరులు నివసించే చిన్న, చిన్న భూభాగాల చుట్టూ విస్తారమైన భూభాగంలో ముస్లిములు, వాయవ్య భూభాగం, బెలూచిస్తాన్, సింధులలో వలె వ్యాపించి ఉన్నారు. బెంగాలు, పంజాబుల్లో హిందువులు దరి చేరేందుకు, సేవలందించేందుకు వీలుగా ఉండే ప్రదేశాలను ఆక్రమించుకొని ఉన్నారు. ఈ పరిస్థితుల్లో ముస్లింలీగ్ కోరుతున్నట్లుగా, ప్రస్తుత పంజాబ్, బెంగాలు సరిహద్దులు పశ్చిమ, తూర్పు పాకిస్తాన్ సరిహద్దులుగా కొనసాగాలనే దానిని ఒప్పుకోవడం అనేది సకారణం కాదు.

ఈ చర్చ నుండి, రెండు నిర్ధారణలు తేలుతాయి. ఒకటి పంజాబు, బెంగాలులలోని ముస్లిమేతరులకు తమ భూభాగాన్ని పాకిస్తాన్ నుండి మినహాయించాలని, వారు ఆక్రమించుకొన్న భూభాగాలను విడదీయరాదని అనేందుకు అవకాశం ఉంది. రెండవది, ఉత్తర-పశ్చిమ భూభాగం, బెలూచిస్తాన్‌కు, సింధులలోని ముస్లిమేతరులకు ఇటువంటి అవకాశం లేదు. వారికి సాంస్కృతిక స్వాతంత్ర్యానికి రాజకీయ రక్షణ కవచాలకు మాత్రమే ఆస్కారం ఉంది. దీన్ని మరో విధంగా చెప్పాలంటే ముస్లింలీగ్ కోరుతున్నట్లు సింధ్, ఉత్తర-పశ్చిమ భూభాగం, బెలూచిస్తాన్‌ల సరిహద్దులు ఇప్పుడున్నట్లు కొనసాగవలెననేది వ్యతిరేకింప వీలుకానిది.

కాని పంజాబ్, బెంగాల్‌ల విషయంలో ఇటువంటి కోరిక సమర్థింప వీలుకానిది. ఆ భూభాగాలందు నివసించే ముస్లిమేతరులు వారు అనుకున్నట్లయితే సరిహద్దులను తిరిగి నిర్ణయించటం ద్వారా వారి భూభాగాలను పాకిస్తాన్ నుంచి మినహాయింపమని కోరవచ్చు.

V

పంజాబు, బెంగాలులకు చెందిన ముస్లిమేతరులు సరిహద్దులను తిరిగి నిర్ణయించాలని కోరిన కోరికను ముస్లింలీగ్ సకారణమైనదిగా, న్యాయబద్ధమైనదిగా భావింపగలదని ఎవరైనా అనుకొని ఉండవచ్చు. సరిహద్దులను తిరిగి నిర్ణయించే అవకాశాలు పరిశీలనను 1940 ముస్లింలీగ్ లాహోర్ సమావేశపు తీర్మానంలో చేర్చారు. ఆ తీర్మానం ఇలా పేర్కొంది.

"భౌగోళికంగా దరి చేరటానికి వీలున్న భూభాగాలను గుర్తించటం ద్వారా అవసరమైన చోట్ల, భౌగోళిక సర్దుబాట్ల ద్వారా పూర్తి స్వాతంత్ర్యం గల రాజ్యాల స్థాపన జరగాలి. వాయవ్య, తూర్పు భూభాగాలందు వలె ముస్లిములు సంఖ్యాపరంగా ఎక్కువగా ఉన్న ప్రదేశాలను కలిపి స్వతంత్ర్య ముస్లిము రాజ్యాలను ఏర్పరచాలి. అవి స్వేచ్ఛ, సార్వభౌమాధి కారాలు గల భాగాలుగా, ముస్లిముల మాతృదేశాలుగా ఉండాలి."

ముస్లింలీగ్ అభిప్రాయం ఇదే విధంగా కొనసాగిందనే విషయం. అది క్రిప్స్ ప్రతిపాదన విషయంలో అంగీకరించిన తీర్మానం తెల్పుతుంది. దాన్ని చదివిన ఎవరికైనా ఈ విషయం స్పష్టం కాగలదు. కాని జిన్నా తన అభిప్రాయాన్ని మార్చుకొన్నట్లు దాఖలాలున్నాయి. 1942 నవంబరు 16న జలంధర్‌లో జరిగిన ఒక బహిరంగ సభలో జిన్నా ఈ క్రింది విధంగా తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసినట్లు నివేదింపబడింది :

"ఇటీవలి తమాషా – నేను దానిని తమాషా అనే పిలుస్తాను, మరోలా కాదు – ఏమీ తెలియని సామాన్య ప్రజానీకాన్ని కావాలనే తప్పుదోవ పట్టిస్తున్నారు. స్వయం నిర్ణయాధికారం ముస్లిములకు మాత్రమే ఎందుకు పరిమితం చేయాలి. దానిని ఇతర వర్గాలవారికి ఎందుకు వర్తింపచేయకూడదు అనే విషయం ఈ ఆట ఆడుతున్న వారికి అర్థమౌతుంది. అందరికి స్వయం నిర్ణయాధికార హక్కు ఉందని పేర్కొని, పంజాబును అనేక ముక్కలుగా విడగొట్టాలని చెబుతారు. అదే విధంగా ఉత్తర, పశ్చిమ సరిహద్దులో సింధులు కూడానూ. ఈ విధంగా వందలకొలది పాకిస్తాన్‌లు ఉండబోతాయి.

## ఉపజాతి సమూహాలు

ప్రతి వర్గానికీ ఇండియా మొత్తం మీద స్వయం నిర్ణయాధికార హక్కు ఉండాలని పథక రచన చేసింది ఎవరు? అది చెప్పలేనంత అజ్ఞానం. లేదా మోసం లేదా తమాషా. నన్ను మీకు సమాధానాన్ని ఇవ్వనివ్వండి. ముస్లిములు అత్యధికంగా ఉన్న ప్రాంతాల్లో ఒక నిర్దిష్టమైన భూభాగంలో ఏదైతే వారు తమ మాతృభూమిగా భావిస్తున్నారో అక్కడ స్వయం

నిర్ణయాధికార హక్కును కోరుకొంటున్నారు. వివిధ ప్రదేశాల్లో విస్తరించి ఉన్న జాతి సమూహాలకు ఒక రాజ్యాన్నిచ్చిన దాఖలాలు చరిత్రలో మీకు తెలిసి ఎక్కడైనా ఉన్నాయా? వారికి మీరు రాజ్యాన్ని ఎక్కడ నుండి తీసుకువస్తారు? ఆ విషయంలో మీకు యునైటెడ్ ప్రావిన్సెస్‌లో 14% మంది Eastern times Lahore (లాహోర్) 17 నవంబరు 1942 ముస్లిములే ఉన్నారు. వారికి రాజ్యం ఎందుకు ఉండకూడదు? యునైటెడ్ ప్రావిన్సెస్‌లోని ముస్లిములు ఒక జాతి సమూహం కాదు. వారు విసిరి వేయబడినట్లు విస్తరించి ఉన్నారు. కాబట్టి రాజ్యాంగ పరిభాషలో వారిని ఉపజాతి సమూహంగా అభివర్ణించాలి. ఒక నాగరిక ప్రభుత్వం నుండి వారు పొందవలసిన దాని కన్నా ఎక్కువ ఆశించకూడదు. నేను నా మనోగతాన్ని స్పష్టం చేశాననే భావిస్తున్నాను. ముస్లిములు ఒక ఉపజాతి సమూహం కాదు. స్వయం నిర్ణయాధికారాన్ని కోరడం, దాన్ని అమలు పరచడమనేది వారి జన్మహక్కు."

జిన్నా అసలు విషయాన్ని పూర్తిగా వదిలివేశారు. ఆయన విమర్శకులు లేవనెత్తిన విమర్శ సాధారణంగా పేర్కొనే ముస్లిమేతరుల గురించి కాదు. అది పంజాబు, బెంగాలులలోని ముస్లిమేతరుల నుద్దేశించింది. జిన్నా అతని ఉపజాతి సిద్ధాంతాన్నే అనుసరించి కచ్చితమైన, సులభంగా సేవలందించగల భూభాగాన్ని ఆక్రమించుకొని ఉండే ముస్లిమేతరుల విషయాన్ని తేల్చడాన్ని సమర్థిస్తారా? అది ఆ విధంగా అయితే అపుడు దీన్ని మించిన కుతర్కం రాజకీయ సాహిత్యంలో ఎక్కడా ఉండబోదని చెప్పవలసి వస్తుంది. ఉపజాతి సిద్ధాంతమనేది ఎక్కడా విని ఉండనటువంటిది. అది కేవలం ఊహాజనితమైనదే కాక, చాలా మోసపూరితమైనట్టిది కూడా. ఉపజాతి సిద్ధాంతం ఏం తెలియజేస్తుంది? దాని సూచనలను నేను సరిగా అర్థం చేసుకున్నట్లయితే విభజన సాధ్యమైనప్పుడు సైతం ఒక ఉపజాతిని అది చెంది ఉండే జాతి నుండి వేరు చేయరాదని తెలియజేస్తుంది. జాతి, ఉపజాతుల మధ్య సంబంధాలు, వ్యక్తి సంబంధిత వ్యవహారాల మధ్య సంబంధాల కంటే ఉన్నతమైనవేమీ కావు అని చెప్తుంది. చరాస్తి యజమానితో ఆస్తి సంబంధ వ్యవహారాలు ఆస్తితోనే పోయేటట్లు ఒక ఉపజాతి, జాతితో కలిసి పోతుంది. జిన్నా వాదనలో ఈ విధమైన కారణాలు ఉన్నాయి. అయితే పంజాబు, బెంగాలులలోని హిందువులు కేవలం చరాచర వస్తువులేనని, కాబట్టి వారు అక్కడి ముస్లిములు ఎక్కడికి పోవాలని నిర్దేశిస్తే అక్కడికి పోవాలని జిన్నా తీవ్రంగా వాదిస్తారా? అటువంటి వాదన ఎవ్వరూ సమర్థింప రానటువంటి మూర్ఖమైన వాదన. అది అత్యంత కుతర్కమైన వాదన. ఎంతో అనుభవం కల న్యాయవాది అయిన జిన్నాకు అందలి కుతర్కం కనబడకుండా పోయేంత కష్టమైంది కాదు. అల్ప సంఖ్యాక జాతిని, అధిక సంఖ్యాకులతో పోల్చినపుడు అది కేవలం ఉపజాతి అయితే, దానికి భూభాగ విభజనను కోరే హక్కు లేదు. ఇండియా మొత్తాన్ని పరిగణనలోనికి తీసుకొని హిందువులు ఒక జాతి అనీ, ముస్లిములు ఉపజాతి అని, ఒక ఉపజాతికి స్వయం నిర్ణయాధికారం లేదా భూభాగ విభజనల విషయంలో హక్కు లేదని ఎందుకు చెప్పకూడదు?

పాకిస్తాన్ విషయంలో ఇప్పటికే కొంత అనుమానం ఉంది. తప్పుగానో, ఒప్పుగానో అనేకమంది పాకిస్తాన్ మోసంతో నిండి ఉందని అనుమానపడతారు. వారి ఉద్దేశ్యంలో దానికి రెండు ధ్యేయాలు ఉన్నాయి. వెనువెంటనే నెరవేర్చ వలసిన ధ్యేయం పొరుగు ముస్లిం రాజ్యాలతో కలిసి ముస్లిం సమాఖ్యను ఏర్పరచటం అని పేర్కొనబడింది. ఈ సమాఖ్య అంతిమ ధ్యేయం హిందూస్తాన్ పై దండెత్తి దానిని జయించి లేదా తిరిగి జయించి ఇండియాలో ముస్లిం సామ్రాజ్యాన్ని స్థాపించడం. పాకిస్తాన్ గురించి ఇతరులు మరొక విధంగా భావిస్తారు. ప్రత్యేక ముస్లిం ప్రాంతాల పుట్టుక అనేది జిన్నా ప్రతిపాదించిన 14 అంశాల వెనుక ఉండే ప్రణాళికల అంతిమ దశగా వారు భావిస్తారు. ముస్లిముల మనసులను తెరచి చూసి పాకిస్తాన్ భావన వెనుక ఉండే అసలు ధ్యేయాలేవో, ఎవరూ కనుక్కోలేరు. పాకిస్తాన్‌ను వ్యతిరేకించే హిందువులు ఈ విషయంలో ముస్లిములను అనుమానించటం జరిగితే వారు తత్ప్రకారం కార్యాచరణ పథకాన్ని రూపొందించుకుంటారు. ధ్యేయాలు చెడ్డవని వారు పాకిస్తాన్‌ను వ్యతిరేకింపలేరు. అయితే వారికి జిన్నాను పాకిస్తాన్ విషయంలో మత సమస్యలు ఉండాలని ఎందుకు అనుకుంటున్నాడో అడిగే హక్కు ఉంది. పాకిస్తాన్ వెనుక ఉండే ధ్యేయాలు ఎంత భయంకరమైనప్పటికినీ, కనీసం ఒక మంచి గుణం ఉంది. పాకిస్తాన్ ఆదర్శమనేది దానిలో మత సమస్య ఉండకూడదని. పాకిస్తాన్ నుండి ఒక వ్యక్తి ఆశించే గుణాలలో ఇది చాలా స్వల్పమైనది. ఇండియాలాగే పాకిస్తాన్ సైతం మత సమస్యలతో పీడింపబడినట్లయితే పాకిస్తాన్ అనేది ఎందుకుండాలి? మత సమస్యలకు పరిష్కారం చూపించనప్పుడే దానిని ఆహ్వానించటం జరిగేది. దీనిని అధిగమించే మార్గం ఏమిటంటే అది ఒక మానవ తెగ రాజ్యంగా ఉండేటట్లు, దానిలో అధిక, అల్ప సంఖ్యాకవర్గాలు ఒకదానితో ఒకటి ఘర్షణకు దిగకుండా ఉండేట్లు సరిహద్దులను ఏర్పాటు చేయాలి. జిన్నా ఒప్పుకునే పక్షంలో మాత్రమే అది సాధ్యపడగలదు. దురదృష్టవశాత్తు జిన్నా దీనికి అభ్యంతరం చేస్తాడు. అక్కడే ప్రధానమైన అనుమానం ఉంది. దీనిని తొలగించాల్సింది పోయి, దానిని అతడు మూర్ఖమైన, కుతర్కయుతమైన, కృత్రిమమైన జాతి, ఉపజాతులనే వాదనతో ఇంకా క్లిష్టతరం చేస్తున్నాడు.

అటువంటి మూర్ఖమైన కుతర్కమైన విషయాలను పట్టుకొని వేలాడే బదులు, సమర్థింప వీలుకాని వాటిని సమర్థింప బూనుకొనే బదులు, న్యాయబద్ధమైన దానిని వ్యతిరేకించే బదులు జిన్నాకు, సర్ ఎడ్వర్డ్ కార్సన్ (Sir Edward Carson) అల్‌స్టర్ సరిహద్దులు నిర్ణయించే విషయంలో చేసినట్లు చేయడం బాగుండబోదా? ఐరిష్ స్వపరిపాలన తీర్మానం ఎట్టి పరిస్థితులలో తీర్మానింపబడిందో తెలిసిన వారందరికి అది 1911 సెప్టెంబరు 23న క్రెగ్‌వాగన్ సమావేశంలో సర్ ఎడ్వర్డ్ కార్సన్ తయారు చేసిన పథకం అని తెలుసు. దాని ప్రకారం అల్‌స్టర్‌లో ఇంపీరియల్ పార్లమెంట్‌కు సంబంధించిన ప్రభుత్వంగాని, అల్‌స్టర్‌కు సంబంధించిన ప్రభుత్వం కాని ఉంటుందే కాని స్వపరిపాలన గల ప్రభుత్వం ఉండబోదు.

ఇంపీరియల్ పార్లమెంట్ తన ప్రభుత్వాన్ని ఉపసంహరించుకుందామని అనుకుంటున్నది. కావున ఈ పథకంలోని అర్థం ప్రకారం అల్‌స్టర్‌లో ఒక ప్రాదేశిక ప్రభుత్వ స్థాపన జరుగుతుంది. అల్‌స్టర్ కేంద్రీయ మండలి ప్రతినిధులు, కౌంట్రీగ్రాండ్ ఆరంజ్ లాడ్జెస్ ప్రతినిధులు, కేంద్రీయ మండలాలు ప్రతినిధుల మధ్య 1911, సెప్టెంబరు 25న జరిగిన సమావేశంలో ఆమోదింపబడిన తీర్మానంలో ఇది చేర్చబడింది. స్వపరిపాలన బిల్లు ఆమోదం పొందిన రోజున అల్‌స్టర్ ప్రాదేశిక ప్రభుత్వం అమలులోనికి వస్తుంది. ఈ పథకంలోని ఒక ముఖ్య అంశం ఏమంటే ఈ ప్రాదేశిక ప్రభుత్వానికి వారు (అల్‌స్టర్ వాసులు) తమ కట్టుబాటు నందు ఉంచుకొనగల జిల్లాల అన్నింటిని, వారి అధికార పరిధిలోనికి తేవడం జరిగింది.

"వారు కట్టుబాటు చేయగల జిల్లాలు" అనే పద సముదాయం ఒక విషయాన్ని అనుమానం లేని విధంగా స్పష్టం చేసింది. అదేమంటే, అల్‌స్టర్‌కు చెందిన మొత్తం పరిపాలక విభాగమంతా అందులో కలుస్తుందని. ఇప్పుడు అది అల్‌స్టర్‌కు చెందిన తొమ్మిది కౌంటీలను (లేదా జిల్లాలను) కలుపుతుంది. వీటిలో మూడు క్యాథలిక్కులు అత్యధిక సంఖ్యలో ఉన్న జిల్లాలు. దీని అర్థం అల్‌స్టర్ పరిపాలన ఈ మూడింటిని కూడ తప్పనిసరిగా ఉంచుకొనవలెనని, కాని సర్ ఎడ్వర్డ్ కార్సన్ చివరకు ఏమి చేశాడు. అత్యధిక సంఖ్యాబలం కలిగిన క్యాథలిక్ జిల్లాలు అల్‌స్టర్‌కు సమస్యాత్మకంగా తయారవుతాయని కనుగొనటానికి సర్ ఎడ్వర్డ్ కార్సన్‌కు ఎక్కువకాలం పట్టలేదు. నిజమైన నాయకుని రీతిలో ఆయన ఒక సాహసోపేతమైన ప్రకటన చేశాడు. అల్‌స్టర్‌ను సురక్షితం చేస్తాననీ, తన నష్టాలను తగ్గించుకుంటాననీ ప్రతిపాదించాడు. 1920 మే 18న ఆయన హౌస్ ఆఫ్ కామన్స్ (House of Commons) సభలో ఉపన్యసిస్తూ తను ఆరు జిల్లాలతోనే సంతృప్తి చెందుతానని ప్రకటించాడు. ఆరు జిల్లాలతోనే సంతృప్తి చెందుతానని కారణాలను చూపిస్తూ ఆయన చేసిన ఉపన్యాసం ఉదహరింపదగినది. ఆయన చెప్పింది.*

"డొనెగల్, కావెన్, మొనఘన్‌లకు బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని అందించే చట్టసభను (పార్లమెంటును) బెల్‌ఫాస్ట్‌లో ఏర్పరచే అవకాశం మాకు లేదు. ఎంతో ఆతురతతో గంటల తరబడి, రోజుల తరబడి ఈ విషయాన్ని, భూభాగం మొత్తాన్ని పరిగణనలోనికి తీసుకొని పరిశీలించిన పిమ్మట మేము ఈ ముగింపునకు వచ్చామనేది వాస్తవం. బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పరచగలమని ఇక్కడ వరకు వచ్చి మేము చెప్పటం పూర్తిగా వాస్తవరహితమైన విషయం. స్వాభావికంగా మాకు పెద్ద భూభాగాలను కలిగి ఉండటం ప్రీతిదాయకం. భూభాగ దోపిడీ విధానం, తమ ప్రభుత్వాల అధికార పరిధిని విస్తృతం చేసుకోదలచిన, ప్రభుత్వాలున్న దేశాలన్నిటిలో ఇది అమలులో ఉంది. మేము ఈ [illegible]

* Housard (House of Commons) 1920 సంపుటం 129, పుట.1315

జిల్లాల మూలంగా బాధింపబడటం జరిగితే, ప్రభుత్వం విఫలం కావటం జరిగితే వీటిని తీసుకొనటం అనేది ఉపయోగరహితమైన విషయం."

ఇవి మేధావంతమైన, సాహసోపేతమైన మాటలు. ఏ పరిస్థితుల్లో ఈ మాటలు అన్నారో ఆ పరిస్థితులకు, పాకిస్తాన్ పథకాన్ని అన్వయించటం మూలంగా పంజాబ్, బెంగాల్‌లందు ఏర్పడబోయే పరిస్థితులకు చాలా దగ్గరి పోలిక ఉంది. జిన్నా కాని, ముస్లింలీగ్ కాని శాంతియుతమైన పాకిస్తాన్ కనుక కోరుకుంటే వీటిని గమనించాలి. పంజాబ్, బెంగాల్ లందు నివశించే ముస్లిమేతరులను, కొన్ని ప్రభుత్వ రక్షణలతో తృప్తి పడమని అడగటంలో ప్రయోజనం లేదు. అధిక సంఖ్యాక హిందూ వర్గాల నియంతృత్వానికి ఎదురుగా కొన్ని రక్షణలతో తృప్తి పడటానికి సిద్ధంగా లేని ముస్లిములు, హిందువులను, ముస్లింల నియంతృత్వానికి ఎదురుగా కొన్ని రక్షణలతో తృప్తి చెందమని ఎందుకు అడగాలి? 'మీ రక్షణలు మాకొద్దు, మీ పరిపాలన మాకొద్దు' అని ముస్లిములు హిందువులకు చెప్పగలిగితే (రెడ్‌మాండ్ విషయంలో కార్సన్ ఉపయోగించిన వాదన) అదే వాదనను పంజాబ్, బెంగాల్ హిందువులు అక్కడ ముస్లిములు ఇస్తామన్న రక్షణలకు వ్యతిరేకంగా తిప్పికొట్టవచ్చు.

అసలు విషయం ఏమంటే ఈ దృక్పథం పాకిస్తాన్‌కు శాంతియుత పరిష్కారం కనుగొనే దృష్టిలో చేసింది కాదు. ఆయుధ శబ్దాలు, బల ప్రదర్శనలు పని చేయవు. మొదటగా ఇది ఇద్దరు ఆడే ఆట. రెండవది ఆయుధాలు బలంలో ఒక భాగం కావచ్చు. అయితే ఆయుధాలు కలిగి ఉండటమే సరిపోదు. రూసో చెప్పినట్లు "నైతిక విలువలు మాత్రమే బలమైన హక్కుగా, విశ్వాన్ని విధిగా మార్చగలవు." పాకిస్తాన్‌కు నైతిక ప్రాతిపదిక ఉండేట్లు చూడవలసింది ముస్లింలీగ్ మాత్రమే.

## VI

అదంతా సరిహద్దు సమస్యలను గురించి. ఇప్పుడు నా దృష్టిని సరిహద్దులను తిరిగి నిర్ణయించిన తర్వాత కూడ పాకిస్తాన్‌లో ఉండవలసిన అల్పసంఖ్యాక వర్గాలవైపు మరలుస్తాను. వారి ప్రయోజనాలు కాపాడే రెండు పద్ధతులున్నాయి. ఒకటి, అల్పసంఖ్యాక వర్గాల రాజకీయ సాంస్కృతిక హక్కులకు రాజ్యాంగ రక్షణ కల్పించడం. భారతీయులకు ఇది బాగా తెలిసిన అంశమే. దీనిని విస్తృతపరచడం అనవసరం. రెండు, పాకిస్తాన్ నుండి హిందూస్తాన్‌కు వారి మార్పిడికి వీలు కల్పించడం. ప్రజల మార్పిడి సాధ్యపడేటట్లయితే అనేకమంది ఈ పరిష్కారాన్ని సమర్థించి పాకిస్తాన్ ఏర్పాటుకు ఒప్పుకుంటారు. కాని వారు దీనిని అత్యంత కలవరపరిచే సమస్యగా భావిస్తారు. ఇది ఆందోళన చెందిన మానసిక స్థితికి అనుమానం లేనటువంటి సంకేతం. నిదానంగా నెమ్మదిగా ఆలోచించిన పక్షంలో ఇదేమీ కలవరపరిచే సమస్య కాదని ఋజువు కాగలదు.

ప్రారంభానికి ముందు సమస్యను అన్నివైపుల నుండి పట్టించుకొనండి. ఈ మార్పిడి అనేది ఏ పద్ధతి అనుసరించి? దీనిని నిర్ధారించే ముందు ప్రతి వ్యక్తి మూడు విషయాలు తప్పక పరిగణనలోనికి తీసుకోవాలి. మొదటగా పంజాబు, బెంగాల్‌ల సరిహద్దులను తిరిగి నిర్ణయించినట్లయితే ఈ రెండు ప్రాదేశిక విభాగాలకు సంబంధించి ప్రజల మార్పిడి అన్న ప్రశ్న ఉదయించదు. రెండవది, హిందూస్తాన్‌లో నివసిస్తున్న ముస్లిములు పాకిస్తాన్‌కు వలస పోవడానికి సమాయత్తం కాదు. ముస్లింలీగ్ కూడా వారి మార్పిడిని కోరుకొనదు. మూడవది, ఉత్తర-పశ్చిమ సరిహద్దు భూభాగం. సింధ్ బలూచిస్తాన్‌లోని హిందువులు వలసపోవడానికి ఇష్టపడరు. ఈ ఆలోచనలు కనుక నిజమైతే ప్రజల మార్పిడి సమస్య కలవరపరచనంత దూరంగా ఉంటుంది. వాస్తవంలో దీనిని సమస్యగా భావింపనవసరం లేనంత స్వల్ప విషయం.

అది సమస్యగా తయారు కాగలదని అనుకొంటే అదంత కలవరపరిచే సమస్యగా తయారవుతుందా? అనుభవం ప్రకారం అది పరిష్కారం అసాధ్యమయ్యేంత సమస్య కాదు. అట్టి సమస్యకు పరిష్కారం కనుక్కొనే ప్రయత్నం చేసే ముందు కొన్నిటిని అడిగి తెలుసుకుంటూ ప్రారంభించడం మంచిది. రాజకీయ మార్పులు మూలంగా ఒక వ్యక్తి ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశానికి వలసపోతున్న సమయంలో ఉత్పన్నమయ్యే కష్టనష్టాలేమిటి.? ఈ క్రిందివి సులభగ్రాహ్యాలు.

1) ప్రజల మార్పిడికి సహకరించి సహాయం చేసే యంత్రాంగం 2) వలసకు వ్యతిరేకంగా ప్రభుత్వ నిషేధం 3) వలసపోయే కుటుంబం తీసుకుని వెళ్ళే వస్తువుల మీద ప్రభుత్వం విధించే భారమైన పన్ను. 4) వలసపోయే కుటుంబం స్థిరాస్తి తరలింపులో ఉన్న అసాధ్యత 5) వలసపోయే కుటుంబాల ఆస్తి విలువను తగ్గించటానికి అనుసరించే మోసపూరిత విధానాలు 6) విపణిలో అమ్మడం ద్వారా తమ వస్తువు యొక్క నిజమైన విలువను పొందలేక నష్టానికి గురి కాగలమనే భయం 7) తాము విడిచిపోతున్న దేశం నుండి తమకు బాకీ ఉన్న పెన్షన్ తదితరాలను రాబట్టుకొనడంలో ఎదురయ్యే కష్టం 8) డబ్బు చెల్లించవలసిన కరెన్సీని నిర్ణయించడంలో ఉండే కష్టం. ఈ కష్టాలను తొలగించినట్లయితే ప్రజల మార్పిడికి మార్గం సుస్పష్టం కాగలదు.

మొదటి మూడు కష్టాలను హిందూస్తాన్, పాకిస్తాన్ రాజ్యాలు ఈ కింది షరతులతో కూడిన అధికరణాన్ని తాము అంగీకరించే ఒక ఒడంబడికలో చేర్చడం ద్వారా సులభంగా తొలగింపవచ్చు. "సరి సంఖ్యలో ప్రతినిధులను కలిగి ఉండేటట్లు, రెండు దేశాలకు చెందని వ్యక్తి అధ్యక్షత వహించేటట్లు ఒక సంఘాన్ని నియమించుటకు పాకిస్తాన్, హిందూస్తాన్ ప్రభుత్వాలు అంగీకరిస్తాయి."

"సంఘానికి వాటి కమిటీలకు నిర్వహణకు, కార్యాచరణలకు సంబంధించి అయ్యే

ఖర్చును రెండు ప్రభుత్వాలు సమాన నిష్పత్తిలో భరించాలి." తమ తమ భూభాగంలో నివసించే అల్ప సంఖ్యాక తెగలకు చెందిన జాతులకు వలసపోయే హక్కును ఇవ్వడానికి పాకిస్తాన్ ప్రభుత్వం, హిందూస్తాన్ ప్రభుత్వం అంగీకరిస్తాయి.

వలసపోయే స్వేచ్ఛ విషయంలో, ఈ హక్కును ఉపయోగించే సమయంలో ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని ఎటువంటి ఆటంకాలు కలిగింపబోమని ఈ విషయంలో సహకరిస్తాము అని పైన పేర్కొన్న రెండు రాజ్యాల ప్రభుత్వాలు పూనుకొంటాయి. వలస స్వేచ్ఛలో ఘర్షించే అన్ని చట్టాలు, నియంత్రణలు రాజ్యాంగవ్యతిరేకములుగా పరిగణింపబడాలి." ప్రజల మార్పిడికి సంబంధించిన నాలుగవ, ఐదవ సమస్యలను ఈ కింది ఒడంబడికలోని అధికరణాల్లో చెప్పినట్లు భావవంతంగా పరిష్కరింపవచ్చు.

"ఈ ఆర్టికల్‌ను అనుసరించి వలస పోవుటకు నిర్ణయించుకొన్న వారందరికీ ఎటువంటి పన్ను విధింపబడకుండా తమ వెంట తమ వస్తువులను తీసుకొని వెళ్ళేందుకు లేదా వాటిని తమ వద్దకు తెప్పించుకొనేందుకు హక్కు కలిగి ఉండాలి."

"స్థిరాస్తి సంబంధ వ్యవహారంలో దానిని నగదు రూపంలోనికి మార్చాలి. ఇది ఒక కమీషన్ ద్వారా ఈ కింది నిబంధనలకు లోబడి జరగాలి."

1) స్థిరాస్థి విలువను అంచనా వెయ్యడానికి కమీషన్ ఒక నిపుణుల సంఘాన్ని నియమించాలి. వలసదారు కోరుకుంటే అతని ప్రతినిధి ఈ సంఘంలో ఉండాలి.

2) వలసదారు స్థిరాస్తి అమ్మకానికి సంబంధించి కమీషన్ అవసరమైన జాగ్రత్తలు తీసుకోవాలి.

నష్టాలభర్తీకి, పెన్షన్ల చెల్లుబాటుకు, చెల్లింపవలసిన కరెన్సీ రూపాన్ని నిర్ధారించుటకు సంబంధించిన కష్టనష్టాలను తీర్చుటకు ఒడంబడికలో ఈ కింది అధికరణాలను చేర్చితే సరిపోతుంది.

1) వలసదారుని స్థిరాస్తికి సంబంధించిన అంచనా విలువ, అమ్మకపు విలువల మధ్య తేడాను గుర్తించి కమీషన్ వెల్లడించిన వెంటనే ఆ భర్తీని నగదు రూపంలో కమీషన్‌కు ప్రభుత్వం వెంటనే చెల్లించాలి. దీనిలో నాలుగవ భాగాన్ని వలసదారు విడిచి వెళ్ళే దేశపు కరెన్సీ రూపంలో, మిగతా మూడు భాగాలను బంగారం రూపంలో లేదా స్వల్పకాలిక బంగారు బాండ్ల రూపంలో చెల్లించాలి.

2) పైన నిర్ణయించినట్లుగా వలసదారుల స్థిరాస్తి విలువను కమీషన్ వారికి చెల్లించాలి.

3) ఒడంబడిక మీద సంతకాలు జరిగే నాటికి వలసదారులు పొంది ఉన్న అన్ని రకాల పౌర లేదా సైనిక భృతులను ఋణగ్రస్త ప్రభుత్వం చెల్లించాలి. యజమానుల ఋము

అయ్యేటట్లు ఈ నగదును ప్రభుత్వం కమీషన్‌కు చెల్లించాలి."

4) వలస పొయ్యేందుకు అవసరమయ్యే నిధులను కమీషన్ ఏర్పరచిన ప్రభుత్వాలు చెల్లించాలి."

ప్రజల మార్పిడిలో ఎదురయ్యే కష్టాలను అధిగమించడానికి ఈ ఏర్పాట్లు చాలవా? అయితే మరికొన్ని సమస్యలు ఉన్నాయి. కాని ఇవి అధిగమించడానికి వీలు లేనటువంటివి కావు. వాటిలో ప్రణాళికకు సంబంధించిన ప్రశ్నలు ఇమిడి ఉన్నాయి. మొదటి ప్రశ్న ఏమంటే : ప్రజల మార్పిడి అనేది తప్పనిసరా? లేదా ఐచ్ఛికమా?

రెండవది : వలసపోవడంలో ప్రభుత్వ సహాయాన్ని పొందే హక్కు అందరికీ ఉండాలా లేదా? ఏదో ఒక వర్గానికి మాత్రమే పరిమితమవ్వాలా?

మూడవది : ప్రభుత్వం ఎంతకాలంపాటు ఒడంబడికలోని ఈ ఏర్పాట్లకు కట్టుబడి ఉండాలి? ముఖ్యంగా వలసదారుల స్థిరాస్తి అమ్మకంలో వచ్చే నష్టాన్ని భర్తీ చేసే విషయంలో ఈ విధమైన ఏర్పాట్లను కొంతకాలానికే పరిమితం చేయాలా లేదా ఇది ఇలా నిరంతరం కొనసాగవలసిందేనా?

మొదటి ప్రశ్నకు సంబంధించినంతవరకు రెండునూ సాధ్యమే. వీటిని ఆచరణలో పెట్టిన దాఖలాలు కూడా ఉన్నాయి. గ్రీస్, బల్గేరియాల మధ్య ప్రజల మార్పిడి అనేది ఐచ్ఛికం అయితే గ్రీస్, టర్కీల మధ్య ఇది తప్పనిసరి అయ్యింది. తప్పనిసరి మార్పిడి వ్యవహారంలో ప్రాథమిక సాక్ష్యం తప్పుగా ఒక వ్యక్తికి తోస్తుంది. వ్యక్తి ఇష్టానికి వ్యతిరేకంగా అతనిని తన పూర్వీకుల ఆవాస ప్రాంతం నుండి వలస పొమ్మని బలవంతం చెయ్యడం మంచిది కాదు. ఒకవేళ అతను నివసిస్తున్న ప్రదేశం శాంతి, సుస్థిరతలకు భంగం వాటిల్లి దేశం అస్తవ్యవస్త పరిస్థితులకు లోనయ్యే పరిస్థితులందు వలసపోవడమనేది అతని శ్రేయస్సు దృష్ట్యా అతనికే అవసరం. ఇపుడు కోవలసినదేమంటే కష్టనష్టాలు లేకుండా కోరుకున్న వారందరు వలసపోవుటకు అనువైన పరిస్థితులు. కాబట్టి నా అభిప్రాయమేమంటే మార్పిడి అనేది బలవంతంగా జరుగకూడదు. వలసపోయే విషయంలో తమ మనోగతాన్ని వెల్లడించివారికే దీనిని వదలివేయాలి.

రెండవ విషయానికి సంబంధించినంతవరకు ప్రజల మార్పిడి విషయంలో ప్రభుత్వం సహాయం. అది నిర్వహించే పథకం కేవలం అల్ప సంఖ్యాక వర్గాలవారికే ఉద్దేశించాలనేది స్పష్టమైన విషయం. కాని ఈ పథకం నుండి సహాయం పొందని వారందరినీ మినహాయించే విషయంలో ఈ నిబంధన కూడా సరిపోదు. మతపరమైన తెగల సంబంధమైన విభేదాల మూలంగా వేర్పాటుకు, బాధలకు గురయ్యే అల్ప సంఖ్యాక వర్గాలవారికి దీనిని పరిమితం చేయాలి.

మూడవ విషయం చాలా ముఖ్యమైనది. అభిప్రాయ భేదాలకు తావిచ్చే అవకాశం ఉన్నట్టిది. ప్రభుత్వ ఖర్చుతో జరిగే మార్పిడి నిరంతరం కొనసాగాలని ప్రభుత్వాన్ని బలవంతం చేయడమనేది కారణయోగ్యత లేనిదానిగా చెప్పవచ్చు. ప్రభుత్వ సహాయం పొంది, ముందు పేర్కొన్న ఒడంబడిక అంశాలను ఉపయోగించుకొని వలసపోవడానికి నిర్ణయించుకొనే వ్యక్తి ఆ పనిని ఒక నిర్దిష్ట కాలపరిమితిలో పూర్తి చెయ్యాలని చెప్పడం అసమంజసమైన విషయమేమి కాదు. ఒకవేళ అతడు కాలపరిమితి పూర్తి అయిన తరువాత వలస వెళ్ళడానికి నిర్ణయించుకొన్న పక్షంలో దానికయ్యే ఖర్చు అతడు భరించుకోవాలి. దీనికి ప్రభుత్వ సహాయం ఉండదు. ఈ విధంగా ప్రభుత్వ సహాయాన్ని పరిమితం చేయడంలో అన్యాయమేమీ లేదు. ప్రభుత్వ సహాయమనేది ఈ ప్రణాళికలో భాగం కావలసిన అవసరం ఎందుకంటే వలసపోవడమనేది, పౌరులు వ్యక్తిగతంగా నియంత్రించలేని రాజకీయ మార్పుల మూలంగా సంభవించేది కాబట్టి, కాని వలసపోవడం రాజకీయ మార్పు ఫలితమే కాకపోవచ్చు. అది ఇతర కారణాల వలన కూడా కావచ్చు. ఇతర కారణాల మూలంగా వలసపోయేవారికి సహాయం చేయాలనే నిర్బంధం ప్రభుత్వానికి లేదు. వలసపోవడం రాజకీయ కారణాల మూలంగానా లేదా ఇతరత్రా కారణాల మూలంగానా అనేది నిర్ణయించడానికి ఉన్న ఒకే ఒక మార్గం ఏమంటే దానిని ఒక నిర్దిష్ట కాలానికి అన్వయించి చూడటమే. రాజకీయ మార్పు సంభవించిన తర్వాత ఒక నిర్ణీత కాలపరిమితిలో వలసపోవడం జరిగితే దానిని వ్యక్తిగత కారణంగా భావింపవచ్చు. దీనిలో అన్యాయమేమీ లేదు. ఇదే విధమైన నియమం పౌర అధికారాల విషయాన్ని కూడా నిర్ధారిస్తుంది. రాజకీయ మార్పు జరిగినపుడు పౌర అధికారులు సైతం ఒక నిర్ణీత కాలపరిమితిలో పదవీ విరమణ చెయ్యడానికి ఒప్పుకుంటారు. ఈ కాలపరిమితి దాటిన తర్వాత మాత్రం అలా చెయ్యడానికి అంగీకరింపబడదు. వారి పదవీ విరమణ భృతి తదనుగుణమైన నిష్పత్తిలో ఉంటుంది.

నేను సూచించేట్టుగా ఈ విషయాలలో ప్రణాళిక ఈ విధంగా ఉంటే దాన్ని ఈ కింది అధికరణాల ఒడంబడికలో చేర్చడం ద్వారా అమలు పరచవచ్చు.

"ఈ ఒడంబడిక ప్రకారం 18 సంవత్సరాలు దాటిన ఏ అల్ప సంఖ్యాక తెగకు చెందిన వ్యక్తి అయినా ఐచ్ఛికంగా వలసపోయే హక్కును ఉపయోగించుకోవచ్చును."

"కమీషన్ ముందు చేసిన ప్రకటనను వలసపోయే అభిప్రాయం ఉన్నదన్న దానికి వలసినంత సాక్ష్యంగా తీసుకోవాలి."

"ఈ విషయంలో భర్త అభిప్రాయం, భార్య అభిప్రాయాన్ని 18 ఏళ్ళలోపు పిల్లల విషయంలో వారి తలిదండ్రుల లేదా సంరక్షకుల అభిప్రాయాన్ని తప్పక పొంది తీరాలి."

"ఒడంబడిక మీద సంతకాలు జరిగిన తేదీ నుండి 5 సంవత్సరముల లోపల

వలసపోనట్టయితే ఈ ఒడంబడిక ద్వారా ఒనగూడే లాభాన్ని పొందే హక్కును కోల్పోతారు."

"5 సంవత్సరముల కాలపరిమితి పూర్తి అయిన తరువాత, కమీషన్ విధులు సైతం అది కార్య నిర్వహణ ప్రారంభించిన తేదీ నుండి 6 నెలలోపు నిలిపి వేయబడతాయి." ఖర్చును గురించిన సంగతేమిటి? మార్పిడి తప్పనిసరి అయిన పక్షంలోనే ఖర్చు సమస్యకి ప్రాముఖ్యం ఉంటుంది. ఐచ్ఛికంగా జరిగే మార్పిడి మూలంగా ప్రభుత్వంపై ఆర్థిక భారం పడదు. స్వేచ్ఛ కన్నా మిన్నగా మానవులు ఆస్తిని ప్రేమిస్తారు. తమ ఆవాస ప్రాంతాలను మార్చడం కంటే రాజకీయ పెత్తందార్ల నియంతృత్వాన్ని భరించటానికే ప్రజలు మొగ్గు చూపుతారు.

ఆడమ్‌స్మిత్ పేర్కొన్నట్లు రవాణాకు అత్యంత క్లిష్టతరమైన వస్తువు మానవుడు. కాబట్టి ఖర్చు విషయం ఎవరినీ భయపెట్టనవసరం లేదు.

దాని ఆచరణ సాధ్యం విషయమేమిటి? ఈ ప్రణాళిక కొత్తదేమి కాదు. గత యూరప్ యుద్ధం తరువాత గ్రీస్, బల్గేరియాల మధ్య టర్కీ, గ్రీస్‌ల మధ్య ప్రజల మార్పిడికి సంబంధించి దీనిని అమలుపరచడం జరిగింది.* అది ఆచరణలో సాధ్యమనే విషయాన్ని ఎవ్వరూ కాదనలేరు. నేను సూక్ష్మంగా వివరించిన ప్రణాళిక దానికి నకలు మాత్రమే. గ్రీస్, బల్గేరియాల మధ్య టర్కీ, గ్రీస్‌ల మధ్య ప్రజల మార్పిడి విషయంలో అది అనుకున్న ఫలితాన్ని పొందింది. అది అత్యంత విజయవంతంగా పనిచేసిందనే దానిని ఎవరూ వ్యతిరేకించలేరు. ఒకచోట విజయవంతమైంది ఇండియాలో కూడా అంతే అవుతుందని ఆశింపవచ్చు.

పాకిస్తాన్ విషయం చిన్న విషయం కాదు. సూత్రీకరణ అనుకున్నట్లు జరిగి, నైతిక ప్రాతిపదిక విషయంలో అంగీకారం కుదిరితే అది అనుకున్నంత కష్టమేమీ కాదు. అది క్లిష్టతరమయ్యేటట్లయితే దానికి కారణం కేవలం అది హృదయ విదారకం కావడమే. పాకిస్తాన్ భావన అనేది చాలా బాధాకరమైనందువల్ల దాని సమస్యల గురించి కాని, వాటి పరిష్కారాన్ని గురించి కాని ఆలోచించడానికి ఎవరూ ఇష్టపడరు. కాని మనస్సు చంపుకుని పాకిస్తాన్ నిర్ణయం జరగాలని అనుకుంటే దాని ద్వారా ఉత్పన్నమయ్యే సమస్యలు ఆశ్చర్యజనితములూ కావు, కలవరపరచునట్టివీ కావు.

---

* ప్రజల మార్పిడికి సంబంధించి ఎక్కువ సమాచారాన్ని పొందగోరేవారు Stephen P. Ladas రాసిన The Exchange of Minorities, Bulgaria, Greece and Turkey (1932) అనే గ్రంథాన్ని సంప్రదించవచ్చు. దానిలో ఈ దేశాల మధ్య ప్రజల మార్పిడికి సంబంధించిన ప్రణాళికను అత్యంత విపులంగా విశదీకరించడం జరిగింది.

# ఎవరు నిర్ణయించగలిగేది ?

పాకిస్తాన్ సమస్యకు ఇరువైపులా హిందూ ముస్లిములనే రెండు పార్శ్వాలున్నాయి. ఇవి తప్పించుకోలేనట్టివి. ఏదైనప్పటికీ ఇరుపక్షాల వైఖరీ హేతుబద్ధంగా లేకపోవటం దురదృష్టకరం. ఇరుపక్షాల వారూ మొండివైఖరి లోతుల్లోకి కూరుకుపోయారు. మొండివైఖరి అనే పొరలు ఎంత మందంగా ఉన్నాయంటే వాటిలోకి హేతువన్నది ఇప్పట్లో చొచ్చుకుపోవటం అత్యంతక్లిష్టం. పరస్పర విరుద్ధమైన వారి వైఖరులు సమసిపోతాయో లేదా పేరుకుపోతాయో కాలమూ పరిస్థితులూ మాత్రమే నిర్ణయించగలవు. ఈ మంచు కరగటానికి భారతీయులు ఎంతకాలం నిరీక్షించాలో ఎవ్వరూ జోస్యం చెప్పలేరు. కానీ ఖచ్చితంగా ఈ మంచు కరగనంతవరకు స్వాతంత్ర్యమన్న దాన్ని శీతల సమాధిలో ఉంచవలసిందే. పాకిస్తాన్ సమస్యకు ఆదర్శప్రాయమూ శాశ్వతమూ అయిన ఒక పరిష్కారం దొరకేటంత వరకూ, భారత స్వాతంత్ర్యాన్ని నిరవధికంగా వాయిదా వేయాలంటే చచ్చినంత వ్యతిరేకత చూపే ఆలోచనాపరులైన కోట్లాదిమంది భారతీయులున్నారని నాకు తెలుసు. అట్టివారిలో నేనొకణ్ణి. పాకిస్తాన్ తప్పించుకోవడానికి వీలులేని ఒక సమస్య. ఒక విన్యాసం కాదు. ఆ సమస్యకు పరిష్కారం కనుక్కోవల్సిందేనని అనుకున్నవారిలో నేనొకణ్ణి. ఏది అనివార్యమో దాన్ని తప్పక ఎదిరించాలని నమ్మేవారిలో నేనొకణ్ణి. చుట్టూ జరుగుతున్నదాన్ని శబ్దమాత్రంగానైనా గుర్తిస్తే మనస్సు చివుక్కుమంటుందని, దాన్ని నిరాకరించి ఇసుకలో తలదూర్చితే ప్రయోజనమేమీ ఉండదు. చేతనైతే తుది నిర్ణయం జరిగే ఘడియ రాకముందే ఒక పరిష్కారంలో సిద్ధపడాలని నమ్మేవారిలో నేనొకణ్ణి. బలవంతంగా ఏరు దాటక తప్పదని తెలిస్తే ఒక వంతెనె నిర్మించుకోవటమే విజ్ఞత.

అసలు ప్రధాన సమస్య ఏమిటంటే – పాకిస్తాన్ ఏర్పడాలా లేక వద్దా అన్నది

నిర్ణయించేదెవరు? గత మూడు సంవత్సరాలుగా ఈ విషయమ్మీద ఆలోచించి తగిన సమాధానమంటూ నేనొక నిశ్చితాభిప్రాయానికి వచ్చాను. నా నిశ్చితాభిప్రాయాలను విశద పర్చటానికి వాటిని పార్లమెంటు, చట్టం రూపంలో తీర్చిదిద్దితే, అవసరం మరింత బాగా తీరుతుందని నా యోచన. నా నిశ్చితాభిప్రాయాలను ఇమిడ్చిన ముసాయిదా చట్టం ఇక్కడ ఇవ్వడమైంది.

## భారత ప్రభుత్వ ప్రాధమిక నిబంధనల చట్టం

పరమ పావన ప్రభువులు మతాధిపతుల పార్లమెంటు సలహా సంప్రదింపులతో ఘనత వహించిన చక్రవర్తిగారిచే అధికార పూర్వకంగా శాసనం ఈ విధంగా చేయబడి ఉండుగాక :

I. 1. వాయవ్య సరిహద్దు రాష్ట్రాలు పంజాబు, సింధు, బెంగాలు శాసనసభల్లో మెజారిటీ ముస్లిములు బ్రిటిష్ పాలిత భారతదేశం నుండి ముస్లిములు అధికంగా ఉన్న ప్రాంతాలను వేరు చేయవల్సిందిగా ఒక తీర్మానాన్ని అనుకున్న తేది నుండి ఆరునెలల్లో ఆమోదిస్తే దాన్ని అనుసరించి ఘనత వహించిన పై ప్రాంతాల్లోనూ బెలూచిస్థానంలోనూ ఉన్న ముస్లిములు ముస్లిమేతర ఓటర్లు అందరితో ఆ తీర్మానం పై ఎన్నికలు జరిపించాలి.

2. ఆ ప్రాంతాల్లో ఎన్నికల్లో పాల్గొనే వారిని ఈ ప్రశ్నను కింది విధంగా అడగాలి.

ఎ) బ్రిటిష్ పాలిత భారతదేశ విభజనకు మీరు సుముఖంగా ఉన్నారా?

బి) విభజనకు మీరు వ్యతిరేకమా?

II. 1. ఎన్నికల ఫలితాల రీత్యా మెజారిటీ ముస్లిం ఓటర్లు, విభజనకు అనుకూలంగానూ ముస్లిమేతరులు విభజనకు వ్యతిరేకంగానూ ఉన్నట్లు తేలితే ఏలినవారు పై రాష్ట్రాల్లో ఏయే జిల్లాల్లో ప్రాంతాల్లో ముస్లిములు మెజారిటీగా ఉన్నారో తెలిపే ఒక జాబితాను తయారుచేసే నిమిత్తం ఒక సరిహద్దు కమీషన్‌ను నియమించాలి. అలాంటి జిల్లాలనూ ప్రాంతాలనూ షెడ్యూల్డు జిల్లాలు అని పిలవాలి.

2. ఆ షెడ్యూల్డు జిల్లాలన్నింటిని కలిపి పాకిస్తాన్‌గా మిగతా బ్రిటిష్ పాలిత భారత దేశాన్ని హిందూస్తాన్‌గా పేర్కొనాలి. పశ్చిమోత్తరంలో ఉన్న షెడ్యూల్డు జిల్లాలను పశ్చిమ పాకిస్తాన్ రాష్ట్రంగా పూర్వోత్తరంలోని షెడ్యూల్డు జిల్లాలను తూర్పు పాకిస్తాన్‌గా పిలవాలి.

III. 1. ఒక ఒప్పందం ద్వారాగానీ, మధ్యవర్తిత్వ నియామకం ద్వారాగానీ, సరిహద్దు కమీషన్ సేకరించిన వివరాలు అంతిమ ఫలితాలుగా తేలితే ఘనత వహించిన

ప్రభువు షెడ్యూల్డు జిల్లాల ఓటర్లతో మరోసారి ఎన్నికలు జరిపించాలి.

2. ఎన్నికల్లో పాల్గొనే వారడిగిన ప్రశ్నలు ఈ విధంగా అడగాలి :

ఎ) ఆ విధమైన విభజనకు మీరు సుముఖంగా వున్నారా?

బి) ఆ విధమైన విభజనకు మీరు వ్యతిరేకమా?

IV. 1. మెజారిటీ ఆ విధమైన విభజనకు సుముఖంగా ఉంటే, పాకిస్తాన్‌కు ఒకటి హిందూస్తాన్‌కు మరొకటి వేరువేరుగా రెండు రాజ్యాంగాలు రచించే ఏర్పాటు ఏలినవారు చేయడం చట్ట సమ్మతమవుతుంది.

2. కొత్త దేశాలయిన పాకిస్తాన్ హిందూస్తాన్‌లు వేరు వేరు దేశాలుగా పనిచేయడం ఏలినవారు ఆదేశ పూర్వకంగా నియమించబడిన రోజు నుండి ప్రారంభమవుతుంది.

3. మెజారిటీ ఆ విధమైన విభజనకు వ్యతిరేకమైతే ఏలినవారు బ్రిటిష్ పాలిత భారతదేశ మంతటికీ ఒకే రాజ్యాంగం రచించే ఏర్పాటు చేయించటం చట్ట సమ్మతమవుతుంది.

V. అవిభాజ్య దేశానికి గానీ లేదా పాకిస్తాన్ హిందూస్తాన్‌లకు వేరువేరుగా గానీ రచింపబడిన రాజ్యాంగాలు అమలులోనికి రావటానికి ఏలినవారు నిశ్చయించిన తేది నుండి పది సంవత్సరాలు గడిచే వరకూపై దానిలో చివరి ఉపకరణ కింద జరిగిన ఎన్నికల ఫలితం విభజనకు ప్రతికూలంగా ఉంటే పాకిస్తాన్ ఆ విధంగా విభజించడం గాని లేదా అదే ఉపకరణ కింద జరిగిన ఎన్నికల ఫలితం విభజనకు అనుకూలంగా ఉంటే పాకిస్తాన్‌ను హిందూస్తాన్‌లో విలీనం చేసే ప్రయత్నం గాని చేయరాదు.

VI. 1. నాల్గవ అధికరణ పరిధిలో రెండు ప్రత్యేక రాజ్యాంగాలు అమలులోకి వచ్చి ఉంటే, అందు నిమిత్తం నిశ్చయించబడిన తేదీ వెనువెంటనే ఏలినవారు ఒక భారత కౌన్సిల్‌ను స్థాపించటం చట్టబద్ధం కావాలి. భారత కౌన్సిల్ ఏర్పాటు ఉద్దేశం బ్రిటిష్ పాలిత యావద్దేశానికీ ఒకే రాజ్యాంగాన్ని ఏర్పరచటం; పాకిస్తాన్ హిందూస్తాన్‌ల శాసనసభలు ప్రభుత్వాల మధ్య సామరస్యం ఏర్పరచటం; బ్రిటిష్ పాలిత యావద్దేశానికి సంబంధించిన వ్యవహారాల్లో లావాదేవీల మధ్య ఐక్యత పెంపొందించటం, బ్రిటిష్ పాలిత యావద్దేశంలో సర్వీసుల నిర్వహణ ఒకే రీతిలో ఉండటానికి, ఉభయ పార్లమెంట్లు చేసుకున్న ఒప్పందం ప్రకారంగానీ లేదా ఇదే చట్టాన్ని అనుసరించి నిర్వహించటం గానీ అయి ఉంటుంది.

2. ఇందులో తర్వాత చెప్పబడిన అంశం భారత కౌన్సిల్ ఏలినవారి ఆదేశాలననుసరించి నియమించబడిన ఒక అధ్యక్షునితో నలభై మంది ఇతరులతో ఏర్పడి ఉంటుంది. వారు ఇరవై మంది పాకిస్తాన్‌కూ, ఇరవై మంది హిందూస్తాన్‌కూ ప్రాతినిధ్యం వహిస్తారు.

3. భారత కౌన్సిల్ సభ్యులు ఒక్కొక్కరి విషయంలో పాకిస్తాన్ హిందూస్తాన్ పార్లమెంట్ల దిగువ సభల సభ్యులచే ఎన్నుకోబడతారు.

4. పాకిస్తాన్ లేదా హిందూస్తాన్ శాసనసభ చేయవలసిన మొదటిపని భారత కౌన్సిల్ సభ్యులను ఎన్నుకోవడం.

5. భారత కౌన్సిల్‌కు ఎన్నుకోబడిన ఒక సభ్యుడు తనను ఎన్నుకున్న పాకిస్తాన్ లేదా హిందూస్తాన్ యొక్క శాసనసభలో తన సభ్యత్వం కోల్పోతే తన భారత కౌన్సిల్ సభ్యత్వం కూడా తీరిపోతుంది. కాని ఈ షరతు మీద : పాకిస్తాన్‌లేదా హిందూస్తాన్ యొక్క శాసనసభ రద్దయితే భారత కౌన్సిల్ సభ్యులు కొత్తగా ఎన్నికలు జరిగినంత వరకు కొనసాగి, అందులో మళ్లీ ఎన్నుకోబడకపోతే లేదు భారత కౌన్సిల్ సభ్యత్వం తీరిపోతుంది.

6. భారత కౌన్సిల్ అధ్యక్షుడు తాను హాజరయిన ప్రతి సమావేశానికి అధ్యక్షత వహించి, వచ్చిన ఓట్లు సరిసమానంగా ఉంటేనే తాను ఓటు వేయాలి. లేకుంటే లేదు.

7. అధ్యక్షుడు నియమించిన స్థలంలోనే సమయంలోనే కౌన్సిల్ మొదటి సమావేశం జరపాలి.

8. సమావేశానికి కావల్సిన నిర్దిష్టపూర్వక సంఖ్య (Quorum) పదిహేను. ఆ సంఖ్యకు తక్కువమంది వచ్చినా కౌన్సిల్ పనిచేయవచ్చు.

9. కమిటీలకు అధికారం ఇవ్వటంతో సహా పైన చెప్పిన విధంగా కౌన్సిల్ దాని కార్యక్రమాలను అదే క్రమబద్ధం చేయవచ్చు.

10. పాకిస్తాన్ హిందూస్తాన్ శాసనసభలు ఒకే విధమైన చట్టాలు చేయడం ద్వారా భారత కౌన్సిల్ యొక్క పొందిక ఎప్పటికప్పుడు మారుతూ ఉండవచ్చు. భారతకౌన్సిల్‌సభ్యులందరినీ గానీ, కొందరిని గానీ పార్లమెంట్‌నియోజకవర్గాల నుండి నిర్ణయించటాన్ని, ఏయే నియోజక వర్గాల నుండి ఎంపిక చేయాలో నిర్ణయించటాన్ని ఎంతమంది సభ్యులను వివిధ నియోజకవర్గాల నుండి ఎంపిక చేయించాలో ఏయే పద్ధతిలో ఎంపిక చేయించాలో నిర్ణయించటాన్ని ఈ చట్టాలు తెల్పుతాయి.

VII. 1. పాకిస్తాన్ హిందూస్తాన్ శాసనసభలు ఒకే విధమైన చట్టాల ద్వారా శాసనసభలకు ప్రభుత్వాలకు ఉన్నట్టి అధికారాలేవైనా భారత కౌన్సిల్‌కు ఇవ్వవచ్చు. ఆ విధంగా ఇచ్చిన అధికారాలను కౌన్సిల్ ఎలా వినియోగించాలో కూడా ఆ చట్టాలు నిర్ణయించవచ్చు.

2. నూతన రాజ్యాంగం పనిచేయటం ప్రారంభించిన రోజు నుండి జల, రైలు రహదారులకు సంబంధించిన శాసనాలు చేసే అధికారాలు భారత కౌన్సిల్‌కే చెందుతాయి. పాకిస్తాన్ లేదా హిందూస్తాన్‌కు మాత్రం కాదు. ఎక్కడైనా మొత్తానికి జల, రైలు, రహదారుల నిర్మాణం విస్తరణ మెరుగుపరిచే నిమిత్తం అధికారమిచ్చే శాసనాలను చేయటంలో పాకిస్తాన్ లేదా హిందూస్తాన్ శాసనసభకు ఈ అధికరణలోనిది ఏదీ అడ్డు రాకూడదు.

3. పాకిస్తాన్ హిందూస్తాన్ ఉభయుల సంక్షేమానికి సంబంధించిన ప్రశ్నలేవైనా ఎదురైతే భారత కౌన్సిల్ తీర్మానం ద్వారా తగినట్లు తోచిన సలహాలను ఆ విషయాల్లో ఇవ్వవచ్చు. కాని అలా చేసిన సలహాలకు శాసనపూర్వక ప్రతిపత్తి ఉండదు.

4. భారతదేశమంతటికీ సంబంధించిన ఏ విషయంలోనైనా పాకిస్తాన్ హిందూస్తాన్ లలో వేరువేరుగా చేసే అవసరం లేకుండా కార్యనిర్వహణకై పాకిస్తాన్ హిందూస్తాన్‌లు ఒకే విధమైన చట్టాలను చేస్తూ తనకు అధికారాలు ఇవ్వటం చట్టబద్ధమేనంటూ భారత కౌన్సిల్ సలహా ఇవ్వడం కూడ చట్టబద్ధం కావాలి.

5. భారత కౌన్సిల్‌కు పైన చెప్పినట్లు ఒకే విధమైన చట్టాల క్రింద ఇవ్వబడిన అధికారాలను ఏ ఒక్క శాసనసభ అయినా తోసివేస్తూ ఎప్పుడైనా చట్టం చేస్తే ఆ అధికారాలు భారత కౌన్సిల్ వినియోగించటానికి వీల్లేకుండా పోయి బ్రిటిష్ పాలిత భారత దేశంలో వాటి వాటి పరిధులను బట్టి పాకిస్తాన్ హిందూస్తాన్ శాసనసభలూ వాటి ప్రభుత్వాలూ ఆ అధికారాలను వినియోగించుకోవటమూ భారత కౌన్సిల్ చేతిలో ఉన్న నిధులతో సహా ఆ అధికారాలను బదిలీ చేయటానికి తగిన చర్యలు తీసికోవటమూ చట్టబద్ధం కావాలి.

VIII. 1. అధికరణ IV - (3) సంబోధన ప్రకారం ఒక రాజ్యాంగం బ్రిటిష్ ఇండియాలో పనిచేసి, పది సంవత్సరాలు అయిన తర్వాత రాష్ట్ర కేంద్ర శాసన సభల్లో షెడ్యూల్డు జిల్లాలకు ప్రాతినిధ్యం వహించే ముస్లిం సభ్యులు మెజారిటీతో హిందూస్తాన్ నుండి పాకిస్తాన్‌ను వేరు చేయవల్సిందిగా ఒక దరఖాస్తును బ్రిటిష్ ప్రభువులకు దాఖలు చేస్తే ఏలినవారు ఎన్నికలను ఆదేశించాలి.

2. ఎన్నికల్లో పాల్గొనే వారికి ప్రశ్నలు ఈ రూపంలో ఉండాలి :

ఎ) హిందూస్తాన్ నుండి పాకిస్తాన్ వేర్పాటుకు మీరు సుముఖంగా ఉన్నారా?

బి) హిందూస్తాన్ నుండి పాకిస్తాన్ వేర్పాటుకి మీరు వ్యతిరేకమా?

IX. ఎన్నికల ఫలితం విభజనకు అనుకూలంగా ఉంటే ఆ విషయమై ఒక ఆదేశమండలి ద్వారా నిర్ణయించిన ఒక దినం నుండి పాకిస్తాన్ బ్రిటిష్ ఇండియాలో ఒక భాగంగా ఉండబోదనీ భారత కౌన్సిల్ రద్దయిందనీ ఒక ప్రకటన చేయాలి.

X. 1. అధికరణ IVలో చెప్పిన పరిస్థితిలో రెండు రాజ్యాంగాలు ఉనికిలోకి వచ్చినా, పాకిస్తాన్ ఒక ప్రత్యేక దేశంగా కాక హిందూస్తాన్‌లో ఒక భాగంగానే ఉంటుందని ఒక ఆదేశమండలి ద్వారా ఏలినవారు ప్రకటించడం చట్టబద్ధమవుతుంది. అయితే పాకిస్తాన్‌కు ప్రత్యేక రాజ్యాంగం ప్రారంభమయిన రోజు నుండి పది సంవత్సరాలుగా గతించేవరకు అలాంటి ఆదేశం చేయరాదు.

అధికరణ X-(2) లో పొందుపరచినట్లు పాకిస్తాన్ హిందూస్తాన్‌ల ప్రజాతంత్ర శాసనసభలు రాజ్యాంగ పరమైన చట్టాలు చేస్తేనేగాని అలాంటి ఆదేశం (Declaration) ఇవ్వరాదు.

2. తృతీయ పఠనలో సభ్యులు తిరుగులేని మెజారిటీ అంగీకారంతో ఒకే విధమైన చట్టాలు పాకిస్తాన్ హిందూస్తాన్ శాసనసభలు చేసి (ఇకమీదట రాజ్యాంగ చట్టాలు అని పేర్కొనడం జరుగుతుంది) భారత కౌన్సిల్‌కు బదులు సంయుక్త భారతదేశానికి ఒక శాసనసభను స్థాపించటమూ అందులోని సభ్యుల సంఖ్యను వారిని నియమించే లేదా ఎన్నుకునే విధానమూ; పలువురి సభ్యులను ఎన్నుకోవాల్సిన నియోజకవర్గాలనూ, పలు నియోజకవర్గాల నుండి ఎన్నుకోవాల్సిన సభ్యుల సంఖ్యనూ; నియామకం లేదా ఎన్నిక పద్ధతినీ; ఉన్నట్లయితే రెండు సభ్యుల మధ్య సంబంధాలను నిర్ణయించవచ్చు.

XI. 1. పాకిస్తాన్ హిందూస్తాన్‌లు ఐక్యమయిన తేది నుండి భారత కౌన్సిల్ రద్దయి అది వినియోగించే అధికారాలన్నింటినీ భారత ప్రభుత్వమూ శాసనసభకు బదిలీ చేయాలి.

2. పాకిస్తాన్ హిందూస్తాన్ శాసనసభలకు, వాటి ప్రభుత్వాలకు పన్నులు విధించే అధికారంతో సహా అన్ని అధికారాలు బ్రిటిష్ ఇండియా శాసనసభకు ప్రభుత్వానికి బదలీ కాగా పాకిస్తాన్ హిందూస్తాన్ శాసనసభలు ప్రభుత్వాలూ రద్దు రావాలి.

XII. 1. ఒక శాసనసభలో ఒక సభ్యుని ఎన్నుకోవడానికి ఎన్నికల్లో పాల్గొనేవారు ఏ విధంగా బాలెట్‌పత్రం ద్వారా ఎన్నుకుంటారో వీలై నంతవరకు అదే విధమైన ఎన్నికలు ఈ చట్టం క్రింద జరపబడి వుండాలి. ఎన్నికల నిమిత్తం అనుసరించే శాసనాలు వంటి నియమాలను ఏలినవారు ఆదేశించాలి.

2. ఎన్నికల్లో పాల్గొనే వ్యక్తి ఒక చోట కంటే ఎక్కువ చోట్ల నమోదు చేసుకున్నా, ఎన్నికల్లో ఓసారి కంటే ఎక్కువసార్లు ఓటు వేయరాదు.

3. ఎన్నికల్లో పాల్గొనేవారు అంటే వాయవ్య ప్రాంతం పంజాబు సింధు బెంగాల్ బెలూచిస్తాన్‌లలో నివసించే మైనారిటీ తీరిన స్త్రీ పురుషులు అని అర్థం.

XIII. ఈ చట్టాన్ని భారత రాజ్యాంగ (ప్రాథమిక నిబంధనల) చట్టం, 194 అని పిలవాలి.

ఈ ముసాయిదా చట్టంలో నా నిశ్చితాభిప్రాయాలను పాఠకులు సరిగ్గా అవగాహన చేసుకోవడానికి ఇంతకంటే విస్తారంగా చెప్పవలసిన అవసరం లేదని నేను అనుకుంటున్నాను. క్రిప్స్ ప్రతిపాదనలతో పోల్చటం ద్వారా పార్లమెంటు చట్టాన్ని పొడిగిస్తూ చేసిన ఈ ప్రతిపాదనల యొక్క ముఖ్య లక్షణాలు కొన్నింటిని నేను చెబితే బహుశా లాభదాయకం కావచ్చునేమో.

పాకిస్తాన్ అనే సమస్యను తీర్చకుండా స్వయం పరిపాలనా ప్రతిపత్తి (Dominion status) లేదా స్వాతంత్ర్యాన్ని ప్రదానం చేసే చట్టాన్ని భారతీయులు అడిగినా, బ్రిటిష్ పార్లమెంటు అంగీకరించినా దానివల్ల ప్రయోజనం లేదని నా ఉద్దేశం. పాకిస్తాన్ అనే సమస్యను మొట్టమొదట సమస్యగా పరిగణించి దాన్ని ఏదో విధంగా పరిష్కరించాలి అందుకే ఇక్కడ ప్రతిపాదించిన చట్టాన్ని నేను "భారత ప్రభుత్వ (మొదటి నిబంధనల) చట్టం" అని పేర్కొన్నాను. పాకిస్తాన్ స్వయం నిర్ణయానికి సంబంధించిన విషయం అన్న దాన్ని ప్రజలు అభిమతం ద్వారానే తేల్చాలి. అందుకే ముస్లిములు అధికంగా ఉన్న ప్రదేశాల్లో ముస్లిములు ముస్లిమేతరులు కూడ ఎన్నికలు జరపాలని నేను ప్రతిపాదించేది. విభజనకు మెజారిటీ ముస్లిములు సుముఖతను, మెజారిటీ ముస్లిమేతరులు విముఖతను జూపినట్లయితే ముస్లిములు మెజారిటీలో ఉన్న జిల్లాలను ముస్లిమేతరులు మెజారిటీలో ఉన్న జిల్లాలను గుర్తించి జాతి సంస్కృతులను బట్టి వాటిని వేరుజేస్తూ ప్రాదేశిక సరిహద్దులను తిరిగి గుర్తించాలి. దాని నిమిత్తం ఒక సరిహద్దు కమీషన్ కావాలి. అందుకే ఈ చట్టంలో ఒక సరిహద్దు కమీషన్ ఏర్పాటు గురించి ఉంది. సరిహద్దు కమీషన్ రూపకల్పన అంతర్జాతీయంగా ఉంటేనే నయం.

ముస్లిములకూ ముస్లిమేతరులకూ వేరువేరుగా రిఫరండమ్ జరిపించాలనే పథకం ప్రాథమికమైనవిగా నేను పరిగణించే రెండు సూత్రాల మీద ఆధారపడి ఉంది. మొదటిది ఏమంటే, అధిక సంఖ్యాకుల దౌర్జన్యానికి వ్యతిరేకంగా అల్ప సంఖ్యాకుల రక్షణ కోసం కొన్ని

భద్రతలను కోరవచ్చు. అంతమాత్రాన అంతిమ గమ్యానికి సంబంధించిన సమస్యలపై అధిక సంఖ్యాకులు తీసుకునే నిర్ణయాలను తృణీకరించే హక్కు అల్ప సంఖ్యాకులకు లేదు. ఈ కారణం వల్లనే పాకిస్తాన్ అవతరణ కోసం జరగవల్సిన రిఫరెండమ్‌ను ముస్లిములకే పరిమితం చేశాను. రెండవది ఏమంటే మతరీత్యా అల్పసంఖ్యాకులయిన వారిని తమ ఆదేశాలకు లోబడి ఉండాలని కోరే హక్కు మతరీత్యా అధిక సంఖ్యాకులకు ఉండరాదు. రాజకీయ రీత్యా అధిక సంఖ్యాకులకు మాత్రమే రాజకీయరీత్యా అల్ప సంఖ్యాకులను శాసించటం ఆమోదయోగ్యం కావచ్చు. భారతదేశంలో ఇట్టి సూత్రాన్ని తారుమారు చేసి మతరీత్యా అల్ప సంఖ్యాకులకు భద్రతా సంబంధమైన కొన్ని హక్కుల్నిచ్చి మతరీత్యా అధిక సంఖ్యాకుల ఆధిపత్యం క్రింద ఉంచడం జరిగింది. కాని ఇది సాంఘిక ఆర్థిక రాజకీయపరమైన సాధారణ ప్రశ్నకు సంబంధించినది. మతరీత్యా అధిక సంఖ్యాకులు మతరీత్యా అల్పసంఖ్యాకులను శాసించడం రాజ్యాంగపరమైన లక్షణంతో కూడిన విషయం కాబట్టి దీన్ని ఇప్పుడు అంగీకరించనూ లేదు. ఎప్పుడూ అంగీకరించనూ కూడదు. ఈ కారణం వల్లనే పాకిస్తాన్‌లోనికి వెళతారో లేక హిందూస్తాన్‌లోకి వెళతారో నిర్ణయించుకోవడానికి ముస్లిమేతరులకు విడిగా ఒక రిఫరెండమ్ నేను కల్పించడం జరిగింది.

ప్రాంతాల సరిహద్దులను సరిహద్దు కమీషన్ నిర్ణయించే పని పూర్తి చేసిన తర్వాత అనేకమైన అవకాశాలు సంభవిస్తాయి. ముస్లిములు పాకిస్తాన్ సరిహద్దులు నిర్ణయించడంతోనే ఆగిపోవచ్చు. ఆఖరుగా పాకిస్తాన్ సూత్రప్రాయంగా అంగీకరించబడితే చాలు (అంటే సరిహద్దులు మళ్లీ నిర్ణయించడం అని అర్థం) వారు తృప్తి చెందవచ్చు. కేవలం సరిహద్దులు నిర్ణయించడంతో ముస్లిములు తృప్తి చెందక పాకిస్తాన్ ఏర్పాటు వైపు మొగ్గు జూపితే అప్పుడు రెండే మార్గాలున్నాయి. వెంటనే పాకిస్తాన్ ఏర్పాటు చేయటం లేదా ఉభయులు ఒకే కేంద్ర ప్రభుత్వం క్రింద కొంతకాలం అంటే పది సంవత్సరాలు పాటు అనండి - ఉండటానికి అంగీకరించి ఆ తర్వాత హిందువుల సంగతి విచారణ చేయవచ్చు. అల్ప సంఖ్యాకులు తమను నమ్మవచ్చునని చూపటానికి హిందువులకు ఒక అవకాశం ఉంటుంది. హిందూ రాజ్యమంటూ తమకున్న భయం ఎంతవరకు ఆధారభూతమయిందో ముస్లిములు అనుభవం ద్వారా నేర్చుకోగలరు. ఇక్కడ మరోటి కూడ సాధ్యం కావచ్చు. వెంటనే విడిపోదామనే నిర్ణయం తీసికున్న పాకిస్తాన్ ముస్లిములు కొంతకాలం తర్వాత పాకిస్తాన్‌తో విసుగు చెంది మళ్లీ హిందూస్తాన్‌లో విలీనమై పోయి ఒకే ప్రజగా ఒకే రాజ్యాంగం క్రింద ఉండాలని కోరుకోవచ్చు.

నా దృష్టిలో మరికొన్ని సంభవాలు ఇలా ఉంటాయి. నా ఉద్దేశం ప్రకారం సంభవించే వాటిని ఎలా తీర్చి దిద్దుతామో కాలపరిస్థితులకే విడిచిపెట్టాలి. నాకనిపిస్తున్నదేమంటే మీరు ఉండాలనుకుంటే భారతదేశంలో ఒక భాగంగా ఉండండి కాని ఎన్నడూ వెళ్లిపోతామని అనకూడదు. లేదా వెళ్ళి పోదామనుకుంటే వెళ్లిపొండి కాని తిరిగి రావటానికి వీల్లేదు అని

ముస్లిములతో అనకూడదు. నా పథకంలో రెండు సంభవాలకు తలుపులు తెరచి ఉంచాను. చట్టంలో రెండు సంభవాలకూ ఆస్కారం కల్పించాను. అవి 1) విడిపోయి పది సంవత్సరాలు ఉండిన తర్వాత ఐక్యం కావటం 2) ఐక్యంగా పది సంవత్సరాలు ఉండిన తర్వాత విడిపోవడం. ఈ రెండింటి మీద నాకు గట్టి అభిమానం లేకపోయినప్పటికీ వ్యక్తిగతంగా నేను రెండవ సంభవాన్నే కోరుకుంటాను. పాకిస్తాన్ అంటే ఏమిటో ముస్లిములు అనుభవిస్తేనే మంచిది. పాకిస్తాన్ అంటే ఏమిటో అనుభవమయ్యాక ఐక్యత ఏర్పడితేనే అది తప్పనిసరిగా స్థిరంగా దీర్ఘకాలం నిలుస్తుంది. పాకిస్తాన్ వెంటనే ఉనికిలోకి వస్తే, ఆ వేర్పాటు జటిలంగా, నిశితంగా సంపూర్ణంగా ఉండనవసరం లేదని నాకనిపిస్తుంది. ఒకరికొకరు ఏమీ కానంతదాక, తిరిగి ఐక్యమవటానికి వీలున్నట్లు పాకిస్తాన్ హిందూస్తాన్‌ల మధ్య సజీవ సంబంధాలు నిల్పవలసిన అవసరం ఉంది. అందుకే ఈ చట్టంలో భారత కౌన్సిల్‌ను పరి కల్పించటం జరిగింది. దాన్ని సంయుక్త రాష్ట్రాలుగా పొరబడకూడదు. అవి అవిభాజ్య రాష్ట్రాలు కూడ కాదు. ఒకే రాజ్యాంగం కింద ఐక్యమయేలా పాకిస్తాన్‌ను హిందూస్తాన్‌కు సంధించే పరికరంలా పని చేయటమే దాని ఉద్దేశం గాని మరేమి కాదు.

అదే నా పథకం. అది మతంవారీగా ప్రజాభిప్రాయ సేకరణ మీద ఆధారపడి ఉంటుంది. ఈ పథకం పరిణామశీలి. హిందువుల మనోవైఖరి దానికి వ్యతిరేకమనే నిజాన్ని అది లెక్కలోనికి తీసుకుంటుంది. పాకిస్తాన్ కావాలనే ముస్లిముల కోరిక తాత్కాలిక స్పందనే కావచ్చని కూడ అది గుర్తిస్తుంది. ఈ పథకం విడాకులు కాదు. న్యాయబద్ధమైన వేర్పాటు మాత్రమే. అది హిందువులకు కొంత గడువునిస్తుంది. వారు న్యాయ సమ్మతంగా పరిపాలన సాగిస్తారని నమ్మిక కలిగించడానికే దాన్ని వినియోగించుకోవచ్చు. పాకిస్తాన్ ఎలా ఉంటుందో తెల్సుకోడానికి ముస్లిములకు కూడ అది కొంత గడువునిస్తుంది.

నా ప్రతిపాదనలను సర్‌స్టాఫోర్ట్ క్రిప్స్ ప్రతిపాదనలతో సరిపోల్చవల్సి ఉంటే ఉండవచ్చు. ఈ ప్రతిపాదనలు కథానికలాగా అక్కడక్కడా ఇవ్వబడ్డాయి. 1943 మార్చి 29న జారీ అయిన ముసాయిదా డిక్లరేషన్‌లో ఈ విషయాలు మాత్రమే ఉన్నాయి :

"ఘనత వహించిన ప్రభుత్వం ఇందుమూలంగా ఈ సూత్రాలను రూపొందించింది.

అ) విరోధాలు తొలిగిన వెంటనే భారతదేశానికి ఒక నూతన రాజ్యాంగాన్ని రూపొందించటానికి ఇక మీదట చెప్పిన పద్ధతిలో ఎన్నుకోబడిన ఒక సభను ఏర్పరచటానికి వెంటనే చర్యలు తీసుకోవాలి.

ఆ) రాజ్యాంగ రచనా సభలో భారత రాష్ట్రాలు పాల్గొనటానికి క్రింద చెప్పబడినట్లుగా ఆధారం కల్పించాలి.

2. ఈ విధంగా రూపొందించిన రాజ్యాంగాన్ని ఘనత వహించిన ప్రభువులు వెంటనే అంగీకరించి అమలు చేయటం ఈ షరతులపై తలపెట్టాలి.

అ) బ్రిటిష్ ఇండియాలో ఏ రాష్ట్రం అయినా నూతన రాజ్యాంగాన్ని అంగీకరించక పోతే ఇదివరకటి రాజ్యాంగ పరిస్థితినే కొనసాగించే హక్కు కోసం అటువిమ్మట అంగీకరించటానికి అవకాశం కల్పించబడింది.

అలా కోరుకుని, అంగీకరించని రాష్ట్రాలకు కిందనుదహరించిన పద్ధతి వంటి క్రమంలో రూపొందించిన నూతన రాజ్యాంగానికి సమైక్య భారత రాజ్యాంగానికి ఉన్న అంతస్తునే పూర్తిగా కల్పించి ఘనత వహించిన ప్రభుత్వం అంగీకరించటానికి సిద్ధపడి ఉండాలి."

అంగీకారం అనంగీకారం యొక్క వివరాలు అతని ఆకాశవాణి ప్రకటనలో ఇవ్వబడ్డాయి.. అవి ఈ విధంగా ఉన్నాయి :

"రాజ్యాంగ రచనా సభకు భారతదేశమంతటికీ అంటే బ్రిటిష్ పాలిత భారతదేశం అందులో చేరడానికి నిర్ణయించుకున్న భారత రాజ్యాల (Indian States) తో కలిపి ఒకే రాజ్యాంగాన్ని రూపొందించటమే గమ్యంగా ఉండాలి.

కాని ఈ సాధారణ వాస్తవం మనకు తెలుసు. విరోధ పడటానికి ఒకే ఇంట్లో చేరబడేవారిని ఒప్పించటానికి మీరు ఒకసారి లోపలికి ప్రవేశిస్తే కలిసికట్టుగా ముడిపడి ఉండాలి గాని మళ్లీ బయటపడే మార్గమే ఉండదని నువు చెప్పడం విజ్ఞత కాదు.

లోపల ప్రవేశించమని చెప్పి వాళ్ల ఒక సాధారణ అంగీకారానికి రాకపోయి మరల విడిపోదామని కోరుకుంటే ఏదీ వారిని తప్పించలేదని మరో ద్వారం నుండి బయట పడవచ్చునని చెప్పడం విజ్ఞత అవుతుంది. వాళ్ల అంగీకారానికి రాలేనప్పుడు కావాలంటే బయటపడే తెలివి వారి కుంటే వాళ్లందరూ ఒకేసారి లోపలికి వెళ్లవచ్చు.

సరే ఈ రాష్ట్రాలకు మనం చెప్పేది అదే. రాజ్యాంగాన్ని రూపొందించే శాసనసభా లావాదేవీలు, అంతా అయిన తర్వాత కూడ విభేదాలు జయించలేక కొన్ని రాష్ట్రాలు (Provinces) ఇంకా ఆ రాజ్యాంగంతో తృప్తి చెందక కావాలంటే ఆ రాష్ట్రాలు బయట పడి విడిగా మిగిలిపోయినా వాటికి ఎటువంటి స్వయంపాలనా ప్రభుత్వమూ స్వేచ్ఛా కేంద్రానికి ఉంటాయో – అంటే స్వయం పరిపాలనా ప్రభుత్వం ఆ స్థాయిలోనే ఆ రాష్ట్రాలకు కూడ ఉంటాయి. గనుక సామాన్యమైన ఒకే రాజ్యాంగాన్ని రూపొందించటానికి కలిసి రండి."

ఈ నకలును పూర్తి చేయటానికి మరికొన్ని వివరాలు పత్రికాగోష్టిలో చేర్చబడ్డాయి. రాష్ట్రాల ఐక్యత లేదా విభజన కోసం ఉన్న ప్రణాళికను వివరిస్తూ సర్‌స్టాఫోర్డ్ క్రిప్స్ ఇలా అన్నారు :

"రాజ్యాంగ సభ (Constituent Assembly) కార్యకలాపాల చివర ఒక రాష్ట్రం లేదా రాష్ట్రాలు (Provinces) ఈ నూతన రాజ్యాంగాన్ని అంగీకరించి సమైక్య దేశంలో చేరదల్చుకోలేకపోయినా విడిపోయే స్వేచ్ఛ దానికి లేదా వాటికి ఉంది – కాని ఆ ప్రాంతం

ప్రావిన్షియల్ అసెంబ్లీలో తగినంత ఓట్ల బలంతో (60 శాతానికి తక్కువ కాకుండా అనండి) ఐక్యతకు వ్యతిరేకంగా నిర్ణయం జరిగి వుంటే - విడిపోయే స్వేచ్ఛ దానికి ఉంటుంది. ఓట్ల బలం 60 శాతానికి తక్కువ ఉంటే అల్ప సంఖ్యాకులు ఆ ప్రాంతంలో ప్రజలందరి అభిప్రాయాన్ని తేల్చి చెప్పటానికి ఒక ప్లెబిసైట్(సర్వ జనాభిప్రాయ సేకరణ) అడగవచ్చు. ప్లెబిసైట్ జరిగితే సాధారణ మెజారిటీ కూడ సరిపోతుంది. అంగీకారాన్ని తెలపటం పూర్తి చేయటానికి సంబంధిత ప్రావిన్షియల్ అసెంబ్లీలో ఇరుపక్షాల ఓటర్లు పాల్గొని ఓటు వేసి నిర్ణయించటం అవసరం. కావాలంటే అంగీకరించని ప్రాంతాలు ప్రత్యేక సమైక్య రాష్ట్రాలుగా, ఒక ప్రత్యేక రాజ్యాంగ సభ ద్వారా కలిసి పోవచ్చు. కాని అలాంటి సమైక్యత వాస్తవం కావాలంటే అవి భౌగోళికంగా దగ్గరిగా ఉండాలి."

నా ప్రణాళిక సర్‌స్టాఫోర్ట్ క్రిప్స్ దానికి మధ్య ఉన్న తేడా సువిదితం. ఐక్యత లేదా విభజనకు నిర్ణయించటానికి - మరోలా చెప్పాలంటే పాకిస్తాన్ ఉండాలా లేక వద్దా అని తేల్చడానికి సర్‌స్టాఫోర్ట్ క్రిప్స్ రాష్ట్రాన్ని ప్రమాణంగా తీసుకున్నారు. నేను మతాన్ని నిర్ణీత ప్రమాణంగా తీసుకున్నాను. సర్‌స్టాఫోర్ట్ ఒక తప్పుడు ఆధారాన్ని అనుసరించాడనడంలో నాకు సందేహం లేదు. తగాదా రాష్ట్రాల మధ్య అయితే రాష్ట్రాన్ని ప్రమాణంగా తీసికోవటం సరైనదే. ఉదాహరణకు తగాదా అంశం పన్నులు, నీటి పంపకాలు మొదలయిన వాటికి సంబంధించిన ప్రశ్నలు అయితే ఆ రాష్ట్రం మొత్తానికి లేదా ఆ రాష్ట్రంలో ఒక ప్రత్యేక మెజారిటీ వారికి నిర్ణయించే హక్కు ఉంటుందని ఎవరైనా గ్రహించగలరు. కాని పాకిస్తాన్ గురించి ఈ తగాదా ఒకే ప్రాంతం వారైన రెండు మతవర్గాలు చిక్కుకున్న అంతః మతవర్గాల సమస్య. ఇంకా ఈ తగాదా విషయం ఏమంటే ఉభయ సామాన్యమైన రాజకీయ జీవితంలో సహచారులుగా ఉండటానికి రెండు మతవర్గాల వారు ఒప్పుకున్న షరతుల మీద కాదు. ఈ తగాదా లోతుకు పోయి అసలు ఈ మతవర్గాల వారు సామాన్య రాజకీయ జీవితం కలిసి బ్రతకటానికి సిద్ధంగా ఉన్నారా అనే ప్రశ్నను లేవనెత్తుతుంది. మతవర్గాల విభేదమే దీని సారాంశం. మతవర్గం వారీగా అభిప్రాయ సేకరణ మాత్రమే దీన్ని నిర్ణయించగలదు.

## IV

నేను ప్రతిపాదించే పరిష్కారం కొత్తదని నేను చెప్పుకోవడం లేదు. దానిలో అంతర్లీనంగా ఉన్న ఆలోచనలు మూడు ఆధారాల నుండి గ్రహించబడ్డాయి. అవి హెూరేస్ ప్లంకెట్ అధ్యక్షత వహించిన ఐర్లాండు సమైక్యతా సభ అస్క్విత్ ప్రవేశపెట్టిన హెూమ్‌రూల్ సవరణ బిల్లు, ఐర్లాండు ప్రభుత్వ చట్టం, 1920. పాకిస్తాన్ సమస్యకు నా పరిష్కారం వీటన్నిటిని కలపోయగా ఫలించిన విజ్ఞతే అని తెలుసుకోగలరు. అది అంగీకరించబడగలదా? పాకిస్తాన్ సమస్యను మార్మోగిస్తున్న ఈ తగాదాకు నాల్గు పరిష్కార మార్గాలున్నాయి. మొదటిది బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయాధికారిగా వ్యవహరించాలి. రెండవది హిందువులు

ముస్లిములు అంగీకరించాలి. మూడవది ఒక అంతర్జాతీయ మధ్యవర్తిత్వ సంఘానికి ఈ తగాదాను నివేదించాలి. నాల్గవది ఒక అంతర్యుద్ధం ద్వారా సాధించుకోవటం.

నేటి భారతదేశం రాజకీయ పిచ్చివాళ్ల కొంప అయిపోయినప్పటికీ దేశంలో తగినంతమంది మనోస్థిమితం కలిగిన వాళ్లున్నారు. వాళ్లు అంతర్యుద్ధస్థాయికి విషయాలను దిగజారనివ్వరని నా ఆశ.

రాజకీయ నాయకుల మధ్య ఒక ఒప్పందం కుదిరే అవకాశం ఇప్పట్లో లేదు. భారత జాతీయ కాంగ్రెస్ ఏప్రిల్ 1942లో అలహాబాద్‌లో జరిగిన సమావేశంలో జగత్ నారాయణలాల్ ప్రతిపాదన మీద పాకిస్తాన్ ప్రతిపాదనను విస్మరించాలనే తీర్మానం చేసింది. ఈ సమస్యను పరిష్కరించటానికి రెండే మార్గాలు మిగిలాయి. ఒకటి దానికి సంబంధించిన ప్రజలు, మరొకటి అంతర్జాతీయ మధ్యవర్తిత్వం. ఇది నేను సూచించిన మార్గం. నేను మొదటిదే ఎంచుకుంటాను. అనేక కారణాల వలన ఇదొక్కటే సరైన మార్గమని నాకనిపిస్తుంది. నాయకులు ఈ సమస్యను పరిష్కరించడంలో విఫలమయ్యారు. నిర్ణయం కోసం దాన్ని ప్రజలవద్దకు తీసుకుపోయే సమయమాసన్నమయింది. నిజానికి ఒక భూభాగాన్ని విభజించడం ఒక ప్రభుత్వానికి కట్టుబడి ఉండిన ప్రజల విధేయతను మరో ప్రభుత్వానికి బదిలీ చేయడం వంటి సమస్యను రాజకీయ నాయకులు ఎలా నిర్ణయించగలరో ఆలోచించడానికే కష్టంగా ఉంది. అలాంటివి విజేతలు చేస్తారు. పరాజయం పొందిన ప్రజల

విషయంలో వాళ్లు ఇష్టం వచ్చినట్లు చేయటానికి యుద్ధంలో విజయమే చాలు వాళ్లకి అధికారం ఇస్తుంది. కాని అలాంటి అరాచక పరిస్థితిలో మనం పని చేయడం లేదు. రాజ్యాంగం రీతులను ప్రక్కకు నెట్టే అసాధారణ సమయాలు లేనప్పుడు నియంతల వద్ద ఉండే తొత్తులకున్నంత ప్రభావం రాజకీయ నాయకుల ఆలోచనలకు ఉండదు. అది ప్రజాస్వామ్య పాలనకే విరుద్ధం. రాజకీయ నాయకులను చర్చలు సంప్రదింపుల్లో తగినవారుగా రానివ్వటమే వారి ఆలోచనల కివ్వగలిగిన గొప్ప విలువ. ఇలాంటి విషయంలో ప్రజలే నిర్ణయం తీసుకునే అవసరాన్ని వాళ్లు మార్చనూ లేరు. సర్‌స్టాఫోర్ట్ క్రిప్స్ ఈ దృక్పధాన్నే అంగీకరించాడు. ముస్లింలీగ్ దృక్పథం కూడ పాకిస్తాన్ కావాలనే నిర్ణయించింది. కాబట్టి పాకిస్తాన్ ఏర్పడవల్సిందేనని ఆ దృక్పథాన్ని క్రిప్స్ ప్రతిపాదనలో నిక్కచ్చిగా ఖండించారు. పాకిస్తాన్ అన్నది ఆలోచించదగిన విషయంగా ముస్లింలీగ్‌కు ఒక ప్రతిపాదన చేసే హక్కు వరకు మాత్రమే క్రిప్స్ ప్రతిపాదనలు గుర్తించాయి. అంతేగాని నిర్ణయించే హక్కు దానికి ఇవ్వబడలేదు. పైగా కాంగ్రెస్ వంటి జాతీయ సంస్థకు మెజారిటీ ప్రజల దృఢమైన సమ్మతి

ఆ తీర్మానం : "జాతీయ కాంగ్రెస్ కమిటీ ఉద్దేశంలో ఇండియన్ యూనియన్ లేక సమాఖ్యలో అంతర్భాగంగా ఉన్న ఒక రాష్ట్రానికి గానీ భౌగోళిక ప్రాంతానికి గానీ స్వేచ్ఛనిస్తూ దేశ ఐక్యతను విచ్ఛిన్నం చేసే ప్రతిపాదన రాష్ట్రాలు ప్రాంతాలు మొత్తం దేశ ప్రజలందరి శ్రేయస్సుకూ పెద్ద విఘాతం కలిగిస్తుంది గాన అట్టి ప్రతిపాదనను కాంగ్రెసు అంగీకరించలేదు."

లేకుండా పాకిస్తాన్ విషయంలో అంత తొందర పాటుగా ప్రభావితం కావడం ఈ సమస్యను పరిష్కారానికి నడిపించదు.

గాంధీజీ, రాజగోపాలాచారి అంగీకరించినా అఖిల భారత కాంగ్రెస్ కమిటీ పాకిస్తాన్‌ను అంగీకరిస్తూ తీర్మానించినా, పంజాబు బెంగాలులలో హిందువులు వ్యతిరేకిస్తే దాని వల్ల ప్రయోజనమేముంటుంది? నిజానికి చెప్పవలసి వస్తే 'పాకిస్తాన్ ఉండి తీరాలి' అని చెప్పడం బొంబాయి లేదా మద్రాసు ప్రజల పని కాదు. ఆ ప్రాంతాల్లో నివసించే ప్రజలెవరైతే హింసాత్మకమూ విప్లవపరమూ అయిన ఆర్థిక రాజకీయ పరిణామాలతో కూడిన ఏ మార్పులతో వారి అదృష్టమూ జీవితమూ సన్నిహితంగా అనేక సంవత్సరాలుగా ముడిపడి ఉన్నాయో అట్టి వారికే దాన్ని వదలివేయాలి. రాష్ట్రాల్లో ఉన్న ప్రజల సర్వజనాభిప్రాయ సేకరణ ఒక్కటే పాకిస్తాన్ సమస్య పరిష్కారానికి అత్యంత శ్రేయస్కరం. అత్యుత్తమ రాజ్యాంగ మార్గం అని నాకనిపిస్తుంది.

పాకిస్తాన్ సమస్యకు సర్వ జనాభిప్రాయ సేకరణతో పరిష్కరించటం ఎంత ఆకర్షణీయంగా ఉన్నా, దానికి సంబంధించిన ప్రజలందరూ సుముఖత చూపరేమోనన్న భయం నాకుంది. ఆఖరుకి ముస్లింలీగుకు కూడా దానిమీద కుతూహలం ఉండవకపోవచ్చు. ఆకర్షణీయమైన మరో పరిష్కారం ఉండటం కూడ వాస్తవమే. తన సర్వాధికారాన్ని ప్రయోగిస్తూ బ్రిటిష్ ప్రభుత్వమే పాకిస్తాన్‌ను ఏర్పరచాలన్నదే వారి పిలుపు. రిఫరెండమ్‌కు బదులు ఈ పరిష్కారాన్నే వాళ్లెందుకు కోరుకుంటున్నారంటే ఈ పరిష్కారం సామాన్యమైనదీ రిఫరెండెమ్‌లాగా దీర్ఘమైన పద్ధతులూ అవకతవకలూ లేనట్టిది కాబట్టి. కాని అలా కోరుకోడానికి మరో ఆస్కారమేమంటే గతంలో అలాంటి ఉదంతం ఉండటమే. అదే ఐర్లాండు ఉదంతం. గతంలో బ్రిటిష్ ప్రభుత్వం తనకున్న సర్వాధికారం వల్ల ఐర్లాండును విభజించి అల్‌స్టర్‌ను సృష్టించినపుడు, ఇండియాను విభజించి పాకిస్తాన్‌ను ఎందుకు ఏర్పరచలేదు?

ప్రపంచంలో అన్నిటికంటే అత్యధికమైన సర్వసత్తాకాధికారం గల శాసనసభ బ్రిటిష్ పార్లమెంటు. డిలాహోమ్ అనే ఫ్రెంచి రచయిత ఇంగ్లీష్ రాజ్యాంగం గురించి స్త్రీని పురుషునిగా పురుషుని స్త్రీగా మార్చటం తప్ప బ్రిటిష్ రాజ్యాంగం చేయలేనిదంటూ ఏమీ లేదని అంటారు. పాలిత ప్రాంతాలు వ్యవహారాల మీద బ్రిటిష్ పార్లమెంటు సర్వసత్తాకాధికారాన్ని వెస్ట్ మినిస్టర్ శాసనం పరిమితం చేసినప్పటికీ భారతదేశం సంబంధించి నంతవరకు అది అపరిమితంగానే ఉంది. ఐర్లాండు విషయంలో చేసినట్లు భారతదేశాన్ని విభజించటానికి పూనుకుంటే బ్రిటిష్ పార్లమెంటుకు చట్టరీత్యా తప్పించగలదేదీ లేదు. అలా చేయగలదుగాని చేస్తుందా? ప్రశ్న అధికారం కాదు గాని అభిమతం.

ఐర్లాండు ఉదంతాన్ని అనుసరించమనే వారు ఐర్లాండు విభజనకు బ్రిటిష్ ప్రభుత్వాన్ని నడిపించిందేమిటీ అని అడగాలి. బ్రిటిష్ ప్రభుత్వం చిత్తానుసారంగా చేసిందా లేక పరిస్థితుల

ప్రోద్బలానికి లొంగిపోయా? ఐర్లాండు హోమ్‌రూల్ గురించి చదివే విద్యార్థి ఐర్లాండు విభజన చిత్తానుసారం కాదు పరిస్థితుల పోద్బలం వల్లనే జారీ చేయబడిందనే అనక తప్పదు. ఐర్లాండు తగాదాలో ఏ పక్షంవారూ ఐర్లాండును విభజించమని కోరలేదనేది చాలావరకు క్షుణ్ణంగా అర్థం చేసికోలేదు. అల్‌స్టర్ నాయకుడైన కార్సన్ కూడా అలా అనలేదు. కార్సన్ హోమ్‌రూల్‌కు వ్యతిరేకంగా ఉన్నాడేగాని విభజనకు సుముఖంగా కాదు. హోమ్‌రూల్‌ను వ్యతిరేకించి ఐర్లాండు సమైక్యతను కాపాడుటమే అతని పట్టుదల. హోమ్‌రూల్ విధించటానికి వ్యతిరేకంగా మరోలా రక్షణ కోసమే అతడు విభజన కావాలన్నాడు. దిగువ సభ లోపల బయట అతని ఉపన్యాసాల నుండి ఈ విషయం తేటతెల్లమవుతుంది. మరోవైపు అస్క్విత్ ప్రభుత్వం కూడ విభజనకు వ్యతిరేకంగా ఉంది. ఇది ఐర్లాండు హోమ్‌రూల్ బిల్లు (1912) మీద దిగువ సభలో జరిగిన కార్యకలాపాల నుండి చూడవచ్చు. ఆ బిల్లు నుండి అల్‌స్టర్‌ను మినహాయించాలంటూ కమిటీ స్థాయిలో ఆరల్ రాబర్ట్స్ ఒకసారి మళ్ళీ తృతీయ అధ్యయనంలో స్వయంగా కార్సన్ రెండుసార్లు సవరణలు ప్రవేశపెట్టారు. రెండుసార్లు కూడ ప్రభుత్వం వ్యతిరేకించగా ఆ సవరణలు పడిపోయాయి.

ఐర్లాండు ప్రభుత్వ చట్టం (1920) ద్వారా శాశ్వతంగా ఐర్లాండు విభజన్ని లాయ్డ్ జార్జ్ అమలులోకి తెచ్చాడు. అప్పుడే ఐర్లాండు విభజన గురించి మొదటిసారిగా అనుకోవడం జరిగిందనీ అది కూడా లాయ్డ్ జార్జ్ నామమాత్ర నాయకత్వం క్రింద ఉన్న కన్సర్వేటివ్ యూనియనిస్టుల మిశ్రమ ప్రభుత్వం రుద్దటం వల్ల జరిగిందని చాలామంది అనుకున్నారు. మిశ్రమ ప్రభుత్వంలో ఆధిక్యతలో ఉన్న పక్షం వారి ప్రభావానికి లాయ్డ్ జార్జ్ లొంబడటం నిజమే కావచ్చు. కాని విభజన అన్నది 1920లో మొదటిసారిగా అనుకోవడం అన్నది నిజం కాదు. లేదా లిబరల్ పార్టీలో మార్పు రాకపోవటం వల్ల విభజనే సాధ్యమైన పరిష్కారంగా అంగీకరించిందనటం కూడ నిజం కాదు. వాస్తవానికి అస్క్విత్ ప్రభుత్వమయిన కేవలం లిబరల్ పార్టీ ప్రభుత్వం అధికారంలో ఉండగా లాయ్డ్ జార్జ్ చట్టానికి ఆరు సంవత్సరాలు ముందుగానే 1914లో విభజన అన్నది ఒక పరిష్కారంగా వచ్చింది. అస్ క్విత్ లిబరల్ పార్టీ ప్రభుత్వ ధోరణిలో మార్పుకు కారణాలేమిటి అని పరీక్షిస్తేనే తప్ప ఐర్లాండు విభజనకు అసలు కారణం అర్థం కాదు. నేను అనుకునేది ఖచ్చితంగా "కుర్రే (Currah) సంఘటన" గా ప్రస్తావించబడే 1914 మార్చిలో జరిగిన సైనిక సంక్షోభమే. లిబరల్ ప్రభుత్వం దృక్పథంలో మార్పుకు దారి తీసిందని "కుర్రే సంఘటన" అంటే ఏమిటో అస్క్విత్ ప్రభుత్వపు విధానంలో ఒక మార్పును తీసికు రావటంలో అది ఎంత బలంగా పని చేసిందో సరిగ్గా వివరించటానికి కొద్ది వివరాలు మాత్రం చాలు. ఐర్లాండు హోమ్‌రూల్ బిల్లు : 1913 చివరి నాటికి పొందిన దశలతో ప్రారంభిస్తే అనుకూలంగా ఉంటుంది. సాధారణ ఎన్నికలు జరగనంతవరకు ఈ చట్టాన్ని అమలు చేయనని ఒక లిఖిత పూర్వక వాగ్దానం చేసి కూడా జనామోదం లేకుండానే అస్క్విత్ ముందుకు సాగుతున్నారని అతన్ని నిలదీయడం కూడ

జరిగింది. ప్రపంచ యుద్ధం ముందుగా వచ్చి ఉండకపోతే అనుకున్నట్టు 1915లో సాధారణ ఎన్నికలు జరిగి ఉండేవి. కాని అల్‌స్టర్ ప్రజలు సాధారణ ఎన్నికల కోసం ఎదురు చూడకుండానే హోమ్‌రూల్‌ని వ్యతిరేకించటానికి పకడ్బందీగా చర్యలు తీసుకున్నారు. ఉద్యమ చర్యల్లో వాళ్ళెపుడూ వెనుకబడలేదు. చక్రవర్తికి విధేయులుగా ఉండనీయకుండా తప్పిస్తున్నందుకే ప్రభుత్వంతో పోరాడుతున్నామనే కుంటిసాకు. ఎవరూ చెప్పలేనంత సిగ్గులేని అసభ్యకరమైన చర్యలకు దిగారు. హోమ్‌రూల్‌ను పడగొట్టటానికి మేగినాట్ లైన్ అనే పథకమ్మీద అల్‌స్టర్ ప్రజలు ఎల్లప్పుడూ ఆధారపడ్డారు. అదే ఎగువసభ కాని పార్లమెంటు చట్టం (1911) వల్ల ఎగువసభ బలంగా ఎత్తుగా లేని ఒక పడిపోతున్న గోడలాగా ఆధారపడటానికి వీలులేక క్షీణించిన ఒక రక్షణాక్షేత్రంగా మాత్రం ఉంది. ఎగువసభ ఆమోదించకపోయినా ఆ బిల్లు ఆమోదించబడగలదని వచ్చే ఎన్నికల్లో అస్క్విత్ గెలుపొందవచ్చునని తెలిసే నిరాశతో అల్‌స్టర్ ప్రజలు మరో రక్షణ పథకాన్ని వెతకనారంభించారు. దాన్నే పదాతిదళంలో కనుగొన్నారు. ఆ పథకం రెండు విధాలుగా ఉంది. వార్షిక పదాతిదళ చట్టాన్ని ఎగువసభ వారి గుప్పిట్లో ఉన్నట్లు చేస్తే అల్‌స్టర్ ప్రజలను ఎదిరించే పదాతిదళమే ఉండదన్నదే ఆ పథకంలో ఒక భాగము. ఐర్లాండులో హోమ్‌రూల్‌ని బలవంతంగా విధించటానికి ప్రభుత్వం పదాతిదళాన్ని ఉపయోగించవచ్చుననే ఆలోచనలతో పదాతిదళాన్ని ప్రభుత్వం పట్ల విధేయతా రహితంగా తయారు చేయటానికి హోమ్‌రూల్ తప్పక హోమ్‌రూలే అవుతుం దంటూ ప్రచారాన్ని పదాతిదళంలో విస్తరింపజేయటం. వారు తేలిగ్గా విజయం సాధించారు కాబట్టి మొదటిది అనవసరమైంది. మార్చి 1914లో జరిగిన కుర్రే సంఘటన జరిగినప్పుడే అది తేటతెల్లమయింది. ఐర్లాండులో కొన్ని సైనిక శిబిరాలపై యూనియనిస్ట్ వాలంటీర్లు దాడి చేయవచ్చునని అనుమానించటంలో ప్రభుత్వానికి కొన్ని ఆధారాలున్నాయి. అలాంటి సైనిక శిబిరాల భద్రత కోసం చర్యలు తీసుకోవల్సిందిగా ఐర్లాండు సర్వ సైన్యాధ్యక్షుడు సర్ ఆర్థర్ పెగెట్‌కు మార్చి 20వ తేదీన ఉత్తర్వులు పంపబడ్డాయి. దానికి సమాధానంగా సైనికాధికారులు ఉత్తర్వులను శిరసావహించటానికి సిద్ధంగా లేరని వారి స్థావరాల నుండి వెను తిరిగిపోతున్నారని సైనికులు ముందుకు కదలరన్న భయం కలుగుతుందంటూ ఒక టెలిగ్రాంను పంపారు. జనరల్ సర్ హ్యూబర్ట్ ఘౌ అల్‌స్టర్ యూనియనిస్టులకు వ్యతిరేకంగా పని చేయటాన్ని తిరస్కరిస్తే ఇతరులు కూడా దాన్నే ఉదాహరణగా అనుసరించారు. సైన్యంలో రాజకీయాలే కాదు పక్షపాతం కూడ బయలు దేరిందని ప్రభుత్వం తెలుసుకుంది. విజ్ఞత వీరత్వ ప్రధానాంశమనే ప్రసిద్ధ సామెత చెప్పినట్లు ఆందోళనతో విభజనకు అనుకూలంగా చర్య తీసికోవటానికి నిర్ణయం జరిగింది. అస్క్విత్ ధోరణిలో ఏ మార్పు కలిగిందో అది చిత్తానుసారం గాక తిరుగుబాటు సైనిక దళాల ఆందోళన వల్లనే కలిగింది. అది ఎంత భారమైన ఆందోళన అంటే ఆ తర్వాత పదాతిదళాన్ని విభజించకుండా హోమ్‌రూల్‌ని విధించటానికి ఎవరూ సాహసించలేకపోయారు.

ఘనత వహించిన ప్రభుత్వం ఐర్లాండులో ఏమి జరిగిందో దాన్నే భారతదేశంలో పునరావృతం చేయగలదా? ఈ ప్రశ్నకు నేను సమాధానం ఇవ్వలేకున్నాను. కాని రెండు విషయాలు మాత్రం నేను చెబుతాను.

మొదటిది ఐర్లాండు విభజన పరిణామాలు ఏమిటో ఏలినవారి ప్రభుత్వానికి పూర్తిగా తెలుసు. స్వతంత్ర ఐర్లాండు దేశం బ్రిటిష్ సామ్రాజ్యానికి తిరుగులేని బద్ధ శత్రువయింది. ఈ శత్రుత్వానికి అంతులేదు. విభజన ఒక ఊహ మాత్రం గాక ఒక వాస్తవంగా రూపాంతరం చెందితేనే తప్ప ఈ విభజన వల్ల కలిగిన గాయం ఎప్పటికీ మాసిపోదు ఐర్లాండు విభజన నైతికంగా సమర్థించటానికి వీలులేదని చెప్పకతప్పదు. అంతేగాక అది ప్రజాభిమతాన్ని అనుసరించి గాక అధికార ప్రోద్బలం వలనే కలిగిందని ఒనక తప్పదు.

ఈ విషయంలో Life of Field Marshal Sir Henry Wilson by Major General Sir C.E. Callwell, Vol. 1, Chapter IX ఇంకా Parliamentary debates (House of Lords), 1914, Vol. 15 PP 998 - 1017 on Ulster and the Army ను కూడా చూడండి. కుర్రే సంఘటనకు చాలా ముందుగానే అల్‌స్టరీయులు సైన్యాన్ని జయించారని దీనివలన తెలుస్తుంది. అస్క్విత్ 1913లోనే హోమ్‌రూల్ బిల్లు నుండి అల్‌స్టర్‌ను ఆరు సంవత్సరాలు పాటు మినహాయించాలనే నిర్ణయం తీసుకున్నట్లు అందుకు కారణం సైన్యం అల్‌స్టర్ పక్షాన ఉండటం వలన హోమ్‌రూల్ విధించలేరని కూడ తెలుస్తుంది.

ఆ దురాగతం మేక్‌బెత్ డంకన్‌ను ఖూనీ చేసినంతటి తీవ్రమైంది. శ్రీమతి మేక్‌బెత్ మీద రక్తపు మరకలు ఎంత ఘాటుగా ఉన్నాయంటే "అరేబియా సుగంధ ద్రవ్యాలన్నీ" వాటిని క్షాళనం చేయలేకపోయాయని ఆమె అన్నట్లు ఘనత వహించిన ప్రభుత్వం మీద పడిన మరకలు అంత ఘాటుగానూ ఉండిపోయాయి. పాస్తీనాలో ఆరబ్ యూదుల సమస్యపై తమ పద్ధతి తేటతెల్లం చేసినట్లు ఘనత వహించిన ప్రభుత్వానికి మరో విభజనకు బాధ్యత వహించటం ఇష్టం లేదని తెలుస్తుంది. పరిశీలనకు కమీషన్‌ను అది ఏర్పాటు చేసింది. జటిలమైన ఈ సమస్యకు ఇదే ఆశాజనకమైన పరిష్కారమని ప్రభుత్వం సూత్రప్రాయంగా అంగీకరించింది. కాని అరబ్బుల మీద అటువంటి బలవంతపు పరిష్కారాన్ని రుద్దితే సమస్య మరింత ముప్పుకు దారి తీస్తుందని ప్రభుత్వం ఆకస్మికంగా గుర్తించి వుడ్ హెడ్ (wood head) కమీషన్‌గా పిలువబడే మరో రాయల్ కమీషన్‌ను నియమించింది. ఆ కమీషన్ విభజనను ఖండించి ఆ భయంకర పరిస్థితి నుండి బయట పడాలని ఆతృతగా ఉన్న ప్రభుత్వానికి ఒక సులభ మార్గాన్ని తెరిపించింది. ఐర్లాండు విభజన అనుసరించదగిన ఉదంతం కాదు. ముందు జాగ్రత్తను సూచిస్తుంది. కాని అది ఒక ఉదాహరణగా తగదు. ముస్లింలీగ్ ప్రోద్బలం వల్ల ఘనత

---

పార్లమెంటరీ డిబేట్స్ కామన్స్ 1938-39 Vol. 31, P.P. 1987-2107 మరియు (Lords) 1936-37, Vol 106. PP 599-674

వహించిన ప్రభుత్వం తనంతటతాను భారతదేశాన్ని విభజిస్తుందంటే నాకు చాలా సందేహముంది.

ఇకపోతే ఏలినవారి ప్రభుత్వం ముస్లింలీగ్‌కు ఎందుకు కట్టుబడి ఉంటుంది? అల్‌స్టర్ విషయంలో రక్త సంబంధాన్ని బట్టి బ్రిటిష రాజకీయ వాదుల్లో ఒక వర్గంవారు అల్‌స్టర్ పక్షాన ఉన్నారు. అటువంటి రక్తసంబంధాన్ని బట్టే లార్డ్ కర్జన్ ఇలా అన్నారు. ("ఉన్న భర్తకు విడాకులిమ్మంటూ నమ్మకం పోగొట్టుకున్న అల్‌స్టర్‌ను మీరే ప్రోద్బలం చేస్తున్నారు. పైగా ఎవరితో జీవించటం ఆమెకు ఇష్టంలేదో, ఎవరిని ఆమె స్నేహపూర్వకంగా ఇష్టపడదో అలాంటి మరో ఏలినవారి ప్రభుత్వానికి ముస్లింలీగ్‌కు మధ్య అటువంటి బాంధవ్యం లేదు. ఘనత వహించిన ప్రభుత్వం తన పక్షాన ఉంటుందని ముస్లింలీగ్ ఆశించడం నిరర్థకమౌతుంది.

నేను చెప్పదల్చిన మరో విషయమేమంటే ఘనత వహించిన ప్రభువుల ప్రభుత్వాధికార ప్రయోగం వల్ల తాము ఆశించిన భారత విభజనను అందుకోవాలనుకోవడం ముస్లింలీగ్‌కు శ్రేయోదాయకం కాదు. నా తీర్పులో విభజనాంతరం పాకిస్తాన్ హిందూస్తాన్‌లు పరస్పర సుహృద్భావంతో దురాలోచన లేకుండా రెండు మిత్ర దేశాలుగా కొనసాగాలనుకోవడమే గమ్యంగా ఉంటే పాకిస్తాన్‌ను సాధించడం కన్నా పాకిస్తాన్ అవతరణకు అనుసరించదగిన పద్ధతే అతి ముఖ్యమైంది.

ఈ కోరిక సిద్ధించటానికి అన్నిటికన్నా విశేషమైన పద్ధతి ఏమిటి ? ఆ విధానమెలా ఉండాలంటే అందులో ఒక మతవర్గానికి విజయమూ మరొకరికి పరాభవమూ ఉండకూడదనిదైతే, అది ప్రతి ఒక్కరికీ ఆమోదయోగ్యంగా ఉండగలదు. ఆ పద్ధతి ఇరుపక్షాలకు గౌరవప్రదమైన ఒప్పందంగా ఉండాలి. ఈ గమ్యం చేరడానికి సర్వజనాభిప్రాయ సేకరణతో కూడిన నిర్ణయం కంటే విశేషంగా కుదిరే పరిష్కారం మరొకటుందేమో నాకు తెలీదు. ఏది విశేష విధానమో నేను సలహా ఇచ్చాను. ఇతరులు కూడ వారి సలహాలతో ముందుకు రాగలరు. అన్నిటికంటే నా సలహాయే విశేషమైనదని నేను చెప్పలేను. సలహా ఏదైనప్పటికీ అది పరిష్కారాన్ని అర్థవంతంగా బాధ్యతాయుతంగా తీర్చిదిద్ద గలిగేదిగా ఉండాలి. లేకుంటే ఈ సమస్య చీము పట్టిన కురుపులాగే మిగిలిపోతుంది.

# ఉపసంహారం

ఇక్కడితో నేను ఆపాలనుకున్నాను. ఈ అంశం మీద నేను చెప్పగలిగిందంతా చెప్పాననుకుంటా. న్యాయశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే వాదోపవాదాలను నేను సాగించాను. తగినంత దీర్ఘంగా దాన్ని నేను సాగించానని చెప్పుకోగలను. అలా చేయడంలో ఇరువైపుల న్యాయవాదులూ ఒకరితో నొకరు వాదప్రతివాదనలు చేయడం ప్రశ్నపై ప్రశ్నలు కురిపించడం ఖండన విమర్శలు చేసికోవడం వంటి ధోరణిలో విక్టోరియన్ కాలంనాటి న్యాయవాదులకు ప్రీతిపాత్రమైన దీర్ఘ పదజాలంతో కూడిన శైలిని నేను అనుసరించాను. పాకిస్తాన్‌కు ప్రత్యానుకూలతలతో కూడిన వాదోపవాదాలు పూర్తిగా ప్రకటించబడటానికి నేను కావాలనే ఇలా చేశాను. ముందు పేజీల్లో వాద ప్రతివాదాలున్నాయి. అందులో ఉన్న వాస్తవాలను నేను సరిగ్గా గుర్తించి నమ్మిన విషయం నిజం. నాకు తోచినవి కూడ ఇందులో చెప్పాను. ఇప్పుడు హిందువులు ముస్లిములు వారికి తోచిన విధంగా వారు చెప్పాలి.

అసలు విషయాలను క్రమబద్ధంగా ప్రస్తావిస్తే కర్తవ్య నిర్వహణలో వారికి సాయపడగలవు.

1. భారతదేశ రాజకీయ ప్రగతికి హిందూ ముస్లిం ఐక్యత అవసరమా? అవసరమైతే రెండు వేరు వేరు దేశాలు కావాలన్న హిందూ ముస్లిముల ఆదర్శాన్ని కాదని దాన్ని సాధించడం సాధ్యమా?

2. హిందూ ముస్లిం ఐక్యత సాధ్యమైతే దాన్ని ఒప్పించడం ద్వారా లేక తగువు తీర్చడం ద్వారా సాధించడమా?

3. ఒప్పించడం ద్వారా అయితే ముస్లిముల శ్రేయస్సుకు భంగం రాకుండా వారి మనస్ఫూర్తి సహకారాన్ని పొందేలా ఎటువంటి కొత్త సదుపాయాలు వారికి అందించగలం?

4. తగువు తీర్చడం ద్వారా అయితే ఆ సెటిల్‌మెంటు పరిధులు ఏమిటి? అందు రెండే పద్ధతులుంటే అ) భారతదేశాన్ని హిందూస్తాన్ పాకిస్తాన్‌లుగా విభజించడం లేదా ఆ) శాసనసభలోనూ ప్రభుత్వ సర్వీసుల్లోనూ చెరో ఏభై చొప్పున వాటా లేసికోవడం. అంటే ఈ రెండింటిలో కావాలనుకున్నది ఏదో ఒకటి.

5. భారతదేశం అవిభాజ్యమైన ఒకే దేశంగా ఉంటే బ్రిటిష్ వారి నుండి సాధించుకున్న స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోవటానికి హిందూ ముస్లిముల మీద ఆధారపడగలదా?

6. హిందూ ముస్లిముల మధ్య ప్రబలిన పరస్పర వైరుధ్యాన్ని విడదీయబడ్డ రెండు విభిన్న దేశాలు అనే కొత్త సిద్ధాంతాన్నీ చివరికి వారు ఊహించుకుంటున్న గమ్యాలే వ్యతిరేకమైనవని వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకుని చూస్తే ఆటంకపరచకుండా పనిచేయ నిస్తారనడానికి తగు ఆశాజనకమైన ఒకే రాజ్యాంగం రూపొందగలదా?

7. రెండు దేశాలు అనే సిద్ధాంతం స్తంభించిపోయిందనే అనుకుంటే భారతదేశం ఒక సమైక్యదేశంగా ఉండగలదా? భావైక్యరహితంగా తగిన మత సామరస్యత ఒకే గమ్యం మీద గురి లోపించటం వల్ల ఐక్యతతో శక్తివంతమైన దేశంగా పెరగలేక బ్రిటిష్ వారు లేదా వేరేదైనా విదేశం తేలిగ్గా దాస్య బంధంలో ఉంచదగునట్టిదిగా నీరసించిన రోగిష్టి దేశంలా ఉండక తప్పుతుందా?

8. భారత దేశం ఒక సమైక్యదేశం కాలేకపోతే, సామరస్య హీనమైన దాన్ని శాంతిపూర్వకంగా స్వభావసిద్ధమైన భాగాలుగా అంటే పాకిస్తాన్ హిందూస్తాన్‌లుగా విడదీయటానికి భారతీయులంతా సహకరించటం మంచిది కాదా?

9. ముస్లిం దేశం పాకిస్తాన్‌గాను హిందూదేశం హిందూస్తాన్‌గాను రెండు స్వతంత్రమైన విభిన్న దేశాలుగా వృద్ధి చెందటాన్ని ప్రోత్సహించటం మంచిది కాదంటే అప్పుడు భారతదేశాన్ని ఒక అవిభాజ్య దేశంగా నిలపటానికి వ్యర్థ ప్రయత్నం చేసి హిందువులు ముస్లిములు ఏదో ఒకరోజున ఒకే దేశ సభ్యులుగా ఒకే మాతృభూమి బిడ్డలుగా దానిలో మనగలుగుతారంటూ తప్పుడు ఆశలు పెంచుకుంటారా?

ఈ సమస్యలను చేతబట్టుకుని ఒక భారతీయుడు నిలబడటాన్ని ఏదీ తప్పించలేదు. పై పుటల్లో వున్న వాస్తవాల సహాయంతో ఒక భారతీయుడు తన సొంత నిర్ణయాలకు రాక తప్పదు. కాని మూడు విషయాలు మాత్రం మినహాయించాలి. అవి ఏవంటే 1) చారిత్రాత్మక దేశభక్తి అనే తప్పుడు ధోరణి 2) భూభాగంపై మినహాయింపు లేని ఆధిపత్యం అనే తప్పుడు అవగాహన 3) ఒకరు తన గురించి తాను ఆలోచించటానికి సిద్ధంగా లేకపోవటం అనేది. ఈ ఆటంకాల్లో ఆఖరుది తప్పించుకోవటం చాలా కష్టం. దురదృష్టవశాత్తు భారతదేశంలో

ఆలోచన అరుదు. ఇక ఆలోచించే స్వేచ్ఛ ఇంకా అరుదు. ప్రత్యేకంగా హిందువుల విషయంలో ఇది వాస్తవం. అందుకే ఈ పుస్తకంలోని వాదంలో అధిక భాగం వారి నుద్దేశించే చెప్పబడింది.అందుకు కారణాలు కనిపిస్తూనే ఉన్నాయి. హిందువులు అధిక సంఖ్యలో ఉన్నారు. అధిక సంఖ్యలో వున్నారు కాబట్టి వారి అభిప్రాయమే ముందు లెఖ్ఖలోనికి రావాలి. హేతుబద్ధమో లేక సంకుచిత్వంతో కూడినవో వాళ్ల అభ్యంతరాలకు బదులు చెప్పటానికి ప్రయత్నించకుండా శాంతిపూర్వక పరిష్కారం ఏమంత సాధ్యం కాదు. ఇతరులకు తేలిగ్గా అవగతం కాకపోయినా నా వాదంలో అధికభాగం వారినుద్దేశించి చెప్పడానికి నన్ను ప్రేరేపించిన కొన్ని ప్రత్యేక కారణాలున్నాయి. నా ఉద్దేశంలో సహచరులకు తమ గమ్యాలకు తోవ చూపే హిందువులే కార్లాయిల్ అన్నట్టు 'కళ్లు' పోగొట్టుకొని వ్యర్థభ్రమల ఆకర్షణలో నడుస్తూ ఉన్నారు. నాకు భయం కలుగుతూ ఉంది. ఎందుకంటే దాని పరిణామాలు హిందువుల పాలిట భయంకరమైనవి. హిందువులు కాంగ్రెసు చేతుల్లో వున్నారు. కాంగ్రెసు గాంధీజీ చేతుల్లో ఉంది. గాంధీజీ కాంగ్రెసుకు సరైన నాయకత్వం ఇచ్చారన్నది చెప్పలేనిది. గాంధీజీ ఈ సమస్యను ఎదుర్కొనకుండా తప్పించుకోవాలనే తొలుత రెండు వాదాలను ఆశ్రయించారు. భారతదేశాన్ని విభజించటం నైతికంగా తప్పు కనుక ఆ పాపంలో నేనెన్నడూ పాలు పంచుకోలేనంటూ ఆయన ప్రారంభించారు. ఇదొక విడ్డూరమైన వాదన. ప్రకృతి సిద్ధమైన చారిత్రాత్మక శక్తుల పరిధుల నుండి జాతీయ శక్తులు పరిధిల్లోనికి సరిహద్దులు మార్పు చెందటమో లేదో విభజన అన్నది ఒక్క భారతదేశం మాత్రమే ఎదుర్కొన్న సమస్య కాదు. పోలెండు మూడుసార్లు విభజించబడింది. ఇకమీదట కూడ పోలెండు విభజించబడకుండా ఉంటుందనేది ఎవరూ చెప్పలేరు. గత 150 సంవత్సరాల్లో విభజనకు గురి కాని దేశాలు యూరప్‌లో బహుకొద్ది మాత్రమే ఉన్నాయి. ఒక దేశాన్ని విభజించటం పుణ్యమూ కాదు, పాపమూ కాదనేదే ఈ ఉదంతం చూపుతుంది. అంటే అది పాపపుణ్యాలకు సంబంధించినది కాదు. అది సాంఘిక రాజకీయ సంబంధమైన సమస్య; రక్షణ సంబంధమైన సమస్య. దానిలో పాపానికి చోటు లేదు.

గాంధీజీ ఆశ్రయించిన రెండవది. ముస్లింలీగు ముస్లిములకు ప్రాతినిధ్యం వహించలేదని పాకిస్తాన్ కేవలం జిన్నా భ్రమ మాత్రమేనంటూ అభ్యంతరం తెలపడం మొదలు పెట్టడం.ముస్లిం ప్రజల మీద జిన్నా ప్రభావం రోజురోజుకు ఎలా పెరుగుతూ ఉందో జిన్నా ఏ విధంగా తన సేనల్ని యుద్ధానికి సిద్ధం చేస్తున్నాడో చూడలేనంత గుడ్డిగా గాంధీజీ ఎలా వున్నాడో అర్థం చేసుకోవటం కష్టం. మునుపెన్నడూ జిన్నా ప్రజల మనిషిగా లేడు. వాళ్ళనెప్పుడూ నమ్మలేదు.

కాంగ్రెసు సభ్యత్వం మెట్రికులేషన్ చదివినవారికి మాత్రమే పరిమితం చేయాలని జిన్నా కోరినట్లు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ తన స్వీయచరిత్రలో చెప్పారు.

రాజకీయాధికారం నుండి వాళ్లని తప్పించటానికి ఆయనెప్పుడూ ఉన్నతవర్గం వారికే ఓటు హక్కు ఉండాలనేవాడు. జిన్నా భక్తి ప్రపత్తులున్న నిజమైన ముసల్మానుగా ఇదివరకెన్నడూ గుర్తింపబడలేదు. ఆయన శాసనసభ సభ్యుడు (ఎం.ఎల్.ఎ)గా ప్రతిజ్ఞ చేసినప్పుడు ఖురాన్‌ను ముద్దుపెట్టుకోవడం తప్ప ఆయనెప్పుడూ దానిలోని అంశాలను గురించి గాని లేదా ప్రత్యేకమైన సిద్ధాంతం గురించి గాని తెలుసుకోవటానికి ప్రయత్నించినట్టు కనిపించదు. జిజ్ఞాసతో లేదా ఆధ్యాత్మిక చింతనతో మసీదుకు తరచు వెళ్లటం కూడ సందేహాస్పదమైనదే. జిన్నా ఎప్పుడూ రాజకీయ మతపరమైన ముస్లిం ప్రజా సభల్లో కనిపించేవారు కాదు. ఈనాడు జిన్నాలో పూర్తిగా మార్పు కన్పిస్తూంది. ప్రజల మనిషి అయ్యాడు. ఇక ప్రజలకు దూరంగా లేడు. ప్రజల్లోనే ఉంటున్నాడు. ఇప్పుడు ప్రజలు జిన్నాను తమకతీతమైన వ్యక్తిగా పొగుడుతూ ఖాయదీ ఆజమ్ (సర్వోత్తముడు) అంటూ పిలుస్తున్నారు. ఇస్లాంను విశ్వసించే వానిగా మాత్రం కాదు. దానికోసం ప్రాణత్యాగానికైనా సిద్ధపడేవానిగా జిన్నా మారాడు. ఈనాడు ఇస్లాం గురించి సాధారణ ఖలామా (ప్రవాచకుడు) కంటె జిన్నాకు ఎక్కువ తెలుసు.

ఈనాడు ఖుత్‌బా వినటానికి ఆయన మసీదుకు వెళతాడు. ఈద్ (Id) సభల్లో కుతూహలంగా పాల్గొంటాడు. డోంగ్రి ఇంకా నల్ బజారులలో ఇది వరకు జిన్నా అంటే పేరు మాత్రంగానే తెలుసు. ఈనాడు ఆయన వారికి సుపరిచితుడు. బొంబాయిలో ఏ ముస్లిం సమావేశం కూడా ల్లా–హో–అక్బర్ అంటూ ప్రారంభం కాకుండాలేదు; లాంగ్ లివ్ ఖాయదీ ఆజామ్ అని ముగింపు కాకుండానూ లేదు. ఈ విషయంలో జిన్నా ఇంగ్లీషు చక్రవర్తి చార్లెస్-I మామగారైన విషాద ఫ్రెంచి చక్రవర్తి హెన్రీ-IV ని అనుసరించారు. హెన్రీ-IV ఒక హ్యూగ్‌నాట్ (Huguenot) విశ్వాసకుడు. కాని అతడు కేథలిక్ చర్చ్ ప్రార్థనా సమావేశాల్లో పాల్గొనటానికి వెనుకాడేవాడు కాదు. అతడు తన హ్యూగ్ నాట్ విశ్వాసాన్ని మార్చుకుని ప్రార్థనా సమావేశాలకు వెళ్లటం పారిస్ ప్రజల గొప్ప సహకారానికి చెల్లించే చౌకధర అని నమ్మేవాడు. హెన్రీ-IV కు పారిస ఎలా ఒక ప్రార్థనా సమావేశం అయిందో అలాగే అటువంటి కారణాల వలనే గోంగ్రి ఇంకా నల్ బజారులు జిన్నాకు ఒక ప్రార్థనా సమావేశం అయింది. ఇదొక ఎత్తుగడ. అదొక ఉపక్రమణ. కాని దాన్ని జిన్నా హేతువాదం నుండి అంధ విశ్వాసంలోకి దిగజారిపోతున్నాడని అనుకుంటే చాలదు. తన ఆదర్శాలతో దిగజారిపోతూ ఉంటే, అతనితో సహా అలా దిగజారిపోవటమన్నది ముస్లిం సమాజం అన్ని వర్గాలలోకి కూడ ప్రాకిపోతూ, అది వాళ్ళ మనస్తత్వంలోనే ఒక భాగమైపోయింది. ఇది చాలా స్పష్టంగా కనిపిస్తుంది. గాంధీజీ విపరీత భావనకు ఒకే ఒక్క ఆధారం ముస్లిం జాతీయవాదులుగా పిలువబడే వారు ఉండటమే. ముస్లింలీగ్‌గా రూపొందిన మతవాదులకు ముస్లిం జాతీయవాదులకు నిజమైన తేడా ఏమీ కనిపించదు. కాంగ్రెసు వారు ముస్లింలీగ్ నుండి వేరుగా గుర్తించిన ముస్లిం జాతీయవాదులకు నిజంగా ఒక ఉద్దేశము, విధానమూ మత నమ్మకంతో కూడిన సంఘమూ ఏదైనా ఉందనటం చాలా సందేహించతగ్గ విషయం. వాస్తవానికి కాంగ్రెసు వారు చాలామంది

ఈ రెండింటికి మధ్య తేడా లేదని కాంగ్రెసులో ఉన్న ముస్లిం జాతీయవాదులు ముస్లిం మతవాదులకు ఒక బాహ్య స్థావరమని అనుకునేవారట. ఇది పూర్తిగా సత్య విదూరం కాదనిపిస్తోంది. అప్పటికే ప్రత్యేక నియోజకవర్గాలివ్వబడినప్పటికీ కాంగ్రెసువారు ముస్లిం జాతీయవాదులు చేసిన తీర్మానానికి వ్యతిరేకంగా ముస్లిం జాతీయ నాయకుడు డా॥ అన్సారీ కమ్యూనల్ అవార్డును వ్యతిరేకించడానికి నిరాకరించిన విషయం గుర్తు చేసుకుంటే అది నిజమేననిపిస్తుంది. అంతేకాదు ముస్లిముల మీద ముస్లింలీగ్ ప్రభావం ఎంత గొప్పగా పెరిగిందంటే ముస్లింలీగ్‌ను వ్యతిరేకించిన ముస్లిములు కూడ లీగ్‌లో స్థానం కోసం లేదా దానితో సంధి కుదుర్చుకోడాని కోసం ఉబలాటపడ్డారు. చిరస్మరణీయులు సర్ సికందర్ హయత్‌ఖాన్ బెంగాలు ప్రధాని శ్రీ ఫజులుహక్‌ల వంకర టింకర పద్ధతులు ఎవరైనా చూస్తే ఇందులో నిజాన్ని ఒప్పుకోక తప్పదు. జిన్నా ముస్లింలీగ్ శాఖలను వారి రాష్ట్రాల్లో పునః ప్రారంభం చేయటాన్ని సర్ సికందర్ ఫజులుహక్ ఇరువురు కూడా 1937లో వ్యతిరేకించారు. కాని ముస్లింలీగ్ శాఖలు బెంగాలు పంజాబుల్లో ప్రారంభమయిన ఒక సంవత్సరానికే తమ వ్యతిరేక ధోరణికి స్వస్తి చెప్పి లీగ్ చేరడానికి ఇరువురు కూడ ఉబలాటపడ్డారు. ఒకరినొకరు అవహేళన చేసికోవాలని వచ్చినవారు ఒకరినొకరు పొగుడుకుంటూ ఉండిపోయారన్నట్లు ఇది ఉంది. ముస్లింలీగ్ విజయానికి ఇంతకంటే నమ్మదగిన సాక్ష్యం ఏముంటుంది.

గాంధీజీ ముస్లింలీగ్‌తోను జిన్నా సంప్రదించి తగువు తీర్చడానికి బదులు, పక్కదారులు పట్టారు. అతడు కాంగ్రెసు ద్వారా ఆగష్టు 1942లో క్విట్ ఇండియా తీర్మానం చేయించారు. క్విట్ ఇండియా తీర్మానం బ్రిటిష్ ప్రభుత్వానికి అల్ప సంఖ్యాకుల సమస్యను చర్చించే ప్రమేయం తద్వారా కాంగ్రెసు అనుకున్న రీతిలో ఆ తగవును తీర్చే స్వేచ్ఛను కలిగించటానికే అలా చేయడం జరిగింది. ఉద్దేశపూర్వకంగా కాకపోయినా అది ముస్లిములను ఇతర అల్ప సంఖ్యాకులను ప్రక్కకు పెట్టి స్వాతంత్ర్యాన్ని సాధించాలనే అలా చేయడం జరిగింది. కాని క్విట్ ఇండియా ఉద్యమం చివరికి పూర్తిగా విఫలమైంది. అది ఒక పిచ్చి చేష్ట. ఒక ఆకారం లేని జీవపదార్థంగా మిగిలిపోయింది. దోపిడి, దొంగతనం, ప్రాణనష్టానికి భారతీయులనే బలి చేస్తూ కాంగ్రెసు వారు స్థిరపరచిన భూమిని దహించే ప్రచారం మాత్రమే అది. దాని నుండి బయటపడాలని తాము నిర్బంధంలో ఉంటూ ఉండగ ఫిబ్రవరి మార్చి 1943లో ఇరువై ఒక్క దినాలు నిరాహారదీక్ష చేబట్టాడు. కాని ఆయన విఫలమయ్యాడు. తర్వాత అతని ఆరోగ్యం దెబ్బతిన్నది. ఆయన ఆరోగ్యం క్షీణిస్తున్నదని తెలిసి బ్రిటిష్ ప్రభుత్వం తమ చేతుల్లోనే అతడు ప్రాణం చాలిస్తే తమకు ప్రతిష్ఠాభంగం కలుగుతుందేమోనన్న భయంతో అతన్ని విడుదల చేసింది. అతడు జైలునుండి బయట పడిన తర్వాత చూస్తే అతనూ కాంగ్రెసు వాడ బస్సునేగాక బాటనే తప్పినట్టు తెలుసుకున్నాడు. క్విట్ ఇండియా తీర్మానాన్ని అనుసరించి సాగిన ఉద్యమం విఫలమై దానిలో జరిగిన హింసాకాండవల్ల కాంగ్రెస్‌కు కలిగిన ప్రతిష్ఠాభంగం నుండి తిరిగి కోల్కొనేలా చేసి బ్రిటిష్ ప్రభుత్వం దృష్టిలో కాంగ్రెస్‌కు

దేశంలో అదే ప్రధానమైన పార్టీగా గౌరవం లభించేటట్లు చేయాలని అతడు వైస్రాయితో సంప్రదింపులు ప్రారంభించాడు. ఆ ప్రయత్నంలో హడలిపోయిన గాంధీజీ జిన్నావైపుకు తిరిగారు. 1944 జూలై 17వ తేదిన మత కలహాల సమస్యను తనతో చర్చించాలని కోరుతున్నానని గాంధీజీ జిన్నాకు రాసిన లేఖలో వ్యక్తం చేశారు. బొంబాయిలో తన స్వగృహానికి గాంధీజీని ఆహ్వానించడానికి జిన్నా ఒప్పుకొన్నాడు.

వారు 1944, సెప్టెంబరు 9వ తేదీన కల్సుకొన్నారు. కళ్లముందు జరిగే వాస్తవాన్ని చూడటానికి నిరాకరించిన గాంధీజీకి కనువిప్పు కలిగి ఇంత కాలానికి దాన్ని చూడటానికి అంగీకరించారు.

వారి మధ్య జరిగిన సంభాషణలకు 1944, ఏప్రియల్‌లో రాజగోపాలాచారి తయారు చేసిన పథకం ఆధారం. నమ్మశక్యంకాని రాజగోపాలాచారి పథకం కథ ఏమంటే గాంధీజీ 1943, మార్చిలో జైలులో ఉంటూ నిరాహార దీక్ష చేస్తూ ఉండగా అతను గాంధీజీతో చర్చించటమూ గాంధీజీ దానికి పూర్తిగా అంగీకరించటమూను. సిఆర్‌ఫార్ములా అని పేరుకెక్కిన రాజగోపాలా చారి ఫార్ములా ఇలా ఉంది.

1. స్వతంత్ర భారత రాజ్యాంగానికి సంబంధించిన నిర్ణయాలకు కట్టుబడుతూ ముస్లింలీగ్ స్వతంత్ర్యం ఇవ్వాలన్న డిమాండుకు మద్దత్తు ప్రకటించి ఈ లోపున తాత్కాలిక మధ్యంతర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి కాంగ్రెసుతో సహకరించాలి.

2. వాయవ్యం ఇంకా తూర్పున ముస్లింలు అత్యధికంగా ఉండి భౌగోళికంగా ఒకటిగా ప్రక్క ప్రక్కన ఉన్న జిల్లాలను గుర్తించేందుకు ఒక కమీషన్‌ను ప్రపంచ యుద్ధానంతరం నియమించాలి. ఈ విధంగా పేర్కొనబడిన ప్రాంతాలలో వయోజన ఓటింగుతో సర్వ జనాభిప్రాయ సేకరణ లేదా వలనుపడే మరేదైనా ఓటింగు అయినా హిందూస్తాన్ నుండి విడిపోవటమన్న దానిని అంతిమంగా నిర్ణయించాలి. హిందూస్తాన్ నుండి వేరుగా ఒక సర్వసత్తాక రాజ్యాన్ని స్థాపించడమే మెజారిటీ నిర్ణయం అయితే అట్టి నిర్ణయాన్ని నిరభ్యంతరంగా అమలు జేయటానికి సరిహద్దు జిల్లాలు తమ ఇష్టం వచ్చిన దేశంలో చేరే హక్కు నివ్వాలి.

3. ప్లెబిసైటు జరగకముందు అన్ని పార్టీలు వాళ్ల ఉద్దేశాలను ప్రచారం చేసికోవచ్చు.

4. రక్షణ వాణిజ్య రవాణా మరే ఇతర మౌలిక శాఖల భద్రత కోసం పరస్పర ఒప్పందాలను విభజన సందర్భంలోనే కుదుర్చుకోవాలి.

5. జనాలు బదిలీ అవటమేదైనా పూర్తిగా ఏప్రమేయం లేకుండానే జరగాలి.

6. దేశ బాధ్య పరిపాలనాధికార మంతా బదిలీ చేయటం బ్రిటిష్ వారి ద్వారా జరిగితే ఈ నిబంధనలన్నీ వర్తిస్తాయి.

ఈ సంభాషణలు సెప్టెంబరు 9వ తేదీన ప్రారంభమై సెప్టెంబరు 27వ తేదీన విఫలమయినట్లు ప్రచురించబడినంతవరకు 18 దినాలు జరిగాయి. ఈ సంభాషణలు విఫలమవటం విభిన్న వర్గాల వారి మనస్సుల్లో విభిన్న రీతులుగా స్పందన కలిగించాయి. కొందరు సంతోషిస్తే మిగిలిన వారు వాపోయారు. ఈ సంభాషణలు జరగకముందు తమ ఆధిక్యత కోసం పెనుగులాడే ప్రత్యర్థి లిరుపక్షాల వారు ఇద్దరి నాయకులను నిందించారు. గాంధీజీని బ్రిటిష్‌వారు జిన్నాను పంజాబు యూనియనిస్టు పార్టీ వారు దూషించారు. వీరిరువురూ యేదైనా నిర్మాణాత్మక ప్రయత్నం ద్వారా ఒక పరిష్కారాన్ని సాధిస్తారని నమ్మిన ప్రజలు ఎక్కువ మంది తమ నమ్మకాన్ని కోల్పోయారు. ఈ వైఫల్యానికి కారణం వ్యక్తిత్వలోపాలే కావచ్చు. కాని యేదైనప్పటికి సి.ఆర్. ఫార్ములాలో కొన్ని మౌలికమైన లోపాలు ఉండంటం వలననే విఫలం కాక తప్పలేదనే చెప్పాలి. మొదటిది ఇది మత సమస్యను రాజకీయ సమస్యతో విప్పలేనంత ముడి వేసింది. రాజకీయ పరిష్కారం లేకుండా మత పరిష్కారం లేదనే యుక్తిమీద ఈ ఫార్ములా ఆధారపడింది. ఇదే జిన్నాను ఒక ఒప్పందానికి రావల్సిందిగా ఆహ్వానించింది. "మీరు స్వాతంత్ర్యం సాధించడంలో మాకు సహకరిస్తే పాకిస్తాన్ గురించి మీరు చేసిన ప్రతిపాదనను మేము సంతోషంగా పరిశీలిస్తామనే బేరమిది. స్వాతంత్ర్య సాధనకు ఇదే గొప్ప సాధనగా రాజగోపాలాచారి ఈ ఆలోచన ఎక్కడనుండి తీసికున్నారో నాకు అర్థంకాలేదు. విదేశ శత్రువుల నుండి స్వాతంత్ర్యం కాపాడుకోటానికి తమ కుమార్తెలను ఇరుగు పొరుగు రాకుమారులకిచ్చి పెళ్లి సంబంధాలను కుదుర్చుకున్న దేశాన్నేలిన పురాతన హైందవ రాజులనుండి ఈ ఆలోచనను ఆయన అరువు తెచ్చుకుని ఉండవచ్చు. ఇటువంటి సంబంధాలు ఒక మంచి వరుణ్ని గాని ఒక మంచి స్నేహితున్ని గాని తీసుకు రాలేదన్నది రాజగోపాలాచారి మరచిపోయారు. స్వాతంత్ర్యం గెలుపొందటమ్మీద ఆధారపడి మత కలహాన్ని పరిష్కరించాలని ఈ విషయంలో ముందుకు సాగటం చాలా తెలివి తక్కువ తనం. ఒక పార్టీవారు మరొక పార్టీ వారిని తమ వలలో పడవేయడానికి బదులుగా మతపరమైన హక్కులను ఇవ్వటమవుతుంది. కమ్యూనల్ సెటల్‌మెంట్‌ను రాజగోపాలాచారి ఫార్ములా ఒక విక్రయ వస్తువును చేసింది. ఈ విషయాల్లో శాసన కార్య నిర్వాహణాధికారాలున్న కేంద్ర ప్రభుత్వ మొకటి అంటే పాకిస్తాన్ హిందూస్తాన్‌లు సర్వసత్తాక రాజ్యాలు కావు. కాని జిన్నా దీనికి అంగీకరిస్తాడా? ససేమి అంగీకరించడు. మరొకటి ఏమంటే పాకిస్తాన్ హిందుస్తాన్‌లను సర్వ సత్తాక రాజ్యాలు చేస్తూ సర్వ సాధారణమైన విషయాల మీద ఒక సంధికి కట్టుబడి వుండేలా చేయాలి. కాని ఈ సంధికి సంబంధించిన అంశాలు పాటించేలా చేయడానికి ఏముంది? అది ఒక డొమినియన్ అయినప్పటికీ ఒక సర్వసత్తాక రాజ్యంగా పాకిస్తాన్ దీన్ని త్రోసిపుచ్చగలదు. ఈ పరికరణ రాజగోపాలాచారి 1922 ఆంగ్లో-ఐరిష్ సంధినుండి సంగ్రహించారు. కాని ఆ సంధి ఐర్లాండు ఒక డొమినియన్ కానంత కాలమూ ఉండి అది డొమినియన్ అయిన వెంటనే దాన్ని

త్రోసివేస్తే బ్రిటిష్ పార్లమెంటు చేయగలిగిందేమీ లేదని తెలిసి నిశ్శబ్దంగా నిర్విణ్ణంగా ఉండి పోయిందన్న వాస్తవాన్ని ఆయన మరచిపోయారు.

సంభాషణలు విఫలమౌతూ మనకు మిగిల్చినవి, వాటిని జిన్నా తన వ్యక్తిగత సంభాషణల్లో ప్రజల మధ్య మాట్లాడినపుడు ముభావంగ ఉండటం గురించి కొన్ని ప్రశ్నలు. ఈ ప్రశ్నలేవంటే-

1. ముస్లింలీగు తీర్మానాలను బట్టి అంగీకరించబడాలా?

2. ముస్లింలీగులో లేని ముస్లిములు ఈ విషయంలో చెప్పడానికేమీ లేదా?

3. పాకిస్తాన్ సరిహద్దులు ఎలా ఉంటాయి? పరిపాలనార్థం ఇప్పుడున్న పంజాబు బెంగాలు సరిహద్దులేనా లేక పాకిస్తాన్ సరిహద్దులు జాతి విచక్షణ మీద ఆధారపడ్డ సరిహద్దులా?

4. "అవసరాన్ని బట్టి భూభాగం సర్దుబాటు" అన్న పదానికి అర్థమేమిటి? ముస్లిం లీగు ఉద్దేశంలో ఉన్న భూభాగం సర్దుబాట్లేమిటి?

5. లాహోరు తీర్మానం చివరి భాగంలో ఉన్న ఆఖరుగా అన్న పదానికి అర్థమేమిటి? పాకిస్తాన్ స్వతంత్ర సర్వసత్తాక రాజ్యం కాకుండా ఉండిన మధ్య కాలాన్ని ముస్లిం లీగు అలా భావిస్తుందా?

6. ఇప్పుడు పరిపాలనార్థం ఉన్నవే తూర్పు పశ్చిమ పాకిస్తాన్ సరిహద్దులనటమే జిన్నా ప్రతిపాదన అయితే షెడ్యూలు కులాలు లేదా నన్ను చెప్పనిస్తే పంజాబు బెంగాలులో ఉన్న ముస్లిమేతరులను జిన్నా పాకిస్తాన్‌లో చేర్చబడలా అన్నది ఒక ప్లెబిసైటు ద్వారా నిర్ణయించబడాలి అని కోరితే వారిని అనుమతిస్తాడా. ఇంకా పంజాబు బెంగాలులోని ముస్లిమేతరుల కోసం జరిగిన ప్లెబిసెటు ఫలితాలకు జిన్నా కట్టుబడి ఉంటాడా?

7. తూర్పు పాకిస్తాన్‌ను పశ్చిమ పాకిస్తాన్‌తో కలపడానికి కొంత స్థలాన్ని ఉత్తర ప్రదేశ్ బీహారుల మీదుగా జిన్నా కావాలంటాడా? సూటి ప్రశ్నలు వేసి జిన్నా నుండి ఖచ్చితమైన సమాధానాలు పొందితే చాలా లాభదాయకంగా ఉండేది. ఈ ప్రశ్నలతో జిన్నాను ఎదుర్కోడానికి బదులు గాంధీజీ తన సమయాన్నంతటినీ సి.ఆర్.ఫార్ములా లీగ్ యొక్క లాహోరు తీర్మానంతో చాలా వరకు సమానమైనదని ఋజువు చేయటానికే వెచ్చించాడు. అది మతిలేని తనం కాకపోయినా అతి తెలివి ప్రదర్శించటమే అవుతుంది. ఆ విధంగా సందేహాలను నివృత్తి చేసికోవాల్సిన అత్యుత్తమ అవకాశాన్ని అతడు పోగొట్టుకున్నాడు.

ఈ సంభాషణల అనంతరం గాంధీజీ జిన్నా ఇక చేయడానికి ఏమీ లేదన్నట్టు ఆట ముగిసిన తర్వాత క్రికెట్ క్రీడాకారులు చేసినట్లు తమ స్థావరాలకు నిష్క్రమించారు. వాళ్లు మరలా కలుసుకుంటారా కల్సుకుంటే ఎప్పుడు అన్న సూచనే లేదు. ఆ తర్వాత ఏమిటి

అన్న ప్రశ్న వాళ్లను వేధించినట్లు లేదా? ఒక్కరు చర్చించటానికి తిరస్కరించి సమస్యకు పరిష్కారం లేకుండా భారతదేశం ఎటువంటి రాజకీయ ప్రగతి సాధిస్తుందో యిక చెప్పతరం కానిది. ప్రజలు విభేదించటానికి ఒప్పుకోదగిన ప్రశ్నలు తరహాకు చెందినది కాదిది. తప్పని సరిగా పరిష్కారం కనుక్కోవల్సిన సమస్య యిది. అయితే ఎలాకాని, ఒక ఒప్పందం ద్వారా గాని లేదా మధ్య వర్తిత్వం ద్వారా గాని. ఒప్పందం ద్వారా అయితే ఒకరికి మరొకరు లొంగిపోవడమనేది లేకుండా యిచ్చి పుచ్చుకునే సాంప్రదాయంలో జరిగిన సంప్రదింపుల ఫలితంగా జరగాలి కదా. అలా కాకపోతే అది ఒప్పందమే కాదు. అది ఆదేశించడమవుతుంది. అలాంటి సుహృద్భావం కలగటానికి చాలాకాలం పడుతుంది. ఎంతకాలం పడుతుందో ఎవరూ చెప్పలేరు. భారత రాజకీయ స్వాతంత్ర్యం అత్యంత శీఘ్రంగా కావాలి. ఇది వాయిదా వేయరానిది. అదీ గాక కమ్యూనల్ (మతవర్గ విభేదాల) సమస్యకు పరిష్కారం లేకుండా స్వాతంత్ర్యాన్ని వేగంగా సాధించలేము. ఒక ఒప్పందం మీద దాన్ని ఆధారపడేలా చేయడమంటే పరిష్కారాన్ని నిరవధికంగా వాయిదా వేయడమే అవుతుంది. మరో శీఘ్రపద్ధతిని కనిపెట్టాలి. ఒక అంతర్జాతీయ సంస్థ ద్వారా మధ్యవర్తిత్వం అన్నిటికన్నా మంచి మార్గమని నాకనిపిస్తుంది. పాకిస్తాన్‌తో సహా అల్ప సంఖ్యాకుల సమస్యలో గల వివాదాస్పద అంశాలను అలాంటి సంస్థకు అప్పగించాలి. బ్రిటిష్ సామ్రాజ్యంలో లేని ఇతర దేశాలనుండి సభ్యులద్వారా ఈ సంస్థను ఏర్పరచాలి. భారత దేశంలో శాసన రీత్యా అల్ప సంఖ్యాకులైన ముస్లిములు, షెడ్యూల్డు కులాలు, సిక్కులు, భారత క్రైస్తవులు ఈ సంస్థకు వాళ్ళ ప్రతినిధులను వాళ్ళనే ఎన్నుకోమనాలి. హిందువులు అల్ప సంఖ్యాకులు వాళ్ళు కోరికలకు మద్దతుగా ఈ సంస్థ ముందు హాజరవుతూ ఈ సంస్థ నిర్ణయాలకు కట్టుబడి ఉండటానికి కూడ అంగీకరించాలి. బ్రిటిష్ వారు ఈ విధంగా ఒక వాంగ్మూల మివ్వాలి.

1. మతసమస్య పరిష్కారంతో వారికేమీ ప్రమేయం లేదని; దాన్ని ఒక ఒప్పందానికి గాని లేదా ఒక మధ్యవర్తిత్వ సంస్థకు గాని వదిలివేస్తామని.

2. మత సమస్యను భాగత ప్రభుత్వ శాసనంలో పేర్కొనడం ద్వారా మధ్యవర్తిత్వ సంస్థ నిర్ణయాన్ని అమలు జరపాలి.

3. అంతర్జాతీయ మధ్యవర్తిత్వసంస్థ తీర్పును భారత దేశంలోని అల్ప సంఖ్యాకుల యెడ తమ కనీస ధర్మాన్ని తగినంతగా నిర్వర్తిస్తున్నట్లు భావించి ఇంకా భారత దేశానికి స్వయం పరిపాలనా ప్రతిపత్తి నివ్వటానికి అంగీకరించాలి.

ఈ పద్ధతివల్ల అనేక ప్రయోజనాలున్నాయి. కాంగ్రెసు సామర్థ్యలోపంచే కుదర్చలేక మిగిల్చిన మత సమస్య పరిష్కారంలో బ్రిటిష్ వారి ప్రమేయముంటుందనే భయాన్నది దూరం చేస్తుంది. కాంగ్రెసుకు సబబుగా తోచిన దానికంటె ఏదైనా అధికంగా అల్పసంఖ్యాకులకు బ్రిటిష్ వారినుండి లభించే అవకాశముందన్న ఆరోపణ ఉండటం వల్ల అల్ప సంఖ్యాకులు

ఎప్పుడూ కాంగ్రెస్‌తో పొత్తు కుదుర్చుకోవాలనుకోరు. ఈ ప్రతిపాదనవలన రెండవ ప్రయోజనం కూడ ఉంది. రాజ్యాంగాన్ని రూపొందించడమ్మీద ఒక వీటో హక్కును అల్ప సంఖ్యాకుల చేతుల్లో బ్రిటిష్ ప్రభుత్వం చేతుల్లో కేవలం పరిహారాలంటూ కాంగ్రెసు అనుమానించి అల్పసంఖ్యాకులు నిర్హేతుకంగా అంగీకారాన్ని నిలిపివేయవచ్చు. లేదా బ్రిటిష్ ప్రభుత్వం చెప్పిన మాటలు విని అల్ప సంఖ్యాకులు తమ అంగీకారాన్ని నిలిపివేయ వచ్చునని అంటున్నారు. అంతర్జాతీయ మధ్యవర్తిత్వం ఈ విధమైన ఆరోపణలన్నింటినీ తొలగిస్తుంది. అల్ప సంఖ్యాకులు అంతర్జాతీయ మధ్యవర్తిత్వ సంస్థ గురించి భయపడవల్సిన అవసరమే లేదు. మధ్యవర్తిత్వానికి లోబడాల్సి ఉండటంలో సబబు కాని దేమీ లేదు. ఎవరినీ తన సొంత తగవులో తననే న్యాయ మూర్తిగా ఉండనివ్వరాదన్న లోకవిదిత న్యాయసూత్రాన్ని అనుసరించే ఉంటుందది. అల్ప సంఖ్యాకుల విషయంలో ఎలాంటి మినహాయింపు ఇవ్వాల్సిన అవసరం కూడ లేదు. ఒక వ్యక్తి మాదిరిగా మరిసొంత తగవులో వారే న్యాయ నిర్ణేతలు కావాలని అడగలేరు. బ్రిటిష్ ప్రభుత్వం గురించి ఏమిటి? ఈ పథకంలో ఏ భాగానికైనా అభ్యంతరం తెలిపే అవసరమే బ్రిటిష్ ప్రభుత్వానికుండదు. ఈ కమ్యూనల్ అవార్డు బ్రిటిష్ వారికి చాలా నిరాదరణ తెచ్చిపెట్టింది. ఇది కృతఘ్నత లేని కార్యం. దీన్నుండి బయటపడటం బ్రిటిష్ వారికి చాలా సంతోషం కలిగిస్తుంది. దీని కోసం కొన్ని వర్గాలవారు బ్రిటిష్‌వారిని నమ్మకస్తులుగా పరిగణించాలి ఏ వర్గాలవారు వారి భద్రతా ప్రయోజనాలకోసం రాజ్యాంగంలో అవకాశం కల్పించే బాధ్యతను తమ సర్వాధికారం కోసం అంతరించక ముందే బ్రిటిష్‌వారు నిర్వర్తిస్తారన్న సమస్యకు వస్తే వారిని నమ్మకస్తులుగా భావించినందులకు ఆ వర్గాలవారు ఒక అంతర్జాతీయ మధ్యవర్తిత్వ సంస్థ తీర్పుద్వారా వాటిని రాజ్యాంగముఖంగా అమలు జరపమని అడగటంకంటె ఏముంటుంది? అంతర్జాతీయ సంస్థ తీర్పును అమలు జరపటంలో బ్రిటిష్‌వారికి ఆకస్మికమైన ఒకే ఒక ఇబ్బంది కలుగవచ్చు. వివాదంలో భాగస్వాములైన వారిలో ఏ ఒక్కరైనా ఈ మధ్యవర్తిత్వానికి తమ తగవును నివేదించటానికి సిద్ధపడని పక్షంలో అటువంటి ఆకస్మిక యిబ్బంది కలుగుతుంది. అలాంటప్పుడు సమస్య ఇలా ఉండగలదు. ఆ పక్షానికి వ్యతిరేకంగా బ్రిటిష్‌వారు తీర్పును అమలుజరపడం న్యాయంగా ఉంటుందా? అలాంటి పక్షానికి వ్యతిరేకంగా బ్రిటిష్‌వారు సంపూర్ణ న్యాయ బద్ధంగా తీర్పును అమలు జరపటంలో ముందుకు పోవచ్చుని ఇబ్బంది లేకుండా నేను చెప్పగలను. అసలు మధ్యవర్తిత్వానికి తమ తగవును నివేదించడానికి నిరాకరించిన వాని స్థానం ఏమిటి? దానికి సమాధానం ఆ పక్షం దౌర్జన్య కారుడవుతాడు. దౌర్జన్యకారుడు ఎలా పరిగణించబడ్తాడు. అతని మీద ఆంక్షలను విధించడం ద్వారా మధ్యవర్తిత్వానికి తమ వాదాన్ని నివేదించిన ఒక పక్షానికి వ్యతిరేకంగా మధ్యవర్తిత్వ సంస్థ తీర్పును రాజ్యాంగ పరంగా అమలు జేయటం దౌర్జన్య కారుని మీద ఆంక్షలు విధించటానికి మరోపేరుమాత్రమే అవుతుంది. ఇట్టి ఆకస్మికమైన ఇబ్బంది కలిగితే బ్రిటిష్ ప్రభుత్వం ఈ పద్ధతిని అనుసరించడంలో బాధపడాల్సిన పనిలేదు.

ఇటువంటి వివాదాల్లో అనుసరించబడిన అందరూ గుర్తింపు పొందిన పద్ధతేయిది. అంతేగాక ముస్సోలిను అబిసినియ వివాదపడినప్పుడు తన వాదాన్ని మధ్యవర్తిత్వ సంస్థకు నివేదించ నిరాకరించితే నానాజాతి సమితి ఈ పద్ధతిని రూపొందించి ప్రచురించడానిక్కూడ అనుమతించింది. నేనేదైతే చెప్పానో అది ఈ ప్రశ్నకు సమాధానం కాకపోవచ్చు. అయితే ఆ పిమ్మట ఏమిటి? ఏమవుతుందో నాకు తెలీదు. నాకు తెల్సిందల్లా ఈ ప్రశ్నకు సమాధానం లేకుండా భారత దేశానికి స్వాతంత్ర్యం ఉండదు. ఆ సమాధానం తప్పనిసరిగా నిర్దుష్టంగా శీఘ్రంగా ఉభయ పక్షాలకు సంతృప్తికరంగా ఉండాలి.

**(అను : డా॥ ప్రసన్నకుమార్)**

# అనుబంధాల పట్టిక

1. మతాలవారీగా భారతదేశ జనాభా
2. బ్రిటిష్ ఇండియా రాష్ట్రాల్లో అల్పసంఖ్యాక వర్గాల రీత్యా మతాలు ఉన్నతీరు
3. రాష్ట్రాల్లో అల్పసంఖ్యాక వర్గాలరీత్యా మతాలు ఉన్నతీరు
4. పంజాబ్‌లో జిల్లాలవారీ మతవిభజన
5. బెంగాల్‌లోజిల్లాలవారీ మత విభజన
6. అస్సాం జిల్లాల్లో జనాభా మతరీత్యా ఉన్న విభజన
7. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో ముస్లిం జనాభానిష్పత్తి
8. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో పట్టణాల్లోని ముస్లిం జనాభా నిష్పత్తి
9. జిల్లాలవారీగా సింధ్ రాష్ట్రంలో ముస్లిం జనాభా నిష్పత్తి
10. సింధ్ పట్టణాల్లో ముస్లింజనాభా నిష్పత్తి
11. భారతదేశంలో ముస్లిములు మాట్లాడేభాషలు
12. 1906లో లార్డ్‌మింటోకి ముస్లిమ్‌ల విజ్ఞాపన, దానికి సమాధానం
13. 1935 భారత ప్రభుత్వచట్టంకింద ప్రతిప్రాంతీయ శాసనసభలోనూ దిగువసభకి కేటాయించిన స్థానాలు
14. 1935 భారత ప్రభుత్వ చట్టంకింద ప్రతిప్రాంతీయ శాసనసభ ఎగువసభలో కేటాయించిన స్థానాలు
15. 1935 భారత ప్రభుత్వ చట్టంకింద, రాష్ట్రాలరీత్యా, మతవర్గాలరీత్యా బ్రిటిష్ ఇండియా ఫెడరల్ శాసనసభలో దిగువసభకి కేటాయించిన స్థానాలు
16. 1935 భారత ప్రభుత్వ చట్టం ప్రకారం ప్రాంతంవారీగా, మతవర్గం వారీగా బ్రిటిష్ ఇండియా ఫెడరల్ శాసనసభలో ఎగువసభకి కేటాయించిన స్థానాలు
17. 1935 భారత ప్రభుత్వ చట్టంకింద ఫెడరల్ శాసనసభలో దిగువసభకీ, ఎగువసభకీ భారత సంస్థానాలకి కేటాయించిన స్థానాలు

# ప్రాతినిధ్య సమస్య

మీ విజ్ఞాపనా సారాంశం, నాకు అర్థమైనంత మేరకు, ఏ ప్రాతినిధ్య వ్యవస్థలోనైనాగానీ – అది మునిసిపాలిటీగానీ, జిల్లా బోర్డుగాని, శాసనసభలోగానీ – ఎన్నికల వ్యవస్థను ప్రవేశపెట్టడమో, పెంచడమో జరిగితే మహమ్మదీయ మతస్థులకు ఒకవర్గంగా ప్రాతినిధ్యం ఉండాలని ఇవాళ ఉన్న పరిస్థితిలో ఎన్నికల సంస్థలకు అత్యధిక సందర్భాల్లో మహమ్మదీయ అభ్యర్థులు ఎన్నిక అయ్యే అవకాశం లేదని మీరు అంటున్నారు. ఒకవేళ ఎన్నికైనా అది అధిక సంఖ్యాకవర్గాల అభిప్రాయాలకు అతని అభిప్రాయాలు బలి కావడం ఫలితమేనని, ఆ అధిక సంఖ్యాకవర్గాలు తమ మతస్థులకు వ్యతిరేకం అనీ, ఆ ఎన్నికైన వ్యక్తి తమ వర్గాన్ని ఏ విధంగానూ ప్రతిబింబించండనీ మీ అభిప్రాయం. మీ వర్గానికి ఉన్న రాజకీయ ప్రాముఖ్యం దృష్ట్యా సామ్రాజ్యానికి మీరు అందించిన సేవల దృష్ట్యా మీ సంఖ్యాత్మక బలానికి తగ్గ పరిగణన ఉండాలని మీరు న్యాయంగానే కోరుతున్నారు. నేనీ విషయంలో మీతో సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను. దయచేసి నన్ను అపార్థం చేసుకోవద్దు. ఏ మార్గాల ద్వారా మతవర్గాల ప్రాతినిధ్యం సాధించాలో సూచించే ప్రయత్నం మేము చెయ్యడం లేదు. భారతదేశంలో ఏ ఎన్నికల ప్రాతినిధ్యం అయినా ఘోరంగా విఫలం అవుతుందన్న గట్టి అభిప్రాయం నాకు ఏర్పడింది. మీకు అలాంటి అభిప్రాయమే కలుగవచ్చు. ఈ ఉపఖండంలోని జనాభా అనేక మత విశ్వాసవర్గాల్లో ఉంది. వాళ్ళ సాంప్రదాయాలు అనేకం. వీటిని పట్టించుకోకుండా వ్యక్తిపర ఓటింగ్ హక్కును ఇవ్వాలని ఉద్దేశించే ఏదైనా విఫలం అవుతుంది. ప్రజా ప్రాతినిధ్య సంస్థలంటే భారతదేశంలోని అధిక జనాభాకు తెలీదు. స్వయంపాలన తొలిమెట్లు మునిసిపల్, జిల్లా బోర్డులోనే ఉన్నాయన్న మీ అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. ఆ దిశలోనే, క్రమేణా ప్రజల్ని రాజకీయంగా విద్యావంతుల్ని చేసే ప్రయత్నం చెయ్యాల్సి ఉంది.

## హామీ

ఈ లోపున మీకు ఒకటే చెప్పదలచుకున్నాను. నాకు ప్రమేయం ఉన్న ఏ పాలక సంస్థలోనైనా మహమ్మదీయ రాజకీయ హక్కుల్ని ఒక వర్గంగా మీ ప్రయోజనాల్ని పరిరక్షించడం ద్వారా మీరు ధీమాగా ఉండచ్చని చెప్పదలచుకున్నాను. ఏలినవారి సామ్రాజ్యంలో అనేక మత విశ్వాసాలు, జాతీయ సంప్రదాయాలు కలిగిన జనాభా ఉన్నారు. ఈ జనాభా అంతా బ్రిటిష్ పాలన తమ విశ్వాసాలను గౌరవిస్తుతందన్న నమ్మకంతో ఉండొచ్చు. బ్రిటిష్ పాలన గర్వపడే విషయం ఇది.

ఘనత వహించిన ప్రభువులారా, పెద్దలారా, ఇంతమంది ప్రముఖ, ప్రాతినిధ్య మహమ్మదీయుల్ని కలుసుకునే అపూర్వ అవకాశాన్ని నాకు కలగజేసినందుకు మీ అందరికీ హృదయపూర్వక కృతజ్ఞతలు. ప్రజా వ్యవహారాల పట్ల మీకు ఉన్న ఆసక్తి వల్ల, శక్తి వల్ల మీరు ఎంతో దూరాల నుంచి ఇక్కడికి వచ్చారు. మీ ఆసక్తిని, శక్తిని అభినందిస్తున్నాను. మీ సిమ్లా యాత్ర అవసరార్థం ఇంత తక్కువ వ్యవధిగా ఉన్నందుకు విచారిస్తున్నాను.

# అనుబంధం - XIII

## ప్రాంతీయ శాసనసభ – దిగువ సభకు, 1935 భారత ప్రభుత్వ చట్టం ప్రకారం కేటాయించిన సీట్లు

| ప్రావిన్స్ | జనరల్ సీట్లు | | షెడ్యూల్డ్ కులాలకు రిజర్వు చేయబడిన జనరల్ సీట్లు | వెనుకబడిన ప్రాంతాల తెగల ప్రతినిధుల కోసం సీట్లు | సిక్కు సీట్లు | మహమ్మదీయుల సీట్లు | ఆంగ్లో ఇండియన్ల సీట్లు | యూరోపియన్ సీట్లు | ఇండియన్ క్రైస్తవుల సీట్లు | వాణిజ్య, పరిశ్రమ, మైనింగ్, ప్లాంటింగ్ ప్రతినిధుల సీట్లు | భూ యజమానులకు సీట్లు | విశ్వవిద్యాలయాలకు సీట్లు | కార్మిక ప్రతినిధులకు సీట్లు | స్త్రీలకు కేటాయించిన సీట్లు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మొత్తం సీట్లు | జనరల్ సీట్ల మొత్తం | | | | | | | | | | | | జనరల్ | సిక్కు | మహమ్మదీయ | ఆంగ్లో ఇండియన్ | ఇండియన్ క్రైస్తవ |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| మద్రాసు | 215 | 146 | 30 | 1 | .. | 28 | 2 | 3 | 8 | 6 | 6 | 1 | 6 | 6 | .. | 1 | .. | 1 |
| బొంబాయి | 175 | 114 | 15 | 1 | .. | 29 | 2 | 3 | 3 | 7 | 2 | 1 | 7 | 5 | .. | 1 | .. | .. |
| బెంగాలు | 250 | 78 | 30 | .. | .. | 117 | 3 | 11 | 2 | 19 | 5 | 2 | 8 | 2 | .. | 2 | 1 | .. |
| యునైటెడ్ ప్రావిన్స్ | 228 | 140 | 20 | .. | .. | 64 | 1 | 2 | 2 | 3 | 6 | 1 | 3 | 4 | .. | 2 | .. | .. |
| పంజాబ్ | 175 | 42 | 8 | .. | 31 | 84 | 1 | 1 | 2 | 1 | 5 | 1 | 3 | 1 | 1 | 2 | .. | .. |
| బీహార్ | 152 | 86 | 15 | 7 | .. | 39 | 1 | 2 | 1 | 4 | 4 | 1 | 3 | 3 | .. | 1 | .. | .. |
| సెంట్రల్ ప్రావిన్స్ బేరర్ | 112 | 84 | 20 | 1 | .. | 14 | 1 | 1 | .. | 2 | 3 | 1 | 2 | 3 | .. | .. | .. | .. |
| అస్సాం | 108 | 47 | 7 | 9 | .. | 34 | .. | 1 | 1 | 11 | .. | .. | 4 | 1 | .. | .. | .. | .. |
| వాయవ్య ప్రావిన్స్ | 60 | 9 | .. | .. | 3 | 36 | .. | .. | | .. | .. | 2 | .. | .. | .. | .. | . | .. |
| ఒరిస్సా | 60 | 44 | 6 | 5 | .. | 4 | .. | .. | 1 | 1 | 2 | .. | 1 | 2 | .. | .. | .. | .. |
| సింద్ | 60 | 18 | .. | .. | .. | 33 | .. | 2 | .. | 2 | 2 | .. | 1 | 1 | .. | 1 | .. | .. |

బొంబాయిలో జనరల్ సీట్ల 87 మరాఠీలకు రిజర్వు చేయాలి.

భూ యజమానుల సీట్లలో 8 ఒకటి పంజాబులో తుమందార్‌కు ప్రత్యేకించాలి.

ఒరిస్సా అస్సాంలో స్త్రీలకు కేటాయించిన సీట్లు మత ప్రాతినిధ్యం లేనివి.

## అనుబంధం - XIV

### ప్రాంతీయ శాసనసభలో — ఎగువ సభలు — 1935 భారత ప్రభుత్వ చట్టం ప్రకారం కేటాయించబడిన సీట్లు

| ప్రావిన్స్ | మొత్తం సీట్లు | జనరల్ సీట్లు | మహమ్మదీయ సీట్లు | యూరోపియన్ సీట్లు | ఇండియన్ క్రైస్తవ సీట్లు | శాసన సభచే నింపబడాల్సిన సీట్లు | గవర్నరు చేత నింపబడాల్సిన సీట్లు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| మద్రాసు | 54కి తక్కువ కాకుండా<br>56కి ఎక్కువ కాకుండా | 35 | 7 | 1 | 3 | .. | 8కి తక్కువ కాకుండా<br>10కి ఎక్కువ కాకుండా |
| బొంబాయి | 29కి తక్కువ కాకుండా<br>30కి ఎక్కువ కాకుండా | 20 | 5 | 1 | .. | .. | 3కి తక్కువ కాకుండా<br>4కి ఎక్కువ కాకుండా |
| బెంగాల్ | 63కి తక్కువ కాకుండా<br>65కి క్కువ కాకుండా | 10 | 17 | 3 | .. | 27 | 6కి తక్కువ కాకుండా<br>8కి ఎక్కువ కాకుండా |
| యునైటెడ్ ప్రావిన్స్ | 58కి తక్కువ కాకుండా<br>60కి ఎక్కువ కాకుండా | 34 | 17 | 1 | .. | .. | 6కి తక్కువ కాకుండా<br>8కి ఎక్కువ కాకుండా |
| బీహార్ | 29కి తక్కువ కాకుండా<br>30కి ఎక్కువ కాకుండా | 9 | 4 | 1 | .. | 12 | 3కి తక్కువ కాకుండా<br>4కి ఎక్కువ కాకుండా |
| అస్సాం | 21కి తక్కువ కాకుండా<br>22కి ఎక్కువ కాకుండా | 10 | 6 | 2 | .. | .. | 3కి ఎక్కువ కాకుండా<br>4కి ఎక్కువ కాకుండా |

# అనుబంధం - XV

## బ్రిటిష్ ఇండియా ఫెడరల్ శాసన సభ – దిగువ సభకు భారత ప్రభుత్వ చట్టం 1935 ప్రకారం కేటాయింపు అయిన సీట్లు

| ప్రావిన్స్ | మొత్తం సీట్లు | మొత్తం జనరల్ సీట్లు | షెడ్యూల్డ్ కులాల వారికి కేటాయించిన జనరల్ సీట్లు | సిక్కులకు సీట్లు | ముస్లింలకు సీట్లు | ఆంగ్లో ఇండియన్ లకు సీట్లు | యూరోపియన్ సీట్లు | భారతీయ క్రైస్తవులకు సీట్లు | వాణిజ్య పరిశ్రమల సీట్లు | భూస్వాములకు సీట్లు | శ్రామికుల ప్రతినిధులకు సీట్లు | స్త్రీలకు సీట్లు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| మద్రాస్ | 37 | 19 | 4 | .. | 8 | 1 | 1 | 2 | 2 | 1 | 1 | 2 |
| బొంబాయి | 30 | 13 | 2 | .. | 6 | 1 | 1 | 1 | 3 | 1 | 2 | 2 |
| బెంగాల్ | 37 | 10 | 3 | .. | 17 | 1 | 1 | 1 | 3 | 1 | 2 | 1 |
| యునైటెడ్ ప్రావిన్స్ | 37 | 19 | 3 | .. | 12 | 1 | 1 | 1 | .. | 1 | 1 | 1 |
| పంజాబ్ | 30 | 6 | 1 | 6 | 14 | .. | 1 | 1 | 1 | .. | 1 | 1 |
| బీహార్ | 30 | 16 | 2 | .. | 9 | 1 | 1 | .. | 1 | 1 | 1 | .. |
| సెంట్రల్ ప్రావిన్స్ బీరార్ | 15 | .. | 2 | .. | 3 | .. | .. | .. | .. | 1 | 1 | 1 |
| అస్సామ్ | 10 | 4 | 1 | .. | 3 | .. | 1 | 1 | .. | .. | 1 | .. |
| వాయవ్య ప్రావిన్స్ | 5 | 1 | .. | .. | 4 | .. | .. | .. | . | .. | .. | .. |
| ఒరిస్సా | 5 | 4 | 1 | .. | 1 | .. | .. | .. | .. | .. | .. | .. |
| సింద్ | 5 | 1 | .. | .. | 3 | .. | 1 | .. | .. | .. | .. | .. |
| బ్రిటిష్ బెలూచిస్తాన్ | 1 | .. | .. | .. | 1 | .. | .. | .. | .. | .. | .. | .. |
| ఢిల్లీ | 2 | 1 | .. | .. | 1 | .. | .. | .. | .. | .. | .. | .. |
| అజ్మీర్ మెర్వారా | 1 | 1 | . | .. | .. | .. | .. | .. | .. | .. | .. | .. |
| కూర్గ్ | 1 | 1 | .. | .. | .. | .. | .. | .. | .. | .. | .. | .. |
| నాన్ ప్రావిన్షియల్ సీట్లు | 4 | .. | .. | .. | .. | .. | .. | 3 | .. | 1 | .. | |
| మొత్తం | 250 | 105 | 19 | 6 | 82 | 4 | 8 | 8 | 11 | 7 | 10 | 9 |

# అనుబంధం - XVI

## బ్రిటిష్ ఇండియా ఫెడరల్ శాసన సభ – ఎగువ సభకు భారత ప్రభుత్వ చట్టం 1935 ప్రకారం కేటాయింపైన సీట్లు

| ప్రావిన్స్ లేదా మతము | మొత్తం సీట్లు | జనరల్ సీట్లు | షెడ్యూల్డు కులాలకు సీట్లు | సిక్కులకు సీట్లు | ముస్లింలకు సీట్లు | స్త్రీలకు సీట్లు |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 5 | 6 | 7 | 8 |
| మద్రాస్ | 20 | 14 | 1 | .. | 4 | 1 |
| బొంబాయి | 16 | 10 | 1 | .. | 4 | 1 |
| బెంగాల్ | 20 | 8 | 1 | .. | 10 | 1 |
| యునైటెడ్ ప్రావిన్స్ | 20 | 11 | 1 | .. | 7 | 1 |
| పంజాబ్ | 16 | 3 | .. | 4 | 8 | 1 |
| బీహార్ | 16 | 10 | 1 | .. | 4 | 1 |
| సెంట్రల్ ప్రావిన్స్ బేరర్ | 8 | 6 | 1 | .. | 1 | .. |
| అస్సామ్ | 6 | 3 | .. | .. | 2 | .. |
| వాయవ్య ప్రావిన్స్ | 5 | 1 | .. | .. | 4 | .. |
| ఒరిస్సా | 5 | 4 | .. | .. | 1 | .. |
| సింధ్ | 5 | 2 | .. | .. | 3 | .. |
| బ్రిటిష్ బెలూచిస్థాన్ | 1 | .. | .. | .. | 1 | .. |
| ఢిల్లీ | 1 | 1 | .. | .. | .. | .. |
| అజ్మీర్ మెర్వార్ | 1 | 1 | .. | .. | .. | .. |
| కూర్గ్ | 1 | 1 | .. | .. | .. | .. |
| ఆంగ్లో-ఇండియన్స్ | 1 | .. | .. | .. | .. | .. |
| యూరోపియన్స్ | 7 | .. | .. | .. | .. | .. |
| ఇండియన్ క్రిస్టియన్స్ | 2 | .. | .. | .. | .. | .. |
| మొత్తం | 150 | 75 | 6 | 4 | 49 | 6 |

# అనుబంధం - XVII

## భారత రాష్ట్రాలు – ఫెడరల్ శాసనసభ – దిగువసభ – ఎగువసభలకు భారత – ప్రభుత్వ చట్టం 1935, ప్రకారం కేటాయింపైన సీట్లు

| రాష్ట్రాలు -రాష్ట్ర సముదాయాలు 1 | కౌన్సిల్ ఆఫ్ స్టేట్‌లో సీట్ల సంఖ్య 2 | రాష్ట్రాలు - రాష్ట్ర సముదాయాలు సీట్ల సంఖ్య 3 | ఫెడరల్ అసెంబ్లీలో సీట్ల సంఖ్య 4 | జనాభా 5 |
|---|---|---|---|---|
| డివిజన్ I | | డివిజన్ I | | |
| హైదరాబాదు | 5 | హైదరాబాదు | 16 | 14,436,142 |
| డివిజన్ II | | డివిజన్ II | | |
| మైసూరు | 3 | మైసూరు | 7 | 6,557,302 |
| డివిజన్ III | | డివిజన్ III | | |
| కాష్మీర్ | 3 | కాష్మీర్ | 4 | 3,646,243 |
| డివిజన్ IV | | డివిజన్ IV | | |
| గ్వాలియర్ | 3 | గ్వాలియర్ | 4 | 3,623,070 |
| డివిజన్ V | | డివిజన్ V | | |
| బరోడా | 3 | బరోడా | 3 | 2,443,007 |
| డివిజన్ VI | | డివిజం VI | | |
| కాలాట్ | 2 | కాలాట్ | 1 | 342,101 |
| డివిజన్ VII | | డివిజన్ VII | | |
| సిక్కిం | 1 | సిక్కిమ్ | .. | 109,808 |
| డివిజన్ VIII | | డివిజన్ VIII | | |
| 1. రామ్‌పూర్ | 1 | 1. రామ్‌పూర్ | 1 | 465225 |
| 2. బెనారస్ | 1 | 2. బెనారస్ | 1 | 391,272 |
| డివిజన్ IX | | డివిజన్ IX | | |
| 1. ట్రావన్‌కోర్ | 2 | 1. ట్రావన్‌కోర్ | 5 | 5,095,973 |
| 2. కొచ్చిన్ | 2 | 2. కొచ్చిన్ | 1 | 1,205,016 |
| 3. పుదుకొట్టాయి | | 3. పుదుకొట్టాయి | 1 | 400,694 |
| బనగానపల్లి | 1 | బనగానపల్లి | | 39,218 |
| సాన్‌దూర్ | | సాన్‌దూర్ | | 13,583 |
| డివిజన్ X | | డివిజన్ X | | |
| 1 ఉదయపూర్ | 2 | 1. ఉదయపూర్ | 2 | 1,566,910 |
| 2. జైపూర్ | 2 | 2. జైపూర్ | 3 | 2,631,775 |
| 3. జోద్‌పూర్ | 2 | 3. జోద్‌పూర్ | 2 | 2,125,982 |
| 4. బికనెర్ | 2 | 4. బికనెర్ | 1 | 936,218 |
| 5. అల్వార్ | 1 | 5. అల్వార్ | 1 | 749,751 |
| 6. కోఠ | 1 | 6. కోఠ | 1 | 685,804 |
| 7. భరత్‌పూర్ | 1 | 7. భరత్ పూర్ | 1 | 486, 954 |
| 8. టోక్ | 1 | 8. టోక్ | 1 | 317, 360 |
| 9. డోల్‌పూర్ | 1 | 9. డోల్ పూర్ | | 254,986 |
| 10. కరోలి | 1 | కరోలి. | 1 | 140,525 |

| | | | | |
|---|---|---|---|---|
| 11.బున్ది | 1 | 10. బున్ది | 1 | 216,722 |
| 12. శిరోహి | 1 | శిరోహి | | 216, 528 |
| 13. దుగ్రాపూర్ | 1 | 11. దుగ్రాపూర్ | 1 | 227,544 |
| 14. బన్స్వారా | 1 | బన్స్వారా | | 260, 670 |
| 15. ప్రటాబర్గ్ | 1 | 12. ప్రటాబర్గ్ | 1 | 76,539 |
| ఝహల్వార్ | | ఝహల్వార్ | | 107,890 |
| 16. జల్సామర్ | 1 | 13. జల్సాల్మర్ | 1 | 76,255 |
| కిషన్బర్గ్ | | కిషన్ బర్గ్ | | 85,744 |
| డివిజన్ XI | | డివిజన్ XI | | |
| 1 ఇన్డోర్ | 2 | 1. ఇన్డోర్ | 2 | 1,825,089 |
| 2. భోపాల్ | 2 | 2. భోపాల్ | 1 | 729,955 |
| 3. రేవా | 2 | 3. రేవా | 2 | 1,587,455 |
| 4. డాట్లా | 1 | 4. డాట్రా | 1 | 158,834 |
| 5. ఓర్ఛ్ | 1 | 4. ఓర్ఛ్ | 1 | 314,661 |
| 6. ధార్ | 1 | 5. ధార్ | | 243,430 |
| దివాస్ (సీనియర్) | | దివాస్ (సీనియర్) | 1 | 243,430 |
| దీవాస్ (జూనియర్) | 1 | దివాస్ (జూనియర్) | | 70,513 |
| 8. జోరా | 1 | 6. జోరా | 1 | 100,166 |
| రాట్లమ్ | | రాట్లమ్ | | 107, 321 |
| 9. పన్నా | | 7. పన్నా | | 212,130 |
| సమ్తార్ | 1 | సమ్తార్ | 1 | 33,807 |
| అజయ్సుర్ | | జయ్పుర్ | | 86,895 |
| 10. బిజ్వార్ | | 8. బిజ్నార్ | | 115,852 |
| చర్ఖారి | 1 | చర్ఖారి | 1 | 120,351 |
| ఛాటర్పూర్ | | ఛాతర్పూర్ | | 161,287 |
| 11. బోంజ్ | | 9. బోంజ్ | | 19,132 |
| నాగోడ్ | 1 | నాగోడ్ | 1 | 74,589 |
| మహర్ | | మహర్ బరన్ధా | | 16,071 |
| 12. బర్వాని | | 10. బర్వాని | | 141,110 |
| అలీ రాజ్పూర్ | 1 | అలీ రాజ్పూర్ | 1 | 101,963 |
| షాహ్పూర్ | | షాహ్పూర్ | | 54,233 |
| 13. ఝబుబా | | 11. ఝబుబా | | 145,522 |
| సైయిలనా | 1 | సైయిలానా | 1 | 35,233 |
| సిటామన్ | | సిటామన్ | | 28,422 |
| 14. రాజ్ఘర్ | | 12. రాజ్ఘర్ | | 134,891 |
| నరిసింఘర్ | 1 | నర్సింఘర్ | 1 | 113,873 |
| కిలాచిపూర్ | | కిలాచిపూర్ | | 45,583 |
| డివిజన్ XII | | డివిజన్ XI | | |
| 1 ఖచ్ | 1 | 1. ఖచ్ | 1 | 514,30 |
| 2. ఇంద్రా | 1 | 2. ఇంద్రా | 1 | 262,660 |
| 3. నవానగర్ | 1 | 3. నవానగర్ | 1 | 409,192 |
| 4. భావనగర్ | 1 | 4. భావనగర్ | 1 | 500,274 |
| 5. జునామఢ్ | 1 | 5. జునాఘఢ్ | 1 | 500,274 |
| 6. రాజ్పిప్లా | 1 | 6. రాజ్ పిప్లా | 1 | 206,114 |
| పాలాన్పూర్ | | పాలన్పూర్ | | 264,179 |

| | | | | |
|---|---|---|---|---|
| 7. దార్ఘ్రా | 1 | 7. దార్గ్రా | 1 | 88,961 |
| గోండా | | గోండా | | 205,846 |
| 8. పోర్‌బందర్ | 1 | 8. పోర్‌బందర్ | 1 | 115,673 |
| మోర్వి | | మోర్వి | | 113,023 |
| 9. రాధన్‌పూర్ | | 9. రాధన్‌పూర్ | | 70530 |
| వాన్క్‌నర్ | 1 | వాన్క్‌నర్ | 1 | 44,259 |
| పలాటనా | | పలాటనా | | 624,150 |
| 10. కాంబే | | 10. కాంబే | | 87,701 |
| ధరమ్‌పూర్ | 1 | ధరమ్‌పూర్ | 1 | 112,031 |
| బాలాసినోర్ | | రాలాసినోర్ | | 52,527 |
| 12. బందా | | 12. బందా | | 48,839 |
| సచిన్ | 1 | సచిన్ | 1 | 22,107 |
| జవహర్ | | జవహర్ | | 57261 |
| దంతా | | దంతా | | 126,196 |
| 13. దరోల్ | | 13. దరోల్ | | 27,639 |
| లిమ్‌బిడి | 1 | లిమిబిడి | 1 | 40,008 |
| వాధ్వాన్ | | వాధ్వాన్ | | 42,602 |
| రాజ్‌కోట్ | | రాజ్‌కోట్ | | 75,540 |
| డివిజన్ XII | | డివిజన్ XIII | | |
| 1. కొల్హాపూర్ | 2 | 1. కొల్హాపూర్ | 1 | 967,137 |
| 2. సంగ్లీ | 1 | 2. సంగ్లీ | 1 | 258,442 |
| సవంత్‌వాడి | | సవంత్‌వాడి | | 230,589 |
| 3. జంజీరా | 1 | 3. జంజీరా | 1 | 110,379 |
| ముధోల్ | | ముధోల్ | | 62,832 |
| భోర్ | | భోర్ | | 141,546 |
| 4. జామ్‌ఖన్డి | 1 | 4. జామ్‌ఖండి | 1 | 114,270 |
| మిరాజ్ (సీనియర్) | | మిరాజ్ (సీనియర్) | | 93,983 |
| మిరాజ్ (జూనియర్) | | మిరాజ్ (జూనియర్) | | 40,684 |
| కురున్‌ద్‌వాద్ (సీనియర్) | | కురున్‌ద్‌వాద్ (సీనియర్) | | 44,204 |
| కురున్‌ద్‌వాద్ (జూనియర్) | | కురున్‌ద్‌వాద్ (జూనియర్) | | 75,540 |
| 5. అకల్‌కోట్ | 1 | 5. అకల్‌కోట్ | 1 | 92,605 |
| పల్టన్ | | పల్టన్ | | 58,761 |
| జాత్ | | జాత్ | | 91,099 |
| ఆవున్ద్ | | ఆవున్ద్ | | 76,507 |
| రామ్‌దుర్గ్ | | రామ్‌దుర్గ్ | | 35,454 |
| డివిజన్ XIV | | డివిజన్ XIV | | |
| 1. పటియాలా | 2 | 1. పటియాలా | 2 | 1,625,520 |
| 2. భావల్‌పూర్ | 2 | 2. భావల్‌పూర్ | 1 | 984,612 |
| 3. ఖైర్‌పూర్ | 1 | 3. ఖైర్‌పూర్ | 1 | 227,183 |
| 4. కపూర్తలా | 1 | 4. కపూర్తలా | 1 | 316,767 |
| 5. జిన్ద్ | 1 | 5. జిన్ద్ | 1 | 324,676 |
| 6. నాభా | 1 | 6. నాభా | 1 | 287,574 |
| | | 7. తెహ్రీ-ఘర్‌వాల్ | 1 | 349,573 |
| 7. మండి | 1 | 8. మండి | 1 | 207,465 |
| బిలాస్‌పూర్ | | బిలాస్‌పూర్ | | 100,994 |

| | | | | |
|---|---|---|---|---|
| ముకట్ | | ముకట్ | | 58,408 |
| 8. తెహ్రీ–ఘర్వాల్ | 1 | 9. సిర్మూర్ | 1 | 148,568 |
| సిర్మూర్ | | చంబా | | 146,870 |
| చంబా | | | | |
| 9. ఫరీద్కోట్ | 1 | 10. ఫరీద్కోట్ | 1 | 164,568 |
| మలేర్కోట్ | | మలేర్కోట్ | | 83,072 |
| లోహరా | | లోహరా | | 23,338 |
| డివిజన్ XV | | డివిజన్ XV | | |
| 1. కూచ్ బీహార్ | 1 | 1. కూచ్ బీహార్ | 1 | 590,886 |
| 2. త్రిపురా | 1 | 2. త్రిపురా | 1 | 382,450 |
| మణిపూర్ | | 3. మణిపూర్ | 1 | 445,606 |
| డివిజన్ XVI | | డివిజన్ XVI | | |
| 1. మయూర్భంజ్ | 1 | 1. మయూర్భంజ్ | 1 | 889,603 |
| సోనాపూర్ | | 2. సోనాపూర్ | 1 | 445,606 |
| 2. పాట్నా | 1 | 3. పాట్నా | 1 | 566,924 |
| కలాంది | | 4. కలాంది | 1 | 513,716 |
| 3. కాన్జ్బర్ | 1 | 5. కాన్జ్బర్ | 1 | 460,609 |
| దెవ్ కెనాల్ | | 6. గంగ్పూర్ | 1 | 346,674 |
| నయాగర్ | | 7. బస్తర్ | 1 | 524,721 |
| తాల్చర్ | | 8. సర్గుజా | 1 | 501,939 |
| నీల్గిరి | | | | |
| 4. గంగాపూర్ | 1 | 9. దెవ్ కెనాల్ | 3 | 284,326 |
| బాంరా | | నయాగర్ | | 142,406 |
| సిరజ్కెరా | | సిరజ్కెరా | | 143,525 |
| బౌద్ | | బౌద్ | | 135,245 |
| బొనాల్ | | తేల్చర్ | | 69,702 |
| | | బొనాల్ | | 80,185 |
| 5. బస్తర్ | 1 | నీల్గిరి | | 68,594 |
| సర్గుజా | | బాంమ్రా | | 151,047 |
| రాయ్పుర్ | | | | |
| నంద్గావ్ | | | | |
| 6. ఖైరఘర్ | 1 | 10. ఖైరఘర్ | 3 | 277,569 |
| ఝూపూర్ | | ఖైరఘర్ | | 157,400 |
| కంకర్ | | జాస్పూర్ | | 193,698 |
| కొరియా | | కంకర్ | | 136,101 |
| పరస్ఘర్ | | పరస్ఘర్ | | 123,967 |
| | | కొరియా | | 90,886 |
| | | నంద్గావ్ | | 182,380 |
| డివిజన్ | | డివిజన్ | | |
| పైన చెప్పిన డివిజన్లలోకి రాని రాష్ట్రాలు– ఈ షెడ్యూల్కు 12 వ భాగంలో వివరించబడ్డాయి. | | పూన చెప్పిన డివిజన్లలోకి రాని రాష్ట్రాలు – ఈ షెడ్యూల్కు 12 వ భాగంలో వివరించబడ్డాయి. | | |
| ఈ పట్టికలోని రాష్ట్రాల మొత్తం జనాభా | | | | 78,996,344 |

# అనుబంధం - XVIII

చక్రవర్తి ప్రభుత్వం ఇచ్చిన కమ్యూనల్ అవార్డు – 1932.

1. రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ రెండవ సమావేశం ముగిశాక చక్రవర్తి వారి ప్రభుత్వం తరఫున ప్రధానమంత్రి డిసెంబర్ 1వ తేదీన ఒక ప్రకటన చేసారు. ఆ ప్రకటనను పార్లమెంటు ఉభయసభలు ఆమోదించాయి. ఆ ప్రకటనలో ఒక విషయం స్పష్టపడింది. కాన్ఫరెన్స్ మత సమస్యను పరిష్కరించడంలో విఫలమైంది, ఆ సమస్యల విషయమై భారతదేశంలోని మతవర్గాలు అన్ని పక్షాలకీ ఆమోదయోగ్యమైన ఒప్పందానికి రాలేకపోతే ఆ కారణంగా భారత రాజ్యాంగ పురోగతి విఫలం కాకూడదని ప్రభుత్వం వారు తీర్మానించుకున్నారు. ఏదో తాత్కాలిక పథకాన్ని రూపొందించి, తామే దాన్ని అమలు పరిచి ఈ ఆటంకాన్ని తొలగించాలన్న తీర్మానంలో ఉన్నారు.

2. వివిధ మతవర్గాలు ఒక ఒప్పందానికి రాలేకపోవడంవల్ల నూతన రాజ్యాంగ నిర్మాణ పథకాలు పురోగతి కుంటుపడిందని తెలిసాక, మార్చి 19వ తేదీన ప్రభుత్వం కష్టభూయిష్టమైన వివాదాత్మక సమస్యల గురించి తీవ్రంగా పునఃపరిశీలన జరుపుతున్నట్లు ప్రకటించింది. నూతన రాజ్యాంగంలో అల్ప సంఖ్యాక వర్గాల స్థానం ఎలా ఉండాలన్న సమస్యల్లో కనీసం కొన్నింటినైనా పరిష్కరించకుండా రాజ్యాంగ నిర్మాణంలో పురోగతి వుండదన్న విషయం ప్రభుత్వం గుర్తించింది.

3. భారత రాజ్యాంగ నిర్మాణానికి సంబంధించిన ప్రతిపాదనలో ఈ కింద ఇచ్చిన ప్రణాళిక అమలు జరిపేందుకు తగిన నిబంధనలను చేరుస్తారని తదనుగుణంగా ప్రభుత్వం నిర్ణయించింది. ఈ రాజ్యాంగ ప్రణాళికని త్వరలో పార్లమెంట్‌కి సమర్పిస్తారు. రాష్ట్రీయ శాసనసభల్లో బ్రిటిష్ ఇండియన్ కమ్యూనిటీల ప్రాతినిధ్యానికి చెందిన ఏర్పాట్లు మేరకే ఈ ప్రణాళిక పరిధిని ఉద్దేశ్యపూర్వకంగా పరిమితం చెయ్యడం జరిగింది. కేంద్రంలోని శాసనసభలకు ప్రాతినిధ్యం ఎలా ఉండాలన్న పరిశీలన కింద 20వ పేరాగ్రాఫ్‌లో ఇచ్చిన కారణంగా వాయిదా వేశారు. ఈ ప్రణాళిక పరిదిని పరిమితం చెయ్యాలని తీర్మానించారు. అంటే అర్థం, అల్ప వర్గాలకు ఎంతో ప్రాముఖ్యం వున్న అనేక సమస్యల్ని రాజ్యాంగ నిర్మాణం విషయంలో పరిష్కరించాల్సిన అవసరం పడుతుందన్న గుర్తింపు లేకపోవడం కాదు. కానీ ప్రాతినిధ్యం నిష్పత్తి, విధానం లాంటి సమకాలిక సమస్య గురించి ఒకసారి అంటూ ప్రకటన జరిగితే, ఆ వర్గాలు తమకి తామే ఇతర మత సమస్యల విషయంలో వివాద పరిష్కారానికి చేరగలవన్న ఆశతో అలా వాయిదా వెయ్యడం జరిగింది. మరి ఈ సమస్యల్ని అవసరమైన తీరులో ఇంకా పరిశీలించలేదు.

4. ప్రభుత్వం ఒక విషయాన్ని స్పష్టం చెయ్యదలచుకుంది. ప్రభుత్వ నిర్ణయాన్ని పునఃపరిశీలించే దృష్టితో ప్రారంభించే ఏ చర్చలలోనూ తాను భాగస్వామిగా ఉండదు.

సంబంధిత పక్షాలన్నీ బలపరచకుండా, దీన్ని సవరించాలన్న ఉద్దేశ్యంతో సమర్పించే ఏ విజ్ఞాపననైనా గానీ ప్రభుత్వం పరిశీలించలేదు. కాని అందరూ అంగీకరించే ఒప్పందం గనుక సంతోషంగా ఏర్పడేటట్లుంటే ప్రభుత్వం ఏ ఆటంకాల్ని ఉంచదు. అంచేత, కొత్త భారత ప్రభుత్వ చట్టం ఆమోదం పొందే ముందు, సంబంధిత మతపక్షాలు, ఆదరణ యోగ్యమైన మార్గాంతర పథకం విషయంలో అంగీకారానికి వస్తే, ఆ పథకాన్నే ఇక్కడ సూచించిన నియమావళికి వదులుగా పరిశీలించమని పార్లమెంటుకి సిఫార్సు చెయ్యడానికి ప్రభుత్వం సంసిద్ధంగా ఉంది. ఆ పథకం ఏ ఒక్క గవర్నర్ రాష్ట్రానికి చెందేంది కానీ, అనేక రాష్ట్రాలకు చెందేదీ కావచ్చు, లేదా యావత్ భారతానికి చెందిందీ కావచ్చు.

5. గవర్నర్ రాష్ట్రాల శాసనమండలుల్లోని సీట్లని, లేదా ఎగువసభ ఉండే సందర్భంలో దిగువసభల్లోని సీట్లను ఈ కింద ఇచ్చిన అనుబంధ పట్టికలో కేటాయించి చూపడం జరిగింది.

6. మహమ్మదీయ, ఐరోపీయ, సిక్కు నియోజకవర్గాల సీట్లకు జరిగే ఎన్నిక మొత్తం రాష్ట్రం అంతటికీ వాళ్ళ మధ్య ఉన్న ప్రత్యేక సందర్భాల్లో "వెనకబడ్డవి" అని మినహాయించిన ఆయా ప్రాంతాలు కాకూడదు.

ఈ ఎన్నిక ఏర్పాటును పునః పరిశీలించే అధికారం నిమిత్తం రాజ్యాంగంలోనే వీలు కల్పించడం జరుగుతుంది. (కింద చూపించిన ఇతర ఏర్పాట్లు విషయానికి సంబంధించీ ఇలాగే ఉంటుంది) ఇది పదేళ్ళ తర్వాత, సంబంధిత మతవర్గాల అనుమతితో, అలాంటి అనుమతి పొందడానికి తగ్గ మార్గాల్ని రూపొందిస్తారు.

7. మహమ్మదీయ, సిక్కు, భారత క్రిస్టియన్ (కింది 10వ పేరా చూడండి) ఆంగ్లో-ఇండియన్ (కింది 11వ పేరా చూడండి) లేదా ఐరోపీయ నియోజక వర్గంలో ఓటర్లు కాని అర్హతగల ఓటర్లందరూ సాధారణంగా నియోజకవర్గంలో ఓటు చెయ్యడానికి అర్హులు.

8. బొంబాయిలోని కొన్ని ఎంపిక చేసిన బహు సభ్య సాధారణ నియోజకవర్గాల్లో ఏడు సీట్లను మరాఠా వాళ్ళకు కేటాయిస్తారు.

9. ఓటు అర్హత ఉన్న "దళిత వర్గాలు" సభ్యులు సాధారణ నియోజక వర్గాల్లో ఓటు వేస్తారు. ఈ మార్గాల ద్వారా, ఈ వర్గాలవాళ్ళు కొంతకాలం దాకా శాసనసభల్లో తగినంత ప్రాతినిధ్యం పొందే అవకాశం ఉండదు, ఈ కారణంగా కింద చూపించిన పట్టికలో విధంగా, కొన్ని ప్రత్యేక సీట్లను వాళ్ళకు కేటాయించడం జరుగుతుంది. ఈ సీట్లను ప్రత్యేక నియోజకవర్గాల నుంచి జరిగే ఎన్నిక ద్వారా భర్తీ చేస్తారు. ఆ నియోజకవర్గాల్లో "దళిత వర్గాల"లో ఎన్నికల రీత్యా అర్హత కలవాళ్ళే ఓటు చేస్తారు. అలాంటి ప్రత్యేక నియోజకవర్గంలో

ఓటు చేసే యే వ్యక్తికి అయినా, పైన చెప్పినట్లు, సాధారణ నియోజకవర్గంలో కూడా ఓటు చేసే హక్కు ఉంటుంది. ఈ నియోజకవర్గాల్ని ఎంపిక చేసిన ప్రాంతాల్లోనే ఏర్పాటు చేసే ఉద్దేశ్యం ఉంది, అంటే ఎక్కడ దళిత వర్గాలు సంఖ్య రీత్యా ఎక్కువ ఉంటాయో అక్కడ. అదీకాక, మద్రాసులో తప్పించి, అవి మొత్తం రాష్ట్రాల్లోని ప్రాంతమంతా ఉండవు.

బెంగాల్‌లో, కొన్ని సాధారణ నియోజకవర్గాల్లో ఓటర్లలో అధిక సంఖ్యాకులు దళిత వర్గాలవాళ్ళుగానే ఉండే అవకాశం కన్పిస్తోంది. తదనుగుణంగా, మరింత విచారణ జరగకుండా, ఆ రాష్ట్రంలో ప్రత్యేక దళితవర్గాల నియోజకవర్గం నుంచి ఎన్నిక కావలసిన సభ్యుల సంఖ్యను నిర్ణయించడం లేదు. బెంగాల్ శాసనసభలో కనీసం 10కి తగ్గకుండా సీట్లను దళితవర్గాలు పొందాలని ఉద్దేశించారు.

ప్రత్యేక దళితవర్గ నియోజకవర్గాల్లో ఓటు చేసే ఓటర్ల గురించిన కచ్చితమైన నిర్వచనం (ఎన్నికల రీత్యా అర్హత పొందితే) ప్రతి రాష్ట్రంలోనూ ఏమిటైందీ ఇదమిద్ధంగా నిర్ణయం కాలేదు. ఓటింగ్ కమిటీ నివేదిక ప్రతిపాదించే సామాన్య సూత్రాల మీద అది ఒక నియమంగా ఆధారపడుతుంది. ఉత్తర భారతంలోని కొన్ని రాష్ట్రాల్లో ఏమైనా కొన్ని సవరణలు అవసరం కావచ్చు. అస్పృశ్యత అన్న సాధారణ కొలమానం ఆ రాష్ట్రాల్లోని ప్రత్యేక పరిస్థితులను కొన్ని సందర్భాల్లో అయితే, అతకని నిర్వచనంగా తేలవచ్చు. ఈ ప్రత్యేక దళిత నియోజకవర్గాలు ఒక కాల పరిమితికి మించి అవసరమై ఉండొచ్చని ప్రభుత్వం వారు భావించడం లేదు. ఇవి ఇర్వై సంవత్సరాల తర్వాత ముగిసిపోయేట్లుగా రాజ్యాంగంలో నిర్దేశించాలని ప్రభుత్వం ఉద్దేశ్యం. అది కూడా 6వ పేరాలో సూచించిన ఎన్నికల సవరణ సాధారణ అధికారుల కింద అంతకు ముందే రద్దయిపోయినట్లయితే.

10. భారత క్రిస్టియన్‌లకు కేటాయించిన సీట్లు ప్రత్యేక కమ్యూనల్ ఎలక్టరేట్ల ఓటర్లు వేసే ఓట్ల ద్వారా జరుగుతాయి. యావత్ రాష్ట్రానికి వర్తించే ఇండియన్ క్రిస్టియన్ నియోజకవర్గాల ఏర్పాటుకు ఒక్క మద్రాసులో తప్ప ఆచరణలో ఇబ్బంది ఉన్నందువల్ల ఆటంకం రావచ్చన్నది దాదాపు ఖాయం. ఆ రకంగా భారతదేశంలో ప్రత్యేక క్రిస్టియన్ నియోజకవర్గాల్ని ఒకటి, రెండు ఎంపిక చేసిన ప్రాంతాల్లోనే రాష్ట్రంలో ఏర్పాటు చెయ్యాల్సి రావచ్చు. ఈ ప్రాంతాల్లోని ఇండియన్ క్రిస్టియన్ ఓటర్లు సాధారణ నియోజకవర్గాల్లో ఓటు చెయ్యరు. ఈ ప్రాంతాల బయట ఉన్న ఇండియన్ క్రిస్టియన్ ఓటర్లు సాధారణ నియోజకవర్గాల్లో ఓటు చేస్తారు. ఒరిస్సాలోనూ, బీహార్‌లోనూ ప్రత్యేక ఏర్పాట్లు అవసరం కావచ్చు. ఆ తావుల్లో ఇండియన్ క్రిస్టియన్ మతస్తులు గణనీయమైన సంఖ్యలో ఆదిమతెగల్లో ఉన్నారు.

11. ఆంగ్లో – ఇండియన్లకు కేటాయించిన సీట్లకు ప్రత్యేక కమ్యూనల్ ఎలక్టరేట్లలో ఓటింగ్ చేసే ఓటర్ల ద్వారా జరుగుతుంది. ప్రస్తుతం ఉద్దేశించింది ఏమిటంటే ప్రతి

రాష్ట్రంలోనూ ఆంగ్లో – ఇండియన్ నియోజకవర్గాలు మొత్తం ప్రాంతాల్ని కలుపుకుని ఉంటాయి – ఇది కూడా ఆచరణలో తల ఎత్తే ఇబ్బందుల్ని విచారించడం షరతులకి లోబడే – పోస్టల్ బాలెట్‌ని ప్రవేశపెట్టడం ద్వారా మొత్తం ప్రాంతాన్ని కలుపుకోవడం జరుగుతుంది. అయితే ఈ విషయమై తుది నిర్ణయం తీసుకోలేదు.

12. వెనకబడిన ప్రాంతాల నుంచి ఎన్నిక కావలసిన ప్రతినిధులకు కేటాయించిన సీట్లు తాత్కాలికం అనే పరిగణించాలి, అలాంటి ప్రాంతాలకి సంబంధించి రాజ్యాంగ ఏర్పాట్లు ఏం ఉండాలో తుది నిర్ణయాన్ని ఇంకా తీసుకోవాల్సి ఉంది.

13. నూతన శాసనసభల్లో కనీసం కొంతమందైనా మహిళా సభ్యులుండాలన్న విషయానికి ప్రభుత్వం వారు గొప్ప ప్రాముఖ్యం ఇస్తున్నారు. ప్రారంభంలో, ప్రత్యేకం మహిళలకు కొన్ని సీట్లను ఏర్పాటు చెయ్యడం ద్వారా తప్ప ఈ లక్ష్యం సాధించడం జరగదు. అదీ కాకుండా ఒక మతవర్గం నుంచే మహిళా సభ్యుల్ని అసమతూకంగా తీసుకోకూడదు. అదీ ముఖ్యమనే ప్రభుత్వం వారు భావిస్తున్నారు. ఈ అవాంతరం లేకుండా, తాము అనుసరించదలచుకున్న ప్రాతినిధ్య పథకంలో మిగిలిన దాంతో తూగుతూ ఉండే పద్ధతి ఏమిటో వారికి అందుబాట్లోకి రాలేదు. ఎలక్టరేట్‌ను ఒక్క మతవర్గానికి* ఒక ప్రత్యేక మహిళాస్థానాన్ని ఓటర్లకు పరిమితం చెయ్యడం తప్ప. ఈ ప్రత్యేక మహిళా స్థానాన్ని, పట్టికలో చూపించినట్లుగా, వివిధ మతవర్గాల మధ్య తదనుగుణంగా నిర్దిష్టంగా విభజించడం ద్వారా జరిగింది. ఈ ప్రత్యేక నియోజకవర్గాల్లో నియోగించాల్సిన కచ్చితమైన ఎన్నిక యంత్రాంగం ఎలా ఉండాల్సిందీ ఇంకా పరిశీలనలో ఉంది.

14. "కార్మికుల"కు కేటాయించిన స్థానాల్ని మతపక్షేతర నియోజకవర్గాల నుంచి భర్తీ చేస్తారు. వీటికి సంబంధించి ఎన్నికల యంత్రాంగం కూడా నిర్ణయించాల్సి ఉంది. అనేక రాష్ట్రాల్లో కార్మిక నియోజకవర్గాలు కొంత భాగం ట్రేడ్ యూనియన్‌వి, కొంతభాగం ప్రత్యేక నియోజకవర్గాలు ఎన్నికల సిఫార్సు మేరకు ఇవి ఉంటాయి.

15. వాణిజ్యానికీ, పరిశ్రమకూ కేటాయించిన ప్రత్యేక సీట్లు, మైనింగ్‌కూ, ప్లాంటింగ్‌కూ కేటాయించిన ప్రత్యేక సీట్లు ఛాంబర్ ఆఫ్ కామర్సు, ఇంకా అనేక సంస్థల ఎన్నికల ద్వారా భర్తీ అవుతాయి. ఈ సీట్లకు సంబంధించిన ఎన్నిక ఏర్పాట్లు ఇంకా పరిశీలించాల్సి ఉంది.

16. భూస్వాములకు కేటాయించిన ప్రత్యేక సీట్లకు ప్రత్యేక భూస్వాముల నియోజకవర్గాల ద్వారా ఎన్నికలు జరుగుతాయి.

17. యూనివర్సిటీ సీట్లకు వినియోగించిన పద్ధతి ఇంకా పరిశీలనలో ఉంది.

* ఒక మినహాయింపులో, చూడండి, నోట్ (2) అనుబంధం 26లోని పట్టిక.

18. గణనీయమైన వివరణల్లోకి పోకుండా తప్పించుకునేట్లు ఈ స్థానిక శాసనసభల ప్రాతినిధ్య సమస్యలను నిర్ణయించటం ప్రభుత్వం వారికి అసాధ్యంగా కనిపించింది. అయితే నియోజకవర్గాల నిర్ణయం ఉంది. భారతదేశంలో ఈ కర్తవ్యాన్ని ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా చేపట్టాలని ప్రభుత్వ ఉద్దేశం.

కొన్ని సందర్భాల్లో నియోజకవర్గాల ఏర్పాట్లు, ఇప్పుడిచ్చిన సీట్ల సంఖ్యకు కొద్ది మార్పులతో మెరుగు పరచుకోవచ్చు. అలాంటి చిన్నా చితకా మార్పుల్ని చేసే అధికారం ప్రభుత్వానికి ఉంది. అయితే మతవర్గాల మధ్య ప్రధానంగా ఉన్న తూకాన్ని ఇది ప్రస్తుతం మార్చదు. అయితే బెంగాల్, పంజాబ్‌ల విషయంలో అలాంటి మార్పులేమీ జరగవు.

19. రాజ్యాంగపరమైన చర్చలో ఇంతవరకూ, రాష్ట్రాల్లో రెండవసభల ఏర్పాటు సమస్య గురించి, ఒక రకంగా దృష్టి పెట్టడం జరగలేదు. ఏ రాష్ట్రానికి రెండవ సభ అవసరం, అని తేల్చే లేదా వాటి ఏర్పాటు గురించిన పథకం తయారు చేసే ముందు ఇంకా పరిశీలన అవసరం.

దిగువ సభల ఏర్పాటు ఫలితంగా వచ్చే కమిటీల మధ్య సమతూకం ప్రధానంగా ఏమీ భంగపడని రీతిలోనే ఒక రాష్ట్రంలో ఎగువసభ ఏర్పాటు ఉండాలని ప్రభుత్వం భావిస్తుంది.

20. కేంద్రంలో శాసనసభ పరిమాణం, నిర్మాణం ఎలా ఉండాలన్న సమస్య గురించి ప్రస్తుతం చర్చించే ప్రతిపాదన ప్రభుత్వం దగ్గరలేదు. ఏమంటే ఇతర సమస్యలతో బాటు పాతినిధ్యం సమస్య కూడా దీంట్లో ఉంది. దాన్ని ఇంకా పరిశీలించాల్సి ఉంది. అయితే, ఇది ఎలా ఏర్పాటవ్వాలన్న విషయాన్ని పరిశీలించేటప్పుడు, అందులో అన్నివర్గాలకూ తగినంత ప్రాతినిధ్యం ఉండే అంశాన్ని పరిగణిస్తారు.

21. సింధ్‌ని ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చెయ్యాలని సూత్రరీత్యా ప్రభుత్వం అంగీకరించింది, అందుకు తగ్గ నిధులు సమకూరే సంతృప్తికర మార్గం దొరికితే అయితే ఇందులో చిక్కుకున్న ఆర్థిక సమస్యల్ని కేంద్ర ఆర్థిక సమస్యలతోబాటు పరిశీలించాల్సి ఉంది. ఆ కారణంగా, ప్రస్తుతదశలో ఇప్పుడున్న బొంబాయి రాష్ట్రానికి, సింధ్‌కి ప్రత్యేక శాసనసభలుండాలన్న పథకాలకు తోడుగా జత చెయ్యడం మంచిదని ప్రభుత్వం భావిస్తోంది.

22. ఒరిస్సా, బీహార్ రాష్ట్రాల విషయంలో ఇచ్చిన అంకెలు ఇప్పుడున్న రాష్ట్రాలవి. విడిగా ఒరిస్సా రాష్ట్రాన్ని ఏర్పాటు చేసే విషయం కూడా పరిశీలనలో ఉంది.

23. బీరార్‌తో సహా కేంద్ర రాష్ట్రాల శాసనసభలకు సంబంధించిన అంకెల్ని పట్టికలో చేర్చినంత మాత్రాన బీరార్ భవిష్యత్తు రాజ్యాంగస్థానం విషయంలో ఒక నిర్ణయం జరిగినట్టు కాదు.

లండన్, ఆగస్ట్ 4, 1932.

# అనుబంధం – XVIII

## ప్రాంతీయ శాసనసభలో కేటాయింపు అయిన సీట్లు (దిగువసభలో మాత్రం)

| ప్రావిన్స్ | జనరల్ | అణచబడ్డ తరగతులు | వెనుక బడిన ప్రాంతల ప్రతినిధులు | సిక్కులు | మహమ్మదీయులు | భారతీయ క్రైస్తవులు | ఆంగ్లో ఇండియన్లు | యూరోపియన్లు | మైనింగ్ ప్లాంటింగ్ వాణిజ్య పరిశ్రమ ప్రత్యేకం | భూస్వాములు ప్రత్యేకం | విశ్వ విద్యాలయం ప్రత్యేకం | శ్రామికులు ప్రత్యేకం | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మద్రాసు | 134 (6గురు స్త్రీలతో కలిపి) | 18 | 1 | 0 | 29 (1 స్త్రీతో కలిపి) | 9 (1 స్త్రీతో కలిపి) | 2 | 3 | 6 | 6 | 1 | 6 | 215 |
| బొంబాయి (సింధ్‌తో కలిపి) | 97 (బి) (6గురు స్త్రీలతో కలిపి) | 10 | 1 | 0 | 63 (1 స్త్రీతో కలిపి) | 3 | 2 | 4 | 8 | 3 | 1 | 8 | 200 |
| బెంగాల్ | 80 (సి) (4గురు స్త్రీలతో కలిపి) | (సి) | 0 | 0 | 119 (2 స్త్రీలతో కలిపి) | 2 | 4 (1 స్త్రీతో కలిపి) | 11 | 19 | 5 | 2 | 8 | 250 |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 182 (4గురు స్త్రీలతో కలిపి) | 12 | 0 | 0 | 66 (2 స్త్రీల కలిపి) | 2 | 1 | 2 | 3 | 5 | 1 | 3 | 228 |
| పంజాబ్ | 43 (1 స్త్రీతో కలిపి) | 0 | 0 | 32 (1 స్త్రీతో కలిపి) | 80 (2 స్త్రీల కలిపి) | 2 | 1 | 1 | 1 | 5 (డి) | 1 | 3 | 175 |
| బీహార్, ఒరిస్సా | 99 (3గ్గురు స్త్రీలతో కలిపి) | 7 | 8 | 0 | 42 (1 స్త్రీతో కలిపి) | 2 | 1 | 2 | 4 | 4 | 1 | 4 | 175 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ (బీరార్‌తో కలిపి) | 77 (3గ్గురు స్త్రీలతో కలిపి) | 10 | 1 | 0 | 14 | 0 | 1 | 1 | 2 | 2 | 1 | 2 | 112 |
| అస్సాం | 44 (ఎ) (1 స్త్రీతో కలిపి) | 4 | | 0 | 34 | 1 | 0 | 1 | 11 | | 0 | 4 | 108 |
| వాయవ్య సరిహద్దు ప్రావిన్స్ | 9 | 0 | 0 | 2 | 36 | 0 | 0 | 0 | 0 | 2 | 0 | 0 | 50 |
| బొంబాయి (సింధ్ లేకుండా) | 109 (బి) (5గురు స్త్రీలతో కలిపి) | 10 10 | 1 | 0 | 30 (1స్త్రీతో కలిపి) | 3 | 2 | 3 | 7 | 2 | 1 | 7 | 175 |
| సింధ్ | 19 (1 స్త్రీతో కలిపి) | 0 | 0 | 0 | 34 (1 స్త్రీతో కలిపి) | 0 | 0 | 2 | 2 | 2 | 0 | 1 | 60 |

అ) ఈ సీట్లకు ఎన్నికలు జరిగే కార్యవర్గాల నిర్మాణం, చాలా సందర్భాల్లో యూరోపియన్ ప్రాముఖ్యతే వున్నా భారతీయ ప్రాముఖ్యతే వున్నా నిబంధనల రీత్యా నిశ్చితం కాదు. ఎంతమంది యూరోపియన్‌లు, ఎంతమంది భారతీయులు వుంటారో ప్రతి ప్రావిన్స్‌లోనూ కచ్చితమైన సంఖ్యను తేల్చి చెప్పలేము. అయినా మొదట్లో ఈ సంఖ్య ఎలా ఉంటుందో ఇంచుమించుగా చెప్పవచ్చు. అవి : మద్రాసు - 4 యూరోపియన్లు- 2 భారతీయులు; బొంబాయి (సింధ్‌తో కలిపి ) - 6 యూరోపియన్లు-3 భారతీయులు; బెంగాల్ - 14మంది యూరోపియన్లు, 5 భారతీయులు; యునైటెడ్ ప్రావిన్స్ - 2 యూరోపియన్లు, 1 భారతీయుడు; పంజాబ్ - 1 భారతీయుడు; బీహార్ మరియు ఒరిస్సా - 2 యూరోపియన్లు, 2 భారతీయులు; సెంట్రల్ ప్రావిన్సెస్ (బీరార్‌తో కలిపి) - 1 యూరోపియన్, 1 భారతీయుడు; అస్సామ్ - 8 యూరోపియన్లు, 3 భారతీయులు; బొంబాయి (సింధ్ లేకుండా) - 4 యూరోపియన్లు, 3 భారతీయులు; సింద్ - 1 యూరోపియన్, 1 భారతీయుడు.

ఆ) మరాఠాలకు 7 సీట్లు రిజర్వు చేయబడ్డాయి.

ఇ) పేరా 9లో వివరించినట్లుగా - బెంగాల్‌లో ప్రత్యేక అణచివేయబడ్డ తరగతిలో సంఖ్య - 10కి మించకూడదనడం - ఇంకా నిశ్చయించబడలేదు. జనరల్ సీట్ల సంఖ్య 80 (ఇవి ప్రత్యేక అణచబడ్డ తరగతి సీట్ల సంఖ్యను మినహాయిస్తే).

ఈ) ఈ సీట్లలో ఒకటి జమీందారు, ఏడు ప్రత్యేక నియోజకవర్గాలు, సంయుక్త ఎలక్టరేట్స్ నుంచి 4 భూస్వాముల కేటాయింపు సీట్లు భర్తీ చేయటం జరుగుతుంది. ఎలక్టరేట్ పంపిణీ ప్రకారం చూస్తే సభ్యులు ఒక హిందువు, ఒక సిక్కు, ఇద్దరు మహమ్మదీయులుండే అవకాశం ఉంది.

ఉ) మతరహిత నియోజకవర్గం షిల్లాంగ్ నుంచి స్త్రీల కేటాయింపు సీటు భర్తీ చేయబడుతుంది.

## అనుబంధం - XIX

## అనుబంధ కమ్యూనల్ అవార్డు*

"ఇక కేంద్రంలో మతవర్గాల ప్రాతినిధ్యం సమస్య ఉంది, ముఖ్యంగా ముస్లిం మతవర్గాల ప్రాతినిధ్యం. అక్కడ, ఫెడరల్ కేంద్రంలో ముస్లిం జనాభాకు 33.5 శాతం

* కేంద్ర ప్రభుత్వంలో 33.5శాతం ప్రాతినిధ్యం ఉండాలన్న ముస్లిం అభ్యర్థన గురించి ప్రభుత్వం ఇచ్చిన కమ్యూనల్ అవార్డులో (అనుబంధం 28) ఏ నిర్ణయం లేదు. ఈ అభ్యర్థన విషయమై మూడవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో ప్రకటన చేస్తూ 1932 డిసెంబర్ 24న సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా ప్రభుత్వ నిర్ణయం ప్రకటించాడు.

ప్రాతినిధ్యం ఉండి తీరాలన్న విషయాన్ని ప్రభుత్వం పరిశీలించాలి. ఈ విషయం నేను కచ్చితంగా చెపుతున్నాను. ఇంతకుముందు చాలాసార్లు పరోక్షంగా చెప్పాను. ఈ విషయమై భారతదేశంలోని బ్రిటిషేతర ప్రాంతాలకు సంబంధించి, ఆయా మతవర్గాలవాళ్ళు, రాజులు ఒప్పందానికి రావాలి. కానీ, ఈ సమస్యలో బ్రిటిష్ ప్రభుత్వానికి ఏదైనా పాత్ర ఉంటే ఆ మేరకు మేం, ఏ సమయంలోనైనాగానీ, భవిష్యత్తులో సీట్ల కేటాయింపు విషయమై ఉభయ పక్షాల మధ్య ఒప్పందం కుదిరేందుకు సానుకూలపడేట్లు సాయం చేస్తాం."

## అనుబంధం - XX

## పూనా ఒప్పందం

1. సాధారణ ఎలక్టొరేట్ నుంచి దళితవర్గాలకి, రాష్ట్రీయ శాసనసభల్లో సీట్ల కేటాయింపు ఈ కింది విధంగా ఉంటుంది : మద్రాస్-30; సింధ్‌తో కలిసి బొంబాయి-15; పంజాబ్-8; బీహార్, ఒరిస్సా-18; సెంట్రల్ ప్రావిన్సెస్-20; అస్సాం-7; బెంగాల్-30; యునైటెడ్ ప్రావిన్సెస్-20; మొత్తం 148.

ప్రధానమంత్రి నిర్ణయంలో ప్రకటించినట్లు, మొత్తం రాష్ట్రకౌన్సిళ్ళ సభ్యత్వం ఎంత ఉంటుందో దానిమీద ఆధారపడి ఈ అంకెల్ని ఇవ్వడం జరిగింది.

2. ఈ సీట్లకు ఎన్నిక సంయుక్త ఎలక్టొరేట్‌ను బట్టి ఉండాలి. అయితే ఈ కింది కార్యాచరణ క్రమానికి లోబడి ఉండాలి.

ఒక నియోజకవర్గంలోని సాధారణ ఎన్నికల జాబితాలో నమోదు అయిన దళితవర్గాల సభ్యులందరూ ఎలక్టరల్ కాలేజీ అవుతారు. కేటాయింపు పైన ప్రతి ఒక్క సీటుకీ ఈ ఎలక్టరల్ దళితవర్గాలకి చెందిన నలుగురు అభ్యర్థులుండే జాబితాను ఎన్నుకుంటుంది ఈ కాలేజీ. ఒకే ఓటు పద్ధతి ద్వారా ఈ ఎన్నిక జరుగుతుంది. అలాంటి ప్రాథమిక ఎన్నికల్లో అత్యధిక ఓట్లు వచ్చిన నలుగురు అభ్యర్థులు, సాధారణ ఎలక్టొరేట్ నుంచి జరిగే ఎన్నికలకు అభ్యర్థులుగా ఉంటారు.

3. కేంద్ర శాసనసభల్లో దళితవర్గాల ప్రాతినిధ్యం కూడా ఇదే మాదిరి సంయుక్త ఎలక్టొరేట్, కేటాయింపైన సీట్లు అన్న సూత్రం మీద ఆధారపడుతుంది. ప్రాథమిక ఎన్నిక పద్ధతి, పైన 2వ అధికరణంలో చెప్పినట్లు రాష్ట్ర శాసనసభల్లో వాళ్ళ ప్రాతినిధ్యానికి సంబంధించి ఉంటుంది.

4. కేంద్ర శాసనసభకు సంబంధించి, బ్రిటిష్ ఇండియాలోని సాధారణ ఎలక్టొరేట్‌కి ఆ శాసనసభ నిమిత్తం కేటాయించిన సీట్లలో పద్దెనిమిది శాతం దళితవర్గాలకు రిజర్వు అవుతాయి.

5. కేంద్ర, రాష్ట్ర శాసనసభలకి ఇంతకు ముందు చెప్పిన జాబితా అభ్యర్థుల ఎన్నికకు ప్రాథమిక ఎన్నిక జరిగే పద్ధతి మొదటి పది సంవత్సరాల తర్వాత ముగుస్తుంది. కింద చెప్పిన 6వ అధికరణంలోని నియమం ద్వారా పరస్పర అంగీకారంతో ఇంకా త్వరితంగానే రద్దు చెయ్యని పక్షంలో ఇలా జరుగుతుంది.

6. రాష్ట్ర, కేంద్ర శాసనసభల్లో దళిత వర్గాలకు సీట్లు రిజర్వు చెయ్యడం ద్వారా ఉండే ప్రాతినిధ్య విధానం - 1వ, 4వ అధికరణల్లో ఏర్పాటు చేసినట్లు - ఈ ఏర్పాట్లలో సంబంధిత మతవర్గాల మధ్య పరస్పర ఒప్పందం ద్వారా నిర్ణయించేంత వరకూ జరుగుతాయి.

7. కేంద్ర, రాష్ట్ర శాసనసభల్లో దళితవర్గాల ఓటింగ్ "లోథియన్ కమిటీ" నివేదికలో సూచించినట్లు ఉంటుంది.

8. స్థానిక సంస్థల ఎన్నికలకు గానీ, ప్రభుత్వోద్యోగ నియమాలకు గానీ సంబంధిత దళిత వర్గాలకు చెందిన వాళ్ళన్న కారణంగా ఎవ్వళ్ళకి అనర్హత లేమీ ఉండవు. ఈ విషయాలకు సంబంధించి దళితవర్గాలకు న్యాయమైన స్థానం ఉండేట్టు అన్ని ప్రయత్నాలు జరుగుతాయి. ప్రభుత్వ ఉద్యోగాలకు అవసరమైన విద్యార్హతలు ఉండాలన్న నియమావళికి లోబడే ఇలా జరుగుతుంది.

9. ప్రతి రాష్ట్రంలోనూ విద్యకు కేటాయించిన ధనం నుంచి తగినంత మొత్తం దళితవర్గాల విద్యా సౌకర్యం నిమిత్తం ప్రత్యేకించడం జరుగుతుంది.

# అనుబంధం – XXI

## ప్రాంతీయ శాసనసభ భారత ప్రభుత్వచట్టం 1935 ప్రకారం మైనారిటీల ప్రాతినిధ్యం

### దిగువ సభ

| ప్రావిన్స్ | మొత్తం | ముస్లిములు: చట్టంకింద కేటాయింపబడిన సీట్లు | ముస్లిములు: జనాభా ప్రకారం ఉండాల్సిన సీట్లు | ముస్లిములు: హెచ్చు లేదా లోటు | షెడ్యూల్డు కులాలు: చట్టంకింద కేటాయింపబడిన సీట్లు | షెడ్యూల్డు కులాలు: జనాభా ప్రకారం ఉండాల్సిన సీట్లు | షెడ్యూల్డు కులాలు: హెచ్చు లేదా లోటు | భారతీయ క్రైస్తవులు: చట్టంకింద కేటాయింపబడిన సీట్లు | భారతీయ క్రైస్తవులు: జనాభా ప్రకారం ఉండాల్సిన సీట్లు | భారతీయ క్రైస్తవులు: హెచ్చు లేదా లోటు | సిక్కులు: చట్టంకింద కేటాయింపబడిన సీట్లు | సిక్కులు: జనాభా ప్రకారం ఉండాల్సిన సీట్లు | సిక్కులు: హెచ్చు లేదా లోటు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మద్రాసు | 215 | 29 | 17 | +12 | 30 | 35 | -5 | 9 | 9 | – | నిల్ | నిల్ | – |
| బొంబాయి | 175 | 30 | 16 | +14 | 15 | 16 | -1 | 53 | 3 | – | నిల్ | నిల్ | – |
| బెంగాల్ | 250 | 119 | 137 | -18 | 30 | 33 | -3 | 3 | నిల్ | +3 | నిల్ | నిల్ | – |
| ఉత్తర ప్రదేశ్ | 228 | 66 | 35 | +31 | 20 | 49 | -29 | 2 | నిల్ | +2 | నిల్ | 1 | -1 |
| బీహార్ | 152 | 40 | 20 | +20 | 15 | 20 | -5 | 1 | నిల్ | +1 | నిల్ | నిల్ | – |
| సి.పి. అండ్ బీరార్ | 112 | 14 | 5 | +9 | 20 | 20 | – | నిల్ | నిల్ | – | నిల్ | నిల్ | – |
| అస్సాం | 108 | 34 | 36 | -2 | 7 | 7 | – | 1 | నిల్ | +1 | నిల్ | నిల్ | – |
| ఎన్.డబ్లు.ఎఫ్.పి. | 50 | 36 | 46 | -10 | నిల్ | – | – | నిల్ | నిల్ | – | 3 | 1 | +2 |
| ఒరిస్సా | 60 | 4 | 1 | +3 | 6 | 9 | -3 | 1 | నిల్ | +1 | నిల్ | నిల్ | – |
| సింధ్ | 60 | 34 | 43 | -9 | నిల్ | 3 | -3 | నిల్ | నిల్ | | నిల్ | నిల్ | – |
| మొత్తం | 1585 | 492 | 456 | +36 | 151 | 200 | -49 | 22 | 15 | -7 | 35 | 25 | +10 |

### ఎగువ సభ

| ప్రావిన్స్ | మొత్తం | ముస్లిములు: చట్టంకింద కేటాయింపబడిన సీట్లు | ముస్లిములు: జనాభా ప్రకారం ఉండాల్సిన సీట్లు | ముస్లిములు: హెచ్చు లేదా లోటు | షెడ్యూల్డు కులాలు: చట్టంకింద కేటాయింపబడిన సీట్లు | షెడ్యూల్డు కులాలు: జనాభా ప్రకారం ఉండాల్సిన సీట్లు | షెడ్యూల్డు కులాలు: హెచ్చు లేదా లోటు | భారతీయ క్రైస్తవులు: చట్టంకింద కేటాయింపబడిన సీట్లు | భారతీయ క్రైస్తవులు: జనాభా ప్రకారం ఉండాల్సిన సీట్లు | భారతీయ క్రైస్తవులు: హెచ్చు లేదా లోటు | సిక్కులు: చట్టంకింద కేటాయింపబడిన సీట్లు | సిక్కులు: జనాభా ప్రకారం ఉండాల్సిన సీట్లు | సిక్కులు: హెచ్చు లేదా లోటు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మద్రాసు | 56 | 7 | 4 | +3 | నిల్ | 9 | -9 | 3 | 2 | +1 | నిల్ | నిల్ | – |
| బొంబాయి | 30 | 5 | 3 | +2 | నిల్ | 3 | -3 | నిల్ | నిల్ | – | నిల్ | నిల్ | – |
| బెంగాల్ | 65 | 17 | 36 | -19 | నిల్ | 8 | -8 | నిల్ | నిల్ | – | నిల్ | నిల్ | – |
| యునైటెడ్ ప్రావిన్స్ | 60 | 17 | 9 | +8 | నిల్ | 13 | -13 | నిల్ | నిల్ | – | నిల్ | నిల్ | – |
| బీహార్ | 30 | 4 | 4 | – | నిల్ | 4 | -4 | నిల్ | నిల్ | – | నిల్ | నిల్ | – |
| అస్సాం | 22 | 10 | 7 | +3 | నిల్ | 38 | -38 | 3 | 2 | +1 | నిల్ | నిల్ | – |
| మొత్తం | 263 | 60 | 63 | -3 | నిల్ | 38 | -38 | 3 | 2 | +1 | నిల్ | నిల్ | – |

## అనుబంధం — XXII

## కేంద్ర శాసనసభలో భారత ప్రభుత్వచట్టం 1935 ప్రకారం మైనారిటీల ప్రాతినిధ్యం

| ప్రావిన్స్ | మొత్తం | ముస్లిములు | | | షెడ్యూల్డు కులాలు | | | భారతీయ క్రైస్తవులు | | | సిక్కులు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | చట్టంకింద కేటాయింప బడిన సీట్లు | జనాభా ప్రకారం ఉండాల్సిన సీట్లు | హెచ్చు లేదా లోటు | చట్టంకింద కేటాయింప బడిన సీట్లు | జనాభా ప్రకారం ఉండాల్సిన సీట్లు | హెచ్చు లేదా లోటు | చట్టంకింద కేటాయింప బడిన సీట్లు | జనాభా ప్రకారం ఉండాల్సిన సీట్లు | హెచ్చు లేదా లోటు | చట్టంకింద కేటాయింప బడిన సీట్లు | జనాభా ప్రకారం ఉండాల్సిన సీట్లు | హెచ్చు లేదా లోటు |
| దిగువ సభ | 250 | 82 | 67 | +15 | 19 | 35 | -16 | 8 | 3 | +5 | 6 | 3 | +3 |
| ఎగువ సభ | 150 | 49 | 40 | +9 | 6 | 21 | -15 | నిల్ | 2 | -2 | 4 | 2 | +2 |

## అనుబంధం - XXIII

# ప్రభుత్వ ఉద్యోగాల్లో కుల, మత ప్రాతినిధ్యం

# భారత ప్రభుత్వ తీర్మానం*

## సిబ్బంది

## జూలై 4, 1934

## విభాగం – 1, సాధారణ సిబ్బంది

నం. ఎఫ్ 14/17-బి 33 ప్రభుత్వ ఉద్యోగాలకు నేరుగా చేసే నియామకాల్లో, కులమత అసమానతలను సవరించడానికి 1925 నుంచీ కొంతశాతం ప్రత్యేకించడం జరిగింది. ఈ విధాన ఫలితాన్ని భారత ప్రభుత్వం శాసనసభలో ఇచ్చిన హామీ ప్రకారం శ్రద్ధగా సమీక్షించడం జరిగింది. ఈ విధానాన్ని ప్రధానంగా ముస్లింలకు ప్రభుత్వోద్యోగాల్లో ఇతోధిక ప్రాతినిధ్యం అందించడం కోసం అనుసరించినా, వాళ్ళకు తగినంత వాటాలో ఉద్యోగాలు లభ్యం కాలేదు. ముస్లిముల కోసమే ప్రత్యేకం కొన్ని ఉద్యోగ ఖాళీలను ఇంతశాతం అని నిర్ణయిస్తే తప్ప ఈ పరిస్థితి మెరుగవదని వాదించడం వినిపిస్తోంది. ప్రత్యేకించి, రైల్వే ఉద్యోగాల్లో ముస్లిముల సంఖ్య తక్కువగా ఉందని చూపిస్తున్నారు. అది కూడా మొత్తం జనాభాలో ముస్లిములు ఎక్కువ శాతం ఉన్న ప్రాంతాల గుండా వెళ్ళే రైల్వేలలో.

ఈ పరిస్థితిని సమీక్షించిన మీదట, ఈ ఫిర్యాదులు సమంజసమేనని తెలుస్తుంది. ఈ ఉద్యోగాల్లో ముస్లిముల స్థాయిని మెరుగు పరిచే దృష్టితో సిబ్బందిని నియమించే విధానానికి సంబంధించిన సూచనల్ని పునఃపరిశీలించాలన్న విచారణలతో ప్రభుత్వం సంతృప్తి చెందుతుంది.

2. ఈ సాధారణ సమస్యను పరిశీలించేటప్పుడు, ఆంగ్లో-ఇండియన్లు వలస వచ్చిన యూరోపియన్లు, దళితవర్గాలు చేస్తున్న ప్రతిపాదనలను కూడా భారత ప్రభుత్వం పరిగణనలోకి తీసుకోవాలి. ఆంగ్లో-ఇండియన్లు కొన్ని శాఖల్లో సర్వదా హెచ్చు శాతంలోనే ఉద్యోగాల్లో ఉన్నారు. ఈ వర్గం ఈ ఉద్యోగాల మీద ఆధారపడిన విషయాన్ని బట్టి, ప్రస్తుతం ఉన్న స్థానాల నుంచి వేగంగా వాళ్ళను తప్పించే రీతిలో ఏది నూతన పరిస్థితిలో ఉన్నా దాన్ని అడ్డగించేందుకు చర్యలు తీసుకోవాలి. వాళ్ళను తొలగిస్తే, ఈ పక్షీయుల ఆర్థిక పరిస్థితుల్లో తీవ్రమైన ఒడిదుడుకులు వస్తాయి. కొన్ని నిర్దిష్ట శాఖల్లో ఆంగ్లో-ఇండియన్లనీ వలస వచ్చిన యూరోపియన్లనీ, ఉద్యోగాల్లో నియమించడానికి సంబంధించి చేసిన సూచనలు ఆ విధానానికి ఆచరణ యోగ్యత కలిగించేందుకు ఉద్దేశించినవే.

* ఇండియా గెజెట్, 1వ భాగం, 1934 జూలై 7.

3. ఇక దళితవర్గాల విషయం ప్రభుత్వ ఉద్యోగాల్లో వాళ్ళకు న్యాయమైన ప్రాతినిధ్యం ఉండేందుకు సహేతుకమైన అన్ని చర్యలు తీసుకోవాలన్నది సామాన్యాభిప్రాయం. ఈ విషయానికి సంబంధించి అగ్రవర్ణ హిందువుల ఉద్దేశ్యం ఏమిటైందీ 1932 నాటి పూనా ఒప్పందంలో లాంచనప్రాయంగా ప్రకటితమైంది. చక్రవర్తి ప్రభుత్వం ఆ ఒప్పందాన్ని అంగీకరించడం ద్వారా ఆ అంశాన్ని గుర్తించినట్లయింది. ఇవాళ ఈ వర్గాల్లో ఉన్న సాధారణ విద్యాస్థాయిబట్టి, హిందువులకు మొత్తంగా లభ్యమయ్యే ఉద్యోగాలలో ఒక కచ్చితమైన శాతం వాళ్ళకు రిజర్వు చెయ్యడం వల్ల ప్రయోజనం ఉండదని ప్రభుత్వం భావిస్తోంది. కానీ సార్వజనకమైన పోటీలో వాళ్ళు నెగ్గలేరన్న సూత్రం చేత దళితవర్గాల అర్హులైన అభ్యర్థులు, తమకి న్యాయంగా ఉండాల్సిన ఉద్యోగావకాశాలు కోల్పోకుండా ఉండేట్టు చూడాలని భావిస్తున్నారు.

4. పైన చెప్పిన వర్గాలే కాక ఇతర అల్ప సంఖ్యాక వర్గాల స్థితిని ప్రభుత్వం జాగ్రత్తగా పరిశీలించింది. ఇప్పుడున్నట్లుగానే, నూతన నియమాలు కూడా వాళ్ళకు ఉద్యోగాల్లో యుక్తమైన ప్రాతినిధ్యం అందిస్తాయని సంతృప్తి కల్గింది.

## విభాగం - II

## నియమాల పరిధి

5. ఈ కింద చేర్చిన నియమాల్ని పాటించడం జరుగుతుందో లేదో కనిపెట్టి ఉండడానికి సాలుసరి నివేదికల్ని భారత ప్రభుత్వం ప్రతిపాదిస్తోంది.

6. ఈ లక్ష్యాల్ని సాధించే దృష్టితో సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఆమోదంతో భారత ప్రభుత్వం అనుసరించిన సాధారణ నియమాల్ని ఈ కింద ఇస్తున్నాం. అవి నేరుగా జరిగే ఉద్యోగ నియమాకాలకు మాత్రమే సంబంధించినవి, ప్రమోషన్లకు వర్తించవు. ఇవి ఇప్పుడున్నట్లుగానే ప్రతిభ ప్రాతిపదికగా ఉంటాయి. అవి ఇండియన్ సివిల్ సర్వీసెస్‌కి, సెంట్రల్ సర్వీసెస్‌కి, క్లాస్ 1, క్లాస్ 2, సబార్డినేట్ సర్వీసెస్ - ఇవి భారత ప్రభుత్వ పరిపాలన అజమాయిషీలో ఉంటాయి - లాంటి అన్నిటికీ వర్తిస్తాయి. కానీ ఒక మినహాయింపు ఉంది. సాంకేతిక అర్హతలు అవసరమైనవాటికి, లేదా ప్రత్యేక అర్హతలు అవసరమైన వాటికి వర్తించవు. కానీ బర్మాలో ఈ ఉద్యోగాలకు జరిగే రిక్రూట్‌మెంట్‌కి వర్తించవు. నాలుగు రాష్ట్రాల నిర్వహణలో ఉన్న రైల్వేలలో, తక్కువ శ్రేణి ఉద్యోగాలకూ, కూలీలకు పైబడి ఉన్న అన్ని ఉద్యోగాలనీ అవి వర్తిస్తాయి. కంపెనీ నిర్వహణలో ఉన్న రైల్వేల యాజమాన్యాన్ని ఈ రైల్వేల ఉద్యోగాలకు ఈ మాదిరి నియమాల్ని అనుసరించమని అడుగుతారు.

## విభాగం - III

# యావద్భారతస్థాయిలో జరిగే ఉద్యోగ నియామకాల నిబంధనలు

7. ఎ) యావద్భారత స్థాయిలో ఉద్యోగ నియామకాల నిబంధనలు జరిగే ఇండియన్ సివిల్ సర్వీస్, కేంద్ర సర్వీసెస్, సబార్డినేట్ సర్వీసెస్‌ల ఉద్యోగ నియామకాలకు ఈ కింది నిబంధనల్ని అనుసరించాలి :

అ) భారతీయుల్ని నేరుగా నియమించుకునే అన్ని ఖాళీల్లోను 25% ముస్లిములకు, 8.1/3 శాతం ఇతర అల్ప సంఖ్యాక వర్గాలవారికీ కేటాయించడం.

ఆ) సార్వత్రికమైన పోటీ ద్వారా నియామకం జరిగి, ముస్లిములు, ఇతర అల్ప సంఖ్యాక వర్గాలవారు ఈ శాతాల కంటే తక్కువ పొందితే, ఈ శాతాల్ని నామినేషన్ ద్వారా వాళ్ళు పొందాలి; ఒకవేళ ముస్లిములు సార్వత్రికమైన పోటీలో తమకు కేటాయించిన శాతం కంటే ఎక్కువ పొందితే, ఇతర అల్ప సంఖ్యాక వర్గాలకి కేటాయించిన శాతంలో తగ్గింపు ఉండనక్కరలేదు.

ఇ) సార్వత్రికమైన పోటీలో ఇతర అల్ప సంఖ్యాక వర్గాల వాళ్ళకు కేటాయించిన శాతం కంటే తక్కువ లభిస్తే, నామినేసన్‌కు అర్హత గల అభ్యర్థులు దొరక్కపోతే, 8.1/3 శాతంలో మిగిలిన ముస్లిములకు చెందుతాయి.

ఈ) ఇతర అల్ప సంఖ్యాక వర్గాలకు కేటాయించిన 8.1/3% వాళ్ళు మధ్య ఏ నిర్దిష్ట దామాషాలోనూ పంచడం జరగదు.

ఉ) అన్ని సందర్భాల్లోనూ అర్హతకి సంబంధించి ఒక కనీస ప్రమాణాన్ని విధిస్తారు, రిజర్వేషన్లు, దానికి లోబడే ఉంటాయి.

ఊ) దళితవర్గాలకు తగినంత ధర్మబద్ధమైన ప్రాతినిధ్యం కలిగేందుకు ఈ వర్గాల అర్హతలున్న వాళ్ళకు ప్రభుత్వోద్యోగాలకు నామినేట్ చెయ్యడం జరుగుతుంది. ఆ ఉద్యోగాల రిక్రూట్‌మెంటు సార్వత్రికమైన పోటీ ద్వారా జరగాల్సి ఉన్నా కూడా. నామినేషన్ ద్వారా ఇలా వచ్చే ఈ వర్గాల వాళ్ళకు పైన (1) నిబంధన కింద కేటాయించిన శాతం పరిధిలోని వాళ్ళుగా పరిగణించరు.

బి) ఈ తీర్మానంలోని 2వ పేరాగ్రాఫ్‌లో సూచించిన కారణాల వల్ల, భారత ప్రభుత్వం యావద్భారత స్థాయిలో జరిగే రైల్వే గెజిటెడ్ ఉద్యోగాలలో ఆంగ్లో–ఇండియన్లకు, వలస వచ్చిన యూరోపియన్లకు సంబంధించి ప్రత్యేక ఆసక్తి కనబరుస్తున్నది. ఈ ఉద్యోగాలలో వాళ్ళు ప్రస్తుతం ఉన్న స్థానాన్ని సుమారుగా నిలుపుకోవాలంటే, మొత్తం భారత వర్గాలన్నిటికీ అందుబాటులో ఉండే ఖాళీల్లో దగ్గర దగ్గర 9 శాతం ఆంగ్లో–

ఇండియన్లకు, వలస వచ్చిన యూరోపియన్లకూ అవసరం అవుతాయి. ప్రస్తుతంలో ఈ వర్గం వాళ్ళకు, గెజిటెడ్ ఉద్యోగాలకు ప్రమోషన్ల ద్వారా, నేరుగా జరిగే నియామకం ద్వారా 9 శాతం పై బడే లభిస్తున్నాయని భారత ప్రభుత్వం సంతృప్తి పడుతుంది. ఎప్పుడైనా ఒకవేళ ఈ 9 శాతం కంటే తక్కువ దక్కుతున్నప్పుడు నేరుగా జరిగే నియామకాల్లో ఏఏ మార్పులు వాళ్ళ న్యాయమైన ప్రయోజనాల్ని కాపాడేందుకు చెయ్యాలో పరిశీలిస్తారు.

## విభాగం - IV

## స్థానికంగా నియామకం జరిగే ఉద్యోగాల నిబంధనలు

సి) అఖిల భారతస్థాయిలో కాక స్థానికంగా జరిగే నియామకాలన్నిటికీ, అంటే రైల్వేలలో సబార్డినేట్ ఉద్యోగాలకు, పోస్ట్, టెలిగ్రాఫ్ శాఖ ఉద్యోగాలకు, కస్టమ్స్ ఉద్యోగాలకూ, ఇన్‌కమ్ టాక్స్ ఉద్యోగాల లాంటి వాటికీ, పైన నిర్దేశించిన సాధారణ నియమాలు ఈ కింది సవరణలకు లోబడి అమలు జరుగుతాయి.

అ) ఆయా ప్రాంతాల్లోని ముస్లిం జనాభా నిష్పత్తిని, ఇతర అల్ప సంఖ్యాక వర్గాల నిష్పత్తిని పరిగణనలోకి తీసుకుంటూ ప్రతి రైల్వేకీ, స్థానిక సంస్థలకూ, మండలానికీ శాతం నిర్దేశించుకుని, ఆ సబంధిత ప్రాంతంలోని స్థానిక ప్రభుత్వం రిక్రూట్‌మెంట్‌కి అనుసరించే నిబంధనల ప్రకారం అఖిల భారతదేశంలో ఉండాల్సిన ముస్లింలకు 25 శాతం, ఇతర అల్ప సంఖ్యాకపరులకు 8.1/3 శాతం ఉండాలి.

ఆ) ప్రస్తుతం ఆంగ్లో-ఇండియన్లు, వలస వచ్చిన యూరోపియన్ వర్గాల వాళ్ళు ప్రధానంగా నియమితులైన రైల్వేలకూ, పోస్ట్ టెలిగ్రాఫ్ శాఖలకూ కస్టమ్స్ ఉద్యోగాలకూ పైన రెండవ పేరాలో చెప్పిన విధానానికి ఆచరణ యోగ్యత కలిగించేందుకు ఈ తర్వాతి పేరాగ్రాఫ్‌లో వివరించిన ప్రత్యేక నియమాలు అవసరమౌతాయి.

9. ప్రస్తుతం రైల్వేల సబార్డినేట్ ఉద్యోగాల్లో ఆంగ్లో-ఇండియన్లు, వలస వచ్చిన యూరోపియన్లు 8.8% ఉన్నారు. ఈ స్థానాన్ని అలా నిలబెట్టేందుకు నేరుగా జరిగే నియామకాలన్నిట్లోనూ ఈ వర్గాల వాళ్ళకు8 % కేటాయించడం జరుగుతుంది. ఈ మొత్తం శాతం సాధించేందుకు విడిగా శాతాన్ని ఏర్పాటు చెయ్యాలి. 1) ప్రస్తుతం ఈ వర్గం వాళ్ళు నియమితులైన సంఖ్యను దృష్టిలో పెట్టుకుని ప్రతి రైల్వేకీ; 2) ఆంగ్లో-ఇండియన్లు ఇప్పుడున్న శాఖలో కొనసాగేటందుకు రైల్వేలోని ప్రతి విభాగానికీ, శాఖకూ ఇలా విడి శాతం ఏర్పాటు చెయ్యాలి. ప్రస్తుతం ఆంగ్లో - ఇండియన్లు ప్రధానంగా మెకానికల్ ఇంజనీరింగ్, సివిల్ ఇంజనీరింగ్, ట్రాఫిక్ డిపార్ట్‌మెంట్లలో నియమితులై ఉన్నారు. సబార్డినేటు ఉద్యోగాల హెచ్చుస్థాయి పోస్టులు ఏమీ రిజర్వు కావు. ఆ స్థానాలకు ప్రమోషన్లు, ప్రస్తుతం ఉన్నట్లుగా ప్రతిభ ఆధారంగానే జరుగుతాయి. 3) ముస్లిములకు 25 శాతం, ఆంగ్లో-ఇండియన్లకు 8

శాతం రిజర్వేషన్ల వల్ల, అన్ని ఇతర అల్ప సంఖ్యాక వర్గాలకూ అనుసరిస్తున్న ప్రస్తుత 33.1/3 శాతం రిజర్వేషన్‌ని పెంచవలసి వస్తుంది. ముస్లిములు, ఆంగ్లో–ఇండియన్లు కాని ఇతర అల్ప సంఖ్యాక వర్గాల ప్రయోజనాలను కాపాడడం కోసం ఇలా చెయ్యాల్సి వస్తుంది. అంచేత, నేరుగా చేసే నియామకాల్లో 5 శాతాన్ని వాళ్ళకోసం కేటాయించాలని తీర్మానించడం జరిగింది. ప్రస్తుతం, సుమారుగా వాళ్ళు ఈ శాతంలోనే ఉన్నారు. ఈ మొత్తం రిజర్వేషన్లను ఈ తీర్మానంలోని పేరా 8(1)లో సూచించినట్లు అమలు జరుపుతారు. అల్ప సంఖ్యాక వర్గాలలో మళ్ళీ ఇలా ఉప విభాజనలుండవు.

2) రైల్వేలలో మాదిరిగానే, పోస్ట్ టెలిగ్రాఫ్ డిపార్ట్‌మెంట్లలో ఇదే సూత్రాన్ని ఆంగ్లో–ఇండియన్, వలస వచ్చిన యూరోపియన్ వర్గాలవారి ప్రయోజనాల పరిరక్షణ కోసం అమలు చేస్తారు. ప్రస్తుతంలో ఈ శాఖల అన్ని సబార్డినేట్ సర్వీసెస్‌లలోనూ వాళ్ళు 2.2 శాతం ఉన్నారు. ఈ వర్గాల వాళ్ళు మామూలుగా ప్రవేశించే శాఖల్లో, డిపార్ట్‌మెంట్లలో, విభాగాలలో 5 శాతం గనక వాళ్ళకు కేటాయించినట్లయితే ఇప్పుడు వాళ్ళు సబార్డినేట్ ఉద్యోగాల్లో ఉన్న శాతం కంటే కొంచం తక్కువగా వాళ్ళకు లభ్యం అవుతాయని ధృవ పడింది. ఆంగ్లో–ఇండియన్లకు ప్రత్యేక రిజర్వేషన్ చేసిన డిపార్ట్‌మెంట్లలో, ఇతర అల్ప సంఖ్యాక వర్గాలకు ప్రస్తుతం సబార్డినేట్ ఉద్యోగాల్లో వాళ్ళకు శాతానికి సుమారుగా తూగే ఖాళీల రిజర్వేషన్ వాళ్ళకు చేస్తారు. ముస్లిమేతర అల్ప సంఖ్యాక, వర్గాలకూ, ఆంగ్లో ఇండియన్లకీ జరిగే మొత్తం రిజర్వేషన్ ఏ విధంగానూ 8.1/3 శాతానికి తగ్గదు.

3) ఆంగ్లో–ఇండియన్లు పెద్ద ఓడరేవుల్లో ఎప్రైసింగ్ డిపార్ట్‌మెంట్లలోనూ, సుపీరియర్ ప్రివెంటివ్ సర్వీసుల్లోనూ సబార్డినేట్ పోస్టుల్లో ఎక్కువగా ఉన్నారు. మొదటి దానికి సాంకేతిక అర్హతలు కావాలి. ఈ తీర్మానం 6వ పేరాలో సూచించిన సాధారణ సూత్రాలకు అనుగుణంగా, ఈ డిపార్ట్‌మెంట్‌ని ఈ నిబంధనల పరిధి నుంచి మినహాయించడం జరిగింది. ప్రివెంటివ్ సర్వీసుల్లో ప్రత్యేక అర్హతలు కావాలి. ఆంగ్లో–ఇండియన్లకు ఉద్యోగాలు కేటాయిస్తే ప్రస్తుత రిక్రూట్‌మెంట్ పద్ధతి కొనసాగుతుంది.

ఆర్డర్ – అన్ని స్థానిక ప్రభుత్వాలకూ, పరిపాలనా శాఖలకూ, భారత ప్రభుత్వ వివిధ శాఖలకూ సమాచారం అందించే నిమిత్తం (మార్గదర్శకత్వం నిమిత్తం) ఈ తీర్మానాన్ని అందజెయ్యాలని "గెజెట్ ఆఫ్ ఇండియా"లో దీన్ని ప్రచురించాలని ఆదేశించడమైంది.

ఎమ్.జి. హల్లెట్

భారత ప్రభుత్వ కార్యదర్శి

## అనుబంధం - XXIV

# ప్రభుత్వ ఉద్యోగాల్లో షెడ్యూల్డ్‌కులాల వారి ప్రాతినిధ్యం గురించి 1943నాటి భారత ప్రభుత్వ తీర్మానం (ఆంతరంగిక శాఖ తీర్మానం)

### న్యూఢిల్లీ, 1943 ఆగస్టు 11

నంబర్ 23/5/42 - పాలనా శాఖ (ఉద్యోగాలు) - 1942లో కేంద్ర శాసనసభలో ఇచ్చిన హామీల మేరకు, భారత ప్రభుత్వం దళితవర్గాలు - భారత ప్రభుత్వం వారి 1935 చట్టంలో షెడ్యూల్డ్ కులాలు అని వ్యవహరించడం జరిగింది. పాలనాశాఖలో ఉన్న స్థానానికి సంబంధించి జాగ్రత్తగా సమీక్ష చేసింది. 1934 జూలై 4వ తేదీతో ఉన్న నం. ఎఫ్ 14/17-బి/33 తీర్మానంలో, ఆనాడు ఈ వర్గాల్లో ఉన్న సాధారణ విద్యాస్థాయి దృష్ట్యా, వాళ్ళకు ఒక నిర్దిష్ట శాతం ఉద్యోగాల్ని కేటాయించడం వల్ల అంత ప్రయోజనం ఉండదని భారత ప్రభుత్వం ప్రకటించింది. అయినాగానీ, షెడ్యూల్ట్ కులాల వారికి ఉచితమైన ప్రాతినిధ్యం ఇచ్చేందుకు, ఈ వర్గాల నుంచి అర్హులైన వారికి ఉద్యోగాలకు నామినేట్ చెయ్యొచ్చు. ఆ ఉద్యోగానికి రిక్రూట్‌మెంట్ పోటీ ద్వారా జరిగేట్లు ఉన్నా కూడా షెడ్యూల్డ్ కులాల వాళ్ళకు ప్రభుత్వోద్యోగాలలో ఇతోధికంగా నియామకం జరిగేందుకు అప్పట్నుంచీ అనేక చర్యల్ని తీసుకుంటున్నారు. అయితే, ఇప్పటిదాకా అందిన ఫలితాలు గణనీయమైనవిగా లేవు. దీనికి ప్రధాన కారణం ఇప్పటిదాకా తగినంత అర్హతలున్న అభ్యర్థులు దొరక్క పోవడమేనని భారత ప్రభుత్వం గుర్తించినా, ఇప్పుడు ఉద్యోగాలలో ఒక నిర్దిష్టశాతాన్ని కేటాయించడం ఆ కులాల వాళ్ళకు ప్రోత్సాహకరంగా ఉంటుందని ప్రభుత్వం భావిస్తోంది. రిజర్వేషన్ వుంటే మరింత మంచి అర్హతలు సాధించేందుకు, అనేక ప్రభుత్వ ఉద్యోగాలకి అర్హులు కాగలిగేందుకు వాళ్ళకు ప్రోత్సాహం ఉంటుంది. వయసు పరిమితిలో మినహాయింపు ఇవ్వడం, ఫీజును తగ్గించడం షెడ్యూల్డు కులాలవాళ్ళు అర్హత సాధించేందుకు తోడ్పడతాయని భావిస్తున్నారు. తదనుగుణంగా భారత ప్రభుత్వం కింద 4వ పేరాలో ఇచ్చిన నిబంధనల్ని ఏర్పాటు చేస్తోంది.

2. ఇప్పుడున్న అన్ రిజర్వ్‌డ్ ఖాళీల్లోకి వాటికి అర్హమైన ఇతర కులాల జనాభా ఏ దామాషాలో ఉంటుందో దాని మీద ఆధారపడి, షెడ్యూల్డ్ కులాలకు 12.75 శాతం, ఆ మొత్తం ఖాళీల్లో భాగం ఉంటుంది. జనాభా రీత్యా తమకు ఉండే ఖాళీలని భర్తీ చెయ్యడానికి తగినంతమంది షెడ్యూల్డ్‌కులాల నుంచి వచ్చే అవకాశం లేదు. అంచేత, ప్రస్తుతానికి, ఒకంత తక్కువ శాతం, అంటే 8.1 శాతం రిజర్వు చేస్తే సరిపోతుందని భారత ప్రభుత్వం నిర్ణయించింది. ఈ కులాల నుంచి అర్హత గల సభ్యులు తగినంతమంది లభ్యమైనప్పుడు ఈ శాతాన్ని పెంచే ఆలోచన చెయ్యవచ్చని ప్రభుత్వం ప్రతిపాదిస్తోంది.

3. కింద సూచిస్తున్న నిబంధనలు నేరుగా జరిగే రిక్రూట్‌మెంట్లకే గానీ ప్రమోషన్ల ద్వారా జరిగే వాటికి కాదు, ఇవి కుల, మత పరిగణనలేకుండా ప్రస్తుతం ఉన్నట్లే కొనసాగుతాయి. అవి భారత ప్రభుత్వ పరిపాలనా అజమాయిషీకింద ఉన్న కేంద్ర సర్వీసులకు (క్లాస్ 1, 2), సబార్డినేట్ల సర్వీస్‌కు వర్తిస్తాయి. అయితే హెచ్చు స్థాయి సాంకేతిక లేదా ప్రత్యేక అర్హతలు అవసరమైన ఉద్యోగాలకు, 1934 జూలై 4వ తేదీ, నం. ఎఫ్ 14/17-బి/33 తీర్మానంలో ఉన్న కమ్యూనల్ రిప్రజెంటేషన్ ఆర్డర్ల పరిధి నుంచి మినహాయించిన వాటికీ

ఇవి వర్తించవు. రైల్వేలకు సంబంధించి, తక్కువ శ్రేణి ఉద్యోగులను కూలీలకూ కాక ఇతర ఉద్యోగాలకు ఈ నిబంధనలన్నీ వర్తిస్తాయి. కంపెనీలు నిర్వహించే రైల్వే పరిపాలక మండలుల్ని ఆ రైల్వేల ఉద్యోగాలకు సంబంధించి ఇలాంటి నిబంధనల్నే అనుసరించమని అడుగుతారు.

4. అంచేత, ప్రభుత్వోద్యోగాల్లో షెడ్యూల్డ్ కులాలకు మరింత మెరుగైన ప్రాతినిధ్యం ఉండేందుకుగాను భవిష్యత్తులో ఈ కింద సూచించిన నియమం అనుసరిస్తారు:

i) కేంద్ర, సబార్డినేట్ సర్వీసెస్‌లో నేరుగా భారతీయుల్ని చేర్చుకునే ఖాళీలన్నిటిలోనూ, అఖిలభారత స్థాయిలో జరిగే ఈ నియామకాలన్నిటిలోనూ షెడ్యూల్డ్ కులాల ప్రతినిధులకు 8.1/3 శాతం కేటాయిస్తారు. ii) అఖిలభారత స్థాయిలో కాక, స్థానిక ప్రాంతాల నుంచీ, మండలాల నుంచీ రిక్రూట్‌మెంట్ జరిగే ఉద్యోగాలకు సంబంధించి, అంటే రైల్వేలలో, పోస్ట్ టెలిగ్రాఫ్ డిపార్ట్‌మెంటులో, కస్టమ్స్ శాఖలో ఇన్‌కంటాక్స్ డిపార్ట్‌మెంటు వగైరాలలో, సబార్డినేట్ ఉద్యోగాలకు యావత్ భారతంలోనూ మొత్తం రిజర్వేషన్ షెడ్యూల్డ్ కులాల ఖాళీలకు 8.1/3 శాతం ఉంటుంది. ప్రతిస్థానిక ప్రాంతాలకూ, మండలాలకూ ఫలానా ఇంత శాతం ఉంటుంది. ఆ ప్రాంతంలో లేక మండలంలో ఉన్న షెడ్యూల్డ్ కులాల జనాభాను బట్టి ఆ ప్రాంతాలకి మండలాలకి స్థానిక ప్రభుత్వం అనుసరించిన రిక్రూట్‌మెంట్ నిబంధనల్ని బట్టి ఉంటుంది. iii) రిక్రూట్‌మెంట్ సార్వత్రిక పోటీ ద్వారా జరిగే సందర్భంలో, షెడ్యూల్డ్ కులాలవాళ్ళకు కేటాయించిన సీట్లకంటె తక్కువ సీట్ల వాళ్లకు ఉండే పక్షంలో ఆ తేడాని, వీలైతే ఆ కులాల్లో అర్హతలున్న వాళ్ళని నామినేట్ చెయ్యడం ద్వారా భర్తీ చేస్తారు. iv) షెడ్యూల్డ్ కులాల అభ్యర్థులు తమకు రిజర్వు చేసిన సీట్ల కంటే తక్కువ సీట్లను సార్వత్రిక పోటీలో పొందితే, ఈ కులాల నుంచి తగిన అర్హత గల అభ్యర్థులు లేకపోతే లేదు తగినంత సంఖ్యలో నామినేషన్‌లు లభ్యం కాకపోతే, అలాంటి అభ్యర్థుల కోసం కేటాయించిన మిగిలిన ఖాళీల్ని అన్ రిజర్వ్‌డ్‌గా భావించడం జరుగుతుంది. అయితే అందుకు అనురూపమైన ఖాళీల్ని ఆ ఏడాది పై అధికరణం (1) లేదా అధికరణం (2) ప్రకారం రిజర్వు చేస్తారు. v) అధికరణం (4) కింద మరుసటి సంవత్సరానికి తీసుకు వచ్చిన ముందటి సంవత్సరం ఖాళీలకు, అర్హతగల షెడ్యూల్డు కులాల అభ్యర్థులు దొరక్కపోతే అలా ఖాళీగా ఉన్న ఉద్యోగాల్ని అన్‌రిజర్వ్‌డ్ పోస్టులుగా భావిస్తారు. vi) అన్ని సందర్భాల్లోనూ అర్హతకు కనీస ప్రమాణం నిర్ణయిస్తారు, రిజర్వేషన్ దీనికి లోబడే ఉంటుంది. vii) షెడ్యూల్డ్ కులాలకు చెందిన అభ్యర్థులకు, ఉద్యోగార్థులకు నిర్ణీతం చేసిన గరిష్ట పరిమితిని మూడు సంవత్సరాలకు పెంచుతారు. viii) ఏ పరీక్షకు గానీ, ఎంపికకు గానీ ప్రవేశం కోసం నిర్ణయించిన రుసుమును షెడ్యూల్డ్ కులాల అభ్యర్థుల విషయంలో 1/4 వంతకు తగ్గిస్తారు. xi) ఈ పైన వివరించిన నిబంధనల్లోని ఆదేశాలు మూడు నెలలు కాక ఇంకా ఎక్కువగా ఉండే తాత్కాలిక ఖాళీలకు కూడా వర్తిస్తాయి. వీటిలో పర్మనెంట్ ఖాళీలు ప్రభుత్వ ఉద్యోగాలల్లో పర్మనెంట్ కాని వ్యక్తులతో తాత్కాలికంగా భర్తీ చేసినవి కూడా, కలిసే ఉంటాయి. x) ఈ నిబంధనల నిమిత్తం, భారత ప్రభుత్వ (షెడ్యూల్డ్‌కులాల) ఆర్డర్ 1936, ప్రకారం ఒక వ్యక్తి, అతని కుటుంబం సాధారణంగా నివసించే ప్రాంతంలో షెడ్యూల్డ్ కులంగా ప్రకటితమైన కులాలకు చెంది ఉంటే అతన్ని షెడ్యూల్డ్ కులంగా పరిగణిస్తారు.

ఆర్డర్ – సమాచారం నిమిత్తం, అనుసరణ నిమిత్తం తీర్మాన ప్రతిని చీఫ్ కమిషనర్లందరికీ

భారత ప్రభుత్వ వివిధ, డిపార్ట్‌మెంట్లకి ఇంటలిజెన్స్ బ్యూరో డైరెక్టరకి, ఫెడరల్ రిపబ్లిక్ సర్వీస్ కమిషనర్‌కూ పంపించాలని ఆదేశించడమైంది. రాజకీయ విభాగాలకి, ప్రభుత్వ ఆర్థిక శాఖకూ, గవర్నర్ జనరల్ కార్యదర్శికి (పబ్లిక్) గవర్నర్ జనరల్ కార్యదర్శికి (రీఫార్మ్స్), గవర్నర్ జనరల్ కార్యదర్శికి (పెర్సనల్), శాసనసభ శాఖకూ, ఫెడరల్ కోర్టుకూ, మహా రాజశ్రీ వైస్రాయిగారి మిలిటరీ కార్యదర్శికి, అన్ని స్థానిక ప్రభుత్వాలకి సమాచారం నిమిత్తం పంపించాల్సిందిగా ఆదేశించడమైంది. ఈ తీర్మానాన్ని "గెజిట్ ఆఫ్ ఇండియా"లో ప్రచురించాలి.

ఇ. కానాన్ - స్మిత్,

కార్యదర్శి

## అనుబంధం - XXV

## క్రిప్స్ ప్రతిపాదనలు

### 1941, మార్చి 29న ప్రకటితం

### భారత నాయకులతో చర్చలకోసం తయారుచేసిన ముసాయిదా ప్రకటన

భారతదేశ భవిష్యత్తు గురించి చేసిన వాగ్దానాల పరిపూర్తి విషయమై ఈ దేశంలోనూ, భారతదేశంలోనూ వెల్లడవుతున్న ఆందోళనని చక్రవర్తి వారి ప్రభుత్వం పరిశీలించింది. భారత దేశంలో స్వయంపాలనను సాధ్యమైనంత త్వరగా ఆచరణ యోగ్యం కావించేందుకు తాము ప్రతిపాదించే చర్యలను నిర్దిష్టమైన, స్పష్టమైన నిబంధనలలో ఉంచాలని తీర్మానం జరిగింది. నూతన భారత యూనియన్‌ను ఏర్పాటు చెయ్యడం ఇక్కడ లక్ష్యంగా ఉంది. అది యునైటెడ్ కింగ్‌డమ్‌తో సంబంధం ఉన్న అధినివేశ రాజ్యంగా, చక్రవర్తికి ఉమ్మడి విధేయతతో ఉండే ఇతర అధినివేశ రాజ్యాలుగా ఉంటుంది. కానీ అవి అన్నివిధాలా సమానస్థాయిలో ఉంటాయి. తమ ఆంతరంగిక కానీ, అంతర్జాతీయ వ్యవహారాలకు కానీ సంబంధించి ఏ రకంగానూ లొంగి ఉండవు.

అంచేత చక్రవర్తి వారి ప్రభుత్వం ఈ కింది ప్రకటన చేస్తుంది.

(అ) యుద్ధచర్యల విరమణ జరిగిన వెంటనే, భారతదేశంలో ఎన్నికైన సభని స్థాపించే చర్యల్ని, ఈ కింద చెప్పిన విధంగా తీసుకోవడం జరుగుతుంది. బారత దేశానికి నూతన రాజ్యాంగాన్ని రూపొందించే కర్తవ్యం దానికి అప్పగిస్తారు. (ఆ) రాజ్యాంగ నిర్మాణసభలో, భారతదేశంలో ఉన్న రాజ్యాలు, ఈ కింద చెప్పిన విధంగా పాల్గొనేందుకు అవకాశం ఏర్పాటవుతుంది. ఇ) అలా రూపొందించిన రాజ్యాంగాన్ని చక్రవర్తి వారి ప్రభుత్వం తక్షణం ఆమోదించి, అమలు జరిపే బాధ్యత వహిస్తుంది. అయితే ఇక్కడ ప్రస్తావించబోయే వాటికి లోబడే :

1) తన ప్రస్తుత రాజ్యాంగ స్థానాన్ని నిలుపుకునేందుకు, నూతన రాజ్యాంగాన్ని ఆమోదించలేని ఏ బ్రిటిష్ ఇండియా రాజ్యానికైనా, హక్కులుండాలి. ఆ రాజ్యం కనక కోరుకుంటే తర్వాత యూనియన్‌లో చేరేందుకు అవకాశం కలిగిస్తూ ఈ హక్కు ఉండాలి.

అలా చేరకుండా ఉన్న రాజ్యాలలో, చక్రవర్తి వారి ప్రభుత్వం భారత యూనియన్ మాదిరిగానే పూర్తి హోదాని ఇచ్చే నూతన రాజ్యాంగ విషయమై ఒప్పందానికి రావడానికి సిద్ధంగా ఉంది. వాళ్ళు అలా కోరుకుంటే ఆ రాజ్యాంగం ఇక్కడ పొందుపరచిన సరళికి అనురూపంగా ఉంటుంది.

రాజ్యాంగ నిర్మాణ సభా, చక్రవర్తివారి ప్రభుత్వం ఒప్పందం మీద సంతకాలు చెయ్యడం గురించి చర్చించుకోవచ్చు. బ్రిటిష్ వారి నుంచి భారమైన విషయాలన్నిట్లో ఈ ఒప్పందం ఇముడ్చుకుంటుంది. చక్రవర్తివారి ప్రభుత్వం ఇచ్చిన హామీల మేరకు, జాతి, మత పర అల్ప సంఖ్యాక వర్గాల రక్షణకు అవకాశం కల్పిస్తుంది. కానీ బ్రిటిష్ కామన్వెల్త్ సభ్యత్వ రాజ్యాలతో తమ భావి సంబంధాలు ఎలా ఉండాలో నిర్ణయించుకునే ఇండియన్ యూనియన్ అధికారం ఏ ఆంక్షనీ విధించదు.

ఒక ఇండియన్ స్టేట్ రాజ్యాంగానికి బద్ధమై ఉండదలుచుకున్నా లేకపోయినా, తన ఒప్పందం ఏర్పాట్ల పునః పరిశీలనలకోసం చర్చలు జరపడం అవసరం. నూతన పరిస్థితి ఆపేక్షించే మేరకు అది అవసరం.

ఈ) యుద్ధ విరమణ జరిగేలోగా, ముఖ్యమైన మతవర్గాల భారత నాయకులు వేరే ఇతర రూపం గురించి ఏకాభిప్రాయానికి రాకపోతే, రాజ్యాంగ నిర్మాణ సభ ఈ దిగువ చెప్పిన మాదిరీ ఏర్పాటవుతుంది.

యుద్ధ విరమణ తర్వాత స్థానిక ఎన్నికలు జరుగుతాయి. వాటి ఫలితం తెలిసిన వెంటనే స్థానిక శాసనసభల దిగువ సభల మొత్తం సభ్యులంతా, ఒకే ఒక ఎలక్టరల్ కాలేజీగా, స్థానిక ప్రాతినిధ్య వ్యవస్థ ద్వారా రాజ్యాంగ నిర్మాణ సభని ఎన్నుకుంటారు. ఈ నూతన సభ ఎలక్టరల్ కాలేజీ సంఖ్యలో 1/10 వంతు ఉంటుంది.

ఇండియన్ స్టేట్స్‌ని ప్రతినిధుల్ని పంపమని అడగడం జరుగుతుంది. మొత్తం బ్రిటిష్ ఇండియా ప్రతినిధుల విషయంల్లో మాదిరీ, ఆ ఇండియన్ స్టేట్స్, తమ మొత్తం జనాభాను బట్టి అదే నిష్పత్తిలో ప్రతినిధుల్ని పంపవచ్చు. బ్రిటిష్ ఇండియా సభ్యులకు ఉండే అదే అధికారాలు వాళ్ళకీ ఉంటాయి.

ఉ) ప్రస్తుతం భారతదేశం ఎదుర్కొంటున్న క్లిష్టపరిస్థితిలో, నూతన రాజ్యాంగం ఏర్పడేదాకా చక్రవర్తి వారి ప్రభుత్వం, ప్రపంచ యుద్ధ ప్రయత్నంలో తమ భాగంగా, భారత రక్షణ అజమాయిషీని, దర్శకత్వాన్ని తమ ఆధీనంలో ఉంచుకోవడం, బాధ్యత వహించడం తప్పనిసరి అవుతుంది. అయితే, భారతదేశంలోని సైనిక, నైతిక, పాదార్థిక వనరులను సంపూర్ణంగా వ్యవస్థీకరించే కర్తవ్యం భారత ప్రభుత్వ బాధ్యత, కానీ భారత ప్రజల సహకారంతో దీన్ని నిర్వహించాల్సి ఉంది. చక్రవర్తిగారి ప్రభుత్వం భారత ప్రజల ప్రధాన విభాగాల నాయకులు తమదేశ, కామన్వెల్త్, ఐక్యరాజ్య సమితుల సలహా మండలుల్లో తక్షణం, ఫలవంతమైన భాగస్వాములు కావాలని కోరుతుంది. ఆ రకంగా వారు, భారత భవిష్యత్ కోసం ప్రాణిభూతమూ, ముఖ్యమూ అయిన కర్తవ్య నిర్వహణలో తమ క్రియాశీలకమైన నిర్మాణాత్మక సహకారాన్ని అందించగలుగుతారు.

అనువాదం : ఆర్వియార్

డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్

రచనలు - ప్రసంగాలు

సంపుటం - 8

సాదా ప్రతి రూ 40/-

లైబ్రరీ ప్రతి రూ 80/-

Dr. BABASAHEB AMBEDKAR

WRITINGS & SPEECHES

Vol - 8

Popular Edition Rs. 40/-

Library Edition Rs. 80/-

సౌజన్యం:

తెలుగు విశ్వవిద్యాలయం